# వల్మిరిగము

(హిమబిందు సమూహము)

మేలిమి తెలుఁగు అల్లుల కావింత

రెండవ సంపుటము – కానస త్రోవ

'వాచస్పతి'

2022

**Valmirigamu -2** (A Collection of Dewdrops – వల్మీరిగము-2) కానస త్రోవ

A Diadactic Poem

By Vaachaspathy

**Published :** 2022.

**Price :**

**Cover Design : By Courtesy of**

https://www.freepik.com/free-vector/watercolor-floral-background-with-golden-frame_16529451.htm#query=floral%20border&position=12&from_view=keyword

**Readers may post their opinions and further queries to :**

https://in-detail-and-brief.blogspot.com/

***IMPORTANT :***

*Free downloads are allowed by the author and the copyright-holder from archive.org only. Those who thus download it **should not re-upload the same** on other sites for whatever purposes. However, they are free to share this document with their personal acquaintances by email and on chatting platforms like Whatsapp without paying anything to the author and the copyright-holder either before or after the share. Nor are they required to obtain permission to do so.*

COPYRIGHTS ON THIS BOOK WHOLLY AND SOLELY BELONG TO **Mr. T.V.R. SAI** REPRODUCTION OR MODIFICATION IN FULL OR IN PART BY ANY MEANS OR MEDIUM OR TECHNOLOGY FOR COMMERCIAL PURPOSES IS STRICTLY PROHIBITED. CRITICS, REVIEWERS AND RESEARCHERS ARE FREE TO QUOTE FROM THIS DOCUMENT. HOWEVER, THEY ARE REQUIRED TO GIVE DUE CREDITS TO THE AUTHOR ALONGSIDE EACH QUOTE HEREFROM.

PUBLISHED FROM INDIA

# మున్నరిక

(ఉపోద్ఘాతము)

*మేలిమి తెలుఁగాదటు లందఱికిని నిండెందపు టేంకణములు.*

మిహివానులారా ! నిరుడు **వల్మిరిగము** అను ఈ చింతనాత్మక పద్యకావ్యమునందు మొదటి వీట్టైన **మనిమిత్రోవ** వెల్వడఁగా వందలాది మంది మేలిమితెలుఁగాదటులైన చదువరులు దానిని అక్కునఁ జేర్చుకొని ఆదరించినారు. ఆ వెన్నుదట్టునకు మురిసి ఇనుమడించిన కెరలికతో రెండవ వీట్టైన **కానసత్రోవ** ను కూడ ఇప్పుడు మీ చేతులలోఁ బెట్టుచున్నాను. ఇవి గాక ఈ పుస్తెకమ్మ యందు ఇంకను 3 వీటులు గలవని మఱియొక్కసారి మనవి చేయుచున్నాను. అవి-

3. **అర్మిలి త్రోవ** (ప్రేమ మార్గము)

4. **ఏలత్రోవ** (శృంగార మార్గము)

5. **కాకడ త్రోవ** (తత్త్వమార్గము)

ఇవ్వైనము విడుదల చేయుచున్న **కానసత్రోవ** లో 665 పద్యములు కలవు. **మనిమిత్రోవ** లో వలెనె దీనిలో కూడ ప్రతి పద్యమునకు కలివిడి తెలుఁగులో పదవిభాగము, అన్వయక్రమము, ప్రతిపదార్థము, తాత్పర్యము విశేష వివరణము మఱియు ఇంగ్లీషులో Summary ఇవ్వఁబడినవి.

ఐదవ భాగమ్మైన **కాకడ త్రోవ** ను ఈ యేడాది (అనఁగా – 2022) డిసెంబరు నెలలో వెలువఱింపఁగలను. మిగితా భాగములను 2023 లోనే వెలువఱించుట వీలుపడును. కనికరించి అప్పటి వరకు వేచి చూడవలసినదిగా చదువరులకు వేఁడికోలు.

*వల్మిరిగములో ఎసవాడిన ఛందస్సు*

1. **తంగేడుక :** పాదమునకు 11 మాత్రలు.
2. **రాల్మిక :** 12 మాత్రలు.
3. **తెల్మిరిక** : 13 మాత్రలు.
4. **వెల్మిరిక :** 14మాత్రలు.
5. **గంగేరిక :** 15 మాత్రలు.
6. **పస్పియ** : 16 మాత్రలు.
7. **మొల్ల** : 17 మాత్రలు.
8. **గోరంటిక :** 18 మాత్రలు.
9. **పొన్నిక :** 19 మాత్రలు.

10. **అవిగింగ :** 20 మాత్రలు.

11. **సంపంగి :** 21 మాత్రలు.

12. **దాసానిక :** 22 మాత్రలు.

13. **చేమంతిక :** 23 మాత్రలు.

14. **వాణిద :** 24 మాత్రలు.

15. **మోదువిక :** 25 మాత్రలు.

16. **కలిగోటిక :** 26 మాత్రలు.

17. **తామరిక :** 28 మాత్రలు.

18. **తమ్మిక :** 30 మాత్రలు.

19. **నల్వతమ్మిక :** 32 మాత్రలు.

**20. ముత్యాల సరము.**

ఈ ఛందములకు సంబంధించిన మిగితా వివరములను మొదటి వీటు యొక్క మున్నరిక నుండి తెలిసికొనవచ్చును.

|| *ఎల్లఱకున్ మేల్గాతన్* ||

| | | |
|---|---|---|
| **శ్రీ గురురాజ విహారము** |  | **ఇట్లు** |
| **వైశాఖ బహుళ దశమి. బుధవారము. (హనుమద్ జయంతి)** | | **మీవాఁడు** |
| 25.05.2022. | | **వాచస్పతి** |

# వల్మిరిగము

## రెండవ వీటు (కానసత్రోవ)

క్రేవణిక (విషయసూచిక)

---

# వల్మిరిగము

## రెండవ వీటు - కానస త్రోవ

### మొదటి సంచము (మొదటి అధ్యాయము)

#### హంజియము (మంగళాచరణము)

**తలీరిక (అవతారిక)** : 'వలిమిరి/ వల్మిరి' అనఁగా మంచు చుక్క. 'వల్మిరిగము' అనఁగా మంచుచుక్కల మొత్తము (హిమబిందు సమూ-హము). రెండవ వీటు అనఁగా రెండవ భాగము. 'వల్మిరిగము' అను పేరు గల ఈ ఖండకావ్యమున అయిదు భాగములు కలవు. అవి 1. మనిమి త్రోవ 2. కానస త్రోవ 3. అర్మిలి త్రోవ 4. ఏలత్రోవ 5. నెఱింపు త్రోవ (వీటి అర్థములు వరుసగా – జీవనమార్గము, లోక-మార్గము, ప్రేమమార్గము, శృంగారమార్గము, చింతన మార్గము). ప్రస్తుత భాగము **కానస త్రోవ**. అనఁగా లోకమార్గము (లోకపు తీరు). ఇందులో 6 సంచములు (అధ్యాయములు) ఉన్నవి. లోకతత్త్వమును తాను పసించినంత మేరకు కవి వాచస్పతి ' బిరుదుఁడు ఈ అధ్యా-యముల గుండా వివరించును. కవి ఈ తొలి అధ్యాయమును మొదలుపెట్టుటకు ముందు తన తండ్రి నిట్లని తలఁచుకొనుచున్నాఁడు.

**వాణిద॥ చెరి బిడ్డఁడు బయలుదేఱు మెయిసల్పుచుఁ దన తండ్రిన్ ;**

**జెరి కొడుకును గడతేఱున్ గైసల్పుచు నాయనకున్ ;**

**నడుమఁ గినియు నఱచు దూఱు నెడము జరుగు నెదిరించున్ ;**

**దాఁ దన తండ్రియు నొక్క పొడ కాఁ బసియించుఁ గడకున్ ;** **1**

**తరుకుందుఁ దండ్రికూఱిమిఁ దక్కువ సేసినందుకున్ ;**

**ఇదియ నా వాకువయు నని యెఱింగి యెఱుంగెదన్ మా**

**కైసల్ప యొడమీవు మిహి వెంకటేశ్వరులు గారికి.** **2**

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెరి, బిడ్డఁడున్, బయలుదేఱున్, మెయిసల్పుచున్, తన, తండ్రిన్, చెరి, కొడుకును, కడతేఱున్, కైసల్పుచున్, నాయనకున్, నడుమన్, కినియున్, అఱచున్, దూఱున్, ఎడము–జరుగున్, ఎదిరించున్, తాన్, తన, తండ్రి + ఉన్, ఒక్క, పొడ, కాన్, పసియించున్, కడకున్, తరుకుందున్, తండ్రి–కూఱిమిన్, తక్కువ–చేసినందుకున్, ఇదియ, నా, వాకువ + ఉన్, అని, ఎఱింగి, ఎఱుంగెదన్, మా, కైసల్ప, ఒడము + ఈవు, వెంకటేశ్వరులు–గారికిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చెరి = ప్రతి ; మెయిసల్పుచున్ = ఆరాధించుచు ; కడతేఱున్ = గతించును ; కైసల్పుచున్ = పూజించుచు ; కినియున్ = కోపించును ; దూఱున్ = నిందించును ; ఒక్క పొడ కాన్ = ఒకే రూపమని ; పసియించున్ = గ్రహించును ; కడకున్ = చివరికి ; తరుకుందున్ = పశ్చాత్తాపము పొందును ; తండ్రి–కూఱిమిన్ = పితృప్రేమను ; ఇదియ = ఇదే ; వాకువ + ఉన్ = కథ కూడ ; ఎఱింగి = తెలిసి ; ఎఱుంగెదన్ = ప్రణమిల్లెదను ; మా కైసల్ప = మాకు పూజ్యుఁడైన ; ఒడము + ఈవు = జన్మదాత (తండ్రి).

**లోవాఱిక (తాత్పర్యము) :** లోకములో ప్రతి బిడ్డయు తన తండ్రిని ఆరాధించుచు మొదలగును. అట్లే ఆయనను పూజించుచు చనిపోవును. కాని ఈ మధ్యలో మటుకు ఆయన మీఁద కోపించును. అఱచును. నిందించును. ఎదిరించి దూరమగును. కాని ఒక ఈడు వచ్చిన పిదప – తాను చేసినది తప్పనియు, తాను తండ్రిగారి ప్రేమను తక్కువగా అంచన వేసినాననియు గ్రహించి పశ్చాత్తాపము నొందును. నా కథయు అటువంటిదే. కనుక మాకు పూజ్యులైన జన్మదాత వెంకటేశ్వర్లు గారికి సాష్టాంగ నమస్కారము లాచరించెదను.

**పైమాల విడఁబఱ్ఱు (విశేష వివరణము) :** తండ్రి బ్రదికి యున్నంత కాలము ఆయన మంచితనము, గొప్పతనము సంతానమునకు అర్థము కావు.

SUMMARY : Every child in the world sets out adoring his father. Similarly every son passes away worshipping his father. However in the mean time, he gets angry with his father, yells at him, blames him and distances himself by revolting against him. But after attaining certain age, he realizes his mistake of underrating the paternal love and will be in remorse. My story is no different. Therefore, I bow down at the feet of Late Venkateswarlu Gaaru, our venerable father.

*(The father's kind heart and greatness are seldom understood by the children as long as he is above the ground).*

**రాల్మిక వాలు జంట** ॥ నచ్చనిచో బాసటకాన్, "వచ్చి దూరుచున్నాఁ" డందురు ;
నాకేమని యూరకున్న, "బల్ తామట్టరి" యని దూఱెదరు ; 3

**మాటల విడఁదీత (పద విభాగము) :** నచ్చనిచోన్, బాసటకాన్, వచ్చి, దూరుచున్నాఁడు + అందురు, నాకున్ + ఏమి, అని, ఊరక + ఉన్నన్, బల్–తామట్టరి, అని, దూఱెదరు.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** బాసటకాన్ = సహాయకుఁడు ; బల్ తామట్టరి = బహు స్వార్థపరుఁడు ; దూఱెదరు = నిందించెదరు.

**లోవాఱిక (తాత్పర్యము) :** లోకులు తమకు సహాయము చేయ వచ్చినవాఁడు నచ్చనిచో "అతఁడు వచ్చి మా వ్యవహారములో అనవసరముగా తల దూర్చుచున్నాఁడు" అందురు. "ఒకఱి జోలి నాకెందుకు?" అని మిన్నకున్న వానినేమో "పరమ స్వార్థపరుఁడు" అని దూషించెదరు.

**పైమాల విడఁబఱ్ఱు (విశేష వివరణము) :** నీవెట్లున్నను బాహ్యావరణము నిన్ను ఆడిపోసికొనుచునే ఉండునని భావము.

SUMMARY : People accuse a voluntary helper of meddling in their affairs if they don't like him. The same people blame him calling him 'selfish' if he minds his own business and keeps quiet.

**గంగేరిక** ॥ ఆనసపుఁ గైవారముల, నాని యుండునె మన మంచితనము ?
మాటల మతక మెఱుఁగువార్, మంచిసెబ్రల మార్చి చూపెదర్. 4

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఆనసపుం + కైవారములన్, ఆని, ఉండునె, మన, మంచితనము, మాటల, మతకము + ఎఱుఁగు–వార్, మంచి–సెబ్రలన్, మార్చి, చూపెదర్.

**చఅమోలి (అన్వయ క్రమము) :** మన మంచితనము ఆనసపుం కైవారములన్ ఆని ఉందునె? మాటల మతకము ఎఱుఁగు-వార్ మంచి-సెబ్రలన్ మార్చి చూపెదర్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఆనసపుం = లోకపు (లోకము చేయు) ; కైవారములన్ = స్తోత్రములపై ; ఆని ఉందునె = ఆధారపడి ఉందునా? ; మతకము = మాయను/ మాయాశక్తిని ; ఎఱుఁగు-వార్ = తెలిసికొన్నవారు ; మంచి-సెబ్రలన్ = మంచి-చెదులను ; చూపెదర్ = చూపెదరు.

**లోవాఱిక (తాత్పర్యము) :** మన మంచితనము – దానిని లోకము పొగడుట మీఁద ఆధారపడి ఉండదు కదా? మాటల మాయాశక్తిని అర్థము చేసికొని వాడుకొనుట నేర్చినవారు మంచిని చెడుగాను, చెడును మంచిగాను మార్చి పొడకట్టించఁగలరు.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** "లోకులు మనలను పొగడినచో మనము మంచివారమా? లేక వారు మనలను తిట్టినంత మాత్రమున చెడ్డవారమై పోయెదమా? కాదు గదా !" అని భావము.

SUMMARY : Is our goodness dependent on people praising it? Those in the know of the magical powers of words, can project good as bad and vice versa.

**రాల్మిక వాలు జంట ||** మంచి సెప్పువారు లేక, మన్నొలవు సెడిపోలేదు తమ్మి !
మంచి జెప్పినను వినువా, రించుకయు లేక చెడెను సుమ్మీ ! 5
బావిలోఁ బడి "కావు" మని గావుకేకలు వెట్టు నీ యొలవు
పైకిఁ దీసిన తరువాత "నీకేల మా జోలి ? పో" మ్మనును. 6

**మాటల విడఁదీత (పద విభాగము) :** మంచి, చెప్పు-వారు, లేక, మన్ను + ఒలవు, చెడి-పోలేదు, తమ్మి, మంచిన్, చెప్పినను, విను-వార్ + ఇంచుక + ఉన్, లేక, చెడెను, సుమ్మీ, బావిలోన్, పడి, కావుము + అని, గావు-కేకలు, పెట్టున్, ఈ, ఒలవు, పైకిన్, తీసిన, తరువాత, నీకున్, ఏల, మా, జోలి, పొమ్ము + అనును.

**చఅమోలి (అన్వయ క్రమము) :** మంచి చెప్పువారు లేక మన్ను + ఒలవు చెడిపోలేదు తమ్మి ! మంచిన్ చెప్పినను వినువార్ ఇంచుక + ఉన్ లేక చెడెను సుమ్మీ ! ఈ ఒలవు బావిలోన్ పడి కావుము + అని గావు-కేకలు పెట్టున్. పైకిన్ తీసిన తరువాత నీకున్ ఏల మా జోలి పొమ్ము అనును.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** : మన్ను + ఒలవు = భూలోకము ; తమ్మి = తమ్ముఁడా ! ; ఇంచుక + ఉన్ = కొంచెము కూడ ; కావుము = కాఁపాడుము ; మా జోలి = మా ప్రసక్తి.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : The mortal world got spoilt not because it is short of the ones to teach it good things, but because it is short of the people ready to listen to good counsels. The world loudly cries for help after falling in a well. However, after emerging out, it dismisses the rescuer, asking him, "What business do you have arriving here? Just get out of here."

**వాణిద||** వెరగొందుట మానినచోఁ గఱచుట యాపై వాయము ;
కొంటె చెఱుకు లాఁగినచోఁ గోడెతనమింక మాయము ;
నమ్మిక సెడిపోయినచో నంటులు కడు మొగమోటము ;

కూఱిమింప మానినచోఁ గుట్టుసులు కూడఁ బూటము. 7

**మాటల విడఁదీత (పద విభాగము) :** వెరగు + ఒందుట, మానినచోన్, కఱచుట, అ–పైన్, వాయము, కొంటె–చెణుకులు, అఁగినచోన్, కోడెతనము, ఇంకన్, మాయము, నమ్మిక, చెడి–పోయినచోన్, నంటులు, కడు, మొగమోటము, కూఱిమింపన్, మానినచోన్, కుఱు + ఉసుఱు, కూడన్, పూటము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే)

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వెరగు + ఒందుట = ఆశ్చర్యపోవుట ; కఱచుట = నేర్చుకొనుట ; అ–పైన్ = ఆ తరువాత ; వాయము = దండుగ ; కొంటె చెణుకులు = చిలిపి ఛలోక్తులు ; కోడెతనము = పడుచుదనము ; మాయము = అదృశ్యము ; నంటులు = చెలుములు ; కడు మొగమోటము = మిక్కిలి మొహమాటము ; కూఱిమింపన్ మానినచోన్ = ప్రేమించుట మానినచో ; కుఱు + ఉసుఱు (కుట్టుసుఱు) = కొన–యూపిరి ; పూటము = బరువు (భారము).

**లోవాఱిక (తాత్పర్యము) :** మనిషికి ఆశ్చర్యము కలుగుట లేదనఁగా అతనికింక క్రొత్తగా నేర్చుకొనుటకు ఏమియు లేదని అర్థము. మనిషి కొంటె ఛలోక్తులు విసరుట మానినాఁడనఁగా అతనిలో పడుచుదనము అదృశ్యమగుచున్నదని అర్థము. ఒండొరుల నడుమ నమ్మకము పోయిన తరువాత నేస్తము మొగమోటముల మయము. మనిషికి తోడి మనుష్యులయందు ప్రేమ నశించిన తరువాత కొన–ఊపిరితో బ్రదుకుట సైతము భారముగా తోఁచును.

SUMMARY : It is in vain to learn after man can no more marvel at things. Youth is as good as gone if man can no longer crack naughty jokes. Friendship feels embarrassing after mutual trust eroded for good. Living on short breath feels cumbersome too if man cannot love anyone anymore.

**వెల్మిరిక జంట** ॥ నవకపు నేలయె ప్రోదించును ; రివటలకే గుమ్మడి కాయును ;
వేంగి కాదు, వేఁపియె కాఁచును ; ఎమ్ములె గావు, కండ**లు** నడుపును ; 8
బండ కాలుసేతులు గావు, కండచుక్క గట్రా మనుపు-
న్నొరా ! ఈ యైకలి వెట్టున్, నౌరులపైఁ బ్రెన్ మోపికలన్. 9

**మాటల విడఁదీత (పద విభాగము) :** నవకపుం, నేలయె, ప్రోదించును, రివటలకే, గుమ్మడి, కాయును, వేంగి, కాదు, వేఁపియె, కాఁచును, ఎమ్ములె, కావు, కండలున్, నడుపును, బండ, కాలు–సేతులు గావు, కండచుక్క, గట్రా, మనుపున్ + ఔరా,ఈ + ఐకలి, పెట్టున్, నౌరులపైన్, ప్రెన్–మోపికలన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....ఈ ఐకలి నౌరులపైన్ ప్రెన్ మోపికలన్ పెట్టున్. (మిగితాది అన్వయ సులభము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నవకపుం నేలయె = మృదువైన పంటనేలయే ; ప్రోదించును = పోషించును ; రివటలకే = తీఁగెలకే ; వేంగి = పులి ; వేఁపియె = కుక్కయే ; ఎమ్ములె కావు = ఎముకలే కాదు ; కండలున్ = కండలు కూడ ; కండచుక్క గట్రా = కాలేయము మొద–లైనవి ; మనుపున్ = బ్రదికించును ; ఐకలి = ప్రకృతి ; నౌరుల పైన్ = మృదువైన వాని మీఁద ; ప్రెన్–మోపికలన్ = మహత్తర బాధ్యత–లను.

**లోవాఱిక (తాత్పర్యము) :** మెత్తని నేలయే పంటలు పండి మానవాళికి తిండి పెట్టి బ్రదికించును. సన్నని తీఁగెలకే పెద్దపెద్ద గుమ్మడి కాయును. మనిషిని పెద్దపులి కాదు, పెంపుడు కుక్కయే కాఁపాడును. ఎముకలొక్కటియే కాదు, మెత్తని కండ కూడ మనిషికి సత్తువ నిచ్చును. కాల్సేతులు ఎంత మొద్దుగా ఉన్నను లాభము లేదు. లోపలి అంగములైన కాలేయము, గుండె వంటివే మనిషిని బ్రదికించును.

ఔరా ! ప్రకృతి బండవాటి మీఁద కాక మృదువైన వాటి మీఁద ఎంత ప్రెను-బాధ్యత మోపినది !!

SUMMARY : It is soft soil which yields crops and feeds humanity. It is slender creepers which bear hefty pumpkins. It is a pet dog, but not a tiger, which protects man. It is not just bones, but also muscle which adds to the body strength. It is not the well-built hands and legs, but only the tender inner organs like the liver and heart which give life to man. Oh My God ! How the Nature has burdened the delicate things in stead of the sturdy ones.

**రాల్మీక వాలు జంట** ॥ కనులారన్ జూచిననే, కాని నమ్మమందురీ కారు ;
ఎన్నిఁటిని జూడఁగందురు ? ఎన్ని చూచి తట్టుకొనఁగలరు ? 10
నానాడును బొడచు ప్రొద్దె, కానఁజాలక తల దించుకొందుము ;
ఆద మఱచి కూర్కిన పయిన్, బ్రో దొరులె చెప్పవలె మనకున్. 11

**మాటల విడఁదీత (పద విభాగము) :** కనులు + ఆరన్, చూచినన్ + ఏ, కాని, నమ్మము + అందురు, ఈ, కారు, ఎన్నిఁటినిన్, చూడన్ + కందురు, ఎన్ని, చూచి, తట్టుకొనన్ + కలరు, నాడు + నాడునున్, పొడచు, ప్రొద్దె, కానన్ + చాలక, తలన్, దించుకొందుము, ఆద, మఱచి, కూర్కిన, పయిన్, ప్రోదు, ఒరులె, చెప్పన్ + వలెన్, మనకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఈ కారు కనులారన్ చూచినన్ + ఏ కాని నమ్మము అందురు. ఎన్నిఁటినిన్ చూడన్ కందురు? ఎన్ని చూచి తట్టుకొనన్ కలరు? నాడు-నాడునున్ పొడచు ప్రొద్దె కానన్ చాలక తలన్ దించుకొందుము. ఆద మఱచి కూర్కిన పయిన్ ఒరులె మనకున్ ప్రోదు చెప్పన్ వలెన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చూచినన్ + ఏ కాని = చూస్తేనే కాని ; ఈ కారు = ఈ కాలము ; చూడన్ + కందురు = చూచుటకు అవ-కాశమును పొందెదరు ; నాడు + నాడునున్ = ప్రతి దినమును ; పొడచు = ఉదయించు ; ప్రొద్దె = సూర్యునే ; కానన్ + చాలక = చూడ లేక ; ఆద మఱచి = స్పృహ కోల్పోయి ; కూర్కిన పయిన్ = నిద్రపోయిన తరువాత ; ప్రోదు = తేది ; ఒరులె – ఇతరులే .

**లోవాటిక (తాత్పర్యము) :** "ఏదైనను కళ్ళతో చూచినప్పుడు గాని నమ్మము" అని ఈ కాలములో జనులు పల్కెదరు. కాని ఎవరైనను స్వయ ముగా కళ్ళతో ఎన్ని చూడఁగలరు? ఒకవేళ చూచినను ఎన్నిఁటిని చూచి తట్టుకొనఁగలరు? ప్రతి దినమును ఉదయించు సూర్యునే సూటిగా చూడలేక తల దించుకొనెదము కాదా? ఒడలెఱుంగకుండ గాఢనిద్ర పోయిన తరువాత లేచెదమేని, ఆనాటి తేది మఱియు వారము – వేఱే వారు చెప్పకుండ మనకు తెలియదు కదా?

**పైమాల విడఁబఱ్రు (విశేష వివరణము) :** ఇతరులు నిజాయితీగా సదుద్దేశముతో చెప్పు మాటలను కూడ లెక్కలోనికి తీసికొనవలె నని భావము.

SUMMARY : People these days refuse to believe in anything unless seen with their own eyes. However, howmany things can they see with their own eyes? Howmany things can they bear even if seen? Don't we lower our eyes being unable to look straight into the rising Sun at the dawn? Will we be able to know the date ourselves without asking others after having long sound sleep?

**వాణిద** ॥ తెగ యందురు, త్రెవ యందురు, కొల్వలి యందురు, లేటందురు ;
ఆ తేడపాడలఁ గూర్చి యెడాపెడ పోరాడెదరు ;

ఆ తెగలో ం ఆ త్రెవలో ం ఆ కొల్వలి-లేటలలో
వేదారగఁ దమకెందఱు నెళవు ? ససైకము నూర్వుఱు ? 12

**మాటల విడఁదీత (పద విభాగము) :** తెగ, అందురు, త్రెవ, అందురు, కొల్వలి, అందురు, లేట, అందురు, ఆ, తేడ–పాడలన్, కూర్చి, ఎడా–పెడ, పోరు + ఆడెదరు, ఆ, తెగలోన్, ఆ, త్రెవలోన్, ఆ, కొల్వలి–లేటలలోన్, వేదారగన్, తమకున్, ఎందఱు, నెళవు, ససైకము, నూర్వుఱు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తెగ = ఉపజాతి ; త్రెవ = కులము ; కొల్వలి = మతము ; లేట = శాఖ ; వేదారగన్ = వ్యక్తిగతముగా ; నెళవు = పరిచయము ; ససైకము = కనీసము ; నూర్వుఱు = వందమంది.

**లోవాఱిక (తాత్పర్యము) :** జనులు "మన జాతి, ఉపజాతి, మతము, శాఖ" అనుచు ఆ భేదముల కోసమై ఎడపెడా పోరాడెదరు. ఆ జాతి–కులము మొదలైన వాటిలో వ్యక్తిగతముగా తమకెంతమంది పరిచయము? కనీసము వందమంది అయినను ఉండెదరా?

**వైమాల విడఁబఱ్చు (విశేష వివరణము) :** ముందు తమ చుట్టుప్రక్కల ఉన్నవారిని ప్రేమించుట నేర్చుకొనవలె నని భావము. అందులో జాతి, మత, శాఖాది భేదములను చూపరాదు.

SUMMARY : People love their own race, tribe/ caste, faith and denomination and fight a lot on their basis. But howmany in their own race, religion etc are known to them? At least one hundred souls? *(The poet asks the readers to firstly love those in their surroundings regard-less of these affiliations)*.

**రాల్మిక వాలు జంట ॥** మంచి చేఁదల్పుల వారి, కెంచ మొల్లము హేరాళముండదు ;
మొల్లము గలగిన వారల, కుల్లములన్ జేఁదల్పు లుండవు ; 13
రెండును గలిగిన వారికి, మెండు బ్రదిమి-సేఁపరముండదు ;
మూఁడును గలిగిన వారికిఁ, దోడుండ రెవఱు సూడులె గాని. 14

**మాటల విడఁదీత (పద విభాగము) :** మంచి–చేఁదల్పుల–వారికిన్ + ఎంచన్, మొల్లము, హేరాళము + ఉండదు, మొల్లమున్, కలిగిన వారలకున్ + ఉల్లములన్, చేఁదల్పులు, ఉండవు, రెండునున్, కలిగిన–వారికిన్, మెండు–బ్రదిమి–సేఁపరము, ఉండదు, మూఁడునున్, కలిగిన–వారికిన్, తోడు, ఉండరు, ఎవఱున్, సూడులె, కాని.

**చఱమోలి (అన్వయ క్రమము) :** .....మూఁడునున్ కలిగిన వారికిన్ సూడులె కాని ఎవఱున్ తోడు ఉండరు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మంచి చేఁదల్పుల వారికిన్ = సత్ సంకల్పములు గలవారికి ; ఎంచన్ = లెక్కింపఁగా ; మొల్లము = ధనము ; హేరాళము = విపరీతముగా ; ఉల్లములన్ = మనస్సులలో ; మెండు = పుష్కలమైన ; బ్రదిమి–సేఁపరము = ఆయుః కాలావధి ; సూడులె కాని = శత్రువులే తప్ప.

**లోవాఱిక (తాత్పర్యము) :** సత్ సంకల్పములున్నచో (వాటిని జరిపిడి చేయుటకై) సంపద ఉండదు. సంపద ఉన్నచో సత్ సంకల్పములు ఉండవు. ఈ రెండును గలవారికి ఆయుఃప్రమాణము ఉండదు. ఒకవేళ ఈ మూఁడు ఒనఁగూడినను, మనిషికి శత్రువులే ఎదురయ్యేదరు తప్ప (తన కార్యసాధనలో తగిన) మిత్రులుండరు.

SUMMARY : Even if man has good intentions, he may be short of money to execute them. If he has money, he may not have good intentions. Even when he has both, he may not be

blessed with long lifespan. Even if he is blessed with all of these three, he may not find compatible cohorts to work with. In stead, he may only find enemies all around.

**వెల్మీరిక జంట** ॥ ఎప్పుడుఁ దప్పు సేయని వారు, సప్పునఁ బట్టుపడిపోవుదురు
వడార మొక్కసారి కక్కట ! పిమ్మటఁ దప్పుడు రెంచలుగాఁ 15
బేరు వడెదరు బ్రదిమి పొడవున ఽ ; ఎప్పుడును దప్పే చేయు వా-
రెప్పటికిని జిక్క "రప్పసము నిప్పంటి" ఽ అనిపించుకొందురు. 16

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎప్పుడున్, తప్పు, చేయని–వారు, చప్పునన్, పట్టు–పడి–పోవుదురు, వడారము + ఒక్క–సారికిన్ + అక్కట, పిమ్మటన్, తప్పుడు, రెంచలుగాన్, పేరు + పడెదరు, బ్రదిమి–పొడవునన్, ఎప్పుడును, తప్పే, చేయు, వార్ + ఎప్పటికినిన్, చిక్కరు, అప్పసము, నిప్పంటి, అనిపించుకొందురు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** అక్కట ! ఎప్పుడున్ తప్పు చేయని వారు వడారము ఒక్క–సారికిన్ చప్పునన్ పట్టుపడిపోవుదురు. పిమ్మటన్ తప్పుడు రెంచలుగాన్ పేరు + పడెదరు. బ్రదిమి పొడవునన్ ఎప్పుడును తప్పే చేయు వార్ ఎప్పటికినిన్ చిక్కరు. అప్పసము నిప్పంటి అనిపించుకొందురు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వడారము = కేవలము ; అక్కట = అయ్యో ; పిమ్మటన్ = తరువాత ; తప్పుడు రెంచలుగాన్ = తప్పుడు మనుష్యులుగా ; పేరు + పడెదరు = ప్రసిద్ధి నొందెదరు ; బ్రదిమి పొడవునన్ = జీవితాంతము ; అప్పసము = నిత్యము ; నిప్పంటి = అగ్ని–కల్పులు (అగ్ని అంత పవిత్రులు).

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Alas ! Those who are never into wrong-doing get nabbed instantly and will be noted for life as the corrupt for just one isolated incidence of wrong-doing. However those who are long given to wrong-doing never get caught, but receive compliments as the spotless ones.

**తలీరిక (అవతారిక)**: *ప్రజలను ప్రభావితము చేయుటలో మిక్కుటముగా పాత్ర పోషించు అంశములను ఈ క్రింది పద్యములో ఏకరువు పెట్టు చున్నాఁడు.*

**వాఁణిద** ॥ వందలాది మంది ముందు వలికెడునది ప్రోదివాను ;
అంతకన్న నొక నోలున సంతరింత హతరవాను ;
దాని మించి దొరతనంబు, సాటినదే పోతరవాన్ ;
వాటన్నింటి కంటెఁ దమ యక్కఱ తమకు బ్రోమువాన్. 17

**మాటల విడఁదీత (పద విభాగము) :** వందల + ఆది–మంది, ముందు + పలికెడు + అది, ప్రోదివాను, అంత–కన్నన్, ఒక, నోలునన్, సంతరింత, హతరవాను, దానిన్, మించి, దొరతనంబు, చాటినదే, పోతరవాన్, వాటి + అన్నింటి–కంటెన్, తమ, అక్కఱ, తమకున్, బ్రోమువాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ప్రోదివాను = పుష్టియైనది ; నోలునన్ = పుస్తకములో ; సంతరింత = వ్రాసి యున్నది ; హతరవాను = ప్రభావశాలి ; దొరతనంబు = ప్రభుత్వము ; చాటినదే = ప్రకటించినదే ; పోతరవాన్ = బలీయము ; అక్కఱ = అవసరము ; బ్రోమువాన్ = శక్తిమంతము.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఎవఱు ఏమని చెప్పినను, వ్రాసినను, శాసించినను, అంతిమముగా జనము తమ తమ అవసరము–లను బట్టియే నడచుకొందురని భావము.

SUMMARY : The words spoken in front of hundreds of people are powerful. Those written in a book are more influential. The statements from the side of the government are even more compelling. But the force of one's own needs is more potential than all of the above.

**గంగేరిక ||** కాంచువు లోడెదరు కాంచువులకు ; కాంచరు లోడెదరు కొడుకులకు ;
కొడుకు లోడఁగలరు కోడళ్ళకు ; కోడ ళ్ళోడెదరు కోడళ్ళకు. 18

**మాటల విడఁదీత (పద విభాగము) :** కాంచువులు + ఓడెదరు, కాంచువులకున్, కాంచరులు + ఓడెదరు, కొడుకులకున్, కొడుకులు, ఓడన్ + కలరు, కోడళ్ళకున్, కోడళ్ళు + ఓడెదరు, కోడళ్ళకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కాంచువులు కాంచువులకున్ ఓడెదరు. కాంచరులు కొడుకులకున్ ఓడెదరు. కొడుకులు కోడళ్ళకున్ ఓడన్ కలరు. కోడళ్ళు కోడళ్ళకున్ ఓడెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కాంచువులు = గురువులు ; కాంచరులు = తల్లిదండ్రులు.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక గురువు మఱియొక గురువు చేతిలో ఓడును. తల్లిదండ్రులు తమ కొడుకుల దగ్గర ఓడెదరు. ఆ కొడుకులు తమ భార్యల దగ్గర ఓడెదరు. ఆ భార్యలు మరల తమ కోడళ్ళ చేతులలో ఓడెదరు.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఎవఱి పైచేయి అయినను తాత్కాలికమే నని భావము.

SUMMARY : Masters lose to masters. Parents lose to ther sons. Sons capitualte before their wives. Their wives taste defeat at the hands of their daughters-in-law.

**పొన్నిక ||** నల్వుఱ నోళ్ళలో నానినదేది యైన, విల్వఁ గోల్పడు, నది పలుకైన రెంచయిన ;
మరల నా రెంచకు మాటకుఁ గడుచేరువ నరిగినఁ గాని పరి యెఱుఁగఁజాల రా విలువ. 19

**మాటల విడఁదీత (పద విభాగము) :** నల్వుఱ, నోళ్ళలోన్, నానినది + ఏది + ఐనన్, విల్వన్, కోల్పడున్, అది, పలుకు + ఐనన్, రెంచ + అయినన్, మరలన్, ఆ, రెంచకున్, మాటకున్, కడు–చేరువన్, అరిగినన్, కాని, పరి, ఎఱుఁగన్ + చాలరు + ఆ, విలువన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** అది పలుకు ఐనన్ రెంచ అయినన్ నల్వుఱ నోళ్ళలోన్ నానినది ఏది ఐనన్ విల్వన్ కోల్పడున్. మరలన్ ఆ రెంచకున్ మాటకున్ కడు–చేరువన్ అరిగినన్ కాని పరి ఆ విలువన్ ఎఱుఁగన్ చాలరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నల్వుఱ = నలుగుఱి యొక్క ; విల్వన్ = విలువను ; కోల్పడున్ = కోల్పోవును / పోఁగొట్టుకొనును ; పలుకు + ఐనన్ = మంచి మాట అయినను ; రెంచ + అయినన్ = మనిషి అయినను ; కడు–చేరువన్ = మిక్కిలి దగ్గరగా ; అరిగినన్ + కాని = వెళితేనే గాని ; పరి = జనము ; ఎఱుఁగన్ + చాలరు = తెలిసికొనలేరు.

**లోవాఱిక (తాత్పర్యము) :** జనము ఒక మనిషిని గుఱించి ఎక్కువ మాటలాడిన కొలఁది వారి కనురోకలో ఆ మనిషి యొక్క విలువ తగ్గి-పోవును. అట్లే ఒక మేల్పలుకును పదే పదే ఉటంకించిన కొలఁది దాని విలువ కూడ తగ్గిపోవును. ఆ మనిషికి మఱియు ఆ సూక్తికి చాల దగ్గరగా పోయిననే గాని మరల జనము ఆ మనిషి విలువను/ ఆ మాట విలువను గుర్తింపఁజాలరు.

SUMMARY : The more the people speak of a person or a quote, the more the latter get devalued. The people will not be able to appreciate their value again until and unless they draw closest to them.

**వెల్మిరిక** ॥ మోసువడి వెన్నాడిన కొలఁది, యీసడించుకొనుఁ గా యొలవు ;
"చాలు" నని యెడమేఁగు మీఁదట, మీఁదఁబడు నా యొలవె యాదట. 20

**మాటల విడఁదీత (పద విభాగము) :** మోసు + పడి వెన్ను + ఆడిన, కొలఁది, ఈసడించుకొనున్, కా, ఒలవు, చాలున్, అని, ఎడము + ఏఁగు, మీఁదటన్, మీఁదన్, పడున్, ఆ, ఒలవె, ఆదటన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** మోసుపడి వెన్ను ఆడిన కొలఁది ఒలవు ఈసడించుకొనున్ కా. చాలున్ అని ఎడమేఁగు మీఁదటన్ ఆ ఒలవె ఆదటన్ మీఁదన్ పడున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మోసు + పడి = మోజుపడి ; వెన్ను + ఆడిన కొలఁది = వెంటపడిన కొలఁది ; ఈసడించుకొనున్ కా = చీదరించుకొనును కదా ; ఒలవు = లోకము ; ఎడము + ఏఁగు మీఁదటన్ = దూరముగా పోయిన తరువాత ; ఆదటన్ = అభిమానముతో.

**లోవాఱిక (తాత్పర్యము) :** లోకము పట్ల వ్యామోహముతో దాని వెంట మనము పడిన కొలఁది అది మనలను ఏవగించుకొనును. "ఇక చాలు నులే. ఏమి నీ గొప్ప? నీవు నాకు వలదు" అనుకొని మనము దానికి దూరముగా జరిగి మన పనిలో మనమున్నప్పుడు ఆ లోకమే వచ్చి అభిమానముతో మీఁదపడి కౌఁగలించుకొనును.

SUMMARY : The world looks down upon us as long as we hanker after it (its appreciation etc). Long after we called it quits and minded our own business, it will suddenly step in and embrace us with affection.

**వెల్మిరిక జంట** ॥ కూడు లేక కుందిన ప్రొద్దుల, మాడ యిచ్చువాఁడే యుండఁడు ;
చెమటోడ్చి యెటులో యెత్తెదుగ, "వాఁడు మావాఁ" డను నొక్క త్రెవ ; 21
"టె" క్కందురు తన చుట్టములు ; విరాళముల కెగఁబడు కూటములు ;
"పన్నులు పన్ను" లను దొరతనము ; కడు తుకాటమీ పెల్చతనము. 22

**మాటల విడఁదీత (పద విభాగము) :** కూడు, లేక, కుందిన, ప్రొద్దులన్, మాడ, ఇచ్చు-వాఁడే, ఉండఁడు, చెమట + ఓడ్చి, ఎటులో, ఎత్తు + ఎదుగన్, వాఁడు, మా వాఁడు + అనున్, ఒక్క, త్రెవ, టెక్కు, అందురు, తన, చుట్టములు, విరాళములకున్, ఎగఁబడున్, కూటములు, పన్నులు, పన్నులు, అనున్, దొరతనము, కడు, తుకాటము, ఈ, పెల్చతనము.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** కూడు లేక కుందిన ప్రొద్దులన్ మాడ ఇచ్చు-వాఁడే ఉండఁడు. చెమట ఓడ్చి ఎటులో ఎత్తు ఎదుగన్ ఒక్క త్రెవ "వాఁడు మా వాఁడు" అనున్. తన చుట్టములు టెక్కు అందురు. కూటములు విరాళములకున్ ఎగఁబడున్. దొరతనము పన్నులు పన్నులు అనున్. ఈ పెల్చతనము కడు తుకాటము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కూడు లేక = తిండి లేక ; కుందిన = బాధపడిన ; ప్రొద్దులన్ = వేళలందు ; మాడ = ఒక నాణెము ; త్రెవ =

కులము ; టెక్కు = గర్వము ; కూటములు = సంఘములు ; దొరతనము = ప్రభుత్వము ; కడు తుకాటము = మిక్కిలి ప్రాచీనము ; పెల్చ తనము = కఠిన హృదయము.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనిషి ఆఁకటితో నకనకలాడుచున్న పేదఱికపు నాళ్ళలో అతనిని పిలిచి ప్రేమగా చేతిలో ఒక నాణెము పెట్టువాఁడెవఁడును కనిపించఁడు. ఆ మనిషి కష్టపడి ఏదియో ఒక విధముగా బ్రదిమానములో పైకి రాఁగా, అతనిని అందఱు చుట్టుముట్టెదరు. ఒక కులమువారు లేచి, "ఆతఁడు మా కులస్థుఁడే" అని గర్వముగా చాటెదరు. కొన్ని సంఘముల వారు వచ్చి, "మీ బాసట కావలె" ననుచు ఆతని నుండి విరాళములను యాచించెదరు. చుట్టములేమో తనకు గీఱ ఎక్కినదనుట మొదలుపెట్టెదరు. ప్రభుత్వము ప్రత్యక్షమై, "నీవు సంపాదించిన దాని మీఁద పన్నులు కట్టు"మని శాసించును. బాహ్యావరణము యొక్క ఈ కఠిన హృదయము ఈనాటిది కాదు సుమా ! (ఎప్పటి నుండియో ఉన్నది. ఇఁకముందు కూడ ఉండునని భావము).

SUMMARY : There would be none to give man a coin when he sufferes from hunger. How- ever, when the same man comes up the hard way in his life by the sweat of his brow, he will be surrounded by a variety of strangers. Some will rise to claim that he belonged to their caste. Some others will come in groups and beg him for donations. Relations will start accusing him of hubris. Authorities will appear from nowhere and order him to pay taxes on all that he has earned. This cruelty has a long history.

**తలీరిక (అవతారిక)** : *లోకము మిక్కిలి (కుళ్ళు)-కుత్సితములతో నిండి ఉన్నదని హెచ్చరించుచున్నాఁడు.*

.**పస్సియ జంట** ॥ అవతలివాని చొక్కాకొక గుండి ౧, అదనమ్మైన నొలవది చించు సుండి !

కనుకనె ముక్కంటి సనె వలిగుబ్బలి ; నలుచేతులవాఁ డరిగెఁ బాల్కడలి ; 23

నిక్కువానసము నెక్కె నలువయ్య ; వేకంటి లాహ వీడి రాఁడయ్యె. 24

**మాటల విడఁదీత (పద విభాగము) :** అవతలి–వాని, చొక్కాకున్, ఒక, గుండి, అదనము, ఐనన్, ఒలవు + అది, చించున్, సుండి, కనుకనె, ముక్కంటి, చనెన్, వలి–గుబ్బలిన్, నలు–చేతుల–వాడు, అరిగెన్, పాల్ + కడలి, నిక్కువ + ఆనసమున్, ఎక్కెన్, నలువ + అయ్య, వే–కంటి, లాహన్, వీడి, రాఁడు + అయ్యెన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** అవతలి–వాని చొక్కాకున్ ఒక గుండి అదనము ఐనన్ ఒలవు అది చించున్ సుండి కనుకనె ముక్కంటి వలి–గుబ్బలిన్ చనెన్. నలు–చేతుల–వాడు పాల్ –కడలి అరిగెన్. నలువ + అయ్య నిక్కువ–ఆనసమున్ ఎక్కెన్. వే–కంటి లాహన్ వీడి రాఁడు అయ్యెన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఐనన్ = అయినచో ; ఒలవు = లోకము ; సుండి = సుమండీ ; ముక్కంటి = శివుఁడు ; చనెన్ = వెడలెను ; వలి–గుబ్బలిన్ = హిమాలయమునకు ; నలు–చేతుల–వాడు = విష్ణుమూర్తి ; అరిగెన్ = వెడలెను ; పాల్ + కడలిన్ = పాల సముద్రము–నకు ; నిక్కువ + ఆనసమున్ = సత్యలోకమును ; ఎక్కెన్ = అధిరోహించెను ; నలువ + అయ్య = నాలుఁగు ముఖముల బ్రహ్మదేవుఁడు ; వే–కంటి = వేయి కన్నులు గలవాఁడైన ఇంద్రుఁడు ; లాహన్ = స్వర్గమును ; వీడి రాఁడు + అయ్యెన్ = వదిలిపెట్టి రాఁడాయెను.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒకని చొక్కాకు ఒక గుండి ఎక్కువగా ఉన్నచో మానవ లోకము అసూయ పట్టలేక ఆ చొక్కా మొత్తమును పరపర చించి చీలికలు చేయు వరకు నిద్రపోదు. అందువలననే ఈ మానవ లోకము నుండి తప్పించుకొనుటకై శివుఁడు హిమాలయములకు పోయెను. విష్ణుమూర్తి పాల సముద్రములో పరుండెను. బ్రహ్మదేవుఁడు సత్యలోకమునకు వెడలెను. ఇంద్రుఁడు స్వర్గమునకే పరిమిత–మయ్యెను.

SUMMARY : The jealous human world won't rest until it tears down one's shirt to pieces if it has got just one more button. That's why Lord Siva left for the Himalayas. Lord Vishnu took rest in the Milk Ocean. Brahma settled in Satyalokam. Indra refused to come out of Heaven. All for fear of the human world.

**తామరిక ॥** మన చొఅకమేమియు లేకయే, మక్కువకంటుపాదులౌదుమే !
ప్రొద్దునకుఁ గెరలుఁ గోడిపుంజు ; వద్దని డాఁగును గ్రుడ్లగువ్వ ;
తేపకడను బొడవక తప్పదు ; మాపునఁ దాఁ గ్రుంకక మానదు ;
పుంజు-గువ్వల గుండెసవ్వడిఁ బ్రొద్దేటికి సరకు సేసెడి ? 25

**మాటల విడఁదీత (పద విభాగము) :** మన, చొఅకము + ఏమి + ఉన్, లేక + ఏ, మక్కువ-కంటు-పాదులు + ఔదుమే (అగుదుమే), ప్రొద్దునకున్, కెరలున్, కోడి-పుంజు, వద్దు + అని, డాఁగును, గ్రుడ్ల-గువ్వ, తేపకడను, పొడవక, తప్పదు, మాపునన్, తాన్, క్రుంకక, మానదు, పుంజు-గువ్వల, గుండె-సవ్వడిన్, ప్రొద్దు + ఏటికిన్, సరకు-చేసెడిన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** మన చొఅకము ఏమి + ఉన్ లేక + ఏ, మక్కువ-కంటు-పాదులు ఔదుమే. కోడి-పుంజు ప్రొద్దునకున్ కెరలున్. గ్రుడ్ల-గువ్వ వద్దు అని డాఁగును. (ప్రొద్దు) తేపకడను పొడవక తప్పదు. మాపునన్ తాన్ క్రుంకక మానదు. పుంజు-గువ్వల గుండె-సవ్వడిన్ ప్రొద్దు ఏటికిన్ సరకు-చేసెడిన్?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చొఅకము = జోక్యము ; మక్కువ-కంటు-పాదులు = రాగద్వేషములకు పాత్రులము ; ఔదుమే (అగుదుమే) = అయ్యెదము కదా ; ప్రొద్దునకున్ = సూర్యునికి (సూర్యుఁడు కనిపించినందుకు) ; కెరలున్ = ఉత్సహించును ; డాఁగును = దాఁగికొనును ; గ్రుడ్ల-గువ్వ = గ్రుడ్లగూబ ; తేప-కడను = ఉదయమున ; పొడవక తప్పదు = ఉదయింపక తప్పదు ; మాపునన్ = సాయంకాలము ; క్రుంకక మానదు = అస్తమింపక మానదు ; ఏటికిన్ = ఎందుకు ; సరకు-చేసెడిన్ = లెక్కచేయును?

**లోవాఱిక (తాత్పర్యము) :** మనము తఱచుగా మన ప్రమేయమేమియు లేకుండనే వేఱేవారి కనురోకలో ఇష్టులము మఱియు ద్వేష్యులము అగుచుందుము. అందుకు మనమేమి చేయఁగలము? మన దారిన మన కర్తవ్యమును నిర్వర్తించుటయే మన చేతులలో ఉన్నది. సూర్యుఁడు ఉదయించినప్పుడు కోడిపుంజు ఉత్సాహముతో "కొక్కొరొకో" అని కూయును. కాని గ్రుడ్లగూబ కండ్లు మూసికొని తన గూటిలో దాఁగి-కొనును. కాని వాటి ఉత్సాహ నిరుత్సాహాదులను సూర్యుఁడెందుకు లెక్కచేయును?

SUMMARY : We often become objects of love or hatred in the eyes of others without playing any wilful role in all that. How can we help it? Doing our duty is what falls to our lot. The rooster is excited when the Sun rises. But the owl withdraws into its nest. How can the Sun help it? He has a daily duty to rise and set. Why should He care?

**రాల్మిక వాలు ॥** రెంచ యెఱుఁగునది కొంచెము ; చేయనెంచునది మటు కకంచెము ;
చేయం గలది మప్పితము ; చేయునదెల్లఁ దుదకు ౨ తప్పిదము. 26

**మాటల విడఁదీత (పద విభాగము) :** రెంచ, ఎఱుఁగునది, కొంచెము, చేయన్ + ఎంచునది, మటుకు + అకంచెము, చేయన్ + కలది, మప్పితము, చేయునది + ఎల్లన్, తుదకున్, తప్పిదము.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** రెంచ = మనిషి ; చేయన్ + ఎంచునది= చేయఁగోరునది ; అకంచెము = అపరిమితము ; మప్పితము = పరిమితము.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Man knows only a little but wants to accomplish an unlimited number of things. He can accomplish only a little. But all of his accomplishments are full of mistakes.

**అవిగింగ జంట** || చెడే యెగనూరుపును జెడే దిగనూరుపును
జెడే తీపికూడును జెడే మంచినీరును
జెడే కనుల విందును జెడే పెద్ద పండుగయు ;
చెడునకుఁ జూచు కూట సేరెడు కన్నులతో ; 27
దొరుకనిచో నొక చెడుఁ బుట్టించుకొనుఁ గడఁక ;
లేనిది పుండలించు మానైన పూనికన్ ;
మంచివారల చెడు మఱియుఁ గమ్మన దానికి ;
మంచిచెడులు నీవి చూపకుమి తన కంటికి. 28

**మాటల విడఁదీత (పద విభాగము) :** (కూటకున్) చెడే, ఎగన్ + ఊరుపును, చెడే, దిగన్ + ఊరుపును, చెడే, తీపి-కూడును, చెడే, మంచి-నీరును, చెడే, కనుల, విందును, చెడే, పెద్ద, పండుగ +ఉన్, చెడునకున్, చూచున్, కూట, చేర + ఎడు, కన్నులతోన్, దొరుకనిచోన్, ఒక, చెడున్, పుట్టించుకొనున్, కడఁకన్, లేనిది, పుండలించున్, మాను + ఐన, పూనికన్, మంచి-వారల, చెడు, మఱి + ఉన్, కమ్మన, దానికిన్, మంచి-చెడులు, నీవి, చూపకుమి, తన, కంటికిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (కూటకున్) చెడే ఎగన్ + ఊరుపును చెడే దిగన్ + ఊరుపును. చెడే తీపి-కూడును చెడే మంచి-నీరును. చెడే కనుల విందును, చెడే పెద్ద పండుగ +ఉన్. కూట చేరెడు కన్నులతోన్ చెడునకున్ చూచున్. (చెడు) దొరుకనిచోన్ ఒక చెడున్ కడఁకన్ పుట్టించుకొనున్. మాను ఐన పూనికన్ లేనిది పుండలించున్. దానికిన్ మంచి-వారల చెడు మఱి + ఉన్ కమ్మన. మంచి-చెడులు నీవి తన కంటికిన్ చూపకుమి.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** (కూటకున్ = సమాజమునకు) ; ఎగన్ + ఊరుపును = ఉచ్ఛ్వాసము ; దిగన్ + ఊరుపును = నిఃశ్వాసము కూడ ; తీపి-కూడును = పాయసము కూడ ; పెద్ద పండుగ +ఉన్ = సంక్రాంతి కూడ ; చెడునకున్ = చెడు కోసమై ; చేర + ఎడు = అఱి-చేయంత ; కడఁకన్ = ప్రయత్నముతో ; లేనిది = లేని చెడును ; పుండలించున్ = కల్పించును ; మాను + ఐన = శ్రేష్ఠమైన ; పూనికన్ = ప్రయత్నముతో ; మఱి + ఉన్ కమ్మన = ఇంకను కమ్మన.

**లోవాఱిక (తాత్పర్యము) :** సమాజమునకు చెడ్డ విషయములన్నవి మిక్కిలి ప్రీతిపాత్రము. చెడే దానికి ఉచ్ఛ్వాస నిఃశ్వాసములు. చెడే దానికి తీయని పాయసమును, మంచినీరును, సంక్రాంతి పండుగ కూడ. కనుక చెడు కోసమై సమాజము చేరెడేసి కన్నులతో వెదకుచుండును. ఒక వేళ ఆ చెడు దానికి దొరకనిచో అటువంటి దానిని సప్రయత్నముగా సృష్టించి ఆనందించును. అట్లు సృష్టించలేనిచో లేని చెడు ఉన్నట్లుగా ఒక కల్పిత కథ కట్టి సంతోషించును. సమాజమునకు మంచివారిలో కనిపించు చెడు మఱింత మధురము. అందుచేత నీ మంచిచెడు-లేవియు సమాజపు కనురోకకు రాని విధముగా జాగ్రత్తపడుము.

SUMMARY : The evil is the apple of the eye of the society. It is its life sustenance like inhal-ation and exhalation. It is its delicious food, water and the memorable event worth celebra-

ting. Therefore, the society is always on the lookout for the evil with its eyes wide open. If it is not found, it will create one, putting in lots of effort. If it is unable to create one, it will start a rumour about an imaginary evil. Esp. the perceived evil in the noble feels sweetest to the society. Hence, take all possible care so that your good and bad do not attract the attention of the society.

**గోరంటిక ॥** ఉన్న పట్టునకో చిన్న చుట్టుకకో, ఒలవని పేరుఁ బెట్టి పరువుఁ దీయకుమి ;
పేరుపార్రైన దది తీరుతీర్రైనది ; నలువుఱు గా, రేడున్నఱ తోరలది. 29

**మాటల విడఁదీత (పద విభాగము)** : ఉన్న, పట్టునకో, చిన్న, చుట్టుకకో, ఒలవు + అని, పేరున్, పెట్టి, పరువున్, తీయకుమి, పేరుపారు + ఐనది + అది, తీరుతీరు + ఐనది, నలువుఱు, కారు, ఏడున్ + అఱ, తోరలది.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పట్టునకో = ప్రదేశమునకో ; చుట్టుకకో = పరిసరమునకో ; ఒలవు = ప్రపంచము ; పేరుపారు + ఐనది = ప్రసిద్ధమైనది ; తీరుతీరు + ఐనది = వైవిధ్యము గలది ; ఏడున్ + అఱ తోరలది = ఏడున్నఱ శతకోటుల జనాభా గలది.

**లోవాఱిక (తాత్పర్యము) :** నీవున్న ఒక చిన్న ప్రదేశమునకో, లేదా నీ చుట్టుత ఉన్న పరిసర ప్రాంతములకో "ప్రపంచము/ లోకము" అని వర్ణించి ప్రపంచపు పరువు తీయవలదు మిత్రమా ! అదొక్కటియే ప్రపంచము కాదు. ప్రపంచమనఁగా ఇంకను చాల పెద్దది. ప్రసిద్ధమైనది. అది నలుగుఱు కాదు. ఏడున్నఱ శతకోటుల జనాభా గల మహాస్వరూపము.

**వైమాల విడఁబర్రు (విశేష వివరణము) :** "నలుగుఱూ ఏమనుకుంటారు? లోకం ఏమనుకుంటుంది?' అని ప్రశ్నించు వారికి కవి చెప్పుచున్న మార్పులుకిది.

SUMMARY : Don't humiliate the world at large by calling a small place or neighborhood as "the world". The actual world is known to be incredibly diverse. It comprises not just a handful of souls around you, but a population of 7 and a half billion out there.

**గంగేరిక డిగ్గు జంట ॥** ఆయికారిటుల మెప్పు దొరుకదు, పారిపై లాహ సిక్కదు ;
పీనుఁగులకు మూలుగులుండవు ; కూటమునకుఁ దెలివుండదు. 30

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఆయికారిటుల, మెప్పు, దొరుకదు, పారిపైన్, లాహ + చిక్కదు, పీనుఁగులకున్, మూలుగులు, ఉండవు, కూటమునకున్, తెలివు, ఉండదు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఆయికారిటుల మెప్పు = సమకాలికుల ప్రశంస ; పారి పైన్ = భూలోకము మీఁద ; లాహ = స్వర్గము ; పీనుఁగులకున్ = శవములకు ; కూటమునకున్ = సమాజమునకు ; తెలివు = తెలివితేఁటలు.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనిషికి సమకాలికుల ప్రశంస లభింపదు. భూమిపై స్వర్గమెన్నటికిని సాధ్యపడదు. శవముల నుండి ఏవియో చప్పుళ్ళు వచ్చును గాని అవి మూల్గులు కావు. సమాజమొక వరుసలో నడచుచుచుండును. కాని అంతమాత్రమున దానికి తెలివితేఁటలున్నవని భ్రమింపరాదు.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** (౧) మనిషికి ప్రశంసలన్నియు తరువాతి తరముల నుండియే లభించునని భావము. బ్రదికి ఉండఁగా మెచ్చుకొనువారు తక్కువ.

(౨) ఈ పద్యమునందు కవి అసంభవములన్నిఁటిని గుదిగ్రుచ్చినాఁడు.

(౩) ఆయికారిటి = సమకాలికము/ సమకాలికుఁడు/ సమకాలికురాలు.

SUMMARY : Man cannot win the acclaim of his comtemporaries. Creating heaven on the earth is never possible. The sounds emanating from the corpses are not grumblings. The society is not sentient however orderly it appears. (Here, the poet lists out a few popular illusions).

**గంగేరిక డిగ్గు ||** ఉరివానునకు మసకము గలుగదు ; అణఁకువ యేలిక కుండదు ;
మంట సల్లదనము నౌపొందదు ; మగవాని కెలమి ౦ అందదు. 31

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఉరివానునకున్, మసకము, కలుగదు, అణఁకువ, ఏలికకున్, ఉండదు, మంట, చల్లదనమున్, ఔపొందదు, మగవానికిన్, ఎలమి, అందదు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఉరివానునకున్ = ఉరి వేయఁబడిన వానికి ; మసకము = కామము ; అణఁకువ = వినయము ; ఏలికకున్ = పరిపాలకులకు ; ఔపొందదు = అనుభవించదు ; ఎలమి = ప్రేమ.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : A man hanged to death is not sexually aroused. Similarly, the ruler does not have humility. Fire never knows what coolness is. Similarly the male does not receive love. (He can only hope to receive respect).

**వాణిద ||** ప్రోదిం పది గల్గినచోఁ దళుకులీను మందనములు ;
లేదయ్యేనేని నవియే పరికి విళంగిపాదులగు ;
తారివాను గల వేఁపిని "భైరవుఁ డూరి వేహి" యని
చీరెద, రటుగానిచో ౦ "కుక్క" యని చీదరించెదరు. 32

**మాటల విడఁదీత (పద విభాగము) :** ప్రోదింపు + అది, కల్గినచోన్, తళుకులు + ఈనున్, మందనములు, లేదు + అయ్యేన్ + ఏనిన్, అవి + ఏ, పరికిన్, విళంగిపాదులు + అగున్, తారివాను, కల, వేఁపినిన్, భైరవుఁడు, ఊరి, వేహి, అని, చీరెదరు + అటు, కానిచోన్, కుక్క, అని, చీదరించెదరు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ప్రోదింపు అది కల్గినచోన్ మందనములు తళుకులు ఈనున్. (మిగితాది సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ప్రోదింపు + అది = ఆ పోషణము ; కల్గినచోన్ = దొరకినచో ; తళుకులు + ఈనున్ = వెలుఁగును/ మెఱయును ; మందనములు = సుగుణములు ; లేదు + అయ్యేన్ + ఏనిన్ = లేనిచో ; అవి + ఏ = అవే ; పరికిన్ = ప్రజకు ; విళంగిపాదులు + అగున్ = నిందార్హములగును ; తారివాను కల = యజమానుఁడు గల ; వేఁపినిన్ = కుక్కను ; ఊరి వేహి = గ్రామసింహము ; చీరెదరు

= పిలిచెదరు ; ఛీదరించెదరు = ఛీ కొట్టెదరు.

**లోవాఱిక (తాత్పర్యము) :** రాజపోషణమున్నచో వ్యక్తుల/ విషయముల సద్గుణములు బయటికి వచ్చి మెఱయును. కానప్పుడు ఆ సద్గుణ–ములే దుర్గుణములుగా భావింపఁబడి తిట్టఁబడును. యజమానుఁడు గల కుక్కను జనులు భైరవుఁడని, గ్రామసింహమని పొగడెదరు. యజమానుఁడు లేని కుక్కను ఛీకొట్టి తరిమెదరు.

SUMMARY : The merits of individuals and things come out and shine only when they have royal patronage. If not, the same individuals and things are deemed to be vile and therefore, get blamed. For example, a pet dog is praised as Bhairava and the Lion of the town, while a street dog is despised and chased away.

**తామరిక ||** ఎన్ని జరిగినఁ గాని నేర్వరు తా మెవఱేదియు జరిమి నుండి ;
చెరి తరమువారును దలంతురు మునుపటులపైఁ దాము మెఱుఁగని,
వా రప్పటమైన మొప్పెలని, కారు తమది మిక్కిలి వేఱని,
నాటి తప్పులింక జరుగవని ; కారు మూదలించుఁ గాదని. 33

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎన్ని, జరిగినన్, కాని, నేర్వరు, తాము + ఎవఱు + ఏదియున్, జరిమి, నుండి, చెరి, తరము–వారును, తలంతురు, మునుపటుల, పైన్, తాము, మెఱుఁగు + అని, వారు + అప్పటము + ఐన, మొప్పెలు + అని, కారు, తమది, మిక్కిలి, వేఱు + అని, నాటి, తప్పులు + ఇంకన్. జరుగవు + అని, కారు, మూదలించున్, కాదు + అని.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ఎన్ని జరిగినన్ కాని తాము ఎవఱు ఏదియున్ జరిమి నుండి నేర్వరు. చెరి తరము–వారును మునుపటుల పైన్ తాము మెఱుఁగు అని వారు అప్పటము ఐన మొప్పెలు అని కారు తమది మిక్కిలి వేఱు అని నాటి తప్పులు ఇంకన్ జరుగవు అని తలంతురు. కాదు అని కారు మూదలించున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** జరిమి = చరిత్ర ; చెరి = ప్రతి ; తలంతురు = తలఁచెదరు ; మునుపటులపైన్ = పూర్వుల కన్న ; మెఱుఁగు + అని = నయమని ; అప్పటము + ఐన = శుద్ధమైన ; మొప్పెలు = మూర్ఖులు ; కారు = కాలము ; మూదలించున్ = నిరూ–పించును.

**లోవాఱిక (తాత్పర్యము) :** చరిత్రలో ఎన్ని ఘటనలు జరిగినను, ఎవఱును దాని నుండి ఏమియు నేర్చుకొనరు. తాము పూర్వుల కన్న నయమనియు, పూర్వులు శుద్ధ మూర్ఖులనియు, తమ కాలము చాల వేఱనియు, అందుచేత పూర్వులు చేసిన పొఱఁబాటులు తాము చేయ–మనియు అందఱును భావించెదరు. కాని "ఆ అభిప్రాయము తప్పు" అని కాలము నిరూపించును.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** చరిత్ర నుండి పాఠములు నేర్చుకొననంత కాలము, కాలము మారినను, తరములు మారినను ప్రయోజనమేమియు ఉండదని తాత్పర్యము.

SUMMARY : No one learns any lesson from the happenings of history. Everyone thinks that he/ she is wiser than the ancestors, that the latter were just fools, that their own times are qualitatively different and therefore, they are not at all going to repeat the grand mistakes of their predecessors. However time will prove all these assumptions wrong.

*(The poet implies that the times won't change and mistakes continue as long as hunanity*

*refuses to learn its leassons from history).*

**తలీరిక (అవతారిక)**: *ఈ క్రింద కవుల వైశిష్ట్యమును ఉగ్గడించుచున్నాఁడు.*

**వెల్మిరిక** ॥ రెంచలు పెక్కుఱు పుట్టినపుడె ; పోహి గిట్టు దనుకను రెంచయె ;
వరలకు లొచ్చు ; ఇలవాని కెచ్చు ; తనీవిక గైకొనని కాంచువు. 34

**మాటల విడఁదీత (పద విభాగము) :** రెంచలు, పెక్కుఱు, పుట్టిన + అపుడె, పోహి, గిట్టు, దనుకను, రెంచయె, వరలకున్, లొచ్చు, ఇల-వానికిన్, ఎచ్చు, తనీవికన్, కైకొనని, కాంచువు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** రెంచలు = మనుష్యులు ; పెక్కుఱు = చాలమంది ; పోహి = కవి ; గిట్టు దనుకను = చనిపోవునంత వరకు ; వరలకున్ = మునికి ; లొచ్చు = తక్కువ ; ఇలవానికిన్ = గృహస్థునకు ; ఎచ్చు = ఎక్కువ ; తనీవికన్ = దక్షిణను ; కైకొనని = తీసి-కొనని ; కాంచువు = గురువు.

**లోవాటిక (తాత్పర్యము) :** లోకమున చాలమంది మనుష్యులు పుట్టినప్పుడు మాత్రమే మనుష్యులుగా నుందురు. తరువాత వారిలో కొందఱు జంతువులయ్యెదరు. మఱికొందఱు రాక్షసులయ్యెదరు. కవి మటుకు – పుట్టినప్పుడును మనిషియే. బ్రదుకుచున్నప్పుడును మనిషియే. చనిపోవునప్పుడును మనిషియే. ఆతఁడు తపస్వులైన మునుల కన్న తక్కువవాఁడే. కాని సాధారణ గృహస్థుల కన్న ఎక్కువవాఁడు. ఆతఁడు లక్షలాది మందికి సందేశ-ఉపదేశములు కావించి వారికి గురువగును. కాని ఎవఱి నుండియు ఏ రూపములోను గురుదక్షిణ తీసికొనఁడు.

SUMMARY : A lot many in the world are humans only at birth, for some will become like animals and some, like demons. Only the poet remains a human since birth through death. He may be lower than saints but definitely higher than ordinary householders. He leads millions by way of his precepts and messages and becomes their Master but never charges fee from anyone in any form.

**అవిగింగ** ॥ పారిఁ జెరి మనీకియు బ్రదుకు నొక యుంబైల ;
వేఱొక్క యుంబైల దూరింప నది సచ్చు ;
కట్టకముల కెర్ముల కైనఁ గలవుంబైళ్ళు ;
లాతి సోఁకున రెండు గోతిలోనికిఁ బోవు. 35

**మాటల విడఁదీత (పద విభాగము) :** పారిన్, చెరి, మనీకి + ఉన్, బ్రదుకున్, ఒక, ఉంబైలన్, వేఱు + ఒక్క, ఉంబైలన్, దూరింపన్, అది, చచ్చున్, కట్టకములకున్, ఎర్ములకున్, ఐనన్, కలవు, ఉంబైళ్ళు, లాతి, సోఁకునన్, రెండున్, గోతిలోనికిన్, పోవున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పారిన్ చెరి మనీకి + ఉన్ ఒక ఉంబైలన్ బ్రదుకున్. వేఱు + ఒక్క ఉంబైలన్ దూరింపన్ అది చచ్చున్. కట్టకములకున్ ఎర్ములకున్ ఐనన్ ఉంబైళ్ళు కలవు. లాతి సోఁకునన్ రెండున్ గోతిలోనికిన్ పోవున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పారిన్ = భూమిపై ; చెరి మనీకి + ఉన్ = ప్రతి జీవియు ; ఉంబైలన్ = నివాస స్థానములో ; వేఱు + ఒక్క = మఱియొక ; దూరింపన్ = ప్రవేశపెట్టినచో ; కట్టకములకున్ = శాస్త్రములకును ; ఎర్ములకున్ = విజ్ఞానములకును ; లాతి = వేఱే (నివాస స్థానపు) ; సోఁకునన్ = స్పర్శచేత ; రెండున్ = శాస్త్రములును, విజ్ఞానములును ; గోతిలోనికిన్ పోవున్ = అధోగతి పాలగును.

**లోవాటిక (తాత్పర్యము) :** ఈ భూమి మీఁద ప్రతి జీవికి అనుకూలమైన నివాస స్థానము ఒకటున్నది. అక్కడినుంచి దానికి తొలఁగించి మఱి-

యొక చోట దానిని ప్రవేశపెట్టినచో ఆ జీవి చచ్చిపోవును. అట్లే శాస్త్రములును, విజ్ఞానములును బ్రదుకుటకు అనుకూలమైన చోటులు కొన్ని ఉన్నవి. వాటిని అక్కడ కాకుండ వేఱే చోటులందు బోధించుటకును, ఆచరించుటకును ప్రయత్నించినచో అవి చచ్చిపోవును.

SUMMARY : Each being on the Earth has a habitat favourable to its living. It will die out the moment it is removed from there and introduced in another habitat. Similarly, even scriptures and sciences have their own habitat. If you try to teach and practise them in other places, they will die out.

**తలీరిక (అవతారిక)**: *మంది ఏవేవియో కోర్కెలు కోరుచుందురు గాని అందుకు వలసిన పనులు చేయను సిద్ధముగా ఉండరను- చున్నాఁడు.*

**అవిగింగ జంట ॥** నేఱమాలు కూటము నెల్లఱుం గోరెదరు
గాని గండారముల నేరు కూర్మించెదరు ?
క్రచ్చుకొందురు త్యాలు మచ్చునకైన లేమి ;
వాసిలి కరోలికిన్ దాళఁజాలున దెవఱు ? 36
పాటి కోస మెల్ల పరియుఁ బెల్లార్చుచుందురు ;
పాటికాన్ తీఱుపుఁ బాటించి వినఁగలరె ?
సీమవిచ్చుకపుఁ బైలమోమఁగా దమింతురు ;
అనిబైలి చాహోరు నాలకింపఁగలరె ? 37

**మాటల విడఁదీత (పద విభాగము) :** నేఱమాలు, కూటమున్, ఎల్లఱున్, కోరెదరు, కాని, గండారములన్, ఏరు, కూర్మించెదరు, క్రచ్చుకొందురు, త్యాలు, మచ్చునకున్ + ఐనన్, లేమిన్, వాసిలి–కరోలికిన్, తాళన్ + చాలునది + ఎవఱు, పాటి కోసము + ఎల్ల, పరియున్, పెల్లు + అర్చుచున్ + ఉందురు, పాటికాన్–తీఱుపున్, పాటించి, వినన్ + కలరె, సీమ–విచ్చుకపుం–పైలము, ఓమఁగాన్, తమింతురు, అని–బైలి, చాహోరున్ (చావు + హోరున్), ఆలకింపన్ + కలరె.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నేఱమాలు కూటమున్ ఎల్లఱున్ కోరెదరు కాని గండారములన్ ఏరు కూర్మించెదరు? త్యాలు మచ్చునకున్ ఐనన్ లేమిన్ క్రచ్చుకొందురు. (మిగితాది అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నేఱమాలు కూటమున్ = నేఱములు జరుగని సమాజమును ; ఎల్లఱున్ = అందఱును ; గండారములన్ = చెఱసాలలను ; ఏరు = ఎవఱు ; కూర్మించెదరు = ప్రేమించెదరు ; క్రచ్చుకొందురు = ఆశించెదరు ; త్యాలు = జబ్బు ; మచ్చునకున్ + ఐనన్ = ఉదాహరణకైనను ; లేమిన్ = లేకపోవుటను ; వాసిలి–కరోలికిన్ = వైద్యశాల వాతావరణమునకు ; తాళన్ + చాలునది = తట్టు కొనఁగల్గునది ; పాటి = న్యాయము ; ఎల్ల పరియున్ = ప్రజలందఱును ; పెల్లు + అర్చుచున్ + ఉందురు = ఆక్రోశించుచుందురు ; పాటి కాన్–తీఱుపున్ = న్యాయమూర్తి తీర్పును ; పాటించి = సావధానము పెట్టి ; వినన్ + కలరె = వినఁగలరా ; సీమ–విచ్చుకపుం– పైలము = దేశ స్వాతంత్ర్యపు భద్రతను ; ఓమఁగాన్ = కాఁపాడుటకై ; తమింతురు = కోరెదరు ; అని–బైలి = రణరంగమునందలి ; చాహోరున్ (చావు + హోరున్) = మృత్యుఘోషను ; ఆలకింపన్ + కలరె = శ్రద్ధగా వినఁగలరా.

**లోవాఱిక (తాత్పర్యము) :** అందఱును నేఱములు లేని సమాజము కావలె నని కోరెదరు కాని అందుకోసమే ఉన్న చెఱసాలలను ప్రేమింపఁ– జాలరు. అందఱును రోగములు లేని స్థితిని కోరుకొందురు గాని వైద్యశాలల వాతావరణమును మటుకు భరింపఁజాలరు. అందఱును, "న్యాయము కావలె" నని ఆక్రోశించుచుందురు కాని న్యాయమూర్తి ఇచ్చు తీర్పును సావధానముగా సొంతము ఆలకింపఁజాలరు. దేశ

స్వాతంత్ర్యమును కాఁపాడవలె నని కోరెదరు కాని యుద్ధరంగమునందలి చావుకేకలను విని తట్టుకొనలేరు.

SUMMARY : Everyone wants a crimeless society, but no one loves jails which are meant for that purpose. Everyone wants health, but no one can withstand the ambiance of a hopsital. Everyone clamours for justice, but no one is patient enough to pay attetion to the verdict read by the judge. Folks want the freedom of the motherland defended, but they cannot put up with death cries on the battle field.

**వెల్మిరిక ॥** మీఁదువల్కు, విడఁబల్కు లేక, సూటిగఁ జులాకుగ నాకళమౌ

చెరిమాట "చెనుపరి" యను నొలవు ; "పలుకరి నొప్పించె" నని నొడువు. 38

**మాటల విడఁదీత (పద విభాగము) :** మీఁదువల్కున్, విడఁబల్కున్, లేక, సూటిగన్, చులాకుగన్, ఆకళము + ఔ, చెరి, మాట, చెనుపరి, అనున్, ఒలవు, పలుకరి, నొప్పించెన్, అని, నొడువున్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మీఁదువల్కున్ = వ్యాఖ్యానము ; విడఁబల్కున్ = వివరణము కూడ ; లేక = లేకుండ ; చులాకుగన్ = తేలికగా ; ఆకళము + ఔ (అగు/ అవు) = అర్థమగునట్టి ; చెరి మాట = ప్రతి మాట ; చెనుపరి = అశ్లీలము ; ఒలవు = లోకము ; పలుకరి = వక్త/ అన్నవాఁడు ; నొప్పించెన్ = బాధించెను; నొడువున్ = పలుకును.

**లోవాఱిక (తాత్పర్యము) :** వ్యాఖ్యాన తాత్పర్యముల అవసరము లేకుండ సూటిగా తేలికగా అర్థమగు ప్రతి మాటకు సమాజము "అసభ్యము/ బూతి" అనిపేరుపెట్టును. "ఆ మాట అన్నవాఁడు తనను నొప్పించె" నని "కనుక "ఆతఁడు దుర్మార్గుఁ" డనియు "నేఱస్థుఁ" డనియు ఆరోపించును. "వాని అంతు చూడవలె" నని ఆక్రోశించును.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** పదప్రయోగముల మాయాజాలముతో కప్పివేయఁబడని నిజాయితీ గల భావములకు మానవ సమాజము తట్టుకొనఁజాలదని భావము.

SUMMARY : Society terms every dierect expression vulgar if it is readily and easily under–stood without calling for a commentary and interpretation. It says that the speaker had hurt it by using the words. It bays for his blood by calling him a wicked man deserving severe penalties.

**తలీరిక (అవతారిక):** *ముందటి అల్లులో చెప్పిన ముచ్చటకు ఈ క్రింది అల్లులో కతమును విడఁబర్చుచున్నాఁడు.*

**గంగేరిక ॥** అన్నిఁట సూటిదేఁటల కోసము, ప్రెన్నెలుగున నిలఁదీయు కూటము,

కొన్ని పెడసూటి వెటకారము, లున్న బాగుండు నని కోరును. 39

**మాటల విడఁదీత (పద విభాగము) :** అన్నిఁటన్, సూటి–తేఁటల కోసము, ప్రెన్ + ఎలుగునన్, నిలఁదీయు, కూటము, కొన్ని, పెడసూటి, వెటకారములు + ఉన్నన్, బాగుండున్ + అని, కోరును.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అన్నిఁటన్ = అన్ని విషయములందును ; సూటి–తేఁటల కోసము = సూటితనము కోసము మఱియు తేఁట

దనము కోసము ; ప్రెన్ + ఎలుగునన్ = బిగ్గర గొంతుకతో ; నిలంdీయు = డిమాండ్ చేయునట్టి ; కూటము = సమాజము ; పెదనూటి = పరోఒ క్షమైన ; వెటకారములు = ధ్వని-వ్యంగ్యములు ; ఉన్నన్ = ఉన్నచో.

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రతి విషయమును సూటిగాను తేఁటగాను చెప్పుమని వ్యక్తిని నిలంdీత చేయు సమాజము — కొన్ని విషయాల దగ్గరకు వచ్చు తఱికి "సూటిగా వలదనియు, పరోఒ క్షముగా సూచించు"మనియు కోరుట మొదలుపెట్టును.

SUMMARY : The same society which demands direct approach and clarity on all matters — asks man to adopt indirect approach and implicit expressions when it comes to some other ones.

**రాల్మీక బారు ॥** పెక్కు లెఱింగిన వారలె, మిక్కిలి పొఱఁబాటులు సేయుదురు ;
అన్నిఁటి ముచ్చూచు కుక్క , యారయ దోమటిలోని నంజమున్. 40

**మాటల విడఁదీత (పద విభాగము) :** పెక్కులు + ఎఱింగిన-వారలె, మిక్కిలి, పొఱఁబాటులు, చేయుదురు, అన్నిఁటిన్, ముచ్చూచు, కుక్క, ఆరయదు, ఓమటిలోని, నంజమున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....అన్నిఁటిన్ ముచ్చూచు కుక్క ఓమటి-లోని నంజమున్ ఆరయదు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పెక్కులు = చాల విషయములు ; ఎఱింగిన-వారలె = తెలిసినవారే ; మిక్కిలి = గొప్ప ; ముచ్చూచు- = వాసన చూచునట్టి ; ఆరయదు = గమనింపదు ; ఓమటిలోని = అన్నములోని ; నంజమున్ = విషమును.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఎన్నో విషయములు తెలిసినవారే కొన్ని సారులు మిక్కిలి ప్రమాదకరమైన పొఱఁబాటులు కూడ చేసెదరు. అన్నిఁటిని వాసన చూచి వాటి మంచిచెడులను పసిగట్టఁగల కుక్క - తనకు పెట్టిన తిండిలో కలిపిన విషము సంగతి తెలిసికొనలేక దానిని తిని చనిపోవును కదా !

SUMMARY : Sometimes even the omniscient ones make fatal mistakes. The dog which can judge the good and bad of everything by its olfactory sense — dies after consuming the food laced with poison.

**రాల్మీక వాలు మున్నంగి ॥** ప్రెన్ వటారములన్ గొఱలి, మెఱుమెస్తలీల వాడుచున్నన్
గొండతెగల యుల్లపుఁ దీరుఁ గోల్పడరో రెంచ లెన్నటికిన్ ; 41
నా డీఁటెలుఁ గత్తులుఁ గా, నే డెత్తులు జిత్తులుఁ దంప్రీలు
నాడు రెంచను మడుపఁగన్ ; నే డతని వేదారిమిని బగన్ ; 42
అయ్యో నా మఱపు మండ ! ఇదింకను బసర మేనే కదా ! 43

**మాటల విడఁదీత (పద విభాగము) :** ప్రెన్-వటారములన్, కొఱలి, మెఱుము + ఎస్తలీలన్, వాడుచున్ + ఉన్నన్, కొండ-తెగల, ఉల్లపుం + తీరున్, కోల్పడరో, రెంచల్ + ఎన్నటికిన్ (ఏ + నాటికిన్), నాడు + ఈఁటెలున్, కత్తులున్, కాన్, నేడు + ఎత్తులున్, జిత్తులున్, తంప్రీలున్, నాడు, రెంచను, మడుపఁగన్, నేడు + అతని, వేదారిమినిన్, పగన్, అయ్యో, నా, మఱపు, మండన్, ఇది + ఇంకను, పసర-మేనే, కదా.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ప్రెన్-వటారములన్ కొఱలి మెఱుము + ఎస్తలీలన్ వాడుచున్ ఉన్నన్ కొండ-తెగల ఉల్లపుం తీరున్ రెంచల్ ఎన్నటికిన్ (ఏ + నాటికిన్) కోల్పడరో..... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ప్రెన్–వటారములన్ = మహానగరములలో ; కొఱలి = నివసించి ; మెఱుము + ఎస్తలీలన్ = విద్యుత్ ఉప–కరణములను ; వాడుచున్ + ఉన్నన్ = వాడుచున్నప్పటికిని ; కొండ–తెగల = గిరిజనపు ; ఉల్లపుం + తీరున్ = మనస్తత్త్వమును ; కోల్ప–దరో = పోఁగొట్టుకొనరా ఏమి? ; రెంచల్ = మనుష్యులు ; నాడు = ఆనాడు ; కాన్ = కాఁగా ; నేడు = ఈనాడు ; ఎత్తులున్ = వ్యూహ–ములు ; జిత్తులున్ = కపటోపాయములు కూడ ; తంప్రీలున్ = కోర్టు కేసులు కూడ ; నాడు = ఆనాడు ; రెంచను = మనిషిని ; మడుపఁ–గన్ = చంపఁగా ; నేడు = ఈనాడు ; వేదారిమినిన్ = వ్యక్తిత్వమును ; పగన్ = ప్రతీకారముతో ; చంపుట (అధ్యాహారము) ; పసర–మేనే = జంతు శరీరమే.

**లోవాఱిక (తాత్పర్యము) :** మానవులు మహానగరములలో నివసించుట మొదలుపెట్టి విద్యుద్ ఉపకరణాలను వాడుచున్నను, ఒకనాటి గిరి–జన తెగల మనస్తత్త్వమును మటుకు వదులుకొనరా ఏమి? ఆనాడు ఒకఱి నొకఱు కత్తులతోను, ఈఁటెలతోను ఎదుర్కొనఁగా – ఈనాడు ఎత్తులతోను, జిత్తులతోను, కోర్టు కేసులతోను ఎదుర్కొనుచున్నారు. ఆనాడు ప్రతీకార భావనతో మనిషినే చంపివేయఁగా – ఈనాడు మనిషి యొక్క వ్యక్తిత్వమును చంపివేయుట జరుగుచున్నది. అయ్యో ! నా మతిమఱపు మంద ! మనిషి మనస్సు ఎంత పెంపు నొందినను ఆతని శరీరము ప్రాథమికముగా జంతు శరీరముగానే ఉన్నది కాని దివ్య శరీరము కాలేదు కదా !

**వైమాల విడఁబర్రు (విశేష వివరణము) :** మనస్సు మఱియు శరీరము ఒండొరులను ప్రభావితము చేయును కనుక జంతువు నుండి పరిణ–మించిన మానవ శరీర సంపర్కము చేత మనిషి యొక్క మనస్సున సైతము కొన్ని ప్రాఁత జంతు లక్షణములు మిగిలిపోయినవని భావము.

SUMMARY : Do humans not get rid of the once-tribal mentality of theirs even after they have started living in big cities and using electric gadgets? Back then, they had confronted each other with swords and spears. Now they do the same with ruses, ploys and court cases. Back then, they had eliminated the very person physically. Now they resort to the same by way of character assassination. Alas ! Fie upon my mind. Isn't this body of the human still bestial, though his intellect has highly evolved? (His mind too carries some bestial traces on account of its association with his bestial body).

**వెల్మిరిక ॥** మిన్నయినందు కలర, దలుగదు విన్నమునకు, ముక్కలైన తెగ ;
పోఁగొట్టుకొను విరిగిన పాలు, పొంగనిచ్చు తన తీర్తేనును. 44

**మాటల విడఁదీత (పద విభాగము) :** మిన్న + అయిన + అందుకున్ + అలరదు + అలుగదు, విన్నమునకున్, ముక్కలు + ఐన, తెగ, పోఁగొట్టుకొనున్, విరిగిన, పాలు, పొంగన్ + ఇచ్చు తన తీర్తేనును.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ముక్కలు ఐన తెగ మిన్న అయిన అందుకున్ అలరదు. విన్నమునకున్ అలుగదు. విరిగిన పాలు పొంగన్ + ఇచ్చు తన తీర్తేనును పోఁగొట్టుకొనున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మిన్న + అయిన + అందుకున్ = శ్రేష్ఠమైనందుకు ; అలరదు = సంతోషింపదు ; అలుగదు = కోపింపదు ; విన్నమునకున్= అవమానమునకు ; తెగ = జాతి / ఉపజాతి ; పొంగన్ + ఇచ్చు = పొంగుటకు వీలు కల్పించు ; తన తీర్తేనును = తన లక్షణమును.

**లోవాఱిక (తాత్పర్యము) :** తమలో తాము గొడవపడి ముక్కలైన జాతి – తాము ఉన్నతి నొందినందుకు సంతోషింపఁజాలదు. ఇతర జాతులు తమవారిని అవమానించుచుండఁగా బాధపడదు. విరిగిపోయిన పాలు బుస్సున పొంగునట్టి లక్షణమును పోఁగొట్టుకొనును కదా !

**వైమాల విడఁబర్రు (విశేష వివరణము) :** ముక్కలైన జాతులు అసహజముగాను, మానవ స్వభావ విరుద్ధముగాను నడచుకొనుట మొదలు–

పెట్టునని భావము.

SUMMARY : A broken nation/ race ceases to feel elated at the elevation of their own people. Also it fails to feel offended if they were humiliated. Does broken milk not lose the property of boiling over?

*(Broken-up nations/ races start behaving in strange ways and against the grain).*

**పస్సియ జంట** ॥ అందఱు రెంచలొక తీరను పలుకు ౨, అదుకరిల్లు లోఁగానసమునకుఁ ;
గాదు వారి యాదరి కాకడకుఁ గానే కాదీ కానసమునకున్ ; 45
మున్నీటన్ బ్రెన్నేటన్ నూతన్, నంజమునన్ జిలుమునఁ బండ్ల గీలునన్
సరిసాటిగ తవణిల్లునది నీరే ; ఒక తీరవి అన్ని త్రాఁగఁగలరే ? 46

**మాటల విడఁదీత (పద విభాగము) :** అందఱు, రెంచలున్ + ఒక, తీరు + అను, పలుకు, అదుకరిల్లున్, లోన్ + కానసమునకున్, కాదు, వారి, ఆదరి, కాకడకున్, కానే, కాదు + ఈ, కానసమునకున్, మున్నీటన్, ప్రెన్ + ఏటన్, నూతన్, నంజమునన్, చిలుమునన్, పండ్ల, గీలునన్, సరిసాటిగన్, తవణిల్లునది, నీరే, ఒక, తీరు + అవి, అన్ని, త్రాఁగన్ + కలరే ?

**చఱమోలి (అన్వయ క్రమము) :** అందఱు రెంచలున్ ఒక తీరు + అను పలుకు లోన్ + కానసమునకున్ అదుకరిల్లున్. వారి ఆదరి కాకడకున్ కాదు. ఈ కానసమునకున్ కానే కాదు. మున్నీటన్ ప్రెన్ + ఏటన్ నూతన్ నంజమునన్ చిలుమునన్ పండ్ల గీలునన్ సరిసాటిగన్ తవణిల్లునది నీరే. ఒక తీరు అవి అన్ని త్రాఁగన్ కలరే ?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అందఱు రెంచలున్ = మనుష్యులందఱును ; అదుకరిల్లున్ = వర్తించును ; లోన్ + కానసమునకున్ = అంతరంగ ప్రపంచమునకు ; ఆదరి కాకడకున్ = చైతన్యము (స్పృహ) గల స్థితికి ; ఈ కానసమునకున్ = ఈ (భౌతిక) లోకమునకు ; మున్నీటన్ = సముద్రములో ; ప్రెన్ + ఏటన్ = మహానదిలో ; నూతన్ = నూతిలో ; నంజమునన్ = విషమునందును ; చిలుమునన్ = పాము విషము నందును ; పండ్ల గీలునన్ = ఫల రసములోను ; సరిసాటిగన్ = సమానముగా ; తవణిల్లునది = ప్రవర్తిల్లునది ; ఒక తీరు = ఒకే విధముగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** "మనుష్యులందఱును సమానము" అన్న మాట అంతరంగ ప్రపంచమునకే తప్ప మనుష్యుల చేతన ప్రపం-చమునకు గానీ, భౌతిక లోకమునకు గానీ వర్తింపదు. మహాసముద్రములోను, మహానదిలోను, విషములోను, పాము విషములోను, పండ్ల రసములోను ఉన్నది నీరే. కాని మంది "అవి అన్నియు ఒకటియే" అనుకొని త్రాఁగఁగలరా?

SUMMARY : Egalitarianism applies only to the inner world but not the conscious world. Nor does it apply to the physical world. It is water which is present in the oceans, rivers, poison, snake venom and fruit juice. But can people partake of all these with a sense of equality?

**గేరంటిక** ॥ చెడుగు నుండి మంది నెడఁద్రిప్పఁజూచుట నడువ, దెవటి కతింపు వారిది లోపట ;
"అదువ రెంగాకడ, చాల నానకపడ, రోయియే గట్టి" యను రోవాపిరివాన్. 47

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెడుగు నుండి, మందిన్, ఎడన్ + త్రిప్పన్ + చూచుట, నడువదు + ఎవటి, కతింపు, వారిది, లోపటన్, అదువ, రెంగాకడ, చాలన్ + ఆనకపడన్, రోయి + ఏ, గట్టి, అనున్, రో-వాపిరివాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చెడుగు నుండి మందిన్ ఎడన్ + త్రిప్పన్ చూచుట నడువదు. లోపటన్ ఎవటి కతింపు వారిది. అదువ

రెంగాకడ. ఆనకపడన్ చాలన్. రోయి + ఏ గట్టి అనున్ రో–వాపిరివాన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మందిన్ = ప్రజలను ; ఎడన్ + త్రిప్పన్ + చూచుట = దూరముగా మరలించుటకై ప్రయత్నించుట ; కతింపు = తర్కము ; లోపటన్ = మనస్సులో ; అదువ = అస్థిరము / చంచలము ; రెంగాకడ (రెంచ + కాకడ) = మానవ తత్త్వము ; ఆనకపడన్ + చాలన్ = ఆధారపడలేను ; రోయి + ఏ = ధనమే ; రో–వాపిరివాన్ = ధన వ్యామోహపరుఁడు.

**లోవాటిక (తాత్పర్యము) :** ప్రజలందఱిని సామూహికముగా ఒకేసారి చెడు నుండి దూరముగా మరలించుట వీలుపడదు. చెడులో కొన–సాఁగుటకై ఎవఱి తర్కము వారికి మనస్సులో ఉన్నది. (దానిని ఖండించుట, మఱియు మంచికి ఒప్పించుట అంత తేలిక కావు). ఉదాహ=రణకు – ధనవ్యామోహపరుని తర్కము ఇట్లుండును : "మానవ స్వభావము చంచలము. ధనము స్థిరము. కనుక నేను మానవుల మీఁద ఆధారపడఁజాలను. ధనము మీఁదనే ఆధారపడెదను."

SUMMARY : It is not possible to drive all people away from the evil at a time. Each one fallen on bad ways has his own justification to persist with them. For example – the money–minded one says, "Human mentality is fickle and therefore, unreliable. So I depend only on money but not men."

**గోరంటిక ॥** అకరెంచించు సుమా నెగడ్త రెంచన్ ; అలవోకగ మసల నాస్కారముండదు ;
ఆదటుల మైమఱపు తన చెరి నొడువును ; మార్తుఱకు మండించుఁ దన చెరి కదలిక. 48

**మాటల విడఁదీత (పద విభాగము) :** అకరెంచించున్, సుమా, నెగడ్త, రెంచన్, అలవోకగన్, మసలన్, ఆస్కారము, ఉండదు, ఆదటుల, మైమఱపు, తన, చెరి, నొడువును, మార్తుఱకున్, మండించున్, తన, చెరి, కదలిక.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నెగడ్త రెంచన్ అకరెంచించున్ సుమా! అలవోకగన్ మసలన్ ఆస్కారము ఉండదు. తన చెరి నొడువును ఆదటుల మైమఱపు. తన చెరి కదలిక మార్తుఱకున్ మండించున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అకరెంచించున్ = అమానవీకరించును ; సుమా = చూడుమా ; నెగడ్త = ప్రతిష్ఠ ; రెంచన్ = మనిషిని ; అలవోకగన్ = యథాలాపముగా ; మసలన్ = నడచుకొనుటకు ; ఆస్కారము = అవకాశము ; ఆదటుల = అభిమానులకు ; మైమఱపు = పారవశ్యము ; చెరి నొడువును = ప్రతి వాక్యము కూడ ; మార్తుఱకున్ = శత్రువులకు.

**లోవాటిక (తాత్పర్యము) :** పేరుప్రతిష్ఠలు మనిషిని అమానవీకరించును (మనిషిని మనిషి అను దృష్టితో చూడకుండ చేయును). ప్రఖ్యాతుఁడైన మనిషి స్వేచ్ఛగా యథాలాపముగా నడచుకొనుటకు వీలుండదు. తన ప్రతి మాటయు అభిమానులను మైమఱపించును.. కాని తన ప్రతి కదలికయు శత్రువులకు మంటెత్తించును.

**వైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** తనను తన అభిమానులు దేవుఁడన్న దృష్టితో చూచెదరు కనుక వారికి పారవశ్యము. తన శత్రు–వులు తనను రాక్షసుఁడన్న దృష్టితో చూచెదరు కనుక వారికి మంట. మొత్తము మీఁద అతఁడు మంది కనురోకలో దేవుఁడో లేక రాక్షసుఁడో – ఈ రెండే తప్ప మనిషి మాత్రము కాఁడని భావము.

SUMMARY : Name and fame dehumanize man. i.e. Folks stop viewing a famous man as a human being just like themselves. He does not get to carry himself naturally and casually. His fans are carried away by each word of his, while his enemies are incensed by each move of his. (On the whole, he is always either a god or demon but never a human in the eyes of the people).

**రాల్మిక వాలు** ॥ అంకోలున గెలిచిన వా, రన్నింటను గెలుచుచుఁ బోయెదర్ ;
పోర నోడువా రన్నియుఁ బోఁగొట్టుకొనెద రొక్కొకటిగాన్. 49

**మాటల విడఁదీత (పద విభాగము) :** అంకోలునన్, గెలిచిన–వార్ + అన్నింటను, గెలుచుచున్, బోయెదర్, పోరన్, ఓడు–వార్ + అన్నియున్. పోఁగొట్టుకొనెదర్, ఒక్క + ఒకటిగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పోరన్ ఓడువార్ ఒక్క + ఒకటిగాన్ అన్నియున్ పోఁగొట్టుకొనెదర్.(మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అంకోలునన్ = వ్యాపారమునందు ; పోరన్ = యుద్ధములో ; ఒక్క + ఒకటిగాన్ = ఒకటొకటిగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Those successful in business keep winning all other things. Losers in wars keep losing everything else too one by one.

**రాల్మిక వాలు** ॥ పోతరవానే కూటము, వేదారిపైఁ దెలివితక్కువది ;
కనుక వరకించుచుండున్, దన వీసరములకు వేదారిన్. 50

**మాటల విడఁదీత (పద విభాగము) :** పోతరవానే, కూటము, వేదారిపైన్, తెలివి–తక్కువది, కనుకన్, వరకించుచు + ఉండున్, తన, వీసరములకున్, వేదారిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పోతరవానే = బలశాలియే ; కూటము = సమాజము ; వేదారి పైన్ = వ్యక్తితో పోల్చినప్పుడు ; వరకించుచు + ఉండున్ = శిక్షించుచుండును ; వీసరములకున్ = లోపములకు ; వేదారిన్ = వ్యక్తిని.

**లోవాఱిక (తాత్పర్యము) :** సమాజము వ్యక్తితో పోల్చినప్పుడు శక్తిమంతమే. కాని అది స్వతహాగా ఆతని కన్న తెలివితక్కువది. కనుక తన లోటుపాట్లను ఆతని తప్పులుగా చిత్రించి ఆతనిని శిక్షించుచుండును.

SUMMARY : The society is stronger than the individual, but unclever compared with him. So it tends to punish him for its own inadequacies. (Taking its own inadequacies for his faults).

**పన్నియ** ॥ కన్నీటఁ దడువని కాసుగలుములు, సొగయుచు నేర్చిన చదువు-సాములు,
మఱకలు నెత్తుటివంటని మణియముఁ , గలవన్నది కలనైన నమ్మకుము. 51

**మాటల విడఁదీత (పద విభాగము) :** కన్ + నీటన్, తడువని, కాసు–కలుములున్, సొగయుచున్, నేర్చిన, చదువు–సాములున్, మఱకలు నెత్తుటివి + అంటని, మణియమున్, కలవు + అన్నది, కలన్ + ఐనన్, నమ్మకుము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కాసు–కలుములున్ = ధన సంపదలు (డబ్బు మఱియు ఆస్తులును) ; సొగయుచున్ = సుఖపడుచు (హాయిగా) ; చదువు–సాములున్ = చదువుసంధ్యలును ; మఱకలు నెత్తుటివి = నెత్తుటి మఱకలు ; మణియమున్ = రాజకీయ అధికారము కూడ ; కలన్ + ఐనన్ = కలలో కూడ.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** డబ్బును, ఆస్తులను గడించుట వెనుక మిక్కిలి కష్టమున్ను, మానసిక వ్యథ ఉండును. కనుక అవి (పైకి కనిపించనివి మఱియు తనవో ఇతరులవో అయిన) కన్నీళ్ళతో తడిసినటువంటివి. అట్లే – రాజకీయ అధికారమును సాధించుటకో, వాడుకొనుటకో లేక దానిని నిలఁబెట్టుకొనుటకో హింసకు పాల్పడియే తీఱవలెఁ గనుక రాజకీయాధికారమునకు నెత్తుటి మఱకలంటుట తప్పదు. ఇట్లు కానటువంటి డబ్బు, అధికారము ఉన్నవన్న విషయమును కలలో కూడ నమ్మవలదని కవి సందేశము.

SUMMARY : Do not ever believe even in your dream that money and assets can be earned without tears, that education can be had by way of enjoyment and that political power can be exercised without getting stained with blood.

**పస్పియ** ॥ మట్టు సేసెదర్ మ న్నెల్లెడమని ; అగ్గించుచుందు రరుదని బంగరు ;

పొన్ను మాలినను బొదలవచ్చు మఱి, మన్ను లేనియెడ మనఁగల్గుదుమే ? 52

**మాటల విడఁదీత (పద విభాగము) :** మట్టు–చేసెదర్, మన్ను + ఎల్లెడము + అని, అగ్గించుచున్ + ఉందురు, అరుదు + అని, బంగరున్, పొన్ను, మాలినను, పొదలన్ + వచ్చున్, మఱి, మన్ను, లేని + ఎడన్, మనన్ + కల్గుదుమే.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మన్ను ఎల్లెడము అని మట్టు చేసెదర్. అరుదు అని బంగరున్ అగ్గించుచున్ ఉందురు.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మట్టు + చేసెదర్ = క్రించుపఱిచెదరు ; మన్ను= మట్టి ; ఎల్లెడము + అని = సార్వత్రికమని (అన్ని చోటుల ఉన్నదని) ; అగ్గించుచున్ + ఉందురు = పొగడుచుందురు ; పొన్ను మాలినను =బంగారము లేకపోయినను ; పొదలన్ + వచ్చున్ = ప్రెంపొందవచ్చును ; మఱి = కాని ; మన్ను లేని + ఎడన్ = మట్టి లేకపోయినచో ; మనన్ + కల్గుదుమే = మనుగడ సాఁగింపఁగలమా?

**లోవాఱిక (తాత్పర్యము) :** మట్టి అన్నిచోటుల ఉండుననియు, బంగారము అరుదుగా దొరకుననియు తలపోసి జనము మట్టిని తక్కువ చేసి బంగారమును ఆకాశమున కెత్తెదరు. బంగారము లేకపోయినను పెంపుఁగాంచఁగలము కాని మట్టి లేకుండ మనుగడ సాఁగింపఁగలమా?

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** మనఁగల్గుట = to survive ; మనుగడ = survival.

SUMMARY : People make light of soil and highlight gold as they think that the former is ubiquitous and the latter is a rare find. But we can prosper without gold. Can we survive at all without soil?

**రాల్మిక జంట** ॥ “కవ్వించిరి త మ్మొరు” లందురు ; దానికిఁ దగు వీసరమేదొ

తమలో లే కది యెటులగు ? కొన్ని పట్టులందు మంది 53

తమ్ముఁ దామె గిల్లుకొందు, రకక్కఱగా రేఁగెదరు ;

కొఱమాలు నమ్మకములును, విలువలె యా తనుగిల్లుడు. 54

**మాటల విడఁదీత (పద విభాగము) :** కవ్వించిరి, తమ్ము + ఒరులు + అందురు, దానికిన్, తగు, వీసరము + ఏదొ, తమలోన్, లేక + అది, ఎటుల్+ అగున్, కొన్ని, పట్టులందున్, మంది, తమ్మున్, తామె, గిల్లుకొందురు, అకక్కఱగాన్, రేఁగెదరు, కొఱమాలు, నమ్మకములును, విలువలె, ఆ, తనున్–గిల్లుడు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తమ్ము = తమను ; ఒరులు = పరులు ; తగు = తగిన ; వీసరము = లోపము ; పట్టులందున్ = సందర్భ ముల యందు ; అకక్కఱగాన్ = అనవసరముగా ; రేఁగెదరు = విజృంభించెదరు ; కొఱమాలు = నిష్ప్రయోజనమైన ; తనున్-గిల్లుడు = తనను తాను గిల్లుకొనుట.

**లోవాఱిక (తాత్పర్యము) :** వేఱేవారు తమను రెచ్చఁగొట్టినారనియు, అందుకే తాము రెచ్చిపోయినామనియు జనము పల్కెదరు. రెచ్చిపోవు తత్త్వము అను మానసిక లోపము తమలో ముందే లేనిచో రెచ్చిపోవుట ఎట్లు సాధ్యము? కొన్ని సందర్భములలో ఎవఱును రెచ్చఁగొట్టక పోయినను జనము తమను తామే గిల్లుకొని నిత్య దుఃఖితుల వలె ఏడ్చుచుందురు. అనవసరముగా విజృంభించెదరు. అప్రయోజకమైన నమ్మకములును, పనికిమాలిన విలువలును అట్లు గిల్లుకొనుటకు దారితీయును.

SUMMARY : People cite the excuse of someone's provocation for their getting triggered. But how can you be triggered unless you already have that propensity in you? Sometimes people prick themselves and weep and go on rampage though no one actually did anything to pain them. Inconsequential beliefs and useless values lead to that kind of self-pricking.

**పస్పియ జంట** ॥ ఆయిమాడిక త్యాలులుఁ దంప్రీలు ; పదిమంది వలయు బయటికి లాఁగను ;
నలుగుఱిలోన నానఁ గలిగించును ; కాకువెచ్చపడును బైకమూరక ; 55
ఆడిపోసికొనెద రైనవారలె ; పెద్దకారు పట్టు బయటికి రాను ;
నెమ్మన మలఁతియె నెగ్గి వచ్చినను ; సాఁగినంత కారు రిమ్మ విడువదు. 56

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఆయిమాడిక, త్యాలులున్, తంప్రీలున్, పది-మంది, వలయున్, బయటికిన్, లాఁగను, నలుగుఱిలోనన్, నానన్, కలిగించును, కాకు-వెచ్చపడును, పైకము + ఊరక, ఆడిపోసికొనెదరు, ఐన-వారలె, పెద్ద, కారు, పట్టున్, బయటికిన్, రాను, నెమ్మనము, అలఁతియె, నెగ్గి, వచ్చినను, సాఁగిన + అంత, కారున్, రిమ్మ, విడువదు.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** త్యాలులున్ తంప్రీలున్ ఆయిమాడిక. బయటికిన్ లాఁగను పది-మంది వలయున్. నలుగుఱిలోనన్ నానన్ కలిగించును. పైకము ఊరక కాకు-వెచ్చపడును. ఐన-వారలె ఆడిపోసికొనెదరు. బయటికిన్ రాను పెద్ద కారు పట్టున్. నెగ్గి వచ్చినను నెమ్మనము అలఁతియె. సాఁగిన అంత కారున్ రిమ్మ విడువదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఆయిమాడిక = సదృశము (ఒక్కలాటివి) ; త్యాలులున్ = జబ్బులును ; తంప్రీలున్ = కోర్టు కేసులును ; నానన్ = సిగ్గును ; కాకు-వెచ్చపడును = వ్యర్థముగా ఖర్చగును ; పెద్ద కారు = పెద్దకాలము ; నెమ్మనము = మనశ్శాంతి ; అలఁతియె = అల్పమే ; సాఁగిన + అంత కారున్ = (జబ్బు/ కోర్టు కేసు) కొనసాఁగినంత కాలము ; రిమ్మ = తిక్క.

**లోవాఱిక (తాత్పర్యము) :** (వైద్యశాలలో చేరక తప్పని) జబ్బులును, కోర్టు కేసులును ఒక్కలాటివే. వాటిలోనుండి బయటికి లాఁగుటకు పదిమంది కావలెను. అవి ఉన్నవన్న విషయము నలుగుఱిలోను చెప్పుకొనుట సిగ్గుగా ఉండును. వాటి కోసమై విపరీతముగా డబ్బు ఖర్చ-గును. "ఈ తగులాటమెందుకు తెచ్చుకొంటివి?" అనుచు అయినవారే తిట్టెదరు. జబ్బులలో నుండి మఱియు కోర్టుకేసులలో నుండి బయట పడుటకు చాల కాలము పట్టును. ఒకవేళ బయట పడినను మనశ్శాంతి ఉండదు. అవి కొనసాఁగినంత కాలము మనస్సంతయు తిక్క-తిక్కగా ఉండును.

SUMMARY : Diseases (requiring hospitalization) and lawsuits are very much similar. You need at least 10 others to pull you out of them. It feels embarrassing to talk about them. Diseases and lawsuits eat up lots of money. Your own people fault you for unwittingly getting

into the trouble. It takes a whale of time to completely get out of them. You are robbed of mental peace for a long time even after getting out. Mind goes crazy as long as you are through the process.

**గంగేరిక జంట** ॥ ప్రెన్ నేఅస్తు లయ్యెదరు మంది, చిన్నచిన్న దామ మక్కువలు
చిన్నారమప్పుడు తీఅకుండి ; పెద్దయి ప్రెనువందము లెన్నియొ 57
పేర్చికొన్నను ౨ ఆ కొఅ బ్రదియే ; అలము సిక్కకున్న ౨ అలముదీను
పొలవేఁటఁ దవిలి పొదలుచుండును ; లే మింపును జంప, దెచ్చించును. 58

**మాటల విడఁదీత (పద విభాగము) :** ప్రెన్–నేఅస్తులు + అయ్యెదరు, మంది, చిన్న–చిన్న, దామ, మక్కువలు, చిన్నారము + అప్పుడు, తీఅక + ఉండి, పెద్ద + అయి, ప్రెను–వందముల్, ఎన్నియొ, పేర్చికొన్నను, ఆ, కొఅ, బ్రది + ఏ, అలము, చిక్కక + ఉన్నన్, అలము–దీను, పొల–వేఁటన్, తవిలి, పొదలుచున్ + ఉండును, లేమి + ఇంపును, చంపదు + ఎచ్చించును.

**చఅమోలి (అన్వయ క్రమము) :** చిన్న–చిన్న దామ మక్కువలు చిన్నారము + అప్పుడు తీఅక ఉండి మంది ప్రెన్–నేఅస్తులు అయ్యెదరు. పెద్ద అయి ప్రెను–వందముల్ ఎన్నియొ పేర్చికొన్నను ఆ కొఅ బ్రది + ఏ. అలము చిక్కక ఉన్నన్ అలము–దీను పొల–వేఁటన్ తవిలి పొదలుచున్ ఉండును. లేమి ఇంపును చంపదు. ఎచ్చించును.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ప్రెన్–నేఅస్తులు = పెద్ద నేఅస్తులు ; మంది = జనము ; దామ మక్కువలు = అమాయక అభీష్టములు ; చిన్నారము + అప్పుడు = చిన్నప్పుడు/ బాల్యమప్పుడు ; ప్రెను–వందముల్ = పెద్ద వస్తువులను ; ఆ కొఅ = ఆ కొఅఁత ; బ్రది + ఏ = సజీవమే ; అలము = శాకము/ శాకాహారము ; చిక్కక + ఉన్నన్ = దొరుకక పోయినచో ; అలము–దీను = శాకాహార జీవి ; పొల–వేఁటన్ = మాంసపు వేఁటలో ; తవిలి = తగుల్కొని ; పొదలుచున్ + ఉండును = పెంపొందును ; లేమి = (ఒక వస్తువు) లేకపోవుట ; ఇంపును = ఇష్టమును.

**లోవాఱిక (తాత్పర్యము) :** చిన్ననాటి అమాయక కోర్కెలు తీఅక అసంతృప్తికి లోనైన జనము పెద్దయిన తరువాత ఇంకను పెద్ద కోర్కెలు కోరి వాటి కోసము నేఅస్తులయ్యెదరు. కాని పెద్దయిన వెనుక ఎన్ని వస్తువులను సమకూర్చికొన్నను చిన్ననాటి కొఅఁత మనస్సు లోఁతులలో సజీవముగానే ఉండును. శాకాహారము దొరుకని శాకాహార జీవి మాంసపు వేఁటలోనికి దిగును. ఒక వస్తువు లేకపోవుట – దాని యందలి ఇష్టమును చంపకపోఁగా – మఱింత హెచ్చించును.

SUMMARY: With their innocent wishes of childhood left unfulfilled, folks grow up to commit crimes in the pursuit of bigger things. The childhood void remains inside, no matter how-many things they have acquired after growing up. Having failed to find plant food, a herbi-vore may resort to hunting for meat. Absence cannot kill a desire but only makes the heart grow fonder of it.

**గోరంటిక** ॥ పుట్టుచునే పొలికేక పొత్తిళ్ళలో ; ప్రొద్దుపొడపునే కిలకిల పులుగులతో ;
వెలివారణ యామతి మైకొన్న కటిమి ; నలువుఱనునది మటుకు "నోరు మూసికొనుమి". 59

**మాటల విడఁదీత (పద విభాగము) :** పుట్టుచునే, పొలి–కేక, పొత్తిళ్ళలోన్, ప్రొద్దు–పొడపునే, కిలకిల, పులుగులతోన్, వెలివారణ, ఆమతి, మైకొన్న, కటిమి, నలువుఱు + అనునది. మటుకున్, నోరు, మూసికొనుమి.

**చఅమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ప్రొద్దు–పొడపునే –సూర్యోదయమునందే ; కిలకిల పులుగులతోన్ = పక్షులతో ; వెలివారణ = వెలిబుచ్చు/ వ్యక్తీకరణము ; ఆమతి = సృష్టి ; మైకొన్న = ఆమోదించిన ; కటిమి = సూత్రము.

**లోవాఱిక (తాత్పర్యము) :** పుట్టుచునే పొత్తిళ్ళలో పసికందు ఏడ్పుకేక. సూర్యోదయము అగుచునే పక్షుల కిలకిల రావములు. ఇది ప్రకృతి తత్త్వము. అనఁగా భావ వ్యక్తీకరణమన్నది సృష్టి ఆమోదించిన సూత్రమన్నమాట. కాని మానవ సమాజములో మటుకు "నోరు మూసి-కొనుము" అన్నదే నిత్యజీవన సూత్రము.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఇక్కడ – అప్పుడే పుట్టిన పసికందు ఏడ్పునకు పాలికేక (బలిఘోష) అని వర్ణించుట సరియైన పద ప్రయోగము కాదు. కాని ఆ సందర్భమునకు తగ్గ మాట లేదాయె.

SUMMARY : The new-born baby cries aloud immediately after being born. Birds chirp noisily at sunrise. This self-expression is inherent in Nature. This is the rule approved by the Creation. However in the human society, it is quite the opposite. Here the rule of everyday living is to keep mum.

**రాల్మిక జంట** ॥ మరమరాలు తిండి గాదు, మంచు మంచినీరు గాదు ;
పరి వేల్పులు గారు ; కాదు- మందిమన్నియ మేలకము ; 60
బ్రదుకుదెరువు చదువు గాదు, చదు వౌఁజందమ్ము గాదు. 61

**మాటల విడఁదీత (పద విభాగము) :** మరమరాలు, తిండి, కాదు, మంచు, మంచి–నీరు, కాదు, పరి, వేల్పులు, కారు, కాదు, మంది–మన్నియము, ఏలకము, బ్రదుకు–తెరువు, చదువు, కాదు, చదువు + ఔఁజందమ్ము, కాదు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పరి = జనము ; వేల్పులు = దేవతలు ; మంది–మన్నియము = ప్రజాస్వామ్యము ; ఏలకము = పరిపాలన పద్ధతి ; బ్రదుకు–తెరువు = ఉపాధి ; ఔఁజందమ్ము = సంస్కారము.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** "కాదు మందిమన్నియము ఏలకము" అనఁగా – అన్ని స్థాయిలలోను, అన్ని రంగములలోను సంపూర్ణ ప్రజాస్వామ్యమును పాటించుట సరియైన పరిపాలన పద్ధతి కాదనియు, కొన్ని యెడల ప్రజాస్వామ్యము పనికిరాదనియు కవి భావము. ముఖ్యముగా ధర్మాచరణము, మాతృభాషాభ్యాసము, విజ్ఞాన శాస్త్ర వాస్తవములు, కుటుంబ పాలన, విద్యాబోధన, దేశ సమైక్యము, దేశ రక్షణము వంటివి.

SUMMARY : Rice puff is no food. Fog is no potable water. People are no gods and goddesses. Absolute democracy is not a good mode of governance. Livelihood is no education. (Formal) Education does not necessarily make culture.

*(Democracy is utterly useless in the matters of religious practice, learning the mother tongue, facts of science, running a family, teaching the pupils, national integration and defense of the motherland).*

**వాణిద ||** కలిమి-బ్రదిమి-ససుము లొసఁగు నలరాటము సమయువులకు,
నాయిప్రాయులును దమతోడ హాయిగ మనియున్ననాడ ;
ఒకే యొక్క జొన్నమొక్క యొడము టెవ్వఱును జూడరు ;
నిక్క, మేడను గానము నిఱువేదార యెడాటము. 62

**మాటల విడఁదీత (పద విభాగము) :** కలిమి–బ్రదిమి–ససుముల్ + ఒసఁగున్, అలరాటమున్, సమయువులకున్, ఆయిప్రాయులును, తమ, తోడన్, హాయిగన్, మని + ఉన్న, నాడ, ఒకే, ఒక్క, జొన్న–మొక్క, ఒడముట + ఎవ్వఱును, చూడరు, నిక్కము, ఏడను, కానము, నిఱు–వేదార, ఎడాటమున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఆయిప్రాయులును తమతోడన్ హాయిగన్ మని ఉన్న నాడ కలిమి–బ్రదిమి–ససుముల్ సమయువులకున్ అలరాటమున్ ఒసఁగున్. ఒకే ఒక్క జొన్న–మొక్క ఒడముట ఎవ్వఱును చూడరు. నిఱు–వేదార ఎడాటమున్ ఏడను కానము. నిక్కము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కలిమి–బ్రదిమి–ససుముల్ = ఐశ్వర్య ఆయురారోగ్యములు ; ఒసఁగున్ = ఇచ్చును ; అలరాటమున్ = సంతోషమును ; సమయువులకున్ = మానవులకు ; ఆయిప్రాయులును = సమవయస్కులు కూడ ; తమతోడన్ = తమతో పాటు ; హాయిగన్ = సుఖముగా ; మని + ఉన్న నాడ = బ్రదికి ఉన్నప్పుడే ; ఒడముట = మొలచుట ; నిక్కము = నిజము ; ఏడను = ఎక్కడ గానీ ; కానము = చూడము ; నిఱు–వేదార = సంపూర్ణ వ్యక్తిగత– ; ఎడాటమున్ = విషయమును.

**లోవాఱిక (తాత్పర్యము) :** తన సమ వయస్కులందఱును బ్రదికి ఉన్నప్పుడే ఆయురారోగ్య ఐశ్వర్యములు ఆనందము నిచ్చును. వారందఱును పోయి తానొక్కఁడే బ్రదికి ఉన్నప్పుడు లోకములో ఏదియు సంతోషము నివ్వదు. జొన్నమొక్కలు చేనుగా పెరుగును గాని ఒకే ఒక్క జొన్న మొక్క ఎక్కడైనను ఉన్నదా? మనిషి కూడ జొన్నమొక్క వంటివాఁడే. లోకములో సంపూర్ణముగా వ్యక్తిగతమైన విషయమేదియు చూడము. ప్రతి విషయమును వేఱేవారితో ముడిపడి ఉన్నటువంటిదే.

SUMMARY : Long life, health and prosperity give pleasure to one only when one's contemporaries are alive along with one. Sorghum plants grow as a crop. Has anyone seen a single sorghum plant growing in isolation? Man is like the sorghum plant too. There is not a single matter which can be considered purely private. Everything has something to do with others.

**వాణిద ||** తొలిచైవుల పంటకముగఁ గోదక్కు సాలనప్పుడు
కెళవయ్యేద రైనవారు ; గెంటసములె వినిపించును ;
ఓదారు పొడఁగూడదు ; మేలి పలుకు లలరింపవు ;
వేఁడికోళ్ళకు మార్వలుకరు, వేల్పులును మోమోడెదరు. 63

**మాటల విడఁదీత (పద విభాగము) :** తొలి, చైవుల, పంటకముగన్, కోదక్కు చాలని + అప్పుడు, కెళవు + అయ్యేదరు, ఐన–వారు, గెంటసములె, వినిపించును, ఓదారుపు + ఒడఁగూడదు, మేలి–పలుకులు, అలరింపవు, వేఁడికోళ్ళకున్, మార్వలుకరు, వేల్పులును, మోము + ఓడెదరు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తొలి చైవుల పంటకముగన్ కోదక్కు చాలని అప్పుడు ఐన–వారు కెళవు అయ్యేదరు. గెంటసములె వినిపించును. ఓదారుపు ఒడఁగూడదు. మేలి పలుకులు అలరింపవు. వేల్పులును మోము ఓడెదరు. వేఁడికోళ్ళకున్ మార్వలుకరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తొలి చైవుల = పూర్వకర్మల యొక్క ; పంటకముగన్ = ఫలితముగా ; కోదక్కు = అదృష్టము ; కెళవు + అయ్యేదరు = దూరమయ్యేదరు ; ఐన–వారు = సంబంధీకులే ; గెంటసములె = కటువైన మాటలే ; మేలి పలుకులు = మంచిమాటలు ;

అలరింపవు = సంతోషపెట్టవు ; వేఁడికోళ్ళకున్ = ప్రార్థనలకు ; మార్వలుకరు = సమాధానమివ్వరు ; వేల్పులును = దేవతలు కూడ ; మోము + ఓడెదరు = ముఖము చాటు చేసెదరు.

**లోవాఱిక (తాత్పర్యము) :** పూర్వకర్మఫలముగా అదృష్టము సరిపోనప్పుడు స్వంతవారే దూరమయ్యెదరు. కఠినోక్తులే విన్పించును. ఒకవేళ ఎవరైనను మంచిమాటలు పలికినను సంతోషము కలుగదు. దేవతలు కూడ ప్రార్థనలకు సమాధానమివ్వరు. పైపెచ్చు ముఖము తప్పిం–చెదరు.

SUMMARY : When one is short of luck on account of what one had sowed, one is put at arms length by his own people. He gets only to hear harsh words. He is not elated even if someone speaks pleasingly. Gods do not answer his prayers. In stead they hide themselves from him.

**పస్పియ జంట** ॥ "చేయవచ్చు నందఱుఁ గావళ" మని, చేసినను జట్టంబు నీనాడే,
వ్రాసిన నొక గన్నోలీ పూఁటనె, చేయరు సుమీ మంది కావళమును ; 64
ససేమిరా చేయరు చెరియొకఱును ; ఆంకమీరు కలమేనొక్కటి కల-
దందఱి లోపలఁ బోనీవరియై ; వ్రాత లాఁపవు "చేయవలె" ననుకొన్నన్. 65

**మాటల విడఁదీత (పద విభాగము) :** చేయన్ + వచ్చున్ అందఱున్ కావళము + అని చేసినను చట్టంబున్ ఈ నాడే వ్రాసినన్ ఒక గన్నోలు ఈ పూఁటనె చేయరు సుమీ మంది కావళమును ససేమిరా చేయరు చెరి + ఒకఱును ఆంకమీరు కలమేన్ ఒక్కటి కలదు అందఱి లోపలన్ పోనీవరియై వ్రాతలు ఆఁపవు చేయన్ + వలెన్ అనుకొన్నన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** అందఱున్ కావళము చేయన్ వచ్చున్ అని ఈ నాడే చట్టంబున్ చేసినను ఈ పూఁటనె ఒక గన్నోలు వ్రాసినన్ మంది కావళమును చేయరు సుమీ. చెరి ఒకఱును ససేమిరా చేయరు. అందఱి లోపలన్ పోనీవరి ఐ ఆంకమీరు కలమేన్ ఒక్కటి కలదు. చేయన్ వలెన్ అనుకొన్నన్ వ్రాతలు ఆఁపవు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కావళము = పాపము ; గన్నోలు = పవిత్ర గ్రంథము ; ఆంకమీరు = గ్రంథములకు మించిన ; కలమేన్ = యథార్థ స్వరూపము ; పోనీవరి + ఐ = సారథియై.

**లోవాఱిక (తాత్పర్యము) :** "అందఱును పాపము చేయవచ్చును" అని ఈనాడే ఒక క్రొత్త చట్టమును తెచ్చినను, లేదా క్రొత్త ధర్మశాస్త్రమును వ్రాసినను జనము అది చేయరు. ఒకవేళ కొందఱు చేసినను అందఱును చేయరు. (లేదా అందఱును చేసినను కొందఱు మటుకు చేయరు). ఎందుకనఁగా మనిషి లోపల పుస్తకములను మించిన అసలు మనిషి ఒకఱు కలరు. ఆ అసలు మనిషియే బయటి మనిషిని సారథి వలె నడిపించును. ఒకవేళ మనిషి "తప్పే చేయవలె" నని నిశ్చయించుకొనె నేని ఆతనిని/ ఆమెను వ్రాతలు ఆపఁజాలవు.

**పైమాల విడఁబఱు (విశేష వివరణము) :** ఆంకము = పుస్తకము.

SUMMARY : Folks won't commit sin even if a new law or scripture is written giving them a free hand. Not everyone will commit it though some follow the new law, because there exists a true inner being in every physical being, driving him/ her like a charioteer. Writings can–not restrain the human if he has made up his mind in the ernest to commit sin.

**రాల్మిక జంట** ॥ పొత్తేడఁ బొసఁగు నొలవున, మెలగరంపు నిక్కమునకు,
మిడితేని నిక్కమునకును ? "డెందమ్ములు పొందెను, మే- 66

ముందు మొకటిగా" నందురు ; ఎవటి నొప్పులు వారివే ;
ఎవటి యాఁకలి వారిదే ; మిడితేను-మెలఁగరంబుల 66
నడివేర్మి నెఱుక మార్చునే ? 67

**మాటల విడఁదీత (పద విభాగము) :** పొత్తు + ఏడన్, పొసఁగున్, ఒలవునన్, మెలగరంపుం, నిక్కమునకున్, మిడితేని, నిక్కమునకును, డెందమ్ములు, పొందెను, మేము, ఉందుము + ఒకటిగాన్, అందురు, ఎవటి, నొప్పులు, వారివే, ఎవటి + ఆఁకలి, వారిదే, మిడితేను-మెలఁగరంబుల, నడివేర్మిన్, ఎఱుక, మార్చునే.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ఒలవునన్ మెలగరంపుం నిక్కమునకున్ మిడితేని నిక్కమునకును పొత్తు ఏడన్ పొసఁగున్? "డెందమ్ములు పొందెను, మేము ఒకటిగాన్ ఉందుము" అందురు. ఎవటి నొప్పులు వారివే. ఎవటి ఆఁకలి వారిదే. మిడితేను-మెలఁగరంబుల నడివేర్మిన్ ఎఱుక మార్చునే?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పొత్తు = పొంతనము ; ఏడన్ = ఎక్కడ ; పొసఁగున్ = కుదురును ; ఒలవునన్ = లోకములో ; మెలగరంపుం నిక్కమునకున్ = వ్యవహార సత్యమునకు ; మిడితేని నిక్కమునకును = పరమార్థ సత్యమునకు ; డెందమ్ములు = హృదయములు ; పొందెను = చేరువయ్యెను ; మిడితేను-మెలఁగరంబుల = పరమార్థ వ్యవహారముల ; నడివేర్మిన్ = మధ్యన భేదమును ; ఎఱుక = జ్ఞానము ; మార్చునే = మార్పఁగలదా?

**లోవాఱిక (తాత్పర్యము) :** లోకములో వ్యవహార సత్యమునకును, పారమార్థిక సత్యమునకు పొంతన ఎక్కడ కుదురును? (పారమార్థిక సత్యము ననుసరించి – అందటి ఆత్మలును ఒకటియే). ప్రేయసీప్రియులు "మా హృదయములొక్కటైనవి. కనుక కలసి ఉండెద"మని పలికెదరు. కాని కలసి ఉన్నను ఎవటి నొప్పి వారిదే, ఎవటి ఆఁకలి వారిదే అగును కాదా? ఎంత పారమార్థిక జ్ఞానమున్నను – వ్యవహార పరమార్థముల నడుమ గల అగాధమును అది పూడ్పఁజాలునా?

SUMMARY : How can the operational (physical) reality be reconciled with the spiritual reality? (All souls are one and the same, according to the spiritual reality). Lovers say, "We both are one, as our hearts mingled." But, to each his/ her own in the matters of pain and hunger etc. No matter how knowledgeable one is in spirituality, can it bridge the gap between these conflicting realities?

**తామరిక ॥** ఎక్కారునను విఱుల తెరువే యిక్కానసము దుండగులకు ;
ఎక్కారునను ముళ్ళకంపయె యిక్కూటము మంచివారలకు ;
వడారము మంచివారే కల యెడాయి యున్నదన్నదొక కల ;
తప్పులను గూడ నొప్పులుగాఁ దలంచునదేమో దాని తొగ ;
తా వరకింపఁ దలఁచిన వారిఁ గావించు వేల్పు మంచిగా. 68

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏ + కారునను, విఱుల, తెరువే, ఈ + కానసము, దుండగులకున్, ఏ + కారునను, ముళ్ళ-కంపయె, ఈ + కూటము, మంచి-వారలకున్, వడారము, మంచి-వారే, కల, ఎడాయి, ఉన్నది + అన్నది + ఒక, కల, తప్పులను, కూడన్, ఒప్పులుగాన్, తలంచునది + ఏమో, దాని, తొగ, తాన్, వరకింపన్ + తలఁచిన, వారిన్, కావించున్, వేల్పు, మంచిగాన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ఈ కానసము దుండగులకున్ ఏ + కారునను విఱుల తెరువే. ఈ కూటము మంచి-వారలకున్ ఏ + కారునను ముళ్ళ-కంపయె. వడారము మంచి-వారే కల ఎడాయి ఉన్నది అన్నది ఒక కల. దాని తొగ తప్పులను కూడన్ ఒప్పులుగాన్

తలంచునది ఏమో. తాన్ వరకింపన్ తలఁచిన వారిన్ వేల్పు మంచిగాన్ కావించున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఏ + కారునను = ఏ కాలములో నైనను ; విఱుల తెరువే = పూల బాటయే ; ఈ + కానసము = ఈ లోకము ; దుండగులకున్ = దుష్టులకు ; ఈ + కూటము = ఈ సమాజము ; వడారము = వడారము ; మంచి-వారే కల = మంచివారే ఉన్న ; ఎడాయి — యుగము ; తొౕగ = రకము ; వరకింపన్ + తలఁచిన వారిన్ = శిక్షింపఁదలఁచిన వారిని ; కావించున్ = చేయును ; వేల్పు = దేవుఁడు.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఈ లోకము చెడ్డవారికి ఏ కాలములో నైనను పూలబాట వంటిదే. అదే తీరుగా – ఇది ఏ కాలములో నైనను మంచివారికి ముళ్ళకంప వంటిదే. అందఱును మంచివారే ఉన్న యుగమొకటి ఉండెడిదను ఊహ కల మాత్రమే. ఒకవేళ అటువంటి యుగము నిజముగా ఉండెనేని — అది బహుశ చెడును కూడ మంచి అని తలఁచునట్టిది కావలె. దేవుఁడు ఎవఱిని శిక్షింపఁదలఁచునో వారిని మంచివారుగా పుట్టించును.

SUMMARY : The world is a flower-path for the wicked at all times. It is a thorny bush for good people at all times. The imagination about the bygone utopian times when everyone was virtuous - is just a nice dream. If such an age had really existed, it must be the time when the evil was also taken for good. Those whom God wants to punish, are made to be born as good ones.

**పస్సియ** ॥ మన కుదురమున సేఁగిలిన వారల్, మండ్రాటిల్ల నోదార్పవచ్చున్,
జైవుల నీవుల మేలి నొడువులన్ ; వారు పగయఁ బదుర ౨ పరువుఁ దీయన్ ౨
కడ నేమి మిగులు నెమ్మనింపఁగాన్ ? 69

**మాటల విడఁదీత (పద విభాగము) :** మన, కుదురమునన్, సేఁగిలిన-వారల్, మండ్రాటిల్లన్, ఓదార్పన్, వచ్చున్, చైవులన్, ఈవులన్, మేలి, నొడువులన్, వారు, పగయన్, పదురన్, పరువున్, తీయన్, కడన్, ఏమి, మిగులున్, నెమ్మనింపఁగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మన కుదురమునన్ సేఁగిలిన వారల్ మండ్రాటిల్లన్ చైవులన్ ఈవులన్ మేలి నొడువులన్ ఓదార్పన్ వచ్చున్. వారు పగయన్ పదురన్ పరువున్ తీయన్ నెమ్మనింపఁగాన్ కడన్ ఏమి మిగులున్?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మన కుదురమునన్ = మన మూలముగా ; సేఁగిలిన వారల్ = నష్టపోయిన వారు ; మండ్రాటిల్లన్ = సంతాప పడఁగా ; చైవులన్ = చేతలతో ; ఈవులన్ = బహుమతులతో/దానములతో ; మేలి నొడువులన్ = మంచి మాటలతో ; పగయన్ = పగ పెట్టుకొనఁగా ; పదురన్ = శపించుచుండఁగా ; కడన్ = చివరికి ; నెమ్మనింపఁగాన్ = శాంతింపఁ జేయుటకు.

**లోవాఱిక (తాత్పర్యము) :** మన మూలముగా నష్టపోయినవారిని — మేలు చేయుట గుండా, పరిహారము నిచ్చుట ద్వారా, స్నేహముగా మాట లాడుట చేత — ఓదార్పవచ్చును. అందుకు ఆస్కారమివ్వకుండ — వారు మన మీఁద పగబట్టి శపించుచు పదిమందిలో మన పరువు తీయుటకే నిశ్చయించుకొన్నప్పుడు ఇఁక వారిని శాంతింపఁజేయుటకు ఏమి మిగులును?

SUMMARY : We may console our victims by doing them a favour, paying them compensation and engaging them in a friendly talk. But what is left there to console them if they turn vengeful, curse us and are strongly determined to defame us in the public?

**దాసానిక** ॥ పిచ్చికూటిమది వలయున్ బిల్లలను బెంపఁగా ;

వెఱ్ఱి వెంటములు వలయు న్నెఱుకను గడింపఁగా ;
ఒడలెఱుఁగని యొడికారము వలయుఁ బోరాడఁగా ;
కడమాల్ కసి వలయున్ దాఁ దను మూదలింపఁగా ; 70
వల్లమాలు పడుచు చురుకు వలయు సిందాడఁగా ;
ఎసరేఁకల మున్నూకే యేదైనఁ జేయఁగా. 71

**మాటల విడఁదీత (పద విభాగము) :** పిచ్చి, కూఱిమి + అది, వలయున్, పిల్లలను, పెంపఁగాన్, వెఱ్ఱి, వెంటములు, వలయున్ + ఎఱుకను, గడింపఁగాన్, ఒడల్, ఎఱుఁగని, ఒడికారము, వలయున్, పోరు + ఆడఁగాన్, కడమాల్, కసి, వలయున్, తాన్, తనున్, మూదలింపఁగాన్, వల్లమాలు, పడుచు, చురుకు, వలయున్, సిందు + ఆడఁగాన్, ఎసరేఁకల, మున్నూకే, ఏది + ఐనన్, చేయఁగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పిల్లలను పెంపఁగాన్ పిచ్చి కూఱిమి అది వలయున్. ఎఱుకను గడింపఁగాన్ వెఱ్ఱి వెంటములు వలయున్. పోరు ఆడఁగాన్ ఒడల్ ఎఱుఁగని ఒడికారము వలయున్. తనున్ తాన్ మూదలింపఁగాన్ కడమాల్ కసి వలయున్. సిందు ఆడఁగాన్ వల్లమాలు పడుచు చురుకు వలయున్. ఏది ఐనన్ చేయఁగాన్ ఎసరేఁకల మున్నూకే.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పిచ్చి కూఱిమి + అది = ఆ పిచ్చి ప్రేమ ; వలయున్ = కావలెను ; పెంపఁగాన్ = పెంచుటకై ; వెఱ్ఱి వెంట–ములు = వెఱ్ఱి కుతూహలములు ; ఎఱుకను = జ్ఞానమును ; గడింపఁగాన్ = సంపాదించుటకై ; ఒడల్ ఎఱుఁగని = ఒళ్ళు తెలియని ; ఒడికారము = ఆవేశము ; పోరు + ఆడఁగాన్ = పోరాడుటకై ; కడమాల్ = అంతులేని ; తాన్ = తాను ; తనున్ = తనను ; మూదలింపఁగాన్ = నిరూపించుకొనుటకు ; వల్లమాలు = అపారమైన ; పడుచు చురుకు = యౌవనోత్సాహము ; సిందు + ఆడఁగాన్ = నాట్యమాడుటకు ; ఎసరేఁకల = భావోద్వేగముల ; మున్నూకే = ప్రోద్బలమే ; ఏది + ఐనన్ చేయఁగాన్ = ఏది చేయుటకైనను.

**లోవాఱిక (తాత్పర్యము) :** పిల్లలను పెంచవలె నన్నచో పిచ్చిప్రేమ కావలెను. జ్ఞానమును ఆర్జింపవలె నన్నచో వెఱ్ఱి కుతూహలము కావలెను. పోరాడవలె నన్నచో ఒళ్ళు తెలియని ఆవేశము కావలెను. తనను తాను నిరూపించుకొనవలె నన్నచో మనస్సులో అంతులేని కసి ఉండ–వలెను. నాట్యమాడవలె నన్నచో అపారమైన యౌవనోత్సాహము కావలెను. ఈ విధముగా – ఈ ప్రపంచములో ఏది చేయుటకైనను ప్రోద్బలము భావోద్వేగములే సుమా.

SUMMARY : Mad love is needed to care for and bring up children. Abiding curiosity is need–ed to gain knowledge. Feverish emotion is needed to fight someone/ something. Intensive vengeance is needed to prove oneself. Immeasurable youthful passion is needed to dance. Thus, emotion is the driving force behind every activity in the world.

**గేరంటిక ॥** "విచ్చుకము సాటికము తోబుట్టుకమని, పెచ్చరిల్లిన వారలే పిదపఁ బిదప
నెలకొల్పిరి వలసమన్యము లెల్లెడల ; అగచాట్ల నొక తీరు హాతి నొక తీరు
రెంచాలుడి యిది ; కా రేరు న్నాతలి. 72

**మాటల విడఁదీత (పద విభాగము) :** విచ్చుకము, సాటికము, తోబుట్టుకము + అని, పెచ్చరిల్లిన–వారలే, పిదపన్–పిదపన్, నెలకొల్పిరి, వలస–మన్యముల్, ఎల్ల + ఎడలన్, అగచాట్లన్, ఒక, తీరు, హాతిన్, ఒక, తీరు, రెంచ + ఆలుడి, ఇది, కారు + ఏరున్, ఆతలి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** విచ్చుకము సాటికము తోబుట్టుకము అని పెచ్చరిల్లిన వారలే పిదపన్ పిదపన్ వలస–మన్యముల్ ఎల్ల + ఎడలన్ నెలకొల్పిరి. అగచాట్లన్ ఒక తీరు. హాతిన్ ఒక తీరు. ఇది రెంచ + ఆలుడి. ఏరున్ ఆతలి కారు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** విచ్చుకము = స్వేచ్ఛ ; సాటికము = సమానత్వము ; తోబుట్టుకము = సౌభ్రాత్రము ; పెచ్చరిల్లిన వారలే = చెలరేఁగిన వారే ; పిదపన్ పిదపన్ – తరువాత తరువాత (కాలక్రమములో) ; నెలకొల్పిరి = స్థాపించిరి ; వలస–మన్యముల్ = వలస రాజ్యములను ; ఎల్ల + ఎడలన్ = అన్నిచోటులందు ; అగచాట్లన్ = కష్టములలో ; హాతిన్ = సుఖమునందు ; రెంచ + ఆలుడి = మానవ స్వభావము ; ఏరున్ = ఎవఱును ; ఆతలి = అతీతము.

**లోవాటిక (తాత్పర్యము) :** ముందు "స్వేచ్ఛ, సమానత్వము, సౌభ్రాత్రము" అని నినదించి విజృంభించిన వారే తరువాత ప్రపంచములో తమ వలసరాజ్యములను స్థాపించిరి. కష్టములలో ఉన్నప్పుడు ఒక తీరు. సుఖములలో ఉన్నప్పుడు ఇంకొక తీరు. ఇదియే మానవ స్వభావము. దీనికి ఎవఱును అతీతులు కారు.

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** ఇక్కడ ఇచ్చిన ఉదాహరణ ఫ్రెంచివారిని గూర్చినది.

SUMMARY : The same people who clamoured for "Liberty, Fraternity and Equality" had colonized others' lands. One way in adversity and another in prosperity. This is characteri–stic of all humans. No one makes an exception. (The given example pertains to France).

**రాల్మిక వాలు జంట ॥** నీలోని నెసర్ బిల్లిక వెలిబైలునకు మటుకుఁ జీఁకు మినుక ;
నీయందలి చిఱు చేదులు కూటమునకు మటుకుఁ జిచ్చేదులు ; 73
తన తప్పు లంకుచొప్పులు ; తన వీసరములు తప్పనిసరులు ;
నీ యక్కఱలు సరుదలవి ; తన యక్కఱలేమో ముమ్మొదలివి. 74

**మాటల విడఁదీత (పద విభాగము) :** నీలోని, నెసర్–బిల్లిక, వెలిబైలునకున్, మటుకున్, చీఁకు, మినుక, నీ అందలి, చిఱు, చేదులు, కూటమునకున్, మటుకున్, చిచ్చేదులు, తన, తప్పులు, అంకు–చొప్పులు, తన, వీసరములు, తప్పనిసరులు, నీ అక్కఱలు, సరుదన్ + అలవి, తన, అక్కఱలు ఏమో, మున్ + మొదలివి.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నెసర్–బిల్లిక = సూర్యబింబము ; వెలిబైలునకున్ మటుకున్ = బాహ్యావరణమునకు (సమాజమునకు) మాత్రము ; చీఁకు మినుక = గ్రుడ్డి వెలుఁగురేఁక ; కూటమునకున్ మటుకున్ = సమాజమునకు మాత్రము ; చిచ్చేదులు = కాలకూట విష ములు ; అంకు–చొప్పులు = దైవ మార్గములు ; వీసరములు = లోపములు ; అక్కఱలు = అవసరములు ; సరుదన్ + అలవి = సర్దుకొని పోవలసినవి ; మున్ + మొదలివి = ప్రాథమ్యములు.

**లోవాటిక (తాత్పర్యము) :** నీలో ప్రచండ సూర్యబింబము వలె వెలుఁగొందు గొప్పతనము బాహ్యావరణమునకు (సమాజమునకు) మటుకు గ్రుడ్డి వెలుఁగురేఁకతో సరిసాటి. నీలోని చిన్న చిన్న లోపములు మటుకు దానికి కాలకూట విషము వలె దుర్భరములు. కాని అదే సమాజ–మునకు – తన తప్పులు దైవలీలలు. దైవ పద్ధతులు. దాని కనురోకలో – నీ అవసరములు సర్దుకొన వలసినవి. కాని తన అవసరములు మటుకు ప్రప్రథమములు.

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** సమాజమును పూజింప వలసినంత గొప్పతనమేదియు దానిలో లేదని కవి భావము.

SUMMARY : To the external sphere (society) – the blazing Sun in you is just a barely visible spark. Your minor defects are unbearable like poison. But to the same society, its own faluts are Godly pranks. In its viewpoint – you need to adjust in the matter of your pressing needs. However, its own needs are the most urgent and the first priority.

**పస్సియ** ॥ తిండిలేమి కాదు పేదఱికమన ; ఇల్లు లేమి కాదు బీదఱికమన ;

తనవారు లేమియే పేదఱికము ; కనికరము లేమియే బీదఱికము. 75

**మాటల విడఁదీత (పద విభాగము) :** తిండి–లేమి, కాదు, పేదఱికము + అనన్, ఇల్లు–లేమి, కాదు, బీదఱికము + అనన్, తన–వారు, లేమి + ఏ, పేదఱికము, కనికరము, లేమి + ఏ, బీదఱికము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పేదఱికము + అనన్ తిండి–లేమి కాదు. బీదఱికము అనన్ ఇల్లు–లేమి కాదు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** లేమి = లేకపోవుట ; అనన్ = అనఁగా (అంటే).

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Poverty does not mean the lack of food. Penury does not mean the shortage of housing. Absence of one's own people is the real poverty. Mercilessness is the actual penury.

**గంగేరిక** ॥ ఎవఱి నేటు వారు గైకొందురు ; ఎగ్గులగ్గుల లోరువు లడుగరు ;

హావళి యేదేనిఁ బైఁబడఁగా, నాదుకొమ్మందురు ప్రాయిడిగా. 76

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎవఱి, నేటు, వారు, కైకొందురు, ఎగ్గు–లగ్గుల, లోరువులు + అడుగరు, హావళి, ఏది + ఏనిన్, పైన్ + పడఁగాన్, ఆదుకొమ్ము + అందురు, ప్రాయిడిగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎవఱి నేటు వారు, కైకొందురు. ఎగ్గు–లగ్గుల లోరువులు + అడుగరు. హావళి ఏది + ఏనిన్ పైన్ + పడఁగాన్ ప్రాయిడిగాన్ ఆదుకొమ్ము + అందురు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నేటు = నిర్ణయము ; కైకొందురు = తీసికొనెదరు ; ఎగ్గు–లగ్గుల = శుభాశుభముల ; లోరువులు = వివరాలు ; హావళి = ఉపద్రవము ; ఏది + ఏనిన్ = ఏది అయినను ; ప్రాయిడిగాన్ = దీనముగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** లోకములో జనము ఎవఱి నిర్ణయములు వారు తీసికొనెదరే తప్ప వాటి మంచి–చెడ్డల వివరములను గూర్చి తెలి–సిన నిపుణులను విచారింపరు. తరువాత ఆ నిర్ణయముల పంటకముగా ఏదైన ఉపద్రవము వచ్చి మీఁద పడినచో అప్పుడు "ఆదుకొనుఁడో అని దీనముగా అఱవ సాఁగెదరు.

SUMMARY : Folks take their own decisions without consulting the experts in the concerned field on the details of the risk & advantage factors. But when a calamity befalls them as a result of their decisions, they start screaming for help.

**పస్సియ** ॥ కందోలి కంతటి కొకే యొక్కఱి, గర్గలమునఁ జొక్కుఁ బల్ తరంబులు ;

ఒకే యొక్కఱు నాటిన మొక్కయి ప్రాన్, పలువుఱకుఁ బనికివచ్చు మాడికన్. 77

**మాటల విడఁదీత (పద విభాగము) :** కందోలికిన్ + అంతటికిన్, ఒకే, ఒక్కఱి, గర్గలమునన్, చొక్కున్, పల్, తరంబులు, ఒకే, ఒక్కఱు, నాటిన, మొక్క + అయి, ప్రాన్, పలువుఱకున్, పనికివచ్చు, మాడికన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒకే ఒక్కఱు నాటిన మొక్క ప్రాన్ అయి పలువుఱకున్ పనికివచ్చు మాడికన్ కందోలికిన్ అంతటికిన్ ఒకే ఒక్కఱి గర్గలమునన్ పల్ తరంబులు చొక్కున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కందోలికిన్ + అంతటికిన్ = వంశమునకంతయు ; గర్గలమునన్ = పుణ్యము చేత ; చొక్కున్ = సుఖించును

; పల్ తరంబులు = అనేక తరముల వారు ; మ్రాన్ అయి = మహావృక్షమై ; పనికివచ్చు = ఉపయోగపడు ; మాడికన్ = రీతిగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒకే ఒకఱు నాటిన మొక్క పెద్ద మ్రానై చాలమందికి పనికివచ్చు రీతిగా – వంశమంతటిలోను ఒకే ఒకఁడు చేసిన పుణ్యము చేత అనేక తరముల వారు సుఖపడెదరు.

SUMMARY : A family–line will live happily for several generations because of the merit of a single person born in it, like several people stand to gain from a plant sowed by a single one and grown to become a big tree.

**పస్పియ ||** కావళ మొకటే సేసెనేనియున్, గందోలి స్రుక్కుఁ బలు తరములుగాన్ ;
కుట్టిన దొక్క చీమయే యైనన్, ద్రొక్కి చంపరే వాటన్నింటిన్. 78

**మాటల విడఁదీత (పద విభాగము) :** కావళము, ఒకటే, చేసెన్, ఏనియున్, కందోలి, స్రుక్కున్, పలు, తరములుగాన్, కుట్టినది, ఒక్క, చీమ + ఏ, ఐనన్, త్రొక్కి, చంపరే, వాటి + అన్నింటిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కావళము ఒకటే చేసెన్ ఏనియున్ పలు తరములుగాన్ కందోలి స్రుక్కున్. కుట్టినది ఒక్క చీమ + ఏ ఐనన్ వాటి అన్నింటిన్ త్రొక్కి చంపరే.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కావళము = పాపము ; చేసెన్ ఏనియున్ = చేసినప్పటికిని ; కందోలి = వంశము ; స్రుక్కున్ = హింస పడును ; పలు తరములుగాన్ = అనేక తరములుగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** వంశమంతటిలోను తప్పు చేసినది ఒక్కటే అయినను దాని పంటకముగా ఆ వంశములో అనేక తరముల వారు హింసపడెదరు. తమను కుట్టినది ఒక్క చీమయే అయినను చుట్టుత ఉన్న చీమలన్నింటిని ప్రజలు త్రొక్కి చంపెదరు కాదా?

SUMMARY : A whole family–line will suffer for several generations as a result of the wrong committed by a single person born in it. Are several ants not killed just because a single one among them stung a human?

**వెల్మిరిక తగ్గు జంట ||** గోపాకాంచువులై యుందురు, గోపాపాఱఁబాటరులున్ ;
గోపావేలుపులై యుందురు, గోపరెంచలు బ్రదినాళులున్ ; 79
గోపాకఱదరులై యుందురు, గోపదామలు చిఱుత-తనమునన్ ;
పేరెంచవానులు కానోపు బల్ లేసరులు వేదారగాన్. 80

**మాటల విడఁదీత (పద విభాగము) :** గోపా–కాంచువులు + ఐ, ఉందురు, గోపా–పొఱఁబాటరులున్, గోపా–వేలుపులు + ఐ, ఉందురు గోప–రెంచలు, బ్రది–నాళులున్, గోపా–కఱదరులు + ఐ, ఉందురు, గోప–దామలు, చిఱుత–తనమునన్, పేరెంచవానులు, కాన్, ఓపున్, బల్, లేసరులు, వేదారగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** గోపా–కాంచువులు గోపా–పొఱఁబాటరులున్ ఐ ఉందురు. గోపా–వేలుపులు బ్రది–నాళులున్ గోప–రెంచలు ఐ ఉందురు. గోపా–కఱదరులు చిఱుత–తనమునన్ గోప–దామలు ఐ ఉందురు. పేరెంచవానులు వేదారగాన్ బల్ లేసరులు కాన్ ఓపున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గోపా–కాంచువులు = గొప్ప ఉపాధ్యాయులు ; గోపా–పొఱఁబాటరులున్ = గొప్ప పొఱఁబాటులు చేసిన వారు కూడ ; గోపా–వేలుపులు = గొప్ప దేవతలు ; గోప–రెంచలు = గొప్ప మానవులు ; బ్రది–నాళులున్ = బ్రదికి ఉన్నన్ని నాళ్ళు ; గోపా

–కఱదరులు = గొప్ప మేధావులు ; గోప–దామలు = గొప్ప అమాయకులు ; చిఱుత–తనమునన్ = బాల్యమునందు ; పేరెంచవానులు = మహాత్ములు ; కాన్ + ఓపున్ = కావచ్చును ; బల్ లేసరులు = బహు సరళ మనస్కులు/ నిరాడంబరులు ; వేదారగాన్ = వ్యక్తిగతముగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** గొప్ప పొఱఁబాటులు చేసినవారు ఆ తరువాత గొప్ప ఉపాధ్యాయులయ్యెదరు. బ్రదికి ఉండఁగా గొప్ప హృదయము గల మానవులు చనిపోయిన తరువాత గొప్ప దేవులును, దేవతలును అయ్యెదరు. చిన్నప్పుడు గొప్ప అమాయకత్వమును గలిగి ఉన్నవారు పెద్దయిన పిమ్మట గొప్ప మేధావులయ్యెదరు. అట్లే మహనీయులు కూడ తమ వ్యక్తిగత జీవితములో మిక్కిలి సరళ స్వభా–వులును, నిరాడంబరులును అయి ఉండెదరు. (పరస్పర విరుద్ధము వలె కనిపించు ఈ లక్షణములకు నిగూఢ సంబంధమున్నదని కవి ఆంతర్యము).

SUMMARY : Great teachers could also be great bunglers in the past. Great gods/ goddesses could be great humans earlier. Great intellectuals could be highly naïve ones in their child–hood. The greatest are the simplest in their personal lives.

*(The poet implies that the apparently conflicting attributes do, in fact, have an invisible correlation).*

**పస్సియ** ॥ లోవైనమెంత మీసరమ్మైనను, జరుమానమునఁ బనిమారము లేక
మీసరికం బది నిలఁబడుట కడిఁది ; నిన్న నింపైన చవులూరు విందుఁ
దిన్నఁ దీఱునే నేటి బొజకుందు? 81

**మాటల విడఁదీత (పద విభాగము) :** లోవైనము + ఎంత, మీసరము + ఐనను, జరుమానమునన్, పనిమారము, లేక, మీసరికంబు + అది, నిలఁబడుట, కడిఁది, నిన్నన్, ఇంపు + ఐన, చవులు + ఊరు, విందున్, తిన్నన్, తీఱునే, నేటి, బొజ–కుందు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నిన్నన్ ఇంపు + ఐన చవులు + ఊరు విందున్ తిన్నన్ నేటి బొజ–కుందు తీఱునే? (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** లోవైనము = గతము ; మీసరము + ఐనను = శ్రేష్ఠమైనను ; జరుమానమునన్ = వర్తమానమునందు ; పనిమారము = క్రియాశీలత ; లేక = లేకపోయినచో ; మీసరికంబు + అది = ఆ శ్రేష్ఠత్వము ; కడిఁది = కష్టము ; ఇంపు + ఐన = ఇష్టమైన ; చవులు + ఊరు = రుచులు మీరునట్టి ; తిన్నన్ = తిన్నచో ; నేటి + ఈనాటి ; బొజ–కుందు = పొట్టబాధ (ఆఁకలి).

**లోవాఱిక (తాత్పర్యము) :** గతమెంత శ్రేష్ఠముగా ఉన్నను, వర్తమానమున పని లేకపోయినచో ఆ శ్రేష్ఠత నిలఁబడుట కష్టము. (అసాధ్యము కూడ). నిన్న ఇంపైన రుచికరపు విందు తిన్నామని చెప్పి ఈ పూఁట ఆఁకలి వేయుట మానదు కదా? నిన్నటి విందు నేటి ఆఁకటిని తీర్చదు కదా?

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** పనిమారము = క్రియాశీలత – activity ; పనిమారి = క్రియాశీలకము/ క్రియాశీలి – active/ active person.

SUMMARY : However glorious one's past might be, the glory is unlikely to endure in the absence of activity at the present. Can today's appetite be satisfied with yesterday's delicious feast?

**పస్సియ జంట** ॥ నంజము లేదు తిండిగింజలలో ; నాసి లేదు మఱి మంచినీళ్ళలో ;

త్యాలు లేదు పిల్లతెమ్మెఱలలో ; వణికముగా నాణ్యముగా నైకలి 82
యిడిన సమైమంటి నలిగము లాని, మంచితన మదియె రెంచల పట్లను ౹
అగపఱచుట కేమీ? ఐకలియున్ ౹ అకపాటిఁ జేయుచో మనమెచటన్ ? 83

**మాటల విడఁదీత (పద విభాగము) :** నంజము, లేదు, తిండి–గింజలలోన్, నాసి, లేదు, మఱి, మంచి–నీళ్ళలోన్, త్యాలు, లేదు, పిల్ల–తెమ్మెఱలలోన్, వణికముగాన్, నాణ్యముగాన్, ఐకలి, ఇడిన, సమైమి + అంటి, నలిగములు + ఆని, మంచితనము + అదియె, రెంచల, పట్లను, అగపఱచుటకున్, ఏమీ, ఐకలియున్, అకపాటిన్, చేయుచోన్, మనము, ఎచటన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తిండి–గింజలలోన్ నంజము లేదు. మఱి మంచినీళ్ళలోన్ నాసి లేదు. పిల్ల–తెమ్మెఱలలోన్ త్యాలు లేదు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నంజము = విషము ; నాసి = తక్కువ నాణ్యము ; త్యాలు = రోగము ; పిల్ల–తెమ్మెఱలలోన్ = చిఱు చిఱు గాలి కెఱటములలో ; వణికముగాన్ = ఉచితముగా (ఊరకే – మారుగా ఏమియు పుచ్చుకొనకుండ) ; ఇడిన = ఇచ్చిన/ పెట్టిన ; ఐకలి = ప్రకృతి ; సమైమి + అంటి = అమృతము వంటి ; నలిగములు = పదార్థములను ; ఆని = ఆస్వాదించి ; మంచితనము + అదియె = ఆ మంచితనమునే ; రెంచల పట్లను = మానవుల యెడల కూడ ; అగపఱచుటకున్ = చూపుటకు ; ఏమీ = ఏమి అభ్యంతరము? ' అక–పాటిన్ = అన్యాయము ; చేయుచోన్ = చేసిన యెడల ; ఎచటన్ – ఎక్కడ ఉండెదము?

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రకృతిమాత ఉచితముగాను నాణ్యముగాను ప్రసాదించిన తిండిగింజలలో విషము లేదు. మంచినీళ్ళలో నాణ్యము తగ్గలేదు. పిల్ల తెమ్మెఱలలో రోగము లేదు. ఈ విధముగా మనిషి ఒక ప్రక్కన ప్రకృతి తనకు ప్రసాదించిన పరిశుద్ధములైన పదార్థములను ఆస్వాదించుచు మఱియొక ప్రక్కన ఆ మంచితనమునే తన గుండా ఇతరులకు అందించను అభ్యంతరమేమి? మనము తోడి మానవులకు చేయుచున్న అన్యాయమును ప్రకృతి కూడ మనకు చేసిన యెడల మనము ఎక్కడ ఉండెదము?

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** (౧) ఇది వాతావరణమును మఱియు పదార్థములను కల్తీ చేయుటను గూర్చిన పద్యము. ప్రకృతి నుండి నీవు పొందుచున్న ప్రేమను, మంచితనమును, సుఖమునే ఇతరులకు సైతము అందింప వలసినదని కవి సందేశము.

(౨) పిల్ల తెమ్మెఱ = light breeze.

SUMMARY : There is no poison in the grains given by Nature. The water graced by Her is not low quality. There is no disease in the light breeze granted by Her. Then what is it that prevents man from paying forward the same goodness to his fellow-humans? What will be our fate if She does the same injustice to us that we do to our fellow-humans?

**రాల్మిక వాలు ॥** కడగండ్లు పడెదరు మంది, కొన్నెంచికల మార్చికొనలేక ౹
అలవాటుల వీడలేక, వంచదనముల తేడాలెఱుఁగక. 84

**మాటల విడఁదీత (పద విభాగము) :** కడగండ్లు–పడెదరు, మంది, కొన్ని, ఎంచికలన్, మార్చికొనన్ + లేక, అలవాటులన్, వీడన్ + లేక, వంచదనముల, తేడాలు, ఎఱుఁగక.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కొన్ని ఎంచికలన్ మార్చికొనన్ లేక అలవాటులన్ వీడన్ లేక వంచదనముల తేడాలు ఎఱుఁగక మంది కడగండ్లు పడెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కడగండ్లు పడెదరు = కష్టాలు పడెదరు ; మంది = జనము ; ఎంచికలన్ = అభిప్రాయములను ; వంచదన–

ముల తేడాలు = ప్రాముఖ్యముల నడుమ తేడాలను.

**లోవాతిక (తాత్పర్యము) :** కొన్ని అభిప్రాయములను మార్చుకొనలేక పోవుట వలనను, కొన్ని అలవాటులను మానుకొనలేక పోవుట వలనను, విషయములకు ఇవ్వవలసిన ప్రాధాన్యములోని తేడాలను పాటింపక పోవుట వలనను ప్రజలు కష్టములు పడుచుందురు.

SUMMARY : People often suffer because they refuse to change some of their opinions, habits and the order of priority they accord to different issues.

**పస్సియ జంట ॥** బ్రదిమానమున నొక వ్రయవంచి, బ్రంబోతని డెందమున నంచించి,
కీడించెదరు తమకు లాతులకున్ ; నికాప బ్రంబోతెడాట మొక్కటి, 85
నెప్పిగఁ బైకొన్నప్పుడే మంది, నేర్చెదరు బ్రదిమానమున కన్నను,
బ్రంబోతెద్దియు నింబుగ లేదని, వ్రయవంచి పిచ్చి పిల్లచేతలని. 86

**మాటల విడఁదీత (పద విభాగము) :** బ్రదిమానమునన్, ఒక, వ్రయవంచి, బ్రంబోతు + అని, డెందమునన్, అంచించి, కీడించెదరు, తమకున్, లాతులకున్, నికాప, బ్రంబోతు + ఎడాటము + ఒక్కటి, నెప్పిగన్, పైకొన్న + అప్పుడు + ఏ, మంది, నేర్చెదరు, బ్రదిమానమున కన్నను, బ్రంబోతు, ఎద్దియున్, ఇంబుగన్, లేదు + అని, వ్రయవంచి, పిచ్చి, పిల్ల–చేతలు + అని.

**చఱమోలి (అన్వయ క్రమము) :** బ్రదిమానమునన్ ఒక వ్రయవంచి బ్రంబోతు అని డెందమునన్ అంచించి తమకున్ లాతులకున్ కీడించెదరు. నికాప బ్రంబోతు + ఎడాటము ఒక్కటి నెప్పిగన్ పైకొన్న అప్పుడు + ఏ బ్రదిమానమున కన్నను బ్రంబోతు ఎద్దియున్ ఇంబుగన్ లేదు అని వ్రయవంచి పిచ్చి పిల్ల–చేతలు అని మంది నేర్చెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** బ్రదిమానమునన్ = జీవితములో ; వ్రయవంచి = ఒకే ఒక్క భాగము (ఏకదేశము) ; బ్రంబోతు + అని = బ్రహ్మాండమని ; డెందమునన్ = హృదయములో ; అంచించి = ఊహించి ; కీడించెదరు = కీడు చేసెదరు ; లాతులకున్ = ఇతరులకు ; నికాప = యథార్థమైన (అసలైన) ; బ్రంబోతు + ఎడాటము = బృహద్ విషయము ; నెప్పిగన్ = బాధాకరముగా ; పైకొన్న + అప్పుడు + ఏ = మీఁదఁ బడినప్పుడే ; మంది = జనము ; ఎద్దియున్ = ఏదియు ; ఇంబుగన్ = చక్కగా ; వ్రయవంచి = ఏకదేశము (ఏకదేశములను గూర్చిన పట్టుదల.

**లోవాతిక (తాత్పర్యము) :** జీవితములో ఒకే ఒక్క భాగమును పట్టుకొని అదే బ్రహ్మాండమనుకొని దానికై తమకును వేఱేవారికి కూడ జనము కీడు చేసికొందురు. నిజమైన ప్రధాన విషయమొకటి మీఁద పడినప్పుడే వారు గుర్తించెదరు, "బ్రదుకుట కన్న బ్రహ్మాండమైన విషయమేదియు లే" దని, "ఏకదేశములను గూర్చిన ఛాందసము పిచ్చిచేష్ట" లనియు, "పిల్లచేత" లనియు !!

**వైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** ఈ పద్యములో చెప్పఁబడిన సత్యమునకు మచ్చుతునుకలేవియు ఇవ్వఁబడలేదు. కాని కరుడుగట్టిన కులాభిమానులు సైతము – తమకే వైద్యకీయ అవసరము పడినప్పుడు – ఏ కులస్థుల నెత్తుటి నైనను అవయవ దానము నైనను తీసికొనను సిద్ధపడుటను తారకాణముగా చెప్పుకొన వచ్చును.

SUMMARY : Taking a minor part of life for that of the greatest importance, people harm themselves and others. However, when they face a truly serious issue, they will come to real-ize that there is nothing more serious than survival and their insistence on minor parts is just crazy and puerile.

**రాల్మిక ॥** కడగండివానులుండరు, కలిమి గలుగ ముందటి వలెనె ;

తడిఁ బీల్చికొన్న తలుపులు తెఱచుకొనవు తొంటి వలెనె. 87

**మాటల విడఁదీత (పద విభాగము) :** కడగండివానులు + ఉందరు, కలిమి, కలుగన్, ముందటి, వలెనె, తడిన్, పీల్చికొన్న, తలుపులు, తెఱచుకొనవు, తొంటి, వలెన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కలిమి కలుగన్ కడగండివానులు ముందటి వలెనె ఉందరు. తడిన్ పీల్చికొన్న తలుపులు తొంటి వలెన్ తెఱచుకొనవు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కడగండివానులు = కష్టజీవులు ; కలిమి = సంపద ; కలుగన్ = చేకూడఁగా ; ముందటి వలెనె = ఇదివరకటి వలెనె ; తొంటి వలెన్ = పూర్వము వలె.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : The ones in hardships won't remain the same people after they got riches. The doors which have absorbed moisture cannot be opened like before.

**పస్పియ జంట** ॥ వాయరము నేర్చి వలంతుల పోలె, వాకొండ్రు పెక్కండ్రు మేల్పలుకులె ;

వాయరమునకుఁ దగ్గ పానారము, వలంతికమున్ మటుకు సామింపరు ; 88

కొండిక తండిరి తుండుఁ జుట్టుకొన, మెండుగ నగవగు, మేరిక కలుగునె? 89

**మాటల విడఁదీత (పద విభాగము) :** వాయరమున్, నేర్చి, వలంతుల, పోలెన్, వాకొండ్రు, పెక్కండ్రు, మేల్ + పలుకులె, వాయరమునకున్, తగ్గ, పానారమున్, వలంతికమున్, మటుకు, సామింపరు, కొండిక, తండిరి, తుండున్, చుట్టుకొనన్, మెండుగన్, నగవు + అగున్, మేరిక కలుగునే.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పెక్కండ్రు వాయరమున్ నేర్చి వలంతుల పోలెన్ మేల్ + పలుకులె వాకొండ్రు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వాయరమున్ = భాషను ; వలంతుల పోలెన్ = ప్రతిభాశాలుల వలె ; వాకొండ్రు = ఉపన్యసించెదరు ; పెక్కండ్రు = చాలమంది ; మేల్ + పలుకులె = సూక్తులే/ సుభాషితములే ; తగ్గ = తగినటువంటి ; పానారమున్ = పరిణతిని ; వలంతికమున్ = ప్రతిభను ; సామింపరు = సాధన చేయరు/ అభ్యసింపరు ; కొండిక = చిన్నపిల్లవాఁడు/ చిన్నపిల్ల ; తండిరి తుండున్ = తండ్రి తుండుగుడ్డను ; చుట్టుకొనన్ = చుట్టికొనఁగా ; మెండుగన్ = మిక్కిలి ; నగవు + అగున్ = నవ్వు వచ్చును ; మేరిక = గౌరవము.

**లోవాఱిక (తాత్పర్యము) :** కొంతమంది భాష నేర్చుకొని గొప్ప పండితుల వలె సూక్తులను, సుభాషితములను ఉపన్యసించెదరు. కాని ఆ భాషాజ్ఞానమునకు తగ్గ పరిణతిని, ప్రజ్ఞను మటుకు సాధింపరు. ఒక చిన్నపిల్లవాఁడు తండ్రిగారి తుండుగుడ్డ చుట్టుకొన్నచో నవ్వు వచ్చును గాని గౌరవము కలుగునా?

SUMMARY : Some master only language and lecture people on maxims and aphorisms. However they won't attain the matching maturity and expertise that is associated with that mastery of language. If a child draped himself with his dad's towel, people only laugh. But would they respect him?

**రాల్మిక వాలు** ॥ మనలోఁ జెరివానికి వే, వలయుఁ బారీలు పొకాల్పుటకై,

ఒడికార మెసరేకయే, నేటులకు నిలుమ ట్లగునేనిన్. 90

**మాటల విడఁదీత (పద విభాగము) :** మనలోన్, చెరి–వానికిన్, వే, వలయున్, పారీలు, పొకాల్పుటకై, ఒడికారము, ఎసరేక + ఏ, నేటులకున్, నిలుమట్లు + అగున్ + ఏనిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒడికారము ఎసరేక + ఏ నేటులకున్ నిలుమట్లు అగున్ + ఏనిన్ మనలోన్ చెరి–వానికిన్ పొకాల్పుటకై వే పారీలు వలయున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చెరి–వానికిన్ = ప్రతివానికి ; వే = వేయి ; వలయున్ = కావలెను ; పారీలు = భూగ్రహములు ; పొకాల్పు టకై = నాశనము చేయుటకై ; ఒడికారము = ఆవేశము ; ఎసరేక + ఏ = భావోద్వేగమే ; నేటులకున్ = నిర్ణయములకు ; నిలుమట్లు = ప్రాతిపదికములు ; అగున్ + ఏనిన్ = అయినచో.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఆవేశము మఱియు భావోద్వేగములే మన నిర్ణయములకు ప్రాతిపదికములైనచో, మనలో ఒక్కొక్కఱికి నాశనము చేయుట కోసము కనీసము పది భూగ్రహములు కావలసి వచ్చును.

**వైమాల విడఁబఱ్పు (విశేష వివరణము) :** ఏమి చేసినను ఆవేశములను, భావోద్వేగములను తృప్తిపఱచుట అసంభవమనియు, కనుక వాటిని అదుపులో పెట్టుకొనుట తప్ప మార్గాంతరము లేదనియు భావము.

SUMMARY : Each one of us will need at least 10 Earths to destroy, if emotions alone were to form the basis of our decisions.

*(The poet implies that it is impossible to cater to our emotions. So better restrain them).*

**పస్సియ ॥** విడఁద్రెంపులని రెంచలెంచునవి, పొడఁగాంచినచోఁ గ్రొత్త జబ్బులే ;
అవి వేఁకికిఁ జన్నీటి జలకములు ; వానలో మ్రాను నాని నిలచుటలు. 91

**మాటల విడఁదీత (పద విభాగము) :** విడఁద్రెంపులు + అని, రెంచలు + ఎంచునవి, పొడఁగాంచినచోన్, క్రొత్త, జబ్బులే, అవి, వేఁకికిన్, చన్నీటి (చల్ల + నీటి), జలకములు, వానలోన్, మ్రానున్, ఆని, నిలచుటలు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** విడఁద్రెంపులు = పరిష్కారములు ; రెంచలు = మనుష్యులు ; ఎంచునవి = భావించునట్టివి ; పొడఁగాం–చినచోన్ = గమనించినచో ; వేఁకికిన్ = జ్వరమునకు ; జలకములు = స్నానములు ; మ్రానున్ = చెట్టునకు ; ఆని = ఆనుకొని ; నిలచు టలు = నిలఁబడుటలు.

**లోవాఱిక (తాత్పర్యము) :** "పరిష్కారములు" అని జనము తలఁచునవి — మెలకువతో గమనించినచో నిజమునకు క్రొత్త సమస్యలే సుమా. అవి జ్వరమునకు చికిత్సగా రోగి మీఁద చన్నీళ్ళు పోయుట వంటివి. అవి — వాన కురియుచున్నప్పుడు చెట్టు క్రింద నిలఁబడుట వంటివి.

**వైమాల విడఁబఱ్పు (విశేష వివరణము) :** (౧) జ్వరరోగి మీఁద చన్నీళ్ళు పోసినచో ఆ జ్వరము మఱింత ప్రమాదకరముగా మారును.

(౨) వాన కురియుచున్నప్పుడు చెట్టు క్రింద నిలఁబడ్డవారు పిడుగుపాటునకు గుఱియగు ముప్పు కలదు.

(౩) 'చల్లు → చల్లకము' — ఇదే కాలక్రమమున మంది పలుకుబడిలో 'జలకము' అయినది. అంతే తప్ప తెలుఁగు జలకమునకును సంస్కృత "జల" శబ్దమునకు ఏ తౌలము గానీ లేదు. 'జలకము' నందలి [జ] కారము తెలుఁగు దంత్యము. (dzalakamu).

SUMMARY : If you care to observe, what the people take for solutions are often newer bottlenecks. They are like bathing a fever patient in cold water. They are like standing

under a tree when it is raining. (Those standing like that run the risk of getting struck by a thunder).

**పస్సియ జంట** ॥ రోవా నెవటైరి తెరువాటులన్ ? ససివా నెవటైరి కాని తిండ్లన్ ?

చట్టములు గల వైకలిలో ; క్రొత్త, చట్టమ్ములతోఁ బని యేమున్నది ? 92

ఐకలి చట్టముల నెనపించుటయె ౨, అన్ని చట్టముల కడపొంటెము. 93

**మాటల విడఁదీత (పద విభాగము) :** రోవాన్ + ఎవఱు + ఐరి, తెరువాటులన్, ససివాన్ + ఎవఱు + ఐరి, కాని-తిండ్లన్, చట్టములు, కలవు + ఐకలిలోన్, క్రొత్త, చట్టమ్ములతోన్, పని, ఏమి, ఉన్నది, ఐకలి, చట్టములన్, నెనపించుట + ఎ, అన్ని, చట్టముల, కడపొంటెము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎవఱు తెరువాటులన్ రోవాన్ ఐరి? ఎవఱు కాని తిండ్లన్ ససివాన్ ఐరి? ఐకలిలోన్ చట్టములు కలవు. .... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** రోవాన్ = ధనికులు ; తెరువాటులన్ = దారిదోపిడుల గుండా ; ససివాన్ = ఆరోగ్యవంతులు ; కాని తిండ్లన్ = తినఁగూడని తిండ్ల వలన ; ఐకలిలోన్ = ప్రకృతిలో ; నెనపించుట + ఎ = గుర్తు చేయుటయే ; కడపొంటెము =అంతిమ ప్రయోజనము.

**లోవాఱిక (తాత్పర్యము) :** దారిదోపిళ్ళు చేసి ధనికులైన వారెవఱు? తినఁగూడని తిండ్లు తిని ఆరోగ్యవంతులైనదెవఱు? ప్రకృతిలో ఇప్పటికే చట్టములు ఉన్నవి. మనుష్యులకు క్రొత్త చట్టములతో పని ఏమున్నది? ప్రకృతి చట్టములను గుర్తు చేయుటయే మానవ చట్టములన్నిఁటి అంతిమ ప్రయోజనము.

SUMMARY : Who did get rich by way of waylayings? Who did gain health through bad dietary habits? There are the laws already made by the Nature. So why do humans need new laws? Reminding people of the Nature's laws is the ultimate objective of all man-made laws.

**వెల్మిరిక జంట** ॥ ఎగురు మానిన పులుగుల యెఱక, లగును దుదిని నగచందములే ;

వేసి తీయుట జరుగని కప్ప, బిగిసిపోవును ౨ కిలుములు గప్ప ; 94

హాయి-నెమ్మనములకు నలవడి ౨, అగును బోరున కంబేద పరి ;

వ్రాయఁ జదువ మానిన పిమ్మట, వాయరము కడిఁది గుఱుతుండుట. 95

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎగురన్, మానిన, పులుగుల, ఎఱకల్ + అగును, తుదిని, నగ-చందములే, వేసి, తీయుట, జరుగని, కప్ప, బిగిసి-పోవును, కిలుములు, కప్పన్, హాయి-నెమ్మనములకున్, అలవడి, అగును, పోరునకున్, అంబేద, పరి, వ్రాయన్, చదువన్, మానిన, పిమ్మటన్, వాయరము, కడిఁది, గుఱుతు + ఉండుట.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎగురన్ మానిన పులుగుల ఎఱకల్ తుదిని నగ-చందములే అగును. వేసి తీయుట జరుగని కప్ప కిలుములు కప్పన్ బిగిసిపోవును. హాయి-నెమ్మనములకు అలవడి పరి పోరునకున్ అంబేద అగును. వ్రాయన్ చదువన్ మానిన పిమ్మటన్ వాయరము గుఱుతు ఉండుట కడిఁది.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎగురన్ మానిన =ఎగురుట మానివేసిన ; పులుగుల = పక్షుల యొక్క ; ఎఱకల్ = ఱెక్కలు ; తుదిని = చివరికి ; నగ-చందములే = అలంకార ప్రాయములే ; కప్ప = తాళము కప్ప ; కిలుములు = లోహ మలినము ; కప్పన్ = క్రమ్ముకొనఁగా ;హాయి-నెమ్మనములకు = సుఖ శాంతులకు ; అలవడి = అలవాటు పడి ; పోరునకున్ = యుద్ధము చేయుటకు ; అంబేద = అసమర్థము ; పరి = జనము ; వ్రాయన్ = వ్రాయుటకు ; చదువన్ = చదువుటకు ; పిమ్మటన్ = తరువాత ; వాయరము = భాష ; కడిఁది = కష్టము.

**లోవాతిక (తాత్పర్యము) :** పక్షులు ఎగురుట మానివేసిన తరువాత వాటి ఱెక్కలు నిరుపయోగమై అలంకార ప్రాయమే అగును. వేయుట తీయుట జరుగని తాళము కప్ప కిలుము పట్టి బిగిసిపోయి పనికిరానిదగును. సుఖశాంతులకు అతిగా అలవాటు పడ్డ జనము తరువాత పోరాటములకు పనికిరాని వారయ్యెదరు. అనునిత్యము వ్రాయుట, చదువుట మానివేసిన తరువాత భాషలోని సూక్ష్మములు గుర్తుండుట కష్టము.

SUMMARY : Wings turn just ornamental among the flightless birds. A padlock turns useless having developed verdigris after falling in disuse for a long time. The public will become un-fit for fighting wars after overly getting addicted to peace and comfort. The subtle nuances of the language are hard to remember after one quit the habit of regular reading and writing.

**పస్పియ ॥** ఱాలు ఱువ్వెదరు కాయల మ్రానికె ; కోయఁబోయెదరు గఱిమేపులనే ;
తెగడఁగలరు కడతేఱినవారినె ; కాఱించఁగలరు మంచివారినే. 96

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఱాలు, ఱువ్వెదరు, కాయల, మ్రానికె, కోయన్ + పోయెదరు, గఱి-మేపులనే, తెగడన్ + కలరు, కడతేఱిన-వారినె, కాఱించన్ + కలరు, మంచి-వారినే.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కాయల మ్రానికె ఱాలు ఱువ్వెదరు. గఱి-మేపులనే కోయన్ పోయెదరు. కడతేఱిన-వారినె తెగడన్ కలరు. మంచి-వారినే కాఱించన్ కలరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఱాలు = ఱాళ్ళు ; ఱువ్వెదరు = విసరెదరు ; కాయల మ్రానికె = కాయలు కాసిన పెద్దచెట్టునకే ; గఱి-మేపులనే = గడ్డి తిను జంతువులనే ; తెగడన్ కలరు = తిట్టఁగలరు ; కడతేఱిన-వారినె = అంతరించిన వారినే (చనిపోయిన వారినే) ; కాఱించన్ కలరు = హింసింపఁగలరు.

**లోవాతిక (తాత్పర్యము) :** కాయలు కాసిన చెట్టు మీఁదికే జనము ఱాలు ఱువ్వెదరు. గడ్డి మేయు జంతువులనే కోసి తినెదరు. చనిపోయిన వారినే నిందింపఁగలరు. వారు మంచివారిని మాత్రమే హింసింపఁగలరు.

SUMMARY : People pelt stones only at the trees which bear fruits. They kill and eat only the animals which subsist on grass. They can blame only the ones who departed. They can torture only the good ones.

**అవిగింగ ॥** చెరివారికిన్ వలయు నొక చెన్నయిన బొంకు ; కఱకు నిక్కముఁ దెల్పఁబోఁ గాకడ యందురు ;
చెన్నయిన బొంకుల నమ్మి సేఁగిల్లినవా, రేదియో సరిగాఁ జేయలేదనుకొందురు. 97

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెరి-వారికిన్, వలయున్, ఒక, చెన్ను + అయిన, బొంకు, కఱకు, నిక్కమున్, తెల్పన్ + పోన్, కాకడ, అందురు, చెన్ను + అయిన, బొంకులన్, నమ్మి, సేఁగిల్లిన-వారు + ఏదియో, సరిగాన్, చేయలేదు + అనుకొందురు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చెరి-వారికిన్ ఒక చెన్ను అయిన బొంకు వలయున్.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చెరి-వారికిన్ = ప్రతివారికిని ; వలయున్ = కావలెను ; చెన్ను + అయిన = అందమైన ; బొంకు = అబద్ధము ; కఱకు నిక్కమున్ = కఠోర సత్యమును ; తెల్పన్ + పోన్ = తెలుపఁబోఁగా ; కాకడ = వేదాంతము/ తత్త్వశాస్త్రము ; సేఁగిల్లిన-వారు = నష్టపోయినవారు.

**లోవాతిక (తాత్పర్యము) :** లోకములో ప్రతివారికి ఒక అందమైన అబద్ధము కావలెను. ఎవతైన కఠోర సత్యములను వివరింపఁబోయినచో,

"వేదాంతము చెప్పుచున్నావు" అని తిరస్కరించెదరు. అందమైన బొంకులను నమ్మి నష్టపోయిన వారు, "తామెక్కడనో పొఱబాటు చేసినా మనియు, అందుచేతనే నష్టపోయినా" మనియు తలఁచెదరే తప్ప – "మొదలు అందమైన అబద్ధములను నమ్మి ఆ మేరకు నడుచు కొనుటయే ఆ పొఱబాటు" అని మటుకు గుర్తింపరు, ఒప్పుకొనరు.

SUMMARY : Everyone in the world wants a nice untruth to live by. People call it philosophy (impracticality) if some tries to enlighten them on bitter truths. Those who have lost so much on account of nice untruths, think that they have made a mistake somewhere in the metho-dology. Little do they realize that believing in and proceeding on beautiful untruths was the fundamental mistake in the first place.

**గేరంటిక మున్నంగి** ॥ ఏడు త్రుంకముల నేనే కొఱలఁదగుట, నెవఱికి నుండల్వి గాని యెడారి మిగిత ;
కొన్ని పేర్బయళ్ళె కొఱలల్వి ౨ అయిదిఁట ; ఆ పేర్బయళ్ళనున్ మనుగడ కటకట ; 98
నూఱుల కొలఁది పండ్ల చాలుకట్టులన్ నోరుపట్టునవి కొన్ని తెఱంగులె అగున్ ;
నీరే యే తటు చూపు నిగుడించినన్ ; తా రది యున్నటు త్రాగలేరు రెంచల్ ; 99
మంచి యొలవున నెపుడుఁ గొంచెమే సుమీ ! మఱి ౨ అది దొరకినప్పుడు గుఱుతించుమీ ! 100

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏడు, త్రుంకములన్, ఏనే, కొఱలన్ + తగుటన్, ఎవఱికిన్, ఉండల్వి, కాని, ఎడారి, మిగిత, కొన్ని, పేర్బయళ్ళె, కొఱలల్వి, అయిదిఁటన్, ఆ, పేర్బయళ్ళన్ + ఉన్, మనుగడ, కటకట, నూఱుల, కొలఁది, పండ్ల, చాలుకట్టులన్, నోరు-పట్టునవి, కొన్ని, తెఱంగులె, అగున్, నీరే, ఏ, తటు, చూపున్, నిగుడించినన్, తారు, అది, ఉన్న + అటు, త్రాగన్ + లేరు, రెంచల్, మంచి, ఒలవునన్, ఎపుడున్, కొంచెమే, సుమీ, మఱి, అది, దొరకిన + అప్పుడు, గుఱుతించుమీ.

**చఱమొలి (అన్వయ క్రమము) :** ఏడు త్రుంకములన్ ఏనే కొఱలన్ తగుటన్ మిగిత ఎవఱికిన్ ఉండల్వి కాని ఎడారి. అయిదిఁటన్ కొన్ని పేర్బయళ్ళె కొఱలల్వి. ఆ పేర్బయళ్ళన్ + ఉన్ మనుగడ కటకట. నూఱుల కొలఁది పండ్ల చాలుకట్టులన్ నోరు-పట్టునవి కొన్ని తెఱంగులె అగున్. ఏ తటు చూపున్ నిగుడించినన్ నీరే. రెంచల్ తారు అది ఉన్న + అటు త్రాగన్ లేరు. మంచి ఒలవునన్ ఎపుడున్ కొంచెమే సుమీ. మఱి అది దొరకిన అప్పుడు గుఱుతించుమీ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** త్రుంకములన్ = ఖండములలో ; ఏనే = అయిదే ; కొఱలన్ + తగుటన్= నివసింపఁదగి ఉండుట చేత (నివాసయోగ్యమై ఉండుట చేత) ; ఎవఱికిన్ = ఎవఱికిని ; ఉండల్వి = నివాస యోగ్యము ; పేర్బయళ్ళె = ప్రాంతములే ; కొఱలల్వి = నివాస యోగ్యము ; అయిదిఁటన్ = అయిదింటిలో ; ఆ పేర్బయళ్ళన్ + ఉన్ = ఆ ప్రాంతములలో కూడ ; కటకట = చాలియు చాలని కష్టస్థితి ; పండ్ల చాలుకట్టులన్ = పండ్ల జాతులలో ; నోరు-పట్టునవి = తినఁదగ్గవి ; తెఱంగులె = రకములే ; ఏ తటు = ఏ వైపు ; చూపున్ నిగుడించినన్ = దృష్టి సారించినను ; తారు = తాము ; ఉన్న + అటు – ఉన్నట్లుగా ; రెంచల్ = మనుష్యులు ; ఒలవునన్ = లోకములో ; ఎపుడున్ = ఎల్లప్పుడును.

**లోవాఱిక (తాత్పర్యము) :** భూగోళము మీఁద ఉన్న 7 ఖండములలోను ఐదే మానవులకు నివాస యోగ్యము. మరల ఆ అయిదింటిలోను కొన్ని ప్రాంతములే బ్రదుకుటకు పనికివచ్చును. మరల ఆ కొలఁది ప్రాంతములలో సైతము మనుగడ కష్టముతోనే కడచును. అట్లే ప్రపంచ-ములో కొన్ని వందల పండ్ల జాతులు కలవు. కాని వాటిలో కొన్ని మటుకే తినఁదగ్గవి. అదే విధముగా – భూమండలము మీఁద ఏ వైపున చూచినను నీరే ఉన్నది. కాని మానవులు దానిని ఉన్నది ఉన్నట్లుగా త్రాఁగఁజాలరు. దీని నుండి నేర్వఁదగు గుణపాఠము ఏమనఁగా – లోకములో మంచి అనునది మిక్కిలి కొంచెమే కలదు. కనుక అది దొరకినప్పుడు దాని గొప్పతనమును గుర్తించి గౌరవింపవలెను.

**వైమాల విడఁబఱు (విశేష వివరణము) :** (౧) దీని సందేశము ఏమనఁగా – మంచితనమును విలువాటిగా చూచుకొనుము. మంచివారిని

క్రించుపఱవకుము. వారిని ఎగతాళి చేయకుము. వారికి ద్రోహము చేయకుము. వారి వంటివారు నీకు మరల దొరుకక పోవచ్చును.

(౨) కొఱలు = నివసించు, ఉండు, వర్తించు. (౩) పేర్బయలు/ పేర్చైలు = ప్రాంతము. (౪) చాలుకట్టు = మొక్కల/ పండ్ల జాతి/ వంగడము. (౫) తట్టు = వైపు.

SUMMARY : Just 5 out of the 7 continents of the Earth are fit for human habitation. Even among the said 5, only some regions are the better places to live. Even at those places, man needs to strive hard to survive. Similarly, out of hundreds of fruit varieties, only some are fit for consumption. In the same way, it is water wherever you set your eyes. But none of it is potable as it is. The lesson learnt is – that goodness is rare to come by. It needs to be recognised and respected the moment it is found.

**పస్సియ జంట** ‖ లేకపోవచ్చు హొన్మంటియములు ; ఏ కడనో డాఁగు నినుప పాతరలు ;
కట్టి కరకల్లదియు లేకున్నను, గలుగు సనైకము ఱాల్ ప్రెబ్బోతిగ ; 101
పంటలు ౧ పండ్లు విఱివి గాకున్నను, బసరంబులేవియో పొదలవచ్చు ;
ఐకలి సేయదేరికి నకపాటి ; ఎచటి యేర్పా టుచటికి బల్మేటి. 102

**మాటల విడఁదీత (పద విభాగము) :** ‖ లేకపోవచ్చున్, హొన్ + మంటియములు, ఏ, కడనో, డాఁగున్, ఇనుప, పాతరలు, కట్టి, కరకల్లు + అది + ఉన్ లేక + ఉన్నను, కలుగున్, సనైకము, ఱాల్, ప్రెబ్బోతిగన్, పంటలున్, పండ్లున్, విఱివి, కాక + ఉన్నను పసరంబుల్ + ఏవియో, పొదలన్ + వచ్చున్, ఐకలి, చేయదు, ఏరికిన్, అకపాటి, ఎచటి, ఏర్పాటు + అచటికిన్, బల్ + మేటి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** హొన్ + మంటియములు లేకపోవచ్చున్. ఏ కడనో ఇనుప పాతరలు డాఁగున్. కట్టి కరకల్లు అది + ఉన్ లేక ఉన్నను సనైకము ఱాల్ ప్రెబ్బోతిగన్ కలుగున్. పంటలున్ పండ్లున్ విఱివి కాక ఉన్నను పసరంబుల్ ఏవియో పొదలన్ వచ్చున్. ఐకలి ఏరికిన్ అకపాటి చేయదు. ఎచటి ఏర్పాటు అచటికిన్ బల్ మేటి.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** హొన్ + మంటియములు = బంగారు గనులు ; ఏ కడనో = ఏ వైపుననో ; డాఁగున్ = దాఁగి ఉండును ; కట్టి కరకల్లు + అది + ఉన్ = ఆ నల్లని లోహము కూడ ; కలుగున్ = ఉండును ; సనైకము = కనీసము ; ఱాల్ = ఱాళ్ళు ; ప్రెబ్బోతిగన్ = ఖచ్చితముగా ; విఱివి = విస్తారము ; పసరంబుల్ + ఏవియో = జంతువులేవో ; పొదలన్ + వచ్చున్ = పెరుగవచ్చును ; ఐకలి = ప్రకృతి ; ఏరికిన్ = ఎవఱికిని ; అకపాటి = అన్యాయమును ; బల్ + మేటి = సర్వోత్తమము.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక సీమలో బంగారు గనులు లేకపోయినను, బహుశ ఇనుప గనులు ఉండి ఉండవచ్చును. ఒకవేళ ఆ ఇనుప గనులు సైతము లేకపోయినను కనీసము ఱాళ్ళయినను ఖచ్చితముగా ఉండును. ఆ సీమలో పండ్లును పంటలును విఱివిగా పండక పోయి–నను ఏవియో కొన్ని జంతువులైనను ప్రెంపొంది ఉండవచ్చును. అందుచేత ప్రకృతి ఏ దేశప్రజలకు గానీ అన్యాయము చేయదు. ఎక్కడి బ్రదుకుదెరువు ఏర్పాటులను అక్కడ చేసియే ఉన్నది. ఆయా సీమల వరకు ఆ ఏర్పాటులు సర్వ శ్రేష్ఠములే సుమా.

**వైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** ఒక దేశమును, దాని జీవన విధానమును వేఱే దేశములతో పోల్పరాదని భావము.

SUMMARY : Even if gold mines are absent in a particular country, probably iron mines would have been present there. Even if iron mines are not there, at least stones could certai–nly be available. Even if crops and fruits do not grow there in abundance, at least a few ani–

mals must be flourishing there. Thus, the Nature does not do injustice to the denizens of any country. She has made an arrangement tailor-made for each country. The arrangements are the best for those regions.

**వాణిద** || తా మ్రింగిన పులుగ్రుడ్డు చిలువ కొకపూఁట మెసవము ;
దానికి గావగు గ్రుడ్డున కది నిండుబ్రదిమానము ;
తన మయ్యాతఁ గోల్పడిన తల్లి కడుపు-దావంతము ;
ఇట్టివ మన మొరులకుఁ దలపెట్టు కీళ్ళు మన కోసము. 103

**మాటల విడఁదీత (పద విభాగము) :** తాన్ మ్రింగిన పులుగ్రుడ్డు చిలువకున్ + ఒక-పూఁట-మెసవము దానికిన్ గావు + అగు గ్రుడ్డున కది నిండు-బ్రదిమానము తన మయ్యాతన్ + కోల్పడిన తల్లి-కడుపు-దావంతము ఇట్టివి+ అ మనము + ఒరులకున్ + తలపెట్టు కీళ్ళు మన కోసము.

**చఱమొలి (అన్వయ క్రమము) :** ....మనము మన కోసము ఒరులకున్ + తలపెట్టు కీళ్ళు ఇట్టివి+ అ. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పులుగ్రుడ్డు = పక్షిగ్రుడ్డు ; చిలువకున్ = పామునకు ; మెసవము = భోజనము ; గావు + అగు = బలి అగునట్టి ; నిండు-బ్రదిమానము = నిండు జీవితము ; మయ్యాతన్ = సంతానమును ; కోల్పడిన = కోల్పోయిన ; తల్లి-కడుపు-దావంతము = తల్లికి గర్భశోకము ; ఇట్టివి+ అ = ఇటువంటివే ; ఒరులకున్ = ఇతరులకు ; తలపెట్టు = చేయను సంకల్పించునట్టి ; కీళ్ళు = అపకారములు.

**లోవాఱిక (తాత్పర్యము) :** తాను మ్రింగిన పక్షిగ్రుడ్డు పామునకు వదారమొక పూఁట భోజనమున కన్న ఎక్కువ ముఖ్యమైనది కాదు. కాని దాని చేత మ్రింగఁబడి చనిపోయిన గ్రుడ్డునకు ఒక పూర్తి జీవితమే పోయినది. దాని తల్లికి తన మొత్తము ఆశలే పోయి గర్భశోకము కలిగినది. మన స్వార్థము కోసమై మనము ఇతరులకు తలపెట్టు అపకారములును, అన్యాయములును ఆ పాము నడవడివంటివే సుమా !

SUMMARY : The bird-egg swallowed by the snake does not matter to it more than a day-meal. But the to the swallowed egg, the incident means the loss of its entire life. To its mother, it is agony in her womb. So are the disfavours and injustices that we selfishly plot against others.

**అవిగింగ** || కతముండి కంటగింపఁ గరఁగింపఁగనోపు ; మన వలన స్రుక్కువాని మద్దటింపనోపు ;
కడిఁది మారుసేత కతమాలు కంటులకున్ ; తరమే యూరార్పఁగఁ దన్నుఁ దా గిల్లుకొని,
తఱచుగఁ దలబాదుకొను నపాదావంతిన్. 104

**మాటల విడఁదీత (పద విభాగము) :** కతము + ఉండి, కంటగింపన్ + కరఁగింపఁగన్ + ఓపున్, మన వలనన్, స్రుక్కు-వానిన్, మద్దటింపన్ + ఓపున్, కడిఁది, మారుసేత, కతమాలు, కంటులకున్, తరము + ఏ + ఊరార్పఁగన్ + తన్నున్ + తాన్, గిల్లుకొని, తఱచుగన్ + తల-బాదుకొను + అపాదావంతిన్.

**చఱమొలి (అన్వయ క్రమము) :** .... కతమాలు కంటులకున్ మారుసేత కడిఁది. తన్నున్ + తాన్ గిల్లుకొని తఱచుగన్ + తల-బాదుకొను + అపాదావంతిన్ ఊరార్పఁగన్ తరము + ఏ. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** : కతము = కారణము ; కంటగింపన్ = ద్వేషింపఁగా ; కరఁగింపఁగన్ + ఓపున్ = కరఁగింపవచ్చును ;

స్రుక్కు-వానిన్ = బాధపడు వానిని ; మద్దటింపన్ + ఓపున్ = ఓదార్చవచ్చును ; కడిఁది = కష్టము ; మారుసేత = ప్రతికరణము ;, కత మాలు = నిష్కారణమైన ; కంటులకున్ = ద్వేషములకు ; తరము + ఏ = సాధ్యమా ; ఊరార్పఁగన్ = ఓదార్చుటకు ; అపాదావంతిన్ = నిత్య దుఃఖితుని / నిత్య దుఃఖితురాలిని

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒకఁడు ఒక గట్టి కారణము చేత మనలను ద్వేషించినచో ఏదియో ఒకటి చేసి వారి హృదయములను మనవైపు త్రిప్పికొనవచ్చును. అట్లే ఒకఁడు మన మూలముగా బాధపడుచున్నచో ఏదియో ఒక విదముగా వారిని ఊఱడింపవచ్చును. కాని కారణము లేని ద్వేషములకు ప్రతికరణము చేయుట మటుకు చాల కష్టము. అదే విధముగా ఊరక తమను తామే గిల్లుకొని ఏడ్చునట్టి నిత్య దుఃఖితు-లను ఓదార్చుట సైతము సాధ్యము కాదు గదా !

SUMMARY : Those who hate us for a reason can somehow be turned to our favour. Similar-ly, those who suffer on our account may also be assuaged one way or the other. But it is way hard to address the unaccounted-for hate. In the same way, it is not possible to console the ever-melancholic who often pinch themselves and cry.

**అవిగింగ జంట** || పొంగి పొరలు జక్కర పుట్టువీవిత అంచు ౩ , పోహణవైనిగాఁ బొగడి పరి నివాళించు ;
ఎండిపోఁ గట్టెదరా యేటి నడుమ నిండ్లు ; సాఁగు సేసెద, రా వాగుమట్టునం దాడెదరు ; 105
పరి తలంచెదరు బ్రదివానులై విటారులు, గెలువమ్ముల గుఱిగోటుచున్నంత కారు ;
కడసన్న మీఁదటఁ గలుగఁబోదు సుమాళము, చెల్లిన యేటఁ జెలక సాఁగు గాని వైనము. 106

**మాటల విడఁదీత (పద విభాగము) :** పొంగి, పొరలు, జక్కర, పుట్టువు + ఈవిత, అంచున్(అనుచున్), పోహణ-వైనిగాన్, పొగడి, పరి, నివాళించున్. ఎండి-పోన్. కట్టెదరు. ఆ, ఏటి, నడుమన్, ఇండ్లు, సాఁగు, చేసెదరు, ఆ, వాగు-మట్టునందున్, ఆడెదరు, పరి, తలంచెదరు, బ్రదివానులు + ఐ, విటారులు, గెలువమ్ములన్, గుఱిగోటుచున్ + ఉన్న + అంత, కారు, కడసన్న, మీఁదటన్, కలుగన్ + పోదు, సుమాళము, చెల్లిన, ఏటన్, చెలక, సాఁగు, కాని, వైనము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పొంగి పొరలు జక్కర పుట్టువు + ఈవిత అంచున్ (అనుచున్) పోహణ-వైనిగాన్ పొగడి పరి నివాళించున్. ఎండిపోన్ ఆ ఏటి నడుమన్ ఇండ్లు కట్టెదరు. సాఁగు చేసెదరు. ఆ వాగు-మట్టునందున్ ఆడెదరు. విటారులు బ్రదివానులు + ఐ గెలు వమ్ములన్ గుఱిగోటుచున్ + ఉన్న అంత కారు పరి తలంచెదరు. చెల్లిన ఏటన్ చెలక సాఁగు కాని వైనము కడసన్న మీఁదటన్ సుమాళము కలుగన్ పోదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** జక్కర = నది ; పుట్టువు + ఈవిత = పుట్టుక నిచ్చినట్టిది (జన్మదాత్రి) ; అంచున్ = అనుచున్ ; పోహణ-వైనిగాన్ = కవితాత్మకముగా ; పరి = జనము ; నివాళించున్ = ఆరతులిచ్చును ; ఎండిపోన్ = ఎండిపోఁగా ; ఆ ఏటి నడుమన్ = ఆ నది మధ్యలో ; ఆ వాగుమట్టునందున్ = ఆ నదీగర్భమునందు ; తలంచెదరు = తలఁచుకొందురు ; బ్రదివానులు + ఐ = బ్రదికి ఉన్నవారై (బ్రదికి ఉన్నప్పుడు) ; విటారులు = విశిష్టులు ; గెలువమ్ములన్ = విజయములను ; గుఱిగోటుచున్ + ఉన్న + అంత కారు = సాధించుచు ఉన్నంత కాలము ; కడసన్న మీఁదటన్ = గతించిన తరువాత ; కలుగన్ + పోదు = పుట్టదు ; సుమాళము = ఊఁపు ; చెల్లిన = అంత రించిన ; ఏటన్ = నదితో (నది నీళ్ళతో) ; చెలక = చేని మడి ; సాఁగు కాని వైనము = సాఁగు కాని విధముగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక నది ఉరవడితో పాఱినంత కాలము జనము దానిని "జన్మ నిచ్చిన తల్లి" అనుచు కవితాశైలిలో స్తోత్రము చేసె దరు. ఆ నదియే ఎండిపోయిన పిదప వారే ఆ నదీప్రవాహపు దారిని ఆక్రమించి అక్కడ ఇళ్ళు కట్టెదరు. అక్కడి నేలలో వ్యవసాయము చేసె దరు. వారి పిల్లలు ఆ నది నడుమ చేరి ఆటలాడెదరు. అదే విధముగా విశిష్టులు బ్రదికి ఉండి విజయములను సాధించుచున్నంత కాలమే జనము వారిని తలఁచుకొందురు. కాని ఆ విశిష్టులు చనిపోయిన తరువాత వారి పేరు జనములో అంతకు ముందటి ఊఁపును ఉద్రే-

కమును కలిగింపదు. ఎండిపోయిన నది యొక్క నీటితో నారుమళ్ళు సాఁగగుట ఎంత అసాధ్యమో ఇది కూడ అంతే !

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము)** : (౧) "మందిమెప్పు అప్పస"మని తలఁపరాదని భావము. (౨) గుఱిగోటు = సాధించు. (౩) సుమాళము = Excitement.

SUMMARY : As long as a river-flow is breezy and sparkling, folks heap eulogies on it in a poetic style, calling it their 'life-giving mother'. Once it dried up, they will encroach on its fluvial margins, construct houses there and even do farming. Their kids play in the river bed. Similarly, people remember celebrities as long as the latter are alive and hit success after success. But once they departed, their names will fail to evoke the same excitement among the masses, just like farming is impossible with the water of a dried-up river.

**తామరిక** ॥ అచ్చముగ నాదు డెందమునకు గ్రుచ్చుకొనునవి ముల్కులు నాల్గు ;
నెత్తురు వంచుక పుట్టువారు తామొండొరులకు మార్తురగుడు ;
కండ-కడవసముల్ జాల్వోసి కని పెంచు తల్లులకుఁ గన్నడ ;
ఓళపుఁ గలయిక లెన్నియేని నుల్లము లొకటిగఁ గలుపలేమి ;
పైమోరుల నెక్కిన కొలఁదియుఁ బాడైపోవుట రెన్నడితియు. 107

**మాటల విడఁదీత (పద విభాగము) :** అచ్చముగన్, నాదు, డెందమునకున్, గ్రుచ్చుకొనునవి, ముల్కులు, నాల్గు, నెత్తురు, పంచుక, పుట్టు-వారు, తాము + ఒండొరులకున్, మార్తుర్ + అగుడు, కండ-కడవసముల్, జాల్ + పోసి, కని, పెంచు, తల్లులకున్, కన్నడ, ఓళపుం-కలయికల్ + ఎన్ని + ఏనిన్, ఉల్లముల్, ఒకటిగన్, కలుపన్ + లేమి, పై-మోరులన్ + ఎక్కిన, కొలఁది + ఉన్, పాడు + ఐ-పోవుట, రెన్నడితి (రెంచ + నడితి) + ఉన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** పై-మోరులన్ ఎక్కిన కొలఁది + ఉన్ రెన్నడితి (రెంచ + నడితి) + ఉన్ పాడు ఐ-పోవుట. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అచ్చముగన్ = శాశ్వతముగా ; నాదు = నా యొక్క ; డెందమునకున్ = హృదయమునకు ; ముల్కులు = బాణాగ్రములు ; ఒండొరులకున్ = పరస్పరము ; మార్తుర్ = శత్రువులు ; అగుడు = అగుట ; కండ-కడవసముల్ = మాంస చర్మములను ; జాల్ + పోసి = ధారపోసి ; కన్నడ = ఉపేక్ష ; ఓళపుం-కలయికల్ + ఎన్ని + ఏనిన్ = శారీరిక సంగములు ఎన్నియైనను ; ఉల్లముల్ = మనస్సులను ; కలుపన్ + లేమి = కలుపలేక పోవుట ; పై-మోరులన్ = ఉన్నత శిఖరములను ; రెన్నడితి (రెంచ + నడితి) + ఉన్ = మానవుల ధర్మశీలము కూడ.

**లోవాఱిక (తాత్పర్యము) :** నా హృదయములో ఎల్లప్పటికిని గ్రుచ్చుకొనుచుండు బాణాగ్రములు నాలుఁగు కలవు. ఒకటి – లోకములో ఒకే తల్లిదండ్రుల నెత్తుటిని పంచుకొని పుట్టిన అన్నదమ్ములే పరస్పరము పగవారుగా మారుట. రెండవది – మాంస-చర్మములను ధారపోసి పుట్టుక నిచ్చి పెంచిన తల్లులను వారి సంతానము నిర్లక్ష్యము చేయుట. మూఁడవది — ఆడ-మగ ఎన్నిసారులు శారీరికముగా కలసినను వారి హృదయములు ఒకటి కాలేక పోవుట. నాల్గవది — మానవులు జీవితములో ఉన్నత శిఖరములను ఎక్కిన కొలఁది వారి శీలము మఱింతగా నాశనమై పోవుట.

SUMMARY : Four arrow-heads never fail to prick my heart. One – the brothers who have inherited the blood of the same parents, turning enemies to one another. Two – negligence by

the children of their own mothers who shed their sweat and blood to bear and bring them up. Three – the utter failure of multiple sexual intercourses to unite the hearts of the couples. Four – the progressive degeneration of people's character as they keep rising in life.

: సంచమర్తి చెబకము :

**ఇది**

**వాచస్పతి బిరుదుని సంతరిదమైన వల్మిరిగమను నెఱింపటి కావింతయందు**

**రెండవ వీటగు కానస త్రోవలో మొదటి సంచము**

**మొత్తము ముగిసినది.**

**|| మేల్గాతన్ ||**

**మాటల విడఁదీత (పద విభాగము) :** వాచస్పతి-బిరుదుని, సంతరిదము + ఐన, వల్మిరిగము + అను, నెఱింపటి, కావింతయందున్, రెండవ వీటు + అగు, కానస-త్రోవలో, మొదటి, సంచము, మొత్తము, ముగిసినది.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వాచస్పతి-బిరుదుని సంతరిదము + ఐన వల్మిరిగము + అను నెఱింపటి కావింతయందున్ రెండవ వీటు + అగు కానస-త్రోవలో మొదటి సంచము మొత్తము ముగిసినది.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వాచస్పతి-బిరుదుని = వాచస్పతి అను బిరుదము గల కవి యొక్క ; సంతరిదము + ఐన = ప్రణీతమైన ; నెఱింపటి కావింతయందున్ = చింతనాత్మక కావ్యమునందు ; రెండవ వీటు + అగు = రెండవ భాగమైన ; కానస-త్రోవలో = లోక మార్గములో ; మొదటి సంచము = మొదటి అధ్యాయము ; మేల్గాతన్ (మేల్ + కావుతన్) = శుభమస్తు.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

: SUMMARY:

Thus concludes the first chapter of the second part named

*Kaanasa Trova* in the work *Valmirigamu* written

By

Vachaspathi.

---

# వల్మిరిగము

## రెండవ వీటు - కానస త్రోవ

రెండవ సంచము

### హంజియము

**తామరిక ॥ టేంకణముల్ మేల్బారులకున్ బ్రదితారకాణ కానువలై**
**నిలచిన వేలాది మంది తందరుసు రెంచ-రెంచితలకునున్**
**అరిది పొసకట్టకములకుఁ ; తార్రై కొలమానము లవి, రెంచల్**
**మూదలించుచు నున్న దనుకన్ మూఁకుమ్మడి పాటింపు మెయిన్.** 1

**మాటల విడఁదీత (పద విభాగము) :** టేంకణముల్, మేల్బారులకున్, బ్రది-తారకాణ-కానువలై, నిలచిన, వేలాది-మంది, తందరుసు, రెంచ-రెంచితలకున్ + ఉన్, అరిది, పొస-కట్టకములకున్, తార్రై, కొలమానముల్, అవి, రెంచల్, మూదలించుచున్, ఉన్న, దనుకన్, మూఁక + ఉమ్మడి, పాటింపు మెయిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మేల్బారులకున్ బ్రది-తారకాణ-కానువలై నిలచిన వేలాది మంది తందరుసు రెంచ-రెంచితలకున్ + ఉన్ టేంకణముల్. అరిది పొస-కట్టకములకున్ (టేంకణముల్). మూఁక + ఉమ్మడి పాటింపు మెయిన్ రెంచల్ మూదలించుచున్ ఉన్న దనుకన్ అవి తార్రై కొలమానముల్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** టేంకణముల్ = నమస్కారములు ; మేల్బారులకున్ = ఆదర్శములకు : బ్రది- = సజీవ ; తారకాణ-= దృష్టాంత- ; కానువలై = రూపులై ; తందరుసు = సామాన్య- ; రెంచ-రెంచితలకున్ + ఉన్ = మానవీ-మానవులకు కూడ ; అరిది = అద్భుతమైన ; పొస-కట్టకములకున్ = ధర్మశాస్త్రములకు ; తార్రై కొలమానముల్ = స్వయంప్రమాణములు ; రెంచల్ = మనుష్యులు ; మూదలించుచున్ + ఉన్న దనుకన్ = నిరూపించుచున్నంత వరకు ; మూఁక + ఉమ్మడి = సామూహిక / సమష్టి ; పాటింపు మెయిన్ = అనుష్ఠానము / ఆచరణ ద్వారా.

**లోవాటిక (తాత్పర్యము) :** ఆదర్శములకు సజీవ దృష్టాంత మూర్తులై నిలచిన వేలాది మంది మానవ స్త్రీపురుషులకు నమస్కారములు. అందుకు కారణమైన (దారి చూపిన) అద్భుతమైన ప్రాచీన ధర్మశాస్త్రములకు కూడ నమస్కారములు. మనుష్యులు తమ అనుష్ఠానము గుండా వాటి ప్రయోజనమును నిరూపించుచున్నంత కాలము ఆ ధర్మశాస్త్రములు స్వయంప్రమాణములే.

**పైమాల విడఁబఱ్చు (విశేష వివరణము) :** స్వయంప్రమాణము అనఁగా దైవదత్తమైన అధికారము గల మతగ్రంథము. అందులోని మాటలను మరల వేఱేవేఱే గ్రంథాల బాసటతో, లేదా ప్రముఖుల మాటల తోడ్పాటుతో నిరూపింప వలసిన అక్కఱ లేదు.

SUMMARY : Namaskarams to thousands of men and women who stood like live examples for lofty ideals. Namaskarams to the holy scriptures too which are responsible for that. The

scriptures are self-evident as long as their purpose and veracity are substantiated by the practices of humans.

**రాల్మిక వాలు ॥** నా తలఁచిన యట్లు కాదు, నీ తలఁచిన యట్లు గాదీ యొలవు ;
తన తెరువునఁ దాను బోవు ; కడలన్ మను మీ నైరకొల్పఁగఁ
జాలునే యా కడలినే? 2

**మాటల విడఁదీత (పద విభాగము) :** నా, తలఁచిన + అట్లు, కాదు, నీ, తలఁచిన + అట్లు, కాదు + ఈ + ఒలవు, తన, తెరువునన్, తాను, పోవున్, కడలన్, మను, మీన్, ఐరకొల్పఁగన్ + చాలునే, ఆ, కడలినే?

**చఱమోలి (అన్వయ క్రమము) :** నా తలఁచిన అట్లు కాదు. నీ తలఁచిన అట్లు కాదు. ఈ ఒలవు తన తెరువునన్ తాను పోవున్. కడలన్ మను మీన్ ఆ కడలినే ఐరకొల్పఁగన్ చాలునే?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒలవు = లోకము ; తన తెరువునన్ = తన దారిన ; కడలన్ = సముద్రములో(ని) ; మను = బ్రదుకునట్టి ; మీన్ = చేఁప ; ఐరకొల్పఁగన్ + చాలునే = సంస్కరింపఁ గల్గునా?

**లోవాఱిక (తాత్పర్యము) :** ఈ లోకము నేను అనుకొన్నట్లు గానీ నీవు అనుకొన్నట్లు గానీ నడువదు. అది తన దారిన తాను నడచుకొను నంతయే ! సముద్రములో పుట్టి అందులోనే పెరిగి అందులోనే బ్రదికి చివరికి అందులోనే చావ వలసిన ఒక చేఁప ఆ సముద్రమును ఎప్పటికైన సంస్కరింపఁగలదా?

SUMMARY : This world does not behave as expected by me or you, but goes its own way. Can a fish which lives in the ocean, ever reform the same?

**గోరంటిక ॥** నికువంబుగా నొలవును మీఁదోలునది, చెకుందరులుఁ బోహులుఁ గాకడారులే ;
వెలిఁగాఁపరులే యేలిక-పేరిటీలు, వెరసి చిదుగేరువులే రోవానులు. 3

**మాటల విడఁదీత (పద విభాగము) :** నికువంబుగాన్, ఒలవును, మీఁదోలునది, చెకుందరులున్, పోహులున్, కాకడారులే, వెలిఁగాఁపరులే, ఏలిక-పేరిటీలు, వెరసి, చిదుగు + ఏరువులే, రోవానులు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నికువంబుగాన్ ఒలవును మీఁదోలునది చెకుందరులున్ పోహులున్ కాకడారులే. ఏలిక-పేరిటీలు వెలిఁగాఁపరులే. రోవానులు వెరసి చిదుగు + ఏరువులే.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నికువంబుగాన్ = వాస్తవముగా ; ఒలవును = లోకమును ; మీఁదోలునది = నడిపించునది ; చెకుంద రులున్ = కళాకారులు ; పోహులున్ = కవులును ; కాకడారులే = తత్త్వవేత్తలే ; వెలిఁగాఁపరులే = ద్వారపాలకులే ; ఏలిక-పేరిటీలు = పరిపాలక నాములు ; వెరసి = మొత్తముగా ; చిదుగు + ఏరువులే = కట్టెపుల్లలను ఏరుకొను వారే ; రోవానులు = ధనికులు.

**లోవాఱిక (తాత్పర్యము) :** వాస్తవముగా ఈ లోకమును నడిపించుచున్నది కవులు, కళాకారులు మఱియు తత్త్వవేత్తలే. పరిపాలకుల పేరుతో ఉన్నవారు వట్టి ద్వారపాలకులు మాత్రమే. ధనికులు కట్టెపుల్లలను ఏరుకొనువారు మాత్రమే.

SUMMARY : It is only artists, poets and philosophers that actually run the world. Those known as rulers are just sentinels, while the rich are only firewood prospectors.

**రాల్మిక వాలు ॥** నడచి నడచి నిలచిపోవు, నడిమేలముగా నొల వొక నాడు

ప్రాఁత గడియారము చొప్పు ; పని సేయింప దాని మరఁ ద్రిప్పు. 4

**మాటల విడఁదీత (పద విభాగము) :** నడచి, నడచి, నిలచి–పోవున్, నడిమేలముగాన్, ఒలవు + ఒక, నాడు, ప్రాఁత, గడియారము, చొప్పు, పని + చేయింపన్, దానిన్, మరన్, త్రిప్పు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నడచి నడచి  ఒకనాడు ఒలవు ప్రాఁత గడియారము చొప్పు నడిమేలముగాన్ నిలచి–పోవున్. దానిన్ పని చేయింపన్ మరన్ త్రిప్పు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నడిమేలముగాన్ = నడుమంతరముగా ; ఒలవు = లోకము ; ప్రాఁత గడియారము చొప్పు = ప్రాఁత గడియారము వైనముగా ; మరన్ త్రిప్పు = చీలను త్రిప్పుము.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : The world runs on and on and finally grinds to a halt sometime like an old wall–clock. You need to turn the key, should you make it work again.

**వెల్మిరిక జంట ||** ఒలవు నుండి పడయవలసినవి, కలవంచుఁ దలఁచినంత కా-

రాకళిల్లదు కాకడ దానిది, రెప్పంబుగా మొత్తంబుగా ; 5

అప్పుకాఁపు నాకళించుకొన నొప్పఁడు సుమి వారకమీవరి. 6

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒలవు, నుండి, పడయన్, వలసినవి, కలవు + అంచున్ (అనుచున్), తలఁచిన + అంత, కారు + ఆకళిల్లదు, కాకడ, దానిది, రెప్పంబుగాన్, మొత్తంబుగాన్, అప్పుకాఁపున్, ఆకళించుకొనన్, ఒప్పఁడు, సుమి, వారకము + ఈవరి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒలవు నుండి పడయన్ వలసినవి కలవు అంచున్ (అనుచున్) తలఁచిన అంత కారు కాకడ దానిది రెప్పంబుగాన్ మొత్తంబుగాన్ ఆకళిల్లదు. వారకము + ఈవరి అప్పుకాఁపున్ ఆకళించుకొనన్ ఒప్పఁడు సుమి.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒలవు నుండి = లోకము నుండి ; పడయన్ వలసినవి = పొందవలసినవి ; కలవు + అంచున్ (అనుచున్) = ఉన్నవి అనుచు ; తలఁచిన + అంత కారు = అనుకొన్నంత కాలము ; ఆకళిల్లదు = బోధపడదు ; కాకడ దానిది = దాని తత్త్వము ; రెప్పంబుగాన్ = సంపూర్ణముగా ; అప్పుకాఁపున్ = అప్పుపడ్డవానిని ; ఆకళించుకొనన్ = అర్థము చేసికొనుటకు ; ఒప్పఁడు సుమి = అంగీకరింపఁడు సుమా ; వారకము + ఈవరి = ఋణదాత (అప్పిచ్చినవాఁడు).

**లోవాఱిక (తాత్పర్యము) :** "లోకము నుండి మనకేదో కావలె, దాని నుండి మనమేదో గుంజుకొనవలె" నని భావించినంత కాలము మనకు లోకతత్త్వము పూర్తిగా బోధపడదు. అట్లు భావించుచున్నాము అనఁగా లోకము మనకేదో ఋణపడినట్లు ఆలోచించుచున్నామన్నమాట. అందువలన అప్పిచ్చినవాని మనస్తత్త్వము మనలో చొఱఁబాఱినదన్నమాట. అప్పిచ్చినవాఁడు అప్పు దీసికొన్నవానిని ఎందుకు అర్థము చేసికొనును?

SUMMARY : We cannot fully make sense of the nature of the world as long as we think that it owes us something. The thought promotes the mentality of a creditor in us. Why would a creditor ever try to understand a debtor?

**రాల్మిక జంట ||** చెరి యెఱిమిటి ముందంజయు, నిచ్చు బాసట యిరువుఱకు ;

ఒకఱికిఁ జెందినవారికి, నందఱకుఁ జెందువారికి ; 7

తక్కినవారికిఁ దప్పవు తమ తంటాలెప్పటి వలె. 8

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెరి, ఎఱిమిటి, ముందంజ + ఉన్, ఇచ్చున్, బాసట, ఇరువుఱకున్, ఒకఱికిన్, చెందిన–వారికిన్, అందఱకున్, చెందు–వారికిన్, తక్కిన–వారికిన్, తప్పవు, తమ, తంటాల్ ఎప్పటి, వలెన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చెరి ఎఱిమిటి ముందంజ + ఉన్ ఇరువుఱకున్ బాసట ఇచ్చున్. ఒకఱికిన్ చెందిన–వారికిన్, అందఱకున్ చెందు–వారికిన్. తక్కిన–వారికిన్ తమ తంటాల్ + ఎప్పటి వలెన్ తప్పవు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చెరి = ప్రతి ; ఎఱిమిటి ముందంజ + ఉన్ = వైజ్ఞానిక పురోగతి కూడ ; బాసట = సహాయమును ; ఇరువుఱకున్ = ఇద్దఱికి.

**లోవాఱిక (తాత్పర్యము) :** లోకములో ప్రతి వైజ్ఞానిక పురోగతియు ఇద్దఱికి మాత్రమే మిక్కిలి సహాయకారిగా ఉండును. ఒకఱు – ఒక్కఱికే చెంనవారు. రెండవ వారు – అందఱికిని చెందినవారు. కాని ఇతరులకు మటుకు తమ కష్టములు తమకు ఎప్పటి వలెనె తప్పవు.

**పైమాల విడఁబఱు (విశేష వివరణము) :** అందఱికిని చెందినది ప్రభుత్వము.

SUMMARY : Every scientifc breakthrough in the world largely helps only two sets of people. One – those belonging to one person each. Two – those belonging to all. The rest are condemned to their trials and tribulations as usual.

**రాల్మిక వాలు** ‖ ఒలవంతటికిని గెళవౌ, నొక్క పైదలికై మగవాఁడు ;
ఒల వొకఁ డామతించి యిడు, నొక మగవాని కొఱకుఁ బైదలి. 9

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒలవు + అంతటికిని, కెళవు + ఔన్, ఒక్క, పైదలికై, మగవాఁడు, ఒలవు + ఒకఁడు + ఆమతించి, ఇడున్, ఒక, మగవాని, కొఱకున్, పైదలి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మగవాఁడు ఒక్క పైదలికై ఒలవు అంతటికిని కెళవు ఔన్. పైదలి ఒక మగవాని కొఱకున్ ఒలవు ఒకఁడు ఆమతించి ఇడున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒలవు = ప్రపంచము ; కెళవు + ఔన్ = దూరమగును ; పైదలికై = స్త్రీ కోసము ; ఒలవు + ఒకఁడు = ప్రపంచమొకటి ; ఆమతించి ఇడున్ = సృష్టించి పెట్టును.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక్క స్త్రీ కోసమై మగవాఁడు మొత్తము ప్రపంచమునకే దూరమైపోవును. కాని ఒక్క మగవాని కోసమై స్త్రీ ఒక ప్రపంచమునే సృష్టించి ఇచ్చును.

SUMMARY : Man distances himself from the entire world for the sake of just one woman. But woman creates a whole world for the sake of just one man.

*(Household life is a distinct world by itself apart from the world outside).*

**గోరంటిక జంట** ‖ మెండీడవచ్చు నెవ ఱెవఱినేనియు ; చెండాడవచ్చు చీల్చి యెవఱినేనియు ;
బుఱదఁ జల్లవచ్చు నెవఱిపై నేనియు ; బొగ్గుఁ బులుమవచ్చు నెవ్వారికేనియు ; 10
ఎగతాళి సేయవచ్చు నెవ్వఱి నేనియు ; కడిఁది వారి నాకళించుకొనుట మటుకు ;
కడగండి వారల యిరవున నుండుటకు ; ఎఱుంగరు మించి తమ పూడపోటునకు. 11

**మాటల విడఁదీత (పద విభాగము) :** మెండీడన్ + వచ్చున్, ఎవఱు, ఎవఱిన్ + ఏనియున్, చెండాడన్ + వచ్చున్, చీల్చి, ఎవఱిన్ +

ఏనియున్, బుఱదన్, చల్లన్ + వచ్చున్, ఎవఱిపైన్ + ఏనియున్, బొగ్గున్, పులుమన్, వచ్చున్, ఏ + వారికిన్ + ఏనియున్, ఎగతాళి + చేయన్ + వచ్చున్, ఎవ్వఱిన్ + ఏనియున్, కడిఁది, వారిన్, ఆకళించుకొనుట, మటుకున్, కడగండి, వారల, ఇరవునన్, ఉండుటకున్, ఎఱుంగరు, మించి, తమ, పూడ-పోటునకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎవఱు ఎవఱిన్ ఏనియున్ మెండీడన్ వచ్చున్. (ఎవఱు) ఎవఱిన్ ఏనియున్ చీల్చి చెండాడన్ వచ్చున్ (ఎవఱు) ఎవఱిపైన్ ఏనియున్ బుఱదన్ చల్లన్ వచ్చున్. (ఎవఱు) ఏ వారికిన్ ఏనియున్ బొగ్గున్ పులుమన్ వచ్చున్. (ఎవఱు) ఎవ్వఱిన్ ఏనియున్ ఎగతాళి చేయన్ వచ్చున్. వారిన్ ఆకళించుకొనుట మటుకున్ కడిఁది. వారల ఇరవునన్ ఉండుటకున్ కడగండి. తమ పూడ-పోటునకున్ మించి (మంది) ఎఱుంగరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మెండీడన్ + వచ్చున్ =విమర్శింప వచ్చును ; చెండాడన్ + వచ్చున్ = బంతి ఆడవచ్చును ; ఎవ్వారికిన్ + ఏనియున్ = ఎవఱికైనను ; కడిఁది = కష్టము ; ఆకళించుకొనుట మటుకు = అర్థము చేసికొనుట మాత్రము ; కడగండి = ఇబ్బంది ; వారల ఇరవునన్ = వారి స్థానములో ; పూడ-పోటునకున్ = ముడ్డినొప్పికి.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఎవఱు ఎవఱినైనను విమర్శింప వచ్చును. ఎవఱు ఎవఱినైనను చీల్చి చెండాడవచ్చును. ఎవఱు ఎవఱి మీఁద నైనను బుఱద చల్లవచ్చును. ఎవఱు ఎవఱికైనను బొగ్గు పులుమవచ్చును. ఎవఱు ఎవఱినైనను ఎగతాళి చేయవచ్చును. వారిని అర్థము చేసికొనుట మటుకు చాల కష్టము. వారి స్థానములో తాము ఉండుట ఇంకను కష్టము. సామాన్య జనమునకు తమ ముడ్డినొప్పి ఒకటియే ఎఱుక. అంతకు మించి ఇంకేమియు తెలియదు.

**పైమాల విడఁబఱ్చు (విశేష వివరణము) :** (౧) మెండీడు అన్నది వాస్తవముగా ఒక నామవాచకము (noun). చూపుడు వ్రేలు అని అర్థము. దానినే క్రియాపదము (verb) గా ఎసవాడినప్పుడు విమర్శించుట అన్న అర్థము వచ్చును. మరల దీని భావార్థకము మెండీట = విమర్శ ; మెండీటరి = విమర్శకుఁడు.

(౨) చెండు = బంతి ; చెండు + ఆడు = చెండాడు = బంతాట ఆడుట.

SUMMARY : Anyone may criticize anyone. Anyone may flay anyone. Anyone may sling mud on anyone. Anyone may paint anyone in black. Anyone may deride anyone. But it is way hard to understand others properly. Still harder to place themselves in their position and view things from their perspective. Lay people don't know anything but their own pain in the ass.

**వెల్మిరిక జంట** || తోడుమాలు నెక్కటి బవరము, సేఁగికా నది బలుదెప్పరము ;
గెల్వాను కామియే కా దది, పొలివాన్ పరిదూఱుపాదు నౌ ; 12
వంద మందికై పోరవలెన్, ససైక మొక ౨ ఐఁదుగుఱైనన్ ;
వారికి వెన్నుదన్ను కావలె, ససైక మిఱువది మంది యొరులె. 13

**మాటల విడఁదీత (పద విభాగము) :** తోడుమాలు + ఎక్కటి, బవరము, సేఁగికాన్ + అది, బలు-దెప్పరము, గెల్వాను, కామి +ఏ, కాదు + అది, పొలివాన్, పరి-దూఱుపాదున్ + ఔన్, వంద-మందికై, పోరన్ + వలెన్, ససైకము + ఒక, ఐఁదుగుఱు + ఐనన్, వారికిన్, వెన్ను-దన్ను, కావలెన్, ససైకము + ఇఱువది-మంది, ఒరులె.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తోడుమాలు ఎక్కటి బవరము సేఁగికాన్. అది బలు-దెప్పరము. అది గెల్వాను కామి +ఏ కాదు పొలివాన్, పరి-దూఱుపాదున్ ఔన్. వంద-మందికై ససైకము ఒక ఐఁదుగుఱు ఐనన్ పోరన్ వలెన్. ససైకము + ఇఱువది-మంది ఒరులె వారికిన్

వెన్ను-దన్ను కావలెన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తోడుమాలు = సహకారము లేని ; ఎక్కటి బవరము = అసహాయ పోరు ; సేఁగికాన్ = నష్టదాయకము ; బలు-దెప్పరము = బహు ప్రమాదకరము ; గెల్వాను = విజయవంతము ; కామి + ఏ కాదు = కాకపోవుటయే కాదు ; పొలివాన్ = నాశనకారి ; పరి-దూఱుపాదున్ = జన నిందాస్పదము కూడ ; ఔన్ = అగును ; సనైకము = కనీసము ; వెన్ను-దన్ను = సమర్థన ; ఒరులె = వేఱేవారే.

**లోవాటిక (తాత్పర్యము) :** ఎవఱును తోడుగా రాని అసహాయ పోరాటము నష్టదాయకమును, బహు ప్రమాదకరమును అయి ఉన్నది. అది నాశనకారి అగుటయే కాక, ప్రజల చేత తప్పుబట్టఁబడునది కూడ. వందమంది కోసము పోరాడుటకు — ఆ వందమందిలో కనీసము ఐదు గుఱైనను ముందుకు రావలెను. ఆ అయిదుగుఱికి కనీసము మఱొక ఇరువదిమంది బయటివారు బాసటగా నిలువ వలెను. ("లేనిచో ఆ పోరాటము దండుగ" అని కవి భావము).

SUMMARY : Fighting a lonely battle is fraught with losses and grave dangers. It is reprehensible in the eyes of the public, besides being destructive. In order to fight on behalf of one hundred people, at least 5 people should come forward from their ranks. And these 5 must be assisted by at least 20 others from outside. Then only the fight will be successful.

**పస్పియ జంట ||** ఓటమియే తఱచు మంచివారికి ; గెలువ మెన్నరించుఁ జెడ్డవారిని ;
తమ డెంద మెఱుక మంచివారికిన్ ; మంది డెంద మెఱుక చెడ్డవారికి ; 14
నిక్కము లెఱుంగుదురు మంచివారు ; చౌక ట్లెఱుంగుదురు చెడ్డవారు. 15

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఓటమి + ఏ, తఱచు, మంచి-వారికిన్, గెలువము + ఎన్నరించున్, చెడ్డ-వారినిన్, తమ, డెందము + ఎఱుక, మంచి-వారికిన్, మంది-డెందము + ఎఱుక, చెడ్డ-వారికిన్, నిక్కములు + ఎఱుంగుదురు, మంచి-వారు, చౌకట్లు + ఎఱుంగుదురు, చెడ్డ-వారు.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** మంచివారికిన్ ఓటమి + ఏ తఱచు. గెలువము చెడ్డవారినిన్ ఎన్నరించున్. మంచివారికిన్ తమ డెందము ఎఱుక. చెడ్డవారికిన్ మంది-డెందము ఎఱుక. మంచివారు నిక్కములు ఎఱుంగుదురు. చెడ్డవారు చౌకట్లు ఎఱుంగుదురు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గెలువము = గెలుపు/విజయము ; ఎన్నరించున్ = వరించును ; డెందము = హృదయము ; ఎఱుక = విదితము (తెలుసు) ; మంది-డెందము = ప్రజల హృదయము ; నిక్కములు సత్యములు ; చౌకట్లు = నియమములు.

**లోవాటిక (తాత్పర్యము) :** లోకమున మంచివారికి తఱచుగా ఓటములే ఎదురగును. గెలుపులు ఎక్కువ పాలు చెడ్డవారినే వరించును. ఇందుకు కొన్ని కారణములు కలవు. వాటిలో ముఖ్యమైనవి ఏమనఁగా — మంచివారికి తమ హృదయము మాత్రమే తెలియును. చెడ్డవారికి జనముల హృదయము కూడ తెలియును. మంచివారికి నిజములు మాత్రమే తెలియును. చెడ్డవారికి ఆట నియమములు కూడ తెలియును.

SUMMARY : Good ones in the world often face defeats only while the wicked have wins mostly. A few factors account for this phenomenon, the critical ones among them being — 1. Good ones know only their own heart, while the wicked know the people's heart too. 2. Good ones know only the facts and truths, while the wicked know the rules of the game as well.

**వెల్మిరిక ||** నిమ్మళపుఁ బోర్బైలు కూటము ; ఇచటఁ గటికతనంబులె తప్ప,

నెందు కుండును గనికరంబులు ? ఏమరితివో నీ తల తెగున్. 16

**మాటల విడఁదీత (పద విభాగము) :** నిమ్మళపుం, పోర్ + బైలు, కూటము, ఇచటన్, కటికతనంబులె, తప్పన్, ఎందుకున్ + ఉందును, కనికరంబులు, ఏమరితివో, నీ, తల, తెగున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కూటము నిమ్మళపుం పోర్ + బైలు. ఇచటన్ కటికతనంబులె తప్పన్ కనికరంబులు. ఎందుకున్ ఉండును? ఏమరితివో నీ తల తెగున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నిమ్మళపుం పోర్ + బైలు = నిశ్శబ్ద యుద్ధరంగము ; కూటము = సమాజము ; కటికతనంబులె తప్పన్ = కసాయితనములే తప్ప ; కనికరంబులు = కారుణ్యములు ; ఏమరితివో = ఆద మఱచితినావా.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఈ సమాజము ఒక నిశ్శబ్ద రణరంగము. ఇక్కడ ప్రతి ఒక్కఱును పైకి మౌనముగా ఉన్నను తమ లోలోపల ఎవటి–తోనో దేనితోనో పోరాడుచుందురు. ఇటువంటి యుద్ధభూమిలో తోడి మానవుల పట్ల కసాయితనమే తప్ప కారుణ్యమెట్లు పొడసూపును? కనుక ఈ యుద్ధరంగములో తిరుగునప్పుడు నీ జాగ్రత్తలో నీవుండుము. ఏమరుపాటుగా ఉన్నావో నీ తల తెగును. (ఎవఁడో ఒకఁడు వచ్చి నీ తల నరుకవచ్చు నని భావము).

SUMMARY : This society is a silent battlefield where every one fights someone or something inside of their minds. In a battlefield such as this, you only come across butcherhood but not mercy. Therefore you need to be on your own guard. Your head will roll down if you are not alert.

**వాఱిద జంట** ॥ పదుగుఱ వెంటఁగొని యే పనియైనఁ జేయవచ్చును ;
మూఁ డల్లు లుటంకించి యే పనినైనఁ జేయింప నగు ;
ఒక చౌకట్టుఁ జూపి యే పనికైన నొప్పింపఁజను ;
రెండు కటుములు సెప్పి యే పనినైనఁ బొగిడింపఁదగు ; 17
వెన్నుదన్నులకే గాని మంచి-చెడుల విడఁగాంచిక-
కించు కైనను జోటేదీ యీ రెంచాది కఱదలోన్? 18

**మాటల విడఁదీత (పద విభాగము) :** పదుగుఱన్, వెంటన్ + కొని, ఏ, పని + ఐనన్, చేయన్ + వచ్చును, మూఁడు + అల్లులు + ఉటంకించి, ఏ, పనిన్ + ఐనన్, చేయింపన్ + అగున్, ఒక, చౌకట్టున్ + చూపి, ఏ, పనికిన్ + ఐనన్, ఒప్పింపన్ + చనున్, రెండు, కటుములు + చెప్పి, ఏ, పనిన్ + ఐనన్, పొగిడింపన్ + తగున్, వెన్ను–దన్నులకే, కాని, మంచి–చెడుల, విడఁగాంచికకున్ + ఇంచుక + ఐనను, చోటు + ఏదీ, ఈ, రెంచాది–కఱదలోన్?

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఈ రెంచాది–కఱదలోన్ వెన్ను–దన్నులకే కాని మంచి–చెడుల విడఁగాంచికకున్ ఇంచుక ఐనను చోటు + ఏదీ? (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వెంటన్ + కొని = తన వెంట తీసికొని పోయి ; అల్లులు = పద్యములను ; ఉటంకించి = ఉదాహరించి ; చౌకట్టున్ = నియమమును ; కటుములు = సూత్రములను ; వెన్ను–దన్నులకే కాని = జన సమర్థనలకే తప్ప ; మంచి–చెడుల విడఁగాంచికకున్ = సదసద్ విచక్షణకు ; ఇంచుక + ఐనను = కొంచెమైనను ; రెంచాది–కఱదలోన్ = మానవాళి బుద్ధిలో?

**లోవాఱిక (తాత్పర్యము) :** ఈ సమాజములో పదిమందిని వెంటఁబెట్టుక పోయి ఏ పని అయినను చేయవచ్చును. మూఁడు పద్యములను ప్రమాణముగా ఉదాహరించి జనము చేత ఏ పని అయినను చేయింపవచ్చును. ఒక చట్టమునో నియమమునో చూపించి వారిని ఏ పనికై–

నను ఒప్పించవచ్చును. రెండు సూత్రాలు చెప్పి ఏ పనినైనను వారి చేత "ఆహా ఓహో" అని పొగిడింప వచ్చును. ఇట్లు మూఁకల సమర్థన, పుస్తక సమర్థన, ప్రభుత్వ సమర్థన మొదలైన సమర్థనలకే తప్ప యథార్థమైన మంచి-చెడుల విచక్షణకు ఈ మానవజాతి బుద్ధిలో చోటేదీ?

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** నిజమైన ధర్మచింతన సమాజ పోకడలతో అన్ని వేళలా సంవదింపదని కవిహృదయము.

SUMMARY : In this society, you may do any deed if you are accompanied by 10 people. You may have others do anything if you can quote 3 verses (from holy books). You may persuade people to do anything if you can cite a law or rule. You can make them praise any deed by mentioning a couple formulae. Thus, only the things like popular support, religious support, literary support, legal support etc have a place in the mind of the humanity. But where is room for true discretion on good and bad?

**పస్సియ జంట ||** "కడిఁది, కడిఁది" ౨ అని కాఱు లఱచెదరు ; "కాసంత తేలిక కావలె" నండ్రు ;
నిక్క మసివంద మెవఱు మెచ్చెదరు? జిలుగు సేసెడి దనుకఁ గూర్కుదీయరు ; 19
"పటారము నసివందరము నొకచోఁ, గూడు గట్టుకొని యుండ" వన వినరు ;
సపారముల్ గావు గుడిసె పోలికలు ; చప్పునఁ దెలియవు మేలిమి పలుకులు. 20

**మాటల విడఁదీత (పద విభాగము) :** కడిఁది, కడిఁది, అని, కాఱులు + అఱచెదరు, కాసు + అంత, తేలిక, కావలెన్ + అండ్రు, నిక్కము + అసివందము + ఎవఱు, మెచ్చెదరు జిలుగు + చేసెడి, దనుకన్ + కూర్కు, తీయరు, పటారమున్ + అసివందరమున్ + ఒకచోన్, గూడు, కట్టుకొని, ఉండవు + అనన్, వినరు, సపారముల్, కావు, గుడిసె, పోలికలు, చప్పునన్ + తెలియవు, మేలిమి=పలుకులు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** సపారముల్ కావు గుడిసె పోలికలు కావు. మేలిమి-పలుకులు చప్పునన్ తెలియవు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కడిఁది కడిఁది అని = కష్టము, కష్టము అని ; కాఱులు + అఱచెదరు = ఆక్రోశించెదరు ; కాసు + అంత = కొంచెము : అండ్రు = అందురు : నిక్కము + అసివందము = నిజమైన నిరాడంబరతను ; జిలుగు + చేసెడి దనుకన్ = సంక్లిష్టముగా చేయునంత వరకు ; కూర్కు తీయరు = నిద్రపోరు ; పటారమున్ = ఆడంబరమును ; అసివందరమున్ = నిరాడంబరత కూడ ; ఒకచోన్ = ఒకే చోట ; అనన్ = అనఁగా ; సపారముల్ = సౌధములు ; గుడిసె పోలికలు = గుడిసెలను పోలినవి ; చప్పునన్ = వెనువెంటనే ; తెలియవు = అర్థము కావు ; మేలిమి-పలుకులు = సుభాషితములు.

**లోవాఱిక (తాత్పర్యము) :** జనమునకు ఏ క్రొత్త విషయమును నేర్పుదమన్నను, "అమ్మో కష్టము, కష్టము" అని ఆక్రోశించెదరు. ఒకవేళ నిజముగా ఒక విషయము మిక్కిలి సరళమైనచో అది ఎవఱికి నచ్చును? సరళమైన/ నిరాడంబరమైన విషయములను సైతము సంక్లిష్టముగా మార్చునంత వరకు జనము నిద్రపోరు. (మచ్చునకు – పెండ్లిండ్లు). "ఆడంబరమును, సులభత్వమును ఒకే చోట కలసి కాపరముండఁజాలవు నాయనా!" అని చెప్పఁగా వినిపించుకొనరు. మేడలు గుడిసెల వలె సరళము కావు. మేడలు మేడలే. గుడిసెలు గుడిసెలే. మంచి మాటలు ఎవఱికిని తొందఱగా అర్థము కావు. (మంచిమాటలు మేడల వంటివి అని భావము).

SUMMARY : Folks loudly complain of difficulty when a new thing is introduced to them. But who likes it if something is really simple and easy? They won't rest until they render even the simplest things too complicated in the end. (Weddings, for instance). They refuse to listen if told, "*Complexity and simplicity/ easiness cannot ever coexist.*" Palaces cannot be as simple as huts. Palaces are palaces and huts and huts only. No one gets good counsels that quick.

(Good counsels are just like palaces).

**పస్పియ ॥** అవ్వాడెదరు పసరముల పేరన్ ; రెంచల సీదనములు గల వేడన్,
గొంచెమ్మైనను బసరములలోన్ ? తిట్టుకొనునొ ౨ అవి రెంచల పేరన్? 21

**మాటల విడఁదీత (పద విభాగము) :** అవ్వ + ఆడెదరు, పసరముల, పేరన్, రెంచల, సీదనములు, కలవు + ఏడన్ + కొంచెము + ఐనను + పసరములలోన్, తిట్టుకొనునొ, అవి, రెంచల, పేరన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పసరముల పేరన్ అవ్వ ఆడెదరు. రెంచల సీదనములు కొంచెము ఐనను పసరములలోన్ ఏడన్ కలవు? అవి రెంచల పేరన్ తిట్టుకొనునొ?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అవ్వ + ఆడెదరు = నిందించుకొందురు (నేఱ మోపకములు చేసికొందురు) ; పసరముల పేరన్ = జంతువుల పేరుతో ; రెంచల = మానవుల యొక్క : సీదనములు = దుర్గుణములు : కలవు = ఉన్నవి : ఏడన్ = ఎక్కడ.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనుష్యులు ఒండొరులను జంతువుల పేర్లుపెట్టి తిట్టుకొనుచుందురు. ("ఓరీ కుక్కా ! నక్కా ! పందీ ! గాడిదా ! ఎద్దూ ! మొద్దూ ! దున్నపోఁతా !" ఇత్యాది). కాని మనుష్యులలో ఉన్నన్ని దుర్గుణములు జంతువులలో ఎక్కడ ఉన్నవి? అందుచేత బహుశ జంతువులు కూడ తమలో తాము తిట్టుకొనునప్పుడు "ఓరీ మనిషీ !" అని తిట్టుకొనునేమో?

SUMMARY : Humans scold one another in the name of animals. But where are the typical human foibles in animals? So, maybe animals too scold one another in the name of the human being. *("You dirty human... You are a faithless human in the form of a dog... etc).*

**గోరంటిక ॥** మీసరపు మేల్బారులమై మొదలయ్యు, నీసడించుకొనఁబడు నన్ని మేహాలీలుఁ
బ్రెమ్మాటములన్ బ్రెను తటమటంబులన్, దొమ్మీలఁ గ్రమీలఁ దంప్రీల వలనన్. 22

**మాటల విడఁదీత (పద విభాగము) :** మీసరపుం, మేల్బారులమైన్, మొదల్ + అయ్యున్, ఈసడించుకొనన్ + పడున్ + అన్ని, మేహాలీలున్ + ప్రెమ్మాటములన్ + ప్రెను, తటమటంబులన్, దొమ్మీలన్ + క్రమీలన్ + తంప్రీల, వలనన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** అన్ని మేహాలీలున్ మీసరపుం మేల్బారులమైన్ మొదల్ అయ్యున్ ప్రెమ్మాటములన్ ప్రెను తటమటంబులన్ దొమ్మీలన్ క్రమీలన్ తంప్రీల వలనన్ ఈసడించుకొనన్ పడున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మీసరపుం = శ్రేష్ఠమైన ; మేల్బారుల మైన్ = ఆదర్శములతో ; మొదల్ + అయ్యున్ = మొదలైనప్పటికిని ; ఈసడించుకొనన్ + పడున్ = ఏవగించుకొనఁబడును ; అన్ని మేహాలీలున్ = అన్ని ఉద్యమములు కూడ ; ప్రెమ్మాటములన్ = రాజకీయముల వలన ; ప్రెను తటమటంబులన్ = మోసముల వలన ; దొమ్మీలన్ = కొట్టుక చచ్చుట వలన ; క్రమీలన్ = హత్యల వలన ; తంప్రీల వలనన్ = వ్యాజ్యముల వలన.

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రజా ఉద్యమములన్నియు ముందు మంచి ఉన్నతాదర్శములతోనే మొదలైనను – లోలోపలి రాజకీయముల వలనను, మోసములకు పాల్పడుట వలనను, ఉద్యమ నాయకులు తమలో తాము కొట్టుక చచ్చుట వలనను, హత్యాకాండల వలనను, కోర్టు–కేసుల వలనను అభాసుపాలై చివరికి ప్రజల చేత ఛీకొట్టఁబడును.

SUMMARY : Though all public movements are launched initially with lofty ideals, they will ultimately run afoul of people and are loathed by them on account of the internal politics, frauds, internecine squabbles, murders and lawsuits of the latter days.

**గోరంటిక జంట** ॥ ఒక్కఁఉ సేయనీ, ఇరువుఁఉ సేయనీ, పదుగుఁఉ సేయనీ, పాతిక సేయనీ ;
తప్పు తప్పే యెప్పుడుఁ దప్పకుండన్ ; తప్పించుకొనఁ జాలరు తరుకౌటలన్ ; 23
వేనూర్వుఁఉ వెరసు నంజముఁ ద్రావన్, వికానువిల్ల దది తీయ సమ్మైమిగాన్. 24

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒక్కఁఉ + చేయనీ, ఇరువుఁఉ + చేయనీ, పదుగుఁఉ + చేయనీ, పాతిక + చేయనీ, తప్పు, తప్పే, ఎప్పుడున్, తప్పకుండన్, తప్పించుకొనన్ + చాలరు, తరుకౌటలన్, వేనూర్వుఁఉ, వెరసు, నంజమున్, త్రావన్, వికానువిల్లదు + అది, తీయ, సమ్మైమిగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒక్కఁఉ చేయనీ. ఇరువుఁఉ చేయనీ. పదుగుఁఉ చేయనీ. పాతిక చేయనీ. తప్పు తప్పే తప్పకుండన్. తరుకౌటలన్ తప్పించుకొనన్ చాలరు. వేనూర్వుఁఉ వెరసు నంజమున్ త్రావన్ అది తీయ సమ్మైమిగాన్ వికానువిల్లదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పాతిక = పాతిక మంది (ఇరువది ఐదుగుఁఉ) ; తరుకౌటలన్ = పర్యవసానములను ; వేనూర్వుఁఉ వెరసు = లక్ష సంఖ్యాకులు ; నంజమున్ = విషమును ; త్రావన్ = త్రాఁగఁగా ; వికానువిల్లదు = రూపాంతరము చెందదు ; అది = ఆ విషము ; తీయ సమ్మైమిగాన్ = మధురమైన అమృతముగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** తప్పును ఒకఁఉ చేసినను అంతకంటె ఎక్కువమంది చేసినను అది తప్పే. ఎక్కువమంది చేసినంత మాత్రాన అది ఒప్పయిపోదు. (క్షమింపఁబడదు). అది చేసినవారు దాని పర్యవసానముల నుండి తప్పించుకొనలేరు. లక్షమంది ఒకేసారి విషమును త్రాఁగినంత మాత్రాన అది తీయని అమృతముగా మారిపోదు కదా.

**వైమాల విడఁబఱు (విశేష వివరణము) :** (౧) వేనూఁఉ = లక్ష. (౨) వెరసు = సంఖ్య.

(౩) వికానువు = రూపాంతరము. (← విడి +కానువు = వేఱే రూపము. ఇదే ఆద్యక్షర శేషము చేత వికానువు).

SUMMARY : A wrong is a wrong, no matter whether it was committed by just one or many. It will not make a right, (nor is it forgiven) just because several people resorted to it. They cannot get away from the consequences of their actions. Will poison become sweet ambrosia just because one lakh people gulped it at a time? (One lakh = 100,000).

**గోరంటిక జంట** ॥ మొండివాఁడు ఱేని కంటెఁ బోతరవాన్, మూఁకలు దొరతనమున కంటె బ్రోమువాన్,
ఒడికారి లెంకోరు కంటెను బ్రుంకాన్ ; ఆడుపొగులు మగకండపై హతరవాన్ ; 25
పస గల కడఁదేల్మల కంటె లేనివియె, యిను-చల్లజంపు లిను-మెడవంచువులున్. 26

**మాటల విడఁదీత (పద విభాగము) :** మొండివాఁడు, ఱేని కంటెన్, పోతరవాన్, మూఁకలు, దొరతనమున కంటెన్, బ్రోమువాన్, ఒడికారి, లెంకోరు కంటెను, బ్రుంకాన్, ఆడు–పొగులు, మగ–కండపైన్, హతరవాన్, పస, కల, కడఁదేల్మల కంటెన్, లేనివియె, ఇను–చల్లజంపుల్ + ఇను–మెడ–వంచువులున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఱేని కంటెన్ = రాజున కన్న ; పోతరవాన్ = బలవంతుఁడు ; దొరతనమున కంటెన్ = ప్రభుత్వమున కన్న ; బ్రోమువాన్ = శక్తిమంతము ; ఒడికారి = ఆవేశపరుఁడు ; లెంకోరు కంటెను = సైన్యము కంటెను ; బ్రుంకాన్ = విధ్వంసకారి ; ఆడు–పొగులు = స్త్రీశోకము ; హతరవాన్ = ప్రభావశీలము ; పస కల = సారముఁ గలిగిన ; కడఁదేల్మల కంటెన్ = సిద్ధాంతముల కన్న ; లేని వియె = సారము లేని సిద్ధాంతములే ; ఇను–చల్లజంపుల్ = ఇంకను ఎక్కువ భయంకరములు ; ఇను–మెడ–వంచువులున్ = బల ప్రయో

గులు (బలవంతము చేయునవి).

**లోవాఱిక (తాత్పర్యము) :** మొండివాఁడు రాజున కన్న బలవంతుఁడు. ప్రభుత్వమున కన్న మూఁకలే ఎక్కువ శక్తిమంతము. ఒక పెద్ద సైన్య–మున కన్న ఒక్క ఆవేశపరుఁడే ఎక్కువ విధ్వంసకారి. మగవారి కండల కన్న స్త్రీల శోకమే సమాజమును ఎక్కువ ప్రభావితము చేయును. పస గల సిద్ధాంతముల కన్న పస లేని సిద్ధాంతముల చెలరేఁగుడే ఎక్కువ భయంకరముగాను, బలప్రయోగ పూరితముగాను ఉండును.

SUMMARY: A stubborn soul is stronger than the king. Mobs are more powerful than the go–vernment. An emotionally charged person is more destructive than a whole army. Women's sorrow moves the society more than the male muscle. Meaningless ideologies turn out to be more horrific and coercive than meaningful ones.

**పస్పియ ॥** కొలువలి వాగీటు వేల్పునకు మించి, కలదు చెరివారి కొక తారి జేజి ;
వారలకె లో నెఱుక ౨ అది యేమో ! దాని నేమైన ౨ అను - చంపెదరు నిను. 27

**మాటల విడఁదీత (పద విభాగము) :** కొలువలి, వాగీటు, వేల్పునకున్, మించి, కలదు, చెరి–వారికిన్, ఒక, తారి, జేజి, వారలకె, లోన్, ఎఱుక, అది, ఏమో, దానిన్, ఏమి + ఐనన్, అను, చంపెదరు, నినున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చెరి–వారికిన్ కొలువలి వాగీటు వేల్పునకున్ మించి ఒక తారి జేజి కలదు. అది ఏమో వారలకె లోన్ ఎఱుక. దానిన్ ఏమి ఐనన్ అను. నినున్ చంపెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కొలువలి = మతము ; వాగీటు = వర్ణించునట్టి ; వేల్పునకున్ మించి = దేవుని కంటెను గొప్పదై ; కలదు = ఉన్నది ; చెరి–వారికిన్ = ప్రతివారికిని ; తారి జేజి = సొంత దేవత ; లోన్ = లోపల (మనస్సులో) ; ఎఱుక = తెలియును ; అది ఏమో = "ఆ దేవత ఎవఱు" అన్న విషయము.

**లోవాఱిక (తాత్పర్యము) :** మతము చెప్పునట్టి దేవుఁడు కాకుండ ప్రతి ఒక్కఱి మనస్సులోను తమ తమ సొంత దేవత కూడ ఒకటి ఉన్నది. అది ఏమిటన్నది వారికే తెలియును. మనకు తెలియదు. పొఱఁబాటున దానిని నీవైన అన్నచో వారు నీ మీఁదఁ బడి చంపెదరు.

**వైమాల విడఁబఱ్పు (విశేష వివరణము) :** "అన్ని రకాల వెఱ్ఱి అభిమానములును మతోన్మాదముతో సమానమే" అని కవి భావము.

SUMMARY : Everyone has a personal deity in his/ her mind apart from the commonly known God praised by the religion. In their hearts, it ranks higher than God. They alone know what it is. If you say something about it by mistake, they will kill you.

**పస్పియ జంట ॥** ఏలా మిహికంబుల హోళి పరికి? జాలువాన లవి మిహికము గావో?
చూలుగాఁప మది వాసిమి గాదో? బొక్కినవి బ్రోమగుటరిది గాదో? 28
ఎచ్చట నైన ఱిచ్చకములె కనన్, బుచ్చిపాఁప విచ్చు కనుపాపలన్. 29

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏలా, మిహికంబుల, హోళి, పరికిన్, జాలు–వానలు + అవి, మిహికము, కావో, చూలు–కాఁపము + అది, వాసిమి, కాదో, బొక్కిన + అవి, బ్రోము + అగుట + అరిది, కాదో, ఎచ్చటన్ + ఐనన్, ఱిచ్చకములె, కనన్, బుచ్చి–పాఁప–విచ్చు కను–పాపలన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పరికిన్ మిహికంబుల హోళి ఏలా? జాలు–వానలు అవి మిహికము కావో? చూలు–కాఁపము అది వాసిమి కాదో? బొక్కిన అవి బ్రోము అగుట అరిది కాదో? బుచ్చి–పాఁప–విచ్చు–కను–పాపలన్ కనన్ ఎచ్చటన్ ఐనన్ ఱిచ్చకములె.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఏలా = ఎందుకు ; మిహికంబుల = మహిమల యందు/ మాహాత్మ్యముల యందు ; హాళి = ఆసక్తి ; పరికిన్ = జనమునకు ; జాలు–వానలు = జడిజడిగా కురియు వానలు ; కావో = కావా? ; చూలు–కాఁపము = గర్భవాసము (తల్లికడుపులో బిడ్డ ఉండుట) ; వాసిమి = ఘనత ; కాదో = కాదా? ; బొక్కిన + అవి = ఆబగా తిన్న పదార్థములు ; బ్రోము + అగుట = శక్తిగా మారుట ; అరిది = అపరూపము ; జిచ్చకములె = అద్భుతములే ; కనన్ = చూడఁగా ; బుచ్చి–పాఁప– = బుజ్జిపాఁప యొక్క/ పాఁపని యొక్క ; విచ్చు– = (ఆశ్చర్యముతో) తెఱచుకొన్న.

**లోవాఱిక (తాత్పర్యము) :** జాలుగా కురియు జడివానలు మహిమ కాదా? తల్లికడుపులో బిడ్డ ఉండుట గొప్ప విషయము కాదా? తిన్నవి ఒంటికి ఓపికగా మారుట అపరూపము కాదా? చిన్నపాఁపల/ బాబుల వలె కనులను విప్పార్చి చూచినచో ఈ విధముగా భూమండలము మీఁద ఎల్లెడల మహిమలే మహిమలు కదా ! మఱి జనమెందుకు "ఇంకను ఏవియో మహిమలు కావలె" నని ఎగఁబడుచుందురు?

SUMMARY : Aren't the continuous downpours a miracle? Isn't the baby inside the mother's womb magical? Isn't the food metabolizing into energy marvellous? Thus, isn't the world full of miracles, if viewed with the eyes of a wondering kid?

**పస్నియ జంట** ॥ తఱియ ౨ ఊఱటలె యెప్పటికప్పుడు ; తాముండవు కలకార్ విడఁద్రెంపులు ;
కల్లులకుఁ గలిదముండుఁ గడగండ్లు ; మ్రానులకుఁ గూడ మానవు వనటలు ; 30
కదలిక మాలిన కానసమేటి ? కైపదమాలిక సమా-సరిసాటి ;
మనుకంద మేన నాడునంతలో, మనకుఁ దప్పవు పలుదోము లోలలు. 31

**మాటల విడఁదీత (పద విభాగము) :** తఱియ–ఊఱటలె, ఎప్పటికిన్ + అప్పుడు, తాము + ఉండవు, కలకార్–విడఁద్రెంపులు, కల్లులకున్ + కలిదము + ఉండున్ + కడగండ్లు, మ్రానులకున్ + కూడన్, మానవు, వనటలు, కదలిక, మాలిన, కానసము + ఏటి, కైపద– మాలిక సమా–సరిసాటి, మనుకంద, మేనన్ + ఆడు + అంతలోన్, మనకున్ + తప్పవు, పలు + తోములు + ఓలలున్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ఎప్పటికిన్ అప్పుడు తఱియ–ఊఱటలె. కలకార్–విడఁద్రెంపులు తాము ఉండవు. కల్లులకున్ కలిదము కడగండ్లు ఉండున్. మ్రానులకున్ కూడన్ వనటలు మానవు. కదలిక మాలిన కానసము ఏటి? కైపద–మాలిక సమా–సరిసాటి. మనుకంద మేనన్ ఆడు + అంతలోన్ మనకున్ పలు తోములు ఓలలున్ తప్పవు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తఱియ–ఊఱటలె = తాత్కాలిక ఉపశమనములే ; కలకార్–విడఁద్రెంపులు = శాశ్వత పరిష్కారాలు ; కల్లులకున్ = ఱాలకు ; కలిదము = సైతము ; కడగండ్లు = కష్టములు ; మ్రానులకున్ కూడన్ = పెనుచెట్లకు కూడ ; మానవు = తగ్గవు/ పోవు ; వనటలు = విచారములు ; కదలిక మాలిన = కదలిక లేని ; కానసము = ప్రపంచము ; ఏటి = ఏమిటి/ ఎందుకు ; కైపద–మాలిక = సమస్యలు లేకపోవుట ; సమా–సరిసాటి = చావుతో సమానము ; మనుకంద = ప్రాణము ; మేనన్ = ఒంటిలో ; ఆడు + అంతలోన్ = ఆడుచున్నంత కాలము ; పలు + తోములు = పళ్ళు తోముకొనుట ; ఓలలున్ = స్నానములు కూడ.

**లోవాఱిక (తాత్పర్యము) :** సమస్యలకు ఎప్పటికప్పుడు కలిగింప వలసిన తాత్కాలిక ఉపశమనములే తప్ప శాశ్వత పరిష్కారములు ఉండవు. ఱాలకు సైతము కష్టములుండును. పెద్ద చెట్లకు కూడ విచారములు వదలవు. కదలిక లేనిచో ఇఁక ప్రపంచమేమున్నది? సమస్యలు లేక పోవుట చావుతో సమానము. (సమస్యలు ఉండుటయే జీవలక్షణము). మన శరీరములలో ప్రాణము ఆడుచున్నంత కాలము పళ్ళు తోము–కొనుట, స్నానము చేయుట తప్పవు కదా! సమస్యలు కూడ అటువంటివే నని భావము.

SUMMARY : Issues have only temporary reliefs but no permanent solutions. Rocks have hardships too. Big trees have worries too. What is the world without movement? Absence of

problems equals lifelessness. (Problems signify the vibrancy of life). We have no option but to brush the teeth and to take bath as long as we life pulsates in our bodies. (Problems are just like that).

**పస్సియ మున్నంగి** ॥ రెంచలు చెరిదాని మార్చికొందురు, రెచ్చిపోవుట కొక ప్రెన్నెపముగా ;
సమయువు లన్నింటిని వాడికొందురు చంప వాడుకోలగు కైదువుగా ; 32
మడియువు లొయ్యనఁ జేసికొందురు, చెడు మరగముగా దేనినైన ;
పారికాఁపు లొడ్డారింపఁగలరు, పేరెంచలను గూడఁ బ్రామిఁడిగా ; 33
ఎంచుచుందురు నిలువు లేదియైన, హేనుక బైలాటపు టెస్తలిగా. 34

**మాటల విడఁదీత (పద విభాగము) :** రెంచలు, చెరి–దానిన్, మార్చికొందురు, రెచ్చి-పోవుటకున్, ఒక, ప్రెన్ + నెపముగాన్, సమయువుల్, + అన్నింటినిన్, వాడికొందురు, చంపన్, వాడుకోలు + అగు, కైదువుగాన్, మడియవుల్ + ఒయ్యనన్, చేసికొందురు, చెడు–మరగముగాన్, దేనిన్, ఐనన్, పారి–కాఁపుల్ + ఒడ్డారింపన్ + కలరు, పేరెంచలను, కూడన్, ప్రామిఁడిగాన్, ఎంచుచున్ + ఉందురు, నిలువుల్+ ఏది + ఐనన్, హేనుక–బైలాటపు + ఎస్తలిగాన్.

**చఱమొలి (అన్వయ క్రమము) :** రెంచలు చెరి–దానిన్ రెచ్చిపోవుటకున్ ఒక ప్రెన్ నెపముగాన్ మార్చికొందురు. సమయువుల్ అన్నింటినిన్ చంపన్ వాడుకోలు అగు కైదువుగాన్ వాడికొందురు. మడియవుల్ దేనిన్ ఐనన్ ఒయ్యనన్ చెడు మరగముగాన్ చేసికొందురు. పారి–కాఁపుల్ పేరెంచలను కూడన్ ప్రామిఁడిగాన్ ఒడ్డారింపన్ కలరు. నిలువుల్ ఏది ఐనన్ హేనుక బైలాటపు ఎస్తలిగాన్ ఎంచుచున్ ఉందురు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** రెంచలు = మనుష్యులు ; చెరి–దానిన్ = ప్రతి దానిని ; ప్రెన్ + నెపముగాన్ = పెద్ద సాకుగా ; సమయువుల్ = మర్త్యులు ; చంపన్ = చంపుటకై ; వాడుకోలు + అగు = పనికివచ్చు/ ఉపయోగపడు ; కైదువుగాన్ = ఆయుధముగా ; మడియవుల్ = మర్త్యులు ; ఒయ్యనన్ = నెమ్మదిగా/ క్రమముగా ; చెడు మరగముగాన్ = దుర్ వ్యసనముగా ; పారి–కాఁపుల్ = భూలోకవాసులు ; ఒడ్డారింపన్ + కలరు = ద్వేషింపఁగలరు ; పేరెంచలను కూడన్ = మహాత్ములను కూడ ; ప్రామిఁడిగాన్ = నిర్దయగా ; ఎంచుచున్ + ఉందురు = పరిగణించుచుందురు ; నిలువుల్ = మానవులు ; హేనుక– = అహంకార– ; బైలాటపు = ప్రదర్శనము యొక్క ; ఎస్తలిగాన్ = సాధనముగా .

**లోవాఱిక (తాత్పర్యము) :** మానవులు లోకములోని ప్రతి విషయమును ఆవేశము తెచ్చుకొని రెచ్చిపోవుటకొక సాకుగా మార్చుకొందురు. వారు అన్నింటిని తోడి మానవులను చంపుటకు పనికివచ్చు ఆయుధములుగా వాడుకొందురు. వారు దేని నైనను ఒక చెడ్డ వ్యసనముగా చేసికొందురు. వారు మహాత్ములను సైతము దయాదాక్షిణ్యములు లేకుండ ద్వేషింపఁగలరు. వారు ఏ విషయమునైనను తమ అహంకార–మును చూపుటకై ఉపయోగపడు పనిముట్టుగా తలఁచుచుందురు.

SUMMARY : Humans convert every issue into a pretext for getting provoked/ triggered. They utilize every object as a weapon to kill fellow-humans. They turn everything into an indulgence. They can mercilessly hate great souls too. They take everything as a means to flaunt their egos.

**రాల్మిక వాలు జంట** ॥ కన్నడపా దెడాటములఁ , గడు పెద్దగించుకొని యేడ్తురు ;
కంటగింతురు మొరసుగా, నారుదూఱు సేసెదరు బయలన్ ; 35
చిఱుతటి కడచిన మీఁదటఁ , జీమ చిటుక్కు విలువయుఁ బుటుక్కు. 36

**మాటల విడఁదీత (పద విభాగము) :** కన్నడపాదు + ఎడాటములన్, కదు, పెద్దగించుకొని, ఏడ్తురు, కంటగింతురు, మొరసుగాన్, ఆరు దూఱు + చేసెదరు, బయలన్, చిఱు–తఱి, కడచిన–మీఁదటన్, చీమ, చిటుక్కు, విలువయున్ + పుటుక్కు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కన్నడపాదు ఎడాటములన్ కదు పెద్దగించుకొని ఏడ్తురు. మొరసుగాన్ కంటగింతురు. బయలన్ ఆరు దూఱు చేసెదరు. చిఱు–తఱి కడచిన–మీఁదటన్ చీమ చిటుక్కు. విలువయున్ పుటుక్కు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కన్నడపాదు = ఉపేక్షింపఁదగ్గ ; ఎడాటములన్ = విషయములను ; కదు = మిక్కిలి ; పెద్దగించుకొని = పెద్ద విగా చేసికొని ; కంటగింతురు = ద్వేషించెదరు ; మొరసుగాన్ = మోటుగా ; ఆరుదూఱు = అల్లరి ; బయలన్ = బహిరంగముగా ; చిఱు–తఱి = కాసేఁపు.

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రక్కన పెట్టఁదగిన అముఖ్య విషయములను పెద్ద చేసి (వాటికి ప్రాముఖ్యమును ఆపాదించి) ప్రజలు వాపోయె–దరు. ఎవఱినో కర్కశముగా ద్వేషించెదరు. బట్టబయలుగా అల్లరి చేసెదరు. కాసేఁపు కడచిన తర్వాత ఏమియు ఉండదు. చీమ చిటుక్కు మన్నంత నిశ్శబ్దము. ఆ పెద్ద చేయఁబడ్డ విషయమునకు కూడ విలువ పుటుక్కున (తొందఱగా) తెగిపోవును.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ప్రజలందఱును ఒకచోటఁ జేరి గగ్గోలుగా అఱచినంత మాత్రాన విలువ లేని విషయములకు దీర్ఘ–కాలికముగా విలువ ఏర్పడదని భావము.

SUMMARY : Folks lament over negligible things, having unduly magnified them. They hate someone hard and make a public commotion. But after a while, there will be deafening silen–ce with the seriousness of the issue vanishing into thin air.

*(Unimportant things cannot become important just because folks gather in mobs and shout).*

**పస్నియ మున్నంగి** ॥ వెంగలితన "మిల్వరుసఁ బిమ్మటుల్, తొంగలింపవలె నచ్చుమచ్చుగాఁ ,
దమ వలెనే" ౨ అని లోఁ దమించుటల్ ; ఒదవులనే తక్క నెదలందు హుళకి, 37
తండ్రి-తాత-కొడుకు-మనుమ పోలికి ; పల్లమేఁగుటె సెలయేటి యాలుడి ;
పల్లపు నీటఁ బొడమిన యావిరికిఁ , బైకిఁ బోవుటయె నిక్కపుఁ బోకిడి ; 38
ఆవిరిఁ బుట్టు మబ్బుల కన్నన్ో ౨ , అడుగునకుఁ గురియుటయె కాకడ ;
పోలిక లేమున్నవి తామిక్కడ? 39

**మాటల విడఁదీత (పద విభాగము) :** వెంగలితనము + ఇల్వరుసన్, పిమ్మటుల్, తొంగలింపన్ వలెన్, అచ్చు–మచ్చుగాన్, తమ వలెనే, అని, లోన్ + తమించుటల్, ఒదవులన్ + ఏ, తక్కన్, ఎదలందున్, హుళకి, తండ్రి–తాత–కొడుకు–మనుమ–పోలికి, పల్లము + ఏఁగుటె, సెల–ఏటి + ఆలుడి, పల్లపుం నీటన్ + పొడమిన + ఆవిరికిన్ + పైకిన్ + పోవుటయె, నిక్కపుం + పోకిడి, ఆవిరిన్, పుట్టు, మబ్బులకున్, అన్ననో, అడుగునకున్, కురియుటయె, కాకడ, పోలికలు, ఏమి + ఉన్నవి, తాము + ఇక్కడ?

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఇల్వరుసన్ పిమ్మటుల్ అచ్చు–మచ్చుగాన్ తమ వలెనే తొంగలింపన్ వలెన్ అని లోన్ తమించుటల్ వెంగలితనము. ఒదవులన్ + ఏ, తక్కన్ తండ్రి–తాత–కొడుకు–మనుమ–పోలికి ఎదలందున్ హుళకి. పల్లము ఏఁగుటె సెల–ఏటి ఆలుడి. పల్లపుం నీటన్ పొడమిన ఆవిరికిన్ పైకిన్ పోవుటయె నిక్కపుం పోకిడి. ఆవిరిన్ పుట్టు మబ్బులకున్ అన్ననో అడుగునకున్ కురియుటయె కాకడ. పోలికలు తాము ఇక్కడ ఏమి ఉన్నవి?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వెంగలితనము = వెఱ్ఱితనము ; ఇల్వరుసన్ = వంశములో ; పిమ్మటుల్ = తరువాతివారు ; తొంగలింపన్ వలెన్ = ప్రకాశింపవలె ; అచ్చు–మచ్చుగాన్ = పూర్తిగా అదే విధముగా ; లోన్ = మనస్సులో ; తమించుటల్ = ఆశించుట ; ఒదవులన్ +

ఏ తక్కన్ = జన్యువులందే తప్ప ; ఎదలందున్ = హృదయములందు ; హుళకి = శూన్యము ; పోలికి = పోలికలు ; పల్లము + ఏఁగుటె = పల్లమునకు పోవుటయే ; సెల–ఏటి = జలపాతము యొక్క ; ఆలుడి = స్వభావము ; పల్లపుం నీటన్ = పల్లపు నీటిలో ; పొడమిన = ఆవిర్భవించిన ; నిక్కపుం + పోకిడి = నిజమైన శైలి ; ఆవిరిన్ = ఆవిరి నుండి ; మబ్బులకున్ : అడుగునకున్ = క్రిందికి ; కాకడ = తత్త్వము.

**లోవాఱిక (తాత్పర్యము) :** "తమ వంశములో తమ తరువాతివారు అచ్చుమచ్చుగా తమ వలెనే ఉండవలె" నని ఆశించుట వెఱ్ఱితనము. తాత–తండ్రి–మనుమల నడుమ జన్యువుల పోలికయే తప్ప వారివారి హృదయములందు పోలికలు ఉండవు. పల్లమునకు పాఱుటయే జల పాతపు స్వభావము. ఆ పల్లపు నీటిలో నుండి పుట్టిన ఆవిరికి పైకి పోవుటయే స్వభావము. ఆ ఆవిరి నుండి పుట్టిన మబ్బులకు క్రిందికి కురియుటయే స్వభావము. ఇవి అన్నియు జలస్వరూపములే అయినను వీటి స్వభావముల నడుమ పోలికలేమైన ఉన్నవా?

SUMMARY : It is absurd of people to expect all the descendants of their family–line to take after themselves, or to be self–same as themselves. They only share genes but nothing else in their hearts. To flow to the low–lying land is in the nature of a waterfall. To soar high is in the nature of the vapour born of the waterfall. To pour down is in the nature of the cloud formed of the vapour. Is there any resemblance in the behaviour of these entities made of water?

**వెల్మిరిక** ॥ వేలుపు ౦ కూటము నేలకమున్, వెరసి పెద్దలు నచ్చుమచ్చని,
తలఁచి రెంచ లొడిగట్టుచుండ్రు, తాము కడమాలు తప్పులకున్. 40

**మాటల విడఁదీత (పద విభాగము) :** వేలుపున్, కూటమున్, ఏలకమున్, వెరసి, పెద్దలున్, అచ్చు–మచ్చు + అని, తలఁచి, రెంచల్, ఒడిగట్టుచుండ్రు, తాము, కడమాలు, తప్పులకున్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** వేలుపున్ కూటమున్ ఏలకమున్ వెరసి పెద్దలున్ అచ్చు–మచ్చు అని తలఁచి రెంచల్ తాము కడమాలు తప్పులకున్ ఒడిగట్టుచుండ్రు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వేలుపున్ = దేవుఁడును ; కూటమున్ = సంఘమును ; ఏలకమున్ = పరిపాలన వ్యవస్థయు ; వెరసి = కలిసి ; పెద్దలున్ = అందఱు పెద్దలును ; అచ్చు–మచ్చు = ఒక్క విధమే ; రెంచల్ = మనుష్యులు ; ఒడిగట్టుచుండ్రు = పాల్పడుచుందురు ; కడమాలు = అనంతమైన.

**లోవాఱిక (తాత్పర్యము) :** "దేవుఁడును, సమాజమును, ప్రభుత్వమును, పెద్దలును — వీరందఱును ఒకటియే" అని పొఱఁబడి మను–ష్యులు అంతులేని తప్పులకు పాల్పడెదరు.

SUMMARY : Humans commit countless wrongs, assuming that God, society, government and elders are all one and the same.

**పస్సియ జంట** ॥ ప్రెమ్మాటి కాలేఁ డైరకొల్పరి ; కైసల్పరి కాఁడు వక్కళకాను ;
జరిమికాను కాఁడు పొసవ్రాతరి ; అంకోలరి కాఁజాలఁడు మాసటి ; 41
పెనిమిటి కాలేఁ డాలికి నేస్తుఁడు ; బయటివాఁడు కానేఱఁడు కొడుకు. 42

**మాటల విడఁదీత (పద విభాగము) :** ప్రెమ్మాటి, కాలేఁడు + ఐరకొల్పరి, కైసల్పరి, కాఁడు, వక్కళకాను, జరిమికాను, కాఁడు, పొస–వ్రాతరి,

అంకోలరి కాన్ + చాలఁడు, మాసటి, పెనిమిటి, కాలేఁడు + ఆలికిన్, నేస్తుఁడు, బయటి–వాఁడు, కాన్ + నేఱఁడు, కొడుకు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ప్రెమ్మాటి ఐరకొల్పరి కాలేఁడు. కైసల్పరి వక్కళకాను కాఁడు. జరిమికాను పొస–వ్రాతరి కాఁడు. అంకోలరి మాసటి కాన్ చాలఁడు. పెనిమిటి ఆలికిన్ నేస్తుఁడు కాలేఁడు. బయటి–వాఁడు కొడుకు కాన్ నేఱఁడు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ప్రెమ్మాటి = రాజకీయవేత్త ; ఐరకొల్పరి = సంఘసంస్కర్త ; కైసల్పరి = పూజారి ; వక్కళకాను = విప్లవకారుఁడు ; జరిమికాను = చరిత్రకారుఁడు ; పొస–వ్రాతరి = ధర్మశాస్త్రకర్త ; అంకోలరి = వ్యాపారి ; మాసటి = యోధుఁడు ; పెనిమిటి = భర్త ; ఆలికిన్ = భార్యకు ; నేస్తుఁడు = స్నేహితుఁడు ; కాన్ + నేఱఁడు = కాఁజాలఁడు.

**లోవాఱిక (తాత్పర్యము) :** రాజకీయవేత్త సంఘసంస్కర్త కాలేఁడు. పూజారి విప్లవకారుఁడు కాలేఁడు. చరిత్రకారుఁడు ధర్మశాస్త్రకర్త కాలేఁడు. వ్యాపారస్థుఁడు పోరుబంటు కాలేఁడు. భర్త తన భార్యకు స్నేహితుఁడు కాలేఁడు. బయటివాఁడు కన్నకొడుకు కాలేఁడు.

SUMMARY : A politician cannot become a social reformer. A priest cannot become a rebel/ revolutionary. A historian cannot become a scripture writer. A businessman cannot become a fighter. The husband cannot become a friend to his wife. An outsider cannot become one's own son.

**గంగేరిక జంట** ॥ గుంపులో గోవిందయలేలే, నలుగుఱితో నారాయణలేలె,
మంచివారని మనమెంచువారు ; అరుదు సుమీ నిక్కపు మంచివా- 43
రిటువంటి మంచివారి కన్నను ౧, ఇనుమిక్కిలి మెఱుఁగు పిచ్చివారు. 44

**మాటల విడఁదీత (పద విభాగము) :** గుంపులోన్, గోవిందయలే, లే, నలుగుఱితోన్, నారాయణలే, లె, మంచి–వారు + అని, మనము + ఎంచు–వారు, అరుదు, సుమీ, నిక్కపుం + మంచి–వారు + ఇటువంటి, మంచి–వారి కన్నను, ఇనుమిక్కిలి, మెఱుఁగు, పిచ్చి–వారు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మంచివారు అని మనము ఎంచు–వారు గుంపులోన్ గోవిందయలే లే. నలుగుఱితోన్ నారాయణలే లె. నిక్కపుం మంచి–వారు అరుదు సుమీ. ఇటువంటి మంచి–వారి కన్నను పిచ్చి–వారు ఇనుమిక్కిలి మెఱుఁగు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎంచు–వారు = భావించువారు ; నిక్కపుం + మంచి–వారు = నిజమైన మంచివారు ; ఇనుమిక్కిలి మెఱుఁగు = ఇంకను చాల నయము.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనము మంచివారు అని భావించు మనుష్యులు వాస్తవముగా "గుంపులో గోవింద, నలుగుఱితో నారాయణ" తెఱఁగు వారు. ఇటువంటి మంచివారి కన్న పిచ్చివారు ఎన్నియో రెట్లు నయము. నిజమైన మంచివారు దొరకుట చాల కష్టము సుమా !

**వైమాల విడఁబఱ్రు (విశేష వివరణము) :** "గుంపులో గోవిందయలు, నలుగుఱితో నారాయణలు" అనఁగా లోకమును బట్టి పోవువారే తప్ప స్వంతగా ధర్మాధర్మ విచక్షణ గలిగినవారు కారు. కనుక – నీకును, లోకమునకు నడుమ ఏదైన గొడవ తలయెత్తినచో – ఈ మంచివా–రందఱును లోకము వైపు నిలఁబడెదరే గాని నీ వైపు నిలఁబడరు. "ఇటువంటి మంచివారి కన్న పిచ్చివారే మే" లని కవిహృదయము.

SUMMARY : Those whom we deem to be good people, are in fact, just social beings. The insane are far far better than this type of good people. True good souls are rare to find.

**గోరంటిక జంట** ॥ పారిగొను నంజమునకు నుండుఁ బొట్లకము ; గజదొంగలకుఁ గలిదము కల రెయ్దురులు ;
డగరలకు రవల్లుదు రోకొల్పరులు ; ఱోత బూతుల కున్నారు నెఱిహోతులు ; 45
వెన్నుదన్ నల్వుఱి దున్నంత మట్టున, నెన్నల్వి కా దేదియు బలుమిన్నగాన్. 46

**మాటల విడఁదీత (పద విభాగము) :** పొరిగొను, నంజమునకున్ + ఉందున్, పొట్లకము, గజ–దొంగలకున్, కలిదము, కలరు + ఎయ్దురులు, దగరలకున్, తవల్లుదురు + ఓకొల్పరులు, ఱోత–బూతులకున్ + ఉన్నారు, నెఱిహోతులు, వెన్ను–దన్, నల్వుఱిది + ఉన్న + అంత, మట్టునన్ + ఎన్నల్వి, కాదు + ఏది + ఉన్, బలు–మిన్నగాన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** పొరిగొను నంజమునకున్ పొట్లకము ఉందున్. గజ–దొంగలకున్ కలిదము ఎయ్దురులు కలరు. దగరలకున్ ఓకొల్పరులు తవల్లుదురు. ఱోత–బూతులకున్ నెఱిహోతులు ఉన్నారు. వెన్ను–దన్ నల్వుఱిది ఉన్న అంత మట్టునన్ ఏది+ ఉన్ బలు–మిన్నగాన్ ఎన్నల్వి కాదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పొరిగొను '= చంపునట్టి ; నంజమునకున్ = విషమునకు ; పొట్లకము = పొట్లపు కట్టు ; కలిదము = సైతము ; కలరు = ఉన్నారు ; ఎయ్దురులు = అనుచరులు ; దగరలకున్ = భూతప్రేతములకు ; తవల్లుదురు = ప్రవర్తిల్లెదరు (ఉండెదరు) ; ఓకొల్పరులు = ఉపాసకులు ; ఱోత–బూతులకున్ = అసహ్యమును పుట్టించు బూతి విషయములకు ; నెఱిహోతులు = రసికులు ; వెన్ను–దన్ నల్వుఱిది = నలుగుఱి సమర్థన ; ఉన్న + అంత మట్టునన్ – ఉన్నంత మాత్రాన ; ఎన్నల్వి కాదు = భావింపఁదగినది కాదు ; ఏది+ ఉన్ = ఏది కూడ ; బలు–మిన్నగాన్ = పరమోత్తమముగా / పరమోత్తమము అని.

**లోవాఱిక (తాత్పర్యము) :** జీవులను చంపునట్టి విష పదార్థములకు సైతము మంచి ఆకర్షణీయమైన పొట్లపు కట్టు ఉండును. గజదొంగలకు కూడ అనుచరులుందురు. భూతప్రేతములకు కూడ భక్తులును, ఉపాసకులును ఉన్నారు. ఏవఁ బుట్టించు బూతి విషయములను కూడ ఆనందించు రసికులు ఉన్నారు. అందుచేత — పదిమంది యొక్క మద్దతు ఉన్నంత మాత్రాన దేనినైనను సర్వశ్రేష్ఠముగా తలఁపరాదు.

SUMMARY : Even killer poisons have attractive packaging. Hard–core robbers have followers too. Demons also have devotees. There are connoisseurs for repulsive obscenities as well. So everything that has enjoys wider support should not be deemed to be the best.

**వెల్మిరిక జంట ||** ఒంపుసొంపులు వంకరలనున్ ; వెలుఁగును వేఁడి వెక్కసమనున్ ;
లేని లోటుల లెంకఁబూనున్ ; లేనిచోఁ గ్రత్సాటి ూ అపదూ- 47
ఱేసి పొకాల్పన్ గమకించున్ ; నరము లేని నాల్కది కూటము. 48

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒంపు–సొంపులు, వంకరలు + అనున్, వెలుఁగును, వేఁడి, వెక్కసము + అనున్, లేని, లోటులన్, లెంకన్ + పూనున్, లేనిచోన్, క్రత్సాటి, అపదూఱు + ఏసి, పొకాల్పన్, గమకించున్, నరము–లేని–నాల్కది, కూటము.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** కూటము నరము లేని నాల్కది. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వెక్కసము =ఓర్వరానిది ; లెంకన్ + పూనున్ = వెదకుటకై ప్రయత్నించును ; క్రత్సాటి అపదూఱు = లైంగిక మైన అపనిందను ; ఏసి = ప్రయోగించి ; పొకాల్పన్ = నాశనము చేయుటకై ; గమకించున్ = ప్రయత్నించును ; నరము–లేని–నాల్కది = నరము లేని నాల్క గలది ; కూటము = సమాజము.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఈ సమాజము ఒంపుసొంపులను వంకరలు అని పిలిచి ఎగతాళి చేయును. జీవితమునకు పనికివచ్చు వెలుఁగును, వేఁడిని దుర్భరమని నిందించును. ఇంకను ఏవేవియో లేని లోపములను కూడ వెదుకఁబూనును. ఏవియు దొరుకనిచో శృంగారపరమైన అపనిందలు వైచి మనిషిని నాశనము చేయను ప్రయత్నించును. ఈ సమాజపు నాలుకకు నరము లేదు నాయనా!

SUMMARY : This society dubs curves as convolutions. It blames light and heat by describing them as unbearable. It goes on to pick some other non–existent defects as well. If it fails in the attempt, it resorts to destroying individuals by casting sex slurs on them. My brother !

This society's tongue is way loose.

**వెల్మిరిక జంట** ॥ తొలితొలిపరి తెలిసినవాఁడును, దెలిసి పనిలో దిగినవాఁడును,

దిగి యొరుల మేల్కొలుపు వాఁడును, సేఁగిఁ జెందెదరు ; మంది చేతఁ 49

జెడఁ దిట్టించుకొనెదరు ; కొండొకచో మునిఁగిపోయెదరు. 50

**మాటల విడఁదీత (పద విభాగము) :** తొలి–తొలి–పరి, తెలిసిన–వాఁడును, తెలిసి, పనిలోన్, దిగిన–వాఁడును, దిగి, ఒరులన్, మేల్కొలుపు–వాఁడును, సేఁగిన్+ చెందెదరు, మంది చేతన్, చెడన్ + తిట్టించుకొనెదరు, ఒకొండు + ఒకచోన్, మునిఁగి–పోయెదరు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తొలితొలిపరి = మొట్టమొదటిసారిగా ; ఒరులన్ = ఇతరులను ; సేఁగిన్ + చెందెదరు = నష్టపోయెదరు ; మంది చేతన్ = జనము చేత ; చెడన్ = బహు చెడ్డగా ; ఒకొండు + ఒకచోన్ = అరుదుగా ఒక్కొక్కసారి.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక విషయమును మొట్టమొదటి సారిగా తెలిసికొన్నవాఁడును, తెలిసి ఆ రంగములో గట్టిపని చేయుటకై పూను–కొన్నవాఁడును, చేసి ఇతరులను మేల్కొలుపు వాఁడును నష్టపోయెదరు. తమ జ్ఞానమును, కష్టమును అర్థము చేసికొనలేని పిచ్చిజనము చేత బహుచెడ్డగా తిట్టించుకొందురు. అరుదుగా ఒక్కొక్క సారి – పూర్తిగా నాశనమై పోయెదరు కూడ.

SUMMARY : The one who discovered a new thing for the first time, the one who got down to doing some solid work in a new field and the one who awakened others thus – these three lose heavily in their lives and are also subjected to merciless castigations by the crazy folks of poor understanding. Rarely at times, they completely perish in their noble endeavour.

**వెల్మిరిక** ॥ సూటి పలుకులు సురుక్కుమనున్, దేఁటి ములుకు పోటుసాటియై ;

తేఁటతెల్లము సెప్పినందుకుఁ దెలుప రెవఱు నెదనిండు నెనరు. 51

**మాటల విడఁదీత (పద విభాగము) :** సూటి, పలుకులు + చురుక్కు + అనున్ + తేఁటి–ములుకు–పోటు–సాటి + ఐ, తేఁట–తెల్లము + చెప్పిన + అందుకున్ + తెలుపరు + ఎవఱున్ + ఎద–నిండు, నెనరున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** సూటి పలుకులు తేఁటి–ములుకు–పోటు–సాటి ఐ చురుక్కు అనున్. తేఁట–తెల్లము చెప్పిన అందుకున్ ఎవఱున్ ఎద–నిండు నెనరున్ తెలుపరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తేఁటి–ములుకు–పోటు–సాటి + ఐ = తేనెటీఁగ యొక్క ములుకు గ్రుచ్చులతో సమానమై ; తేఁట–తెల్లము = స్పష్టముగా ; ఎద–నిండు = హృదయపూర్వకమైన ; నెనరున్ = కృతజ్ఞతను.

**లోవాఱిక (తాత్పర్యము) :** సూటిగా పలుకు మాటలలో నిజమున్నను, అవి – తేనెటీఁగ యొక్క ములుకుగ్రుచ్చుల వలె చురుక్కుమని మంటఁ బుట్టించును. ఒకఱు తమ అభిప్రాయమును డొంకతిరుగుడు లేకుండ స్పష్టముగా తెలియఁజేసినందుకు వారికి ఎవ్వఱును కృతజ్ఞతలు చెప్పరు. (పైపెచ్చు ద్వేషించెదరని భావము).

SUMMARY : Though they contain truth, direct expressions prick/ incense the listeners like a bee sting. No one heartily thanks the speaker for being so clear and candid.

**పస్సియ** ॥ మంచివాఁడో చెడ్డవాఁడో యని, రెంచపై నొఱపాట మకైకట్టి

కూటంబునకున్ ; "ఎంత బ్రోమువా, నాతఁ డెంత మేల్తనకా?"
నన్నదె తారసాప దాని కప్పసంబును. 52

**మాటల విడఁదీత (పద విభాగము) :** మంచి–వాఁడు + ఓ, చెడ్డ–వాఁడు + ఓ + అని, రెంచపైన్ + ఒఱపాటము + అకైకట్టి, కూటంబునకున్, ఎంత, బ్రోమువాన్ + ఆతఁడు + ఎంత, మేల్తనకాన్, అన్నది + ఎ, తారసాప, దానికిన్ + అప్పసంబును.

**చఱమొలి (అన్వయ క్రమము) :** మంచివాఁడు ఓ చెడ్డ–వాఁడు + ఓ అని రెంచపైన్ ఒఱపాటము కూటంబునకున్ అకైకట్టి. ఎంత బ్రోమువాన్ ఆతఁడు ఎంత మేల్తనకాన్ అన్నది + ఎ దానికిన్ అప్పసంబును తారసాప.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** రెంచపైన్ = మనిషిని గుఱించి ; ఒఱపాటము = చర్చ ; అకైకట్టి = అసందర్భము ; కూటంబునకున్ = సమాజమునకు ; బ్రోమువాన్ = శక్తిశాలి ; మేల్తనకాన్ = ఉపయోగకరము ; అన్నది + ఎ = అను విషయమే ; తారసాప = సందర్భ సహితము ; అప్పసంబును = ఎల్లప్పుడు.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక మనిషి "మంచివాఁడా? చెడ్డవాఁడా?' అన్న చర్చ సమాజమునకు అప్రస్తుతము. "ఆతఁడు ఎంత శక్తిమంతుఁడు? తనకు ఎంతవరకు పనికివచ్చును?' అన్నవే దానికి ప్రసక్తము.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** శక్తికే తప్ప మంచితనమునకు సమాజములో విలువ లేదని భావము.

SUMMARY : To society, the debate over "*whether one is a good or bad person*" is irrelevant. To it, the most relevant question is, "*How powerful and useful is he?*"

**తామరిక జంట** ॥ "జల్లెడకుఁ జిల్లు లున్న" వనుచు లొల్లిసేయ రెవ్వఱును ; కాని,
పళ్లెమున కొక టున్న మండి పడెద రిల్లు మునిగిపోయినట్లు ;
ఱాతి మచ్చలు సరకుసేయరు ; కరకంటి మచ్చకుఁ గనలెదరు ;
మీఁదాడ రోగు నోగుతనమున, కరిది తుటారమున కలిగెదరు ; 53
ఎవ్వ ఱెట్టు లుండవలయునో వా రట్లే యుండవలెనన్న
నెవ్వఱి కే తీ రోగితమో యెవఱు మటుకు వాక్రువ్వఁగలరు ? 54

**మాటల విడఁదీత (పద విభాగము) :** జల్లెడకున్ + చిల్లులు + ఉన్నవి + అనుచున్, లొల్లి + చేయరు + ఎవ్వఱును, కాని, పళ్లెమునకు + ఒకటి + ఉన్నన్, మండి–పడెదరు + ఇల్లు, మునిగి–పోయిన + అట్లు, ఱాతి, మచ్చలు, సరకు + చేయరు, కరకంటి, మచ్చకున్, కనలెదరు, మీఁదాడరు + ఓగు–ఓగుతనమునకున్ + అరిది, తుటారమునకున్ + అలిగెదరు, ఎవ్వఱు + ఎట్టుల్ + ఉండన్, వలయునో వార్ + అట్లే + ఉండన్ వలెన్ + అన్నన్, ఎవ్వఱికిన్ + ఏ, తీరు + ఓగితమో, ఎవఱు, మటుకు, వాక్రువ్వన్ + కలరు.

**చఱమొలి (అన్వయ క్రమము) :** జల్లెడకున్ చిల్లులు ఉన్నవి అనుచున్ ఎవ్వఱును లొల్లి చేయరు. కాని పళ్లెమునకు ఒకటి ఉన్నన్ ఇల్లు మునిగిపోయిన అట్లు మండిపడెదరు. ఱాతి మచ్చలు సరకు చేయరు. కరకంటి మచ్చకున్ కనలెదరు. ఓగు–ఓగుతనమునకున్ మీఁదాడరు. అరిది తుటారమునకున్ అలిగెదరు. ఎవ్వఱు ఎట్టుల్ ఉండన్ వలయునో వార్ అట్లే ఉండన్ వలెన్ అన్నన్ ఎవ్వఱికిన్ ఏ తీరు ఓగితమో ఎవఱు మటుకు వాక్రువ్వన్ కలరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** లొల్లి + చేయరు = గొడవ చేయరు ; ఉన్నన్ = ఉన్నప్పటికిని ; సరకు + చేయరు = లెక్క చేయరు ; కరకంటి మచ్చకున్ = లోహపు మచ్చకు ; కనలెదరు = కోపించెదరు ; మీఁదాడరు = ఫిర్యాదు చేయరు ; ఓగు–ఓగుతనమునకున్ = చెడ్డవాని చెడ్డతనమునకు ; అరిది = అరుదైన ; తుటారమునకున్ = వాక్పారుష్యమునకు ; అన్నన్ = అన్నచో ; ఏ తీరు = ఏ పద్ధతి ; ఓగితమో =

యుక్తమో ; వాక్రువ్వన్ + కలరు = పలుకఁగలరు.

**లోవాతిక (తాత్పర్యము) :** జల్లెడకు చిల్లులు కలవని ఎవఱును గొడవ చేయరు. కాని ఒక పళ్ళెమునకు ఒక్క చిల్లి ఉన్నను కొంప మునిఁగి- నట్లు మండిపడెదరు. ఱాలకున్న మచ్చలను జనము పట్టించుకొనరు. కాని లోహ వస్తువులకు మచ్చలు ఉన్నచో కోపించెదరు. అదే విధ- ముగా చెడ్డవాఁడు చెడ్డగానే ఉన్నచో సంఘము ఫిర్యాదు చేయదు. కాని ఒక మంచివాఁడు అరుదుగా ఎప్పుడో ఒకసారి పరుషముగా మాట లాడినను ఎగిరిపడెదరు. "ఎవతెట్లు ఉండవలెనో వారు అట్లే ఉండవలె" నన్నచో ఎవఱికి ఏ పద్ధతి యుక్తమో ఎవఱు నిర్ణయించఁగలరు?

SUMMARY : No one complains of the holes in a sieve. But everyone is angered by a single perforation in a plate. Folks don't mind the smudges on stones. But they are disturbed by the same manifest on metallic objects. Similarly, people do not complain of the routine wicked-ness of a wicked person. But they are incensed by the rare and one-time harshness shown by a good person. They say, *"People ought to be what they ought to be"*. But who can decide what is the the befitting manner to whom?

**పస్నియ** ॥ పోహులు వ్రాతరు లంకువానులున్, సయారింతురు వాగుడుకాయలన్,
తారి సవింత యిసుమంతయు లేక, నుడి మటుకు నేర్చి వాడువారలన్. 55

**మాటల విడఁదీత (పద విభాగము) :** పోహులున్, వ్రాతరుల్, అంకువానులున్, సయారింతురు, వాగుడుకాయలన్, తారి, సవింత, ఇసుము + అంతయున్, లేక, నుడిన్, మటుకున్, నేర్చి, వాడు-వారలన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పోహులున్ వ్రాతరుల్ అంకువానులున్ తారి సవింత ఇసుము అంతయున్ లేక నుడిన్ మటుకున్ నేర్చి వాడు-వారలన్ వాగుడుకాయలన్ సయారింతురు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పోహులున్ = కవులును ; వ్రాతరుల్ = రచయితలును ; అంకువానులున్ = దైవజనులును ; సయా రింతురు = తయారు చేసెదరు ; తారి సవింత = స్వంత అనుభూతి ; ఇసుము + అంతయున్ = కొంచెమైనను ; లేక = లేకుండ ; నుడిన్ మటుకున్ = భాష మాత్రమే.

**లోవాతిక (తాత్పర్యము) :** కవులును, రచయితలును, దైవజనులును గొప్పవారే కాని వారి వలన సైతమొక నష్టము కలదు. అది ఏమనఁగా — ఏ విషయమును గానీ స్వంతముగా అనుభూతి చెందకుండ ఊరక పుస్తకములు చదివి భాష నేర్చి గడగడా మాటలాడు వాగుడుకాయ లను విఱివిగా ఉత్పత్తి చేయుట.

**పైమాల విడఁబఱు (విశేష వివరణము) :** కవుల వంటివారు నిజాయితీగా స్వంతముగా అనుభూతి చెంది వెలిబుచ్చిన భావములను తరువాత జన సామాన్యము కాపీ కొట్టి వాగుడుకాయలు అయ్యెదరని భావము.

SUMMARY : Poets, writers and godmen are great. But they too indirectly cause an evil. i.e. They widely produce chatter-boxes who master their words and usages and blabber without actually experiencing the sense of the words even by a little.

**గంగేరిక మున్నంగి** ॥ చొక్కటము కాదు పుట్టుక తోడ, నిక్కానసమునం దేదియున్ ;
సైకట్టుగ రాదేదియు రెంచ- చేయి వడకయె చెకుందాపగా ; 56
మరిగించి వడపోయకయె నీరు, మారదు మన్నియానకంబుగా ;

పొట్టూడ్చి వండియు గంజిజాలు, నుట్టింపక తినఁజాలము ప్రాలు ; 57
చొక్కటులు కారని సమయువులను, వెక్కసించుట కడు నకోగితము ;
చెప్పి చేయూత నొసఁగి యోర్పుగ, తప్పుల సవరించుట మీసరము. 58

**మాటల విడఁదీత (పద విభాగము) :** చొక్కటము, కాదు, పుట్టుక తోడన్, ఈ + కానసమునందున్, ఏది + ఉన్, సైకట్టుగన్, రాదు + ఏది + ఉన్, రెంచ– చేయి, పడక + ఎ, చెకుందాపగాన్, మరిగించి, వడపోయక + ఎ, నీరు, మారదు, మన్ని+ఆనకంబుగాన్, పొట్టు + ఊడ్చి, వండి + ఉన్, గంజి–జాలున్, ఉట్టింపక, తినన్ + చాలము, ప్రాలు, చొక్కటులు, కారు + అని, సమయువులను, వెక్కసించుట, కడున్ + అకోగితము, చెప్పి, చేయూతన్ + ఒసఁగి + ఓర్పుగన్, తప్పులన్, సవరించుట, మీసరము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఈ కానసమునందున్ ఏది + ఉన్ పుట్టుక తోడన్ చొక్కటము కాదు. ఏది + ఉన్ రెంచ– చేయి చెకుందాపగాన్ పడక + ఎ సైకట్టుగన్ రాదు. మరిగించి వడపోయక + ఎ నీరు మన్ని+ఆనకంబుగాన్ మారదు. పొట్టు ఊడ్చి వండి + ఉన్ గంజి–జాలున్ ఉట్టింపక ప్రాలు తినన్ చాలము. చొక్కటులు కారు అని సమయువులను వెక్కసించుట కడున్ అకోగితము. చెప్పి చేయూతన్ ఒసఁగి ఓర్పుగన్ తప్పులన్ సవరించుట మీసరము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చొక్కటము = పరిపూర్ణము / సౌష్ఠవ వంతము ; కానసమునందున్ = లోకమునందు ; సైకట్టుగన్ = పూర్వ సిద్ధముగా (రెడీమేడ్ గా) ; రెంచ– చేయి = మానవుని చేయి ; చెకుందాపగాన్ = కళాత్మకముగా ; మన్ని+ఆనకంబుగాన్ = జీవాధార ముగా ; పొట్టు + ఊడ్చి = పొట్టు దీసి ; గంజి–జాలున్ = గంజిధారను ; ఉట్టింపక = కార్చక ; తినన్ + చాలము = తినలేము ; ప్రాలు = బియ్యము ; చొక్కటులు = సౌష్ఠవులు ; సమయువులను = మానవులను ; వెక్కసించుట = ఈసడించుకొనుట ; కడున్ = మిక్కిలి ; అకోగి తము = అయుక్తము ; మీసరము = ఉత్తమము.

**లోవాటిక (తాత్పర్యము) :** ఈ లోకములో ఏ వస్తువు గానీ, పదార్థము గానీ, జీవి గానీ, మనిషి గానీ పరిపూర్ణులు కారు. మనిషి చేయి పడ–కుండ ఏ వస్తువును పదార్థమును దానంతట అదే కళాత్మకతను సంతరించుకొనదు. కాచి వడపోయకుండ నీరు ప్రాణమును నిలఁబెట్టఁ–జాలదు. పొట్టు దీసి ఉడికించి గంజిని ధారగా పాఱింపకుండ వరి తినలేము. అట్లే పరిపూర్ణులు కారని చెప్పి తోడి మానవులను తక్కువగా చూచుట అనుచితము. దానికి మారుగా అపరిపూర్ణులకు మంచిగా చెప్పి బాసట అందించి ఓర్పుగా వారి తప్పులను సవరించి పరిపూర్ణు–లగుటకు తోడ్పడుట మంచిది.

SUMMARY : No object, substance, being or human in the world is perfect. No object or subs–tance turns aesthetic without the active involvement of a human hand. Water cannot give us life if partaken of without boiling and filtering it. Rice cannot be eaten without removing the husk, boiling it and draining it of its gruel. Similarly, it is not proper to look down upon peo–ple, dubbing them imperfect. In stead better help them attain perfection by patiently teach–ing them and correcting their mistakes.

**పస్సియ** ॥ కూటిమి తెచ్చిపెట్టును దారిమిన్ ; వరవిక తెచ్చిపెట్టును మణియమున్ ;
కాటియ యెలందారు మణియమున్ ; ఎంత కాటియ కంతటి మణియమున్. 59

**మాటల విడఁదీత (పద విభాగము) :** కూటిమి, తెచ్చి–పెట్టును, తారిమిన్, వరవిక, తెచ్చి–పెట్టును, మణియమున్, కాటియ, ఎలందారు మణియమున్, ఎంత, కాటియకున్, అంతటి మణియమున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కూటిమి తారిమిన్ తెచ్చి–పెట్టును. వరవిక మణియమున్ తెచ్చి–పెట్టును. కాటియ ఎలందారు

మణియమున్ (తెచ్చి-పెట్టును). ఎంత కాఱియకున్ అంతటి మణియమున్ (తెచ్చి-పెట్టును).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కూఱిమి = ప్రేమ : తారిమిన్ = హక్కును ; వరవిక = సేవ ; మణియమున్ = అధికారమును ; కాఱియ = హింస ; ఎలందారు మణియమున్ = నిరంకుశ అధికారమును.

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రేమ హక్కులను సంపాదించి పెట్టును. సేవ అధికారమును సంపాదించి పెట్టును. హింస నిరంకుశాధికారమును తెచ్చిపెట్టును. ఆ హింస ఎంత ఎక్కువగా చేసినచో అంత ఎక్కువ నిరంకుశాధికారము ప్రాప్తించును.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఎవఱి మీఁద ప్రేమ చూపెదరో వారి మీఁద హక్కులు కలుగును. ఎవఱికి సేవ చేసెదరో వారి మీఁద అధికారము ఏర్పడునని భావము.

SUMMARY : Love brings about rights. Service brings about power. Violence brings about despotic power. The more violent one is, the more despotic power he gets.

**వెల్మిరిక జంట** ॥ కట్టాకటఁ జెట్టఁ జేసెడున్ ; కాని యెడలఁ గనలిక వెఱలన్,
గానలఁ గడల మను మనీకులు ; ఆఁకలి-కనల్-వెఱ లవి లేక 60
ముక్కుమోము లెఱుఁగని వారికి, ముప్పు వాటించు పసరము వే-
ఱొప్పునె యొలవున రెంచ వసిలి? 61

**మాటల విడఁదీత (పద విభాగము) :** కడు + ఆఁకటన్, చెట్టన్, చేసెడున్, కాని, ఎడలన్, కనలిక-వెఱలన్, కానలన్, కడలన్, మను, మనీకులు, ఆఁకలి-కనల్-వెఱల్, అవి, లేక, ముక్కు-మోముల్ + ఎఱుఁగని-వారికి, ముప్పున్, వాటించు, పసరము, వేఱు + ఒప్పునె, ఒలవునన్, రెంచన్, వసిలి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కానలన్ కడలన్ మను మనీకులు కడు + ఆఁకటన్ చెట్టన్ చేసెడున్. కాని ఎడలన్ కనలిక-వెఱలన్ (చెట్టన్ చేసెడున్). ఆఁకలి-కనల్-వెఱల్ అవి లేక ముక్కు-మోముల్ ఎఱుఁగని-వారికి ముప్పున్ వాటించు పసరము రెంచన్ వసిలి ఒలవునన్ వేఱు ఒప్పునె.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కడు + ఆఁకటన్ = మిక్కిలి ఆఁకటితో ; చెట్టన్ చేసెడున్ = కీడు చేయును ; కాని ఎడలన్ = లేనిచో / అట్లు కానిచో ; కనలిక-వెఱలన్ = కోప-భయముల చేత ; కానలన్ = అడవులలోను ; కడలన్ = సముద్రములోను ; మను = బ్రదుకునట్టి ; మనీకులు = జీవులు ; ఆఁకలి-కనల్-వెఱల్ + అవి = ఆ ఆఁకలి, కోపము, భయము ; ముప్పున్ వాటించు = కీడు చేయునట్టి ; పసరము = జంతువు ; వేఱు + ఒప్పునె = మఱియొకటి ఉండునా? ; ఒలవునన్ = లోకములో ; రెంచన్ వసిలి = మనిషి తప్ప.

**లోవాఱిక (తాత్పర్యము) :** అడవులలోను, సముద్రములోను బ్రదుకునట్టి జీవులు మిక్కిలి ఆఁకటితోఁ గానీ, లేనిచో కోపము చేతఁ గానీ, భయము చేతఁ గానీ వేఱెవారికి కీడు చేయును. కానీ ఆ కారణములేవియు తనను పురికొల్పకుండనే ముక్కుమొగము తెలియనివారికి సైతము కీడు చేయు వింతజీవి ఈ ప్రపంచములో మనిషి తప్ప మఱియొకటి కలదా?

SUMMARY : The wild and marine animals harm other beings only when they are hungry or angry or threatened. But is there another being like the human in the world which harms even the unacquainted ones, being quite unprovoked by the aforementioned causes.

**అవిగింగ** ॥ గెనుసుగడ్డ గైకొనుఁ గెంపును నేల నుండి ;
తెల్ల ముల్లంగియుఁ దెలుపు నదే నేల నుండి ;

మంది గైకొందురు డెందములకు నచ్చినవి,

వంద కడఁదేల్మ్లు లొకే యొక వెలంకి నుండి. 62

**మాటల విడఁదీత (పద విభాగము) :** గెనుసు–గడ్డ, కైకొనున్ + కెంపును, నేల నుండి, తెల్ల ముల్లంగి + ఉన్ + తెలుపున్, అదే, నేల నుండి, మంది, కైకొందురు, డెందములకున్, నచ్చినవి, వంద, కడఁదేల్మ్లుల్ + ఒకే, ఒక, వెలంకి నుండి.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** గెనుసుగడ్డ కెంపును నేల నుండి కైకొనున్. తెల్ల ముల్లంగి + ఉన్ + తెలుపున్ అదే నేల నుండి కైకొనున్. మంది డెందములకున్ నచ్చినవి వంద కడఁదేల్మ్లుల్ + ఒకే ఒక వెలంకి నుండి కైకొందురు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గెనుసుగడ్డ = చిఱుగడమ (చిలకడదుంప మొక్క) ; కైకొనున్ = తీసికొనును ; కెంపును = ఎఱుపురంగును ; మంది = ప్రజలు ; డెందములకున్ = హృదయములకున్ ; కడఁదేల్మ్లుల్ = పిండితార్థములను ; వెలంకి నుండి = మూలము నుండి.

**లోవాఱిక (తాత్పర్యము) :** గెనుసుగడ్డ మఱియు తెల్ల ముల్లంగి — రెండును తమ కెంపు–తెలుపు రంగులను ఒకే నేలనుండి తీసికొనును. అట్లే ప్రజలు ఒకే మూలము/ సమాచారము నుండి వంద పిండితార్థములను లాఁగెదరు.

SUMMARY : Both the sweet potato and radish draw their pink and white hues from the same soil. In the same way, diffferent people draw different conclusions from the same source.

**అవిగింగ ||** అక్కఱయే యిందుఁజేతయుఁ దలపెట్టుడు ;

ఒక్కొక పరి మిన్నక వేచికయే ౨ అక్కఱ ;

చక్కన, దానంతట జరుగనిచ్చినప్పుడు ;

చెక్కు వెఱికిన కుఱుపు సెలగారును, మానదు. 63

**మాటల విడఁదీత (పద విభాగము) :** అక్కఱ + ఏ, ఇందున్ + చేత + ఉన్, తలపెట్టుడున్, ఒక్క + ఒక, పరి, మిన్నక–వేచిక + ఏ, అక్కఱ, చక్కన, దాని + అంతటన్, జరుగన్ + ఇచ్చిన + అప్పుడు, చెక్కు + పెఱికిన, కుఱుపు, సెల + కారును, మానదు.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ఇందున్ + చేత + ఉన్ తలపెట్టుడున్ అక్కఱ + ఏ. ఒక్క + ఒక పరి మిన్నక–వేచిక + ఏ అక్కఱ. దాని అంతటన్ జరుగన్ ఇచ్చిన అప్పుడు చక్కన. చెక్కు పెఱికిన కుఱుపు సెల కారును, మానదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అక్కఱ + ఏ = అవసరమే ; ఇందున్ + చేత + ఉన్ = ఇహలోక కర్మ (మానవ ప్రయత్నము) ; తల–పెట్టుడున్ = మానవ సంకల్పము కూడ ; ఒక్క + ఒక పరి = ఒక్కొక్క సారి ; మిన్నక–వేచిక + ఏ = మౌనముగా ఎదురుచూచుటయే ; చక్కన = బాగు ; దాని + అంతటన్ = దానంతట దానిని ; పెఱికిన = పీకిన ; కుఱుపు సెల + కారును = ధారగా నెత్తురు కారును.

**లోవాఱిక (తాత్పర్యము) :** లోకములో ఏదైనను జరుగవలె నన్నచో మానవ సంకల్పమును, మానవ ప్రయత్నమును అవసరమే. కాని కొన్ని సారులు ఏ ప్రణాళికయు వేయకుండ ఊరక ఎదురుచూచుట కూడ అవసరమే. మనము వ్రేలు పెట్టకుండ విషయములను వాటంతట వాటిని జరుగనిచ్చుట మిక్కిలి బాగుండును. కుఱుపు దానంతట అదే మాని చెక్కు రాలిపోవుట లెస్స. అట్లు కాక, దాని చెక్కును బలవంత–ముగా పెఱికినచో నెత్తురు ధారగా కారును. అట్లు మాటిమాటికిని కెలకఁబడు కుఱుపు మానదు.

SUMMARY : Human will and effort are necessary for making anything happen in this world. But sometims it also necessary to wait in silence without planning anything. Better watch things as they happen without our interferenc. It is desirable that the scab of a wound / boil drops on its own after complete healing. If one did not wait for that to happen, but

plucked it forcibly, blood will ooze down. Such a disturbed wound will not heal.

**పస్సియ జంట** ॥ సీమీఁదువల్కు లాడక మానదు, చిల్లర కూట మీవెట్టు లున్నను ;
మెత్తగ నుంటేని మెతకవాఁడను ; గట్టిగ నుంటేనిఁ గఱకటి యనున్ ; 64
నిల్వరవానును దూబగఁ బిలుచున్ ; మంచి నెఱిహొతిని మసకవాననున్ ;
పుట్టుమచ్చలిచ్చి తెచ్చు నైకలి ; చావుమచ్చలద్ది పనుచు ౨ కూటము. 65

**మాటల విడఁదీత (పద విభాగము) :** సీమీఁదువల్కుల్ + ఆడక, మానదు, చిల్లర–కూటము + ఈవు + ఎట్టుల్ + ఉన్నను, మెత్తగన్, ఉంటి + ఏనిన్, మెతక–వాఁడు + అనున్, గట్టిగన్ + ఉంటి + ఏనిన్, కఱకటి + అనున్, నిల్వరవానును, దూబగన్, పిలుచున్, మంచి, నెఱిహొతిని, మసకవాన్ + అనున్, పుట్టు–మచ్చల్ + ఇచ్చి, తెచ్చున్. ఐకలి, చావు–మచ్చల్ + అద్ది, పనుచున్, కూటము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** + ఈవు ఎట్టుల్ + ఉన్నను చిల్లర–కూటము సీమీఁదువల్కుల్ ఆడక మానదు. మెత్తగన్ ఉంటి ఏనిన్ మెతక–వాఁడు అనున్. గట్టిగన్ ఉంటి ఏనిన్ కఱకటి అనున్. నిల్వరవానును దూబగన్ పిలుచున్. మంచి నెఱిహొతిని మసకవాన్ అనున్. ఐకలి పుట్టు–మచ్చల్ ఇచ్చి తెచ్చున్. కూటము చావు–మచ్చల్ అద్ది పనుచున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సీమీఁదువల్కుల్ = దుర్ వ్యాఖ్యానములు ; ఆడక మానదు = చేయక మానదు ; చిల్లర–కూటము = క్షుద్ర సమాజము ; ఈవు = నీవు ; ఎట్టుల్ + ఉన్నను = ఎట్లు ఉన్నప్పటికిని ; ఉంటి + ఏనిన్ = ఉన్నావంటే ; కఱకటి = కర్కశుఁడు ; నిల్వర వానును = నిగ్రహవంతుని ; దూబగన్ = నపుంసకుఁడుగా ; నెఱిహొతిని = రసికుని ; మసకవాన్ = కాముకుఁడు ; ఐకలి = ప్రకృతి ; చావు–మచ్చల్ = చనిపోవు నాటికి మనిషి మీఁద పడు ముద్రలు ; అద్ది = పులిమి ; పనుచున్ = పంపించును.

**లోవాఱిక (తాత్పర్యము) :** నీవు ఎట్లున్నను నీ మీఁద నీచ సమాజము దుర్ వ్యాఖ్యానములు చేయకుండ వదిలిపెట్టదు. మెత్తగా ఉన్నచో మెతక వాఁడు, అసమర్థుఁడు అనును. కఠినముగా ఉన్నచో హృదయము లేని కర్కశుఁడు అనును. ఇంద్రియ నిగ్రహమును పాటించిన వానిని నపుంసకుఁడు అనును. సౌందర్యమును చూచి ఆనందించి ఆరాధించు రసికుని కాముకుఁడు అని ఆడిపోసికొనును. ప్రకృతి మనిషికి పుట్టుమచ్చలు వేసి ఈ లోకములోనికి పంపును. సమాజము అతనికి చావుమచ్చలు అంటించి పరలోకమునకు పంపును.

SUMMARY : Society cannot help passing uncharitable remarks on you, no matter how you carry yourself. It calls you inept if you are soft. It terms you stony-hearted if you are tough. It dismisses a man of self-restraint as impotent. It blames a connoisseur of beauty as libidinous. Thus the Nature gives man moles at birth and sends into this world. But society gives them at death and sends him to the other world.

**గోరంటిక** ॥ ముందెచ్చటికి నివ్వరు రంపెలానులు ; ముమ్మొదటిది మటుకె ఇచ్చెదరు వేల్పులు ;
రెండెచ్చటిక లిచ్చెదరు రెంచవాను, లంతయు ముగియఁ దెలిసికొందురు మొప్పెలు. 66

**మాటల విడఁదీత (పద విభాగము) :** ముందు + ఎచ్చటికన్ + ఇవ్వరు, రంపెలానులు, మున్ + మొదటిది, మటుకె, ఇచ్చెదరు, వేల్పులు, రెండు + ఎచ్చటికల్ + ఇచ్చెదరు, రెంచవానుల్ + అంత + ఉన్ ముగియన్ + తెలిసికొందురు, మొప్పెలు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** రంపెలానులు ముందు + ఎచ్చటికన్ ఇవ్వరు. వేల్పులు మున్ మొదటిది మటుకె ఇచ్చెదరు. రెంచవానుల్ రెండు ఎచ్చటికల్ ఇచ్చెదరు. మొప్పెలు అంత + ఉన్ ముగియన్ తెలిసికొందురు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ముందు + ఎచ్చటికన్ = ముందస్తు హెచ్చటికను ; రంపెలానులు = రాక్షసులు ; మున్ + మొదటిది =

మొట్టమొదటి హెచ్చఱికను ; మటుకె = మాత్రమే ; వేల్పులు = దేవతలు ; రెంచవానుల్ = మనుష్యులు ; ముగియన్ + అయిపోయిన పుడు ; మొప్పెలు = మూర్ఖులు.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఏదైన చెడు చేయఁబోవుచున్నప్పుడు/ జరుగఁబోవుచున్నప్పుడు రాక్షసులు ఎటువంటి ముందస్తు హెచ్చఱికను గానీ చేయరు. దేవతలైనచో ఒక్క హెచ్చఱికను మటుకు చేసెదరు. మనుష్యులు (వారు నిజముగా మనుష్యులే అయినచో) రెండు హెచ్చఱి-కలు చేసెదరు. ఎవఱు ఎన్ని హెచ్చఱికలు చేసినను, మూర్ఖులు అన్నియు అయిపోయిన తరువాతనే తెలిసికొందురు.

SUMMARY : Demons do not issue any warning before an evil thing is done or happens. Gods and goddesses issue at least one warning. Humans (if they are truly human) issue a couple warnings. Fools will come to know of the gravity of the situation only after everything is over, no matter howmany warnings they receive.

**నిడు రాల్మిక జంట** ॥ నీవు గలవు కూటమునకు, నీ వలన ౧ తప్పేదియో జరిగినపుడు ;
నీవు లేవు కూటమునకు, నీ వలన మేళ్ళెన్నియో కలిగినపుడు ; 67
నీవు కావలె ౧ కూటమునకుఁ , బ్రొద్దుపుచ్చులకు నుబుసుపోకడలకున్,
నీవు వలవ వద్దానికి, దాని మీఁద నీ వానకపడినప్పుడు. 68

**మాటల విడఁదీత (పద విభాగము) :** నీవు, కలవు, కూటమునకున్, నీ వలనన్, తప్పు + ఏది + ఓ, జరిగిన + అపుడు, నీవు, లేవు, కూటమునకున్, నీ వలనన్, మేళ్ళు, ఎన్ని + ఓ, కలిగిన + అపుడు, నీవు, కావలెన్, కూటమునకున్, ప్రొద్దు-పుచ్చులకున్ + ఉబుసు-పోకడలకున్, నీవు, వలవవు + ఆ + దానికిన్, దాని మీఁదన్, నీవు + ఆనక-పడిన + అప్పుడు.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** నీ వలనన్ తప్పు ఏది + ఓ జరిగిన అపుడు కూటమునకున్ నీవు కలవు. నీ వలనన్ మేళ్ళు ఎన్ని + ఓ కలిగిన అపుడు కూటమునకున్ నీవు లేవు. ప్రొద్దు-పుచ్చులకున్ ఉబుసు-పోకడలకున్ నీవు కూటమునకున్ కావలెన్. దాని మీఁదన్ నీవు ఆనక-పడిన అప్పుడు ఆ + దానికిన్ నీవు వలవవు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నీవు కలవు = నీవు ఉన్నావు ; కూటమునకున్ = సమాజమునకు ; ప్రొద్దు-పుచ్చులకున్ = కాలక్షేపముల కొఱకు ; ఉబుసు-పోకడలకున్ = కబుర్లు చెప్పుకొనుటకు ; నీవు వలవవు = నీవు వద్దు ; ఆ + దానికిన్ = దానికి ; ఆనక-పడిన + అప్పుడు = ఆధారపడినప్పుడు.

**లోవాఱిక (తాత్పర్యము) :** సమాజము నీ ఉనికి గుర్తించునది ఎప్పుడయ్యా ? అంటేని — నీ మూలముగా తప్పేదియో జరిగినప్పుడు మాత్రమే. అంతకు ముందు నీ వలన మంచి పనులు ఎన్ని జరిగినను నీవు దానికి లేనట్లే లెక్క. పనికి మాలిన కాలక్షేపముల కోసమో, కబుర్లాడుట కోసమో సమాజమునకు నీవు కావలెను. కాని నీవు దాని మీఁద ఏదైన అవసరము కోసము ఆధారపడినచో నీవు దానికి అక్కఱలేదు.

SUMMARY : Your existence comes to the notice of the society only when there is some fault on your side. You were as good as non-existent to it before that, though many good things happened to it from your side. You are needed for its pastime and gossip. But you will become unwanted when you depend on the society for any need.

**రాల్మిక వాలు జంట** ॥ పొన్నాడ వలె నొంటరులు, పోహి యేలిక కాకడారియున్ ;
వారి నాకళించుకొనఁగ , నేరునది వారి సాటివారే ; 69
కాని యాకళించుకొనరు, కలలోఁ గలిదము తమ సాటివారు ;

చూపోప, రలవల్కెదరు, సూడించెదరు, పోటీపడెదరు. 70

**మాటల విడఁదీత (పద విభాగము) :** పొన్నాడ వలెన్, ఒంటరులు, పోహి, ఏలిక, కాకడారి + ఉన్, వారిన్, ఆకళించుకొనఁగన్, నేరునది, వారి, సాటి–వారే, కాని, ఆకళించుకొనరు, కలలోన్, కలిదము, తమ, సాటి–వారు, చూపు + ఓపరు + అలవల్కెదరు, సూడించెదరు, పోటీ–పడెదరు.

**చఊమోలి (అన్వయ క్రమము) :** పోహి, ఏలిక, కాకడారి + ఉన్ పొన్నాడ వలెన్ ఒంటరులు. వారిన్ ఆకళించుకొనఁగన్ నేరునది వారి సాటి–వారే. కాని తమ సాటి–వారు కలలోన్ కలిదము ఆకళించుకొనరు. చూపు ఓపరు. అలవల్కెదరు. సూడించెదరు. పోటీ–పడెదరు.

**కుఊ మమ్మాటిక (లఘుటీక) :** పొన్నాడ వలెన్ = నల్ల చిఱుతపులి వలె ; ఒంటరులు = ఏకాకులు ; పోహి = కవి ; ఏలిక = పరిపాలకుఁడు ; కాకడారి + ఉన్ = తత్త్వవేత్త కూడ ; ఆకళించుకొనఁగన్ + నేరునది = అర్థము చేసికొనఁగలిగినది ; కలలోన్ కలిదము = కలలో కూడ ; చూపు + ఓపరు = ఓర్వలేరు ; అలవల్కెదరు = వాదించెదరు ; సూడించెదరు = ద్వేషించెదరు.

**లోవాఊిక (తాత్పర్యము) :** కవియు, పరిపాలకుఁడును, తత్త్వవేత్తయు – ఈ ముఫ్ఫుఱును నల్ల చిఱుతపులి వలె ఒంటరి జీవులు. వారిని అర్థము చేసికొనఁగల్గినది వారి సాటి కవి, సాటి పరిపాలకుఁడు, సాటి తత్త్వవేత్త మాత్రమే. కాని సరిగ్గా వారే అర్థము చేసికొనరు. పైపెచ్చు అసూయపడెదరు, వాదించెదరు, ద్వేషించెదరు, పోటీపడెదరు.

SUMMARY : The poet, the ruler and the philosopher – these three are solitary beings like black panthers. Their counterparts alone can understand them properly. But it is the same counterparts who refuse to understand them. In stead, they only envy. They only argue. They only hate. They only compete.

**తామరిక ‖** వెస నొప్పికి గిలగిలలాడని లెసలెంక లేఁ డొలవునందున్ ;
లేరు సొరున కాకట్టఁబడని పేరుకాకడారు లెచ్చటను ;
లేరు సమా-సరబడి నున్నను రో రా నలరనివా రెటనున్ ;
లేరు పొగడ నుబ్బని వారున్ ; లేరు తెగడ ౦ కుందనివారున్. 71

**మాటల విడఁదీత (పద విభాగము) :** వెసన్, నొప్పికిన్, గిల–గిలలు + ఆడని, లెస–లెంక, లేఁడు + ఒలవునందున్, లేరు, సొరునకున్ + ఆకట్టన్ + పడని, పేరు–కాకడారుల్ + ఎచ్చటను, లేరు, సమా–సరబడిన్, ఉన్నను, రో, రాన్, అలరని–వార్ + ఎటనున్, లేరు, పొగడన్, ఉబ్బని–వారున్, లేరు, తెగడన్ + కుందని–వారున్.

**చఊమోలి (అన్వయ క్రమము) :** వెసన్ నొప్పికిన్ గిల–గిలలు ఆడని లెస–లెంక ఒలవునందున్ లేఁడు. సొరునకున్ ఆకట్టన్ పడని పేరు–కాకడారుల్ + ఎచ్చటను లేరు. సమా–సరబడిన్ ఉన్నను రో రాన్ అలరని–వార్ ఎటనున్ లేరు. పొగడన్ ఉబ్బని–వారున్ లేరు. తెగడన్ కుందని–వారున్ లేరు.

**కుఊ మమ్మాటిక (లఘుటీక) :** వెసన్ = వెంటనే/ తొందఱగా ; లెస–లెంక = గొప్ప సైనికుఁడు ; ఒలవునందున్ = లోకములో ; లేరు సొరునకున్ = అందమునకు ; ఆకట్టన్ + పడని = ఆకర్షింపఁబడని ; పేరు–కాకడారుల్ = గొప్ప వేదాంతులు ; సమా–సరబడిన్ = మృత్యుద్వారమున ; రో = ధనము ; రాన్ = రాఁగా ; అలరని–వార్ = సంతోషింపని వారు ; ఎటనున్ = ఎక్కడ గానీ ; పొగడన్ = పొగడఁగా/ పొగడినప్పుడు ; తెగడన్ = తిట్టఁగా/ తిట్టినప్పుడు ; కుందని–వారున్ = బాధపడనివారు కూడ.

**లోవాఊిక (తాత్పర్యము) :** ఎంత గొప్ప క్రాఁకలు దీఱిన సైనికుఁడైనను దెబ్బ తగిలినప్పుడు నొప్పితో గిలగిలలాడును. ఎంత గొప్ప వేదాంతి అయినను అద్భుతమైన సౌందర్యము తారసిల్లినప్పుడు మంత్రముగ్ధుఁడై చూచుచు ఉండిపోవును. ఎంత మృత్యుముఖములో ఉన్నవానికైను

"డబ్బు వచ్చిన" దనఁగానే సంతోషము కలుగును. ఎంతటివారికైనను పొగడ్తలు సంతోషమును, తిట్లు బాధను కలిగించును.

SUMMARY : When man receives a blow, he writhes in pain no matter how seasoned a warrior he is. He is awestruck by a mesmerizing instance of beauty, no matter how great a philosopher he is. He is elated by a monetary gain though he is at the threshold of death. Everyone is delighted by appreciation and depressed by criticism.

**రాల్మిక ॥** త్రాఁగుబోఁ తనరు తేఁటిని ; తిండిపోఁ తనరు పందిని ;
తిరుగుబోఁ తనరు క్రోఁతిని ; పిసినారి ౨ అనరు చీమను ;
రెంచ కేల పేరులిన్ని, గైకొనక యున్నవానిని ? 72

**మాటల విడఁదీత (పద విభాగము) :** త్రాఁగుబోఁతు + అనరు, తేఁటినిన్, తిండిపోఁతు + అనరు, పందినిన్, తిరుగుబోఁతు + అనరు, క్రోఁతినిన్, పిసినారి, అనరు, చీమను, రెంచకున్, ఏల, పేరుల్ + ఇన్ని, గైకొనక, ఉన్న–వానినిన్.

**చఱమొలి (అన్వయ క్రమము) :** తేఁటినిన్ త్రాఁగుబోఁతు అనరు. పందినిన్ తిండిపోఁతు అనరు. క్రోఁతినిన్ తిరుగుబోఁతు అనరు. చీమను పిసినారి అనరు. ఉన్న–వానినిన్ గైకొనక రెంచకున్ ఇన్ని పేరుల్ ఏల?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తేఁటినిన్ = తేనెటీఁగను ; పిసినారి = లోభి ; రెంచకున్ = మనిషికి ; గైకొనక = తీసికొనక / స్వీకరింపక / ఆమోదింపక.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : No one calls the honeybee a drunkard ; the pig, a glutton ; the monkey, a wanderer ; and the ant a miser. Then why only call man by all these names without accepting him as he is?

**గోరంటిక జంట ॥** నెనమాలఁ డెడమైనను జోఁగారులన్ ; దాఁచుఁ జెలి వీసరములున్ దాఁపసముల్ ;
కొనియాడుచుండు నడిగినవారి ముందటన్ ; ఆయితమై యుండు నననుౕ అనిపించుకొనన్ ; 73
కనలఁడు పెచ్చుగా ; కినియఁడు పెచ్చుకారున్ ; తేఁకువ నిచ్చు ; వెందట్టుఁ ; దను వెన్నంటున్ ;
ఇచ్చుఁ దీసికొను ; నెరుసు నొందఁడు కలిమిన్ ; అప్పటమ్మైన నేస్తుఁ డనఁగఁడు మార్తుర మైన్. 74

**మాటల విడఁదీత (పద విభాగము) :** నెనమాలఁడు + ఎడము + ఐనను, చోన్ + కారులన్, దాఁచున్, చెలి–వీసరములున్, దాఁపసముల్, కొనియాడుచున్ + ఉండున్ + అడిగిన–వారి, ముందటన్, ఆయితము + ఐ, ఉండున్, అనను, అనిపించుకొనన్, కనలఁడు, పెచ్చుగాన్, కినియఁడు, పెచ్చు–కారున్, తేఁకువన్ + ఇచ్చున్, వెన్ + తట్టున్, తనున్, వెన్ను + అంటున్, ఇచ్చున్, తీసికొనున్ + ఎరుసున్ + ఒందఁడు, కలిమిన్, అప్పటము + ఐన, నేస్తుఁడు + అనఁగఁడు, మార్తుర మైన్.

**చఱమొలి (అన్వయ క్రమము) :** అప్పటము ఐన నేస్తుఁడు చోన్ + కారులన్ ఎడము ఐనను నెనమాలఁడు. చెలి–వీసరములున్ దాఁపసముల్ దాఁచున్. అడిగిన–వారి ముందటన్ కొనియాడుచున్ ఉండున్. అనను అనిపించుకొనన్ ఆయితము ఐ ఉండున్. పెచ్చుగాన్ కనలఁడు. పెచ్చు–కారున్ కినియఁడు. తేఁకువన్ ఇచ్చున్. వెన్ తట్టున్. తనున్ వెన్ను అంటున్. ఇచ్చున్. తీసికొనున్. కలిమిన్ ఎరుసున్ ఒందఁడు. మార్తుర మైన్ అనఁగఁడు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నెనమాలఁడు = మఱచిపోఁడు ; ఎడము + ఐనను = దూరమైనను ; చోన్ + కారులన్ = దేశకాలములలో ;

చెలి–వీసరములున్ = నేస్తుని లోపములను ; దాఁపసముల్ = రహస్యములను ; ఆయితము + ఐ ఉండున్ = సిద్ధమై ఉండును ; అనను = తిట్టుటకు ; అనిపించుకొనన్ = తిట్టించుకొనుటకు ; కనలఁడు = కోపింపఁడు ; కినియఁడు = క్రోధింపఁడు ; పెచ్చు–కారున్ = ఎక్కువ కాలము పాటు కూడ ; తేఁకువన్ = ధైర్యమును ; వెన్ + తట్టున్ = ప్రోత్సహించును ; వెన్ను + అంటున్ = అనుసరించును ; ఎరుసున్ + ఒందఁడు = అసూయను పొందఁడు ; కలిమిన్ = సంపద కలినప్పుడు ; అప్పటము + ఐన = స్వచ్ఛమైన ; అనఁగఁడు = కలియఁడు ; మార్తుర మైన్ = శత్రువులతో.

**లోవాఱిక (తాత్పర్యము) :** నిజమైన స్నేహితుఁడు చాల కాలము పాటు చాల దూరములో ఉండుట వలన వేఱుగా ఉన్నను తన స్నేహితుని మఱువఁడు. ఆతఁడు తన స్నేహితుని లోటుపాట్లను, గుట్టుమట్లను దాఁచిపెట్టును. అంతే కాక తన స్నేహితుని గూర్చి ఎవరైన అడిగినప్పుడు పొగడుచుండును కూడ. అవసరమైనచో స్నేహితుని తిట్టుటకు గానీ, ఆతనిచే తిట్టించుకొనుటకు గానీ ఆతఁడు ఎల్లప్పుడును సిద్ధముగానే ఉండును తప్ప కోపగించఁడు. ఒకవేళ కోపించినను ఎక్కువకాలము కోపించఁడు. అటువంటివాఁడు ఎల్లప్పుడు తన స్నేహితునికి ధైర్యము చెప్పును, ప్రోత్సహించును, వెంట ఉండి నడిపించును కూడ. తనకు కావలసినచో అడిగి తీసికొనును. అడిగినప్పుడు ఇచ్చును. తన స్నేహితునికి సంపదలు చేకూడినప్పుడు అవి చూచి అసూయపడఁడు. తన స్నేహితుని శత్రువులతో ఆతఁడెన్నటికిని కలియఁడు.

SUMMARY : A true friend does not forget his friend though separated in time and space. He conceals his friend's defects and secrets. He praises his friend in front of others if enquired about. He is always prepared to criticise his friend and be criticised by the same if the situation so warrants. He does not get angry on that account and even if he does, his anger won't not last long. A true friend always gives confidence, encourages and accompanies to guide. He takes and gives too, as the need be. He does not envy his friend's prosperity. Nor does he join hands with his friend's enemies.

**గోరంటిక జంట** ‖ నిక్కపు టోటమి హుళక్కి, బవరములన్ ; తొలుతటుల క్రమికానుల కొలువునఁ జేరి,
నెలజీతములు గొని నెనరుఁ బూనిన తఱిఁ, దమ వేల్పుల నీఁగి వారి వేల్పుల నూఁది, 75
తమ నుడి మాని వారి నుడి మాటాడిన, తఱి గదా ౢ అది నిక్కముగ రెప్పమగునది ! 76

**మాటల విడఁదీత (పద విభాగము) :** నిక్కపు + ఓటమి, హుళక్కి, బవరములన్, తొలుతటుల, క్రమికానుల, కొలువునన్, చేరి, నెల–జీతములు, కొని, నెనరున్, పూనిన, తఱిన్ + తమ, వేల్పులన్, ఈఁగి, వారి, వేల్పులన్, ఊఁది, తమ, నుడిన్, మాని, వారి, నుడిన్, మాట + ఆడిన, తఱిన్ + కదా, అది, నిక్కముగన్, రెప్పము + అగునది.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** బవరములన్ నిక్కపు + ఓటమి హుళక్కి. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** హుళక్కి = శూన్యము ; బవరములన్ = యుద్ధములలో ; తొలుతటుల క్రమికానుల = (తమ) పూర్వీకుల హంతకుల యొక్క ; కొలువునన్ = సేవలో ; నెనరున్ పూనిన = కృతజ్ఞత వహించిన ; తఱిన్ = సమయమునందు ; వేల్పులన్ = దేవతలను ; ఈఁగి = త్యజించి ; ఊఁది = చేపట్టి ; నుడిన్ = భాషను ; నిక్కముగన్ = నిజముగా ; రెప్పము + అగునది = సంపూర్ణమగునది.

**లోవాఱిక (తాత్పర్యము) :** యుద్ధములో ఓడిపోవుట నిజమైన ఓటమి కాదు. తమ పూర్వీకులను ఎవరైతే చంపినారో ఆ శత్రువుల సేవలోనే ఉద్యోగులుగా చేరి వారి కడ నెలజీతములు తీసికొనుచు, అందుకు వారి పట్ల కృతజ్ఞత వహించిన నాడు, తమ దేవతలను వదిలిపెట్టి వారి దేవతలను పూజించుట మొదలుపెట్టిన నాడు, తమ భాషను మానివేసి శత్రువుల భాషను మాటాడుట మొదలుపెట్టిన నాడు — అది కదా ఒక జాతి పూర్తిగా ఓడిపోయిన నాడు !! వారి ఓటమి సంపూర్ణమైన నాడు.

SUMMARY : A defeat in a war is not the actual defeat. The day when the vanquished join the service of the victors who killed their forefathers and feel beholden to them for the monthly salaries doled out by them ; the day when the former leave their own gods for those of the latter ; the day when the former abandon their own mother tongue and embrace that of the latter ; that is the day when their submission to the enemy is total and complete.

**వెల్మిరిక అల్మోద ||** మెసవెదరు పండుగ వచ్చెనని ; మెసవెద రూరఁ దిరునాళులని ;
మెసవెదరు చెలు లేతెంచిరని ; మెసవెదరు చుట్టము వచ్చెనని ; 77
మెసవెద రరైకఁ గడచితిమని ; మెసవెదరు కొలువులు సిక్కెనని ;
మెసవెద రసివాఁణేఁగితిమని ; మెసవెద రేమియుఁ దలఁ దోపక ; 78
మెసవెద రేదియో తోచెనని ; మెసవెదరు మిగులఁ గాటకమని ;
మెసవెదరు నలిగములు పూటని ; మెసవెదరు నిన్న వటింపనియు ; 79
కతకతమునకు మంది కతికెద- రది కలుగకున్నను గతికెదరు. 80

**మాటల విడఁదీత (పద విభాగము) :** మెసవెదరు, పండుగ, వచ్చెన్ + అని మెసవెదర్ + ఊరన్, తిరునాళులు + అని, మెసవెదరు, చెలుల్ + ఏతెంచిరి + అని, మెసవెదరు, చుట్టము, వచ్చెన్ + అని, మెసవెదర్ + అరైకన్, కడచితిమి + అని, మెసవెదరు, కొలువులు + చిక్కెన్ + అని, మెసవెదర్ + అసివాఁణు + ఏఁగితిమి + అని, మెసవెదర్ + ఏమి + ఉన్ + తలన్ + తోపక, మెసవెదర్ + ఏది + ఓ, తోచెన్ + అని, మెసవెదరు,, మిగులన్ + కాటకము + అని, మెసవెదరు, నలిగములు, పూటు + అని, మెసవెదరు, నిన్న, వటింపు + అని + ఉన్, కత–కతమునకున్, మంది, కతికెదర్ + అది, కలుగకున్నను + కతికెదరు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (మంది) పండుగ వచ్చెన్ అని మెసవెదరు. ఊరన్ తిరునాళులు అని మెసవెదర్. చెలుల్ ఏతెంచిరి అని మెసవెదరు. చుట్టము వచ్చెన్ అని మెసవెదరు. అరైకన్ కడచితిమి అని మెసవెదర్. కొలువులు చిక్కెన్ అని మెసవెదరు. అసివాఁణు ఏఁగితిమి అని మెసవెదర్. ఏమి + ఉన్ తలన్ తోపక మెసవెదర్. ఏది + ఓ తోచెన్ అని మెసవెదర్. మిగులన్ కాటకము అని మెసవెదరు. నలిగములు పూటు అని మెసవెదరు. నిన్న వటింపు అని + ఉన్ మెసవెదరు. కత–కతమునకున్ మంది కతికెదర్. అది కలుగకున్నను కతికెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మెసవెదరు = తినెదరు ; ఊరన్ = ఊరిలో ; తిరునాళులు + అని = దేవుని ఉత్సవములని ; చెలుల్ = స్నేహితులు ; ఏతెంచిరి + అని = వచ్చినారని ; చుట్టము = బంధువు ; అరైకన్ = పరీక్షలో ; కడచితిమి + అని = పాసైతిమి అని ; కొలువులు = ఉద్యోగములు ; చిక్కెన్ + అని = దొరకెను అని ; అసివాఁణు + ఏఁగితిమి + అని = విహారమునకు పోయినామని ; తలన్ = బుఱ్ఱలో ; తోపక = తట్టక / స్ఫురింపక ; మిగులన్ = చాల ; కాటకము + అని = కఱువు ఉన్నదని ; నలిగములు = పదార్థములు ; పూటు+ అని = నిండు ; వటింపు = ఉపవాసము ; కత–కతమునకున్ = ప్రతి కారణమునకును ; మంది = జనము ; కతికెదర్ = తినెదరు ; కలుగకున్నను = లేకపోయినను.

**లోవాటిక (తాత్పర్యము) :** (సుబోధము). జనము పండుగ వచ్చెనని వంటలు వండుకొని తినెదరు. ఊరిలో తిరునాళ్ళని చెప్పి తినెదరు. బంధుమిత్రులు ఇంటికి వచ్చినప్పుడు తినెదరు. "పరీక్షలో పాసైతి" మని ప్రత్యేకముగా వండించుకొని తినెదరు. ఉద్యోగము వచ్చెనని తినె–దరు. "విహారయాత్రకు పోయినా" మని తినెదరు. ఏమియు తోపక తినెదరు. ఏదియో ఒకటి తోచెనన్న ఆనందములో తినెదరు. "దేశములో కఱువున్నది గనుక దొరికినప్పుడే తినవలె" నని చెప్పి తినెదరు. లేదా, "కఱువు లేదు గనుక యథేచ్ఛగా తినవచ్చు" నని తినెదరు. "నిన్న ఉపవాసముంటిమి కనుక ఈ పూఁట తినవలె" నని తినెదరు. ఇట్లు ఏదియో ఒక వంక చెప్పి జనము ఎల్లప్పుడును ఏదియో ఒకటి తినుచునే ఉందురనియు, అసలు ఏ వంకయు లేకపోయినను తినెదరని భావము.

SUMMARY : Folks eat on the eve of a festival. They eat on the eve of the annual temple cel-ebration in the town. They eat when friends and relations have been to theirs. They eat special when they passed an examinaion. They eat in a party when they got a job. They eat when they go on a picnic. They eat when they are short of ideas. They also eat when they got an idea. They eat citing the scarce availability of food due to famine. They also eat citing the wide availability of food items. They eat in extra if they were on fast the previous day. Like this, folks always eat something and find timely pretexts for it. They eat even if no such pretext is found.

**దాసానిక** ॥ చెడ్డవారి నిండు చెడును సూడింప దానసము ;
మంచివారి కొలఁది చెడును మట్టుకు వరకించును ;
కటిక చేదు కాకరకాయటంచు మీఁదాడరు ;
కొలఁది చేదు తోప బీఱఁ బాఱవేసెదరిఁకన్. 81

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెడ్డ-వారి, నిండు, చెడును, సూడింపదు + ఆనసము, మంచి-వారి, కొలఁది, చెడును, మట్టుకున్, వరకించును, కటిక, చేదు, కాకర-కాయ + అటు + అంచున్ (అనుచున్), మీఁదాడరు, కొలఁది, చేదు, తోపన్, బీఱన్ + పాఱవేసెదర్ + ఇఁకన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ఆనసము చెడ్డ-వారి నిండు చెడును సూడింపదు. మంచి-వారి కొలఁది చెడును మట్టుకున్ వరకించును. కటిక చేదు కాకర-కాయ + అటు + అంచున్ (అనుచున్) మీఁదాడరు. కొలఁది చేదు తోపన్ ఇఁకన్ బీఱన్ పాఱవేసెదర్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సూడింపదు = ద్వేషింపదు ; ఆనసము = లోకము ; కొలఁది చెడును = కొద్దిపాటి చెడును ; మట్టుకున్ = మాత్రము ; వరకించును = శిక్షించును ; మీఁదాడరు = ఫిర్యాదు చేయరు ; తోపన్ = అనిపించఁగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** చెడ్డవారు పూర్తి చెడ్డవారుగా ఉన్నందుకు ఈ లోకము వారిని ద్వేషింపదు. కాని మంచివారిలో కొద్దిపాటి చెడు ఉన్నను వారిని పరమ దుర్మార్గులని చెప్పుచు శిక్షించును. కాకరకాయ చేదుగా ఉన్నదని పాఱవేయు వారెవఱును లేరు. కాని బీఱకాయలో ఒక్క ముక్క చేదుగా అనిపించఁగానే మొత్తము కాయను "ఛీ" అనుచు గిరవాటు వేసెదరు.

SUMMARY : The world does not hate the wicked for their full-fleded wickedness, but puni-shes the good ones if they are found to be faulty in just one matter. Folks never complain of the bitterness in the bitergourd, but despise and discard the entire ridge-gourd if it tastes bitter in just one small part.

**గోరంటిక జంట** ॥ పసరమ్ములకే తాఁ బొసఁగమ్ము మిగుల, నొసపుగ వడారము జరుమానపు మనిక ;
నడితి కానకము కడచిన దాని నెనపు ; అడుగల్లు రాఁగలియె తీరుంటమునకు ; 82
ముక్కారుల కాకడఁ బుక్కిటం బట్టి, ముక్కంటియై రెంచ విక్కవిఱియవలె. 83

**మాటల విడఁదీత (పద విభాగము) :** పసరమ్ములకే, తాన్, పొసఁగమ్ము, మిగులన్, ఒసపుగన్, వడారము, జరుమానపుం, మనిక, నడితికిన్, ఆనకము, కడచిన-దాని, నెనపు, అడుగల్లు, రాఁగలియె, తీరుంటమునకున్, మూఁడు + కారుల, కాకడన్, పుక్కిటన్, పట్టి, ముక్కంటి + ఐ, రెంచ, విక్క-విఱియన్ + వలెన్ (విఱియన్ + విఱియన్ వలెన్).

**చఱమోలి (అన్వయ క్రమము) :** వడారము జరుమానపుం మనిక ఒనపుగన్ తాన్ పసరమ్ములకే మిగులన్ పొసఁగమ్ము. కడచిన దాని నెనపు నడితికిన్ ఆనకము. తీరుంటమునకున్ అడుగల్లు రాఁగలియె. మూఁడు + కారుల కాకడన్ పుక్కిటన్ పట్టి ముక్కంటి ఐ రెంచ విక్క విఱియన్ వలెన్ (విఱియన్ + విఱియన్ వలెన్).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పసరమ్ములకే = జంతువులకే ; తాన్ = తాను (పాదపూరణము) ; పొసఁగమ్ము = యుక్తము/ సంభవము ; మిగులన్ = బాగుగా/ ఎక్కువగా ; ఒనపుగన్ = అందముగా ; వడారము = కేవలము ; జరుమానపుం + మనిక = వర్తమాన జీవనము ; నడితికిన్ = నీతికి ; ఆనకము = ఆధారము ; కడచిన దాని నెనపు = జరిగిపోయిన విషయముల జ్ఞాపకము ; అడుగల్లు = పునాది / పునాదిఱాయి ; రాఁగలియె = భవిష్యత్తే ; తీరుంటమునకున్ = నాగరికతకు ; మూఁడు + కారుల = మూఁడు కాలముల ; కాకడన్ = తత్త్వమును ; పుక్కిటన్ పట్టి = బాగుగా అభ్యసించి ; ముక్కంటి + ఐ = మఱొక శివుఁడై ; రెంచ = మనిషి ; విక్కవిఱియన్ + వలెన్ = మిక్కిలి వికసింపవలెను.

**లోవాఱిక (తాత్పర్యము) :** కేవలము వర్తమానములో బ్రదుకుట జంతువులకే యుక్తము. అది మానవులకు పనికిరాదు. మానవుని నీతి – కడచిపోయిన వానిని గుఱుతుంచుకొనుట మీఁద ఆధారపడి ఉన్నది. అట్లే భవిష్యద్ అవసరములను గూర్చిన ఊహయే ఆతని నాగరికతకు (ఇళ్ళు, నగరములు, నేలసాఁగు మఱియు వేఱేవేఱే పనిముట్లకు) పునాది. కనుక మానవుఁడీ మూఁడు కాలముల తత్త్వమును జీర్ణించుకొని మూఁడు కన్నులు గల శివుని వలె వెలుఁగవలెను.

SUMMARY : It only behoves well for animals to live in the absolute present. That is not at all useful for humans, for man's ethics are rooted in his memory of the past. Similarly, the idea of future needs forms the foundation for his civilization. Therefore man should duly comprehend the nature of the past, present and the future and shine like Siva (the god of three eyes).

**పస్సియ** ‖ లాహపాటి సేయు రెంగానసము, లాతులవి రెండొండు వీసరములఁ
బెద్ద యుల్లము సేసి మన్నించుడున్ ; ప్రాల ఱా లేరరో నానాడున్? 84

**మాటల విడఁదీత (పద విభాగము) :** లాహ–పాటి + చేయున్, రెంచ + కానసము, లాతులవి, రెండు + ఒండు, వీసరములన్, పెద్ద + ఉల్లము + చేసి, మన్నించుడున్, ప్రాలన్, ఱాల్ + ఏరరో, నానాడున్ (నాడున్ + నాడున్).

**చఱమోలి (అన్వయ క్రమము) :** లాతులవి రెండు ఒండు వీసరములన్ పెద్ద ఉల్లము చేసి మన్నించుడున్ రెంచ + కానసము లాహ–పాటి చేయున్. నానాడున్ (నాడున్ + నాడున్)ప్రాలన్ ఱాల్ ఏరరో.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** లాహ–పాటి + చేయున్ = స్వర్గముతో సమానమగును ; రెంచ + కానసము (రెంగానసము) = మానవ లోకము ; లాతులవి = ఇతరులవైన ; రెండు + ఒండు = ఒకటి–రెండు ; వీసరములన్ = లోపములను ; పెద్ద + ఉల్లము + చేసి = పెద్ద మనసు చేసికొని ; మన్నించుడున్ = మన్నింపఁగా ; ప్రాలన్ = బియ్యములో ; ఱాల్ + ఏరరో = ఱాళ్ళు ఏరరా? ; నానాడున్ (నాడున్ + నాడున్) = ప్రతి రోజును.

**లోవాఱిక (తాత్పర్యము) :** మానవులు ఇతరుల యొక్క ఒకటి–రెండు లోటుపాట్లను పెద్దమనసు చేసికొని మన్నించుట నేర్చుకొన్నచో ఈ భూలోకము స్వర్గముతో సమానముగా మారిపోవును. బియ్యములో ఱాళ్ళు ఉన్నవని దానిని పారవేయుచున్నారా? లేదు కదా ! ప్రతి దినము కష్టపడి వాటిని ఏరి మిగితాది వండుకొందురు కదా ! (మనుష్యుల విషయములో కూడ అట్లే చేయవలె నని భావము).

SUMMARY : The mortal world turns into the veritable heaven if people learn to excuse a

defect or two of others. They do not discard rice just because it contains stones, do they? They daily remove the stones and cook the remaining grain. (The same needs to be done in the case of the fellow-humans too).

**గోరంటిక జంట** ॥ ఉడికిన చొప్పుఁ దెలియఁగ నోమటి యంత, పుడికి పొడఁగనంగ నక్కఱలేదంట ;
మెదుకొక్కటి మెదిగిన నది సాలునంట ; మెదుకొకటి మెసవి బ్రదికెద నన్నదెవఱు? 85
తనరు నొక కరుటనె తడి-మా-డత్తెసరు ; నాసి నానుళ్ళ నమ్మరా దొక పిసరు. 86

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఉడికిన, చొప్పున్ + తెలియఁగన్ + ఓమటి, అంత, పుడికి, పొడఁగనంగన్ + అక్కఱ–లేదు + అంట, మెదుకు + ఒక్కటి, మెదిగినన్ + అది + చాలున్, అంట, మెదుకు + ఒకటి, మెసవి, బ్రదికెదన్ + అన్నది + ఎవఱు, తనరున్ + ఒక, కరుటనె, తడి–మాదు + అత్తెసరు, నాసి, నానుళ్ళన్, నమ్మరాదు + ఒక, పిసరున్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ....ఒక కరుటనె తడి–మాదు అత్తెసరు తనరున్. నాసి నానుళ్ళన్ ఒక పిసరున్ నమ్మరాదు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఉడికిన చొప్పున్ = ఉడికిన విధానమును ; తెలియఁగన్ = తెలిసికొనుటకు ; ఓమటి అంత = అన్నమంతయు ; పుడికి = పిసికి ; పొడఁగనంగన్ + అక్కఱ–లేదు + అంట = పరిశీలించ నక్కఱలేదఁట ; మెదిగినన్ = మెత్తబడినచో ; మెసవి = తిని ; తనరున్ = అలరారును ; ఒక కరుటన్ + ఎ = ఒక్క అన్నపు ముక్కలోనే ; తడి–మాదు + అత్తెసరు = తడి మెదుకులు, మాడు మెదుకులు, అత్తెసరు మెదుకులు ; నాసి = నాణ్యము లేని ; నానుళ్ళన్ = సూక్తులను ; ఒక పిసరున్ = కొంచెము కూడ.

**లోవాఱిక (తాత్పర్యము) :** అన్నము ఉడికినదో లేదో తెలిసికొనుటకు దాని నంతటిని పిసికి చూడనక్కఱలేదని, ఒక్క మెదుకును పరీక్షించినచో చాలు ననియు కొందఱు పల్కెదరు. కాని ఇట్లు చెప్పువారు తాము ఒకే ఒక్క మెదుకు తిని బ్రదుకుచున్నారా? ఒకే అన్నపు కరుదులో మెత్తగా ఉడికిన మెదుకులు, మాడిపోయిన మెదుకులు మఱియు బిరుసుగా ఉడికిన మెదుకులు మూఁడును ఉండవచ్చును. కనుక నాణ్యము (నిక్కము) లేని ఇటువంటి మేల్పలుకులు నమ్మఁదగినవి కావు.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** వ్యక్తులలోని ఒకటో రెండో లక్షణములను పట్టుకొని వారి యొక్క మొత్తము వ్యక్తిత్వము మీఁద తీర్పు తీర్చుటను కవి ఈ పద్యము గుండా ఖండించుచున్నాఁడు. మెదుకుల గుఱించి చెప్పినది మెదుకులకే పూర్తిగా వర్తింపదని, అటువంటప్పుడు అది మనుష్యులకెట్లు వర్తించునని కవి ప్రశ్న.

SUMMARY : Some say that all of rice need not be squeezed to know if it cooked well or not. To them, it is enough if one seed is found to have cooked well. But who can subsist on a single seed? A single morsel may contain well-cooked seeds, burnt seeds and hard-cooked seeds at a time. Therefore, such adages are not worth believing in.

*(The poet condemns the popular practice of rubbishing individuals on the basis of one or two perveived demerits of theirs, comparing them with rice).*

**తామరిక** ॥ పరి మాట సెప్పనేల? తారె పందలౌదురు కోనోకులే,
పలికినట్లు సేసెడివానికిఁ - బలికెడివానికిఁ జేసినటులె ;
వాసేతల పొంతనల్ వెరసి వాటించును మాటలకు బ్రోము ;
పొందించు నుల్లమునకు దీము ; పొలుపారెడు మిస్మిమై మోము. 87

**మాటల విడఁదీత (పద విభాగము) :** పరి–మాట + చెప్పన్ + ఏల, తారె, పందల్ + ఔదురు, కోనోకులే, పలికిన + అట్లు, చేసెడి–వానికిన్, పలికెడి–వానికిన్, చేసిన + అటులె, వా + చేతల, పొంతనల్, వెరసి, వాటించును, మాటకున్, బ్రోమున్, పొందించున్ + ఉల్లమునకున్, దీమున్, పొలుపు + ఆరెడున్, మిస్మిమైన్, మోము.

**చఅమోలి (అన్వయ క్రమము) :** పరి–మాట చెప్పన్ ఏల? పలికిన అట్లు చేసెడి–వానికిన్ చేసిన అటులె పలికెడి–వానికిన్ కోనోకులే తారె పందల్ ఔదురు. వా + చేతల పొంతనల్ వెరసి మాటకున్ బ్రోమున్ వాటించును. ఉల్లమునకున్ దీమున్ పొందించున్. మోము మిస్మిమైన్ పొలుపు ఆరెడున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పరి–మాట = జనము సంగతి ; చెప్పన్ + ఏల = చెప్పుట ఎందుకు? తారె = తామే ; పందల్ = పిఱికివారు ; కోనోకులే = దివ్యులే ; వా + చేతల = వాక్కు మఱియు ఆచరణల యొక్క ; పొంతనల్ = సమన్వయము ; వెరసి = కలసి మొత్తమై ; వాటించును = కలిగించును ; బ్రోమున్ = శక్తిని ; పొందించున్ = జతచేయును ; ఉల్లమునకున్ = మనస్సునకు ; దీమున్ = ఆత్మ విశ్వాసమును ; పొలుపు + ఆరెడున్ = అలరారును ' మిస్మి మైన్ = తేజస్సుతో ; మోము = ముఖము.

**లోవాఱిక (తాత్పర్యము) :** చెప్పినట్లు చేయువానికి, చేసినది చెప్పువానికి యక్ష, గంధర్వ, కిన్నర, కింపురుషాది దివ్యులే భయపడెదరన్నచో ఇఁక సాధారణ జనము సంగతి చెప్పుట ఎందులకు? వాగనుష్ఠానముల కలయిక ఒకానొక దివ్యశక్తిని పుట్టించును. అది మనస్సునకు ఆత్మ విశ్వాసమును కలిగించును. అప్పుడు ముఖము కూడ తేజస్సుతో కళకళలాడును.

SUMMARY : Even demigods are scared of the one who practises what he preaches and who candidily speaks out what he has done. Then why mention the ordinary folks? The combination of the mutually matching speech and action produces tremendous energy which develops self–confidence in man and makes his face glow with brilliance.

**అవిగింగ** ॥ ఎవ ఱేమిటియో వెలార్చు నొక్క కలగుండు ;
ఎగఁదట్టుఁ బట్టియుంచిన తడ-సీజందములు ;
నేలతలంకపు బ్రల్లులలోన వెదకెదరు,
దొంగలు లిబులకు, దొరలు మనుగడారులకు. 88

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎవఱు + ఏమిటి + ఓ, వెలార్చున్ + ఒక్క, కలగుండు, ఎగఁదట్టున్, పట్టి + ఉంచిన, తడ–సీజందములు, నేల–తలంకపుం, బ్రల్లులలోనన్, వెదకెదరు, దొంగలు, లిబులకున్, దొరలు, మనుగడారులకున్.

**చఅమోలి (అన్వయ క్రమము) :** ఒక్క కలగుండు ఎవఱు ఏమిటి + ఓ వెలార్చున్. పట్టి ఉంచిన తడ–సీజందములు ఎగఁదట్టున్. నేల–తలంకపుం బ్రల్లులలోనన్ దొంగలు లిబులకున్ దొరలు మనుగడారులకున్ వెదకెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వెలార్చున్ = బయట పెట్టును ; కలగుండు = సంక్షోభము ; ఎగఁదట్టున్ = పైకి తన్నుకొని వచ్చును ; పట్టి + ఉంచిన = బలవంతముగా అదిమిపట్టి ఉంచిన ; తడ–సీజందములు = చిర దుస్సంస్కారములు ; నేల–తలంకపుం = భూకంపము యొక్క ; బ్రల్లులలోనన్ = శిథిలములలో ; లిబులకున్ = సిరుల కోసము ; దొరలు = గౌరవనీయులు ; మనుగడారులకున్ = బ్రదికి ఉన్న వారి కోసము.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక సంక్షోభము దాఁపరించినప్పుడు ఎవఱి బుద్ధి ఏమిటన్నది బయటపడిపోవును. ఎప్పటి నుండియో బయటికి రాకుండ బలవంతముగా అదిమిపట్టి ఉంచిన చిరకాల దుస్సంస్కారములు కట్టలు త్రెంచుకొని ఎగదన్నుక వచ్చును. భూకంపము వచ్చిన తరువాత దొంగలు ఆ శిథిలములలో "డబ్బు, బంగారము, వస్తువులు ఉన్నవేమో" అని వెదకెదరు. మంచివారు మటుకు అవే శిథిలము

లలో "ఎవఠైన కొనయూపిరితో బ్రదికి ఉన్నారేమో" అని వెదకెదరు.

SUMMARY : When a calamity/ crisis befalls people, it lays bare who is what. The long–pent–up evil urges erupt out all of a sudden. In the aftermath of an earthquake, theives go on searching for valuables and the noble will be on the lookout for survivors in the ruins and rubble.

**పస్పియ** ॥ ఏమి గర్గలము జేసిరి ప్లల్లదు, లైములు మేటివి గైసేయుటకై?
చేసిరి పో, అంత గర్గలము గల, మీసికేల హుళక్కి, వాసికఅద? 89

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏమి, గర్గలమున్ + చేసిరి, ప్రల్లదుల్ + ఐములు, మేటివి, కైసేయుటకై, చేసిరి, పో, అంత, గర్గలము, కల, మీసికిన్, ఏల, హుళక్కి, వాసి–కఅద?

**చఅమోలి (అన్వయ క్రమము) :** మేటివి ఐములు కైసేయుటకై ప్రల్లదుల్ ఏమి గర్గలమున్ + చేసిరి? చేసిరి పో. అంత గర్గలము కల మీసికిన్ వాసి–కఅద ఏల హుళక్కి?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గర్గలమున్ = పుణ్యమును ; ప్రల్లదుల్ = దుర్మార్గులు ; ఐములు = పదవులు/ పదములు ; మేటివి = ఉత్తమములు ; కైసేయుటకై = అలంకరించుటకు ; చేసిరి పో = సరే చేసిరి ; మీసికిన్ = పురుషునికి ; హుళక్కి = శూన్యము ; వాసి–కఅద = మంచి బుద్ధి?

**లోవాఱిక (తాత్పర్యము) :** లోకములో పెక్కంద్రు దుర్మార్గులు మంచిమంచి పదవులలో ఉందుట గోచరించును. మఱి ఇంత దుర్మార్గులు అంత మంచి పదవులను అలంకరించుటకు తమ పూర్వజన్మములలో ఏమి పుణ్యము చేసిరి? సరే చేసిరనుకొందము. కాని ఆ పుణ్యఫలము చేత వారికి ఈ జన్మలో మంచి పదవులతో పాటు మంచి బుద్ధి కూడ కలుగకపోవుటకు కారణమేమి?

SUMMARY : There are several wicked people in high positions. What good could they have done in their previous incarnations to acquire such positions as a reward? Probably they did it. But why did that good not bestow on them a kind heart along with the high positions?

**దాసానిక** ॥ కల దాపోవిక, కడిఁదిపడి గడించిన దానన్ ;
కాని చెప్పఁజనవు కడిందికిఁ బెడతెల్లముల్ ;
తన కఅదయుఁ గాల్సేతులున్ వాడఁ దనివి గాని,
తగవు-గుట్రల గుండా గడింపఁగ నెమ్మి యేమి? 89

**మాటల విడఁదీత (పద విభాగము) :** కలదు + ఆపోవిక, కడిఁది–పడి, గడించిన–దానన్, కాని, చెప్పన్ + చనవు, కడిందికిన్, పెడతెల్లముల్, తన, కఅదయున్ + కాల్ + చేతులున్, వాడన్ + తనివి, కాని, తగవు–కుట్రల, గుండా, గడింపఁగన్, నెమ్మి, ఏమి?

**చఅమోలి (అన్వయ క్రమము) :** కడిఁది–పడి గడించిన–దానన్ ఆపోవిక కలదు. కాని కడిందికిన్ పెడతెల్లముల్ చెప్పన్ చనవు.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఆపోవిక = తృప్తి ; కడిఁది–పడి = కష్టపడి ; గడించిన–దానన్ = సంపాదించిన దానిలో ; చెప్పన్ + చనవు = చెప్పఁదగవు ; కడిందికిన్ = కష్టమునకు ; పెడతెల్లముల్ = అపార్థములు ; కఅదయున్ = బుద్ధిని ; వాడన్ = ఉపయోగింపఁగా ; తనివి = తృప్తి ; తగవు–కుట్రల గుండా = కోర్టుకేసుల ద్వారా మఱియు కుట్రల ద్వారా ; గడింపఁగన్ = సంపాదింపఁగా ; నెమ్మి = ఆదరము.

**లోవాతిక (తాత్పర్యము) :** కష్టపడి సంపాదించిన దానిలో తృప్తి ఉండును. కాని "కష్టము" అను మాటకు అపార్థములు చెప్పుట సరికాదు. కష్టపడుట అనఁగా తన బుద్ధిశక్తిని, కాలుసేతులను ఉపయోగించుటయే. అట్లు కాకుండ కోర్టువ్యాజ్యముల గుండా, కుట్రల గుండా సంపా దించిన దాని పట్ల ఆదరమెందుకు? దానిని చూచుకొని గర్వమెందుకు?

SUMMARY : There is a sense of satisfaction in earning something through hard work. But it is not proper to misinterpret the very phrase 'hard work' which actually means putting one's own intellect and limbs to the maximum use. However, if one earns through lawsuits and conspiracies, why love that money? What is there to feel proud of?

**గోరంటిక** ॥ కతన పనికివచ్చుఁ గట్టకములఁ దెలియ ; ననద ౨ అది రెంచల నాకళించుకొనఁగ ;
వేఱు తెల్లము లే దాకళింపునకున్ గలవారిఁ గలయ ట్లియ్యకొనుట కన్న. 90

**మాటల విడఁదీత (పద విభాగము) :** కతన, పనికిన్-వచ్చున్ + కట్టకములన్ + తెలియన్ + అనద, అది, రెంచలన్ + ఆకళించుకొనఁగన్, వేఱు, తెల్లము, లేదు + ఆకళింపునకున్, కల-వారిన్ + కల + అట్లు + ఇయ్యకొనుట, కన్నన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** కట్టకములన్ తెలియన్ కతన పనికిన్-వచ్చున్. అది రెంచలన్ ఆకళించుకొనఁగన్ అనద. కల-వారిన్ కల అట్లు ఇయ్యకొనుట కన్నన్ ఆకళింపునకున్ వేఱు తెల్లము లేదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కతన = తర్కము ; పనికిన్-వచ్చున్ = ఉపయోగపడును ; కట్టకములన్ = శాస్త్రములను ; తెలియన్ = అర్థము చేసికొనుటకు ; అనద = అసమర్థము ; అది = ఆ తర్కము ; రెంచలన్ = మనుష్యులను ; ఆకళించుకొనఁగన్ = అర్థము చేసికొను టకు ; వేఱు తెల్లము = మఱియొక అర్థము ; కల-వారిన్ = ఉన్నవారిని ; కల + అట్లు = ఉన్నట్లుగా ; ఇయ్యకొనుట కన్నన్ = అంగీక రించుట కన్న.

**లోవాతిక (తాత్పర్యము) :** తర్క-వితర్కములు శాస్త్రములనే తప్ప మనుష్యులను అర్థము చేసికొనుటకు పనికిరావు. మనుష్యులను అర్థము చేసి కొనుట అనఁగా వారిని వారున్నట్లుగా అంగీకరించుటయే. అవగాహనకు మఱియొక అర్థము లేదు.

SUMMARY : Logic comes handy while making sense of sciences, but not humans. To under-stand humans is – to accept and embrace them as they are. Understanding has no other meaning.

**అవిగింగ** ॥ ఒకఱు నేటఁజాల రొరుల కెయ్యది మేలో ;
తమ కైవడియే ౨ అందఱకని తలంచెదరు ;
పులు మేయకెట్లు బ్రదుకుఁ బులి ౨ అనుకొను మొదవు ;
పొలానక మొదవెట్లు పొదలు ననుకొనును బులి. 91

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒకఱు, నేటన్ + చాలరు + ఒరులకున్, ఏ + అది, మేలు + ఓ, తమ, కైవడి + ఏ, అందఱకున్ + అని, తలంచెదరు, పులు, మేయక + ఎట్లు, బ్రదుకున్ + పులి, అనుకొనున్, మొదవు, పొల + ఆనక, మొదవు + ఎట్లు, పొదలున్ + అనుకొనును + పులి.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ఒరులకున్ ఏ + అది మేలు + ఓ ఒకఱు నేటన్ చాలరు. తమ కైవడి + ఏ అందఱకున్ అని తలంచెదరు. మొదవు పులు మేయక పులి ఎట్లు బ్రదుకున్ అనుకొనున్. పులి పొల ఆనక మొదవు ఎట్లు పొదలున్ అనుకొనును.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నేటన్ + చాలరు = నిర్ణయింపలేరు ; ఒరులకున్ = ఇతరులకు ; ఏ + అది (ఎయ్యది) = ఏది ; మేలు + ఓ = శ్రేయస్కరమో ; కైవడి + ఏ = పద్ధతియే ; పులు మేయక = గడ్డి తినకుండ ; మొదవు = ఆవు ; పొల + ఆనక = మాంసమును తినకుండ ; పొదలున్ = పెంపొందును.

**లోవాటిక (తాత్పర్యము) :** తమకే పద్ధతి మంచిదో అదే అందఱికిని మంచిదని జనము తలఁచెదరు. కాని అది సరికాదు. కనుక ఇతరులకు ఏది శ్రేయస్కరమో తాము నిర్ణయింపలేరు. గడ్డి తినకుండ పులి ఎట్లు బ్రదుకుచున్నదని ఆవు ఆశ్చర్యపడును. మాంసము తినకుండ ఆవు అంత పెద్దగా ఎట్లయినదని పులి నివ్వెఱపోవును.

SUMMARY : Folks think that their own ways are good for everyone else which is false. So one cannot decide what is good for others. The cow is surprised as to how the tiger survives without eating grass, while the tiger is intrigued as to how the cow has managed to grow so big without eating meat.

**అవిగింగ ||** ఎవఱికి వారు పైకి విడి, విచ్చు మనీకియ ;
ఎసఁగు నొండోరు నడుమఁ ద్రిచ్చు కౌలంకియ ;
సమసెదరు వా రది తెగిన మఱు-ఱెప్పాటన్,
బిచ్చుకలు లేక పంట సచ్చు నప్పాటన్. 92

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎవఱికిన్, వారు, పైకిన్, విడి, విచ్చు, మనీకి + అ, ఎసఁగున్, ఒండోరు, నడుమన్, ద్రిచ్చు, కౌలంకియ, సమసెదరు, వార్ + అది, తెగిన, మఱు–ఱెప్పాటన్, పిచ్చుకలు, లేక, పంట, సచ్చు + ఆ + పాటన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎవఱికిన్ వారు పైకిన్ విడి విచ్చు మనీకి + అ. ఒండోరు నడుమన్ ద్రిచ్చు కౌలంకియ ఎసఁగున్. పిచ్చుకలు లేక పంట సచ్చు + ఆ + పాటన్ అది తెగిన మఱు–ఱెప్పాటన్ వార్ సమసెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** విడి = వేఱైన ; విచ్చు మనీకి + అ = స్వతంత్ర జీవియే ; ఎసఁగున్ = విలసిల్లును ; ఒండోరు నడుమన్ = పరస్పరము ; ద్రిచ్చు కౌలంకియ = అదృశ్య అనుబంధము ; సమసెదరు = నశించెదరు ; అది = ఆ అనుబంధము ; మఱు–ఱెప్పాటన్ = మఱు క్షణములో ; సచ్చు + ఆ + పాటన్ = చనిపోవు విధముగానే.

**లోవాటిక (తాత్పర్యము) :** ఎవఱికి వారు – పైకి ఒకఱి నుండి ఒకఱు వేర్వేఱైన సర్వ స్వతంత్ర జీవుల వలెనె కనిపించెదరు. కాని వారి నడుమ కంటికి కనిపించని అనుబంధములుండును. ఆ అనుబంధము తెగినచో వారు మఱుక్షణమే నశించెదరు. పిచ్చుకలు లేనిచో పంటలు ఏ విధముగా నశించిపోవునో అట్లే.

SUMMARY : On the surface, each one looks like a separate and absolutely independent be-ing. But there lie invisible bonds between people. People will perish the moment the bond is broken, just like crops do in the absence pf sparrows.

**పస్సియ ||** నీవెవఱినో మడిపినందుకుఁ గా, దెవఱి కొంపనొ పీఁకితివని కాదు,
నిన్ను వెలిబైలు కంటగించునది, నీవు నీవుగా నున్నందులకే. 93

**మాటల విడఁదీత (పద విభాగము) :** నీవు + ఎవఱినో, మడిపిన + అందుకున్ + కాదు + ఎవఱి, కొంపనొ, పీఁకితివి + అని, కాదు, నిన్నున్, వెలిబైలు, కంటగించునది, నీవు, నీవుగాన్ + ఉన్న + అందులకే.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మడిపిన + అందుకున్ = చంపినందుకు ; వెలిబైలు = బాహ్యావరణము (సంఘము) ; కంటగించునది = ద్వేషించునది.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Society hates you, not because you have killed someone or destroyed someone's house , but only because you chose to remain what you are.

**వెల్మిరిక ॥** వట్టిమాట "తన్గాఁపునకే, లామీఁదువా"టను తలపోత ;
వీల్పడదు తన్గాఁపు కలిదము, మీఁదువాటుఁ దొలుతనె నేర్వక. 94

**మాటల విడఁదీత (పద విభాగము) :** వట్టి–మాట, తన్ + కాఁపునకే, లా–మీఁదువాటు + అను, తలపోత, వీల్+పడదు, తన్ + కాఁపు, కలిదము, మీఁదువాటున్ + తొలుతనె, నేర్వక.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తన్ + కాఁపునకే లా–మీఁదువాటు + అను తలపోత వట్టి–మాట. మీఁదువాటున్ + తొలుతనె నేర్వక తన్ + కాఁపు కలిదము వీల్పడదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తన్ + కాఁపునకే = ఆత్మరక్షణకే ; లా–మీఁదువాటు = పరాక్రమణము ; తలపోత = ఆలోచన ; వీల్+పడదు = సాధ్యము కాదు ; కలిదము = సైతము ; మీఁదువాటున్ = దాడిని ; తొలుతనె = ముందే/ మొదటిలోనే.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఆత్మరక్షణమునకే పరాక్రమణము అన్నది వట్టి మాట. పరాక్రమణము (దాడి) చేయుట నేర్చుకొనకుండ ఆత్మ-రక్షణము కూడ సాధ్యపడదు.

SUMMARY : "Offense for the sake of defense" is a hollow adage. The fact is – that self-defe-nse is not possible without learning to launch an offensive.

**అవిగింగ ॥** బల్లిదుఁడు గాఁడు పలువుఱతోఁ బోరువాఁడు ;
బల్లిదుఁడు పలు చెలుల పెల్లు గలిగినవాఁడు ;
మొప్పెతన మది యెంత గొప్ప బల్లిదుఁడైన,
నెక్కటియై పోరఁగ నెక్కువమంది మెయిన్. 95

**మాటల విడఁదీత (పద విభాగము) :** బల్లిదుఁడు, కాఁడు, పలువుఱతోన్ + పోరు–వాఁడు, బల్లిదుఁడు, పలు–చెలుల, పెల్లు, కలిగిన–వాఁడు, మొప్పెతనము + అది, ఎంత, గొప్ప, బల్లిదుఁడు + ఐనన్, ఎక్కటి + ఐ, పోరఁగన్ + ఎక్కువ–మంది మెయిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పలువుఱతోన్ పోరు–వాఁడు బల్లిదుఁడు కాఁడు. పలు చెలుల పెల్లు కలిగిన–వాఁడు బల్లిదుఁడు. ఎంత గొప్ప బల్లిదుఁడు ఐనన్ ఎక్కువ–మంది మెయిన్ ఎక్కటి ఐ పోరఁగన్ అది మొప్పెతనము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** బల్లిదుఁడు = బలవంతుఁడు ; పలువుఱతోన్ = చాలమందితో ; పలు చెలుల పెల్లు = అనేక మిత్రుల బాహుళ్యము ; మొప్పెతనము = మూర్ఖత్వము ; ఎక్కటి + ఐ = అసహాయ శూరుఁడై ; పోరఁగన్ = పోరాడుట ; ఎక్కువ–మంది మెయిన్ = ఎక్కువమందితో.

**లోవాఱిక (తాత్పర్యము) :** బలవంతుఁడను మాటకు అర్థము – ఒకేసారి చాలమందితో పోరాడువాఁడని కాదు. ఎక్కువమంది స్నేహితులు

గలవాఁడని అర్థము. ఎంతటి బలవంతుఁడైనను ఎక్కువమందితో ఒకేసారి అసహాయ శూరుని వలె పోరాడుట మూర్ఖత్వమగును.

**పైమాల విడఁబఱు (విశేష వివరణము) :** పలువురితో పోరాడునప్పుడు వ్యక్తిగత బలము పెద్దగా పనికిరాదని పద్యభావము.

SUMMARY : Strength does not mean the ability to fight multiple enemies at a time. It only means having multiple associates. It is foolish to fight many alone, no matter however strong one is. (The poet implies that personal strength is of no consequence while fighting many).

**దాసానిక** ॥ సరియలన్ గ్రంకనల నైతి, సాటిక మొకించుక ;
నిఱుసాటికము హుళక్కి, రెందౌలముల జోలిన్ ;
అన్ని నలిగములున్ వంటకు వంచమే గాని,
సహంసహ పాళ్ళు తగవు తిన నింపు నింపన్. 96

**మాటల విడఁదీత (పద విభాగము) :** సరియలన్, క్రంకనలన్, ఐతి, సాటికము + ఒక + ఇంచుక, నిఱుసాటికము, హుళక్కి, రెంచ + తౌలముల, జోలిన్, అన్ని, నలిగములున్, వంటకున్, వంచమే, కాని, సహం –సహ–పాళ్ళు, తగవు, తినన్ + ఇంపున్, నింపన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** సరియలన్ క్రంకనలన్ ఒక ఇంచుక సాటికము ఐతి. రెంచతౌలముల జోలిన్ నిఱుసాటికము హుళక్కి. అన్ని నలిగములున్ వంటకున్ వంచమే కాని తినన్ ఇంపున్ నింపన్ సహం –సహ–పాళ్ళు తగవు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సరియలన్ = అవకాశములలోను ; క్రంకనలన్ = చట్టములలోను ; ఐతి = సాధ్యము/ సంభవము ; సాటికము = సమానత్వము ; ఒక + ఇంచుక = కాసంత ; నిఱుసాటికము = పూర్తి సమానత్వము ; హుళక్కి = శూన్యము ; రెంచ + తౌలముల = మానవ సంబంధముల ; జోలిన్ = ప్రసక్తిలో ; నలిగములున్ = పదార్థములును ; వంచమే = ముఖ్యమే ; సహం –సహ–పాళ్ళు = 50 – 50 భాగములు ; తినన్ = తినవలెను అన్న ; ఇంపున్ = ఇష్టమును ; నింపన్ = నింపుటకు ; తగవు = పనికిరావు.

**లోవాఱిక (తాత్పర్యము) :** సమానత్వమన్నది అవకాశములలోను, చట్టపరముగా ఏర్పఱచు సౌకర్యములలోను కొంతవరకు సాధ్యమే. కాని మానవ సంబంధముల విషయములో పూర్తి సమానత్వము వీలుపడదు. వంట వండునప్పుడు అన్ని పదార్థములును ముఖ్యమే కాని వాటిని ఏ పాళ్ళలో కలుపవలెనో ఆ పాళ్ళలోనే కలుపవలెను. అట్లు చేయకుండ ప్రతిది 50 : 50 నిష్పత్తిలో కలిపినచో అట్టి వంట తినుటకు ఇష్టమును పుట్టింపదు కదా.

SUMMARY : Equality is possible to an extent with regard to opportunities and certain statutory amenities. But full equality is not possible in human relations. All spices and condiments are needed (in varying proportions) while cooking food. But a culinary preparation in which different substances are equally (50 : 50) mixed, does not taste good, does it?

**మొల్లబారు** ॥ తావినూనియ రాచి తలంటి పోసి, తీరుతీరుల గిరలి తేపతేపకు దువ్వి,
మురిపెముగా ముద్దాడఁబడు వెంట్రుక, యేవ యగు నూడిపడి నేల రాలినయంత ;
నెంత వార "తన-మన" మెదలములకున్ ! 97

**మాటల విడఁదీత (పద విభాగము) :** తావి–నూనియన్, రాచి, తల + అంటి, పోసి, తీరు–తీరులన్, గిరలి, తేప–తేపకున్, దువ్వి, మురిపెముగాన్, ముద్దాడన్ + పడు, వెంట్రుక, ఏవ, అగున్ + ఊడి–పడి, నేలన్, రాలిన + అంతన్, ఎంత, వార, తన–మన–మెదలములకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తావి-నూనియన్ రాచి తల అంటి పోసి తీరు-తీరులన్ గిరలి తేప-తేపకున్ దువ్వి మురిపెముగాన్ ముద్దాడన్ పడు వెంట్రుక ఊడి-పడి నేలన్ రాలిన + అంతన్ ఏవ అగున్. తన-మన-మెదలములకున్ ఎంత వార !

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తావి-నూనియన్ = సుగంధ తైలమును ; తల + అంటి పోసి = తలస్నానము చేయించి ; తీరు-తీరులన్ = రక-రకములుగా ; గిరలి = పొట్టిగా కత్తిరించి ; తేప-తేపకున్ = మాటిమాటికి ; మురిపెముగాన్ = ఇష్టముతో ; ఏవ = ఱోత ; రాలిన + అంతన్ = పడిపోయిన వెంటనే ; ఎంత వార = ఎంత ఎడము ; తన-మన-మెదలములకున్ = తన అను భావమునకు, మన అను భావమునకు నడుమ.

**లోవాఱిక (తాత్పర్యము) :** తలవెంట్రుకలకు సుగంధ తైలములను రాచుకొనెదరు. తలంటి పోసి ఆరఁబెట్టుకొనెదరు. రక-రకములుగా పొట్టికత్తెరలు వేసెదరు. దినమునకు నాలుఁగైదు సారులు దువ్వెదరు. ఇంత ముద్దుగా మురిపెముగా చూచుకొనఁబడు వెంట్రుకలు ఊడి రాలినచో అవి తత్ క్షణమే అసహ్యములగును. "నాది" అను భావమునకును, "వేఱేది" అను భావమునకు మధ్య ఎంత తేడా కలదు !

SUMMARY : Folks apply perfumed oil to their hair. They take head-bath to keep it clean. They trim it in various beautiful ways and comb the same for 4 – 5 times a day. Having been thus treated with so much love and smugness, if the same hair falls down, it is loathed in an instant. How stark the feelings of the "mine" and the "other" are !

**వాఁిద వాలు** ॥ తెలిసినవి తెలియనట్లున్ దెలియనివి తెలిసినట్లున్,
సవిల్లినవి సవిల్లనట్లు సవిల్లనిది సవిల్లినట్లుఁ
ద్రసియించుటయే సూ యొలవాటికం బనఁగ ; పరి తా-
మింతమట్టునకె నీల్గెద రెంతయో తెలివరులమనుచున్. 98

**మాటల విడఁదీత (పద విభాగము) :** తెలిసినవి, తెలియని + అట్లున్ + తెలియనివి, తెలిసిన + అట్లున్, సవిల్లినవి, సవిల్లిన + అట్లు, సవిల్లనిది, సవిల్లిన + అట్లున్, త్రసియించుట + ఏ, సూ, ఒలవాటికంబు + అనఁగన్, పరి, తాము + ఇంత-మట్టునకె, నీల్గెదర్ + ఎంత + ఓ, తెలివరులము + అనుచున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒలవాటికంబు అనఁగన్ తెలిసినవి తెలియని అట్లున్ తెలియనివి తెలిసిన అట్లున్ సవిల్లినవి సవిల్లిన అట్లు సవిల్లనిది సవిల్లిన అట్లున్ త్రసియించుట + ఏ సూ. పరి తాము ఇంత-మట్టునకె ఎంత + ఓ తెలివరులము అనుచున్ నీల్గెదర్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సవిల్లనివి = అనుభూతి చెందనివి ; సవిల్లిన + అట్లు = అనుభూతి చెందినట్లు ; సవిల్లనిది = అనుభూతి చెందనిది ; సవిల్లిన + అట్లున్ = అనుభూతి చెందినట్లు ; త్రసియించుట + ఏ = నటించుటయే ; సూ = సుమా ; ఒలవాటికంబు + అనఁగన్ = లౌక్యము అనఁగా అర్థము ; పరి = జనము ; ఇంత-మట్టునకె = ఇంతమాత్రమునకే ; నీల్గెదర్ = గర్వించెదరు ; తెలివరులము = మేధావులము.

**లోవాఱిక (తాత్పర్యము) :** తెలిసినవి తెలియనట్లును, తెలియనివి తెలిసినట్లును, అనిపించినవి అనిపించనట్లును, అనిపించనివి అనిపిం-చినట్లును నటించుటయే కదా లౌక్యమను మాటకు అర్థము ! ఈ మాత్రమునకే తాము గొప్ప మేధావులమని జనము గర్వించెదరు సుమా !

SUMMARY : Worldly wisdom is nothing but pretending to know the unknown and not to know the known. It also means pretending to feel what is actually not felt and *vice versa*. Folks feel proud of just this much ability of pretension.

**తెల్మొరిక** ॥ మచ్చలేని మనిమిఁ గడపిన, పెచ్చురెంచలఁ గూర్చి పెక్కు

ప్రుచ్చులు వాక్రుచ్చునట్టి, విచ్చులవిడి విర్వియమునకు
హెచ్చో నీవు నేనెంచన్. 99

**మాటల విడఁదీత (పద విభాగము) :** మచ్చ-లేని, మనిమిన్ + కడపిన, పెచ్చు-రెంచలన్, కూర్చి, పెక్కు, ప్రుచ్చులు, వాక్రుచ్చు + అట్టి, విచ్చులవిడి, విర్వియమునకున్, హెచ్చో, నీవున్ + ఏనున్ + ఎంచన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎంచన్ మచ్చ-లేని మనిమిన్ కడపిన పెచ్చు-రెంచలన్ కూర్చి పెక్కు ప్రుచ్చులు వాక్రుచ్చు అట్టి విచ్చులవిడి విర్వియమునకున్ నీవున్ ఏనున్ హెచ్చో.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మచ్చ-లేని మనిమిన్ = నిష్కళంక జీవితమును ; పెచ్చు-రెంచలన్ + కూర్చి = మహనీయులను గూర్చి ; పెక్కు = అనేకమైన ; ప్రుచ్చులు = ఱోత మాటలను ; వాక్రుచ్చు + అట్టి = పలుకునట్టి ; విచ్చులవిడి = అడ్డు-అదుపు లేని ; విర్వియము-నకున్ = లోకమునకు ; హెచ్చో = ఎక్కువయా ; నీవున్ + ఏనున్ = నీవును, నేనును ; ఎంచన్ = ఆలోచింపఁగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Are you and me any more important for the reckless world which speaks the unspeakeables about the great souls who led unblemished lives?

**తెల్మిరిక జంట ||** స్రగ్గెఁ జమురని ప్రమిదఁ బోయఁ , దుగ్గలి మలఁగ నేమి సేయ?
మొక్క వెరుగుతమని నీరు, మిక్కిలి పెట్టఁగ పరిమారు ; 100
మంచి యెంచిక కల మట్టున, మంచి జరుగక పోవచ్చును ;
పంటకముల గోల యేటికి?పనిసేయి తోచిన పాటికి. 101

**మాటల విడఁదీత (పద విభాగము) :** స్రగ్గెన్ + చమురు + అని, ప్రమిదన్ + పోయన్, తుగ్గలి, మలఁగన్, ఏమి, చేయన్, మొక్క + పెరుగుతన్ + అని, నీరు, మిక్కిలి, పెట్టఁగన్, పరిమారున్, మంచి, ఎంచిక, కల, మట్టునన్, మంచి, జరుగక పోవచ్చును, పంటకముల, గోల, ఏటికిన్, పని + చేయి, తోచిన పాటికిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** స్రగ్గెన్ = తగ్గెను ; చమురు = నూనె ; ప్రమిదన్ = ప్రమిదలో ; పోయన్ = పోయఁగా ; తుగ్గలి = దీపము ; మలఁగన్ = ఆరిపోఁగా ; ఏమి చేయన్ = ఏమిటి చేయుట ; పెరుగుతన్ + అని = పెరుగును గాక అని ; పరిమారున్ = చనిపోవును ; ఎంచిక = అభిప్రాయము/ ఉద్దేశము ; కల మట్టునన్ = ఉన్నంత మాత్రమున ; పంటకముల గోల = ఫలితములను గూర్చిన వివాదము ; ఏటికిన్ = ఎందుకు ; తోచిన పాటికిన్ = తోచిన ప్రకారము.

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రమిదలో నూనె తగ్గినదని చెప్పి మరల బాగుగా పోసినప్పుడు ఆ ఉరవడికి దీపమే ఆరిపోయినచో ఏమి చేయ వలె? మొక్క చక్కగా పెరుగవలె నని కాసంత ఎక్కువ నీరు పోసినచో అది చనిపోవును. కనుక మంచి ఉద్దేశము ఉన్నంత మాత్రాన మంచి యే జరుగునని నమ్మకము లేదు. కాని అట్లని పని చేయుట మానరాదు. ఫలితముల గుఱించి మల్లగుల్లాలు పడనేల? నీకు తోచిన మేరకు నీవు పని చేయుము.

SUMMARY : What to do if the lamp gets extinguished by the same oil which has been poured to replenish it? Even a plant may die because of the excess water which has been poured with an intention to help it grow well. So a good intention does not always guarantee a good

outcome. But that should not deter you from working. Why the fuss about results? Do your work as you deem it fit.

**వాణిద ॥** ఒంబరియ సమసెదరు తెంపరులున్ దేఁకువారులున్ ;
తందవనయు సమసెదరు పులుకందను లన్నింటికిన్ ;
దీమసి దీమసమె సోఁకు ౨ తక్కిన వారందఱకున్ ;
సూదంటగుఁ దాను నినుప తునుక దాని రాపిడికిన్. 102

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒన్ + పరి + అ, సమసెదరు, తెంపరులున్ + తేఁకువారులున్, తవనయున్ + తవనయున్, సమసెదరు, పులుగు + కందనుల్, అన్నింటికిన్, దీమసి–దీమసమె, సోఁకున్, తక్కిన–వార్ + అందఱకున్, సూదంటు + అగున్, తానున్, ఇనుప–తునుక, దాని, రాపిడికిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తెంపరులున్ తేఁకువారులున్ ఒన్ + పరి + అ సమసెదరు. పులుగు–కందనుల్ అన్నింటికిన్ తవనయున్ తవనయున్ సమసెదరు. దీమసి–దీమసమె తక్కిన వార్ అందఱకున్ సోఁకున్. దాని రాపిడికిన్ ఇనుప–తునుక తానున్ సూదంటు అగున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒన్ + పరి + అ = ఒక్కసారియే ; సమసెదరు = చనిపోయెదరు ; తెంపరులున్ = సాహసులును ; తేఁకువారులున్ = ధైర్యశాలులు కూడ ; తవనయున్ + తవనయున్ = నిమిష–నిమిషమునకు ; పులుగు + కందనుల్ = పిట్టగుండె గల వారు (పిఱికివారు) ; దీమసి–దీమసమె = ఆత్మవిశ్వాసము గలవాని ఆత్మవిశ్వాసమే ; సోఁకున్ = సంక్రమించును ; సూదంటు = అయస్కాంతము.

**లోవాఱిక (తాత్పర్యము) :** సాహసులును, ధైర్యవంతులును జీవితములో ఒక్కసారియే చనిపోయెదరు. పిఱికివారు నిమిష–నిమిషమునకు చచ్చుచు బ్రదుకుచు ఉందురు. అయస్కాంతపు రాపిడి చేత ఇనుప ముక్క కూడ అయస్కాంతమైనట్లుగా, ఒక ఆత్మవిశ్వాసి యొక్క ఆత్మ విశ్వాసము అతని చుట్టుత ఉన్నవారికి కూడ అంటుకొనును.

SUMMARY : The adventurous and the brave die only once for all their life, whereas the pigeon-hearted ones keep dying each and every minute of their lives. The confidence of a confident one becomes infectious, just like the friction with a magnet renders even a piece of iron into a magnet.

**వాణిద ॥** టేంకణింపఁడు, పైపెచ్చు వంక లెంకుఁ , గినియు, దూఱు,
జక్కలించుఁ , బదరు నిన్ను నొక్కఁడనంగ నెఱుంగుమీ,
"మనిమి వానిది నీ యూఁతఁ గొని కొనసాఁగుట లే"దని
"నీ ప్రాపరి యెవఁడు నట్లు నిన్ను మన్నింపఁ" డనియున్
"నీ వక్కఱలేని వారి నీఁగవలయు నిఁక" ననియున్. 103

**మాటల విడఁదీత (పద విభాగము) :** టేంకణింపఁడు, పై–పెచ్చు, వంక, లెంకున్ + కినియున్, దూఱున్, జక్కలించున్ + పదరున్, నిన్నున్, + ఒక్కఁడు + అనంగన్, ఎఱుంగుమీ, మనిమి, వానిది, నీ, ఊఁతన్ + కొని, కొనసాఁగుట–లేదు + అని, నీ, ప్రాపరి, ఎవఁడున్ + అట్లు, నిన్నున్, మన్నింపదు + అనియున్, నీవు + అక్కఱ–లేని–వారిన్, ఈఁగన్ + వలయున్ + ఇఁకన్ + అనియున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** టేంకణింపఁడు. పై–పెచ్చు వంక లెంకున్. కినియున్. దూఱున్. జక్కలించున్. పదరున్ నిన్నున్ ఒక్కఁడు

అనంగన్ – "మనిమి వానిది నీ ఊఁతన్ కొని కొనసాఁగుట–లేదు అని, నీ ప్రాపరి ఎవఁడున్ అట్లు నిన్నున్ మన్నింపదు అనియున్, నీవు అక్కఱ–లేని–వారిన్ ఇఁకన్ ఈఁగన్ వలయున్" అనియున్ ఎఱుంగుమీ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** టేంకణింపఁడు = నమస్కరింపఁడు ; వంక లెంకున్ = తప్పులు వెదకును ; కినియున్ = కోపించును ; దూఱున్ = తిట్టును ; జక్కలించున్ = ఎగతాళి చేయును ; పదరున్ = శపించును ; అనంగన్ = అనఁగా (అంటేని) ; ఎఱుంగుమీ = తెలిసికొనుమీ ; మనిమి వానిది = వాని జీవితము ; నీ ఊఁతన్ + కొని = నీ చేయూత తీసికొని ; నీ ప్రాపరి = నీ ఆశ్రితుఁడు ; మన్నింపదు = చూచుకొనఁడు ; అక్కఱ–లేని–వారిన్ = అవసరము లేని వారిని ; ఈఁగన్ + వలయున్ = వీడవలయును.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒకానొకఁడు నీకు నమస్కరింపఁడు. పైపెచ్చు నీలో అప్పసము తప్పులే వెదకును. నీ మీఁద కోపించును. నిన్ను తిట్టును, ఎగతాళి చేయును, శపించును – అనఁగా దాని అర్థమేమి ? వాని జీవితము నీ చేయూఁతతో నడచుట లేదనియు, వాఁడే నీ ఆశ్రితుఁడైనచో వాని నడవడిక అట్లుండదనియు, వానికి నీతో పని లేదు గనుక ఇఁక వానిని వీడిపోవలసిన అదను దగ్గర పడినదనియు !!

SUMMARY : One does not salute you. Moreover he always faults you. He frequently gets angry with you, scolds you, mocks you and curses you. What does all this behaviour mean? It singularly points to the fact that his life is not dependent on you, that his behaviour would be different had he been your dependent and also that it is time for you to leave him, as he does need you anymore.

**అవిగింగ** ‖ తాను రెండవ మారు తాళిఁ గట్ట నెఱుఁగుము,
"తండ్రి యిఁకఁ నీకుఁ బినతండ్రి మట్టుకే" ౨ అని ;
హెత్తరపు సపాటవాను నెచ్చెలికాఁడని
అలరకు ; తెలియు "మిఁక నతఁడు నెచ్చెలి - కాఁ" డని. 104

**మాటల విడఁదీత (పద విభాగము) :** తాను, రెండవ, మారు, తాళిన్ + కట్టన్ + ఎఱుఁగుము, తండ్రి, ఇఁకన్, నీకున్ + పిన–తండ్రి, మట్టుకే, అని, హెత్తరపుం–సపాటన్, ఎక్కినది, నెచ్చెలి + ఏ, అయినను, తెలియుము + ఇఁకన్ + అతఁడు, నెచ్చెలి, కాఁడు + అని.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తాను రెండవ మారు తాళిన్ కట్టన్ "తండ్రి ఇఁకన్ నీకున్ పిన–తండ్రి మట్టుకే" అని ఎఱుఁగుము. హెత్తరపుం–సపాటన్ ఎక్కినది నెచ్చెలి + ఏ అయినను "అతఁడు ఇఁకన్ నెచ్చెలి కాఁడు" అని తెలియుము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** హెత్తరపుం–సపాటన్ = ఉన్నత హోదాను ; నెచ్చెలి + ఏ = ప్రాణస్నేహితుఁడే.

**లోవాఱిక (తాత్పర్యము) :** నీ తండ్రి రెండవ పెండ్లి చేసికొన్నచో ఆయన నీకు ఇఁకముందు పినతండ్రితో సమానమని గ్రహించుము. నీ ప్రాణ స్నేహితుఁడు ఉన్నత హోదాను అధిష్ఠించినచో ఆతఁడు ఇఁకముందు నీకు ప్రాఁత పరిచయస్థుఁడే తప్ప ప్రాణస్నేహితుఁడు కాఁడని అర్థము చేసికొమ్ము.

SUMMARY : If your father married a second time, understand that he is no more your father but only an uncle. If your bosom friend rose to a high position, understand that he is no more your bosom friend, but only an old acquaintance.

**అవిగింగ** ‖ క్రొత్తాలుడిఁ బూనరు కోరినట్లు రెంచలు
కొట్టినంత మట్టునఁ గొంచెమైన లోపల ;

కొబ్బెరకాయయుఁ దన కొప్పుయినట్లె పగులుఁ
గొట్టువాఁ డెన్ని నాళ్ళ గోలెఁ గొట్టుచున్న. 105

**మాటల విడఁదీత (పద విభాగము) :** క్రొత్త + ఆలుడిన్ + పూనరు, కోరిన + అట్లు, రెంచలు, కొట్టిన + అంత–మట్టునన్, కొంచెము + ఐనన్, లోపలన్, కొబ్బెర–కాయయున్ + తనకున్ + ఒప్పు + అయిన + అట్లె పగులున్ + కొట్టు–వాఁడు + ఎన్ని, నాళ్ళ గోలెన్ + కొట్టుచున్ + ఉన్నన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కొట్టిన అంత–మట్టునన్ రెంచలు కోరిన అట్లు కొంచెము ఐనన్ లోపలన్ క్రొత్త ఆలుడిన్ పూనరు. కొట్టు–వాఁడు ఎన్ని నాళ్ళ గోలెన్ కొట్టుచున్ ఉన్నన్ కొబ్బెర–కాయయున్ తనకున్ ఒప్పు అయిన అట్లె పగులున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** క్రొత్త + ఆలుడిన్ = క్రొత్త స్వభావమును ; పూనరు = వహింపరు ; కోరిన + అట్లు = అనుకొన్న విధముగా ; రెంచలు = మనుష్యులు ; కొట్టిన + అంత–మట్టునన్ = కొట్టినంత మాత్రాన ; లోపలన్ = మనస్సులో ; ఒప్పు + అయిన + అట్లె = ఇష్టమైనట్లే ; ఎన్ని నాళ్ళ గోలెన్ = ఎన్ని దినముల నుండి ; కొట్టుచున్ + ఉన్నన్ = కొట్టుచున్నప్పటికిని.

**లోవాఱిక (తాత్పర్యము) :** కొట్టినంత మాత్రాన మనుష్యులు లోలోపల మనము అనుకొన్నట్లుగా మారి క్రొత్త స్వభావమును అలవాటు చేసికొనరు. ఒకఁడు చాలకాలము నుండి కొబ్బెరకాయలు కొట్టుచు ఉండవచ్చును. కాని ఎట్లు కొట్టినను కొబ్బెరకాయ తన ఇచ్చవచ్చినట్లే పగులును తప్ప కొట్టినవాని ఇష్టము మేరకు పగులదు. (చైతన్యము లేని కొబ్బెరకాయయే మన మాట వినదు. ఇఁక చైతన్యము గల మనుష్యులు విందురా? అని పద్యభావము)

**పైమాల విడఁబఱు (విశేష వివరణము) :** మనుష్యులను కొట్టి మార్చవలె ననుకొనుట ఒక మూర్ఖత్వము.

SUMMARY : Humans cannot really change and assume a new psychology as expected by those who beat them. Even a coconut breaks only as it likes but not as per the wish of the one who breaks it, no matter since how long he has been breaking coconuts. (Even a coconut does not listen to us. Then why would a human?)

*(The poet implies that it is foolish to attempt at bringing about a change in humans by way of beatings).*

**పస్పియ ॥** వ్రాయిదములు వ్రాయణు లిరు తెఱంగు, లొలచౌకట్టు లందుఁ దొల్తటిన్ మించి యిను-
పోతరములు సూ కడపటి, మెలంగరములున్ ; నోరువిప్పి దరివల్కరేరు నవి నీకున్ ;
వరకము లినుగడ్డు వాటి జవదాఁటులకున్. 106

**మాటల విడఁదీత (పద విభాగము) :** వ్రాయిదములున్, వ్రాయణులున్ + ఇరు–తెఱంగుల్, ఒల–చౌకట్టుల్ + అందున్ + తొల్తటిన్, మించి, ఇను–పోతరములు, సూ, కడపటి, మెలంగరములున్, నోరు–విప్పి, దరివల్కరు + ఏరున్ + అవి, నీకున్, వరకముల్ + ఇను–గడ్డు, వాటి, జవదాఁటులకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒల–చౌకట్టుల్ ఇరు–తెఱంగుల్. వ్రాయిదములున్ వ్రాయణులున్. అందున్ కడపటి తొల్తటిన్ మించి ఇను–పోతరములు సూ. మెలంగరములున్. అవి ఏరున్ నోరు–విప్పి నీకున్ దరివల్కరు. వాటి జవదాఁటులకున్ వరకముల్ ఇను–గడ్డు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వ్రాయిదములున్ = లిఖితములును ; వ్రాయణులున్ = అలిఖితములును ; ఇరు–తెఱంగుల్ = రెండు రకములు ; ఒల–చౌకట్టుల్ = లోక నియమములు ; అందున్ = వాటిలో ; తొల్తటిన్ మించి = మొదటి వాటి కంటె (లిఖితముల కంటె) ;

ఇను=పోతరములు = బలీయములు ; సూ = సుమా ; కడపటి = తరువాతివి (అలిఖితములు) ; మెలంగరములున్ = వ్యవహారములు కూడ ; దరివల్కరు = ఉపదేశింపరు ; ఏరున్ = ఎవఋను ; వరకముల్ = శిక్షలు : ఇను-గద్దు = కఠినతరములు ; జవదాఁటులకున్ = ఉల్లంఘనలకు.

**లోవాఱిక (తాత్పర్యము) :** లోక నియమములు లిఖితములు, అలిఖితములు అని రెండు రకములు. వాటిలో లిఖితముల కంటె అలిఖితములే బలవత్తరము. అట్లే లోక వ్యవహారములు కూడ లిఖితములు, అలిఖితములు అని రెండు రకములు. అలిఖిత నియమములను, వ్యవహారములను నీకెవఋను నోరువిప్పి బోధింపరు. అవి నీ అంతట నీవు తెలిసికొనవలసినదే. లిఖితములను ఉల్లంఘించినప్పటి కన్న ఆలిఖితములను ఉల్లంఘించినందుకు శిక్షలు కఠినతరము సుమా.

SUMMARY : Social norms are two-fold, namely the written ones and the unwritten ones. Of these two, the latter are more binding than the former. Similarly, activities are two-fold too. No one explicitly teaches you the unwritten ones which you are supposed to learn all by your self. The quantum of penalties that the violation of unwritten ones attract – is greater than what that of the written ones do.

**తామరిక** || నంది ౩ అనఁగా ౩ పంది ౩ అందురు ; ఎడ్డమనఁగాఁ దెడ్డమందురు ;
ఏది జెప్పిన మెండీడెదరు ; ఏది జేసినఁ జెండాడెదరు ;
అట్టివారిని బట్టించుకొని గట్టిపనులు కట్టిపెట్టకుమి. 107

**మాటల విడఁదీత (పద విభాగము) :** నంది, అనఁగాన్, పంది, అందురు, ఎడ్డమి + అనఁగాన్ + తెడ్డమి + అందురు, ఏది + చెప్పినన్, మెండీడెదరు, ఏది + చేసినన్ + చెండాడెదరు, అట్టి-వారిని + పట్టించుకొని, గట్టి,-పనులు, కట్టి-పెట్టకుమి.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మెండీడెదరు = విమర్శించెదరు ; చెండాడెదరు = దాడి చేసి చీఱెదరు ; కట్టి-పెట్టకుమి = మధ్యలో మానకుమీ.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఎడ్డమి = ఆపద ; తెడ్డమి కి తెల్లము తెలియదు. ఈ మాటలు వాడుకలో ఎడ్డెమంటే తెడ్డెం అని మారినవి.

SUMMARY : Folks talk the opposite of whatever you propose. They criticise you for whatever you say. They roast you for whatever you did. However do not call a halt to the solid work you have taken up, taking them a bit seriously.

**అవిగింగ** || కూర్కు బెరయువాని మేల్కొనఁబెట్టలేవు ;
గిల్లుకొని యేడ్చువాని నూఱడింపలేవు ;
మాటకు మాటాడువాని నొప్పింపలేవు ;
గోసులు వెదకువాని కడఁ గొలువుండలేవు. 108

**మాటల విడఁదీత (పద విభాగము) :** కూర్కన్, బెరయు-వానిన్, మేల్కొనన్ + పెట్టన్ + లేవు, గిల్లుకొని, ఏడ్చు-వానిన్ + ఊఱడింపన్ +

లేవు, మాటకున్, మాట + ఆడు–వానిన్ + ఒప్పింపన్–లేవు, గోసులు, వెదకు–వాని, కడన్ + కొలువు + ఉండన్ + లేవు.

**చఱమొలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కూర్కున్ = నిద్రను ; బెరయు–వానిన్ = అనుకరించువానిని ; మేల్కొనన్ + పెట్టన్ + లేవు = లేపలేవు ; ఊఅడింపన్ + లేవు = ఓదార్చలేవు ; గోసులు = దోషములను ; కొలువు + ఉండన్ + లేవు = ఉద్యోగము చేయలేవు.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : You cannot wake up the one who pretends to be asleep. You cannot console the one who pinches himself and cries. You cannot convince the who talks back at everystep. You cannot work under the one who constantly finds fault with your work.

**దాసానిక ||** ఒగ్గాళం బాడుపిచ్చి తిండిపిచ్చి కంటెను ;
బల్ బకురము మంతుపిచ్చి యాడుపిచ్చి కంటెను ;
నెరసుకాను రోయిపిచ్చి మంతుపిచ్చి కంటెను ;
కావళకాన్ మణియపిచ్చి రోయిపిచ్చి కంటెను. 109

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒగ్గాళంబు + ఆడు–పిచ్చి, తిండి–పిచ్చి కంటెను, బల్–బకురము, మంతు–పిచ్చి, ఆడు–పిచ్చి కంటెను, నెరసుకాను, రోయి–పిచ్చి, మంతు–పిచ్చి కంటెను, కావళకాన్, మణియ–పిచ్చి, రోయి–పిచ్చి కంటెను.

**చఱమొలి (అన్వయ క్రమము) :** ఆడు–పిచ్చి తిండి–పిచ్చి కంటెను ఒగ్గాళంబు. మంతు–పిచ్చి ఆడు–పిచ్చి కంటెను బల్–బకురము. రోయి–పిచ్చి మంతు–పిచ్చి కంటెను నెరసుకాను. మణియ–పిచ్చి రోయి–పిచ్చి కంటెను కావళకాన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒగ్గాళంబు = కరాళము ; బల్–బకురము = బహు భయంకరము ; మంతు–పిచ్చి = కీర్తిపిచ్చి ; ఆడు–పిచ్చి = స్త్రీవ్యామోహము ; నెరసుకాను =దోషకారి ; రోయి–పిచ్చి = ధన వ్యామోహము ; కావళకాన్ = పాపకారి ; మణియ–పిచ్చి = అధికార వ్యామోహము.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Womanizing is a more horrible trait than gluttony. Hankering after name and fame is worse than womanizing. Avarice is more of a defect than the greed for fame. The desire for power is more sinful than avarice.

**అవిగింగ జంట ||** గాలి పాఱిపోవును ; చెమ్మ యారిపోవును ;
మంట మలఁగిపోవును ; పంట వాలిపోవును ;
కారు కదలిపోవును ; కొరు మాసిపోవును ;
నేల మారిపోవును ; నింగి తరలిపోవును ; 110
కడలి యాటుపోటుల కగ్గమే ౨ అప్పసము ;
ఉన్న చోట నున్నటు లుండదీ యానసము ;
రెంగాకడ మలుపు దిరుగుటేల వెక్కసము?
రెందొలములు తిరుగఁబడుటేమి అక్కజము? 111

**మాటల విడఁదీత (పద విభాగము) :** గాలి, పాఱి-పోవును, చెమ్మ, ఆరి-పోవును, మంట, మలఁగి-పోవును, పంట, వాలి-పోవును, కారు, కదలి-పోవును, కౌరు, మాసి-పోవును, నేల, మారి-పోవును, నింగి, తరలి-పోవును, కడలి, ఆటు + పోటులకున్ + అగ్గము + ఏ, అప్పసము, ఉన్న, చోటన్ + ఉన్న + అటుల్ + ఉండదు + ఈ, ఆనసము, రెంచ + కాకడ, మలుపు, తిరుగుట + ఏల, వెక్కసము, రెంచ + తౌలములు తిరుగన్ + పడుట + ఏమి అక్కజము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....కడలి అప్పసము ఆటుపోటులకున్ అగ్గము + ఏ. ఆనసము ఉన్న చోటన్ ఉన్న అటులన్ ఉండదు.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కౌరు = రంగు ; కడలి = సముద్రము ; ఆటు + పోటులకున్ = లో-పాఱకమునకు మఱియు వెలి-పాఱక మునకును ; అగ్గమే = వశమే ; అప్పసము = ఎల్లప్పుడు ; ఆనసము = లోకము ; రెంగాకడ (రెంచ + కాకడ) = మానవ స్వభావము ; వెక్కసము = దుస్సహము ; రెంచ + తౌలములు = మానవ సంబంధములు ; తిరుగఁబడుట = తలక్రిందులగుట ; అక్కజము = ఆశ్చ ర్యము.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : The wind escapes and moisture goes dry. Fire dies down and crops wither away. Time moves on and colors fade away. Soil changes and the sky runs away. The sea is always subject to tides. The world will not stay put where it appears now. Then why is the transformation in the human nature so intolerable? What is so surprising in the reversal of human relationships?

: సంచమర్తి చెబకము :

**ఇది**

**వాచస్పతి బిరుదుని సంతరిదమైన వల్మిరిగమను నెఱింపటి కావింతయందు**

**రెండవ వీటగు కానస త్రోవలో రెండవ సంచము**

**మొత్తము ముగిసినది.**

**|| మేల్గాతన్ ||**

**మాటల విడఁదీత (పద విభాగము) :** వాచస్పతి-బిరుదుని, సంతరిదము + ఐన, వల్మిరిగము + అను, నెఱింపటి, కావింతయందున్, రెండవ వీటు + అగు, కానస-త్రోవలో, రెండవ, సంచము, మొత్తము, ముగిసినది.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వాచస్పతి-బిరుదుని సంతరిదము + ఐన వల్మిరిగము + అను నెఱింపటి కావింతయందున్ రెండవ వీటు + అగు కానస-త్రోవలో రెండవ సంచము మొత్తము ముగిసినది.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వాచస్పతి-బిరుదుని = వాచస్పతి అను బిరుదము గల కవి యొక్క ; సంతరిదము + ఐన = ప్రణీతమైన ; నెఱింపటి కావింతయందున్ = చింతనాత్మక కావ్యమునందు ; రెండవ వీటు + అగు = రెండవ భాగమైన ; కానస-త్రోవలో = లోక మార్గములో ; రెండవ సంచము = రెండవ అధ్యాయము ; మేల్గాతన్ (మేల్ + కావుతన్) = శుభమస్తు.

**లోవాటిక (తాత్పర్యము) :** (సుబోధము).

: SUMMARY:

Thus concludes the second chapter of the second part named

*Kaanasa Trova* in the work *Valmirigamu* written

By

Vachaspathi.

---

# వల్మిరిగము

## రెండవ వీటు - కానస త్రోవ



### మూఁడవ సంచము

**హంజియము (మంగళాచరణము)**

**అవిగింగ ॥ త్రాణలున్ త్రాణకాన్ నలిగమ్ములున్ వాని-**
**కానకమౌ పారిచేవయు ౨ పారిప్రాపగు**
**నెసరు నార్చుకపోవుచుండు నానాటికిన్ ;**
**మలఁగినవియే మగుడ వెలుఁగు తిచ్చకముగాన్ ;**
**అటు సేయు నీ మిహిక మగ్గించెదఁ బ్రెందాన్ !** 1

**మాటల విడఁదీత (పద విభాగము) :** త్రాణలున్, త్రాణకాన్, నలిగమ్ములున్, వానికిన్ + ఆనకము + ఔ, పారి–చేవయున్, పారి–ప్రాపు + అగు, నెసరున్ + ఆర్చుక–పోవుచున్ + ఉండున్, నాటికిన్ + నాటికిన్, మలఁగినవి + ఏ, మగుడన్, వెలుఁగున్, తిచ్చకముగాన్, అటు, చేయు, నీ, మిహికమున్, అగ్గించెదన్, ప్రెందాన్.

**చఱిమొలి (అన్వయ క్రమము) :** ప్రెందాన్ ! త్రాణలున్ త్రాణకాన్ నలిగమ్ములున్ వానికిన్ ఆనకము ఔ పారి–చేవయున్ పారి–ప్రాపు అగు నెసరున్ నాటికిన్ నాటికిన్ ఆర్చుక–పోవుచున్ ఉండున్. మలఁగినవి + ఏ మగుడన్ తిచ్చకముగాన్ వెలుఁగున్. అటు చేయు నీ మిహికమున్ అగ్గించెదన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** త్రాణలున్ = ఓపికలును ; త్రాణకాన్ = ఓపికనిచ్చునట్టి ; నలిగమ్ములున్ = పదార్థములును ; ఆనకము + ఔ = ఆధారమైన ; పారి–చేవయున్ = భూసారమును ; పారి–ప్రాపు = భూమికి ఆశ్రయము ; నెసరున్ = సూర్యుఁడును ; ఆర్చుక–పోవుచున్ + ఉండున్ = హరించుక పోవుచుండున్ ; నాటికిన్ + నాటికిన్ = దిన దినమునకు ; మలఁగినవి + ఏ = ఆరిపోయినవే ; మగుడన్ = మరల ; తిచ్చకముగాన్ = అద్భుతముగా ; అటు = ఆ విధముగా ; మిహికమున్ = మహిమను ; అగ్గించెదన్ = పొగడెదను ; ప్రెందాన్ = ఓ పరమాత్మా.

**లోవాతిక (తాత్పర్యము) :** ఓ పరమాత్మా ! జీవుల ఓపిక క్షణ క్షణము హరించుక పోవుచుండును. ఆ యోపికను ఇచ్చు పదార్థములు కూడ నానాటికి నిండుకొనుచుండును. ఆ పదార్థములు ఎందుండి పుట్టునో ఆ నేల యొక్క సారము సైతము ఏటేటా తగ్గిపోవుచుండును. భూమికి ఆశ్రయమైన సూర్యుఁడు కూడ క్షీణించుచుండును. అయినను ప్రపంచము ఎప్పటి వలెనే నడచుచుండును. ఎందుకనఁగా ఆరిపోయినవి మరల వెలుఁగును. పోయిన సారము తిరిగి వచ్చును. నిండుకొన్న పదార్థములు తిరిగి పండును. ప్రాణులకు మరల ఓపిక వచ్చును. దీనికి కారణమైన నీ మహిమను కొనియాడెదను స్వామీ !

SUMMARY : Oh Universal Soul ! Creatures' stamina is expended every moment. Even the substances which give them the stamina, get depleted. The fertility of the soil which is the

source of the substances, goes down year by year. Finally the Sun on whom the Earth depends, diminishes too with the passage of time. Yet the world goes on as usual, because the lost stamina, substances, fertility, light and energy are all restored by your grace. Praise be to your glory.

**గోరంటిక జంట** ॥ ఐపము లందు రౌపొందులు పిన్నలవి ; ఔపొందు లందు రైపములు పెద్దలవి ;
రెంగ్రమి యందు రెడవానులు సంపఁగా ; చివ్వ అండ్రు సీమ సీమను ద్రుంపఁగా ; 2
మగువ బేల్పోవ మంది అక్కటింతురు ; మగవాఁడైన మగతనమే లేదండ్రు ;
రిమ్మవాసిలి యీా రెంగానసమ్ము ; ఇమ్ముకతన కోసము క్రుమ్మరుట వమ్ము. 3

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఐపముల్ + అందుర్ + ఔపొందులు, పిన్నలవి, ఔపొందుల్ + అందుర్ + ఐపములు, పెద్దలవి, రెంచ + క్రమి + అందుర్ + ఎడవానులు, చంపఁగాన్, చివ్వ, అంఁడ్రు, సీమ, సీమను + త్రుంపఁగాన్, మగువ, బేల్పోవన్, మంది, అక్కటింతురు, మగవాఁడు + ఐనన్, మగతనము + ఏ, లేదు + అంఁడ్రు, రిమ్మ–వాసిలి, ఈ, రెంచ + కానసమ్ము, ఇమ్ము–కతన, కోసము, క్రుమ్మరుట, వమ్ము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఔపొందులు పిన్నలవి ఐపముల్ అందుర్. ఐపములు పెద్దలవి ఔపొందుల్ అందుర్. ఎడవానులు చంపఁగాన్ రెంచక్రమి అందుర్. సీమ సీమను త్రుంపఁగాన్ చివ్వ అంఁడ్రు. మగువ బేల్పోవన్ మంది అక్కటింతురు. మగవాఁడు ఐనన్ మగతనము + ఏ లేదు అంఁడ్రు. ఈ రెంచకానసమ్ము రిమ్మ–వాసిలి. ఇమ్ము–కతన కోసము క్రుమ్మరుట వమ్ము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఐపముల్ = దోషములు ; ఔపొందులు = అనుభవములు ; రెంచ + క్రమి = నరహత్య ; ఎడవానులు = వ్యక్తులు ; చివ్వ = యుద్ధము ; అంఁడ్రు = అందురు ; సీమ = ఒక దేశము ; సీమను = మఱియొక దేశమును ; త్రుంపఁగాన్ = నాశనము చేసినప్పుడు ; బేల్పోవన్ = మోసపోయినప్పుడు ; అక్కటింతురు = జాలిపడెదరు ; రిమ్మ–వాసిలి = పిచ్చాసుపత్రి ; రెంచ + కానసమ్ము = మానవ లోకము ; ఇమ్ము–కతన కోసము = మంచి తర్కము కోసము ; క్రుమ్మరుట = తిరుగుట ; వమ్ము = విఫల ప్రయత్నము.

**లోవాఱిక (తాత్పర్యము) :** చిన్నవారి అనుభవములను జనము అపరాధములందురు. పెద్దవారి అపరాధములను మట్టుకు అనుభవములని పిలిచెదరు. వ్యక్తులు చంపినచో నరహత్య అందురు. కాని ఒక దేశము మఱియొక దేశమును ధ్వంసము చేసినచో అది యుద్ధమందురు. స్త్రీ మోసపోయినప్పుడు జనము ఆమె పట్ల జాలి చూపెదరు. కాని మగవాఁడు మోసపోయినచో, "ఆతఁడు మగవాఁడే కాఁ" దందురు. ఈ లోక మొక పిచ్చాసుపత్రి సుమా. ఇక్కడ మనుష్యులలో తర్కమును గూర్చి వెదకుట నిష్ప్రయోజనము.

SUMMARY : The faults of the elderly are called experiences while the experiences of the young are called faults, Mass destruction of one country at the hands of another is called a war, while a killing by an individual is called a murder (culpable homicide). Folks take pity on a woman who was cheated. The same folks deny that a man is a man if he gets cheated. This world is a mental asylum where to search for rhyme and reason is just in vain.

**గోరంటిక** ॥ కొల్పాదులును మీసరులు నగు మీసులన్ గొంచెపుఁ బనులఁ జొఱఁబెట్టుట యెల్లన్
బదంగి పూయఁదగు కమిదపుఁ గట్టిల, సొదఁ గాల్పఁగ వాడినట్లు సోద్యముగాన్. 4

**మాటల విడఁదీత (పద విభాగము) :** కొల్పు + పాదులును, మీసరులున్ + అగు, మీసులన్ + కొంచెపుం + పనులన్, చొఱన్ + పెట్టుట, ఎల్లన్, పదంగి, పూయఁన్ + తగు, కమిదపుం + కట్టిలన్, సొదన్ + కాల్పఁగన్, వాడిన + అట్లు, చోద్యముగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కొల్పు-పాదులును మీసరులున్ అగు మీసులన్ కొంచెపుం పనులన్ చొఅన్ పెట్టుట ఎల్లన్ పదంగి పూయcన్ తగు కమిదపుం కఱ్ఱలన్ సొదన్ కాల్పcగన్ వాడిన అట్లు చోద్యముగాన్ (ఉండును).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కొల్పు + పాదులును = పూజనీయులును ; మీసరులున్ = శ్రేష్ఠులును ; మీసులన్ = పురుషులను ; కొంచెపుం + పనులన్ = అల్పమైన వ్యవహారములలో ; చొఅన్ + పెట్టుట = ప్రవేశపెట్టుట ; ఎల్లన్ = మొత్తమును ; పదంగి = ఒక దశాబ్దము పాటు ; కమిదపుం + కఱ్ఱలన్ = గంధపు చెక్కలను : సొదన్ = చితిని ; కాల్పcగన్ = కాల్చుట కొఱకు ; చోద్యముగాన్ = విచిత్రముగా ; ఉండును = (అధ్యాహారము).

**లోవాఱిక (తాత్పర్యము) :** గౌరవనీయులును, ఉత్తములును అయినవారిని హీనకార్యములందు ప్రవర్తింపcజేయుట ఎట్లుండు ననcగా – పదేండ్ల పాటు అరగcదీసి ఒంటికి పూసికొనుటకు సరిపోవు గంధపు చెక్కలను చితిని కాల్చుటకై వాడినట్లు విచిత్రముగా ఉండును.

SUMMARY : Engaging the respectable and the choicest ones in mean activities is like using sandal sticks to light a funeral pyre.

**పస్పియ** ॥ వేర్వేఱు సీమలు త్యాలు-ససుములు ; అవ్వా రొండొరుల కాకళిల్లరు ;
తమ యెల్ల దాcటి వెనుదిరుగలేరు ; తొలినాటి మాట మఱచిపోయెదరు. 5

**మాటల విడcదీత (పద విభాగము) :** వేర్-వేఱు, సీమలు, త్యాలు-ససుములు, ఆ + వారు + ఒండొరులకున్ + ఆకళిల్లరు, తమ, ఎల్లన్, దాcటి, వెనుతిరుగన్ + లేరు, తొలి-నాటి, మాటన్, మఱచి-పోయెదరు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సీమలు = దేశములు ; త్యాలు-ససుములు = రోగ-ఆరోగ్యములు ; ఆ + వారు = వారు – అనcగా రోగులును, ఆరోగ్యవంతులును ; ఒండొరులకున్ = పరస్పరము ; ఆకళిల్లరు = అర్థము కారు ; ఎల్లన్ = సరిహద్దును.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఆరోగ్యమొక దేశము. అనారోగ్యము ఇంకొక దేశము. ఈ దేశములవారు ఒకటికొకఱు అర్థము కారు. అనcగా – ఆరోగ్యవంతులు రోగులకు అర్థము కారు. అట్లే రోగుల బాధలు ఆరోగ్యవంతులకు కూడ అర్థము కావు. వారు తమ తమ సరిహద్దులను అధిగమించి ఆలోచింపcజాలరు. తమ యొక్క ఇదివరకటి స్థితి గుఱుతుండదు. అనcగా ఒకసారి రోగము పాలైన తరువాత రోగి తన ఆరోగ్య స్థితిని మఱచిపోవును. అట్లే ఆరోగ్యవంతుcడు కూడ రోగము నుండి కోలుకొన్న తరువాత తన ఒకప్పటి రోగస్థితిని మఱచిపోవును.

SUMMARY : Health and sickness are two separate countries, the citizens of which cannot understand each other properly. (The healthy cannot understand the sick and *vice versa*). They cannot transcend their respective barriers in thinking. Nor do they remember their earlier state of health. i.e. the sick forget their healthy days and similarly the recovered ones forget their days of sickness.

**అవిగింగ జంట** ॥ నిఱువల్కొండు లే దిడుములు దక్క మనిమికి ;
మెలపమందు రిడుమ యిడుమ నడిమి యూఱటకు ;
గొంగటcc గుడుచుచు నెఱులc గూర్చి సణుగ నేల?
కానరా రిడుమలు లేని కానసు లొకఱున్ 6
ఆండ్రు ఱేండ్రు మగవాండ్రుc బిన్నవెద్దలున్ ;
ఇడుమ యెవఱిది వారికిc గడవరాని కడలి. 7

**మాటల విడఁదీత (పద విభాగము) :** నిఱువల్కు + ఒందు, లేదు + ఇడుమలు, తక్కన్, మనిమికిన్, మెలపము + అందురు + ఇడుమ-ఇడుమ-నడిమి, ఊఱటకున్, గొంగటన్ + కుడుచుచున్, నెఱులన్ + కూర్చి, సణుగన్ + ఏల, కానన్ + రారు + ఇడుమలు, లేని, కానసుల్ + ఒకఱున్ + ఆంద్రున్, ఱేంద్రున్, మగవాంద్రున్ + పిన్న + పెద్దలున్, ఇడుమ, ఎవఱిది, వారికిన్, కడవన్ + రాని, కడలి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మనిమికిన్ ఇడుమలు తక్కన్ నిఱువల్కు ఒందు లేదు. ఇడుమ-ఇడుమ-నడిమి ఊఱటకున్ మెలపము అందురు. గొంగటన్ కుడుచుచున్ నెఱులన్ కూర్చి సణుగన్ ఏల? ఇడుమలు లేని కానసుల్ ఒకఱున్ కానన్ రారు. ఆంద్రున్ ఱేంద్రున్ మగవాంద్రున్ పిన్న-పెద్దలున్ ఇడుమ ఎవఱిది వారికిన్ కడవన్ రాని కడలి.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నిఱువల్కు = నిర్వచనము ; ఒందు = మఱియొకటి ; ఇడుమలు తక్కన్ = కష్టములు తప్ప ; మనిమికిన్ = జీవితమునకు ; మెలపము = సుఖము ; కుడుచుచున్ = తినుచు ; నెఱులన్ + కూర్చి = వెంట్రుకలను గుఱించి ; కానన్ + రారు = కని-పించరు ; కానసుల్ = లోకులు ; ఆంద్రున్ = స్త్రీలును ; ఱేంద్రున్ = రాజులును ; కడవన్ + రాని = దాఁటుట వీలుకాని ; కడలి = సము-ద్రము.

**లోవాఱిక (తాత్పర్యము) :** జీవితము అను మాటకు కష్టములు తప్ప మఱియొక నిర్వచనము లేదు. ఒక కష్టమునకు మఱియొక కష్టమునకు నడుమ ఉన్న ఊఱటనే మనుజులు సుఖమని పిలిచెదరు. గొంగటిలో తినుచు వెంట్రుకలను ఏరుట ఎందుకు? (జీవితమును జీవించుచు కష్టములను గూర్చి వాపోవుట ఎందుకు?) కష్టము లేని లోకులు ఒక్కరైనను కనిపించరు. ఆడు-మగ, రాజు-పేఁద అందఱికిని ఎవఱి కష్టము వారికి దాఁటరాని మహాసముద్రమే.

SUMMARY : Life could have no definition other than hardships. The brief hiatus between one hardship and another is called happiness. Why complain of hair while eating in a rug? Not a soul without some or other hardship is to be found in the world. To men and women and to kings and paupers – their own hardhip is the uncrossable ocean.

**చదును అవిగింగ** || వెర గేమి రెంచాది కడగండ్లు వడుటలోన్,
వేల్పుజేజుల జరుములే కునారాప కాన్?
వెఱపెట్లు వోవుఁ దా నెలవంచి మందికిన్,
దలవరులు కూడఁ గాఁపుదల లేర్పఱచికోన్? 8
**అవిగింగ** || విఱివియపు బ్రదుకుపై విసుమాల మెటు గల్గు,
హఱవల యీఁగరిలీ లదురఁ బరిడవము మైన్?
గఱిమి యెడ నెట్లు గలుగుఁ బేర్మి తందరుసుల-
కొఱపాటపుఁ బేరఁ గఱదారులు తిట్టికోన్. 9

**మాటల విడఁదీత (పద విభాగము) :** వెరగు + ఏమి, రెంచాది, కడగండ్లు + పడుటలోన్, వేల్పు-జేజుల, జరుములు + ఏ, కునారాప, కాన్, వెఱపు + ఎట్లు + పోవున్ + తాన్ + ఎలవంచి, మందికిన్ + తలవరులు, కూడన్, కాఁపుదలలు + ఏర్పఱచికోన్, విఱివియపుం, బ్రదుకుపైన్, విసుమాలము + ఎటు, కల్గున్, హఱవల, ఈఁగరిలీలు + అదురన్, పరిడవము మైన్, గఱిమి ఎడన్ + ఎట్లు, కలుగున్ + పేర్మి, తందరుసులకున్, ఒఱపాటపుం + పేరన్, కఱదారులు, తిట్టికోన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వేల్పు-జేజుల జరుములు + ఏ కునారాప కాన్ రెంచాది కడగండ్లు పడుటలోన్ వెరగు ఏమి? తలవరులు కూడన్ కాఁపుదలలు ఏర్పఱచికోన్ ఎలవంచి మందికిన్ వెఱపు తాన్ ఎట్లు పోవున్? హఱవల ఈఁగరిలీలు పరిడవము మైన్ అదురన్ విఱివియపుం బ్రదుకుపైన్ విసుమాలము + ఎటు కల్గున్? ఒఱపాటపుం + పేరన్ కఱదారులు తిట్టికోన్ గఱిమి ఎడన్ + తందరుసులకున్

పేర్మి ఎట్లు కలుగున్?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వెరగు = ఆశ్చర్యము ; రెంచాది = మానవాళి ; కడగండ్లు + పడుటలోన్ = కష్టములు పడుటలో ; వేల్పు-జేజుల = దేవీదేవతల ; జరుములు + ఏ = చరిత్రలే ; కునారాప = విషాదాంతము ; కాన్ = కాఁగా ; వెఱపు = భయము ; తాన్ = (పాద పూరణము) ; ఎలవంచి మందికిన్ = సామాన్య జనమునకు ; తలవరులు = నాయకులు ; కాఁపుదలలు = రక్షణలు ; విఱివియపుం బ్రదుకుపైన్ = లోక జీవితము మీఁద ; విసుమాలము = వైరాగ్యము ; ఎటు = ఎట్లు ; హఱవల = సన్న్యాసుల యొక్క ; ఈఁగరిలీలు = ఆశ్రమములు ; అదురన్ = అదిరిపోవుచుండఁగా ; పరిడవము మైన్ = వైభవముతో ; గఱిమి ఎడన్ = విద్య పట్ల ; పేర్మి = గౌరవము ; తందరుసులకున్ = సామాన్యము ; ఒఱపాటపుం + పేరన్ = చర్చల పేరుతో ; కఱదారులు = మేధావులు.

**లోవాఱిక (తాత్పర్యము) :** దేవీదేవతల చరిత్రలే విషాదాంతములు కాఁగా మానవాళి కష్టములు పడుటలో ఆశ్చర్యమేమి కలదు? నాయకులే తమ చుట్టుత రక్షణములను ఏర్పఱచుకొనఁగా సామాన్య జనము నిర్భయముగా ఎట్లు బ్రదికెదరు? సన్న్యాసుల ఆశ్రమములే వైభవోపేత ములై విరాజిల్లుచుండఁగా సంసారులకు ఇహలోక జీవితము మీఁద వైరాగ్యమెట్లు కలుగును? మేధావులు చర్చల పేరుతో అసహ్యముగా తిట్టుకొనుచుండఁగా సామాన్యులకు విద్య పట్ల గౌరవమెట్లు కలుగును?

SUMMARY : What is surprising in the hardships of the humanity when the lives of gods and goddesses themselves are tragic? How can ordinary populace move fearlessly when leaders themselves formed security cordons around themselves? How can householders develop disinterest in the worldly life when the monasteries of the monks themselves rock with pomp and ostentation? How can commoners have respect for learning when intellctuals scold each other odiously in the name of debates?

**అవిగింగ జంట ||** వావిచ్చి పలుకఁగా వాగుడుకాయందురు ;
మూసుక కూర్చున్నచో మ్రుచ్చుమోమందురు ;
ఇచ్చుడున్ జేయూఁత హెచ్చరము లేదండ్రు ;
ఇవ్వకున్నఁ దామట్టని విళంగించెదరు ; 10
ఏమి సేసినను నిన్ వెలిబైలు మెండీడు ;
ఏమియుఁ జేయకున్నను ౨ ఎగతాళి పేర్లిడు. 11

**మాటల విడఁదీత (పద విభాగము) :** వా-విచ్చి, పలుకఁగాన్, వాగుడు-కాయ + అందురు, మూసుక, కూర్చున్నచోన్, మ్రుచ్చు-మోము + అందురు, ఇచ్చుడున్ + చే + ఊఁత, హెచ్చరము, లేదు + అండ్రు, ఇవ్వక + ఉన్నన్, తామట్టు + అని, విళంగించెదరు, ఏమి, చేసినను, నిన్, వెలి-బైలు, మెండీడున్, ఏమి + ఉన్ + చేయక + ఉన్నను, ఎగతాళి-పేర్లు + ఇడు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....చే + ఊఁత ఇచ్చుడున్ హెచ్చరము లేదు అండ్రు.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వా-విచ్చి = నోరు తెఱచి ; పలుకఁగాన్ = మాటలాడఁగా ; మ్రుచ్చు-మోము = దొంగమొహమువాఁడు ; ఇచ్చుడున్ = ఇవ్వఁగా ; హెచ్చరము = జాగ్రత్త ; ఇవ్వక + ఉన్నన్ = ఇవ్వకపోయినచో ; తామట్టు = స్వార్థి ; విళంగించెదరు = నిందించెదరు ; వెలి-బైలు = బాహ్యావరణము (సంఘము) ; మెండీడున్ = విమర్శించును.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనసు విప్పి మాటలాడువానిని బాహ్యావరణము వాగుడుకాయ అనును. మాటలాడకుండ కూర్చున్నచో దొంగ-మొహమువాఁడందురు. ఇతరులకు సహాయము చేసినచో జాగ్రత్త లేనివాఁడందురు. చేయనిచో స్వార్థపరుఁడని నిందించెదరు. నీవేమి చేసినను బాహ్యావరణము నిన్ను నిందించును. ఒకవేళ ఏమియు చేయకపోయినను ఎగతాళిగా పేర్లు పెట్టి అవమానించును.

SUMMARY : The society calls a candid one a chatter-box. It calls man mischievous if he keeps quiet. It names him careless if he liberally helps others. It dubs him selfish if he does not. Thus the society blames you for whatever you did. It insults you by derisive names even if you did not do anything.

**అవిగింగ** ॥ ఎలసోంకులఁ గూడ నెడయరు కుట్రతలఁపులు ;
వెల్లువలఁ గూడ నిల్ కొల్లగొనక మానరు ;
సమయునప్పుడు నొరుల చావుఁ గోరకపోరు ;
విడనర్ది గదా పరి తడకార్ సీజందముల్. 12

**మాటల విడఁదీత (పద విభాగము) :** (పరి), ఎలసోంకులన్ + కూడన్, ఎడయరు, కుట్ర-తలఁపులు, వెల్లువలన్ + కూడన్ + ఇల్, కొల్ల-గొనక, మానరు, సమయు + అప్పుడున్ + ఒరుల, చావున్ + కోరక-పోరు, విడనర్ది, కదా, పరి-తడకార్-సీజందముల్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (పరి) ఎలసోంకులన్ కూడన్ కుట్ర-తలఁపులు ఎడయరు. వెల్లువలన్ కూడన్ ఇల్ కొల్ల-గొనక మానరు. సమయు అప్పుడున్ ఒరుల, చావున్ కోరక-పోరు. పరి-తడకార్-సీజందముల్ విడనర్ది కదా.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** (పరి = జనము) ; ఎలసోంకులన్ = మహమ్మారులప్పుడు ; ఎడయరు = వదిలిపోరు ; వెల్లువలన్ = జల ప్రళయములప్పుడు ; ఇల్ = ఇళ్ళను ; కొల్ల-గొనక మానరు = దోచక మానరు ; సమయు + అప్పుడున్ = చనిపోవునప్పుడు ; ఒరుల = ఇతరుల యొక్క : విడనర్ది = వదులుకొనుటకు కష్టము ; పరి = జనము యొక్క ; తడకార్ = చిరకాల- ; సీజందముల్ = దుస్సంస్కారములు .

**లోవాఱిక (తాత్పర్యము) :** మహమ్మారులు (వేలాదిమందికి ఒకేసారి వచ్చు అంటుజబ్బులు) మ్రింగివేయుచున్నప్పుడు కూడ జనము ఒకటి మీఁద ఒకఱు కుట్రలు చేయుట మానరు. వఱదలు ఊళ్ళను ముంచెత్తుచున్నప్పుడు సైతము వేఱేవారి ఇళ్ళలో పడి దొంగతనములు చేయుట మానరు. తాము స్వయముగా చనిపోవుటకు సిద్ధముగా ఉన్నప్పుడు కలిదము ఇతరుల చావును కోరుచుందురు. అహో ! చిరకాల దుస్సంస్కారములు వదులుట మిక్కిలి కష్టము కదా !

SUMMARY : Folks do not cease to conspire against each other even in the midst of the raging pandemics. They won't abstain from robbing others' houses even when towns are inundated in flood waters. They wish death to others even as they are on the death-bed themselves. How hard it is to get rid of the long-cultivated bad mentalities!

**వాణిద** ॥ తను లాతుల కనురోకన్ గన మేలిమి యగునందురు ;
మెదడు పాడగు నటు సేయ, మేలిమి యెడాట మటుంచి ;
ఎల్లియె చావు, చూచికొన నెవఱి విన్నరాది వారు ;
త్యాళ్ళ పుట్ట పోలెఁ దోచుఁ దనకుఁ దా నరైక సేయ. 13

**మాటల విడఁదీత (పద విభాగము) :** తనున్, లాతుల, కను-రోకన్ + కనన్, మేలిమి + అగున్ + అందురు, మెదడు, పాడు + అగున్ + అటు + చేయన్, మేలిమి-ఎడాటము + అటు + ఉంచి, ఎల్లి + ఎ, చావు, చూచికొనన్ + ఎవఱి, విన్నరాదిన్, వారు, త్యాళ్ళ, పుట్ట, పోలెన్ + తోచున్ + తనకున్ + తాన్ + అరైక + చేయన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తనున్ లాతుల కను-రోకన్ కనన్ మేలిమి అగున్ అందురు. మేలిమి-ఎడాటము అటు ఉంచి అటు

చేయన్ మెదడు పాడు అగున్. ఎవటి విన్నరాదిన్ వారు చూచికొనన్ ఎల్లి + ఎ చావు. తనకున్ తాన్ అరైక చేయన్ త్యాళ్ళ పుట్ట పోలెన్ తోచున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తనున్ = తనను ; లాతుల = ఇతరుల యొక్క ; కను–రోకన్ = దృష్టిలోనుండి ; కనన్ = చూచుకొన్నచో ; మేలిమి = మేలు ; అటు + చేయన్ = ఆవిధముగా చేసినచో ; మేలిమి–ఎడాటము = మేలు విషయమును ; ఎల్లి + ఎ = తేపే ; విన్నరాదిన్ = జాతకమును ; త్యాళ్ళ పుట్ట పోలెన్ = రోగముల పుట్ట వలె ; తోచున్ = అనిపించును ; అరైక + చేయన్ = పరీక్ష చేసికొనఁగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** "మనిషి తనను తాను ఇతరుల దృష్టిలోనుండి చూచుకొన్నచో మేలు జరుగు" నని చెప్పెదరు. అట్లు చేసినచో – మేలు జరుగుట అటుంచి బుఱ్ఱ పాడగును. ఎవటి జాతకమును వారు చూచుకొన్నచో "తేపే మన చావు" అనిపించును. అదే విధముగా – ఎవటికి వారు రోగనిదానము చేసికొన్నచో తమ శరీరము తమకు రోగముల పుట్ట వలె కనిపించును.

SUMMARY : It is said that man benefits immensely by looking at himself from others' view–point. Benefits apart, he will be out of his mind if he really did like that. Death looks like certain tomorrow, if each one casts his own horoscope. Similarly, One's own body looks like a heap of diseases if each one diagnoses himself.

**గోరంటిక జంట** ॥ పచ్చినిక్కము సరిపడదు కూటమునకు ; పచ్చిబొంకులు వెసఁ దెలిసిపోవుఁ దనకు ;
కల్లనిక్కముల కలివిడియె చవిసిక్కు ; చేతఁగానిచో బూకరించుట చిక్కు ; 14
అచ్చిరాని నిక్కము వాక్రువ్వ వలదు ; అర-సరి కా నవి అన్ని, నీ త ప్పసదు. 15

**మాటల విడఁదీత (పద విభాగము) :** పచ్చి–నిక్కము, సరిపడదు, కూటమునకున్, పచ్చి–బొంకులు, వెసన్ + తెలిసి–పోవున్ + తనకున్, కల్ల–నిక్కముల, కలివిడి + ఎ, చవి + చిక్కున్, చేతన్ + కానిచోన్, బూకరించుట, చిక్కు, అచ్చిరాని, నిక్కమున్, వాక్రువ్వన్ + వలదు, అర–సరి, కాన్ + అవి, అన్ని, నీ, తప్పు + అసదు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పచ్చి–నిక్కము కూటమునకున్ సరిపడదు. పచ్చి–బొంకులు తనకున్ వెసన్ + తెలిసి–పోవున్. కల్ల–నిక్కముల కలివిడి + ఎ చవి చిక్కున్. చేతన్ కానిచోన్ బూకరించుట చిక్కు. అచ్చిరాని నిక్కమున్ వాక్రువ్వన్ + వలదు. అవి అన్ని అర–సరి కాన్ నీ తప్పు అసదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పచ్చి–నిక్కము = పచ్చి నిజము ; సరిపడదు = నచ్చదు ; కూటమునకున్ = సంఘమునకు ; పచ్చి–బొంకులు = పచ్చి అబద్ధములు ; వెసన్ = వెంటనే, తొందఱగా ; తనకున్ = సమాజమునకు ; కల్ల–నిక్కముల = సత్యానృతముల యొక్క ; కలివిడి + ఎ = మిశ్రమమే ; చవి + చిక్కున్ = రుచించును ; బూకరించుట = దబాయించుట ; చిక్కు = సమస్యాయుతము ; అచ్చిరాని = మేలుచేయని ; వాక్రువ్వన్ + వలదు = వచింపవలదు ; అర–సరి = అర్ధసత్యము ; కాన్ = కాఁగా ; అవి అన్ని = సత్యములన్నియు ; అసదు = అల్పము.

**లోవాఱిక (తాత్పర్యము) :** సంఘమునకు పచ్చి నిజములు మ్రింగుడుపడవు. అట్లని పచ్చి అబద్ధములను కూడ అది జీర్ణించుకొనఁజాలదు. అవి అబద్ధములని వెంటనే పసిగట్టును. ఒక అబద్ధమాడిన పిదప దానిని సమర్థించుకొనుట చేతఁగానిచో అది ఇనుపెద్ద సమస్యలకు దారి తీయును. సంఘమునకు రుచించునది సత్యానృతముల మిశ్రమమే. అందుచేత నీకు మేలు చేయని నిజములను నీవు సమాజమునకు ఎప్పుడును చెప్పవలదు. అసలు – ఈ ప్రపంచములో పూర్తి నిజములైనవి ఎక్కడ గానీ లేవు. "మనకు బాగుగా తెలియు" నని మనము అనుకొను నిజములు కూడ – అన్నియు అర్ధసత్యములే. కనుక నీవు మౌనము పూనినందుకు నీకు అన్నృత దోషము ఎక్కువ అంటదు.

SUMMARY : Society cannot digest stark truths. Nor can it wrap its head around downright

falsehoods, but discerns them in a jiffy. It will lead to trickier problems if one fails to justify his falsehoods. What society savours is -only a heady blend of truth and falsehood. Therefore, you should never tell the society the kind of truths which do not benefit you. In fact, there are no unalloyed truths in the world. Even the so-called truths which we think we definitely know – are all actually half-truths only. So you will incur less sin for keeping mum on truths.

**అవిగింగ** || ఎప్పసము వేర్వేఱు వింగడమ్ముల నడుమ
నొప్పు ముసుగులోపలి గ్రుద్దులాటల రిమ్మ ;
కలకారు విడఁద్రెంపు కలుగ, దొండొరుల నా-
కళించుకొని సరుదుక పోవుటయే తక్క. 16

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎప్పసము, వేర్ + వేఱు, వింగడమ్ముల నడుమన్, ఒప్పు, ముసుగులోపలి, గ్రుద్దులాటల, రిమ్మ, కలకారు, విడఁద్రెంపు, కలుగదు + ఒండొరులన్ + ఆకళించుకొని, సరుదుక-పోవుట + ఏ, తక్కన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** వేర్ -వేఱు వింగడమ్ముల నడుమన్ ఒప్పు ముసుగులోపలి గ్రుద్దులాటల రిమ్మ ఎప్పసము. ఒండొరులన్ + ఆకళించుకొని సరుదుక-పోవుట + ఏ తక్కన్ కలకారు విడఁద్రెంపు కలుగదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎప్పసము = శాశ్వతము ; వింగడమ్ముల నడుమన్ = వర్గముల్ మధ్య ; ఒప్పు = ఒప్పారెడి ; ముసుగు లోపలి గ్రుద్దులాటల = పైకి వెల్లడి కాకుండ జరుగు రహస్య పోరాటములు అనెడి ; రిమ్మ = ఉన్మాదము ; కలకారు = శాశ్వతమైన ; విడఁద్రెంపు = పరిష్కారము ; ఒండొరులన్ = ఒకఱినొకఱు ; ఆకళించుకొని = అర్థము చేసికొని ; సరుదుక-పోవుట + ఏ = సర్దుకొని పోవుట యే ; తక్కన్ = తప్ప / మినహా.

**లోవాఱిక (తాత్పర్యము) :** సమాజమునందలి వివిధ వర్గముల మధ్య జరుగు ముసుగులోని గ్రుద్దులాటల వెఱ్ఱి శాశ్వతము. వివిధ వర్గములు ఒకఱి నొకఱు సరిగా అర్థము చేసికొని సర్దుక పోవుటే తప్ప వాటికి శాశ్వత పరిష్కారమేమియు లేదు.

SUMMARY : The shadow-boxing mania that prevails between different social strata, classes and communities is eternal. It has no permanent solution except understanding each other properly and living in amity and adjustment.

**దాసానిక జంట** || ఆలకించువానికె చెప్పఁగలఁ డంకుడైనన్ ;
ఎరంగెడివారినే తేఁ డేలఁజాలు నెపుడున్ ;
పేర్మించు బిడ్డలనే పెంచఁగలరు కాంచరుల్ ;
ప్రాలివానులకే దరివల్కఁగలరు కాంచువుల్ ; 17
అదనికి మందు మ్రింగి యానుమానుఁ బాటించిన,
యపుడె త్యాలు గుదుర్పనౌను లెసకానునకైన ;
ఎవఱెంతటి మేటులైనను మేల్ సేయఁగలేరు,
అవతలివారుఁ దోడ్పా టందీయనంతకారు. 18

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఆలకించు-వానికిన్ + ఎ చెప్పన్ + కలఁడు + అంకుడు + ఐనన్, ఎరంగెడి-వారిన్ + ఏ, తేఁడు +

ఏలన్ + చాలున్ + ఎపుడున్, పేర్మించు, బిడ్డలన్ + ఏ, పెంచన్ + కలరు, కాంచరుల్, ప్రాలివానులకున్ + ఏ, దరివల్కన్ + కలరు, కాంచువుల్. అదనికిన్. మందున్, మ్రింగి, అనుమానున్ + పాటించిన + అపుడు + ఎ, త్యాలున్ + కుదుర్పన్ + ఔను, లెసకానునకున్ + ఐనన్, ఎవఱు + ఎంతటి, మేటుల్ + ఐనను, మేల్ + చేయఁగన్ + లేరు, అవతలి–వారున్ + తోడ్పాటు + అందీయని + అంత, కారున్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** అంకుడు ఐనన్ ఆలకించు–వానికిన్ + ఎ చెప్పన్ కలఁడు. ఎపుడున్ ఎరంగెడి–వారిన్ + ఏ ఱేఁడు ఏలన్ చాలున్. పేర్మించు బిడ్డలన్ + ఏ కాంచరుల్ పెంచన్ కలరు. ప్రాలివానులకున్ + ఏ కాంచువుల్ దరివల్కన్ కలరు. లెసకానునకున్ ఐనన్ అదనికిన్ మందున్ మ్రింగి అనుమానున్ పాటించిన అపుడు + ఎ త్యాలున్ కుదుర్పన్ ఔను. అవతలి–వారున్ తోడ్పాటు అందీయని అంత కారున్ ఎవఱు ఎంతటి మేటుల్ ఐనను మేల్ చేయఁగన్ లేరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఆలకించు–వానికిన్ + ఎ = శ్రద్ధగా వినువానికే ; అంకుడు + ఐనన్ = దేవుఁడైనను ; ఎరంగెడి–వారిన్ + ఏ = తల వంచువారినే ; ఱేఁడు = రాజు ; ఏలన్ + చాలున్ = పరిపాలింపఁగలఁడు ; పేర్మించు = గౌరవించు ; కాంచరుల్ = తల్లిదండ్రులు ; ప్రాలివానులకున్ + ఏ = శ్రద్ధావంతులకే ; దరివల్కన్ + కలరు = ఉపదేశింపఁగలరు ; కాంచువుల్ = గురువులు ; అదనికిన్ = సమయమునకు ; అనుమానున్ = పథ్యమును ; త్యాలున్ = రోగమును ; కుదుర్పన్ + ఔను = నయము చేయుట సాధ్యమగును ; లెసకానునకున్ + ఐనన్ = వైద్యునకైనను ; మేటుల్ + ఐనను = నిపుణులైనను ; తోడ్పాటు = సహకారమును ; అందీయని + అంత కారున్ = అందింపనంత కాలమును.

**లోవాఱిక (తాత్పర్యము) :** శ్రద్ధగా వినువారికే దేవుఁడైనను చెప్పఁగలఁడు. తల్లిదండ్రులైనను తమను గౌరవించు పిల్లలనే పెంచఁగలరు. గురువులు కూడ శ్రద్ధావంతులకే ఉపదేశింపఁగలరు. సమయమునకు మందు వేసికొని పథ్యమును పాటించు వారి రోగములనే వైద్యుఁడైనను నయము చేయఁగలఁడు. అవతలివారు సహకారమును అందించనంత కాలము ఎంతటి నిపుణులైనను మేలు చేయలేరు.

SUMMARY : Even God can tell something only to the obedient. Even parents can raise only the children who respect them. Even teachers can teach only the disciples who are attentive. Even doctors can heal only the patients who have timely medication and follow the prescribed diet. Thus, however skillful people may be, they cannot help the ones who do mot cooperate with them.

**తామరిక ||** సెబ్బరీనియందును మంచికి దేవులాడుచుండు మేలాఁడు ;
మేలానియందును జెడుగునకు వెదకాడుచుండు సెబ్బరీఁడు ;
తామరతూండ్లను నెమకు సెఱియ తా నడుసునిండు కుంటలందు ;
ప్రుచ్చుపీనుఁగులకు గాలించుఁ బచ్చనేలలందు రాబందు. 19

**మాటల విడఁదీత (పద విభాగము) :** సెబ్బరీని–యందును, మంచికిన్, దేవులాడుచున్ + ఉండున్, మేలాఁడు, మేలాని–యందును, చెడుగునకున్, వెదకాడుచున్ + ఉండున్, సెబ్బరీఁడు, తామర–తూండ్లను, నెమకున్, సెఱియ, తాన్ + అడుసు–నిండు, కుంటలందున్, ప్రుచ్చు–పీనుఁగులకున్, గాలించున్, పచ్చ–నేలలందున్, రాబందు.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** మేలాఁడు సెబ్బరీని–యందును మంచికిన్ దేవులాడుచున్ ఉండున్. సెబ్బరీఁడు మేలానియందును చెడుగునకున్ వెదకాడుచున్ ఉండున్. సెఱియ తాన్ అడుసు–నిండు కుంటలందున్ తామర–తూండ్లను నెమకున్. రాబందు పచ్చ–నేలలందున్ ప్రుచ్చు–పీనుఁగులకున్ గాలించున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సెబ్బరీని యందును = చెడ్డవానిలో కూడ ; దేవులాడుచున్ + ఉండున్ = వెదకుచుండును ; మేలాఁడు = మంచివాఁడు/ ఉపకారి ; నెమకున్ = వెదకును ; సెఱియ = హంస ; తాన్ = (పాదపూరణము) ; అడుసు–నిండు = బుఱద నిండిన ;

ప్రుచ్చు-పీనుఁగులకున్ = క్రుళ్ళిపోయిన శవముల కోసము.

**లోవాఱిక (తాత్పర్యము) :** మంచివాఁడు చెడ్డవానిలో కూడ మంచికై వెదకును. చెడ్డవాఁడు మంచివానిలో కూడ చెడు కొఱకే వెదకును. బుఱద నిండిన కుంటలలో కూడ హంస తామరతూళ్ళకై వెదకును. పైరుపచ్చలతో కళకళలాడు చోటులలో కూడ రాబందు క్రుళ్ళిపోయిన శవముల కొఱకే గాలించుచుండును.

SUMMARY : The good one looks for goodness even in a bad one. But the bad one looks for bad things even in a good one. For instance, the vulture combs the places replete with greenery for decomposed carcasses, while the swan searches for lily stalks even at the ponds filled with mud.

**సంపంగి ||** గొంగ వాటింపఁ జాలునది కొలఁది చేటునే ;
బ్రుంగేను రెంచ తనవగు లోటుల చేతనే ;
ఎల్లవాఱు నుసుఱు గోల్పో రెన్ని యెలసోంకు-
లల్లాడించినఁ , దప్పించి అస్తుబిస్తులన్. 20

**మాటల విడఁదీత (పద విభాగము) :** గొంగ, వాటింపన్ + చాలునది, కొలఁది, చేటున్ + ఏ, బ్రుంగేను, రెంచ, తనవి + అగు, లోటుల చేతన్ + ఏ, ఎల్ల-వాఱున్ + ఉసుఱున్ + కోల్పోరు + ఎన్ని + ఎలసోంకుల్ + అల్లాడించినన్ + తప్పించి, అస్తుబిస్తులన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** గొంగ వాటింపన్ చాలునది కొలఁది చేటున్ + ఏ. బ్రుంగేను రెంచ తనవి అగు లోటుల చేతన్ + ఏ. ఎన్ని ఎలసోంకుల్ అల్లాడించినన్ అస్తుబిస్తులన్ తప్పించి ఎల్ల-వాఱున్ ఉసుఱున్ కోల్పోరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గొంగ = శత్రువు ; వాటింపన్ + చాలునది = కలిగింపఁగలది ; కొలఁది చేటున్ + ఏ = కొద్దిపాటి హానినే ; బ్రుంగేను = నశించేను ; రెంచ = మనిషి ; లోటుల చేతన్ + ఏ = లోపముల వలననే ; ఎల్ల-వాఱున్ + ఉసుఱున్ = ప్రాణమును ; ఎలసోంకుల్ = మహమ్మారులు ; తప్పించి = మినహా ; అస్తుబిస్తులన్ = అంతంత మాత్రపు ఆరోగ్యము గలవారిని.

**లోవాఱిక (తాత్పర్యము) :** శత్రువు కొద్దిపాటి అపకారమును మాత్రమే చేయఁగలఁడు. కాని నిజమునకు మనిషి తన లోపముల వలననే నశించును. మహమ్మారుల మూలమున అందఱును చనిపోరు. అంతర్గతముగా అస్తుబిస్తు ఆరోగ్యము గలవారే ఎక్కువగా చనిపోయెదరు.

SUMMARY : The enemy can harm you only to a little extent. But it is only because of his own defects that man often perishes. Not everyone but the internally infirm, dies in the wave of a pandemic.

**పస్సియ జంట ||** ఇనుముప్పుకాను క్రించుబాటీలు, హెచ్చుబాటీలపైఁ బలు మడుగులు ;
మల యెక్కి పడినను మడియంగలరు ; ప్రెన్నూబిఁ బడినను మడియంగలరు ; 21
కోరి యెక్కిననె మల వలని ముప్పు ; కోరకున్నను ౨ ఊఱి సమయు చొప్పు. 22

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఇనుముప్పుకాను, క్రించుబాటీలు, హెచ్చుబాటీలపైన్ + పలు, మడుగులు, మల + ఎక్కి, పడినను, మడియన్ + కలరు, ప్రెన్నూబిన్ + పడినను, మడియన్ + కలరు, కోరి + ఎక్కినన్ + ఎ, మల వలని, ముప్పు, కోరక + ఉన్నను, ఊఱి, సమయు, చొప్పు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** క్రించుబాటీలు హెచ్చుబాటీలపైన్ + పలు మడుగులు ఇనుముప్పుకాను.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఇనుముప్పుకాను = ఇంకను ప్రమాదకరము ; క్రించుబాటీలు = ఆత్మన్యూనతా భావుకులు ; హెచ్చుబాటీల పైన్ = ఆత్మాధిక్య భావుకుల కన్నను ; పలు మడుగులు =పెక్కురెట్లు ; మల = కొండను ; ఎమడియన్ + కలరు = చనిపోయెదరు ; ప్రెన్నూబిన్ = పెద్ద ఊబిలో ; పడినను ; ఎక్కినన్ + ఎ = ఎక్కితేనే ; ముప్పు = హాని/ ప్రమాదము ; కోరక + ఉన్నను = దిగవలె నని అనుకొనక పోయినను ; సమయు చొప్పు = చనిపోవుటకు మార్గము.

**లోవాఱిక (తాత్పర్యము) :** తమను గూర్చి తాము హీనముగా ఎంచువారు — తమను గొప్పగా అనుకొనువారి కన్నను ఎన్నియో రెట్లు ఎక్కువ ప్రమాదకారులు. కొండ ఎక్కి పడినను చనిపోవుటకు ఆస్కారమున్నది. ఊబిలో పడినను చనిపోవుటకు ఆస్కారమున్నది. కాని కోరి ఎక్కి నప్పుడే కొండ వలన ముప్పు. దిగవలె నని అనుకొనక పోయినను ఊబి వలన ముప్పు కలదు.

**పైమాల విడఁబఱు (విశేష వివరణము) :** ఇక్కడ ఆత్మాధిక్య భావుకులను కొండతోను, ఆత్మన్యూనతా భావుకులను ఊబితోను పోల్చుట జరి-గినది. కావలె నని బాధించినప్పుడే ఆత్మాధిక్య భావుకుల వలన ప్రమాదము. అట్లేదియు చేయక పోయినను ఆత్మన్యూనతా భావుకుల వలన ప్రమాదము కలదని భావము.

SUMMARY : Those suffering from inferiority complex are more dangerous than those with superiority complex. Death from falling is the common possibility with the mountain and quicksands. But it may happen with the mountain, only when one deliberately climbs it. However, it is likely to happen in the qucksands even when one does not intend to step in them.

*(Here, superiority complex has been compared with a mountain and inferiority complex, with quicksands. Those with superiority complex will harm you only when you deliberately offen-ded them. But those with inferiority complex will harm you, though you never intended to offend them).*

**అవిగింగ** ॥ మఱియుఁ గ్రించు సుమి మడియువ పాటి కఱద ;<br>
మన్నిఁ దీసెద రూరక మందికి మణియమొసఁగ ;<br>
అలఁతి-అలఁతి గోసుల నంచింతురు క్రమి వలె ;<br>
అకపాటియె యినుమేల్ మూఁకపాటి కంటెన్. 23

**మాటల విడఁదీత (పద విభాగము) :** మఱి + ఉన్, క్రించు, సుమి, మడియువ, పాటి, కఱద, మన్నిన్ + తీసెదర్ + ఊరక, మందికిన్, మణియమున్ + ఒసఁగన్, అలఁతి–అలఁతి, గోసులన్ + అంచింతురు, క్రమి వలెన్, అకపాటి + ఎ, ఇనుమేల్, మూఁక–పాటి కంటెన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** మడియువ పాటి కఱద మఱి + ఉన్ క్రించు సుమి. మందికిన్ మణియమున్ ఒసఁగన్ ఊరక మన్నిన్ తీసెదర్. అలఁతి–అలఁతి గోసులన్ క్రమి వలెన్ అంచింతురు. మూఁక–పాటి కంటెన్ అకపాటి + ఎ ఇనుమేల్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మఱి + ఉన్ = మఱీ ; క్రించు = హీనము ; సుమి = చూడుమీ ; మడియువ = మనిషి యొక్క ; పాటి కఱద = న్యాయబుద్ధి ; మన్నిన్ + తీసెదర్ = ప్రాణము తీసెదరు ; ఊరక = అనవసరముగా ; మందికిన్ = జనమునకు ; మణియమున్ = అధి కారమును ; ఒసఁగన్ = ఇచ్చినచో ; అలఁతి–అలఁతి = అల్పాల్పమైన ; గోసులన్ = దోషములను ; అంచింతురు = లెక్కవేసెదరు ; క్రమి వలెన్ = హత్య వలె ; అకపాటి + ఎ = అన్యాయమే ; ఇనుమేల్ = ఇంకను మేలు ; మూఁక–పాటి కంటెన్ = గుంపుల న్యాయమున కంటెను.

**లోవాఱిక (తాత్పర్యము) :** మానవుని న్యాయబుద్ధి అత్యంత హీనమైనది సుమా ! జనములకు అధికారమిచ్చినచో వారు చిన్నచిన్న తప్పులను కూడ హత్య అంత ఘోరముగా పరిగణించి న్యాయము పేరుతో అనవసరముగా బలహీనుల ప్రాణములను తీసెదరు. గుంపున్యాయమున కన్న అన్యాయమే (న్యాయము జరుగక పోవుటయే) మేల్తరము.

SUMMARY: Man's sense of justice is the meanest. If people were to be given power, they will treat even minor lapses as worse as murders and unnecessarily take the lives of the weak. So non-justice is preferrable to mob justice.

**గోరంటిక జంట** ॥ చేకూర్చు మూవిందు నొకనాటి సావి, చే-వలువన్ మస్తరించిన చెందావి ;
గదిలోనిది కొన్ని లుడువు లరుగు వఱకు ; బరిగి యౌఁ దవనలో బయల నది నిరుకు ; 24
వేదారగా దరివల్కునది హత్తును ; వేలాది కన్నది గాలిఁ బరుగెత్తును. 25

**మాటల విడఁదీత (పద విభాగము) :** చేకూర్చున్, ముక్కు + విందున్ + ఒక-నాటి సావి చే-వలువన్ మస్తరించిన చెన్ + తావి గదిలోనిది కొన్ని లుడువుల్ + అరుగు వఱకున్ బరిగి ఔన్ + తవనలోన్ బయలన్ + అది నిరుకు వేదారగాన్ దరివల్కునది హత్తును వేలాదికిన్ అన్నది గాలిన్ + పరుగు + ఎత్తును.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చే-వలువన్ మస్తరించిన చెన్ + తావి ఒక-నాటి సావి ముక్కు -విందున్ చేకూర్చున్. గదిలోనిది కొన్ని లుడువుల్ అరుగు వఱకున్ (ముక్కు -విందున్ చేకూర్చున్). అది బయలన్ తవనలోన్ బరిగి ఔన్, నిరుకు. వేదారగాన్ దరివల్కునది హత్తును. వేలాదికిన్ అన్నది గాలిన్ పరుగు + ఎత్తును.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒక-నాటి సావి = ఒక దినము పాటు (సావి = కాలము/ సమయము) ; చే-వలువన్ = చెతి రుమాలులో ; మస్తరించిన = బంధించిన ; చెన్ + తావి = సువాసన ; గదిలోనిది = గదిలో బంధించిన సువాసన ; కొన్ని లుడువుల్ = కొన్ని గంటలు ; అరుగు వఱకున్ = కడచు వరకు ; బరిగి = శూన్యము ; ఔన్ = అగును ; తవనలోన్ = నిమిషములో ; బయలన్ = ఆరుబయట ; అది = ఆ సువాసన ; నిరుకు = ఖాయము (నిశ్చయము) ; వేదారగాన్ = వ్యక్తిగతముగా ; దరివల్కునది = ఉపదేశించునది ; హత్తును = మనసు లో హత్తుకొనును.

**లోవాఱిక (తాత్పర్యము) :** చేతి రుమాలులో పట్టి బంధించిన సువాసన ఒక దినము పాటు ముక్కులకు విందు చేయును. గదిలో చల్లిన సువాసన కొన్ని గంటల పాటు ఉండును. ఆరుబయట చల్లిన సువాసన ఒక్క నిమిషమునకే మాయమగును. అదే విధముగా ఎవఱికైన వ్యక్తిగత-ముగా చేసిన ఉపదేశము వారికి మనస్సులో హత్తుక పోయి కలకాలము నిలచును. వేలాది మందికి ఇచ్చిన ఉపన్యాసము గాలిలో కలసి పోవును. (అది ఎవఱికిని హత్తుకొనదు, మార్పుఁజాలదని భావము).

SUMMARY : The fragrance held in a handkerchief will be a treat to the nose for the entire day. The same in a room will last for a few hours. That exposed to the open air will disappear in just a moment. Similarly, a precept made in private to a single person will be committed to his memory for long. But a speech delivered to thousands will go to winds. (It attracts no-body. Nor will it be able to transform anyone).

**గంగేరిక జంట** ॥ పాసపు తవణిల్లు నీరేటలన్, మొదలగుటకు మున్ పోరాటలున్ ;
అందొక వైపుండును గొంతదన్ ౨, అవి మొదలుపెట్టిన తరువాతన్ ; 26
ద్రిచ్చుమోమగుఁ దా నచటి నుండి, చిచ్చులు పెచ్చరిల్లిన పదపడి ;

వచ్చి చేరు గెలువాని దరి, వా- విచ్చి చెప్పలేఁడు గనుకోటరి. 27

**మాటల విడఁదీత (పద విభాగము) :** పొసవు, రవణిల్లున్ + ఈరు + ఏటలన్, మొదల్ + అగుటకున్, మున్ పోరాటలున్, అందున్ + ఒక, వైపు + ఉండును, కొంత + అదన్, అవి, మొదలు–పెట్టిన, తరువాతన్, ద్రిచ్చు–మోము + అగున్ + తాన్ + అచటి నుండి, చిచ్చులు, పెచ్చరిల్లిన, పదపడి, వచ్చి, చేరున్, గెలువాని, దరిన్, వా–విచ్చి, చెప్పన్ + లేఁడు, కనుక + ఓటరి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పోరాటలున్ మొదల్ అగుటకున్ మున్ ఈరు ఏటలన్ పొసవు రవణిల్లున్. అవి మొదలు–పెట్టిన తరువాతన్ (పొసవు) కొంత అదన్ అందున్ ఒక వైపు ఉండును. చిచ్చులు పెచ్చరిల్లిన పదపడి (పొసవు) తాన్ అచటి నుండి ద్రిచ్చు–మోము అగున్. ఓటరి వా–విచ్చి చెప్పన్ లేఁడు కనుక (పొసవు) గెలువాని దరిన్ వచ్చి చేరున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పొసవు = ధర్మము ; రవణిల్లున్ = వర్తిల్లును ; ఈరు + ఏటలన్ =ఉభయ పక్షముల యందును ; అందున్ = ఆ రెండు పక్షములలో ; కొంత + అదన్ = కొంతకాలము ; ద్రిచ్చు–మోము + అగున్ = అద్రుశ్యమగును ; తాన్ = ఆ ధర్మము ; చిచ్చులు = వైరాగ్నులు ; పెచ్చరిల్లిన పదపడి = విజృంభించిన తరువాత ; గెలువాని దరిన్ = విజేత దగ్గరకు ; వా–విచ్చి = నోరు దెఱిచి ; ఓటరి = ఓడిపోయినవాఁడు.

**లోవాఱిక (తాత్పర్యము) :** రెండు వర్గముల నడుమ పోరాటములు మొదలగుటకు ముందు మొదటిలో న్యాయము, ధర్మము ఆ ఉభయ పక్షముల వైపును ఉండును. పోరాటము మొదలైన తరువాత ధర్మము కొంతకాలము పాటు వారిలో ఒకటి వైపే ఉండును. శత్రుత్వపు మంటలు బాగుగా రాజుకొన్న తరువాత ధర్మము ఎవటి వైపున గానీ ఉండకుండ అక్కడి నుంచి మాయమగును. పోరాటము ముగిసిన తరువాత గెలిచిన వాని పక్షమునకు వచ్చి చేరినట్లగుపించును.ఎందుకనఁగా — ఓడిపోయినవాఁడు ఇఁక మాటలాడలేఁడు గనుక.

SUMMARY : Justice is on both sides before hostilities commence between two factions. It will only be on one side for some time after the hostilities begin. It will altogether vanish from the scene after the fighting rages on a full scale. It will appear to have taken the side of the victor after the fight is over, because the vanquished cannot speak up anymore.

**చదును అవిగింగ జంట ||** ప్రెమ్మాటి గడపే నొక కటిక జరుమానము ;
కడకు జరుమానమున నడఁగుఁ దన హత్తరము ;
ఒక మంది కొక సీమ కొడయ అగుఁ బ్రెమ్మాటి ;
అది దాఁటి పఱచుకొన దాతనిదగు పఱపటి ; 28
ఎలసీమ యెలకార్తి యెంచికలు పోహణివి ;
ఎల్ల లెఱుఁగని హత్తు ఎల్లపుడుఁ దన ప్రాహి. 29

**మాటల విడఁదీత (పద విభాగము) :** ప్రెమ్మాటి, కడపేను + ఒక, కటిక, జరుమానమున్, కడకున్, జరుమానమునన్, అడఁగున్ + తన, హత్తరము, ఒక, మందికిన్ + ఒక, సీమకున్ + ఒడయ + అగున్ + ప్రెమ్మాటి, అది, దాఁటి, పఱచుకొనదు + ఆతనిది + అగు, పఱపటి, ఎలసీమ, ఎలకార్తి, ఎంచికలు, పోహణివి, ఎల్లల్ + ఎఱుఁగని, హత్తు, ఎల్లపుడున్ + తన, ప్రాహి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ప్రెమ్మాటి ఒక కటిక జరుమానమున్ కడపేను. కడకున్ తన హత్తరము జరుమానమునన్ అడఁగున్ . ప్రెమ్మాటి ఒక మందికిన్ ఒక సీమకున్ ఒడయ అగున్. ఆతనిది అగు పఱపటి అది దాఁటి పఱచుకొనదు. పోహి ఎలసీమ ఎలకార్తి ఎంచికలు పోహణివి. ఎల్లల్ ఎఱుఁగని హత్తు ఎల్లపుడున్ తన ప్రాహి.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ప్రెమ్మాటి = రాజకీయవేత్త ; కడపేను కడపున్ ; కటిక జరుమానమన్ = వట్టి వర్తమాన కాలమును ;

కదకున్ = చివరికి ; అడఁగున్ = అణఁగిపోవును ; హత్తరము = ప్రభావము ; ఒక మందికిన్ = ఒక ప్రజకు ; ఒక సీమకున్ = ఒక దేశమునకు ; ఒడయ = ప్రభువు ; పఱచుకొనదు = వ్యాపించదు ; పఱపటి = పరపతి ; ఎలసీమ = సార్వదేశీయములు/ అంతర్జాతీయ ములు ; ఎలకార్తి = సార్వకాలీనములు (అయిన) ; ఎంచికలు = భావనలు ; పోహణివి = కవికి చెందినవి ; ఎల్లల్ + ఎఱుఁగని = హద్దులు లేని ; హత్తు = ప్రభావము ; ప్రాహి = భాగ్యము.

**లోవాఱిక (తాత్పర్యము) :** రాజకీయవేత్తకు గతమును, భవిష్యమును లేవు. ఆతఁడు మానసికముగా వట్టి తత్ క్షణ వర్తమానమునందు జీవిం చుచుండును. అందుచేత ఆతని గొప్పతనమంతయు వర్తమానము వరకే పరిమితము. అది వర్తమానమునందే గుఱుతుండును. భవి-ష్యత్తులో ఆతనిని గుర్తు చేసికొను వారెవఱును ఉండరు. అట్లే ఆతని ప్రభుత్వము ఒక ప్రజకు, ఒక దేశమునకు పరిమితము. వేఱే ప్రజలకు, దేశములకు ఆతని ఉఱుసే పట్టదు. ఇందుకు విరుద్ధమైన వాఁడు కవి. ఈతఁడు సార్వదేశీయములును, సార్వకాలికములును అగు ఆలో-చనలు చేయును. అందువలన కాలమునకు, సరిహద్దులకు అతీతమైన ప్రభావము ఈతని సొత్తు.

SUMMARY : The politician has neither the past nor the future but only lives in the absolute present. So all his greatness is limited to the present only, being remembered for the time being, with no one left to recall him in future. Also, he presides over a particular people and their country with no one to care him overseas. The poet is in stark contrast to the politician. He thinks of the things relevant to all times and lands. As such, an influence transcending the times and borders makes his good fortune.

**అవిగింగ** ॥ మవకంటు త్రోవగించు వేల్పుకంటునకున్ ;
గుజఱికంటు దారిదీయు లిబ్బికంటునకు ;
గ్రబికంటు పంటగిల్లు వాంకిత కంటుగాన్ ;
రాకంటునకుఁ దరుకౌట యెల్ల కంటులున్. 30

**మాటల విడఁదీత (పద విభాగము) :** మవ-కంటు, త్రోవగించున్, వేల్పు-కంటునకున్, గుజఱి-కంటు, దారి-తీయున్, లిబ్బి-కంటునకున్, గ్రబి-కంటు, పంటగిల్లున్, వాంకిత-కంటుగాన్, రా-కంటునకున్, తరుకౌట, ఎల్ల కంటులున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మవ-కంటు వేల్పు-కంటునకున్ త్రోవగించున్. గుజఱి-కంటు లిబ్బి-కంటునకున్ దారి-తీయున్. గ్రబి-కంటు వాంకిత-కంటుగాన్ పంటగిల్లున్. ఎల్ల కంటులున్ రా-కంటునకున్ తరుకౌట.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మవ-కంటు = పురుష ద్వేషము ; త్రోవగించున్ = దారి తీయును ; వేల్పు-కంటునకున్ = దైవ ద్వేషము నకు ; గుజఱి-కంటు = ధనిక ద్వేషము ; లిబ్బి-కంటునకున్ = సంపదల ద్వేషమునకు ; గ్రబి-కంటు = పండిత ద్వేషము ; పంటగిల్లున్ = ఫలించును ; వాంకిత-కంటుగాన్ = చదువుల తల్లి మీఁది ద్వేషముగా ; రా-కంటునకున్ = రాజ ద్వేషమునకు ; తరుకౌట = పర్యవసా నము ; ఎల్ల కంటులున్ = అన్ని ద్వేషములును.

**లోవాఱిక (తాత్పర్యము) :** పురుష ద్వేషము దైవ ద్వేషమునకు దారి దీయును. ధనిక ద్వేషము సంపదలనే ద్వేషించుటకు దారి దీయును. పండిత ద్వేషము చదువుల తల్లినే నిరసించుటకు దారి దీయును. రాజద్వేషము (ప్రభుత్వమును ద్వేషించుట) చే అందఱి మీఁదను, అన్నిఁటి మీఁదను ద్వేషము కలుగును.

SUMMARY : Misandry leads to hatred for God. Hatred for the affluent leads to hatred of prosperity itself. Hatred for scholars leads to hatred for the Goddess of knowledge. Hatred for the king (government) generates hatred for everyone and everything in the country.

**దాసానిక** ॥ ఒడలంతయు నొడ్డారమె కడల్కొన్నవానికి,
నొడికపు నొద్దిక-వాకో లొదవించు నినుకంటు ;
కాలిన మైవీటులపై జాలుగఁ జన్నీటిన్
బోయ నినుమంటయె గాని పొందవు గా మెలపున్. 31

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒడల్ + అంతయున్ + ఒడ్డారము + ఎ, కడల్కొన్న-వానికిన్ + ఒడికపుం + ఒద్దిక-వాకోల్ + ఒదవించున్ + ఇనుకంటున్, కాలిన, మైవీటులపైన్, జాలుగన్ + చన్నీటిన్ + పోయన్ + ఇనుమంట + ఎ, కాని, పొందవు, గా, మెలపున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒడల్ అంతయున్ ఒడ్డారము + ఎ కడల్కొన్న-వానికిన్ ఒడికపుం ఒద్దిక-వాకోల్ ఇనుకంటున్ ఒదవించున్. కాలిన మైవీటులపైన్ జాలుగన్ చన్నీటిన్ పోయన్ ఇనుమంట + ఎ కాని మెలపున్ పొందవు గా.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒడల్ = శరీరము ; ఒడ్డారము + ఎ = ద్వేషమె ; కడల్కొన్న-వానికిన్ = క్రమ్ముకొన్నవానికి ; ఒడికపుం = యుక్తమైన/ సముచితమైన ; ఒద్దిక-వాకోల్ += సామరస్య వచనము ; ఒదవించున్ = పుట్టించును ; ఇనుకంటున్ = ఇంకను ఎక్కువ ద్వేషమును ; మైవీటులపైన్ = అవయవముల మీఁద ; జాలుగన్ = ధారగా ; ఇనుమంట + ఎ = ఇంకను మంటయే ; మెలపున్ = సుఖమును.

**లోవాటిక (తాత్పర్యము) :** నిలువెల్ల ద్వేషమే నిండిపోయిన వానికి సయ్యోద మాటలు చెప్పినచో వానిలో ఇంకను ద్వేషము పెరుగునే గాని నెమ్మదింపదు. కాలిన అవయవముల మీఁద చన్నీటిని పోసినచో అది ఇంకను మంటెత్తించునే తప్ప హాయి నివ్వదు కదా!

SUMMARY : When one's whole being is filled with hatred, the hate will increase more if he is told reconciliatory words. When burnt organs are drenched with cold water, the burning sensation will increase more instead of feeling comfortable.

**అవిగింగ** ॥ అందఱి లోపల నున్నపుడు కాన్పించునది
కా దప్పటమును గా దది తారితనంబును ;
తా మెయ్యది గాదో దానినే చూపెదరు ;
ఒక్క ఱున్నప్పటిదే నిక్కమై అడరు. 32

**మాటల విడఁదీత (పద విభాగము) :** అందఱి-లోపలన్ + ఉన్న + అపుడు, కాన్పించునది, కాదు + అప్పటమును, కాదు + అది, తారితనంబును, తాము + ఏ + అది, కాదో, దానిన్ + ఏ, చూపెదరు, ఒక్కఱు + ఉన్న + అప్పటిది + ఏ, నిక్కము + ఐ, అడరున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** అందఱి-లోపలన్ + ఉన్న అపుడు కాన్పించునది అప్పటమును కాదు. అది తారితనంబును కాదు. (మిగితా సుబోధము)

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అందఱి-లోపలన్ = అందఱి నడుమ ; కాన్పించునది = చూపించు నడవడిక ; అప్పటమును = శుద్ధమును ; తారితనంబును = స్వంతదనము కూడ ; నిక్కము + ఐ = నిజమై ; అడరున్ = ఒప్పారును.

**లోవాటిక (తాత్పర్యము) :** మనుష్యులు పదిమంది మధ్య ఉన్నప్పుడు చూపు నడవడిక శుద్ధము గానీ స్వంతము గానీ కాదు. అది కల్తీ నడవడి మఱియు పెట్టుడు ప్రవర్తనము మాత్రమే. మనుష్యులు పదిమంది మధ్య ఉన్నప్పుడు – తాము నిజముగా ఏది కాదో అదే అయి ఉన్నట్లు నడచుకొనెదరు. కనుక తాము ఒక్కఱుగా ఉన్నప్పుడు నడచుకొన్నదే యథార్థమైన శీలము.

SUMMARY : The demeanor exhibited by folks while they find themselves among a multitude

– is neither genuine nor original. On such occasions, folks feign a personality which is not theirs. The way they behave in solitude – is what they actually are.

**గోరంటిక జంట** ॥ ప్రేఁగుఁ ద్రెంచుక వేఱయి పుట్టిన నిసువు ౨, ఏఁగు నానాటికిఁ గరము కెళవు కెళవు ;
కాంచరు లెప్పటి వలెనె కైచూచెదరు, కన్నబిడ్డలఁ గొని గమిచికో నెదకు ; 33
ఏ త్రేసు పర్వేను ౨ ఎల్లెడల నేల, నెవటి పిల్లలు వారి యింటనే కొఱల? 34

**మాటల విడఁదీత (పద విభాగము) :** ప్రేఁగున్ + త్రెంచుక, వేఱు + అయి, పుట్టిన, నిసువు, ఏఁగున్, నాటికిన్ + నాటికిన్ + కరము, కెళవు, కెళవు, కాంచరుల్ + ఎప్పటి వలెన్ + ఎ కైచూచెదరు, కన్న–బిడ్డలన్, కొని, గమిచికోన్ + ఎదకున్, ఏ, త్రేసు, పర్వేను, ఎల్ల + ఎడలన్, నేలన్ + ఎవటి, పిల్లలు, వారి, ఇంటన్ + ఏ, కొఱలన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ప్రేఁగున్ త్రెంచుక వేఱు అయి పుట్టిన నిసువు నాటికిన్ నాటికిన్ కరము కెళవు కెళవు ఏఁగున్. కాంచరుల్ కన్న–బిడ్డలన్ ఎప్పటి వలెన్ + ఎ కొని ఎదకున్ గమిచికోన్ కైచూచెదరు. ఎవటి పిల్లలు వారి ఇంటన్ ఏ కొఱలన్ ఏ త్రేసు నేలన్ ఎల్ల + ఎడలన్ పర్వేను?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నిసువు = పసిబిడ్డ ; ఏఁగున్ = పోవును ; నాటికిన్ + నాటికిన్ = రోజురోజుకు ; కరము = మిక్కిలి ; కెళవు కెళవు = దూరదూరముగా ; కాంచరుల్ = తల్లిదండ్రులు ; కైచూచెదరు = ప్రయత్నించెదరు ; కొని = ఎత్తుకొని ; గమిచికోన్ = గట్టిగా కఱచి పట్టుకొనుటకు ; ఎదకున్ = ఱొమ్మునకు ; ఏ త్రేసు = ఏ జాతి ; పర్వేను = వ్యాపించును ; ఎల్ల + ఎడలన్ = అన్ని చోటులందును ; నేలన్ భూమిపై ; కొఱలన్ = నివసించినచో.

**లోవాఱిక (తాత్పర్యము) :** తల్లికడుపు నుండి వేఱయి బయటికి వచ్చిన క్షణము నుండియే బిడ్డ తన తల్లిదండ్రులకు రోజురోజునకు మెల్ల–మెల్లగా దూరమైపోవు ప్రక్రియ మొదలగును. కాని బిడ్డలను ఎప్పటి వలెనె (ఎప్పటికిని) తమతోనే ఉంచుకొనుటకు తల్లిదండ్రులు ప్రయ–త్నించెదరు. అయితే, ఎవటి బిడ్డలు వారి ఇంటిలోనే ఉన్న పక్షమున – ప్రపంచములో ఏ జాతి అన్ని చోటుల వ్యాపించఁగల్గెడిది?

SUMMARY : The neonate which first separated from its mother's womb, will go on separa–ting further and moving farther away from its parents day by day. However parents wish to keep their kids close to their bosom for ever. But then which human race would have spread all over the Earth, if all children stayed with their parents?

**అవిగింగ** ॥ ఐకలి యెనయించిన అంటుబడియె నిలువాన్ ;
అంకుడు కలిపిన కేళ్ళప్పసము లవణి యౌన్ ;
ఐనిల్కలు కూర్చినవగుఁ దీయని నెనపుల్ ;
రెందౌలముల సమాక్రంకు లొప్పందముల్. 35

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఐకలి + ఎనయించిన, అంటుబడి + ఎ, నిలువాన్, అంకుడు, కలిపిన, కేళ్ళ + అప్పసము, లవణి + ఔన్, ఐనిల్కలు, కూర్చినవి + అగున్ + తీయని, నెనపుల్, రెంచ + తౌలముల, సమా–క్రంకుల్ + ఒప్పందముల్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఐకలి ఎనయించిన అంటుబడి + ఎ నిలువాన్. అంకుడు కలిపిన కేళ్ళ అప్పసము లవణి ఔన్. ఐనిల్కలు కూర్చినవి తీయని నెనపుల్ అగున్. ఒప్పందముల్ రెంచ తౌలముల సమా–క్రంకుల్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఐకలి = ప్రకృతి ; ఎనయించిన = ఏకము చేసిన ; అంటుబడి + ఎ = సంబంధమే ; నిలువాన్ = చిరస్థాయి (enduring/ durable) ; అంకుడు = దేవుఁడు ; కేళ్ళ = చేతులు ; అప్పసము = ఎల్లప్పుడు ; లవణి = బిగువు ; ఔన్ = అగును ;

ఐనిల్కలు = పరిస్థితులు ; తీయని నెనపుల్ = మధుర స్మృతులు ; రెంచ + తౌలముల = మానవ సంబంధములకు ; సమా–క్రంకుల్ = మరణ శాసనములు.

**లోవాఱిక (తాత్పర్యము) :** మానవుల నడుమ ప్రకృతి ఏర్పఱచిన సంబంధము కలకాలము ఉండిపోవునట్టిది. దేవుఁడు కలిపిన చేతులకు ఎల్లప్పుడు బిగువు హెచ్చు. పరిస్థితులు కల్పించిన సంబంధములు మధురముగా నుండును. ఒకానొక సంబంధమును ఏర్పఱచుకొనుచు మానవులు తమలో తాము చేసికొన్న ఒప్పందములు — చెలిమికి వ్రాసికొన్న మరణ శాసనములు.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** శాశ్వత సంబంధమును కోరుకొనువారు ఒప్పందములు చేసికొనరాదని భావము. ఒట్లు/ఒప్పందముల ప్రాతిపదికను ఏర్పడ్డ సంబంధములు తొందఱలోనే విఫలమగును. అవి నిలఁబడవు.

SUMMARY : A relationship formed by force of the Nature is enduring. The hands joined by God are always tight together. The relations that formed spontaneously by way of circum–stances, leave sweet memories. The agreements signed by humans forming a relation, will soon prove to be death warrants to their friendship.

*(Those wishing to form a long–lasting relation should not enter an agreement. All relations formed on the basis of oaths and agreements will soon fail.)*

**అవిగింగ ॥** పిఱ్ఱులు బొఱ్ఱలుఁ దప్పఁ బేర్మింప దేదియు
నెన్ని యుబుసులాడిన నెట్టెదుట కూటము ;
మొల్ల ముల్ల ముడుపులుఁ జెల్ల వీడు-సదువులు ;
మైపూట మెంతయో మాట కంత విలువలు. 36

**మాటల విడఁదీత (పద విభాగము) :** పిఱ్ఱులున్, బొఱ్ఱలన్ + తప్పన్ + పేర్మింపదు + ఏదియున్ + ఎన్ని + ఉబుసుల్ + ఆడినన్ + ఎదుటన్ + ఎదుటన్, కూటము, మొల్లమున్ + ఉల్లమున్ + ఉడుపులున్ + చెల్లవు + ఈడు + చదువులున్, మైపూటము + ఎంత + ఓ, మాటకున్ + అంత, విలువలు.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ఎదుటన్ ఎదుటన్ కూటము ఎన్ని ఉబుసుల్ ఆడినన్ పిఱ్ఱులున్ బొఱ్ఱలన్ తప్పన్ ఏదియున్ పేర్మింపదు. మొల్లమున్ ఉల్లమున్ ఉడుపులున్ ఈడు–చదువులున్ చెల్లవు. మైపూటము ఎంత + ఓ మాటకున్ అంత విలువలు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** బొఱ్ఱలన్ = పొట్టలను ; పేర్మింపదు = గౌరవింపదు ; ఉబుసుల్ + ఆడినన్ = కబుర్లు చెప్పినను ; కూటము మొల్లమున్ = ధనమును ; ఉల్లమున్ = మనస్సును ; ఉడుపులున్ = దుస్తులును ; చెల్లవు = విలువ ఇవ్వఁబడవు ; ఈడు + చదువులున్ = వయస్సును, చదువును ; మైపూటము = శరీర బరువు.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఈ సమాజము పైకి ఎన్ని కబుర్లు చెప్పినను మనుష్యుల పిఱుఁదుల సైజును, పొట్టల సైజును చూచి మాత్రమే గౌరవించును. నీ ధనము, నీ మనస్సు, నీ బట్టలు, నీ వయస్సు, నీ చదువు — ఇవన్నియు దానికి అనవసరము. నీ శరీరపు బరువును బట్టియే నీకది ఇచ్చు విలువ.

SUMMARY : Whatever the society may claim outwardly, it respects people only for the size of their bellies and buttocks. In its view, your money, mind, dress, age and educatin are all invalid when placed against your body weight.

**వెల్మిరిక ॥** తానై రాఁదగినదే మార్పు, మతకపుఁ గమ్మతెమ్మెఱ చాడ్పు ;
కోరి మారలే రెవఱును ; దమ- కూకటిఁ బట్టుక లేవలేరు. 37

**మాటల విడఁదీత (పద విభాగము) :** తాన్ + ఐ, రాన్ + తగినది + ఏ, మార్పు, మతకపుం + కమ్మ-తెమ్మెఱ-చాడ్పు, కోరి, మారన్ లేరు + ఎవఱును, తమ, కూకటిన్, పట్టుక, లేవన్ లేరు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మతకపుం కమ్మ-తెమ్మెఱ-చాడ్పు తాన్ ఐ రాన్ తగినది + ఏ మార్పు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తాన్ + ఐ = స్వయముగా / తనయంత తాను ; మతకపుం = మాయల ; కమ్మ-తెమ్మెఱ-చాడ్పు = మలయ మారుతము విధాన ; కూకటిన్ = మాడు మీఁది జుత్తును.

**లోవాఱిక (తాత్పర్యము) :** నిజమైన మార్పు అనఁగా - మలయ మారుతము వలె తనయంత తానుగా – మనకు తెలియకుండా — నిశ్శబ్దముగా మెలమెల్లగా రావలసినదే తప్ప మనము ప్రయత్నము చేసి రప్పించునది కాదు. మారవలె ననుకొన్నంత మాత్రాన ఎవఱును మారలేరు. ఎవఱును తమ నెత్తి మీఁది జుత్తును తామే పట్టుకొని పైకి లేవలేరు.

SUMMARY : True transformation means — the thing that comes about on its own, slowly and magically like a silent breeze. No one can change oneself consciously even if one wishes to. No one can lift oneself by their own hair on the head.

**పస్సియ జంట ॥** నిక్కపు టైకలి నీటులఁ జెఱుతురు ; మేవిక పొన్నముల మెచ్చికొందురు ;
తిట్టిన తిట్టు దిట్టక తిట్టెదరు, ఆబగాఁ బాడి అడిగికొనువారిఁ ; 38
ఆబఁ ద్రసించి యాలతి సేయువాని, 'నాహా ఓహో' అనుచుఁ బొగడెదరు ;
నిక్కువము నంజ మిక్కూటమునకు ; త్రచ్చన-గల్లలె ఱిచ్చకము తనకు. 39

**మాటల విడఁదీత (పద విభాగము) :** నిక్కపుం + ఐకలి-నీటులన్ చెఱతురు మేవిక-పొన్నములన్ మెచ్చికొందురు తిట్టిన తిట్టున్ + తిట్టక తిట్టెదరు ఆబగాన్ + పాడి అడిగికొను-వారిన్ ఆబన్ త్రసించి ఆలతి + చేయు-వానిన్ 'ఆహా ఓహో' అనుచున్ + పొగడెదరు నిక్కువము నంజము + ఈ + కూటమునకున్ త్రచ్చన + కల్లలె ఱిచ్చకము తనకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నిక్కపుం ఐకలి-నీటులన్ చెఱతురు. మేవిక-పొన్నములన్ మెచ్చికొందురు. ఆబగాన్ పాడి అడిగికొను-వారిన్ తిట్టిన తిట్టున్ తిట్టక తిట్టెదరు. ఆబన్ త్రసించి ఆలతి చేయు-వానిన్ 'ఆహా ఓహో' అనుచున్ పొగడెదరు. ఈ కూటమునకున్ నిక్కువము నంజము. త్రచ్చన-కల్లలె తనకున్ ఱిచ్చకము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నిక్కపుం = నిజమైన ; ఐకలి-నీటులన్ = ప్రకృతి అందాలను ; చెఱతురు = పాడు చేసెదరు ; మేవిక-పొన్నములన్ = బొమ్మలోని ప్రకృతి దృశ్యములను ; ఆబగాన్ = ఆఁకలి-దప్పులతో ; త్రసించి = అభినయించి ; ఆలతి + చేయు-వానిన్ = పాట పాడువానిన్ ; నిక్కువము = వాస్తవము ; నంజము = విషము ; కూటమునకున్ = సమాజమునకు ; త్రచ్చన + కల్లలె = కపటము మఱియు అబద్ధములే ; ఱిచ్చకము = అద్భుతము.

**లోవాఱిక (తాత్పర్యము) :** జనము నిజమైన ప్రకృతిని, దాని అందములను నాశనము చేసెదరు. కాని ఆ ప్రకృతినే చిత్రించిన బొమ్మలలోని దృశ్యములను అబ్బురముతో మెచ్చికొందురు. నిజముగా ఆఁకలి-దప్పులతో బాధపడుచు పాటలు పాడి అడుక్కొనువానిని తిట్టి వెడలఁ-గొట్టెదరు. ఆ యాఁకలి-దప్పులనే అభినయించుచు వేదిక మీఁద పాట పాడునట్టి గాయకుని మటుకు "ఆహా ఓహో" అని పొగడెదరు. ఈ సమాజమునకు వాస్తవము విషము వలె మింగుడుపడని పదార్థము. కపటమును, అబద్ధములే దానికి అపరూపము.

SUMMARY : Folks destroy the actual Nature and its beauty, but admire the same in paint–

ings. They scold with a variety of words, the one who sings and begs out of really hunger and thirst. But they shower praises on the one who enacts the same hunger and sings a similar song on a dais. To this society, reality is unpalatable like poison. Only pretence and false–hoods feel magnificent.

**దాసానిక** ॥ అలవోకగఁ దనయంతట నైన ప్రాహిమాలిక-
కలమటఁ జెందరు మందియుఁ గానిమ్మరులై ;
రగిలిపోయెద రది యొక రెంఛైదమని తెలిసిన ;
కాసల్పటిగ నేదియ్యెన నొకటియే కాదా? 40

**మాటల విడఁదీత (పద విభాగము) :** అలవోకగన్ తన + అంతటన్ + ఐన ప్రాహిమాలికకున్ + అలమటన్ + చెందరు మంది + ఉన్ కానిమ్మరుల్ + ఐ రగిలి–పోయెదరు + అది + ఒక రెంచ + చైదము + అని తెలిసినన్ కాసల్పటిగన్ + ఏది + ఐనన్ + ఒకటి + ఏ కాదా.

**చఊమోలి (అన్వయ క్రమము) :** అలవోకగన్ తన అంతటన్ ఐన ప్రాహిమాలికకున్ మంది + ఉన్ కానిమ్మరుల్ ఐ అలమటన్ చెందరు. అది ఒక రెంచ చైదము అని తెలిసినన్ రగిలి–పోయెదరు. కాసల్పటిగన్ ఏది ఐనన్ ఒకటి + ఏ కాదా?

**కుఊ మమ్మాటిక (లఘుటీక) :** అలవోకగన్ = యాదృచ్ఛికముగా ; ఐన = జరిగిన ; ప్రాహిమాలికకున్ = దురదృష్టమునకు ; అలమటన్ = ఆవేదనను ; మంది + ఉన్ = జనము కూడ ; కానిమ్మరుల్ + ఐ = కర్మవాదులై ; రెంచ + చైదము = మానవ కృతము ; తెలిసినన్ = తెలిసినచో ; కాసల్పటిగన్ = ఆచరణాత్మకముగా.

**లోవాఊిక (తాత్పర్యము) :** ఏదైన ఒక దురదృష్టము తనయంత తాను జరిగినప్పుడు జనము కూడ దానికి ఎక్కువ ఆవేదన పడకుండ "సరే, కానిమ్ము. అట్లు జరుగవలసి ఉండెను గనుక జరిగినది" అనుచు కర్మవాదుల వలె మాటలాడెదరు. కాని "అది దానంతట అది జరుగలే-దనియు, ఒకానొక మనిషి మూలమున జరిగె" ననియు తెలిసినచో పగతో రగిలిపోయెదరు. ఆచరణలో ఏదైనను ఒకటియే కదా !

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** "అట్లు జరుగవలసి ఉండెను గనుక జరిగినది అన్న మాటయే నిజమగుచో దానంతట జరిగిన నేమి? ఒకటి వలన జరిగిన నేమి? మొత్తము మీఁద జరుగక తప్పదు కదా" అని కవిభావము. "ఏది జరిగినను ఎవటిని ద్వేషింప వల"దని సందేశము.

SUMMARY : When a misfortune befalls them, folks take it in their stride, speaking like fat–alists. But when they came to know that the supposed misfortune was actually because of a human, they will seethe with rage. Aren't both the same practically (if their earlier fatal–ism is true)?

**గోరంటిక** ॥ పాలోక్రమి అగున్ గొల్వలి-సీమల పేర ; కావళము లంటుకొనున్ గరుసుల పేర ;
లంచగొండితనము చౌకట్టుల పేర ౧ ; అడుగడుగున విన్నము లమరముల పేర. 41

**మాటల విడఁదీత (పద విభాగము) :** పొలోక్రమి, అగున్, కొల్వలి–సీమల, పేరన్, కావళముల్ + అంటుకొనున్, గరుసుల, పేరన్, లంచ గొండితనము, చౌకట్టుల, పేరన్, అడుగు + అడుగునన్, విన్నముల్ + అమరముల, పేరన్.

**చఊమోలి (అన్వయ క్రమము) :** కొల్వలి–సీమల పేరన్ పొలోక్రమి అగున్. గరుసుల పేరన్ కావళముల్ అంటుకొనున్. చౌకట్టుల పేరన్ లంచగొండితనము (అగున్). + అమరముల పేరన్ అడుగు + అడుగునన్ విన్నముల్ (అగున్).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పొలోఁక్రమి = సామూహిక హత్య ; అగున్ — జరుగును ; కొల్వలి–సీమల పేరన్ = మతము మఱియు దేశ ములు పేరిట ; కావళముల్ = పాపములు ; గరుసుల పేరన్ = సంప్రదాయముల పేరిట ; చౌకట్టుల పేరన్ = నిబంధనల పేరిట ; విన్నముల్ = అవమానములు ; అమరముల పేరన్.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనుష్యులు మతము పేరును, దేశము పేరును చెప్పి జన–హననములకు పాల్పడెదరు. సంప్రదాయముల పేరు జెప్పి పాపములకు ఒడిగట్టెదరు. నిబంధనల పేరు జెప్పి లంచములు మేసెదరు. వ్యవస్థల పేరు జెప్పి వ్యక్తులను అడుగడుగున అవమానిం–చెదరు.

SUMMARY : Folks resort to genocides in the name of religion and country. They commit sins in the name of traditions. They take bribes in the name of rules and regulations. They humi–liate respectable individuals in the name of systems.

**గోరంటిక ॥** చెడుగంతయు నొలవునఁ జెలరేఁగుచుండు, మంచి మంచి గుఱికోలుల తోడ మంచి-
కడఁదేల్మలతో మంచి నొడువులతోను ; చెడుగు వచ్చు మంచితనపు టుడుపులు దాల్చి. 42

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెడుగు + అంత + ఉన్ + ఒలవునన్ + చెలరేఁగుచున్ + ఉండున్, మంచి, మంచి, గుఱికోలుల తోడన్, మంచి, కడఁదేల్మలతోన్, మంచి, నొడువులతోన్ + చెడుగు, వచ్చున్, మంచితనపుం + ఉడుపులు, తాల్చి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒలవునన్ చెడుగు అంత + ఉన్ మంచి మంచి గుఱికోలుల తోడన్ మంచి కడఁదేల్మలతోన్ మంచి నొడువులతోన్ చెలరేఁగుచున్ ఉండున్. చెడుగు మంచితనపుం ఉడుపులు తాల్చి వచ్చున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చెడుగు = కీడు ; అంత + ఉన్ = మొత్తమును ; ఒలవునన్ = లోకములో ; గుఱికోలుల తోడన్ = ఉద్దేశము లతో ; కడఁదేల్మలతోన్ = సిద్ధాంతములతో ; నొడువులతోన్ = వాక్యములతో ; ఉడుపులు = దుస్తులు.

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రపంచములోని చెడు మొత్తమును మంచి ఉద్దేశములతోను, సిద్ధాంతములతోను, మాటలతోను చెలరేఁగుచుం–డును. ఎందుకనఁగా – చెడు ఎల్లప్పుడును మంచితనపు వేషమునే వేసికొని వచ్చును.

SUMMARY : All the evil in the world goes on rampage in the name of noble intentions, ide–ologies and sweet words because evil always comes in the guise of welfare.

**వెల్మిరిక జంట ॥** ఇచ్చిన కొలఁది యివ్వుమందురు ; చచ్చిన కొలఁది చావుమందురు ;
చేసిన కొలఁది చేయించెదరు ; ఊరకున్నఁ జిన్నపుచ్చెదరు ; 43
ఎవ్వఱి మంచి యెవఱికి ముద్దు? ఇఱ్ఱి పులిని గొల్చుటెందులకు? 44

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఇచ్చిన, కొలఁది, ఇవ్వుము + అందురు, చచ్చిన, కొలఁది, చావుము + అందురు, చేసిన, కొలఁది, చేయించెదరు, ఊరక + ఉన్నన్ + చిన్నపుచ్చెదరు, ఎవ్వఱి, మంచి, ఎవఱికిన్, ముద్దు, ఇఱ్ఱి, పులినిన్, కొల్చుట + ఎందులకు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఇఱ్ఱి = లేడి ; కొల్చుట = ఆరాధించుట.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము)

SUMMARY : The more you give the folks, the more they demand. The more you suffer, the

more they curse you with death. The more you serve them, the more they make a servant of you. The more you keep quiet, the more they humiliate you. Who does fall in love with good-ness? Why should the deer adore the tiger?

**పస్సియ జంట ॥** పుట్టు ముదిగారియు బిగితవానును, జిట్టి నిసువుగానే చెరివాఁడును ;
పూటు వక్కళకాను లెట్లగుదురు, చాటుకొన్నను దా మదియే అనుచు ; 45
పొన్న నిక్కువముల గరపట్టుదల యున్నంతకారు లేదు వక్కళము. 46

**మాటల విడఁదీత (పద విభాగము) :** పుట్టు-ముదిగారి + ఉన్, బిగితవానును + చిట్టి నిసువుగాన్ + ఏ, చెరి-వాఁడును, పూటు, వక్కళకానుల్ + ఎట్లు + అగుదురు, చాటుకొన్నను + తాము + అది + ఏ, అనుచున్, పొన్న, నిక్కువముల గర-పట్టుదల + ఉన్న + అంత-కారు, లేదు, వక్కళము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పుట్టు-ముదిగారి + ఉన్ బిగితవానును చిట్టి నిసువుగాన్ + ఏ చెరి-వాఁడును పూటు వక్కళకానుల్ ఎట్లు అగుదురు చాటుకొన్నను + తాము అది + ఏ అనుచున్ పొన్న, నిక్కువముల గర-పట్టుదల ఉన్న అంత-కారు లేదు వక్కళము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పుట్టు-ముదిగారి + ఉన్ = పుట్టుకతో చాదస్తుఁడును ; బిగితవానును = అస్తిగోపనుఁడును (rigid/ conservative) ; చిట్టి నిసువు గాన్ + ఏ = పసిబిడ్డగానే ; చెరి-వాఁడును = ప్రతివాఁడును ; పూటు వక్కళకానుల్ = పూర్తి విప్లవ కారులు ; అది + ఏ = విప్లవకారులమే ; పొన్న నిక్కువముల = దృశ్యమాన వాస్తవముల మీఁద ; గర-పట్టుదల = మొండి పట్టుదల ; ఉన్న + అంత-కారు = ఉన్నంత కాలము ; వక్కళము = విప్లవము.

**లోవాటిక (తాత్పర్యము) :** ప్రతివాఁడును పుట్టుకతో పసిప్రాయము నుండియే చాదస్తుఁడును, అస్తిగోపనుఁడును అయి ఉన్నాఁడు. ఇటువంటి వారు తాము విప్లవకారులమని పైకి చెప్పుకొన్నను అది ఎట్లగుదురు? కంటికి కనిపించు వాస్తవములే స్థిరమని నమ్మినంత కాలము విప్లవ మేమియు లేదు.

SUMMARY : Each one is orthodox and conservative since his birth even as an infant. How can such ones be revolutionaries, though they claim to be like that? No revolution as long as one believes that the perceptible reality is constant.

**కలిగోటిక ॥** మెసవి మెచ్చెదరు తిండిని మేల్గిన్నియల నునిచినపుడే ;
మ్రొక్కి మోఁకరిల్లెదరు కల్లి కొక పంచఁ గట్టినపుడే ;
చట్టరపు సకీనకే పెట్టెదరు దణ్ణము దండ వైచి ;
అమరంబుల నిముడునవియె అగు ౨ కూటమునకు గైకొనలవి. 47

**మాటల విడఁదీత (పద విభాగము) :** మెసవి, మెచ్చెదరు, తిండిని, మేల్ + గిన్నియలన్, ఉనిచిన + అపుడు + ఏ, మ్రొక్కి, మోఁకరిల్లెదరు, కల్లికిన్ + ఒక, పంచన్, కట్టిన + అపుడు + ఏ, చట్టరపుం, సకీనకున్ + ఏ, పెట్టెదరు, దణ్ణమున్, దండన్, వైచి, అమరంబులన్ + ఇముడునవి + ఎ, అగున్, కూటమునకున్, గైకొనలవి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తిండిని మేల్ + గిన్నియలన్ ఉనిచిన అపుడు + ఏ మెసవి మెచ్చెదరు. ఒక పంచన్ కట్టిన అపుడు + ఏ కల్లికిన్ మ్రొక్కి మోఁకరిల్లెదరు. చట్టరపుం సకీనకున్ + ఏ దండన్ వైచి దణ్ణమున్ పెట్టెదరు. అమరంబులన్ ఇముడునవి + ఎ కూటమునకున్ గైకొనలవి అగున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మెసవి = తిని ; మేల్ + గిన్నియలన్ = మంచి గిన్నెలలో ; ఉనిచిన + అపుడు + ఏ = ఉంచినప్పుడే/ పెట్టి

నప్పుడే ; కల్లికిన్ = శిల్పమునకు/ విగ్రహమునకు ; పంచన్ = ఆశ్రయమును ; చట్టరపుం = చట్రము గల ; సకీనకున్ + ఏ = చిత్రపట మునకే ; దణ్ణమున్ = నమస్కారమును ; దండన్ వైచి = పూలమాల వేసి ; అమరంబులన్ = వ్యవస్థలలో ; ఇముదునవి + ఎ = భాగమై నవే ; కూటమునకున్ = సంఘమునకు ; గైకొనలవి = స్వీకరణీయము.

**లోవాటిక (తాత్పర్యము) :** తిండిని మంచి, శుభ్రమైన, అందమైన గిన్నెలలో పెట్టి వడ్డించినప్పుడే జనమది తిని మెచ్చుకొందురు. (అంతే తప్ప నేల మీఁద పోసినచో ముట్టుకొనరు). ఒక విగ్రహమునకొక ఆశ్రయమును కట్టి దాని నందులో ప్రతిష్ఠించినప్పుడే జనము దానికి మ్రొక్కె-దరు. చట్రము (frame) కట్టిన చిత్రపటమునకే వారు దండ వేసి దణ్ణము పెట్టెదరు. అదే విధముగా, ఒక వ్యవస్థలో భాగమైన అంశములు మటుకే సమాజమునకు ఆదరణీయములును, ఆమోదయోగ్యములును అగును.

SUMMARY : Folks partake of food and admire it only when it is kept in clean and nice bowls and plates. They bow down to an idol only when it is installed in a separate shelter. They garland and pay homage to a portrait only when it is properly framed. Similarly, only those things which are part of a system/ establishment become acceptable to society.

**వెల్మిరిక ॥** తుగ్గలి వెలుఁగఁ గావలెఁ బ్రవిక ; నారు వోయఁగ వలయును గనిమ ;

**అచ్చుక ట్టొకటి లేక బ్రుంగు, ఊిచ్చకమగు నెఱుకల హొరంగు.** 48

**మాటల విడఁదీత (పద విభాగము)** : తుగ్గలి వెలుఁగన్ + కావలెన్ + ప్రవిక నారు + పోయఁగన్ వలయును గనిమ అచ్చుకట్టు + ఒకటి లేక బ్రుంగున్ ఊిచ్చకము + అగు + ఎఱుకల హొరంగు.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** తుగ్గలి వెలుఁగన్ ప్రవిక కావలెన్. నారు పోయఁగన్ గనిమ వలయును. అచ్చుకట్టు ఒకటి లేక ఊిచ్చకము అగు ఎఱుకల హొరంగు బ్రుంగున్..

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తుగ్గలి = దీపము ; వెలుఁగన్ = వెలుఁగుటకు ; ప్రవిక = ప్రమిద ; వలయును [ కావలెను ; గనిమ = మడి గట్టు ; అచ్చుకట్టు = వ్యవస్థ ; బ్రుంగున్ = ధ్వంసమగును ; ఊిచ్చకము + అగు = అద్భుతమైన ; ఎఱుకల హొరంగు = జ్ఞానశోభ.

**లోవాటిక (తాత్పర్యము) :** దీపము వెలుఁగవలె నన్న దానికొక ప్రమిద కావలె. నారు పోయవలె నన్నచో వాటికొక మడి, ఆ మడికొక గట్టు కావలె. అట్లే, జ్ఞానరాశిని కాఁపాడుటకు సైతమొక వ్యవస్థ కావలె. అది లేనిచో అద్భుతమైన జ్ఞాన సౌందర్యమంతయు ధ్వంసమగును.

SUMMARY : Light needs a lamp to glow steadily. Saplings need a field divided by ridges to grow well. Similarly, a system is needed to preserve knowledge. In its absence, all the marve-llous splendor of knowledge will be subject to vandalism.

**వెల్మిరిక జంట ॥** తీరుంటిదమైనట్లు గాదు, పోతరంబు నెసవాడనిదే,

బ్రదుకుట వీలుపడని కూటము ; ససిమివానని చెప్పఁగలమే, 49

చిలుప మందు వాడక తప్పని, యుసుఱుగొడ్డపు జబ్బురెంచను? 50

**మాటల విడఁదీత (పద విభాగము) :** తీరుంటిదము + ఐన + అట్లు, కాదు, పోతరంబున్ + ఎసవాడనిదే, బ్రదుకుట, వీలు-పడని, కూటము, ససిమివాన్ + అని, చెప్పన్ + కలమే, చిలుప-మందున్, వాడక, తప్పని, ఉసుఱు-గొడ్డపుం, జబ్బు-రెంచను.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** పోతరంబున్ ఎసవాడనిదే బ్రదుకుట వీలు-పడని కూటము తీరుంటిదము ఐన అట్లు కాదు. చిలుప-మందున్ వాడక తప్పని ఉసుఱు-గొడ్డపుం జబ్బు-రెంచను ససిమివాన్ అని చెప్పన్ కలమే.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తీరుంటిదము = నాగరికము ; పోతరంబున్ = బలమును ; ఎసవాడనిదే = ప్రయోగింపకుండ ; కూటము = సమాజము ; ససిమివాన్ = ఆరోగ్యవంతుఁడు ; చిలుప–మందున్ = గరళమును ; ఉసుఱు–గొడ్డపు = ప్రాణాంతకమైన ; జబ్బు–రెంచను = రోగిష్టి మనిషిని.

**లోవాఱిక (తాత్పర్యము) :** బలప్రయోగము చేయకుండ బ్రదుకుట సాధ్యపడని సమాజము నాగరికమైనట్లు కాదు. గరళము పోయనిదే బ్రది–కించుట సాధ్యపడనంత ప్రాణాంతక జబ్బుతో బాధపడుచున్న రోగిష్టి మనిషి ఆరోగ్యవంతుఁడని చెప్పఁగలమా?

**వైమాల విడఁబర్రు (విశేష వివరణము) :** గరళము పోయుట (గరళ చికిత్స) : గరళము అనఁగా పాము విషము. దానిని సూదిమొనంత తీసి రోగి గొంతులో వేయుటయే గరళ చికిత్స. ఒక రోగి ఏమి చేసినను బ్రదుకఁడని ఆశ వదులుకొన్న పరిస్థితిలో ప్రాచీన వైద్యులు చిట్టచివరి ప్రయత్నముగా ఈ చికిత్స చేసెడివారు. గరళము దెబ్బకు ఆ రోగి బ్రదుకనైనను బ్రదుకవలె. లేదా చనిపోవలె. ఇది ఆనాటి లెక్క.

SUMMARY : A society which renders it impossible to survive without the use of force, is not as good as civilised. May we call a person healthy if he cannot be cured without venom treat–ment?

*(Venom treatment was an ancient medical practice in which the physicians left a drop of snake venom as tiny as the tip of a needle in the throat of the patient. It should either cure or kill him. This used to be the last and final weapon in the kit of the physicians when all else failed in the case of terminally ill patients).*

**వాణిద ॥** సుంతయ కాంచి యెంతయో యుజ్జాయించుకొను నొలవు ;
ఉజ్జరిది యెంతెంతయో యున్నచోఁ దనుల్లమునకు ;
తెల్లమైన చెరిది దాని కల్లా టప్పా మెలఁగరము ;
తెల్లము గాని చెరిది తన కొల్లరాని ప్రెన్నేఱము. 51

**మాటల విడఁదీత (పద విభాగము) :** సుంత + అ, కాంచి + ఎంత + ఓ + ఉజ్జాయించుకొనున్ + ఒలవు, ఉజ్జరిది, ఎంత + ఎంత + ఓ, ఉన్నచోన్ + తన్ + ఉల్లమునకున్, తెల్లము + ఐన, చెరిది, దానికిన్, అల్లా–టప్పా, మెలఁగరము, తెల్లము, కాని, చెరిది, తనకున్ + ఒల్లన్ + రాని, ప్రెన్ + నేఱము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒలవు సుంత + అ కాంచి ఎంత + ఓ ఉజ్జాయించుకొనున్. ఎంత ఎంత + ఓ ఉన్నచోన్ తన్ + ఉల్లమునకున్ ఉజ్జరిది. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సుంత + అ = కొంచెమే ; కాంచి = చూచి ; ఎంత + ఓ = చాల ; ఉజ్జాయించుకొనున్ = ఊహించుకొనును ; ఒలవు = లోకము ; ఉజ్జరిది = ఊహాతీతము ; ఎంత + ఎంత + ఓ = మిక్కిలి ఎక్కువగా ; తన్ + ఉల్లమునకున్ = తన మనస్సునకు ; తెల్లము + ఐన = స్పష్టమైన ; చెరిది = ప్రతి విషయమును ; దానికిన్ = లోకమునకు అల్లా–టప్పా మెలఁగరము = సామాన్యమైన (విలువ లేని / పెద్దగా పట్టించుకొన నక్కఱలేని) వ్యవహారము ; ఒల్లన్ + రాని = ఒప్పుకొనుటకు వీలుపడని ; ప్రెన్ + నేఱము = పెద్ద నేఱము.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఏ విషయములో నైనను లోకము కొంచెమును మాత్రమే చూచి దాని ఆధారముతో మిక్కిలి ఎక్కువగా ఊహించు కొనును. నిజముగా ఎక్కువయే ఉన్నచో అది దాని మనస్సునకు అనూహ్యము. తనకు అర్థమైన ప్రతి విషయమును దాని కనురోకలో పనికి రాని వ్యవహారము. అట్లని అది తన కర్థము కాని విషయముల నేమైన గౌరవించునా ? లేదే. అటువంటివి ఉండుట దాని కనురోకలో పెద్ద నేఱము.

SUMMARY : The world gets to see only a little on any matter and estimates it to be ten

times more. If it is really that excessive, the world fails to have an idea of it. To it, the very existence of incomprehensible things is a crime, while every comprehensible thing is simply worthless.

**అవిగింగ జంట** ॥ తగఁ బండించి దవసంబుఁ బిండిగా విసరి
ముగియ ముద్దలు జేసి, సాది, తట్టి చాప-
ట్లమరించి కాల్ప నారగింపవలసిన వాఁ-
డగుఁ గట్టిఁడు బెట్టిదుఁడున్ బోరుల నరుముల ; 52
గురుములు పండిన తోడ్తోడనే కోసి నుఱిచి
నేరుగా నుడికించి నెమ్మి మెసవెడివాఁడు
టెక్కేది యొరులతోఁ జక్కగా మసలుకొను ;
నైకలి బిడ్డ రెంచ యామె పోలిక నుండు. 53

**మాటల విడఁదీత (పద విభాగము) :** తగన్ + పండించి, దవసంబున్ + పిండిగాన్, విసరి, ముగియన్, ముద్దలున్ + చేసి, సాది, తట్టి, చాపట్లు + అమరించి, కాల్పన్ + ఆరగింపన్ + వలసిన-వాఁడు + అగున్, గట్టిఁడున్, బెట్టిదుఁడున్ + పోరులన్ + అరుములన్, గురుములు, పండిన, తోడ్తోడన్ + ఏ, కోసి, నుఱిచి, నేరుగాన్ + ఉడికించి, నెమ్మిన్, మెసవెడి-వాఁడు, టెక్కున్ + ఏది + ఒరులతోన్ + చక్కగాన్, మసలుకొనున్ + ఐకలి-బిడ్డ, రెంచ + ఆమె-పోలికన్ + నుండున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తగన్ పండించి దవసంబున్ పిండిగాన్ విసరి ముగియన్ ముద్దలున్ చేసి సాది తట్టి చాపట్లు అమరించి కాల్పన్ ఆరగింపన్ వలసిన-వాఁడు పోరులన్ అరుములన్ గట్టిఁడున్ బెట్టిదుఁడున్ అగున్. గురుములు పండిన తోడ్తోడన్ + ఏ కోసి నుఱిచి నేరుగాన్ ఉడికించి నెమ్మిన్ మెసవెడి-వాఁడు టెక్కున్ ఏది ఒరులతోన్ చక్కగాన్ మసలుకొనున్. రెంచ ఐకలి-బిడ్డ. ఆమె-పోలికన్ నుండున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తగన్ = తగినట్లుగా ; దవసంబున్ = ధాన్యమును ; ముగియన్ = అయిపోయిన తరువాత ; సాది = సాఁగఁ దీసి పఱచి ; చాపట్లు = రొట్టెలను ; అమరించి = కూర్చి ; కాల్పన్ = కాల్చఁగా ; ఆరగింపన్ + వలసిన-వాఁడు = తినవలసిన పరిస్థితిలో ఉన్నవాఁడు ; గట్టిఁడున్ = దృఢకాయుఁడును/ దృఢ మనస్కుఁడును ; బెట్టిదుఁడున్ = భయంకరుఁడును ; పోరులన్ = యుద్ధములలో ; అరుములన్ = ఆక్రమణములలో ; గురుములు = గింజలు ; తోడ్తోడన్ + ఏ = వెనువెంటనే ; నుఱిచి = నూర్చి ; నెమ్మిన్ = ఆదరముతో (ఇష్టముగా) ; మెసవెడి-వాఁడు = తినెడివాఁడు ; టెక్కున్ + ఏది = గర్వమును విడచి ; + ఒరులతోన్ = ఇతరులతో ; మసలుకొనున్ = మెలఁగును (ప్రవర్తించును) ; ఐకలి-బిడ్డ = ప్రకృతి యొక్క బిడ్డ ; రెంచ = మనిషి.

**లోవాఱిక (తాత్పర్యము) :** చక్కగా పంట పండించి, ఆ ధాన్యమును పిండిగా విసరి, ఆ పిండిని ముద్దలుగా చేసి, సాది, రొట్టెలు చేసి కాల్చి ననే గాని తిండి తినలేని పరిస్థితిలో ఉన్నవాఁడు (అనఁగా - మెట్టనేల కాఁపరస్తుఁడు) దృఢకాయుఁడును, దృఢ మనస్కుఁడును అగును. యుద్ధములలోను, ఆక్రమణములందును భయంకరుఁడగును. అట్లు కాక — గింజలు పండిన వెంటనే పంట కోసి నూర్చి దానిని ఉడికించి తినెడివాఁడు (మ్రాఁగాణముల కాఁపరస్తుఁడు) అహంకారము లేక ఇతరులతో చెలిమితో మెలఁగును. మనిషి ప్రకృతి యొక్క బిడ్డ. తన చుట్టుత ఉన్న ప్రకృతి ఎట్లుండునో తానును అట్లే అగును. ఆమె పోలికలే తనకు కూడ వచ్చును.

SUMMARY : The highlander who is constrained to eat only after painstakingly preparing the bread out of the flour ground and kneaded from the grain – becomes a strong man and a terrific fighter in battles and invasions. On the contrary, the plainsman who can cook and

eat the grain immediately after it is harvested and ground – is devoid of ego and gets along with others in a friendly way. Man is the (surrounding) Nature's child who takes after Her.

**అవిగింగ** ॥ ఎటారిల్లి యెవ్వటిఁ గూర్చి చేసె వేలుపు ౨
"ఒంటిం పిది నీది" అనుచుఁ బేర్పేరఁ బిలుపు ;
అంటసించుకొని అవ్వాటిఁ దమకుఁ దామె ;
నంటుకంటుల కెఱయ్యై గొంటులయ్యేదరు. 54

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎటారిల్లి, ఎవ్వటిన్ + కూర్చి, చేసెన్, వేలుపు, ఒంటింపు + ఇది, నీది, అనుచున్ + పేర్ + పేరన్ + పిలుపున్, అంటసించుకొని, ఆ + వాటిన్ + తమకున్ + తాము + ఎ, నంటు–కంటులకున్ + ఎఱ + ఐ, గొంటుల్ + అయ్యేదరు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వేలుపు ఎటారిల్లి ఒంటింపు ఇది నీది అనుచున్ ఎవ్వటిన్ కూర్చి పేర్ + పేరన్ పిలుపున్ చేసెన్? ఆ + వాటిన్ తమకున్ తాము + ఎ అంటసించుకొని నంటు–కంటులకున్ ఎఱ ఐ గొంటుల్ అయ్యేదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎటారిల్లి = ప్రత్యక్షమై ; వేలుపు = దేవుఁడు ; ఒంటింపు + ఇది = ఈ కర్తవ్యము ; పేర్ + పేరన్ = ప్రతి ఒక్కటి పేరు మీఁద ; అంటసించుకొని = ఆపాదించుకొని ; నంటు–కంటులకున్ = రాగద్వేషములకు ; ఎఱ + ఐ = లోనై ; గొంటుల్ = దుష్టులు.

**లోవాటిక (తాత్పర్యము) :** దేవుఁడు ఎవటికి ప్రత్యక్షమై, ఎవటిని పేరుపేరున పిలిచి, "ఈ కర్తవ్యము నీది." అని అప్పగించెను? ఆయన అప్పగింపక పోయినను, జనము ఆయా కర్తవ్యములను తమకు తామే మీఁద వేసికొని రాగద్వేషములకు లోనై దుర్మార్గులుగా మారెదరు.

SUMMARY : Whom did God appear and assign duties to? Folks take certain duties upon themselves, develop love and hatred in their course and finally become the wicked.

**తామరిక** ॥ నెసరు హిర్సము వేలుపు మనకు నేరుగ దరి నున్నంత వఱకు ;
ఆయనయే నులిపారు నలుసు ౨ అలమింటన్ బల్ కెళవునకు ;
మంచివారము, గొప్పవారము మనము మన చుట్టు గలవారికి ;
సోదిలోనికి రాము సుంతయుఁ జోఁగారులఁ గెళవగువారికి. 55

**మాటల విడఁదీత (పద విభాగము) :** నెసరు, హిర్సము, వేలుపు, మనకున్, నేరుగన్, దరిన్ + ఉన్న + అంత వఱకున్, ఆయన + ఏ, నులిపారు, నలుసు, అలమింటన్, బల్, కెళవునకున్, మంచి–వారము, గొప్ప–వారము, మనము, మన చుట్టు, కల–వారికిన్, సోదిలోనికిన్, రాము, సుంత + ఉన్ + చోన్ + కారులన్, కెళవు + అగు–వారికిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నెసరు మనకున్ నేరుగన్ దరిన్ ఉన్న అంత వఱకున్ హిర్సము వేలుపు. ఆయన + ఏ అలమింటన్ బల్ కెళవునకున్ నులిపారు నలుసు. మన చుట్టు కల–వారికిన్ మనము మంచి–వారము గొప్ప–వారము. చోన్ + కారులన్ కెళవు అగు–వారికిన్ సుంత + ఉన్ సోదిలోనికిన్ రాము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నెసరు = సూర్యుఁడు ; హిర్సము = ప్రధానము ; వేలుపు = దేవుఁడు ; దరిన్ = దగ్గరలో ; నులిపారు = సూక్ష్మమైన ; నలుసు = అణువు ; అలమింటన్ = బాహ్య (outer space) రోదసిలో ; బల్ కెళవునకున్ = బహు దూరమునకు ; సోదిలోనికిన్ = ప్రస్తావన లోనికి ; సుంత + ఉన్ = కొంచెము కూడ ; చోన్ + కారులన్ = దేశ కాలములలో ; కెళవు + అగు–వారికిన్ = దూరముగా ఉన్నవారికి.

**లోవాటిక (తాత్పర్యము) :** సూర్యుఁడు దగ్గరగా ఉన్నంత వరకు మనకాయన ముఖ్యుఁడును, దేవుఁడును. ఆయనయే బాహ్యారోదసి నుండి సూక్ష్మమైన అణువు వలె కనిపించును. అట్లే మన చుట్టుత ఉన్నవారికి మనము మంచివారము, గొప్పవారము. కాని దేశకాలములను బట్టి మనకు దూరములో ఉన్నవారికి మనము ఏమాత్రము ప్రాస్తావికులము కాము.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** అలమిన్/ అలమిన్ను = బాహ్యారోదసి (outer space).

SUMMARY : The Sun is God and an important luminary body for us as long as we are near Him. The same Sun looks like a microscopic particle form the outer space. In the same way, we are good and great only for those in our immediate proximity. We are irrelevant to those who are far separated from us in time and space.

**గోరంటిక ॥** "ఏచితి నొకటినే" అని యెంచెద వీవు ; ఎంద ఱొక్కొక్కఱి వెనుక నీ వెఱుఁగవు ;
ఒకటి పాకా రతనివారికి గుండెయేరు ; ఇ ల్లొకటి గాల్పఁ బదిళ్ళు పదదువాఱు. 56

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏచితిన్ + ఒకటిన్ +ఏ, అని, ఎంచెదవు + ఈవు, ఎందఱు + ఒక్క + ఒక్కఱి వెనుకన్, నీవు + ఎఱుఁగవు, ఒకటి, పొకార్ + అతని-వారికిన్, గుండె + ఏరు, ఇల్లు + ఒకటిన్ + కాల్పన్ + పది + ఇళ్ళు, పదదు+ పాఱున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఏచితిన్ ఒకటిన్ +ఏ అని ఈవు ఎంచెదవు. ఒక్క + ఒక్కఱి వెనుకన్ ఎందఱు నీవు ఎఱుఁగవు.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఏచితిన్ = బాధించితిని ; ఎంచెదవు = భావించెదవు ; ఈవు = నీవు ; పొకార్ = నాశనము ; గుండె + ఏరు = గుండెనొప్పి ; కాల్పన్ = కాల్చఁగా ; పదదు+ పాఱున్ = బూడిద అగును.

**లోవాటిక (తాత్పర్యము) :** "నేను బాధించినది ఒక్కఱినే కదా!" అని నీవు అనుకొందువు. కాని ఆ ఒక్కఱి వెనుక ఎంతమంది ఉన్నారో నీకు తెలియదు. ఒక్కఱి నాశనము అతనికే కాక అతని వారందఱికిని హృదయ వేదనను కలిగించును. ఒక ఇంటికి నిప్పుఁ బెట్టినచో ఆ చుట్టు-ప్రక్కల పది ఇళ్ళు కాలిపోవును.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** కేవలము ఒక్కఱిని బాధించుట గుండానే ఎంతో మందిని బాధపెట్టిన పాపము అంటుకొనును. కనుక ఏ ఒక్కఱిని గానీ బాధపెట్టవలదని భావము.

SUMMARY : You may think that you have troubled just one. However you may not know how many other souls are also there behind that single soul. One's devastation pains the hearts of all those in his/ her circuit. Ten other houses in the neighbourhood will be up in smoke too, if just one house is set on fire. (Do not ever pain even one single person).

**అవిగింగ ॥** కిట్టదు మఱుపంటకు గింజలన్ని నంజఁగ ;
మోడము లేర్పడవు మొత్తము నీరు దాఁపఁగ ;
కాఁపు ముదిమిఁ గలుగదు కందులఁ గని పెంపక ;
మఱుప్రొద్దు వొడవ, దిసుమంతైన మాల్కొనక. 57

**మాటల విడఁదీత (పద విభాగము) :** కిట్టదు, మఱు-పంటకున్, గింజల్ + అన్ని, నంజఁగన్, మోడముల్ + ఏర్పడవు, మొత్తము, నీరు, దాఁపఁగన్, కాఁపు, ముదిమన్, గలుగదు, కందులన్ + కని, పెంపక, మఱు-ప్రొద్దు + పొడవదు + ఇసుము + అంత + ఐనన్, మాల్కొ

నక.

**చఱమోలి (అన్వయ క్రమము) :** గింజల్ అన్ని నంజఁగన్ మఱు-పంటకున్ కిట్టదు. మొత్తము నీరు దాఁపఁగన్ మోడముల్ ఏర్పడవు. కందులన్ కని పెంపక ముదిమన్ కాఁపు కలుగదు. ఇసుము అంత ఐనన్ మాల్కొనక మఱు-ప్రొద్దు పొడవదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కిట్టదు = సరిపడదు ; మఱు-పంటకున్ = తరువాతి పంటకు ; నంజఁగన్ = తినంగా ; మోడముల్ = మబ్బులు ; కాఁపు = రక్షణ ; ముదిమన్ = ముదుసలితనములో ; కందులన్ = పసిపిల్లలను ; పెంపక = పెంచకుండ ; మఱు-ప్రొద్దు = తేపటి ప్రొద్దు ; పొడవదు = ఉదయింపదు ; ఇసుము + అంత + ఐనన్ = అణువంత అయినను ; మాల్కొనక = త్యాగము చేయకుండ.

**లోవాఱిక (తాత్పర్యము) :** పండినవన్నియు తినివేసినచో మరల పంట వేయుటకు గింజలేమియు మిగులవు. మానవులు నీళ్ళన్నియు దాఁపఁగల్గినచో మబ్బులు ఏర్పడవు. వానలు కురువవు. పడుచుప్రాయములో ఉన్నప్పుడు శ్రమ దీసికొని పిల్లను కని పెంచక పోయినచో ముదుసలి తనమున రక్షణ ఏర్పడదు. నేటిని త్యాగము చేయనిచో తేపటి ప్రొద్దు ఉదయింపదు.

SUMMARY : Next crop cannot be grown if today's harvest is fully consumed. Clouds won't form and rain if humans are to store each and every drop of water. No one will be there to care for in the old age if folks do not take trouble in their youth to bear children and raise them. The next morning will not dawn unless the present is not sacrificed.

**వెల్మిరిక ॥** గెలువకొల్పరి సుమీ కూటము ; గెలువానులనఁగ బల్ బేటము ;
విననొల్ల దది బెడిస్తు వాతి ; నెగ్గి పలుకు మెంతేని నడితి. 58

**మాటల విడఁదీత (పద విభాగము) :** గెలువ-కొల్పరి, సుమీ, కూటము, గెలువానుల్ + అనఁగన్, బల్, బేటము, వినన్ + ఒల్లదు + అది, బెడిస్తు, వాతిన్, నెగ్గి, పలుకుము + ఎంత + ఏనిన్, నడితిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కూటము గెలువ-కొల్పరి సుమీ. గెలువానుల్ అనఁగన్ బల్ బేటము. అది బెడిస్తు వాతిన్ వినన్ ఒల్లదు. నెగ్గి ఎంత ఏనిన్ నడితిన్ పలుకుము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గెలువ-కొల్పరి = విజయారాధకురాలు ; సుమీ = చూడుమీ ; కూటము = సమాజము ; గెలువానుల్ = విజేతలు ; అనఁగన్ = అంటే ; బల్ బేటము = బహు అనురాగము ; వినన్ + ఒల్లదు = వినుటకు ఇష్టపడదు ; అది = ఆ సమాజము ; బెడిస్తు = విఫలుని యొక్క ; వాతిన్ = నోటిని/ నెత్తిన ; నెగ్గి = గెలిచి ; పలుకుము = మాటలాడుము ; ఎంత + ఏనిన్ నడితిన్ = ఎంత నీతి నైనను.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఈ సమాజము విజయారాధకురాలు సుమా ! దానికి విజేతలనఁగా మిక్కిలి అనురాగము. అది పరాజితుని మాటలను వినుటకు ఇష్టపడదు. అందుచేత నీవు ముందు జీవితములో గెలిచి ఆ పిదప ఎన్ని సూక్తులు, సుభాషితములైనను మాటాడుము.

SUMMARY : My frend ! This socety is a success-worshiper which loves winners a lot and which is loath to listening to the words of a loser. Therefore, be a winner first and then speak any number of precepts.

**అవిగింగ ॥** చాలుఁ బదియవ పాలు చాగుబడి కంకటికి ;
ఇంబు సాఁబాలు లెంబికిఁ బట్టించికోలు ;
మువ్వంతు మేవడియ ముద్దు దొరతనమునకు ;

కూట మొల్లదు తగ్గ నూటికి నూర్ పాళ్ళకు. 59

**మాటల విడఁదీత (పద విభాగము) :** చాలున్ + పదియవ, పాలు, చాగుబడిక + అంకటికిన్, ఇంబు, సాఁబాలు, లెంబికిన్ + పట్టించికోలు, మూఁడు + వంతు-మేవడి + అ, ముద్దు, దొరతనమునకున్, కూటము + ఒల్లదు, తగ్గన్, నూటికిన్, నూర్, పాళ్ళకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పదియవ పాలు చాగుబడిక అంకటికిన్ చాలున్. సాఁబాలు పట్టించికోలు లెంబికిన్ ఇంబు. మూఁడు వంతు-మేవడి + అ దొరతనమునకున్ ముద్దు. నూటికిన్ నూర్ పాళ్ళకున్ తగ్గన్ కూటము ఒల్లదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పదియవ పాలు = పదవ భాగము ; చాగుబడిక = సాష్టాంగము ; అంకటికిన్ = దేవునికి ; ఇంబు = ఇష్టము ; సాఁబాలు = సగము పాలు (అర్ధభాగము) ; లెంబికిన్ = కుటుంబమునకు ; పట్టించికోలు = శ్రద్ధ చూపుట/ సంరక్షణ ; మూఁడు + వంతు-మేవడి + అ = మూఁడు వంతుల విధేయతయే ; దొరతనమునకున్ = ప్రభుత్వమునకు ; కూటము = సమాజము ; ఒల్లదు = ఒప్పుకొనదు ; తగ్గన్ = తగ్గినచో ; నూటికిన్ నూర్ పాళ్ళకున్ = వందకు వంద శాతమున కన్న.

**లోవాఱిక (తాత్పర్యము) :** అందఱికి కలిపి నీవు పడు సాష్టాంగములలో పదవ వంతు సాష్టాంగములే తన ఎదుట పడినను అది దేవునికి చాలును. విషయముల పట్ల నీవు చూపు శ్రద్ధలో కేవలము సగమే తనయందు చూపినను అది కుటుంబమునకు చాలును. నీవు చూపు విధేయతలలో 3 వంతుల విధేయతనే తన యెడల చూపినచో అది ప్రభుత్వమునకు చాలును. కాని సమాజమనెడి స్వరూపమునకు మాత్రము — నూటికి నూఱు శాతము విధేయత చూపనిదే నీవు నచ్చవు.

**వైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** "సమాజమే అన్నిఁటి కన్నను, అందఱి కన్నను నిరంకుశ నియంత" అని కవిభావము.

SUMMARY : God is satisfied with just a tenth of the prostrations you make to all. Your family is satisfied with just a half of the care and concern you have towards everyone. Your government is saisfied if just three-fourths of your loyalities are dedicated to it. But society would not settle for anything less than 100% conformity on your part. (It is the worst despot of all).

**వెల్మిరిక జంట ॥** తద్దయు సొగసరులై తోఁచెదుఁ , దన్పేఁరిమి వరలు రెందెగలు ౨,
ఎంత పేద-బైజరులైనను ౨ ఎబ్రాసులైనను పారిపై ; 60
ఱోత పుట్టించెదరెంతగా, రోప్రోఁక వెనుక వేసికొన్న
వేల్పులట్టు లొసపరులైనను, దన్పేఁరిమి మాలిన గుంపులు. 61

**మాటల విడఁదీత (పద విభాగము) :** తద్దయున్, సొగసరుల్ + ఐ, తోఁచెదున్ + తన్ + పేఁరిమిన్, వరలు, రెంచ + తెగలు, ఎంత, పేద-బైజరుల్ + ఐనను, ఎబ్రాసుల్ + ఐనను, పారిపైన్, ఱోత + పుట్టించెదరు + ఎంతగాన్, రో-ప్రోఁకన్, వెనుక, వేసికొన్న, వేల్పుల + అట్టుల్ + ఒసపరుల్ + ఐనను, తన్ + పేఁరిమిన్, మాలిన, గుంపులు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పారిపైన్ తన్-పేఁరిమిన్ వరలు రెంచతెగలు ఎంత పేద-బైజరుల్ ఐనను ఎబ్రాసుల్ ఐనను తద్దయున్ సొగసరుల్ ఐ తోఁచెదున్. తన్-పేఁరిమిన్ మాలిన గుంపులు ఎంతగాన్ రో-ప్రోఁకన్ వెనుకన్ వేసికొన్న వేల్పుల అట్టుల్ ఒసపరుల్ ఐనను ఱోత పుట్టించెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తద్దయున్ = మిక్కిలి ; సొగసరుల్ + ఐ = సుందరులుగా ; తోఁచెదున్ = అనిపించెదరు ; తన్ + పేఁరిమిన్ = అత్మగౌరవముతో ; వరలు = ప్రకాశించునట్టి ; రెంచ + తెగలు = మానవ జాతులు ; పేద-బైజరుల్ = పేఁదలు మఱియు అజ్ఞానులు ; ఎబ్రాసుల్ = వికారులు ; పారిపైన్ = భూమిపై ; రో-ప్రోఁకన్ = ధనరాశిని ; వెనుకన్ వేసికొన్న = గడించి దాఁచిపెట్టుకొన్నను ; వేల్పుల +

ఆట్బుల్ = దేవతల వలెనె ; ఒసపరుల్ = స్ఫురద్రూపులు ; తన్ + పేఱిమిన్ మాలిన = ఆత్మగౌరవము లేని.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఆత్మగౌరవము గల మానవ జాతులు పేదలైనను, అజ్ఞానులైనను, చూడ వికారులైనను మిక్కిలి సుందరముగా అగుపించెదరు. ఆత్మగౌరవము లేనట్టి బానిస బుద్ధుల జాతులు పైకి ఎంత స్ఫురద్రూపులైనను, ఎంత డబ్బు వెనకేసికొన్నను పరమ అసహ్యమును పుట్టించెదరు.

SUMMARY : Self-respecting races look charming, though they are poor, ignorant and not so glamorous. But those of slavish mentality appear way ugly and loathsome, though they have accumulated lots of riches and are outwardly glamorous.

**గోరంటిక** ॥ చావుబ్రదుకుల చిక్కుగా రెంచలెంచు, సబ్బం డెడాటము లట్లు గా వయ్యవి ;
కాసంత యోర్పుఁ దలయొగ్గుడు వేచిక, కలిగినచో నవి జాడ లేకపోయెడు
వెలిమికార్తి మబ్బుతునుకల పోలికన్. 62

**మాటల విడఁదీత (పద విభాగము) :** చావు–బ్రదుకుల, చిక్కుగాన్, రెంచల్ + ఎంచు, సబ్బందు + ఎడాటముల్ + అట్లు, కావు + ఆ + అవి, కాసు + అంత + ఓర్పున్ + తల + ఒగ్గుడున్, వేచిక, కలిగినచోన్ + అవి, జాడ, లేక–పోయెడున్, వెలిమి–కార్తి–మబ్బు–తునుకల, పోలికన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చావు–బ్రదుకుల చిక్కుగాన్ రెంచల్ ఎంచు సబ్బందు ఎడాటముల్ ఆ + అవి అట్లు కావు. కాసు అంత ఓర్పున్ తల–ఒగ్గుడున్ వేచిక కలిగినచోన్ వెలిమి–కార్తి–మబ్బు–తునుకల పోలికన్ అవి జాడ లేక–పోయెడున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చావు–బ్రదుకుల చిక్కుగాన్ = జీవన మరణముల సమస్యగా ; రెంచల్ = మనుష్యులు; ఎంచు = భావించునవి ; సబ్బందు + ఎడాటముల్ = సకల విషయములును ; అట్లు కావు = జీవన మరణ సమస్యలు కావు ; వేచిక = ఎదురుచూపు (నిరీక్షణము) ; వెలిమి–కార్తి–మబ్బు–తునుకల పోలికన్ = శరదృతువులోని మేఘపుంజముల వలె.

**లోవాఱిక (తాత్పర్యము) :** "చావు-బ్రదుకుల సమస్య" అని మనుష్యులు భావించు విషయములన్నియు నిజముగా అటువంటివి కావు. వాటిలో ఒక పెద్దపాలు — కాసంత ఓర్పును, పరిస్థితులకు తాత్కాలికముగా తలవంచుట, ఎదురుచూచుట అను లక్షణములు ఉన్నచో, శరత్–కాలపు మేఘపుంజముల వలె తేలిపోయి జాడ లేకుండ మాయమగునట్టివే.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** కార్తి = ఋతువు.

SUMMARY : What folks assume to be the life-and-death questions, are actually not so. A huge part of them vanish without a trace, like the woolpack of clouds in the autumn, provi-ded that man has a modicum of patience, submits to the circumstances for the time being and bides his time.

**గోరంటిక** ॥ కాఱియారులెల్లఱుఁ గడు వెఱవానులు ; కాఱియారులనఁ గట్టకతాళీకులు ;
రాదు మాటలాట ; రాదిం కొకటి సేయుట ; కొల్లబుబ్బులు ; వారినే కొలిచెదరు పరి. 63

**మాటల విడఁదీత (పద విభాగము) :** కాఱియారుల్ + ఎల్లఱున్ + కడు, వెఱవానులు, కాఱియారుల్ + అనన్, కడు + అకతాళీకులు, రాదు, మాటలాట, రాదు + ఇంకన్ + ఒకటి + చేయుట, కొల్ల–బుబ్బులు, వారిన్ + ఏ, కొలిచెదరు, పరి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కాఱియారుల్ ఎల్లఱున్ కడు వెఱవానులు. కాఱియారుల్ అనన్ కడు అకతాళీకులు. మాటలాట రాదు.

ఇంకన్  ఒకటి చేయుట రాదు. కొల్ల–బుఱ్ఱలు. వారిన్ + ఏ పరి కొలిచెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కాఱియారుల్ = హింసాపరులు ; ఎల్లఱున్ = అందఱును ; కడు = మిక్కిలి ; వెఱవానులు = భయస్థులు ; అనన్ = అనఁగా ; కడు + అకతాళీకులు = మిక్కిలి అసమర్థులు ; మాటలాట = సంభాషణము ; కొల్ల–బుఱ్ఱలు = ఖాళీ బుఱ్ఱలు ; కొలిచెదరు = పూజించెదరు ; పరి = జనము.

**లోవాఱిక (తాత్పర్యము) :** హింసాపరులందఱును చాల పిఱికిపందలును, అసమర్థులును. వారు హింసాపరులు ఎందుకు అయినారు? అనఁగా – వారికి మాటలాడుట రాదు. వారి తలకాయలలో విషయమేమియు ఉండదు. అవి ఖాళీ బుఱ్ఱలు. కాని జనము వారినే పెద్దసేసి గౌరవించెదరు.

SUMMARY : All the violent ones are timid and incompetent people. Why did  they turn viol–ent? They did because there is nothing inside their skulls. They don't know how to converse. Nor do they know any other work to do. But folks adore them only.

**గేరంటిక** ॥ కంటు దారిదీయుఁ గహారములకు ; ఇలపోరు త్రోవసూపు అంకులకు ;
వాకట్టరము కతమగుఁ గాఱియకు ; ప్రెమ్మాటపు టణఁపము కలిగించున్,
బ్రెనుమార్పుల నలజందమునందున్. 64

**మాటల విడఁదీత (పద విభాగము) :** కంటు, దారి + తీయున్ + కహారములకున్, ఇల–పోరు, త్రోవ + చూపున్, అంకులకున్, వాకట్టరము, కతము + అగున్, కాఱియకున్, ప్రెమ్మాటపు + అణఁపము, కలిగించున్ + ప్రెను–మార్పులన్ + అలజందమునందున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కంటు–కహారములకున్ దారితీయున్. ఇల–పోరు అంకులకున్ త్రోవ చూపున్. వాకట్టరము కాఱియకున్ కతము అగున్. ప్రెమ్మాటపు అణఁపము అలజందమునందున్ ప్రెనుమార్పులన్ కలిగించున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కంటు = ద్వేషము ; కహారములకున్ = వికటాట్టహాసములకు ; ఇల–పోరు = ఇంటిలోని అశాంతి ; అంకులకున్ = జారత్వములకు ; వాకట్టరము = వాగ్బంధనము ; కతము = కారణము ; కాఱియకున్ = హింసకు ; ప్రెమ్మాటపు + అణఁపము = రాజకీయ అణఁచివేత ; అలజందమునందున్ = సంస్కృతిలో.

**లోవాఱిక (తాత్పర్యము) :** పగ – అవతలివారికి చేటు జరిగినప్పుడు వికటాట్టహాసములు చేయుటకు దారి దీయును. ఇంటిలోని అశాంతి బయట జారత్వము(అంకు) చేయుటకు కారణమగును. వాక్ స్వేచ్ఛను అణఁచివేయుట హింసకు హేతువగును. రాజకీయముగా అణఁచి వేయుట చేత ప్రజల సంస్కృతిలో పెద్దపెద్ద మార్పులు చోటు చేసికొనును.

SUMMARY : Vengefulness leads to bursts of guffaw when some evil happened to the other side. Domestic strife spurs adultery. Suppression of expression culminates in violence. Politi–cal oppression results in major changes in the popular culture.

**రాల్మిక బారు జంట** ॥ ఎందఱొక చిన్న యెడాట, మెఱఁగిన నది అంత పెద్దగిలున్ ;
కుందుకాన్ ౨ ఎడాటములఁ , గుఱించి యెంతగ మాటలాడిన 65
నంతగ నినుమడించు వగ, యొకచో నూఱట కలుగకపోఁగ. 66

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎందఱు + ఒక, చిన్న + ఎడాటమున్ + ఎఱిఁగినన్+ అది, అంత, పెద్దగిలున్, కుందుకాన్, ఎడాటములన్ కుఱించి + ఎంతగన్, మాటలాడిన,న్ అంతగన్ + ఇనుమడించున్, వగ, ఒకచోన్ + ఊఱట, కలుగక–పోఁగన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎందఱు ఒక చిన్న ఎడాటమున్ ఎఱిఁగినన్ అది అంత పెద్దగిలున్. ఒకచోన్ ఊఱట కలుగక-పోఁగన్ కుందుకాన్ ఎడాటములన్ కుఱించి ఎంతగన్ మాటలాడినన్ అంతగన్ వగ ఇనుమడించున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎడాటమున్ = విషయమును ; పెద్దగిలున్ = పెద్దదగును ; కుందుకాన్ = బాధాకరమైన ; ఇనుమడించున్ = రెట్టింపు ; వగ = విచారము ; ఒకచోన్ = ఒకానొక సందర్భములో ; ఊఱట = ఉపశమనము.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక చిన్న విషయమును గుఱించి ఎంతమందికి తెలిసిపోవునో అంతగా అది పెద్దదైపోవును. విచారకరమైన విష-యములను గూర్చి వేఱేవారితో వెడలఁబోసికొన్నచో ఊఱట కలుగునని జనము తలఁచెదరు. కాని కొన్ని సారులు అట్లు జరుగదు. ఎంతగా వెడలఁబోసికొందురో అంతగా బాధ పెరుగవచ్చును.

SUMMARY : The more numerous are the people who know a particular minor matter, the more seriousness it will assume. Folks think that they would be relieved if saddening things were shared with others. However it may not happen like that at all times. Sometimes, the more a saddening matter is shared, the more will be the pain.

**పొన్నిక జంట** ॥ వాఁడివాఁడి వేండ్రంపు వేఁడికిన్ గుంది, "వానా వాన వల్లప్ప!" అందురు మంది ;
తిట్టిన తిట్టు దిట్టక తిట్టెదరు ముసురు-, పట్టి నానాడుఁ దెగఁ గురిసినచో నీరు ; 68
అయినవారల మ్రో లలరించును డెందము, నప్పుడప్పుడు మటుకె అగుపించు చందము. 69

**మాటల విడఁదీత (పద విభాగము) :** వాఁడి-వాఁడి, వేండ్రంపు వేఁడికిన్ + కుంది, వానా, వాన, వల్లప్ప, అందురు, మంది, తిట్టిన, తిట్టున్ + తిట్టక, తిట్టెదరు, ముసురు –పట్టి, నాడున్ + నాడున్ + తెగన్ + కురిసినచోన్, నీరు, అయిన-వారల, మ్రోల్ + అలరించును, డెందమున్ + అప్పుడు + అప్పుడు, మటుకు + ఎ, అగుపించు, చందము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వాఁడి-వాఁడి వేండ్రంపు వేఁడికిన్ + కుంది మంది వానా వాన వల్లప్ప అందురు. ముసురు –పట్టి నాడున్ నాడున్ నీరు తెగన్ కురిసినచోన్ తిట్టిన తిట్టున్ తిట్టక తిట్టెదరు. అప్పుడు అప్పుడు మటుకు + ఎ అగుపించు అయిన-వారల మ్రోల్ చందము డెందమున్ అలరించును.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వాఁడి-వాఁడి = మిక్కిలి పొడుచునట్టి ; వేండ్రంపు = ప్రచండమైన ; కుంది = బాధపడి ; మంది = జనము ; ముసురు-పట్టి = మబ్బుల కప్పు వేసి ; నాడున్ + నాడున్ = ప్రతి దినమును ; తెగన్ + కురిసినచోన్ = విపరీతముగా ; అయిన-వారల మ్రోల్ = బంధుమిత్రుల సన్నిధానము ; అలరించును = సంతోషపెట్టును ; డెందమున్ = హృదయమును ; అప్పుడు + అప్పుడు = అరుదుగా ; మటుకు + ఎ = మాత్రమే ; అగుపించు = కనిపించు ; చందము = విధానము.

**లోవాఱిక (తాత్పర్యము) :** చర్మమును గ్రుచ్చునంత ప్రచండమైన వేసవి వేఁడిమి చేత పీడింపఁబడిన జనము వానచినుకులు మొదలు కాఁగానే "వానా వానా వల్లప్పా ! వాఁకిలి తిరుగు చెల్లప్పా" అని పాటలు పాడెదరు. కాని ఆ వానలే ముసురుపట్టి వరుసగా పలునాళ్ళ పాటు కురిసి-నచో ప్రతిసారియు కొంగ్రొత్త తిట్లతో వానకారును తిట్టెదరు. అట్లే బంధుమిత్రులు కూడ అప్పుడప్పుడు వచ్చిపోవుచున్ననే మనసునకు సంతోషము కలుగును. ఎల్లప్పుడు వచ్చుచున్నచో నిరసనభావము కలుగును.

SUMMARY : Folks play in zest and sing songs in praise of a drizzle, having been afflicted by the unbearable prickly heat of the summer. The same folks scold rainy season in a variety of ways if the sky gets overcast and the drizzle persists for many days. In the same way, the visits and presence of friends and relations make one happy only when they happen at long

intervals. They are resented if they visit us too often.

**గోరంటిక జంట ||** తలపోసి తలపోసి పలు నేర్చి నేర్చి, తీరుంటులయ్యేదరు చప్పయుఁ జవ్వయుఁ
గోఱలు గోల్పోయిన ముదివేహి తీరు ; ఏదియుఁ జదువక యేమియుఁ దలపోయక, 70
కఱదకుఁ దెటిపి నొసఁగి కాల్సేతులలోఁ , జురుకు మిగులు ద్రాబలు గెలిచెదరు వారి. 71

**మాటల విడఁదీత (పద విభాగము) :** తలపోసి, తలపోసి, పలు, నేర్చి, నేర్చి, తీరుంటుల్ + అయ్యెదరు, చప్ప + ఉన్ + చవ్వ + ఉన్ + కోఱలు + కోల్పోయిన, ముది-వేహి-తీరు, ఏది + ఉన్+ చదువక + ఏమి + ఉన్ + తలపోయక, కఱదకున్ + తెటిపిన్ + ఒసఁగి, కాల్ + చేతులలోన్ + చురుకు-మిగులు, ద్రాబలు, గెలిచెదరు, వారిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తలపోసి తలపోసి పలు నేర్చి నేర్చి తీరుంటుల్ కోఱలు కోల్పోయిన ముది-వేహి-తీరు చప్ప + ఉన్ చవ్వ + ఉన్ అయ్యెదరు. ఏది + ఉన్ చదువక ఏమి + ఉన్ తలపోయక కఱదకున్ తెటిపిన్ ఒసఁగి కాల్ -చేతులలోన్ చురుకు-మిగులు ద్రాబలు వారిన్ గెలిచెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తలపోసి తలపోసి = విపరీతముగా ఆలోచించి ; పలు నేర్చి నేర్చి = పెక్కు విద్యలు లోఁతుగా అభ్యసించి ; తీరుంటుల్ = నాగరికులు ; చప్ప + ఉన్ + చవ్వ + ఉన్ = నిరుత్సాహులును, నిస్తేజులును ; ముది-వేహి తీరు = ముదుసలి సింహము వలె ; కఱదకున్ = బుద్ధికి / మేధకు ; తెటిపిన్ + ఒసఁగి = విశ్రాంతి నిచ్చి ; చురుకు-మిగులు = బలము గలిగిన ; ద్రాబలు = అనాగరికులు.

**లోవాటిక (తాత్పర్యము) :** నాగరిక జాతులవారు విపరీతముగా చదువులు చదివి హేరాళముగా ఆలోచనలు చేసి కోఱలు లేని ముదుసలి సింహము వలె నిరుత్సాహులును, నిస్తేజులును అయ్యెదరు. అనాగరిక జాతులవారో, ఏమియు చదువకుండ, దేనిని గూర్చి ఆలోచింపకుండ మేధకు విశ్రాంతి నిచ్చి తమ కాలుసేతుల బలముతోనే నాగరికులను ఓడించెదరు.

SUMMARY : Civilized races study a lot, think a lot and finally become despirited and demoralised like an old lion who lost his teeth. Uncivilised races neither study nor think of anything, but put their intellect to rest and still win over the civilized ones with just the stamina of their hands and legs.

**అవిగింగ ||** గేలిదులు వాలిదులుఁ దిట్టిదులు మట్టిదులు
బీదటిదులుఁ జీదటిదులు బల్ కన్నడిదులు
నమరము తానె వ్రాసికొన్న సమాక్రంకులు ;
**చెరి బ్రదుకు విలువాటి ; చెరి సవింతయు నెడాటి.** 72

**మాటల విడఁదీత (పద విభాగము) :** గేలిదులున్, వాలిదులన్ + తిట్టిదులున్, మట్టిదులున్, బీదటిదలున్ + చీదటిదులున్, బల్ కన్నడిదులున్ + అమరము, తానె, వ్రాసికొన్న, సమా-క్రంకులు, చెరి, బ్రదుకున్, విలువాటి, చెరి, సవింత + ఉన్ + ఎడాటి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గేలిదులున్ = ఎగతాళి చేయఁబడినవారును ; వాలిదులన్ = పతితులును ; తిట్టిదులున్ = దూషింపఁబడ్డవారును ; మట్టిదులున్ = అణఁచివేయఁబడ్డవారును ; బీదటిదులున్ = దరిద్రింపఁబడినవారును ; చీదటిదులున్ = ఈసడించుకొనఁబడినవారును ; బల్ కన్నడిదులున్ = మిక్కిలి నిర్లక్ష్యము చేయఁబడిన వారును ; అమరము = వ్యవస్థ ; సమా-క్రంకులు = మరణ శాసనములు ; చెరి బ్రదుకున్ = ప్రతి జీవితమును ; విలువాటి = విలువైనది ; చెరి సవింత + ఉన్ = ప్రతి అనుభూతియు ; ఎడాటి = సందర్భ సహి

తము.

**లోవాటిక (తాత్పర్యము) :** ఎగతాళికిని, పతనమునకును, దూషణములకును, అణఁచివేతలకును, పేఁదఱికమునకును, ఏవగింపులకును, ఈసడింపులకును, నిర్లక్ష్యమునకును గుఱియైన ప్రజలు – వ్యవస్థ తనకు తానే వ్రాసికొన్న మరణ శాసనముల వంటివారు. ప్రతి జీవితము-ను విలువైనదే. ప్రతి అనుభూతియు ప్రాస్తావికమే.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఎవఱిని గానీ బాధపెట్టకుండ వ్యవస్థలను నడుపుకొనవలె నని భావము. ఇట్లు చేయనిచో ఆ వ్యవస్థలు కూలిపోవు దినము వచ్చును.

SUMMARY : The folks who are subjected to mockery, degradation, abuses, oppression, impoverishment, loathings, despisement and neglect – are like death warrants which an establishment issues on itself. **Every life matters. Every feeling counts.**

**రాల్మీక బారు జంట ॥** ఒరుకాఱియ కొరుదూఱున, కెన్నియొ సాకులు వెదకికొందురు ;
నడితి అని నడసూటి అని మునుహెచ్చఱమని గఱపాటమని ; 73
కసటున్నది లాతులలోఁ గాదు, దాని చూపఱలోనె ;
ఏనుఁగుటోల దిద్దకమ్ము ; కానసమ్మునకుఁ జెప్పు వమ్ము. 74

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒరు–కాఱియకున్ + ఒరు–దూఱునకున్ + ఎన్ని + ఒ సాకులు వెదకికొందురు నడితి అని నడసూటి అని మును–హెచ్చఱము + అని గఱపాటము + అని కసటు + ఉన్నది లాతులలోన్ + కాదు దాని చూపఱలోన్ + ఎ ఏనుఁగు + ఓల దిద్దకమ్ము కానసమ్మునకున్ + చెప్పన్ వమ్ము.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** నడితి అని నడసూటి అని మును–హెచ్చఱము అని గఱపాటము అని ఒరు–కాఱియకున్ ఒరు–దూఱున కున్ ఎన్ని + ఒ సాకులు వెదకికొందురు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒరు–కాఱియకున్ = పరహింసకు ; ఒరు–దూఱునకున్ = పరనిందకు ; ఎన్ని + ఒ = చాలా ; సాకులు = నెపములను ; నడితి = నీతి ; నడసూటి = నిజాయితీ ; మును–హెచ్చఱము = ముందు జాగ్రత్త ; గఱపాటము = శిక్షణము/ అభ్యాసము ; కసటు = కల్మషము ; లాతులలోన్ = ఇతరులలో ; చూపఱలోన్ + ఎ = చూచెడివారిలోనే ; ఏనుఁగు + ఓల = గజస్నానము ; దిద్దకమ్ము = సంస్కరణము ; కానసమ్మునకున్ = లోకమునకు ; చెప్పన్ = చెప్పఁగా (చెప్పుట) ; వమ్ము = దండుగ/ విఫల యత్నము.

**లోవాటిక (తాత్పర్యము) :** తాము పాల్పడు పరహింసకును, పరనిందకును జనము చాల కుంటిసాకులు వెదకుచుందురు. దానిని వారు నీతి –నిజాయితీలను కాఁపాడుట, ముందుజాగ్రత్త, శిక్షణ ఇచ్చుట అని పలుపేర్లతో వ్యవహరించెదరు. నిజమేమనఁగా మనము ఎవఱిని గానీ బాగుసేయ నక్కఱలేదు. తఱచుగా మలినము ఉండునది వేఱే మనుష్యులలో కాదు, వాటి కోసమై వెదకువారిలోనే. లోకమునకు ఏది చెప్పుటైనను దండుగయే. ఎందుకనఁగా అది మన మాటలు విని మరల తన ప్రాఁత పద్ధతులకే మరలును. ఇది ఏనుఁగు జలకము వంటిది.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఏనుఁగు జలకమాడినను మరల పోయి మట్టిలోనే పొర్లాడును.

SUMMARY : Folks keep searching for convenient excuses to justify their tormenting and censuring of others. They call it by various epithets such as keeping ethics and honesty, precaution and teaching the wrong-doers a lesson etc. The fact remains that we need not teach any one anything, for blots lie, not in other humans, but only in the eyes of the beholders. It is in vain to teach the world anything, because it will be back to its old ways even after liste-

ning to you. It is like the elephant's bath. (The animal casts mud on itself after the bath).

**గోరంటిక** ॥ మొల్లమున్నఁ జాలు పల్ లెప్పము లిట్టె, గుఱిగోటఁగలమని అది గడించినవా-
రటుమీఁద నేమియు గుఱిగోటఁజాలక చతికిలఁబడి మానుకొని మిన్నకుందురు. 75

**మాటల విడఁదీత (పద విభాగము) :** మొల్లము + ఉన్నన్ + చాలున్, పల్–లెప్పముల్ + ఇట్టె, గుఱిగోటన్ + కలము + అని, అది, గడించినవార్ + అటు–మీఁదన్ + ఏమి + ఉన్, గుఱిగోటన్ + చాలక, చతికిలన్ + పడి, మానుకొని, మిన్నక + ఉందురు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మొల్లము = ధనము ; ఉన్నన్ = ఉన్నచో ; పల్–లెప్పముల్ = పెక్కు లక్ష్యములను ; ఇట్టె = చులాకుగా / తేలికగా ; గుఱిగోటన్ + కలము = సాధింపఁగలము ; అది = ఆ ధనమును ; గడించినవార్ = సంపాదించిన వారు ; అటు–మీఁదన్ = ఆ తరువాత ; మిన్నక + ఉందురు = ఊరకుందురు.

**లోవాతిక (తాత్పర్యము) :** "డబ్బున్నచో చాలును, ఏదైన సాధింపఁగలము" అనుకొని అదే ప్రకారముగా సంపాదించిన వారు – తఱచుగా అటుపిమ్మట తాము అనుకొన్నవి ఏవియు చేయలేక నోరు మూసికొని ఊరకుందురు.

SUMMARY : Those who once assumed that they could do anything with the help of money – often end up doing nothing and keeping quiet, consequent to earning it in abundance.

**గోరంటిక జంట** ॥ సాదమడిగినఁ బెట్టు – తనివిఁ జెందెదరు ; నీరు వేఁడినఁ బోయి – నిఱము నిండెదరు ;
వలువలఁ గోర నిమ్ము – వలవ వందు రిఁక ; మొల్లమివ్వ మొదలిడుము – చాలదందురు ; 76
వలువ-నీరు-సాదము లొలవ నిక్కమ్ము ; మొల్లము రెంగల్పిదమగు లోదిమ్ము ;
వందముల కుండు నెల్ల, దిమ్మున కేది? 77

**మాటల విడఁదీత (పద విభాగము) :** సాదమున్ + అడిగినన్ + పెట్టు, తనివిన్ + చెందెదరు, నీరున్, వేఁడినన్ + పోయి, నిఱము, నిండెదరు, వలువలన్, కోరన్ + ఇమ్ము, వలవవు + అందురు + ఇఁకన్, మొల్లమున్ + ఇవ్వన్, మొదల్ + ఇడుము, చాలదు + అందురు, వలువ–నీరు–సాదముల్ + ఒలవ–నిక్కమ్ము, మొల్లము, రెంచ + కల్పిదము + అగు, లో–దిమ్ము, వందములకున్ + ఉందున్ + ఎల్ల, దిమ్మునకున్ + ఏది?

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సాదమున్ = అన్నమును ; అడిగినన్ = అడిగినచో ; పెట్టు = వడ్డింపుము ; తనివిన్ + చెందెదరు = తృప్తి పడెదరు ; నీరున్ వేఁడినన్ = నీరు కావలె నని ప్రార్థించినచో ; పోయి = పోయుము ; నిఱము నిండెదరు = పొట్ట నింపుకొనెదరు ; వలువలన్ కోరన్ = బట్టలు కావలె నని కోరఁగా ; వలవవు = అవి వద్దు ; మొల్లమున్ = ధనమును ; ఇవ్వన్ = ఇచ్చుటకు ; మొదల్ + ఇడుము = మొదలుపెట్టుము ; ఒలవ–నిక్కమ్ము = లౌకిక వాస్తవము ; రెంచ + కల్పిదము = మానవ సృష్టి ; అగు = అయిన ; లో–దిమ్ము = మనో భ్రాంతి ; వందములకున్ = వస్తువులకు ; ఎల్ల = సరిహద్దు.

**లోవాతిక (తాత్పర్యము) :** జనము నిన్ను అన్నమడిగినచో పెట్టుము. తృప్తిపడెదరు. నీరు కావలె నన్నచో పోయుము. కడుపు నింపుకొనెదరు. బట్టలు కావలె నని వేఁడుకొన్నచో ఇవ్వుము. "అబ్బా ! ఇఁక చాలు" నందురు. అదే, డబ్బిచ్చుట మొదలుపెట్టితివో, ఎంత ఇచ్చినను ఎప్పటి కప్పుడు, "అబ్బే ఇది చాలదు" అందురు. అన్నోదక వస్త్రాదులు ఇహలోక వాస్తవములు. అవి నిక్కముగా ఉన్నటువంటివి. వాటి కొఱకైన అవసరము కూడ నిజమైనదే. అందుచేత ఆ వస్తువుల కొక పరిమితి కలదు. కాని డబ్బు? మానవ సృష్టి. అది ఊహాజనితము. కనుక ఊహ లకు ఏ విధముగా నైతే అంతు లేదో డబ్బును గూర్చిన ఆశకు కూడ అంతు లేదు.

SUMMARY : Serve food to people, if they asked you for that. They will be contented. Give them water for the asking. Their bellies will be filled with it. Donate clothes to them. They will say that they did not need them anymore. But start giving them money. They will want it more and more, saying at every turn that it would not at all suffice. Food and water etc are the real needs of this mundane world, while money is a man-made object of imaginary value. Real objects have a limit. But how can imaginary things have it? Therefore even the want for money gets infinite.

**అవిగింగ** ॥ మొల్లము మెలపము నిడు జల్లులు కురిసినపుడు,
పంట వచ్చినప్పు డొంట బాగున్నప్పుడు,
తనవా రున్నప్పుడు తప్పు పైఁబడనప్పుడు
నాడు వరలునప్పుడు సూడులు లేనప్పుడు. 78

**మాటల విడఁదీత (పద విభాగము) :** మొల్లము, మెలపమున్ + ఇడున్, చల్లులు, కురిసిన + అపుడు, పంట, వచ్చిన + అప్పుడు + ఒంటన్ బాగు + ఉన్న + అప్పుడు, తన-వార్ + ఉన్న + అప్పుడు, తప్పు, పైన్ + పడని + అప్పుడు, నాడు, వరలు + అప్పుడు, సూడులు, లేని + అప్పుడు.

**చఱమొలి (అన్వయ క్రమము) :** చల్లులు కురిసిన అపుడు పంట వచ్చిన అప్పుడు ఒంటన్ బాగు ఉన్న అప్పుడు తన-వార్ ఉన్న అప్పుడు తప్పు పైన్ పడని అప్పుడు నాడు వరలు అప్పుడు సూడులు లేని అప్పుడు మొల్లము మెలపమున్ ఇడున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మొల్లము = ధనము ; మెలపమున్ = సుఖమును ; ఇడున్ = ఇచ్చును ; చల్లులు = వానలు ; ఒంటన్ = శరీరము ; తప్పు = నేఱము ; పైన్ + పడని + అప్పుడు = మీఁద పడనప్పుడు ; నాడు = దేశము ; వరలు = అలరారుచున్నప్పుడు ; సూడులు = శత్రువులు.

**లోవాటిక (తాత్పర్యము) :** ధనము సుఖము నిచ్చునని అందఱును తలఁచెదరు. కాని అట్లు జరుగవలె నన్నచో పలు ఇతరేతర పరిస్థితులు కూడ తోడ్పడవలెను. వానలు చక్కగా కురిసి కఱవు లేనప్పుడును, పంట చేతికి వచ్చినప్పుడును, తన శరీరములో పెద్దపెద్ద రోగములేమియు లేక బాగున్నప్పుడును, తనవారు తనతోనే ఉన్నప్పుడును, తన మీఁద ఏ నేఱమును మోపఁబడనప్పుడును, దేశము కల్లోలములు లేకుండ ప్రశాంతముగా ఉన్నప్పుడును, తనకు శత్రువులెవఱును లేనప్పుడును మాత్రమే తన ధనము తనకు సుఖము నిచ్చును.

SUMMARY : Folks think that the very possession of money automatically ensures comfort. However, there are many pre-conditions, should that happen. One's money ensures one's comfort (1) only when there are timely rains (2) when the harvest comes handy (3) when one is hale and healthy without any major disease (4) when one is in the company of one's own people (5) when one is free of all criminal charges (6) when the country is peaceful without any turmoil and (7) when one has no enemies to fight.

**పస్పియ** ॥ క్రేణి యెంత హెత్తరమో రెంచది, నెరసుల పంటక మంతటి తీండ్రము ;
ఆయిమాడ్కి అగునే జాటిపడుట, గోడ-కొమ్మ-కొండకొమ్ముల నుండి? 79

**మాటల విడఁదీత (పద విభాగము) :** క్రేణి + ఎంత, హెత్తరము + ఓ, రెంచది, నెరసుల, పంటకము + అంతటి, తీండ్రము, ఆయిమాడ్కి

అగునే, జాతీ-పడుట, గోడ-కొమ్మ-కొండ-కొమ్ముల, నుండి?

**చఱమోలి (అన్వయ క్రమము) :** క్రేణి రెంచది ఎంత హెత్తరము + ఓ నెరసుల పంటకము అంతటి తీం(దము. గోడ-కొమ్మ-కొండ-కొమ్ముల నుండి జాతీ-పడుట ఆయిమాడ్కి అగునే?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** క్రేణి = పదవి/ పదము ; హెత్తరము+ ఓ = ఉన్నతమో ; రెంచది = మనిషిది/ మనిషి యొక్క ; నెరసుల పంటకము = దోషముల ఫలితము ; తీం(దము = తీవ్రము ; ఆయిమాడ్కి = సదృశము/ ఒకే విధము ; అగునే = అగునా ; కొండ-కొమ్ము = పర్వత శిఖరము.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనిషి ఎంత ఉన్నత పదవిలో ఉండునో ఆతఁడు చేయు తప్పుల దుష్ఫలితము అంత తీవ్రముగా ఉండును. చిన్న పదవిలో ఉన్నవాని తప్పులకు తక్కువ దుష్ఫలితమే ఉండును. గోడమీఁది నుండి జాఱిపడుట, చెట్టుకొమ్మ నుండి పడుట, పర్వత శిఖరము నుండి పడుట — ఇవి అన్నియు ఒక్కలాఁటివి కావు గదా !

SUMMARY : The more highly placed one is, the more intense will be the outcome of one's faults. That of the faults committed by a low-placed one will be less. Falling off a wall, falling off a tree branch and that from a hilltop are never the same, are they?

**అవిగింగ** ॥ త్రస్తరిదమౌఁ గ్రొయ్యావపాఱిక తొలుతన్ ;
తలపడెదరు పల్వుఱు దాని మీఁదఁ బిదపన్ ;
కొఱలెదఱు దానితోఁ గలసి బుంగమూతిన్ ;
గైకొందు రద్దానిఁ గొన నిండెందమునన్. 80

**మాటల విడఁదీత (పద విభాగము) :** త్రస్తరిదము + ఔన్, క్రొత్త + ఆవపాఱిక, తొలుతన్, తలపడెదరు, పల్వుఱు, దాని మీఁదన్ + పిదపన్, కొఱలెదఱు, దానితోన్ + కలసి బుంగ-మూతిన్ + కైకొందురు + ఆ + దానిన్ + కొనన్ + నిండు + డెందమునన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** క్రొత్త ఆవపాఱిక తొలుతన్ త్రస్తరిదము ఔన్. పల్వుఱు దాని మీఁదన్ తలపడెదరు. పిదపన్ దానితోన్ కలసి బుంగ-మూతిన్ కొఱలెదఱు. కొనన్ ఆ + దానిన్ నిండు-డెందమునన్ కైకొందురు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** త్రస్తరిదము = వెటకారము చేయఁబడినది ; ఔన్ = అగును ; క్రొత్త + ఆవపాఱిక = క్రొత్త ఆలోచన (idea) ; తొలుతన్ = మొదటిలో ; తలపడెదరు = ఎదుర్కొనెదరు ; పల్వుఱు = చాలమంది ; కొఱలెదఱు = కాఁపరము చేసెదరు ; కైకొందురు = స్వీకరించెదరు/ ఆమోదించెదరు ; కొనన్ = చివరిలో ; నిండు + డెందమునన్ = హృదయ పూర్వకముగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రతి క్రొత్త ఆలోచనయు మొదటిలో ఎగతాళికి గుఱి అగును. పెక్కం(డు దానిపై దాడి చేసెదరు. ఆ తరువాత కొంత కాలము పాటు అనిష్టముగానే దానిని భరించుచు దానితో సహవాసము చేసెదరు. చివరికి దానినే హృదయ పూర్వకముగా ఆమోదించి స్వీకరించెదరు.

SUMMARY : Each new idea will be a butt of ridicule in the begining. Later it will be attacked by many. Afterwards, folks will coexist with it albeit reluctantly with pursed lips. Finally they will heartily accept and own it.

**గంగేరిక** ॥ దిగిననే కాని లోఁతు తెలియదు ; తిన్నప్పుడు గాని చవి తెలియదు ;
నోలెఱుక నికాప తెలివి కాదు ; పెద్ద లలఁతులకుఁ దెల్లము కారు. 81

**మాటల విడఁదీత (పద విభాగము) :** దిగినన్ + ఏ, కాని, లోఁతు, తెలియదు, తిన్న + అప్పుడు, గాని, చవి, తెలియదు, నోల్ + ఎఱుక, నికాప, తెలివి, కాదు, పెద్దలు + అలఁతులకున్ + తెల్లము, కారు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చవి = రుచి ; నోల్ + ఎఱుక = పుస్తక జ్ఞానము ; నికాప = యథార్థమైన ; అలఁతులకున్ = అల్పులకు ; తెల్లము కారు = అర్థము కారు.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము)

SUMMARY : Depth cannot be fathomed until one plunges. Taste of something cannot be known until one eats it. Bookish knowledge is not genuine wisdom. Elders are hard to under–stand for the younger. (Here, the poet emphasizes the importance of personal experience).

**దాసానిక ॥** కా దోమటి-నీఱుల కోసమె రెంచ బ్రదుకునది,
పేరు కోసము, పరువు కోసము, పెరిమ కోసము-
న్నొకాతటి కొఱ కోస, మిది సెల్లుఁ ద్రేసులకున్ ;
ఏలులె వడార మోమటి-నీఱుల వయ్యువారు. 82

**మాటల విడఁదీత (పద విభాగము) :** కాదు + ఓమటి–నీఱుల కోసము + ఎ, రెంచ, బ్రదుకునది, పేరు కోసము, పరువు కోసము, పెరిమ కోసమున్ + ఒక + ఆతటి కొఱ కోసము + ఇది, చెల్లున్ + త్రేసులకున్, ఏలులు + ఎ, వడారము + ఓమటి–నీఱులన్, వయ్యు–వారు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** రెంచ బ్రదుకునది ఓమటి–నీఱుల కోసము + ఎ కాదు. పేరు కోసము పరువు కోసము పెరిమ కోసమున్ ఒక ఆతటి కొఱ కోసము. త్రేసులకున్ ఇది చెల్లున్. ఓమటి–నీఱులన్ వయ్యు–వారు వడారము ఏలులు + ఎ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఓమటి–నీఱుల కోసము + ఎ = అన్నోదకముల కోసమే ; రెంచ = మనిషి ; పెరిమ కోసమున్ = పెద్దఱికము కోసము ; ఆతటి కొఱ కోసము = పరమార్థము కోసము ; ఇది = ఈ మాట ; చెల్లున్ = అన్వయించును ; త్రేసులకున్ = మానవ జాతులకు ; ఏలులు + ఎ = జంతువులే ; వడారము = కేవలము ; వయ్యు–వారు = వాంఛించువారు.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనిషి బ్రదుకునది కేవలము తిండి–నీళ్ళ కోసము కాదు. పేరు కోసము, పరువు కోసము, పెద్దఱికము కోసము, ఒక పరమార్థము కోసము. ఈ మాట వ్యక్తులకే కాదు, మానవ జాతులకు సైతము వర్తించును. వట్టి తిండి–నీళ్ళనే వాంఛించువారు జంతువులతో సమానము.

SUMMARY : It is not for just food and water that man lives, but also for name, fame, respect and a lofty purpose. This applies not only to individuals but also human races. Those who crave only for food and water are stranded at the stage of animals.

**కలిగోటిక ॥** ఎల్లెడలకుఁ జేరకపోదు ౨ ఎడారిఁ బెరిగిన పేరీఁదు ;
ముదితల తలల మురిసిపోవు ముళ్ళ నెదిగిన పస్పెపూవు ;
తనకపు వేదారు పిఱుందఁ దానే పడు రెంచల మంద,
తా నెటువాఁడైనఁ గానీ తనుఁ జెప్పకుండినఁ బోనీ !! 83

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎల్ల + ఎడలకున్ + చేరక–పోదు, ఎడారిన్ + పెరిగిన, పేరీఁదు, ముదితల, తలలన్, మురిసి–పోవున్,

ముళ్ళన్ + ఎదిగిన, పస్సె-పూవు, తనకపుం, వేదారు పిఱుందన్, తాన్ + ఏ, పడున్, రెంచల, మంద, తాన్ + ఎటు-వాఁడు + ఐనన్ + కానీ, తనున్ + చెప్పక + ఉండినన్ + పోనీ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎడారిన్ పెరిగిన పేరీఁదు ఎల్ల ఎడలకున్ చేరక-పోదు. ముళ్ళన్ ఎదిగిన పస్సె-పూవు ముదితల తలలన్ మురిసి-పోవున్. తాన్ ఎటు-వాఁడు ఐనన్ కానీ తనున్ చెప్పక ఉండినన్ పోనీ, తనకపుం వేదారు పిఱుందన్ రెంచల మంద తాన్ + ఏ పడున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎల్ల + ఎడలకున్ = అన్ని చోటులకు ; ఎడారిన్ = ఎడారిలో ; పేరీఁదు = ఖర్జూరము ; ముదితల = సొగస రుల యొక్క ; తలలన్ = తలలపై ; ముళ్ళన్ = ముళ్ళ నడుమ ; పస్సె-పూవు = గులాబీ పువ్వు ; తనకపుం వేదారు పిఱుందన్ = సహజ మైన వ్యక్తి వెనుక ; రెంచల మంద = మనుష్య సమూహము ; ఎటు-వాఁడు + ఐనన్ + కానీ = ఏ చోటివాఁడైనను కానిమ్ము ; తనున్ = తనను గూర్చి ; చెప్పక + ఉండినన్ = చెప్పుకొనకపోయినచో ; పోనీ = (సుబోధము).

**లోవాటిక (తాత్పర్యము) :** తీయని ఖర్జూరము – ఎవఱును కాఁపరముండని ఎడారులలో ఒంటరిగా పెరిగినను, తన తీపి కారణముగా చివ-రికి అన్ని చోటులకు చేరుకొనును. ముళ్ళ నడుమ పెరిగిన గులాబీపువ్వు — తన రంగు, రూపము మఱియు సువాసనలు కారణముగా మృదువైన స్త్రీల తలల మీఁదికి చేరి అలరారును. అట్లే సహజమైన మంచి లక్షణములు గల వ్యక్తి — ఎక్కడివాఁడైనను, తనను గూర్చి తానే-మియు చెప్పుకొనక పోయినను జనము ఆతని వెంట పడెదరు.

SUMMARY : Dates make it to all places due to their exceptional sweetness though they grew in uninhabited deserts. Similarly, the rose makes it to the heads of women due to its pleasant hue, shape and aroma, even though it grew in the company of thorns. In the same way, Folks flock to the one of original merit and virtue, no matter wherever he hails from and whatever he tells of himself.

**దాసానిక ||** అరుఁగులెక్కి అందఱును గాఱియ మెండీడెదరు ;
మురియుచు దానినే యెద మూగగఁ గైసల్పెదరు ;
దాని యెసకట్టులే తమ పేర్మి-లిబ్బి-విలువలు ;
ఎవఱు తప్పింపఁగలరు రెంచాది కునారమున్? 84

**మాటల విడఁదీత (పద విభాగము) :** అరుఁగుల్ + ఎక్కి, అందఱును + కాఱియన్, మెండీడెదరు, మురియుచున్, దానిన్ + ఏ + ఎదన్, మూగగన్ + కైసల్పెదరు, దాని, ఎసకట్టుల్ + ఏ, తమ, పేర్మి-లిబ్బి-విలువలు, ఎవఱు, తప్పింపన్ + కలరు, రెంచాది-కునారమున్?

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....రెంచాది-కునారమున్ ఎవఱు తప్పింపన్ కలరు? (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అరుఁగుల్ + ఎక్కి = వేదికలెక్కి ; కాఱియన్ = హింసను ; మెండీడెదరు = విమర్శించెదరు ; మురియుచున్ = ఆనందపడుచు ; దానిన్ + ఏ = ఆ హింసనే ; ఎదన్ = తమ హృదయములో ; మూగగన్ = మౌనముగా ; కైసల్పెదరు = పూజించెదరు ; దాని = ఆ హింస యొక్క ; ఎసకట్టుల్ + ఏ = నిర్మితములే ; పేర్మి-లిబ్బి-విలువలు = గౌరవములును, సంపదలును, సామాజిక విలువలును ; రెంచాది-కునారమున్ = మానవాళి యొక్క విషాదమును.

**లోవాటిక (తాత్పర్యము) :** వేదికలెక్కినప్పుడు అందఱును "హింస చెడ్డది" అని బహిరంగముగా విమర్శించెదరు. కాని తమ మనస్సులలో మటుకు ఆ హింసనే (ఇతరులను హింసించఁగల సామర్థ్యమునే) మూగగా ఆరాధించెదరు. తమ గౌరవ ప్రతిష్ఠలును, సంపదలును, సామాజిక విలువలను, కొలమానములును — ఇతరులను హింసింపఁగల్గుట మీఁదను, ఆ రకముగా వారిని భయపెట్టుట మీఁదను ఆధార పడి ఉన్నవి. పరిస్థితులు ఇట్లు కొనసాఁగుచున్నప్పుడు మానవాళికి ఎదురగు విషాదములను ఎవఱు తప్పింపఁగలరు?

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** (౧) అందఱును రహస్యముగా హింసను ఆరాధించుట వలన – దాని మూలముగా కలుగు మానవాళి విషాదములలో అందఱి పాత్ర ఉన్నదని కవిభావము. (౨) ఇక్కడ హింసను ఆరాధించుట అనఁగా – తాము కూడ అట్లు ఇతరులను హింసింపఁగల/ భయపెట్టఁగల స్థాయికి ఏదియో ఒకనాడు చేరుకొనవలె నను ఆకాంక్షను కలిగి ఉండుటయే.

SUMMARY : While speaking on public fora, people condemn violence. But the same people secretly and silently adore violence (and the ability to unleash violence on others). Their honour, riches and values hinge on violence (and threatening others with it). With things remaining like this, who can avert the tragedies faced by the humanity?

**తెల్మిరిక ||** కడిఁది పోఁతరమ్మును దాప ; అరిది బ్రాకతనమును జుణుప ;
అకల్వి కొండను మూయన్ ; అకైతి పూవకరు నాఁపన్. 85

**మాటల విడఁదీత (పద విభాగము) :** కడిఁది, పోఁతరమ్మును, దాఁపన్, అరిది, బ్రాకతనమును, జుణుపన్, అకల్వి, కొండను, మూయన్, అక + ఐతి, పూవు + అకరున్ + ఆఁపన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పోఁతరమ్మును దాఁపన్ కడిఁది. బ్రాకతనమును జుణుపన్ అరిది. కొండను మూయన్ అకల్వి. పూవు + అకరున్ ఆఁపన్ అక + ఐతి.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కడిఁది = కష్టము ; పోఁతరమ్మును = బలమును ; దాఁపన్ = దాఁచుట/దాఁచుటకు ; అరిది = అపరూపము ; బ్రాకతనమును = దుర్బలతను ; జుణుపన్ = మఱుఁగుపుచ్చుట(కు) ; అకల్వి = అసాధ్యము ; అక + ఐతి = అసంభవము ' పూవు + అకరున్ = పూల పుప్పొడిని ; ఆఁపన్ = గాలిలో ఎగురకుండ ఆఁపుట(కు).

**లోవాఱిక (తాత్పర్యము) :** బలమును, బలహీనతలను దాఁచుట అసాధ్యము. కొండ ఎవఱికిని కనఁబడకుండ మూయుట, పూల పుప్పొడి గాలిలో ఎగురకుండ ఆఁపుట ఎంత అసంభవములో అదియు అంతే.

SUMMARY : It is as impossible to hide one's strengths and weaknesses as it is to cover up a mountain and keep pollen from flying.

**మొల్ల ||** అల్లరుదు పోరులన్ సొగయువారలు ; వెల్లడిగా నేడుచు నోడినవాఁడు ;
నల్గోడల నడుమను గెలిచినవాఁడు ; అలరునది వారల గుట్టుమార్తులే. 86

**మాటల విడఁదీత (పద విభాగము) :** అరుదు + అరుదు, పోరులన్, సొగయు–వారలు, వెల్లడిగాన్, ఏడుచున్, ఓడిన–వాఁడు, నల్–గోడల నడుమను, గెలిచిన–వాఁడు, అలరునది, వారల, గుట్టు–మార్తులే.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పోరులన్ సొగయు–వారలు అరుదు + అరుదు. ఓడిన–వాఁడు వెల్లడిగాన్ ఏడుచున్. గెలిచిన–వాఁడు నల్–గోడల నడుమను (ఏడుచున్). అలరునది వారల గుట్టు–మార్తులే.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అల్లరుదు (అరుదు + అరుదు) = మిక్కిలి అరుదు ; పోరులన్ = యుద్ధములలో ; సొగయు–వారలు = సుఖపడువారు ; వెల్లడిగాన్ = వ్యక్తమగునట్లుగా ; ఏడుచున్ = ఏడ్చును ; అలరునది = సంతోషపడునది ; గుట్టు–మార్తులే = రహస్య శత్రు–వులే.

**లోవాఱిక (తాత్పర్యము) :** యుద్ధాలు చేసి సుఖపడువారు లోకములో మిక్కిలి అరుదు. వాటిలో ఓడిపోయినవారు బాహాటముగా మొత్తుపెట్టి మఱీ ఏడ్చెదరు. గెలిచినవారేమో రహస్యముగా నాలుగు గోడల నడుమ తలుపులు బిడాయించుకొని నిశ్శబ్దముగా ఏడ్చెదరు. మఱి, ఒక

యుద్ధము ముగిసిన తరువాత ఎవఱు లబ్బిన సంతోషించెద రనఁగా — ఈ విజేతలకును, పరాజితులకును ఉన్న రహస్య శత్రువులే.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** రహస్య శత్రువులను కనిపెట్టుట అసాధ్యము. వారు నేస్తుల వలెనె మెలఁగుచు పైకి సానుభూతి నటించుచుందురు.

SUMMARY : Extremely rare are the people who live happily after fighting a war. The losers wail openly and the winners, silently after shutting themselves up in a chamber. Then who do rejoice? Only the hidden enemies of both the winners and losers.

**పొన్నిక జంట** ‖ ప్రెనుగల్మియె యూమతించుఁ బ్రెనులేమిన్ ; ఎలందారు మణియము వెన్దట్టు దానిన్ ;
ఒకట నెడారి, మఱొకటఁ బచ్చదనపు పారి ; ఒకటి దక్కోలు వేఱొక్కటి మాల్కోలు ; 87
ఱోసెదరు తమ యామతిఁ దామే పెద్దలు ; తనకము గదా తన నీఁగుఁ దానె ఱోయఁగ. 88

**మాటల విడఁదీత (పద విభాగము) :** ప్రెను–గల్మి + ఎ + ఆమతించున్ + ప్రెను–లేమిన్, ఎలందారు, మణియము, వెన్ + తట్టున్, దానిన్ + ఒకటన్ + ఎడారి, మఱి + ఒకటన్, పచ్చదనపుం, పారి, ఒకటి, దక్కోలు, వేఱు + ఒక్కటి, మాల్కోలు, ఱోసెదరు, తమ + ఆమతిన్ + తామే, పెద్దలు, తనకము, కదా, తన, నీఁగున్ + తాన్ + ఎ, ఱోయఁగన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ప్రెను–గల్మి + ఎ + ప్రెను–లేమిన్ ఆమతించున్. దానిన్ ఎలందారు మణియము వెన్ –తట్టున్. ఒకటన్ ఎడారి. మఱి + ఒకటన్ పచ్చదనపుం పారి. ఒకటి దక్కోలు వేఱొక్కటి మాల్కోలు. పెద్దలు తమ ఆమతిన్ తామే ఱోసెదరు. తన నీఁగున్ తాన్ + ఎ ఱోయఁగన్ తనకము కదా.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ప్రెను–గల్మి + ఎ = గొప్ప సంపదయే ; ఆమతించున్ = సృష్టించును ; ప్రెను–లేమిన్ = గొప్ప పేఁద ఱికమును ; ఎలందారు మణియము = నిరంకుశ అధికారము ; వెన్ + తట్టున్ = ప్రోత్సహించును ; దానిన్ = ఆ కలిమిని మఱియు ఆ లేమిని ; ఒకటన్ = ఒక చోట ; పారి = భూమి ; దక్కోలు = లాభము ; మాల్కోలు = త్యాగము ; ఱోసెదరు = ఏవగించుకొనెదరు ; ఆమతిన్ = సృష్టిని ; పెద్దలు = దొరలు ; తనకము = సహజము ; నీఁగున్ = విసర్జితమును ; ఱోయఁగన్ = అసహ్యించుకొనుట.

**లోవాఱిక (తాత్పర్యము) :** గొప్ప పేఁదఱికము ఉండుటకు కారణము కొందఱి వద్ద గొప్ప సంపద ప్రోఁగుపడుటయే. ఆ కలిమి–లేముల తార తమ్యమును ప్రోత్సహించునది నిరంకుశాధికారమే. ఒక చోట ఎడారి లేకుండ మఱియొక చోట పచ్చదనమేర్పడదు.ఒకఱి లాభము వేఱొ–క్కఱి త్యాగ ఫలము. డబ్బున్న దొరలు — స్వయముగా తమ సృష్టియే అయిన కటిక పేదఱికమును తామే అసహ్యించుకొందురు. మనిషి తాను విసర్జించిన మలమును తానే అసహ్యించుకొనుట సహజమే కదా !

SUMMARY : Great prosperity accounts for great poverty both of which are promoted by des–potic powers. An arid zone at one place is responsible for the formation of a green belt else–where. One's loss is another's gain. It is only natural that rich lords abhor poverty which is their own express creation, for humans are known to loathe their own extreta.

**గోరంటిక** ‖ ఐకలి నిప్పచ్చమునకు గావగుఁ దా- నాఱుగార్తులు సెమటోడ్చి సాఁకిన చేన్ ;
పల్కరాని పాటులువడి గడియించిన, పేరుఁ దుడిచివేయు నొకే యొక పెడదూర్. 89

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఐకలి–నిప్పచ్చమునకున్, గావు + అగున్ + తాన్ + ఆఱు + కార్తులు + చెమట + ఓడ్చి, సాఁకిన, చేన్, పల్కన్ + రాని, పాటులు + పడి, గడియించిన, పేరున్ + తుడిచి–వేయున్ + ఒకే + ఒక, పెడదూర్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** తాన్ ఆఱు –కార్తులు చెమట ఓడ్చి సాఁకిన చేన్ ఐకలి–నిప్పచ్చమునకున్ గావు అగున్. పల్కన్ రాని

పాటులు పడి గడియించిన పేరున్ ఒకే ఒక పెదదూర్ తుడిచి-వేయున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఐకలి-నిప్పచ్చమునకున్ = ప్రకృతి బీభత్సమునకు ; గావు + అగున్ = బలి అగును ; కార్తులు = ఋతువుల పాటు ; సాఁకిన = పెంచిన ; చేన్ = చేను (పంటమొక్కలు) ; పల్కన్ + రాని = చెప్పఁగూడని / చెప్పలేనన్ని ; పాటులు + పడి = శ్రమలు పడి ; గడియించిన = సంపాదించిన ; పేరున్ = మంచి పేరును / కీర్తిని ; పెదదూర్ = అపనింద / అభాండము.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక రైతు ఆరుఁగాలము కష్టించి పెంచిన చేను ఒకే ఒక ప్రకృతి వైపరీత్యము సంఘటిల్లినప్పుడు నేలఁగూలును. అట్లే పెక్కు తిప్పలకోర్చి సంపాదించిన మంచిపేరు మొత్తము — ఒకే ఒక అపనింద మూలముగా తుడిచిపెట్టుకొని పోవును.

SUMMARY : A standing crop grown painstakingly for six seasons may fall victim to the Nature's vandalism. Similarly, a single calumny wipes out all the good name earned by tak–ing innumerable troubles.

**పస్పియ** ॥ నిక్కానువైనదాని కుండెదరు, కుప్పలుఁ దెప్పలుగ దన్నుకానులు ;
పలు బిమ్మిటులఁ గొల్పు మ్రోలీటులు ; చేసి చూపు పెల్లాడక మాటలు. 90

**మాటల విడఁదీత (పద విభాగము) :** నిక్కపుం + కానువు + ఐన-దానికిన్ + ఉండెదరు, కుప్పలున్ + తెప్పలుగన్, దన్నుకానులు, పలు బిమ్మిటులన్ + కొల్పున్, మ్రోలీటులు, చేసి, చూపు, పెల్లు + ఆడక, మాటలు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నిక్కపుం కానువు ఐన-దానికిన్ కుప్పలున్ తెప్పలుగన్ దన్నుకానులు ఉండెదరు. మ్రోలీటులు పలు బిమ్మిటులన్ కొల్పున్. మాటలు పెల్లు ఆడక చేసి చూపు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నిక్కానువు (నిక్కపుం + కానువు) = యథార్థము ; దన్నుకానులు = సమర్థకులు ; పలు బిమ్మిటులన్ + కొల్పున్ = అనేక అనుమానములను కలిగించును ; మ్రోలీటులు = ప్రతిపాదనలు ; పెల్లు = బహుళము / బాహుళ్యము ; ఆడక = పలుక కుండ.

**లోవాఱిక (తాత్పర్యము) :** కళ్ళ ఎదుట కనిపించు యథార్థమునకు సమర్థకులు సమాజములో తామరతంపరగా ఉండెదరు. (ఎందుకనఁగా అంతకు మించి వారికి ఊహ పాఱదు). కాని ఒక క్రొత్త విషయమును గుఱించిన ప్రతిపాదనము చేసినచో అది అందఱిలోను బారాది అను మానములను కలిగించును. కనుక ఎవఱి ఎదుటను ఏ ప్రతిపాదనమును గానీ పెట్టకుము. నీవనుకొన్నది చేసి చూపుము. అప్పుడు ప్రతి–పాదనములును, చర్చలును, ఒప్పింపులును ఏవియు లేకుండనే జనము దానిని ఆమోదించెదరు.

**వైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** నిక్కానువు = నిక్కపుం + కానువు = నిజమైన రూపము (యథార్థము). ఇది నిక్కల (నిక్కమైన కల) వంటి నిర్మాణము.

SUMMARY : A plainly visible fact boasts of plenty of supporters at all times. But you find none for a proposal which visualises a novel thing. Moreover, it gives rise to multiple doubts. Therefore, do not propose anything in front of anyone. Just accomplish and demostrate to them what you want to. Then folks will accept it without calling for any debate and persua–ssion.

**పస్పియ** ॥ కాంచువు సెప్పిన వల్లరమున్ వ- ల్లించని నేరువొయ్యనఁ బొకాలున్ ;
నెలకొల్పరుల మేల్బారుల వలనన్, గెళవుగ జరిగిన మైతులు కూలున్. 91

**మాటల విడఁదీత (పద విభాగము) :** కాంచువు + చెప్పిన, వల్లరమున్, వల్లించని, నేరువు + ఒయ్యనన్, పొకాలున్, నెలకొల్పరుల, మేల్పారుల వలనన్ + కెళవుగన్, జరిగిన, మైతులు, కూలున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కాంచువు = గురువు ; వల్లరమున్ = మంత్రమును ; వల్లించని = జపించని ; నేరువు = శిష్యుఁడు ; ఒయ్యనన్ = మెల్లగా / నెమ్మదిగా ; పొకాలున్ = నశించును ; నెలకొల్పరుల = వ్యవస్థాపకుల యొక్క ; మేల్పారుల వలనన్ = ఆదర్శముల నుండి ; కెళవుగన్ = దూరముగా ; మైతులు = సంస్థలు.

**లోవాటిక (తాత్పర్యము) :** గురువుగారు ఉపదేశించిన మంత్రమును జపించని శిష్యుఁడు మెల్లగా నశించును. తమ వ్యవస్థాపకుల యొక్క ఆదర్శముల నుండి దూరముగా జరిగిన సంస్థలు కూలిపోవును.

SUMMARY : A disciple who does not chant the *mantra* taught by his master will perish. Similarly, the institutions which strayed from the ideals of their founders will collapse.

**అవిగింగ** ॥ ఏఁటి సేయరు మంది కూటపుఁ బెరిమఁ గోరి?
మండ్రమాడఁగలరు తలక్రిందులై నూత ;
ముదుసలులకు ముద్దిచ్చి మూతిఁ దుడువఁగలరు ;
గొఱిగించుకొని బోడిగా హఱవలయ్యెదరు. 92

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏఁటి + చేయరు, మంది, కూటపుం + పెరిమన్ + కోరి, మండ్రము + ఆడన్ + కలరు, తల-క్రిందుల్ + ఐ నూతన్, ముదుసలులకున్, ముద్దు + ఇచ్చి, మూతిన్ + తుడువన్ + కలరు, గొఱిగించుకొని, బోడిగాన్, హఱవల్ + అయ్యెదరు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మంది కూటపుం పెరిమన్ కోరి ఏఁటి చేయరు ? నూతన్ తల-క్రిందుల్ ఐ మండ్రము ఆడన్ కలరు. ముదుసలులకున్ ముద్దు ఇచ్చి మూతిన్ తుడువన్ కలరు. బోడిగాన్ గొఱిగించుకొని హఱవల్ అయ్యెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఏఁటి = ఏమిటి ; మంది = జనము ; కూటపుం + పెరిమన్ = సమాజ గౌరవమును ; మండ్రము + ఆడన్ + కలరు = తపస్సు చేయఁగలరు ; నూతన్ = నూతిలో ; హఱవల్ = సన్యాసులు.

**లోవాటిక (తాత్పర్యము) :** జనము సమాజ గౌరవమును కోరి ఏదైన చేయుటకు సిద్ధపడెదరు. నూతిలో తలక్రిందులుగా వ్రేలాడుచు తపస్సు కూడ చేసెదరు. ముదుసలివారికి ముద్దులు పెట్టి ఆ తరువాత ప్రక్కకు పోయి మూతి తుడుచుకొందురు. తలలను బోడి చేయించుకొని సన్యాసులు కూడ అయ్యెదరు.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** జనము కనురోకలో సమాజమే దేవుఁడని భావము.

SUMMARY : What do folks not resort to in their pursuit of societal respect? They do penan-ces in a well hanging upside down. They kiss the old and later wipe their lips clean. They become clean-shaven and embrace monkhood.

**గంగేరిక జంట** ॥ వేల్పుల పాటి, గుఱిగోటుదమని, తలపెట్టకయె గుఱిగోటువారు ;
రెంచల మట్టు గుఱిగోట నెంచి, రేకంబుగా గుఱిగోటువారు ; 93
రంపెలానుల సాటి, లాతులఁ బడ నేయఁబూనుక గుఱిగోటువారు. 94

**మాటల విడఁదీత (పద విభాగము) :** వేల్పుల, పాటి, గుఱిగోటుదము + అని, తలపెట్టక + ఎ, గుఱిగోటు–వారు, రెంచ, మట్టు, గుఱిగోటన్ + ఎంచి, రేకంబుగాన్, గుఱిగోటు–వారు, రంపెలానుల, సాటి, లాతులన్, పడన్ + ఏయన్ + పూనుక, గుఱిగోటు–వారు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** గుఱిగోటుదము అని తలపెట్టక + ఎ గుఱిగోటు–వారు వేల్పుల పాటి. గుఱిగోటన్ ఎంచి రేకంబుగాన్ గుఱిగోటు–వారు రెంచల మట్టు. లాతులన్ పడన్ ఏయన్ పూనుక గుఱిగోటు–వారు రంపెలానుల సాటి.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వేల్పుల పాటి = దేవతాసమానులు ; గుఱిగోటుదము = సాధించుదము ; తలపెట్టక + ఎ= అనుకొన కుండ నే/ సంకల్పించకుండనే ; గుఱిగోటు–వారు = సాధించువారు ; రెంచల మట్టు = మనుష్యుల స్థాయి ; గుఱిగోటన్ + ఎంచి = సాధించ వలె నని తలఁచి ; రేకంబుగాన్ = గంభీరముగా ; రంపెలానుల సాటి = రాక్షస ప్రాయులు ; లాతులన్ = ఇతరులను ; పడన్ + ఏయన్ + పూనుక = పడఁగొట్టుటకు పూనుకొని.

**లోవాఱిక (తాత్పర్యము) :** “ఒకటి సాధించవలె” నని అనుకొనకుండనే సాధించువారు దేవతాసమానులు. “ఒకటి సాధించవలె” నని సంక ల్పించి కష్టపడి సాధించువారు మానవ సహజులు. ఆ సాధించుట కోసము వేఱేవారిని పడఁగొట్టెడివారు రాక్షస ప్రాయులు.

SUMMARY : Those who achieve something without planning it are equal to angels. Those who seriously achieve something after carefully planning it are just human. But those who pull others down for the sake of their achievements are pure demons.

**అవిగింగ ||** కోవ్రేటు మఱీగొప్ప తల్లిదండ్రులుంట ;
కోవ్రేటు మఱీక్రించు తల్లిదండ్రులుంట ;
కోవ్రేటు పెక్కండ్రు తల్లిదండ్రులుంటయు ;
ఇనుకోదక్కులె యివి కాంచరుల లేమిపై. 95

**మాటల విడఁదీత (పద విభాగము) :** కోవ్రేటు, మఱీ–గొప్ప, తల్లి + తండ్రులు + ఉంట, కోవ్రేటు, మఱీ, క్రించు, తల్లిదండ్రులు + ఉంట కోవ్రేటు, పెక్కండ్రు తల్లి + తండ్రులు + ఉంట + ఉన్, ఇనుకోదక్కులు + ఎ + ఇవి, కాంచరుల, లేమిపైన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మఱీ–గొప్ప తల్లి –తండ్రులు ఉంట కోవ్రేటు. మఱీ–క్రించు తల్లిదండ్రులు ఉంట కోవ్రేటు. పెక్కండ్రు తల్లి–తండ్రులు ఉంట + ఉన్. ఇవి కాంచరుల లేమిపైన్ కోవ్రేటు ఇనుకోదక్కులు + ఎ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కోవ్రేటు = దురదృష్టము ; ఉంట = ఉండుట ; మఱీ–క్రించు = అతిహీనమైన ; పెక్కండ్రు = చాలమంది ; ఇనుకోదక్కులు + ఎ = మిక్కిలి అదృష్టములే ; ఇవి = ఈ మూఁడు పరిస్థితులును ; కాంచరుల లేమిపైన్ = తల్లిదండ్రులు లేకపోవుట కన్న.

**లోవాఱిక (తాత్పర్యము) :** మఱీ గొప్పవారైన తల్లిదండ్రులు ఉండుట వారి పిల్లల దురదృష్టము. మఱీ హీనులైన తల్లిదండ్రులు ఉండుట కూడ దురదృష్టమే. ఎక్కువ మంది తండ్రులును, ఎక్కువ మంది తల్లులును ఉండుట కూడ దురదృష్టమే. అయితే తల్లిదండ్రులు అసలే లేకపోవుట కన్న ఈ మూఁడును గొప్ప అదృష్టములే.

SUMMARY : Having too great parents is bad luck. Having too lowly parents is bad luck too. Having too many parents is bad luck too. But all the three situations are far more a good fortune than having none at all.

**వెల్మిరిక ||** వరకము నొపొందెద రిచ్చుటఁ , గఱకుఁగందనులు కావళించి ;
వరకము నొపొందెదరు నొరు, లే తప్పును జేయక ముందే. 96

**మాటల విడఁదీత (పద విభాగము) :** వరకమున్ + ఔపొందెదర్ + ఇచ్చటన్, కఱకు + కందనులు, కావళించి, వరకమున్ + ఔపొందెదరు, నౌరుల్ + ఏ, తప్పును + చేయక, ముందే.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఇచ్చటన్ కఱకు-కందనులు కావళించి వరకమున్ ఔపొందెదర్. నౌరుల్ + ఏ తప్పును చేయక ముందే వరకమున్ ఔపొందెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వరకమున్ = నరకమును ; ఔపొందెదర్ = అనుభవించెదరు ; ఇచ్చటన్ + ఈ లోకములో ; కఱకు + కందనులు = కఠిన హృదయులు ; కావళించి = పాపము చేసి ; నౌరుల్ = మృదు స్వభావులు.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఈ లోకములో కఠిన హృదయులు తప్పు చేసిన తరువాతనే శిక్షను అనుభవించెదరు. మృదుస్వభావులు మట్టుకు ఏ తప్పును చేయక ముందే నరకము ననుభవించెదరు.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** మృదుస్వభావులు నరకమును అనుభవించునట్లుగా చేయఁబడెదరు. "వారిని బాధించుట మిక్కిలి తేలిక" అని భావము.

SUMMARY : The stony-hearted ones in this world undergo punishment only after committing a wrong. However, the soft-hearted ones undergo the same even before they attempted any such thing.

*(They are made to undergo punishment, as it is easy to pain them).*

**అవిగింగ ||** తన కూడు దా వెదకి వేఁటాడి తినవలయు,
నెల్ల కానల కొకే యేలికైనను వేహి ;
తప్పదా మూఁడింటిని దామె చేసికొనక,
అడయరులఁ బ్రోదించు నచ్చుకుప్పలకైన. 97

**మాటల విడఁదీత (పద విభాగము) :** తన, కూడున్ + తాన్, వెదకి, వేఁట + ఆడి, తినన్ + వలయున్ + ఎల్ల, కానలకున్ + ఒకే + ఏలిక + ఐనను, వేహి, తప్పదు + ఆ, మూఁడింటిని + తాము + ఎ, చేసికొనక, అడయరులన్ + ప్రోదించు, అచ్చుకుప్పలకున్ + ఐనన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వేహి ఎల్ల కానలకున్ ఒకే ఏలిక ఐనను తన కూడున్ తాన్ వెదకి వేఁట ఆడి తినన్ వలయున్. అడయరులన్ ప్రోదించు అచ్చుకుప్పలకున్ ఐనన్ ఆ మూఁడింటిని తాము + ఎ చేసికొనక తప్పదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎల్ల కానలకున్ = అడవి అంతటికిని ; ఏలిక = పరిపాలకుఁడు ; వేహి = సింహము ; అడయరులన్ = సేవకులను ; ప్రోదించు = పోషించు ; అచ్చుకుప్పలకున్ + ఐనన్ = ధనవంతులకైనను.

**లోవాఱిక (తాత్పర్యము) :** సింహము అడవి మొత్తమునకు ఏలిక అయినను, అది తన తిండిని తానే స్వయముగా వెదకి వేఁటాడుకొని తినక తప్పదు. అట్లే ఎంతటి ధనికులైనను ఆ మూఁడు పనులు తామే వ్యక్తిగతముగా చేసికొనక తప్పదు.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఆ మూఁడింటిని = తిండి తినుట, గుప్తాంగములను శుభ్రము చేసికొనుట, సంభోగించుట. వీటిని తమకు మారుగా ఇతరులు చేసిపెట్టుట సాధ్యము కాదు.

SUMMARY : Though the lion is the king of the forest, it has no choice to but to hunt its prey all by itself. Similarly, even the affluent have no choice but to do the three things themselves. (i.e. Eating, cleaning the private parts and sexual intercourse).

**గోరంటిక**॥ కావళములకొడిగట్టెద రొక్కొక పరి, లెంబి-కూట-సీమల పేరు సెప్పి పరి ;
వచ్చెదరో తనకుఁ దోడు వారు, వాటి పంటక మౌపొందునట్టి కారు?
వినునో అంకుడు "నా పొంటెఁ గా" దనుడు. 98

**మాటల విడఁదీత (పద విభాగము) :** కావళములకున్ + ఒడిగట్టెదర్ + ఒక్క + ఒక, పరి, లెంబి–కూట–సీమల, పేరు + చెప్పి, పరి, వచ్చెదర్ + ఓ, తనకున్ + తోడు, వారు, వాటి, పంటకమున్ + ఔపొందు + అట్టి, కారు, వినున్ + ఓ, అంకుడు, నా పొంటెన్, కాదు + అనుడున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పరి ఒక్క + ఒక పరి లెంబి–కూట–సీమల పేరు చెప్పి కావళములకున్ ఒడిగట్టెదర్. వాటి పంటకమున్ ఔపొందు అట్టి కారు తనకున్ వారు తోడు వచ్చెదర్ + ఓ? నా పొంటెన్ కాదు అనుడున్ అంకుడు వినున్ + ఓ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కావళములకున్ = పాపములకు ; ఒడిగట్టెదర్ = పాల్పడెదరు ; ఒక్క + ఒక పరి = ఒక్కొక్క సారి ; లెంబి–కూట–సీమల = కుటుంబము, సంఘము మఱియు దేశముల యొక్క ; పరి = జనము ; వచ్చెదర్ + ఓ = వచ్చెదరా ఏమి ; పంటకమున్ = ఫలితమును ; + ఔపొందు + అట్టి = అనుభవించునట్టి ; కారు = సమయమున ; వినున్ + ఓ = వినునా ఏమి ; అంకుడు = భగవంతుఁడు ; నా పొంటెన్ = నా కొఱకు ; అనుడున్ = అనఁగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** జనము అప్పుడప్పుడు కుటుంబము పేరో, సంఘము పేరో, దేశము పేరో చెప్పి పాపములకు ఒడిగట్టెదరు. పాపములకు తప్పనిసరిగా దుష్ఫలితములు ఉండును. ఆ ఫలితముల ననుభవింప వలసి వచ్చినప్పుడు ఆ కుటుంబము, ఆ సంఘము, దేశము తమకు తోడుగా వచ్చెదరా? "నీవు మా కోసమే ఈ పాపములు చేసితివి కనుక ఆ కృతజ్ఞతతో నీకు మారుగా మేమే ఈ పాపములను అనుభవించెదము. నీవు ప్రక్కకు జరుగుము" అందురా? "ఈ పాపములను నేను నా కోసము చేయలే" దని మనిషి వాదించినచో దేవుఁడది వినిపించుకొనునా?

SUMMARY : Sometimes folks commit sins in the name of their family, society or country. But will the family, society and country give man company at the time of paying for the sins? Will God listen to a sinner if he argues that he had not committed them for his own sake?

**చేమంతిక**॥ ఊరక యుండి పొదలించుకొనవచ్చు నన్నెములన్ ;
ఇంటనె యుండి అడరించుకొనవచ్చును జబ్బులన్ ;
కావచ్చున్ దా నొరులకుఁ జేతటియొ మేల్కానో,
తలవని తలంపుగఁ దన చొఱకమించుక లేకయే. 99

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఊరక + ఉండి, పొదలించుకొనన్ వచ్చున్ + అన్నెములన్, ఇంటన్ + ఎ + ఉండి, అడరించుకొనన్ వచ్చును, జబ్బులన్, కాన్ వచ్చున్ + తాన్ + ఒరులకున్ + చేతటి + ఒ, మేల్కాన్ + ఓ, తలవని, తలంపుగన్ + తన, చొఱకము + ఇంచుక, లేక + ఏ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఊరక + ఉండి అన్నెములన్ పొదలించుకొనన్ వచ్చున్. ఇంటన్ + ఎ ఉండి జబ్బులన్ అడరించుకొనన్ వచ్చును. తాన్ ఒరులకున్ తలవని తలంపుగన్ తన చొఱకము ఇంచుక లేక + ఏ చేతటి + ఒ మేల్కాన్ + ఓ కాన్ వచ్చున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పొదలించుకొనన్ వచ్చున్ = పెంచుకొనవచ్చును ; అన్నెములన్ = పాపములను ; అదరించుకొనన్ వచ్చును = విషమింపఁజేసికొనవచ్చును ; ఒరులకున్ = ఇతరులను ; చేతఱి + ఒ = ద్రోహియో ; మేల్కాన్ + ఓ = ఉపకారియో ; తలవని తలంపు గన్ = అసంకల్పితముగా ; చొఱకము = జోక్యము.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఊరకే ఒక మూలన కూర్చుండి కూడ పాపములను పెంచుకొనవచ్చును. ఎక్కడకును పోకుండ ఇంటిలోనే కూర్చుండి జబ్బులను విషమింపఁజేసికొనవచ్చును. తన సంకల్పమును, జోక్యము, పాత్ర కొంచెము కూడ లేకుండనే తాను ఇతరులకు ఉప కారియో, ద్రోహియో కావచ్చును (అట్లు భావింపఁబడవచ్చు నని భావము).

SUMMARY : One can increase one's count of sins just by sitting alone in a corner. One can turn one's diseases critical by staying home only. One may become a benefactor or traitor to others without one's will, intervention or role even by a little.

**చేమంతిక జంట ||** పోతరు లసిపోతరులని పోకడల్ రెండే యిటన్ ;
పోతరు లసిపోతరులన్ బొడవ మంది కేరెదర్ ;
పిఱికిపందలు బేలలున్ బిచ్చుకగుండె ల్లెల్లఱు ;
నంచించి అట్టిటు-బలిమి నపుడె దిగెదరు పోరన్ ; 100
మెత్త లెప్పములకే గుఱివెట్టి దాడి సేసెదర్ ;
తమకన్న బలియురపైఁ గోరి తలపడర్ కలనున్. 101

**మాటల విడఁదీత (పద విభాగము) :** పోతరుల్ + అసిపోతరుల్ + అని, పోకడల్, రెండు + ఏ + ఇటన్, పోతరుల్ + అసిపోతరులన్ + పొడవన్, మంది, కేరెదర్, పిఱికి-పందలున్, బేలలున్ + పిచ్చుక-గుండెల్ + ఎల్లఱున్, అంచించి, అట్టు + ఇటు-బలిమిన్ + అపుడె, దిగెదరు, పోరన్, మెత్త, లెప్పములకున్ + ఏ, గుఱి + పెట్టి, దాడి + చేసెదర్, తమకన్నన్, బలియురపైన్ + కోరి, తలపడర్, కలన్ + ఉన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** పోతరుల్, అసిపోతరుల్ అని ఇటన్ పోకడల్ రెండు + ఏ. పోతరుల్ అసిపోతరులన్ పొడవన్ మంది కేరెదర్. ఎల్లఱున్ పిఱికి-పందలున్ బేలలున్ పిచ్చుక-గుండెల్. అట్టు ఇటు-బలిమిన్ అంచించి అపుడె పోరన్ దిగెదరు. మెత్త లెప్పములకున్ + ఏ గుఱి పెట్టి దాడి చేసెదర్. కలన్ + ఉన్ తమకన్నన్ బలియురపైన్ కోరి తలపడర్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పోతరుల్ = బలవంతులు ; అసిపోతరుల్ = తక్కువ బలవంతులు (బలహీనులు) ; పోకడల్ = విధా నములు/ విధములు ; ఇటన్ = ఈ లోకములో ; పొడవన్ = పొడవఁగా ; మంది = జనము ; కేరెదర్ = కేరింతలు కొట్టెదరు ; బేలలున్ = దీనులు ;ఎల్లఱున్ = అందఱును ; అంచించి = అంచన వేసి ; అట్టు + ఇటు-బలిమిన్ = ఉభయ పక్షముల బలాబలములను ; పోరన్ = యుద్ధములో ; మెత్త లెప్పములకున్ + ఏ = బలహీన లక్ష్యములకే ; బలియురపైన్ = బలవంతుల 'మీఁద ; కోరి = కావలె నని ; తలపడర్ = కలియఁబడరు ; కలన్ + ఉన్ = కలలో కూడ.

**లోవాఱిక (తాత్పర్యము) :** బలవంతులును, బలహీనులును అని ఈ ప్రపంచములో మనుష్యులు రెండే విధములు. బలవంతులు బలహీను లకు దుష్టులనియు, శత్రువులనియు పేరుబెట్టి కొట్టఁగా చంపఁగా అది చూచి జనము ఆనందముతో కేరింతలు కొట్టెదరు. కాని బలవంతు-లైనను, బలహీనులైనను మనుష్యులందఱును లోలోపల పిచ్చుకల వలె పిఱికిపందలే, దీనులే. అందుచేతనే వారు ఉభయ పక్షముల బలా-బలములను అంచనా కట్టిన పిదపనే యుద్ధములకు దిగెదరు. తమకన్న బలహీనులైనవారి మీఁదనే ఆయుధములను ఎక్కుపెట్టెదరు. తమ కన్న బలవంతులని తెలిసినవారి మీఁద కలలో సైతము కలఁబడరు.

**వైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** బలవంతులు బలహీనులను చంపునట్టి యుద్ధములను, మిగితా పోరాటములను పొగడుటకేమియు లేదని భావము.

SUMMARY : Humanity is divided into the strong and the weak. Folks noisily celebrate the assauts on the weak by the strong, calling the former villains and enemies. Both the strong and weak are in fact, equally timid and helpless like sparrows. That's why they wage a war only after having a fair assessment of the strengths on the enemy front as well as the home front. They attack soft targets only. Even in their dream, they won't take on those who are stronger than themselves.

**గంగేరిక ॥** మగవారలకే యెఱుక కూర్మి విలువ ; ఆడువారి కెఱుక కాఁపుదలది ;

ముదుసలుల కెఱుక ప్రాయపు విలువ ; పిల్లలకె యెఱుక పెద్దల విలువ. 102

**మాటల విడఁదీత (పద విభాగము) :** మగ-వారలకున్ + ఏ, ఎఱుక, కూర్మి-విలువ, ఆడు-వారికిన్ + ఎఱుక, కాఁపుదలది, ముదుసలులకున్ + ఎఱుక, ప్రాయపుం, విలువ, పిల్లలకున్ + ఎ, ఎఱుక, పెద్దల, విలువ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మగ-వారలకున్ + ఏ కూర్మి-విలువ ఎఱుక. ఆడు-వారికిన్ కాఁపుదలది ఎఱుక. ముదుసలులకున్ ప్రాయపుం విలువ ఎఱుక. పిల్లలకున్ + ఎ పెద్దల విలువ ఎఱుక.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎఱుక = తెలియును ; కూర్మి-విలువ = ప్రేమ విలువ ; కాఁపుదలది = రక్షణ యొక్క విలువ ; ప్రాయపుం విలువ = వయస్సు యొక్క విలువ ; పిల్లలకున్ + ఎ =చిన్నపిల్లలకే

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రేమ విలువ మగవారికే తెలియును. రక్షణ విలువ ఆడువారికే తెలియును. యౌవనపు విలువ ముదుసలులకే తెలియును. పెద్దల విలువ పిల్లలకే తెలియును.

**పైమాల విడఁబఱు (విశేష వివరణము) :** ఎవటి జీవితములో ఏది లోటుపడునో వారికే దాని విలువ బాగుగా తెలియును.

SUMMARY : Only men know the value of love. Only women understand the importance of security. Only the aged are aware of the significance of youth. Only kids know the indispen-sability of elders.

**తామరిక ॥** పా లొలికిన నెత్తికొనవచ్చుఁ బ్రెన్ వటార్ల రాదారుల నా

పానాదుల క్రిందనో? ముక్కుఁ బగుల్పఁగల ముఱికి కాలువలు ;

పైపైఁ జిఱునగవుల తుట్రలు, లోలో నెల్పొకాలు కుట్రలు ;

మొండు మాటలు దుండగమ్ములుఁ దీరుంటపు టందచందములు. 103

**మాటల విడఁదీత (పద విభాగము) :** పాలు + ఒలికినన్ + ఎత్తికొనన్ వచ్చున్ + ప్రెన్-వటార్ల, రా-దారులన్ + ఆ, పానాదుల, క్రిందన్ + ఓ, ముక్కున్ + పగుల్పన్ + కల, ముఱికి, కాలువలు, పైపైన్ + చిఱు-నగవుల తుట్రలున్, లోలోన్+ ఎల్ + పొకాలు కుట్రలున్, మొండు మాటలున్, దుండగమ్ములున్ + తీరుంటపుం + అంద-చందములు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ప్రెన్-వటార్ల రా-దారులన్ పాలు ఒలికినన్ ఎత్తికొనన్ వచ్చున్. ఆ పానాదుల క్రిందన్ + ఓ ముక్కున్ పగుల్పన్ కల ముఱికి కాలువలు. పైపైన్ చిఱు-నగవుల తుట్రలున్, లోలోన్ ఎల్ పొకాలు కుట్రలున్, మొండు మాటలున్ దుండగమ్ములున్ తీరుంటపుం అంద-చందములు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ప్రెన్-వటార్ల = మహా నగరముల యొక్క ; రా-దారులన్ = రాజమార్గములలో ; ఆ పానాదుల క్రిందన్ + ఓ = ఆ వీథుల క్రింద అన్ననో ; తుట్రలున్ = మంచువానలును ; లోలోన్ = లోలోపల ; ఎల్ + పొకాలు = సర్వనాశనపు ; కుట్రలున్ = దుస్తంత్రములు ; మెండు మాటలున్ = ఊరక మాటలాడుటలును ; దుండగమ్ములున్ = దౌర్జన్యములును ; తీరుంటపుం + అంద-చంద ములు = నాగరికత యొక్క అంద చందములు.

**లోవాటిక (తాత్పర్యము) :** మహానగరముల ఘంటాపథములు — పాలు ఒలికినను ఎత్తికొని వాడుకొనఁగల్గునంత శుభ్రముగా తళతళ మెఱసిపోవుచుండును. కానీ వాటి వీథుల క్రింద (భూగర్భములో) ముక్కులను పగులఁగొట్టునంత దుర్భర దుర్వాసనతో కూడిన మురికి కాలువలు పాఱుచుండును. అట్లే నాగరికత యొక్క అందచందములు బయటికి ఎట్లున్నను – పైపైన చిఱునవ్వుల మంచువానలును, కాని లోలోపల మటుకు "అవతలివారిని సర్వనాశనము చేయవలె" నను కుట్రలును, పైకి తీయని గొప్ప మాటలును, గుట్టుగా దుర్మార్గ చేష్ట-లును కలిగి యుండును.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** నాగరికత యొక్క స్వభావము – మహానగరముల యొక్క పైపై అందముల యందును, లోలోపలి మురికి కాల్వల యందును ప్రతిఫలించు నని కవిభావము.

SUMMARY : The thoroughfares of metropolises are swanky clean – so clean that you can haul up for routine use the milk spilled over them. However, their streets have invisible foul-smelling drains flowing beneath them. Similarly civilization appears splendid only on the surface. But inside of it, there would be a snowfall of smiles concealing destructive conspiracies behind. There would be flowery speeches hiding the unspoken-of horrors.

**దాసానిక ॥** మేల్మి లోవైన మొసఁగున్ మేల్మి జరుమానమున్ ;
మేల్మి జరుమానమొసఁగున్ మేలిమి పవైనమున్ ;
పరువంపుఁ దిండియె కాఁచుఁ బండు ముదిమి యదనన్ ;
పసితనపు మునుగ్రుచ్చులో బ్రదిమానమంతయున్. 104

**మాటల విడఁదీత (పద విభాగము) :** మేల్మి-లోవైనము + ఒసఁగున్, మేల్మి-జరుమానమున్, మేలిమి-జరుమానము + ఒసఁగున్, మేల్మి-పవైనమున్, పరువంపుం + తిండి + ఎ, కాఁచున్ + పండు-ముదిమి + అదనన్, పసితనపుం, మునుగ్రుచ్చులు + ఓ, బ్రదిమానము + అంత యున్.

**చఱమొలి (అన్వయ క్రమము) :** మేల్మి-లోవైనము మేల్మి-జరుమానమున్ ఒసఁగున్. మేలిమి-జరుమానము మేల్మి-పవైనమున్ ఒసఁగున్. పరువంపుం తిండి + ఎ పండు-ముదిమి-అదనన్ కాఁచున్. పసితనపుం మునుగ్రుచ్చులు + ఓ బ్రదిమానము అంతయున్ (కాఁచున్).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మేల్మి-లోవైనము= నాణ్యమైన గతము ; ఒసఁగున్ = ఇచ్చును ; మేల్మి-జరుమానమున్ = నాణ్యమైన వర్త మానమును ; మేల్మి-పవైనమున్ = నాణ్యమైన భవిష్యమును ; పరువంపుం + తిండి + ఎ = పడుచు ప్రాయమున తిన్న తిండియే ; కాఁచున్ = కాఁపాడును ; పండు-ముదిమి + అదనన్ = పండు ముదుసలితనపు కాలమునందు కూడ ; పసితనపుం మునుగ్రుచ్చులు + ఓ = చిన్ననాటి టీకా అన్ననో ; బ్రదిమానము + అంతయున్ = జీవితమంతయు.

**లోవాటిక (తాత్పర్యము) :** గతకాలము బాగున్నచో వర్తమానము బాగుండును. వర్తమానము బాగున్నచో భవిష్యము కూడ బాగుండును. యౌవనమున తిన్న తిండి (దాని నాణ్యము) పండు ముదుసలితనమునందు కూడ ఆరోగ్యమును కాఁపాడును. చిన్ననాడు వేయించుకొన్న టీకా జీవితాంతము కాఁపాడును.

SUMMARY : Good past ensures good present. Good present ensures good future. The (quality of the) food consumed in one's youth safeguards one's health in the old age. The vaccination one had in one's the childhood safeguards one for life.

**గోరంటిక ||** వేఁడో యొకఁడు పుట్టుఁ ద్రేసంతటికిని, వేండ్రంపు నెసర్ బిల్లికఁ బోలువాఁడు ;

అవ్వాని పుట్టుక నతని త్రేసెల్లయు, సదాటుగ వెలుఁగొందుఁ దరతరములుగాన్. 105

**మాటల విడఁదీత (పద విభాగము) :** వేఁడు + ఓ + ఒకఁడు + పుట్టున్ + త్రేసు + అంతటికిని, వేంద్రంపుం, నెసర్–బిల్లికన్ + పోలు–వాఁడు, ఆ + వాని పుట్టుకన్ + అతని, త్రేసు + ఎల్ల + ఉన్, సదాటుగన్ వెలుఁగు + ఒందున్ + తర–తరములుగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** త్రేసు అంతటికిని వేంద్రంపుం నెసర్–బిల్లికన్ పోలు–వాఁడు వేఁడు + ఓ ఒకఁడు పుట్టున్. ఆ + వాని పుట్టుకన్ అతని త్రేసు ఎల్ల + ఉన్ + తర–తరములుగాన్ సదాటుగన్ వెలుఁగు ఒందున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వేఁడు + ఓ + ఒకఁడు = ఒకఁడో ఒకఁడు ; త్రేసు + అంతటికిని = జాతి అంతటికిని ; వేంద్రంపుం = ప్రచండమైన ; నెసర్–బిల్లికన్ = సూర్యబింబమును ; సదాటుగన్ = ఉన్నతముగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక జాతికంతకును గలిపి ఎప్పుడో ఒకనాడు ప్రచండ సూర్యబింబము వంటి ఒక మహాపురుషుఁడు మేనెత్తును. ఆతని పుట్టుక చేత ఆ జాతి మొత్తమును తరతరముల పాటు మహోన్నతముగా వెలిఁగిపోవును.

SUMMARY : For an entire race, one great soul comparable with the blazing son is born sometime in its history. The race will shine brilliantly for several generations just because of that one soul.

**పస్నియ ||** వణికములే గొప్ప యెడాటమ్ములు ; అసివందరులె పేరెంచవానులు ;

కాంచువిఁడులె గొప్పావపాఱికలు ; అదాటులే గొప్ప కలిమిలేములు. 106

**మాటల విడఁదీత (పద విభాగము) :** వణికముల్ + ఏ, గొప్ప, ఎడాటమ్ములు, అసివందరుల్ + ఏ, పేరెంచవానులు, కాంచువిఁడుల్ + ఎ, గొప్ప + ఆవపాఱికలు, అదాటుల్ + ఏ, గొప్ప, కలిమి–లేములు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** గొప్ప ఎడాటమ్ములు వణికముల్ + ఏ. పేరెంచవానులు అసివందరుల్ + ఏ. గొప్ప ఆవపాఱికలు కాంచువిఁడుల్ + ఎ. గొప్ప కలిమి–లేములు అదాటుల్ + ఏ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వణికముల్ + ఏ = ఉచితములే ; ఎడాటమ్ములు = విషయములు ; అసివందరుల్ + ఏ = నిరాడంబరులే ; పేరెంచవానులు = మహాత్ములు/ మహనీయులు ; కాంచువిఁడుల్ + ఎ = గురు రహితములే ; ఆవపాఱికలు = ఆలోచనలు ; అదాటుల్ + ఏ = ఆకస్మికములే ; కలిమి–లేములు = ఐశ్వర్య దారిద్ర్యములు.

**లోవాఱిక (తాత్పర్యము) :** గొప్ప విషయములు డబ్బు పెట్టకుండనే దొరకును. మహనీయులందఱును నిరాడంబరులై ఉండెదరు. గొప్ప ఆవ–పాఱికల (ideas) కు గురువులెవఱును ఉండరు. గొప్ప ఐశ్వర్యము మఱియు గొప్ప పేఁదఱికము ఈ రెండును హఠాత్తుగానే వచ్చి మీఁద పడును.

SUMMARY : Great things always come free of cost. Great souls are always simple-living. Great ideas don't have preceptors. Great prosperity and great poverty – both come about all of a sudden.

: సంచమర్తి చెబకము :

**ఇది**

**వాచస్పతి బిరుదుని సంతరిదమైన వల్మిరిగమును నెఱింపటి కావింతయందు**

**రెండవ వీటగు కానన త్రోవలో మూఁడవ సంచము**

**మొత్తము ముగిసినది.**

**|| మేల్గాతన్ ||**

**మాటల విడఁదీత (పద విభాగము) :** వాచస్పతి–బిరుదుని, సంతరిదము + ఐన, వల్మిరిగము + అను, నెఱింపటి, కావింతయందున్, రెండవ వీటు + అగు, కానస–త్రోవలో, మూఁడవ, సంచము, మొత్తము, ముగిసినది.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వాచస్పతి–బిరుదుని సంతరిదము + ఐన వల్మిరిగము + అను నెఱింపటి కావింతయందున్ రెండవ వీటు + అగు కానస–త్రోవలో మూఁడవ సంచము మొత్తము ముగిసినది.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వాచస్పతి–బిరుదుని = వాచస్పతి అను బిరుదము గల కవి యొక్క ; సంతరిదము + ఐన = ప్రణీతమైన ; నెఱింపటి కావింతయందున్ = చింతనాత్మక కావ్యమునందు ; మూఁడవ వీటు + అగు = మూఁడవ భాగమైన ; కానస–త్రోవలో = లోక మార్గములో ; రెండవ సంచము = రెండవ అధ్యాయము ; మేల్గాతన్ (మేల్ + కావుతన్) = శుభమస్తు.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

: SUMMARY:

Thus concludes the third chapter of the second part named

*Kaanasa Trova* in the work *Valmirigamu* written

By

Vachaspathi.

# వల్మిరిగము

## రెండవ వీటు - కానస త్రోవ

నాల్గవ సంచము

### హంజియము

**అవిగింగ జంట ॥ తమ మనిమిఁ దాము మని మన్ని విడతురు మంది ;**
**ఒక్క తమ మనిమిలోఁ దక్కినవారందటి**
**బ్రదుకులును బ్రదుకఁగలరు పారి మీఁదఁ గొందఱు ;**
**ఔపొందెదరు తామె ౨ అందటి సవింతలన్ ;** 1
**అందటి కొఱ కేడ్తురు ; అందటికై నగుదురు ;**
**తమ చేదు దాఁచుకొని తీయ తేనియఁ బంచి**
**తరలిపోదు రెటకో తందరుసుల కందక ;**
**సారె-టేంకణములా పేరెంచవానులకు.** 2

**మాటల విడఁదీత (పద విభాగము) :** తమ, మనిమిన్ + తాము, మని, మన్నిన్, విడతురు, మంది, ఒక్క, తమ, మనిమిలోన్ + తక్కిన-వార్ + అందటి, బ్రదుకులును, బ్రదుకన్ + కలరు, పారి మీఁదన్ + కొందఱు, ఔపొందెదరు, తాము + ఎ, అందటి, సవింతలన్, అందటి, కొఱకున్ + ఏడ్తురు, అందటికై, నగుదురు, తమ, చేదున్, దాఁచుకొని, తీయ, తేనియన్ + పంచి, తరలి-పోదుర్ + ఎటకున్ + ఓ, తందరుసులకున్ + అందక, సారె-టేంకణముల్ + ఆ, పేరెంచవానులకున్.

**చఱమొలి (అన్వయ క్రమము) :** మంది తమ మనిమిన్ తాము మని మన్నిన్ విడతురు. పారి మీఁదన్ కొందఱు ఒక్క తమ మనిమిలోన్ + తక్కిన-వార్ అందటి బ్రదుకులును బ్రదుకన్ కలరు. తాము + ఎ అందటి సవింతలన్ ఔపొందెదరు. అందటి కొఱకున్ ఏడ్తురు. అందటికై నగుదురు. తందరుసులకున్ అందక తమ చేదున్ దాఁచుకొని తీయ తేనియన్ పంచి ఎటకున్ + ఓ తరలి-పోదుర్. ఆ పేరెంచవానులకున్ సారె-టేంకణముల్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మనిమిన్ = జీవితమును ; మని = బ్రదికి ; మన్నిన్ = ప్రాణమును ; మంది = జనము ; పారి మీఁదన్ = భూమి మీఁద ; ఔపొందెదరు = అనుభవించెదరు ; సవింతలన్ = అనుభూతి ; తందరుసులకున్ = సామాన్యులకు ; సారె-టేంకణముల్ = మరల మరల నమస్కారములు ; పేరెంచవానులకున్ = మహనీయులకు.

**లోవాఱిక (తాత్పర్యము) :** లోకములో సాధారణ ప్రజలందఱును తమ బ్రదుకులు తాము బ్రదికి ప్రాణము విడిచెదరు. కాని కొందఱు మట్టుకు తమ ఒక్కటి జీవితములోనే అందటి జీవితములను జీవించఁగలరు. అందటి అనుభూతులను తామే పొందఁగలరు. వారు తమ కోసమై కాక అందఱు కోసము నవ్వెదరు. అందటి కోసమై ఏడ్చెదరు. వారు తమలోని చేదును దాఁచుకొని తమ తీయని తేనెలనే అందటికిని పంచి ఆ తరువాత సామాన్యుల కందనంత దూరము తరలిపోయెదరు. వారినే మహనీయులందురు. అటువంటి మహనీయులకు మరల మరల

దణ్ణములు.

SUMMARY : Laymen lead their own lives before breathing their last. However, some in the world can live the lives of everyone else within their own lifespan. They can feel everyone's feelings. They smile and cry, not for themselves, but everyone. They keep their bitter experi–ences to themselves and only share their sweet side with everyone before departing farther to somewhere out of the reach of commoners. They are called great souls to whom I repeatedly bow down.

**అవిగింగ** ‖ తేరు వెలాటి ; కాళ్ళకు మటుకుఁ గాదు సాటి ;
ఓడ లావాటి ; వించలికిఁ గాదు పోటీ ;
వించలి పారి మేటి ; కాదు సువాయి పాటి ;
వేటి వంచము వాటిదే, కైకట్టుఁ బట్టి 3

**మాటల విడఁదీత (పద విభాగము) :** తేరు, వెలాటి, కాళ్ళకున్, మటుకున్, కాదు, సాటి, ఓడ, లావాటి, వించలికిన్ + కాదు, పోటీ, వించలి, పారి, మేటి, కాదు, సువాయి–పాటి, వేటి, వంచము, వాటిది + ఏ, కైకట్టున్ + పట్టి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తేరు వెలాటి. కాళ్ళకున్ మటుకున్ సాటి కాదు. ఓడ లావాటి. వించలికిన్ పోటీ కాదు. వించలి పారిన్ మేటి. సువాయి–పాటి కాదు. కైకట్టున్ పట్టి వేటి వంచము వాటిది + ఏ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తేరు = రథము ; వెలాటి = ఖరీదైనది ; వించలికిన్ = విమానమునకు ; పారిన్ = భూమిపై ; మేటి = శ్రేష్ఠము ; సువాయి–పాటి = రాకెట్ తో సమానము ; వంచము = ముఖ్యము ; కైకట్టున్ + పట్టి = సందర్భమును బట్టి.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : The chariot may be pricey, but it is no match to one's legs. The ship may be humongous, but it cannot compete with a plane. The plane is the greatest vehicle, but it is not on par with a rocket. Thus everything has its own utility and greatness, based on the context.

**అవిగింగ** ‖ మంచియుఁ గా రొలవున పరి చెడ్డయును గారు ;
మంచి-చెడ్డవా రెల్లఱు నాయిసారిగాన్ ;
లోఁగాకడి మంచిచెడుల పాళులు మార్చున్
రెంచల నిఱువల్కు నిట్టటుగ నట్టిటుగా. 4

**మాటల విడఁదీత (పద విభాగము) :** మంచి + ఉన్ + కారు + ఒలవునన్, పరి, చెడ్డ + ఉను + కారు, మంచి–చెడ్డ–వార్ + ఎల్లఱున్ + ఆయిసారిగాన్, లోఁగాకడి, మంచి–చెడుల, పాళులు, మార్చున్, రెంచల, నిఱువల్కున్ + ఇట్టు + అటుగన్ + అట్టు + ఇటుగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒలవునన్ పరి మంచి + ఉన్ + కారు. చెడ్డ + ఉను + కారు. ఎల్లఱున్ ఆయిసారిగాన్ మంచి–చెడ్డ–వార్. లోఁగాకడి మంచి–చెడుల పాళులు రెంచల నిఱువల్కున్ ఇట్టు అటుగన్ అట్టు ఇటుగాన్ మార్చున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒలవునన్ = లోకములో ; పరి = జనము ; ఎల్లఱున్ = అందఱును ; ఆయిసారిగాన్ = ఒకే సమయము

నందు ; లోఁగాకడి = మనస్తత్త్వపు ; రెంచల = మనుష్యుల యొక్క ; నిఱువల్కున్ = నిర్వచనమును ; ఇట్టు + అటుగన్ + అట్టు + ఇటుగాన్ = విజ్జోడుగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** లోకములో మనుష్యులు పూర్తిగా మంచివారును కారు. చెడ్డవారును కారు. అందఱును సరిసాటిగా మంచి చెడుల కలివిడియై ఉన్నారు. అయితే ఆ మంచి–చెడుల ఎక్కువ–తక్కువలను బట్టి వారి మనిషితనపు నిర్వచనము (అర్థము) మారిపోవును.

**పైమాల విడఁబఱ్పు (విశేష వివరణము) :** అనఁగా – "మంచి ఎక్కువగా ఉన్నచో మనుష్యులు. చెడు ఎక్కువగా ఉన్నచో రాక్షసులు" అని భావము.

SUMMARY : The people in the world are not completely good. Nor are they fully bad. They are a blend of both. The definition of humanity changes in keeping with the proportions of the good and bad qualities.

**గంగేరిక జంట** ॥ గిట్టఁబోయెద రెచ్చుపాల్ మంది, పుట్టి పెరిగిన తరఁగదియందే ;
ఎసదాఁటెద రది నూటి కొకఁడో, యిద్దఱో యేన్గుఱో పదుగుఱో ; 5
ఒడల్ హూనము జేసికొందు ర- వ్వారి మేల్బారుగాఁ గొని మిగిత. 6

**మాటల విడఁదీత (పద విభాగము) :** గిట్టన్ + పోయెదర్ + ఎచ్చు–పాల్, మంది, పుట్టి, పెరిగిన, తరఁగదియందే, ఎసదాఁటెదర్ + అది, నూటికిన్ + ఒకఁడు + ఓ, ఇద్దఱు + ఓ, ఏన్గుఱు + ఓ, పదుగుఱు + ఓ, ఒడల్, హూనము + చేసికొందుర్ + ఆ + వారిన్ .మేల్బారుగాన్ + కొని, మిగిత.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ఎచ్చు–పాల్ మంది పుట్టి పెరిగిన తరఁగదియందే గిట్టన్ పోయెదర్. నూటికిన్ ఒకఁడు + ఓ ఇద్దఱు + ఓ ఏన్గుఱు + ఓ పదుగుఱు + ఓ అది ఎసదాఁటెదర్. మిగిత ఆ + వారిన్ మేల్బారుగాన్ కొని ఒడల్ హూనము చేసికొందుర్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గిట్టన్ + పోయెదర్ = చనిపోయెదరు ; ఎచ్చు–పాల్ మంది = ఎక్కువ శాతము జనము ; తరఁగదియందే = తరగతిలోనే ; ఎసదాఁటెదర్ = అధిగమించెదరు ; అది = ఆ పుట్టి పెరిగిన తరగతిని ; ఏన్గుఱు + ఓ = అయిదుగురో ; మేల్బారుగాన్ = ఆదర్శ ముగా ; కొని = తీసికొని ; మిగిత = తక్కిన జనము.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఎక్కువ మంది తాము ఏ ఆర్థిక తరగతిలో పుట్టి పెరిగినారో అందులోనే చివరి వరకు బ్రదికి చనిపోయెదరు. కాని నూటికి ఒకఁటిద్దఱు, లేదా అయిదు–పదుగుఱు మటుకు ఆ తరగతిని అధిగమించి ధనికులయ్యెదరు. ఇఁక మిగితా జనమంతా ఆ కొలఁది మందిని ఆదర్శముగా తీసికొని "తాము కూడ వారి వలెనే కావలె" నని ఒళ్ళు హూనము చేసికొని కష్టపడెదరు.

SUMMARY : Majority of the people persist and depart in the same economic class as they were once born and brought up. However just a few of them, not exceeding 1 – 2% or 5 – 10%, transcend the class and get rich. The rest of the people consider them their role–models and slug it out for all their lives.

**గంగేరిక** ॥ బ్రోమున్న తట్టునె నిలతురు మంది, మంచి గాని మ్మది చెడు గానీ ;
మంచి తట్టునె యుందురు కాదా ? మఱి దానికే బ్రోమున్న మీఁద? 7

**మాటల విడఁదీత (పద విభాగము) :** బ్రోమ్ + ఉన్న, తట్టునన్ + ఎ, నిలతురు, మంది, మంచి, కానిమ్ము + అది, చెడు + కానీ, మంచి తట్టున + ఎ + ఉందురు, కాదు + ఆ, మఱి, దానికిన్ + ఏ, బ్రోమ్ + ఉన్న మీఁదన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** అది మంచి కానిమ్ము చెడు కానీ బ్రోమ్ ఉన్న తట్టునన్ + ఎ నిలతురు మంది. దానికిన్ + ఏ బ్రోమ్ ఉన్న మీఁదన్ మఱి మంచి తట్టున + ఎ ఉందురు కాదు + ఆ?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** బ్రోమ్ + ఉన్న = శక్తి గలిగిన ; తట్టునన్ + ఎ = వైపుననే ; నిలతురు = నిలచెదరు ; మంది = జనము ; ఉన్న మీఁదన్ = ఉన్న మీఁదట/ ఉన్నచో.

**లోవాఱిక (తాత్పర్యము) :** శక్తి ఉన్న పక్షము మంచిదైనను చెడ్డదైనను జనము దాని వైపుననే నిలఁబడెదరు. మంచికే శక్తి ఉన్నచో వారు దాని వైపుననే నిలఁబడెదరు కదా?

**వైమాల విడఁబఱ్పు (విశేష వివరణము) :** మంచికి సాధారణముగా శక్తి ఉండదనియు, అందువలన జనము చెడు వైపుననే ఎక్కువగా నిలఁబడుచు, ఆ చెడునే మంచి చేసి చెప్పుకొనుచున్నారనియు కవిభావము.

SUMMARY : Folks often stand by the faction with power, be it good or bad. Would they not stand by the good side if it has power?

*(The poet implies that the good sides are powerless in general. So folks only stand by the powerful bad sides in a big way and describe the same as good).*

**చేమంతిక॥** ఒకటి నేది నగియించు నొరున కది దిగువ నెఱియించు ;
అయిన నెక్కతన నీ కూట మింకను నెమ్మదియే?
అచ్చలమును దీర్చికొనఁగా నాస్కార లేమియే ;
ఎసఁగ నొలవై యుండు నెప్పుడో ప్రెనువల్లకాడు. 8

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒకటిన్ + ఏది, నగియించున్ + ఒరునకున్ + అది, దిగువన్ + ఎఱియించున్, అయినన్ + ఏ + కతనన్ + ఈ, కూటము + ఇంకను, నెమ్మది + ఏ, అచ్చలమును + తీర్చికొనఁగాన్ + ఆస్కార–లేమి + ఏ, ఎసఁగన్ + ఒలవు + ఐ + ఉండున్ + ఎప్పుడు + ఓ, ప్రెను–వల్లకాడు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒకటిన్ ఏది నగియించున్ ఒరునకున్ అది దిగువన్ ఎఱియించున్. అయినన్ + ఏ కతనన్ ఈ కూటము + ఇంకను నెమ్మది + ఏ? అచ్చలమును తీర్చికొనఁగాన్ ఆస్కార–లేమి + ఏ ఎసఁగన్ ఒలవు ఎప్పుడు + ఓ ప్రెను–వల్లకాడు ఐ ఉండున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నగియించున్ = నవ్వించును ; ఒరునకున్ = వేఱెవానికి ; దిగువన్ = క్రింద ; ఎఱియించున్ = మంట బుట్టించును ; అయినన్ = అయినను ; ఏ + కతనన్ = ఏ కారణము చేత ; కూటము = సంఘము ; ఇంకను = ఇప్పటికిని ; నెమ్మది + ఏ = ప్రశాంతమే ; అచ్చలమును = ఆగ్రహమును ; తీర్చికొనఁగాన్ = తీర్చికొనుటకు ; ఆస్కార–లేమి + ఏ = అవకాశము లేకపోవుటయే ; ఎసఁగన్= అట్టి అవకాశము పెరుగఁగా ; ఒలవు = లోకము ; ఐ + ఉండున్ = అయి ఉండెడిది ; ఎప్పుడు + ఓ= చాల కాలము క్రిందటనే ; ప్రెను–వల్లకాడు = పెద్ద శ్మశానము.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒకటికి ఏది నవ్వు పుట్టించునో అది వేఱెవారికి క్రింద మండించవచ్చును. మఱి అటువంటప్పుడు సమాజమింకను ప్రశాంతముగానే ఎందుకు ఉన్నది? ఎందుకనఁగా – ఆగ్రహములను తీర్చికొనుటకై ప్రజలకు అవకాశము లేకపోవుట వలననే. అట్టి అవ–కాశమే పెంపొందినచో — ఈ ప్రపంచము చాల కాలము క్రిందటనే శ్మశానమై ఉండెడిది.

**వైమాల విడఁబఱ్పు (విశేష వివరణము) :** శక్తి ఉన్నచో ప్రతి చిన్న అభిప్రాయ భేదమునకు జనము ఒకటి అంతు ఒకఱు చూచికొని ఉండెడివారు. మానవ సమాజమునందు అసహనము అతివేలమని కవి అభిప్రాయము.

SUMMARY : What regales someone may be infuriating to others. Then why does the society still remains peaceful? Only for want of the opportunity to act on the fury. The world would have already been a vast graveyard, if people had that opportunity.

**గోరంటిక॥** రోవింపఁ జూచెదరు చెరి రపణంబును, దలవాంచి కైమోడ్చి మిన్నకుండక ;
కాన దాఁతురు తమ గొప్పఁ బేరెంచలు ; కాదేని ౨ పరి పెఱుకు గోళ్ళు వెంట్రుకలు. 9

**మాటల విడఁదీత (పద విభాగము) :** రోవింపన్ + చూచెదరు, చెరి, రపణంబును + తల–వాంచి, కై–మోడ్చి, మిన్నక + ఉండక, కానన్, దాఁతురు, తమ, గొప్పన్ + పేరెంచలు, కాదు + ఏనిన్, పరి + పెఱుకున్, గోళ్ళున్ వెంట్రుకలున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (పరి) చెరి రపణంబును తల–వాంచి కై–మోడ్చి మిన్నక ఉండక రోవింపన్ చూచెదరు. కానన్ పేరెంచలు తమ గొప్పన్ దాఁతురు. కాదు ఏనిన్ పరి గోళ్ళున్ వెంట్రుకలున్ పెఱుకున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** (పరి = జనము) ; రోవింపన్ + చూచెదరు = దబ్బు చేసికొనుటకు ప్రయత్నించెదరు ; చెరి రపణంబును = ప్రతి మేటి గుణమును ; కై–మోడ్చి = దణ్ణము పెట్టి ; మిన్నక + ఉండక = ఊరకుండక ; కానన్ = కావున/ కాబట్టి ; దాఁతురు = దాఁచెదరు ; గొప్పన్ = గొప్పతనమును ; పేరెంచలు = మహనీయులు ; కాదు + ఏనిన్ = కానిచో/ కాకపోయినచో ; పరి = జనము ; పెఱుకున్ = పీఁకును.

**లోవాఱిక (తాత్పర్యము) :** జనము ఒకఱిలో ఒక గొప్ప లక్షణము ఉన్నట్లుగా గుర్తించినప్పుడు దానికి తలవంచి నమస్కరించి ఊరకుండక దాని గుండా ఏదైన ధనలాభమును పొందవలెనని ప్రయత్నించెదరు. అందుకే మహనీయులు తమ గొప్పతనమును ఎవఱికిని తెలియకుండ దాఁచుకొందురు. అట్లు దాఁచుకొనని యెడల, జనము వారి గోళ్లకును, వెంట్రుకలకును సైతము మహిమను అంటఁగట్టి వారి మీఁదఁబడి పీఁకి నెత్తురు గార్పించెదరు.

SUMMARY : When folks find a great quality in someone, they don't rest content with saluting it, but go on to gain a monetary benefit out of it. That's why great souls hide their own greatness. Otherwise, folks attribute magical powers even to their hair and nails and proceed to pluck them out.

**అవిగింగ ॥** ఎందఱి నగియింప నందఱు ననుపుకత్తెలు ;
ఎన్నెంచికలఁ జెప్ప నంతమంది మార్తుఱు ;
ఎన్ని బాసటలివ్వ నంతమంది నేస్తులు ;
ఎంత తుటారుఁడైన నందఱు పారేళ్ళు. 10

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎందఱిన్, నగియింపన్ + అందఱు, ననుపుకత్తెలు, ఎన్ని + ఎంచికలన్ + చెప్పన్ + అంత–మంది, మార్తుఱు, ఎన్ని, బాసటల్ + ఇవ్వన్ + అంత–మంది, నేస్తులు, ఎంత, తుటారుఁడు + ఐనన్ + అందఱు, పారేళ్ళు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నగియింపన్ = నవ్వించినచో ; ననుపుకత్తెలు = ప్రియురాళ్ళు ; ఎంచికలన్ = అభిప్రాయములను ; చెప్పన్ = చెప్పినచో ; మార్తుఱు = శత్రువులు ; బాసటల్ = సహాయములను ; ఇవ్వన్ = ఇచ్చినచో ; నేస్తులు = స్నేహితులు ; తుటారుఁడు = కఠినుండు ; ఐనన్ = అయినచో ; పారేళ్ళు = సేవకులు.

**లోవాతిక (తాత్పర్యము) :** ఎంతమందిని నవ్వింపఁగల్గినచో అంతమంది ప్రియురాళ్లు ఏర్పడెదరు. ఎన్ని విషయముల మీఁద అభిప్రాయము-లను చెప్పినచో అంతమంది శత్రువులు ప్రోఁగయ్యెదరు. ఎన్ని సహాయములను చేసినచో అంతమంది స్నేహితులు ఏర్పడెదరు. మనిషి ఎంత కఠిన హృదయుఁడైనచో అంతమంది దాసదాసీ జనము అతనికి దొరకెదరు.

SUMMARY : The more one could make others laugh, the more ladyloves one gets. The more opinions one expresses, the more enemies one gathers. The more one helps others, the more friends one gains. The more stony-hearted one is, the more number of servants and atten-dants one gets.

**అవిగింగ ॥** అంకటికిం గలిదము దారిదెన్ను తోపని
ఐనిల్క నామతించెదరు కొందఱు కలసి ;
అంత నాయన ౨ అల్గి ౨ అమరమంత పొకాల్చుఁ
దన మిగిత నెరిమారులఁ గాఁపాఁడుకొనఁగన్. 11

**మాటల విడఁదీత (పద విభాగము) :** అంకటికిన్ + కలిదము, దారి + తెన్ను, తోపని, ఐనిల్కన్ + ఆమతించెదరు, కొందఱు, కలసి, అంతన్, + ఆయన, అల్గి, అమరమున్ + అంత, పొకాల్చున్ + తన, మిగిత, నెరిమారులన్ + కాఁపాఁడుకొనఁగన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కొందఱు కలసి అంకటికిన్ కలిదము దారి-తెన్ను తోపని ఐనిల్కన్ ఆమతించెదరు. అంతన్ ఆయన అల్గి తన మిగిత నెరిమారులన్ కాఁపాఁడుకొనఁగన్ అమరమున్ అంత పొకాల్చున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అంకటికిన్ = దేవునికి ; కలిదము = సైతము ; ఐనిల్కన్ = పరిస్థితిని ; ఆమతించెదరు = సృష్టించెదరు ; అమరమున్ + అంత = వ్యవస్థ నంతటిని ; పొకాల్చున్ = నాశనము చేయును ; నెరిమారులన్ = భక్తులను ; కాఁపాఁడుకొనఁగన్ = కాఁపాడుకొనుటకై.

**లోవాతిక (తాత్పర్యము) :** సమాజములో కొందఱు దుష్టులు కలసి దేవునికి కూడ దిక్కుతోచని పరిస్థితి సృష్టించెదరు. అప్పుడాయన కోపించి – తన యొక్క మిగిలిన భక్తులను కాఁపాడుకొనుట కొఱకై – మొత్తము వ్యవస్థనే నాశనము చేసివేయును.

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** దారిదెన్ను = దారి + తెన్ను = సమాహార ద్వంద్వ సమాసము. నిత్య ఏకవచనము.

SUMMARY : A few in the society create in tandem, so puzzling a situation that it leaves little scope even for God to sort it out. Then He grows furious and destroys the entire system to save the rest of His devotees.

**అవిగింగ ॥** మొన్నటి కడమానమె మొత్తము లోవైనము ;
పోల్చి సరిచూచుకొనుటయె దాని మేల్తనము ;
వ్రాయక తీఱ దెప్పటి కడమాన మప్పుడు ;
మొన్నటి క్రేఁజూపకము లివైనము తప్పుడు. 12

**మాటల విడఁదీత (పద విభాగము) :** మొన్నటి, కడమానము + ఎ, మొత్తము, లోవైనము, పోల్చి, సరిచూచుకొనుట + ఎ, దాని, మేల్తనము, వ్రాయక-తీఱదు + ఎప్పటి, కడమానమున్ + అప్పుడు, మొన్నటి, క్రేఁజూపకముల్ + ఇవైనము, తప్పుడు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మొత్తము లోవైనము మొన్నటి కడమానము + ఎ. పోల్చి సరిచూచుకొనుట + ఎ దాని మేల్తనము. ఎప్పటి

కడమానమున్ అప్పుడు వ్రాయక-తీఱదు. మొన్నటి క్రేఁజూపకముల్ ఇవైనము తప్పదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కడమానము + ఎ = పంచాంగమే ; లోవైనము = గతకాలము ; మేల్తనము = ప్రయోజనము ; వ్రాయక-తీఱదు = వ్రాయక తప్పదు ; క్రేఁజూపకముల్ = దిజ్ నిర్దేశనములు ; ఇవైనము = ప్రస్తుతము.

**లోవాటిక (తాత్పర్యము) :** గతమంతయు పనికిరాని ప్రాఁత పంచాంగమే. ఇప్పటి కాలముతో పోల్చి చూచుకొనుటయే దానికి గల ఏకైక ప్రయోజనము. ఎప్పటి పంచాంగము నప్పుడు వ్రాసికొనక తప్పదు. మొన్నటి మార్గదర్శనములను ఇప్పుడు అనుసరింపఁదలఁచుట పొఱఁబాటగును.

SUMMARY : All the past is like an old calendar whose sole purpose is to compare with the present. New calendars need to be prepared from time to time. It will be a mistake to go by the guidance given in the past.

**పస్పియ జంట** ॥ పెద్దలామతి తప్పొప్పుల పగిది ; పాపఁడు పాప బావమఱదళ్ళయి,
పుట్టినప్పుడు పుట్టాలుమగలని, పూన్చినవారే పొడమ రవరవలు, 13
రాఁగ రవణంపు బయటి తౌలములు, "మేలు కాదులే మేనటికి" మంఢ్రు ;
చిన్నార సుతి కూటిమది చెట్టగున్ ; చిన్నల కందనల్ చివుక్కుమనున్. 14

**మాటల విడఁదీత (పద విభాగము) :** పెద్దల + ఆమతి, తప్పు + ఒప్పుల, పగిది, పాపఁడున్, పాప, బావ-మఱదళ్ళు + అయి, పుట్టిన + అప్పుడు, పుట్టు + ఆలు-మగలు + అని, పూన్చిన-వారే, పొడమన్, రవరవలు, రాఁగన్, రవణంపుం, బయటి, తౌలములు, మేలు, కాదు, లే, మేనటికము + అంఢ్రు. చిన్నార-సుతి-కూటిమి + అది చెట్ట + అగున్ ; చిన్నల కందనల్ చివుక్కు + అనున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తప్పు + ఒప్పుల పగిది పెద్దల ఆమతి. పాపఁడున్ పాప బావ-మఱదళ్ళు అయి పుట్టిన అప్పుడు పుట్టు + ఆలు-మగలు అని పూన్చిన-వారే రవరవలు పొడమన్ రవణంపుం బయటి తౌలములు రాఁగన్ "మేనటికము మేలు కాదులే" అంఢ్రు. చిన్నార-సుతి-కూటిమి అది చెట్ట అగున్ ; చిన్నల కందనల్ చివుక్కు అనున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఆమతి = సృష్టి ; పగిది = సరళి ; పాపఁడున్ = ఒక మగపిల్లవాఁడును ; పాప = ఒక ఆడుపిల్లయు ; పుట్టు + ఆలు-మగలు = పుట్టుకతోనే ఆలుమగలు ; పూన్చిన-వారే = సంబంధమును కట్టినవారే ; పొడమన్ = పుట్టఁగా ; రవరవలు = అభిప్రాయ భేదములు ; రాఁగన్ = రాఁగా ; రవణంపుం = ఉత్తమమైన ; తౌలములు = సంబంధములు ; మేలు కాదు = మంచిది కాదు ; మేనటికము + అంఢ్రు. చిన్నార-సుతి-కూటిమి + అది = చిన్ననాటి నుండి ఉన్న ప్రేమ ; చెట్ట = చెడుగు ; కందనల్ = హృదయములు ; చివుక్కు + అనున్ = ఆకస్మిక బాధకు లోనగును.

**లోవాటిక (తాత్పర్యము) :** తప్పొప్పుల సరళి పెద్దల సృష్టి. (వారు పిల్లలకు ఏమి చెప్పెదరో అదే విలువల వ్యవస్థ అగును). ఒక పాపఁడు మఱియు పాప బావమఱదళ్ళయి పుట్టినచో, "వారు పుట్టుకతోనే భార్యాభర్తలు" అని సంబంధమును అంటఁగట్టెదరు. ఆ పిల్లలు పెద్దవారైన తరువాత తమ కుటుంబముల నడుమ పొఱపొచ్చెములు రేఁగినను, లేదా ఇంకను మెఱుఁగైన పెండ్లి సంబంధము దొరకినను, అంతకు ముందనుకొన్న మాటలను ప్రక్కన బెట్టి, "మేనటికము మంచిది కా" దని పల్కెదరు. చిన్ననాటి నుండి ప్రేమించుకొన్నది కాస్తా హఠాత్తుగా తప్పయిపోవును. "ఇఁక దూరదూరముగా ఉండుఁ" డని పెద్దలు చెప్పఁగా ఆ చిన్నవారల మనస్సులు చివుక్కుమనును.

SUMMARY : Value judgement system is a creation of elders. If two kids are cousins, the elders describe them as a couple by birth. However, if the families have differences or receiv-ed better matrimonial proposals after the kids grew up, the elders eat their own words and

say, "*Cousin marriages are no good*." The love which has grown since childhood becomes objectionable overnight and the hearts of the young undergo severe pangs of severance.

**అవిగింగ** ॥ బల్లిదుల కడగండి బడుగులకుఁ గాదట్లు ;
బడుగుల కడగండి రాఁపాడదు బల్లిదులన్ ;
గఱిక పైలము చెట్లఁ గూల్చు కల్మెఱాతన్ ;
కళకళలాడుఁ జెట్లు కసవెండు వేసవిన్. 15

**మాటల విడఁదీత (పద విభాగము) :** బల్లిదుల, కడగండి, బడుగులకున్ + కాదు + అట్లు, బడుగుల, కడగండి, రాఁపాడదు, బల్లిదులన్, గఱిక + పైలము, చెట్లన్ + కూల్చు, కల్మెఱాతన్, కలకలలు + ఆడున్ + చెట్లు, కసవు + ఎండు, వేసవిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** బల్లిదుల కడగండి బడుగులకున్ అట్లు కాదు. బడుగుల కడగండి బల్లిదులన్ రాఁపాడదు. చెట్లన్ కూల్చు కల్మెఱాతన్ గఱిక పైలము. కసవు ఎండు వేసవిన్ చెట్లు కలకలలు ఆడున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** బల్లిదుల = బలవంతుల యొక్క ; కడగండి = కష్టము ; బడుగులకున్ = బలహీనులకు ; రాఁపాడదు = హింసపెట్టదు ; గఱిక = గడ్డి ; పైలము = క్షేమము ; కల్మెఱాతన్ = తుఫానులో ; కసవు = గడ్డి ; ఎండు = ఎండిపోవునట్టి.

**లోవాఱిక (తాత్పర్యము) :** బలవంతులకు ఏది కష్టమో అది బడుగులకు ఆ విధముగా కాదు (కష్టము కాదు). అట్లే కొన్ని కష్టములు బడుగులను బాధించినట్లుగా బలవంతులను బాధింపవు. తుఫాను మహావృక్షములనే కూల్చునే తప్ప గడ్డిపోచను ఏమియు చేయఁజాలదు. ఆ గడ్డి ఎండిపోవునట్టి వేసవిలో సైతము మహావృక్షములు నిలఁబడఁగలవు.

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** కల్మెఱాయి / కల్మెఱాయ్ = తుఫాను.

SUMMARY : What feels like a hardship for the strong may not be so for the weak. Similarly, some of the hardships do not trouble the weak as they do the strong. A storm roots out big trees but does not touch grass. A scorching summer dries up grass. But big trees are able to survive.

**వెల్మిరిక** ॥ తెగహత్తరించు బడుగులనే, తటాల్మారు పెయ్యది యైనన్ ;
వెల్లిఁ గొట్టుకపోవుఁ బాకల్, బ్రల్లక నిలచు ఱాతి మేడల్. 16

**మాటల విడఁదీత (పద విభాగము) :** తెగన్-హత్తరించున్, బడుగులన్ + ఏ, తటాల్-మారుపు + ఏది + ఐనన్, వెల్లిన్ + కొట్టుక-పోవున్ + పాకల్, బ్రల్లక, నిలచున్, ఱాతి మేడల్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తటాల్-మారుపు ఏది ఐనన్ బడుగులన్ + ఏ తెగన్-హత్తరించున్. వెల్లిన్ పాకల్ కొట్టుక-పోవున్. ఱాతి మేడల్ బ్రల్లక నిలచున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తెగన్-హత్తరించున్ = మిక్కిలి ప్రభావితము చేయును ; బడుగులన్ + ఏ = బలహీనులనే ; తటాల్-మారుపు = ఆకస్మిక మార్పు / పరిణామము ; వెల్లిన్ = వఱదలో ; పాకల్ = గుడిసెలు ; బ్రల్లక = కూలిపోక.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఆకస్మిక పరిణామములు బలహీనులను ప్రభావితము చేసినంతగా బలవంతులను చేయవు. వఱద వచ్చినప్పుడు గుడిసెలు అందులో మునిఁగి కొట్టుకపోవును. ఱాతి మేడలు మట్టుకు కూలకుండ నిలఁబడును.

SUMMARY : The rich are not affected by drastic changes as much as the poor. Mansions

built of stone stand uncollapsed, while mud-huts get washed away in a flood.

**అవిగింగ ॥** కడిఁది సుమా ! త్రోసిపుచ్చుఁ దట్టుకోఁగల్మి
గలుగ నయ్యది తన కాదిలి వలనఁ గానీ ;
కైసల్పిద వేల్పు వలనఁ గానీ దొరచేఁ ,
గానీ ; కతింపన్ మేలు తా నడుగక మున్న. 17

**మాటల విడఁదీత (పద విభాగము) :** కడిఁది, సుమా, త్రోసిపుచ్చున్ + తట్టుకోన్ + కల్మి + కలుగన్ + ఆ + అది, తన, కాదిలి వలనన్ + కానీ, కైసల్పిద వేల్పు వలనన్ + కానీ, దొరచేన్ + కానీ, కతింపన్, మేలు, తాన్ + అడుగక మున్ను + అ.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ఆ + అది తన కాదిలి వలనన్ కానీ కైసల్పిద వేల్పు వలనన్ కానీ దొరచేన్ కానీ, త్రోసిపుచ్చున్ తట్టుకోన్ కల్మి కలుగన్ కడిఁది సుమా! తాన్ మున్ను + అ కతింపన్ మేలు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కడిఁది = కష్టము ; త్రోసిపుచ్చున్ = నిరాకరణమును ; తట్టుకోన్ + కల్మి = ఓర్చుకొను శక్తి ; కలుగన్ = కలుగుట (ఉండుట) ; ఆ + అది = ఆ తట్టుకోఁగల్మి ; కాదిలి వలనన్ = ప్రియతముని / ప్రియతమురాలి నుండి ; కైసల్పిద వేల్పు వలనన్ = పూజించిన దేవుని నుండి ; దొరచేన్ = ప్రభుని / యజమానుని వలన ; కతింపన్ = తర్కించుట ; మేలు = మంచిది ; మున్ను + అ = అడుగుటకు ముందే.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనుష్యులలో నిరాకరణమును (అడిగి లేదనిపించుకొనుటను) ఓర్చుకొనఁగల శక్తి ఉండుట కష్టము. ఆ నిరాకరణము ప్రియతముని వలన కావచ్చును. ప్రియతమురాలి వలన కావచ్చును. తాను పూజించిన దేవుని వలన కావచ్చును. లేదా తన యజమానుని వలన కూడ కావచ్చును. అందుచేత ఏదైన అడుగుటకు ముందే, "అది అడుగవలయునా? వలవదా? అడుగవచ్చునా? కూడదా?' అన్న విషయమును గుఱించి లోఁతుగా తర్కించుట మంచిది.

**వైమాల విడఁబఱు (విశేష వివరణము) :** త్రోసిపుచ్చును ఓర్చుకొనలేకపోవుట తఱచుగా వైషమ్యములకు నాంది కావచ్చును.

SUMMARY : Rare is the faculty of tolerance to rejection in humans, be it by the beloved or by the god whom one worships or by one's master. So better ponder over in depth in advance whether to ask them for something or not.

*(Intolerance to rejection might often be the starting point of bitter enmity as well).*

**అవిగింగ ॥** తీరుతీరులుగఁ దిట్టించుకొంద్రు పిదపన్
దేరఁదేఱిదులు తాము మన్న ౨ అదనన్ ;
బ్రదిమినాళుల నే పేరెంచలు కన్నడిదు,
లవ్వారందఱు నటుపైఁ గైసల్పాదులు. 18

**మాటల విడఁదీత (పద విభాగము) :** తీరు-తీరులుగన్ + తిట్టించుకొంద్రు, పిదపన్ + తేరన్ + తేఱిదులు, తాము, మన్న, అదనన్, బ్రదిమి-నాళులన్ + ఏ, పేరెంచలు, కన్నడిదుల్ + ఆ + వార్ + అందఱున్ + అటుపైన్ + కైసల్పాదులు.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** తాము మన్న అదనన్ తేరన్ తేఱిదులు పిదపన్ తీరు-తీరులుగన్ తిట్టించుకొంద్రు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తీరు-తీరులుగన్ వివిధముగా / రకరకాలుగా ; తేరన్ + తేఱిదులు = రథమెక్కి ఊరేఁగింపఁబడ్డవారు ; మన్న అదనన్ = బ్రదికి యున్న కాలములో ; బ్రదిమి-నాళులన్ = బ్రదికి యున్న దినములలో ; ఏ పేరెంచలు = ఏ మహనీయులు ;

కన్నడిదుల్ = ఉపేక్షింపఁబడ్డవారు ; ఆ + వార్ + అందఱున్ = వారంతా ; అటుపైన్ = ఆ తరువాత (చనిపోయిన తరువాత) ; కైసల్పాదులు = పూజనీయులు.

**లోవాఱిక (తాత్పర్యము) :** బ్రదికి యున్న కాలములో బ్రహ్మరథము పట్టఁబడినవారు ఆ తరువాత జనము చేత రకరకాల విమర్శలకు గుఱియ్యెదరు. బ్రదికి యున్న నాళ్ళలో నిరాదరణమునకు గుఱియైన మహనీయులు – చనిపోయిన తరువాత ప్రజలకు పూజనీయులయ్యెదరు.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** చావుతో జీవితము ముగిసిపోదు.

SUMMARY : Those who are publicly honored while above the ground, might be subject to censure after they passed away. The great souls who are neglected during their lifetime, will be widely honored posthumously.

**పస్నియ** ॥ కనులు వోవునంత కాటుక వలదు ; నములలేనంత నంజుకొనరాదు ;
మొదటికె మోసమగు మంచి కూడదు ; తెలియని దాన వ్రేలు వెట్టఁదగదు. 19

**మాటల విడఁదీత (పద విభాగము) :** కనులు + పోవు + అంత, కాటుక, వలదు, నములన్ + లేని + అంత, నంజుకొనన్ + రాదు, మొదటికిన్ + ఎ, మోసము + అగు, మంచి, కూడదు, తెలియని దానన్, వ్రేలు + పెట్టన్ + తగదు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** (సుబోధము).

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : No eyeliner to the point of losing the eyesight itself. No gobbling up the am–ount of food which you cannot chew. No show of goodness which strikes at the very base. No meddling with the things that one does not know.

**అవిగింగ** ॥ పోరేటల నొక వైపు పొందుకొందురు పరి,
దాని పొగయు సెగయుఁ దమకుఁ దగులకుండు తఱి ;
వెనుక వేసుక వచ్చెద రెంతకపాటియున్ ;
తమను దెబ్బ తాఁక దుమ్మెత్తి పోసెదర్. 20

**మాటల విడఁదీత (పద విభాగము) :** పోరు + ఏటలన్ + ఒక, వైపు, పొందుకొందురు, పరి, దాని, పొగ + ఉన్, సెగ + ఉన్ + తమకున్ + తగులక + ఉండు, తఱిన్, వెనుకన్, వేసుక (వేసికొని), వచ్చెదర్ + ఎంత + అకపాటి + ఉన్, తమను, దెబ్బ, తాఁకన్ దుమ్ము + ఎత్తి పోసెదర్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** దాని పొగ + ఉన్ సెగ + ఉన్ తమకున్ తగులక ఉండు తఱిన్ పరి పోరు ఏటలన్ ఒక వైపు పొందుకొందురు. ఎంత + అకపాటి + ఉన్ వెనుకన్ వేసుక (వేసికొని) వచ్చెదర్. తమను దెబ్బ తాఁకన్ దుమ్ము ఎత్తి పోసెదర్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పోరు + ఏటలన్ = పోరాడుచున్న పక్షములలో ; పొందుకొందురు = చేరెదరు ; పరి = జనము ; తగులక + ఉండు తఱిన్ = తగులనంత సమయము ; వెనుకన్ వేసుక (వేసికొని) వచ్చెదర్ = సమర్థించెదరు ; ఎంత + అకపాటి + ఉన్ = ఎంత అన్యాయమునైనను ; దుమ్ము + ఎత్తి పోసెదర్ = విచ్చలవిడిగా దూషించెదరు.

**లోవాఱిక (తాత్పర్యము) :** పోరాటపు దుష్ప్రభావము తమకు సోఁకనంత కాలము, పోరాడుచున్న రెండు పక్షములలో ఒకదాని వైపు జనము చేరెదరు. తమకు నచ్చిన పక్షము ఎంత అన్యాయమునకు ఒడిగట్టుచున్నను దానిని సమర్థించెదరు. అదే, ఆ పోరాటము వలన తమకు కూడ దెబ్బ తగిలినచో అందఱిని దుమ్మెత్తి పోసెదరు.

SUMMARY : As long as they remain untouched by the heat of a fight, folks side with one of the warring factions and justify its actions, no matter however unjust they are. But when they are hit themselves by the fight, they start lambasting at everyone.

**గోరంటిక ॥** కావలయుననని కోరెద రవ్వారిగాఁ , గారును నీరును గాసు లంకుసాకత ;
మవి సిక్కఁ జేసెదరు బల్ సీవాడక- ; మఱిచేత నున్న చెరిదియు విలువమాలు. 21

**మాటల విడఁదీత (పద విభాగము) :** కావలయున్ + అని, కోరెదర్ + అవ్వారిగాన్ + కారును, నీరును, కాసులున్ + అంకు-సాకతమున్, అవి + చిక్కన్ + చేసెదరు, బల్-సీవాడకము + అఱి-చేతన్ + ఉన్న, చెరిది + ఉన్, విలువ-మాలు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కారును నీరును కాసులున్ అంకు-సాకతమున్ అవ్వారిగాన్ కావలయున్ అని కోరెదర్. అవి చిక్కన్ బల్-సీవాడకము చేసెదరు. అఱి-చేతన్ ఉన్న చెరిది + ఉన్ విలువ-మాలు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అవ్వారిగాన్ = నిరంతరాయముగా, అనంతముగా ; కారును = కాలమును ; నీరును = నీరు కూడ ; కాసులున్ = డబ్బులు కూడ ; అంకు-సాకతమున్ = భగవద్ అనుగ్రహమును కూడ ; చిక్కన్ = దొరుకఁగా ; బల్-సీవాడకము = మిక్కిలి దుర్వినియోగము ; చెరిది + ఉన్ = ప్రతిదియు ; విలువ-మాలు = విలువ లేనిది.

**లోవాఱిక (తాత్పర్యము) :** జనము - కాలము, జలము, ధనము, భగవద్ అనుగ్రహము అను ఈ నాలుఁగును తమకు అనంతముగా వచ్చి పడవలె నని కోరెదరు. కాని నిజముగా అవి దక్కినచో బహు దుర్వినియోగము చేసెదరు. అందుబాటులో ఉన్న ప్రతిదియు మనిషి కను-రోకలో విలువ లేనిదగును.

SUMMARY : Folks wish for 4 things i.e. time, water, money and God's grace – to flow and be available abundantly. But they squander away the same if available. Everything which is handy in the world loses its value in the eyes of people.

**గోరంటిక ॥** చెరికార్తికిఁ గాయవు బంగినపల్లులు ; చెరి యామనికిఁ బూవవు నల్వతమ్ములు ;
హంజరుకలు వాటిల్లవు వావరుసగా ; పాటిల్లుచో నీ పరి సూడదు విల్వగా. 22

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెరి-కార్తికిన్ + కాయవు, బంగినపల్లులు,, చెరి + ఆమనికిన్ + పూవవు, నల్వ-తమ్ములు, హంజి + జరుకలు, వాటిల్లవు, వరుస-వరుసగాన్, పాటిల్లుచోన్ + ఈ పరి + చూడదు, విల్వగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** బంగినపల్లులు చెరి-కార్తికిన్ కాయవు. నల్వ-తమ్ములు చెరి ఆమనికిన్ పూవవు. హంజి + జరుకలు వావరుసగా (వరుస-వరుసగాన్) వాటిల్లవు. పాటిల్లుచోన్ ఈ పరి విల్వగాన్ చూడదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చెరి-కార్తికిన్ = ప్రతి ఋతువునకు ; చెరి + ఆమనికిన్ = ప్రతి ఋతువునకు ; పూవవు = పూచునది లేదు ; నల్వ-తమ్ములు = బ్రహ్మకమలములు ; హంజి + జరుకలు = శుభ ఘటనలు ; వాటిల్లవు = జరుగవు ; వావరుసగా = వరుస-వరుస గాన్ ; పాటిల్లుచోన్ = జరిగినచో ; ఈ పరి = ఈ ప్రజ ; చూడదు = పరిగణింపదు ; విల్వగాన్ = విలువగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రతి ఋతువులోను బంగినపల్లి మామిడిపండ్లు కాయవు. ప్రతి ఋతువులోను బ్రహ్మకమలములు పూచవు. అట్లే

శుభ సంఘటనలు జీవితములో వరుస-వరుసగా జరుగుచు పోవు. అట్లు జరిగినచో జనము వాటి విలువను గుర్తెఱుఁగరు.

SUMMARY : Banginapalli mangoes don't come up every season. Sacred Lotuses *(Saussurea Obvallata)* do not blossom every season too. Similarly, good fortunes do not smile on one in a serial manner. If they do, folks will not value them much.

**దాసొనిక** ॥ గెలువ మెటారిల్లు జేజిపోలె ననుకొనకుండ ;
ఓట ముంచు మెల్లన నోడకుఁ బడ్డ చిల్లులటు ;
మునుగీటఁజాలఁడు రెంచ తన గెలువమును దాను ;
తన మునుగీటులలో దాఁగియుండును జిల్లులే. 23

**మాటల విడఁదీత (పద విభాగము) :** గెలువము + ఎటారిల్లున్, జేజి పోలెన్ + అనుకొనకుండన్, ఓట, ముంచున్, మెల్లనన్ + ఓడకున్ + పడ్డ, చిల్లులు + అటు, మునుగీటన్ + చాలఁడు, రెంచ, తన, గెలువమును + తాను, తన, మునుగీటులలోన్, దాఁగి + ఉండును, చిల్లుల్ + ఏ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** గెలువము జేజి పోలెన్ అనుకొనకుండన్ ఎటారిల్లున్. ఓడకున్ పడ్డ చిల్లులు అటు ఓట మెల్లనన్ ముంచున్. రెంచ తన గెలువమును తాను మునుగీటన్ చాలఁడు. తన మునుగీటులలోన్ చిల్లుల్ + ఏ దాఁగి ఉండును.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గెలువము = విజయము ; ఎటారిల్లున్ = ప్రత్యక్షమగును ; జేజి పోలెన్ = జగన్మాత వలె ; అనుకొనకుండన్ = అనూహ్యముగా ; ఓట = ఓటమి ; ముంచున్ = ముంచెత్తును ; చిల్లులు + అటు = చిల్లుల వలె ; మునుగీటన్ + చాలఁడు = ప్రణాళిక వేయలేఁడు ; చిల్లుల్ + ఏ = లోపములే.

**లోవాఱిక (తాత్పర్యము) :** విజయము జగన్మాత వలె అనుకొనకుండ హఠాత్తుగా ప్రత్యక్షమగును. ఓటమి మటుకు — ఓడకు పడిన చిల్లుల వలె — నెమ్మది నెమ్మదిగా ముంచెత్తును. మనిషి తన గెలుపునకు తానే ప్రణాళికలు వేయలేఁడు. ఆతని ప్రణాళికలలో ఆతనికి తెలియకుండ లోపములే దాఁగి ఉండును.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** గెలుపోటములు దైవాధీనములు. ఓటమి ఒక్క దినములోనే ఎదురగును కాని అందుకు పూర్వ రంగము మట్టుకు చాల ముందునుండియే రూపు దిద్దుకొనుచుండు నని భావము.

SUMMARY : Victory makes its appearance all of a sudden like the Universal Mother. But defeat takes hold of one slowly like the perforations formed on a ship. Man cannot plan his own win. Several defects lie in his plans unbeknownst to himself.

**పస్పియ** ॥ వాయపుఁ బలుకొండు వాయరంబున, "మన్నింపు" మన్నది మంది యెఱుఁగనిది ;
అన్న కొలఁది యొరులంతుఁ జూచెదరు, తాము నొరుల మన్నింపు వేఁడుచున్. 24

**మాటల విడఁదీత (పద విభాగము) :** వాయపుం + పలుకు + ఒందు వాయరంబునన్ మన్నింపుము + అన్నది మంది + ఎఱుఁగనిది అన్న కొలఁది + ఒరుల + అంతున్ + చూచెదరు తామున్ + ఒరుల మన్నింపున్ వేఁడుచున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒందు మన్నింపుము అన్నది వాయరంబునన్ వాయపుం పలుకు. మంది ఎఱుఁగనిది. తామున్ ఒరుల మన్నింపున్ వేఁడుచున్ మన్నింపుము అన్న కొలఁది ఒరుల అంతున్ చూచెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వాయపుం + పలుకు = వ్యర్థ వచనము ; ఒందు = ఒకటి ; వాయరంబునన్ = భాషలో ; మన్నింపుము +

అన్నది = "క్షమింపుము" అన్న మాట ; మంది + ఎఱుఁగనిది = జనమునకు తెలియనిది ; ఒరుల = వేఱేవారి యొక్క ; తామున్ = తాము కూడ ; వేఁడుచున్ = కోరుకొనుచు.

**లోవాఱిక (తాత్పర్యము) :** మానవ భాషలో ఉన్న ఒకానొక పనికిమాలిన మాట "క్షమింపుము" అనునది. ఎందుకనఁగా అట్లు వేఁడినను ఎవఱును ఎవఱిని గానీ క్షమింపరు. మొదలు ఆ మాటకు అర్థమే జనమునకు తెలియదు. ఒకఱు ఎంతగా "క్షమించు" మని వేఁడినచో అంతగా వారిని జనము చావ బాదెదరు లేదా చంపెదరు. కాని ఆ చావబాదువారే – తమ జీవితములోని ఇతరేతర అంశములలో – తమను ఇతరులు సహింపవలె నని క్షమింప వలెనని ఆశించుచుందురు.

SUMMARY : The most useless phrase in the entire human language is – "**I beg your pardon / Pardon me**" because no one pardons anyone on this basis. The more one begs for pardon, the more folks thrash him. But the irony is – that the same thrashers want some others to bear with and pardon them in some other matters.

**గంగేరిక జంట ॥** "ఏనే వేల్ప నెటారుగా" నని, యెంచికొకటి గల్గు రెంచలోన ;
"కావళ గర్గళమ్ములకున్ దా, నావలివాఁడ" నను నమ్మికొదవు ; 25
"తన కంతయు న్నెఱుకయే, తాను, బొఱఁబడఁబో" నని గీఱనూను ;
మణేలాతము సేతఁ బడ్డపుడు, మంది తన కౌఁదల వాంచినపుడు. 26

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏన్ + ఏ, వేల్పన్ + ఎటారుగాన్ + అని, ఎంచిక + ఒకటి, కల్గున్, రెంచలోనన్, కావళ–గర్గళమ్ములకున్ + తాన్ + ఆవలి–వాఁడన్ + అను, నమ్మిక, ఒదవున్, తనకున్ + అంతయున్ + ఎఱుక + ఏ, తాను + పొఱఁబడన్ + పోను + అని, గీఱన్ + ఊనున్, మణే–లాతము + చేతన్ + పడ్డ + అపుడు, మంది, తనకున్ + ఔన్ + తలన్, వాంచిన + అపుదు.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** మణే–లాతము చేతన్ + పడ్డ అపుడు మంది తనకున్ ఔన్ + తలన్ వాంచిన అపుడు ఏన్ + ఏ వేల్పన్ + ఎటారుగాన్ అని ఎంచిక ఒకటి రెంచలోనన్ కల్గున్. కావళ–గర్గళమ్ములకున్ తాన్ ఆవలి–వాఁడన్ అను నమ్మిక ఒదవున్. తనకున్ అంతయున్ ఎఱుక + ఏ తాను పొఱఁబడన్ పోను అని గీఱన్ ఊనున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఏన్ + ఏ = నేనే ; వేల్పన్ = దేవుఁడను ; ఎటారుగాన్ = ప్రత్యక్షముగా ; ఎంచిక = అభిప్రాయము ; కల్గున్ = పుట్టును ; రెంచలోనన్ = మనిషిలో ; కావళ–గర్గళమ్ములకున్ = పాపపుణ్యములకు ; ఆవలి–వాఁడన్ = అతీతుఁడను ; ఒదవున్ = పుట్టును ; ఎఱుక + ఏ = తెలిసినదే ; గీఱన్ + ఊనున్ = గర్వమును వహించును ; మణే–లాతము = అధికార దండము ; చేతన్ = చేతిలో ; మంది = జనము ; ఔన్ + తలన్ = శిరస్సులను ; వాంచిన + అపుడు = వంచినప్పుడు.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనిషి చేతిలోనికి అధికార దండము వచ్చిపడినచో "తానే స్వయముగా భగవంతుఁడ" నను అభిప్రాయమొకటి ఆతనిలో కలుగును. తాను "పాపపుణ్యములకు అతీతుఁడ" నని నమ్మఁ దొడఁగును. తాను "సర్వజ్ఞుఁడ" ననియు, "ఎట్టి పరిస్థితులలోను తన నిర్ణయములలోఁ గానీ, చేతలలోఁ గానీ పొఱఁబాటన్నది ఉండనే ఉండ" దని తలఁచి విఱ్ఱవీఁగ సాఁగును.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** మణియము/ మణివము = అధికారము.

లాతము = రాజులు లేదా అధికారులు, లేదా సన్న్యాసులు పట్టుకొను కఱ్ఱ.

మణియ + లాతము = మణేలాతము = అధికార దండము.

అధికారమునకు గల మఱియొక అచ్చతెలుఁగు మాట 'రపము'.

SUMMARY : When a man starts weilding the mace of power, he thinks that he is verily the

God Himself. He begins to believe that he is above all the considerations of sin and spiritual merit. He deems himself to be omniscient and infallible under all circumstances, and falsely prides himself on the delusion.

**అవిగింగ జంట** ‖ ఎలఁదోఁట పులుగుల కెగ్గు రెంచల వలననె ;
చెఱువుఁగప్పల కౌఁ జేటు చిలువల వలననె ;
కార్కోన పిట్టల కల్గల మన్నిఁటి నుండి ;
కడలి మనీకులకుఁ గడిఁది అంతటి నుండి ; 27
చిఱు కొఱల్బయలన్ జిన్నముప్పులే కలుగు ;
పెను కొఱల్బయలన్ బెద్ద ముప్పులు తమ కగు. 28

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎలఁదోఁట–పులుగులకున్ + ఎగ్గు, రెంచల వలనన్ + ఎ, చెఱువు + కప్పలకున్ + ఔన్ + చేటు, చిలువల వలనన్ + ఎ, కార్ + కోన–పిట్టలకున్ + అల్గలము + అన్నిఁటి నుండి, కడలి–మనీకులకున్ + కడిఁది, అంతటి నుండి, చిఱు, కొఱల్ + బయలన్ + చిన్న, ముప్పుల్ + ఏ, కలుగున్, పెను, కొఱల్ + బయలన్ + పెద్ద, ముప్పులు, తమకున్ + అగున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎలఁదోఁట–పులుగులకున్ రెంచల వలనన్ + ఎ ఎగ్గు. చెఱువు + కప్పలకున్ చిలువల వలనన్ + ఎ చేటు ఔన్. కార్–కోన–పిట్టలకున్ అన్నిఁటి నుండి అల్గలము. కడలి–మనీకులకున్ అంతటి నుండి కడిఁది. చిఱు కొఱల్బయలన్ చిన్న ముప్పుల్ + ఏ కలుగున్. పెను కొఱల్బయలన్ పెద్ద ముప్పులు తమకున్ అగున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎలఁదోఁట–పులుగులకున్ = ఊరతోఁట (ఉద్యాన వనపు) పక్షులకు ; ఎగ్గు = హాని ; రెంచల వలనన్ + ఎ = మనుష్యుల వలననే ; చేటు = హాని ; చెఱువుఁగప్పలకున్ = చెఱువులోని కప్పలకు ; చిలువల వలననె = పాముల వలననె ; కార్ + కోన–పిట్టలకున్ = కారడవిలోని పక్షులకు ; అల్గలము = ఉపద్రవము ; కడలి–మనీకులకున్ = సముద్రజీవులకు ; కడిఁది = కష్టము ; అంతటి నుండి = అన్నివైపుల నుండి ; చిఱు = చిన్న ; కొఱల్ + బయలన్ = నివాస ప్రాంతము (habitat) నందు ; కలుగున్ = ఏర్పడును / పుట్టును ; పెను కొఱల్ + బయలన్ = పెద్ద నివాస ప్రాంతమునందు.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఊరతోఁటలోని పక్షులకు మనుష్యుల నుండియే ప్రమాదము. చెఱువులోని కప్పలకు పాముల నుండియే హాని. అడవిలోని పక్షులకు అన్నిఁటి నుండి ముప్పు. సముద్రజీవులకు అన్నివైపుల నుండి చేటు. అనఁగా – చిన్న నివాస ప్రాంతములలో చిన్న ముప్పులే ఉండును. పెద్ద నివాస ప్రాంతములలో పెద్ద ముప్పులు ఉండును.

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** నివాస ప్రాంతమును చూచుకొని గర్వింప వలదని భావము.

SUMMARY : The birds in a city-park face danger only from humans. The frogs in a tank have risk only from snakes. The birds in the woods are threatened by everyone. Marine animals encounter calamities from all sides. Thus big habitats present with major risks while the small ones, with minor risks. (No pride on one's dwelling).

**అవిగింగ** ‖| మఱుమాట వాక్రువ్వఁ , డొఱపాటకును దిగఁడు,
"తలవంపుఁబా లైతి" నని తలపోయువాఁడు ;
ఒడిగట్టు నుజ్జరిది దుమాల్ పాకాలునకున్ ;
వావాటు లొండోరుపేర్మి మెయి సాఁగుతన్. 29

**మాటల విడఁదీత (పద విభాగము) :** మఱు-మాటన్, వాక్రువ్వఁడు + ఒఅపాటకును, దిగఁడు, తలవంపు + పాలు + ఐతిన్ + అని, తలపోయు-వాఁడు, ఒడిగట్టున్, ఉజ్జ + అరిది, దుమాల్, పొకాలునకున్, వావాటుల్ + ఒండోరు-పేర్మి మెయిన్, సాఁగుతన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తలవంపు-పాలు ఐతిన్ + అని తలపోయు-వాఁడు మఱు-మాటన్ వాక్రువ్వఁడు. ఒఅపాటకును దిగఁడు. ఉజ్జ + అరిది దుమాల్ పొకాలునకున్ ఒడిగట్టున్. వావాటుల్ ఒండోరు-పేర్మి మెయిన్ సాఁగుతన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మఱు-మాటన్ = మఱొక మాటను (సమాధానమును) ; వాక్రువ్వఁడు = పలుకఁడు ; ఒఅపాటకును = చర్చకు కూడ ; తలవంపు + పాలు + ఐతిన్ = అవమానము పాలైతిని ; తలపోయు-వాఁడు = భావించువాఁడు ; ఒడిగట్టున్ = పాల్పడును ; ఉజ్జ + అరిది = ఊహాతీతమైన (అనుకొనని) ; దుమాల్ = సమూలమైన ; పొకాలునకున్ = నాశనమునకు ; వావాటుల్ = వాదనలు ; ఒండోరు-పేర్మి మెయిన్ = పరస్పర గౌరవముతో.

**లోవాఱిక (తాత్పర్యము) :** అవమానింపఁబడినట్లు అనుభూతిల్లినవాఁడు సమాధానము చెప్పఁడు. చర్చలోను పాల్గొనఁడు. అతఁడు మిన్నక వెడలిపోయి ఏదియో ఒక సమయములో తటాలున తిరిగి వచ్చును. ప్రతివాదుల మీఁదఁబడి అనూహ్యమైన సమూల సర్వనాశనమునకు ఒడిగట్టును. కనుక మనుష్యుల నడుమ వాదనలు పరస్పర గౌరవముతో సాఁగును గాక !

SUMMARY : The one who feels humiliated, does not reply to any question, but quietly quits the debate altogeter, only to return with a vengeance and wreak an unimaginable scale of havoc on the opponents. Therefore, may arguments be presented with mutual respect.

**మొల్ల ॥** కొన్నాళులే బ్రదుకు దోమల పిండు, మున్నూర్వుఱకుఁ ద్యాళ్ళంటించి చెండుఁ
దమ కొన్నాళుల బ్రదుకు కోసరము ; క్రించు రెంచలదియు నిదియే వైనము. 30

**మాటల విడఁదీత (పద విభాగము) :** కొన్ని + నాళుల్ + ఏ, బ్రదుకు, దోమల, పిండు, మూఁడు + నూర్వుఱకున్ + త్యాళ్ళు + అంటించి, చెండున్ + తమ, కొన్ని + నాళుల, బ్రదుకు కోసరము, క్రించు, రెంచలది + ఉన్ + ఇది + ఏ, వైనము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కొన్ని-నాళుల్ + ఏ బ్రదుకు దోమల పిండు తమ కొన్ని-నాళుల బ్రదుకు కోసరము మూఁడు నూర్వుఱకున్ + త్యాళ్ళు అంటించి చెండున్ క్రించు రెంచలది + ఉన్ ఇది + ఏ వైనము

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కొన్ని + నాళుల్ + ఏ = కొలఁది దినములే ; బ్రదుకు = బ్రదుకునట్టి ; పిండు = గుంపు ; మూఁడు + నూర్వుఱకున్ = మూఁడు వందల మందికి ; త్యాళ్ళు = రోగములను ; అంటించి = సంక్రమింపఁజేసి ; చెండున్ = నరుకును ; క్రించు రెంచలది + ఉన్ = హీన మానవులది కూడ ; వైనము = పద్ధతి.

**లోవాఱిక (తాత్పర్యము) :** దోమలు కొలఁది దినముల పాటే బ్రదికి యుండును. కాని ఈ లోపల కనీసము మూఁడువందల మందికి జబ్బు-లంటించి చంపును. లోకములో నీచ మానవుల ప్రవర్తన కూడ ఇటువంటిదే. (తాము బ్రదికి యున్న కొలఁది కాలములోనే వారు పెక్కండ్ర జీవితములను పాడు చేసెదరని భావము).

SUMMARY : Mosquitoes survive only for a few days during which they torture hundreds of people by transmitting diseases to them. Same is the case with mean people.

**దాసానిక ॥** వేదారఁ జేసికొందు రౌజాప తౌలముల నొకఱు ;
ఔజాపగ మార్చికొండ్రు వేదారల మఱియొకఱు ;
ఔజాప-వేదారలు దేనికదియె పలువుఱకు ;
తొలి వరాతివారె తడవు గుఱుతుండిపోయెదరు. 31

**మాటల విడఁదీత (పద విభాగము) :** వేదారన్ + చేసికొందురు + ఔజాప, తౌలములన్ + ఒకఱు, ఔజాపగన్ మార్చికొండ్రు, వేదారలన్, మఱి + ఒకఱు, ఔజాప–వేదారలు, దేనికిన్ + అది + ఎ, పలువుఱకున్, తొలి, వరాతి–వారె, తడవు, గుఱుతు + ఉండి–పోయెదరు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒకఱు ఔజాప తౌలములన్ వేదారన్ చేసికొందురు. మఱి ఒకఱు వేదారలన్ ఔజాపగన్ మార్చికొండ్రు. పలువుఱకున్ ఔజాప–వేదారలు దేనికిన్ అది + ఎ. తొలి వరాతి–వారె తడవు గుఱుతు ఉండి–పోయెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వేదారన్ = వ్యక్తిగతముగా ; ఔజాప తౌలములన్ = వృత్తిపరమైన సంబంధములను ; ఔజాపగన్ = వృత్తి పరముగా ; వేదారలన్ = వ్యక్తిగతములను (వ్యక్తిగత సంబంధములను) ; పలువుఱకున్ = చాలమందికి ; తొలి వరాతి–వారె = మొదటి శ్రేణికి చెందినవారే ; తడవు = చిరకాలము.

**లోవాటిక (తాత్పర్యము) :** వృత్తి చేయుచున్నప్పుడు ఏర్పడ్డ సంబంధములను కొందఱు వ్యక్తిగత సంబంధములుగా (స్నేహముగా) చేసికొం–దురు. మఱికొందరు వ్యక్తిగత సంబంధములను కూడ వృత్తిపరమైన (వాణిజ్యపరమైన) సంబంధములుగా మార్చుకొందురు. కాని ఎక్కువ మందికి ఈ రెండును దేనికదే తప్ప కలగాపులగము చేయరు. మొత్తము మీఁద వీరిలో మొదటి తరఁగదివారే చాలకాలము పాటు గుర్తుండి పోయెదరు.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** వరాయి = శ్రేణి / తరఁగది / కేడర్.

SUMMARY : Some convert professional relations into personal relations. Also there are some others who turn the latter into the former. However most are careful enough to not mix the both. Anyway, it is only the first category of people who are remembered for long.

**గోరంటిక ॥** రాదన్ను తనకున్న దనుకొన్నఁ జాలు, రెంచ యెంచును గావించఁ గావళాలు ;
వింత విడ్డూరముల కోర్కె లడిగేను ; అందియు ౦ పొందని నెఱివాటు లాడేను. 	32

**మాటల విడఁదీత (పద విభాగము) :** రా–దన్ను, తనకున్ + ఉన్నది + అనుకొన్నన్ + చాలున్, రెంచ + ఎంచును + కావించన్ + కావళాలు, వింత–విడ్డూరముల, కోర్కెల్ + అడిగేను, అంది + ఉన్, పొందని, నెఱివాటులు + ఆడేను.

**చఱమోలి (అన్వయ క్రమము) :** రా–దన్ను తనకున్ ఉన్నది అనుకొన్నన్ చాలున్ రెంచ కావళాలు కావించన్ ఎంచును. వింత–విడ్డూరముల కోర్కెల్ అడిగేను. అంది + ఉన్ పొందని నెఱివాటులు ఆడేను.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** రా–దన్ను = రాజ సమర్థన (ప్రభుత్వపు ప్రాపు) ; అనుకొన్నన్ = అనుకొన్నచో ; రెంచ = మనిషి ; ఎంచును = కోరును ; కావించన్ = చేయుటకు ; కావళాలు = పాపాలను ; అంది + ఉన్ పొందని = అతార్కికమైన ; నెఱివాటులు = వక్రవాదములను ; ఆడేను = పలికేను.

**లోవాటిక (తాత్పర్యము) :** "దొరతనమువారి వెన్నుదన్ను తనకున్నది" అను నమ్మకము మనిషిలో కలిగిన తరువాత ఆతఁడు అనేక పాపములకు ఒడిగట్టును. విచిత్రమైన కోరికలు కోరసాఁగును. తల–తోఁక లేని పిడివాదనలు లేవనెత్తఁ దొడంగును.

SUMMARY : Once man is assured of government's support, he will plan to commit several sins. He will begin to raise weird demands and resort to pure sophistry.

**గోరంటిక ॥** రెంగూర్మినిండుగుండెల పేరెంచలు, చెడులోనను మంచిని సేకరించెదరు ;
హేను-దామట్టుకంబుల సీరెంచలు మంచిలోనుండి చెడు వెలారించెదరు. 	33

**మాటల విడఁదీత (పద విభాగము) :** రెంచ + కూర్మి–నిండు–గుండెల, పేరెంచలు, చెడులోనను, మంచిని, సేకరించెదరు, హేను +

తామట్టుకంబుల, సీరెంచలు, మంచిలో–నుండి, చెడున్, వెలారించెదరు.

**చఊమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఊ మమ్మాటిక (లఘుటీక) :** రెంచ + కూర్మి–నిండు–గుండెల పేరెంచలు = మానవప్రేమతో నిండిన హృదయములు గల మహనీయులు ; హేను + తామట్టుకంబుల = అహంకార స్వార్థములు గల ; సీరెంచలు = దుష్ట మానవులు ; వెలారించెదరు = బయట పెట్టెదరు (Expose చేసెదరు).

**లోవాఊిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : The great souls whose hearts are filled with the love of humanity look for good even in the bad. The wicked with ego and selfishness expose the bad side of even a good thing / person.

**వాఊిద ॥** వేపి నుండి లోఁగరమును ౨ పిల్లి నుండి యొబ్బిడికము,
గ్రీబ నుండి గాసితనము వారువమున వడితనమును
గ్రచ్చుకొందు రిటు లొక్కొక కాకడయె మనీకులందు ;
క్రచ్చుకొందు రివి ౨ అన్ని యొక రెంచలోనె, యేమందు? 34

**మాటల విడఁదీత (పద విభాగము) :** వేపి నుండి, లోఁగరమును, పిల్లి నుండి + ఒబ్బిడికమున్, గ్రీబ నుండి, గాసితనమున్, వారువమునన్, వడితనమును, క్రచ్చుకొందురు + ఇటుల్ + ఒక్క + ఒక, కాకడ + ఎ, మనీకులందున్, క్రచ్చుకొందురు + ఇవి, అన్ని + ఒక, రెంచలోన్ + ఎ, ఏమి + అందున్.

**చఊమోలి (అన్వయ క్రమము) :** వేపి నుండి లోఁగరమును పిల్లి నుండి ఒబ్బిడికమున్ గ్రీబ నుండి గాసితనమున్ వారువమునన్ వడితనమును ఇటుల్ ఒక్క + ఒక కాకడ + ఎ మనీకులందున్ క్రచ్చుకొందురు. ఇవి అన్ని ఒక రెంచలోన్ + ఎ క్రచ్చుకొందురు. ఏమి అందున్?

**కుఊ మమ్మాటిక (లఘుటీక) :** వేపి నుండి= కుక్క నుండి ; లోఁగరమును = విధేయతను ; ఒబ్బిడికమున్ = శుభ్రతను ; గ్రీబ నుండి = ఎద్దు నుండి ; గాసితనమున్ = శ్రమశీలమును ; వారువమునన్ = గుఱ్ఱమునందు ; వడితనమును = వేగమును ; క్రచ్చుకొందురు = ఆశించెదరు ; ఇటుల్ = ఈ విధముగా ; కాకడ + ఎ = తత్త్వమునే ; మనీకులందున్ = జీవులలో ; రెంచలోన్ + ఎ = మనిషిలోనే.

**లోవాఊిక (తాత్పర్యము) :** జనము కుక్క నుండి విశ్వాసమును, పిల్లి నుండి శుభ్రతను, ఎద్దు నుండి శ్రమశీలమును (కష్టపడి పనిచేయు తత్త్వమును), గుఱ్ఱము నుండి వేగమును– ఈ విధముగా వేర్వేఱు జీవుల నుండి వేర్వేఱు లక్షణములను ఆశించెదరు. కాని "ఈ అన్ని లక్షణములను ఒక్క మనిషిలోనే ఉండవలె" నని ఆశించెదరు. ఈ వెఱ్ఱికి నేను ఏమనఁగలను?

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** జనమునకు బొత్తుగా లోపములే లేని పరిపూర్ణ వ్యక్తిత్వములు కావలె. అది సాధ్యపడు విషయము కాదని భావము.

SUMMARY : Folks expect different attributes from different beings, like gratitude from the dog, cleanliness from the cat, laboriousness from the bull and speed from the horse. However, they expect all these qualities from a single human being. What I can say on this foolishness?

*(Folks expect perfection from the individual which is impossible and unrealistic).*

**అవిగింగ ॥** పరి దూఊడెద "రొకఊండు ముల్చ" యనుచున్,

బన్నినది పన్నినట్లుగా జరుగని తఱిన్ ;
అందఱు జాణలే ౨ అనుకొన్న దగు నెడలన్ ;
అలవి యెవటి కెఱిఁగి చెప్ప ముదురు-ముల్చలన్. 35

**మాటల విడఁదీత (పద విభాగము) :** పరి, దూఱు + ఆడెదర్ + ఒకఱుండు, ముల్చ + అనుచున్ + పన్నినది, పన్నిన + అట్లుగాన్, జరుగని, తఱిన్, అందఱున్, జాణల్ + ఏ, అనుకొన్నది + అగు + ఎడలన్, అలవి + ఎవటికిన్ + ఎఱిఁగి, చెప్పన్, ముదురు–ముల్చలన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పన్నినది పన్నిన అట్లుగాన్ జరుగని తఱిన్ ఒకఱుండు ముల్చ అనుచున్ పరి దూఱు ఆడెదర్. అనుకొన్నది అగు ఎడలన్ అందఱున్ జాణల్ + ఏ. ముదురు–ముల్చలన్ ఎఱిఁగి చెప్పన్ ఎవటికిన్ అలవి.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పరి = జనము ; దూఱు + ఆడెదర్ = నిందించెదరు ; ఒకఱుండు = ఒకఁడు ; ముల్చ = మూఢుఁడు ; పన్నినది = ఎత్తు (ప్రణాళిక) వేసినది ; జరుగని తఱిన్ = జరుగనప్పుడు ; జాణల్ + ఏ = నిపుణులే ; అగు + ఎడలన్ = అయినచో ; అలవి = శక్యము ; ఎఱిఁగి చెప్పన్ = తెలిసికొని చెప్పుటకు ; ముదురు–ముల్చలన్ = ప్రౌఢులను, మూఢులను (పండిత–పామరులను).

**లోవాఱిక (తాత్పర్యము) :** అనుకొన్నది అనుకొన్నట్లుగా జరుగనిచో (జరిపించలేనిచో) జనము మనిషిని "మూఢుఁడు, అసమర్థుఁడు" అని నిందించెదరు. కాని లోకములో అన్నియు అనుకొన్నట్లుగా అయినచో అందఱును జాణలే కదా! అటువంటప్పుడు ప్రౌఢులెవరో, మూఢులెవరో ఎవఱు సరిగా అర్థము చేసికొని చెప్పఁగలరు?

SUMMARY : Folks call someone a nincompoop and incompetent when he fails to have some thing done on the expected lines. But then, would everyone not become a wise and competent one if every initative in the world turns out perfect as expected? Then who can know and tell the foolish from the wise?

**దాసానిక॥** చెప్పి చూచిన వినరు, చేయెత్తి చూపిన వినరు ;
జరిమి నుండి నేరికలేవియు గఱువ నొల్లరు ;
చెంపపెట్టుల కులుకరు, కత్తివ్రేటులకుఁ దప్ప ;
పరి వంకటి దూఱాడెద రెల్ల పొకాల్పులకున్. 36

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెప్పి, చూచినన్, వినరు, చే + ఎత్తి, చూపినన్. వినరు, జరిమి నుండి నేరికల్ + ఏవి + ఉన్, గఱువన్, + ఒల్లరు, చెంప–పెట్టులకున్ + ఉలుకరు, కత్తి–వ్రేటులకున్ + తప్పన్, పరి, వంకటిన్, దూఱు + ఆడెదర్ + ఎల్ల, పొకాల్పులకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చెప్పి చూచినన్ వినరు. చే ఎత్తి చూపినన్ వినరు. జరిమి నుండి నేరికల్ ఏవి + ఉన్ గఱువన్ ఒల్లరు. కత్తి–వ్రేటులకున్ తప్పన్ చెంప–పెట్టులకున్ ఉలుకరు. ఎల్ల పొకాల్పులకున్ పరి వంకటిన్ దూఱు ఆడెదర్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** జరిమి నుండి = చరిత్ర నుండి ; నేరికల్ + ఏవి + ఉన్ = పాఠములేవియు ; గఱువన్ + ఒల్లరు = నేర్చు కొనుటకు ఇష్టపడరు ; ఉలుకరు = ఉలిక్కిపడరు ; పరి = జనము ; వంకటిన్ = భగవంతుని ; దూఱు + ఆడెదర్ = నిందించెదరు ; ఎల్ల పొకాల్పులకున్ = అన్ని నాశనములకును.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఎవరైన వచ్చి ఎలుగెత్తి చెప్పినను జనము వినరు. చేయెత్తి అంతకు ముందటి మచ్చుతునకలను చూపినను వినరు. చరిత్రము నుండి గుణపాఠములేవియు నేర్చుకొనుటకు ఒప్పుకొనరు. కాని తమ నడుమ జరుగుచున్న అన్ని వినాశనములకును, విధ్వంస ములకును భగవంతునే కారకుఁడుగా చేసి నిందించెదరు.

**పైమాల విడఁబఱ్చు (విశేష వివరణము) :** "చెడు జరుగకుండ నివారించుటకై తమ చేతులలో ఉన్న పనులను తాము చేయక ఊరక దేవుని

తిట్టనేల?' అని కవిభావము.

SUMMARY : Folks do not heed oral precepts. Nor do they pay attention to the real-life examples when shown. They are not willing to learn from the documented history either. But they hold God responsible for all the damage occurring around them.

*(Why blame God without doing the things on hand to avert a damage?)*

**దాసానిక మున్నంగి** || చెట్టునీడ నున్నప్పుడు "చెన్ను పాకయె" అనున్ ;
కట్టిన మీఁదట "నయ్యది కావలె మేడ" అనున్ ;
పొట్టకు లేనపు డాపోవు నొక్క సాదకమున ;
నిండుదిండి కలుగన్ మెండుగ వంకలు వెట్టున్ ; 37
చెలులు లెంబియు మాటచెల్లుబాటును మొల్లమున్
జేకూడఁగఁ గ్రచ్చుకొనున్ జేపట్టఁగ రపమున్ ;
రపము సిక్కఁ "దన కెదురాడరా దెవ్వఁడు" ననున్ ;
ప్రోలిమేర యేది రెంగ్రచ్చుపోఁతుతనమునకు? 38
చిల్లికుండ యోళము ; చల్లాఅని చిచ్చుల్లము ;
కడమాల్ సుమీ కారు ; కలిమైకలిది మోపారు. 39

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెట్టు–నీడన్ + ఉన్న + అప్పుడు, చెన్ను పాక + ఎ, అనున్, కట్టిన–మీఁదటన్ + ఆ + అది, కావలెన్, మేడ, అనున్, పొట్టకున్, లేని + అపుడు + ఆపోవున్ + ఒక్క, సాదకమునన్, నిండు + తిండి, కలుగన్, మెండుగన్, వంకలు + పెట్టున్, చెలులున్, లెంబి + ఉన్, మాట–చెల్లుబాటును, మొల్లమున్ + చేకూడఁగన్ + క్రచ్చుకొనున్ + చేపట్టఁగన్, రపమున్, రపము + చిక్కన్ + తనకున్ + ఎదురు + ఆడరాదు + ఎవ్వఁడున్ + అనున్, ప్రోలి–మేర + ఏది, రెంచ + క్రచ్చుపోఁతుతనమునకున్, చిల్లి–కుండ + ఓళము, చల్ల + వాఅని, చిచ్చు –+ ఉల్లము, కడమాల్, సుమీ, కారు, కలిమి + ఐకలిది, మోపారు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చెట్టు–నీడన్ ఉన్న అప్పుడు చెన్ను పాక + ఎ అనున్ కట్టిన–మీఁదటన్ ఆ + అది కావలెన్ మేడ అనున్ పొట్టకున్ లేని అపుడు ఒక్క సాదకమునన్ ఆపోవున్. నిండు తిండి కలుగన్ మెండుగన్ వంకలు పెట్టున్. చెలులున్ లెంబి + ఉన్ మాట–చెల్లుబాటును మొల్లమున్ చేకూడఁగన్ రపమున్ చేపట్టఁగన్ క్రచ్చుకొనున్. రపము చిక్కన్ ఎవ్వఁడున్ తనకున్ ఎదురు ఆడరాదు అనున్. రెంచ–క్రచ్చుపోఁతుతనమునకున్ ప్రోలి–మేర ఏది? ఓళము చిల్లి–కుండ. ఉల్లము చల్ల + వాఅని చిచ్చు. కారు కడమాల్ సుమీ. కలిమి + ఐకలిది మోపారు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చెన్ను = అందమైనది ; పాక + ఎ = గుడిసెయే ; ఆపోవున్ = తృప్తిపడును ; సాదకమునన్ = ఆదరువుతో ; మెండుగన్ = దండిగా ; వంకలు + పెట్టున్ = లోపములు వెదకును ; చెలులున్ = స్నేహితులును ; లెంబి + ఉన్ = కుటుంబమును ; మాట–చెల్లుబాటును = పరపతియు ; మొల్లమున్ = ధనము కూడ ; చేకూడఁగన్ = చేకూడిన తరువాత ; క్రచ్చుకొనున్ = ఆశించును ; రపమున్ = అధికారమును ; చిక్కన్ = దొరుకఁగా ; ప్రోలి–మేర = సరిహద్దు ; రెంచ + క్రచ్చుపోఁతుతనమునకున్ = మనిషి యొక్క ఆశ పోఁతుతనమునకు ; ఓళము = శరీరము ; చిచ్చు = అగ్ని ; ఉల్లము = మనస్సు ; కడమాల్ = అనంతము ; సుమీ = చూడుమీ ; కారు = కాలము ; కలిమి + ఐకలిది = ప్రకృతి యొక్క సంపద ; మోపారు = బృహత్తరము.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనిషి చెట్టు క్రింద ఉండవలసి వచ్చినప్పుడు "గుడిసె కూడ బాగుగనే ఉండును" అని పలుకును. ఆ గుడిసె కట్టిన తరువాత "అది మేడ అయినచో బాగుండు" ననును. కడుపునకు లేనప్పుడు ఒక్క ఆదరువు వేసికొని తృప్తి చెందును. పూర్ణ భోజనము

దొరుకఁగా అందులో లోపములు పట్టును. ధనము, కుటుంబము, స్నేహితులు, పరపతి ఏర్పడిన తరువాత అధికారమును చేపట్ట వాంఛించును. దానిని చేపట్టిన పిదప "నాకెవఱును ఎదురు మాటాడరా" దని శాసించును. ఇట్లు మనిషి ఆశపోఁతుతనమునకు హద్దే లేదు. తన శరీర మొక చిల్లికుండ వంటిది. తన మనస్సు ఆరని చిచ్చు వంటిది. కాలమేమో అనంతము. ప్రకృతిలోని సంపదయో, బృహత్తరము. ఎంత అనుభవించినను ఏమాత్రము అనుభవింపఁగలరు?

SUMMARY : While staying under a tree, man appreciates the beauty of a hut too. Once it was built, he wishes for a mansion. When he cannot afford proper food, he gets content with a single item. But he faults full meals when they are available. After he acquired money, family, friends and influence – he wishes for political power. Once he attained it, he asks everyone not to talk back to him. Thus, man's greed is insatiable. His body is like a pot with a hole that can never be filled in. His mind is like an ever-raging fire which cannot be put out. Time is infinite and the Nature's wealth, vast. Howmuch can one enjoy of all that, no matter how one tries?

**పస్నియ** ॥ ఎత్తి చూపకుము పెద్దల బైజన్ ; నోరెత్తి సవరింపకుము వలయక-
మెంతయో లేక వారి తప్పిదము, లడిసున్నితము సుమీ వారు తఱచు. 40

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎత్తి, చూపకుము, పెద్దల, బైజన్, నోరు + ఎత్తి, సవరింపకుము, వలయకము + ఎంతయో, లేక, వారి, తప్పిదముల్ + అడిసున్నితము, సుమీ, వారు, తఱచు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పెద్దల బైజన్ ఎత్తి చూపకుము. వలయకము ఎంతయో లేక వారి తప్పిదముల్ నోరు ఎత్తి సవరింపకుము. వారు తఱచు అడిసున్నితము సుమీ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** బైజన్ = అజ్ఞానమును ; వలయకము = అవసరము ; ఎంతయో లేక = ఎక్కువగా లేనిచో ; అడిసున్నితము = అత్యంత మృదువు ; సుమీ = చూడుమీ.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Do not point out elders' ignorance on something. Do not be vocal in correcting their lapses unless it is urgently called for, since they are oftentimes way sensitive.

**రాల్మిక జంట** ॥ బిస్తలిగా బయటఁబడును, మన తామట్టుమాలికలు,
ఒరులకంటెను మన కున్న, వెసుల్బాటు లొకటి-రెంటిఁ 41
దారుములు నొకటి-రెంటిని, మణియంబులు నొకటి-రెంటి
నెడఁబాయవలసినప్పుడు, నెల్సాటులమైనప్పుడు. 42

**మాటల విడఁదీత (పద విభాగము) :** బిస్తలిగాన్, బయటన్ + పడును, మన, తామట్టుమాలికలు, ఒరులకంటెను, మనకున్ + ఉన్న, వెసుల్బాటుల్ + ఒకటి-రెంటిన్, తారుములున్ + ఒకటి-రెంటిని, మణియంబులున్ + ఒకటి-రెంటిన్ + ఎడన్ + పాయన్ + వలసిన + అప్పుడు, ఎల్సాటులము + ఐనప్పుడు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒరులకంటెను మనకున్ ఉన్న వెసుల్బాటుల్ ఒకటి-రెంటిన్ తారుములున్ ఒకటి-రెంటిని మణియంబు

లున్ ఒకటి-రెంటిన్ ఎడన్ పాయన్ వలసినప్పుడు ఎల్సాటులము ఐనప్పుడు మన తామట్టుమాలికలు బిస్తలిగాన్ బయటన్ పడును.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** బిస్తలిగాన్ = నగ్నముగా ; తామట్టుమాలికలు = నిఃస్వార్థతలు ; ఒరులకంటెను = వేఱేవారి కంటెను ; వెసుల్బాటుల్ = సౌకర్యములు ; తారుములున్ = హక్కులను ; మణియంబులున్ = అధికారములు కూడ ; ఎడన్ + పాయన్ + వలసిన + అప్పుడు = వీడవలసి వచ్చినచో ; ఎల్సాటులము = అందఱితోను సమానులము.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఇతరుల కంటెను మనకు హెచ్చుగా ఉన్న ఒకటి-రెండు సౌకర్యములను (లేదా ప్రస్వామ్యములను లేదా మినహా-యింపులను), అట్లే ఒకటి-రెండు హక్కులను, అట్లే ఒకటి-రెండు అధికారములను వదులుకొనవలసి వచ్చినప్పుడు, అందుగుండా మనము మిగితా అందఱితోను సమానులము కావలసి వచ్చినప్పుడు – మనము ఏపాటి నిఃస్వార్థపరులమన్నది నగ్నముగా బయటపడును.

**పైమాల విడఁబర్సు (విశేష వివరణము) :** (౧) తారిమి/ తార్మి = హక్కు.

(౨) వెసుల్బాటు/ వెసులుబాటు = ప్రస్వామ్యము (a provision or privilege).

(౩) ఎల్లఱితో సరిసాటి (అందఱితోను సమానము) = ఎల్లసాటి/ ఎలసాటి/ ఎల్సాటి.

SUMMARY : Our true sense of selflessness nakedly comes out in the open when we have to give up a special privilege or two, a special right or two and a special power or two and thereby become equal to everyone else.

**గోరంటిక జంట** ॥ కల తాణతాళీకమ్ములఁ సాఁబాలు, బలువాడి వమ్ముపఱచెదరు వెలిబైలుఁ
గూర్చి తలపోయుచు మెచ్చింప దానిన్, దనుపన్ రేఁబవలు నగచాట్లు వడుచున్ ; 43
అది మాని తాము తాముగా ఠవణించి, మేల్తనమయ్యెదరు పోను ౨ పోను పరికి ;
ఉప్పింకొకటయిన నుండలే మొలవునన్ ; మారదది మరిగించిన మండించినన్. 44

**మాటల విడఁదీత (పద విభాగము) :** కల, తాణ-తాళీకమ్ములన్, సగం-పాలు, బలు-వాడి, వమ్ము-పఱచెదరు, వెలిబైలున్ + కూర్చి, తలపోయుచున్, మెచ్చింపన్, దానిన్ + తనుపన్, రేయి + పవలున్ + అగచాట్లు + పడుచున్, అది, మాని, తాము, తాముగాన్, ఠవణించి, మేల్తనము + అయ్యెదరు, పోనుపోను, పరికిన్, ఉప్పు + ఇంకొకటి + అయినన్ + ఉండలేము + ఒలవునన్, మారదు + అది, మరిగించినన్, మండించినన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వెలిబైలున్ కూర్చి తలపోయుచున్ మెచ్చింపన్ దానిన్ తనుపన్ రేయి-పవలున్ అగచాట్లు పడుచున్ కల తాణ-తాళీకమ్ములన్ సగం-పాలు బలు-వాడి వమ్ము-పఱచెదరు. అది మాని తాము తాముగాన్ ఠవణించి పోనుపోను పరికిన్ మేల్తనము అయ్యెదరు. ఉప్పు ఇంకొకటి అయినన్ ఒలవునన్ ఉండలేము. మరిగించినన్ మండించినన్ అది మారదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కల = ఉన్నటువంటి ; తాణ-తాళీకమ్ములన్ = ఓపిక మఱియు సమర్థతలో ; సగం-పాలు = సగభాగమును ; బలు-వాడి = మిక్కిలి ఉపయోగించి ; వమ్ము-పఱచెదరు = విఫలము (దండుగ) చేసెదరు ; వెలిబైలున్ + కూర్చి = సంఘమును గుఱించి ; తలపోయుచున్ = ఆలోచించుచు ; మెచ్చింపన్ = మెప్పించుటకు ; తనుపన్ = తృప్తిపఱచుటకు ; రేయి + పవలున్ = అహర్నిశమును ; అగచాట్లు + పడుచున్ = కష్టములు పడుచు ; అది = అట్లు చేయుట ; మాని = మానివేసి ; ఠవణించి = వర్తిల్లి/ నడచుకొని ; మేల్తనము + అయ్యెదరు = ప్రయోజకులయ్యెదరు ; పోనుపోను = క్రమ క్రమముగా ; పరికిన్ = ప్రజకు ; అయినన్ = అయినచో/ మారినచో ; ఉండలేము = బ్రదుకలేము ; ఒలవునన్ = ప్రపంచములో.

**లోవాఱిక (తాత్పర్యము) :** జనులు ఎల్లప్పుడును సంఘమును గుఱించియే ఆలోచించుచు దాని ప్రశంసలు పొందుటకై రేఁబవళ్లు నానా గడ్డి కఱచుచు తమకు వాస్తవముగా ఉన్న సహన-సామర్థ్యములలో సగము వృథా చేసెదరు. "సంఘమును మెప్పించుట" అను ఈ పనికిమా-లిన ప్రయత్నమునకు స్వస్తి చెప్పి తాము తాముగానే మిగిలినచో కాలక్రమమున అప్రయత్నముగానే వారు సంఘమునకు ప్రయోజనకారు-

లయ్యెదరు. ఎవఱు వారుగానే ఉండుట మంచిది. ఉప్పును మరఁగించినను, కాల్చినను అది తన ఉప్పదనమును కోల్పోవదు. అందువలననే మనము బ్రదుకఁగల్గుచున్నాము. అదే ఉప్పు పంచదారతో పోటీపడి తాను కూడ తీయగా మారినచో మనమీ ప్రపంచములో బ్రదుకలేము.

**పైమాల విడఁబఱ్పు (విశేష వివరణము) :** తాణ– తాళీకములు = ఈ రెండు మాటలును "తాళు" (ఓర్చుకొను) అను తెలుఁగు క్రియాదాతువు నుండియే వచ్చినవి. కాని తరువాతి కాలములో ఎవఱో తాణను త్రాణ అని మార్చిరి. అంతట అది – తనకు ఏ మాత్రమును సంబంధము లేని సంస్కృత శబ్దమైన త్రాణముతో ముడిపెట్టఁబడసాఁగినది. కాని సంస్కృత త్రాణము – త్రాఞ్ అను ధాతువు నుండి వచ్చినది. దానికి "కాఁపాడుట" తప్ప వేఱే తెల్లమేమియు లేదు. తెలుఁగు తాణకు ఓర్చుకొనుట అని అర్థము.

SUMMARY : Folks waste half of their patience and potential by constantly thinking of the society and struggling the hard way to win its appeciation. They will truly be useful to the society if they quit that conscious attempt and remain just what they are originally. Salt does not lose its saltiness even if it is burnt or boiled and that's why we are able to survive. We cannot live in this world if it becomes something else (say, sweet like sugar).

**పస్పియ** ॥ మెలపులు దరిఁగూర్చు నైనవారిని ; నవపులు కలిపెడుఁ గానివారిని ;
వెల్లువఁ గొట్టుక పోవుచుండంగఁ , వెంటువుఁ జిలువ యెక్కు నొకే దుంగ. 45

**మాటల విడఁదీత (పద విభాగము) :** మెలపులు, దరిన్ + కూర్చున్ + ఐన–వారిని, నవపులు, కలిపెడున్ + కాని–వారిని, వెల్లువన్ + కొట్టుక, పోవుచున్ + ఉండంగన్, వెంటువున్ + చిలువ, ఎక్కున్ + ఒకే, దుంగన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఐన–వారిని మెలపులు దరిన్ కూర్చున్. కాని–వారిని నవపులు కలిపెడున్. వెల్లువన్ కొట్టుక పోవుచున్ ఉండంగన్ వెంటువున్ చిలువ ఒకే దుంగన్ ఎక్కున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మెలపులు = సుఖములు ; దరిన్ + కూర్చున్ = దగ్గకు చేర్చును ; + ఐన–వారిని = ఇంతకు ముందే చుట్ట ఱికమును, స్నేహమును గలవారిని ; నవపులు = కష్టములు ; కలిపెడున్ = కలుపును ; కాని–వారిని = ఒకఱికొకఱు ఏమియు కానివారిని ; వెల్లువన్ = వఱదలో ; వెంటువున్ = ముంగిస కూడ ; చిలువ = పాము ; ఒకే దుంగన్ = ఒకే మ్రాని మొద్దును.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఐనవారు సుఖములప్పుడు మటుకే కలిసి యుందురు. కాని ఆపదలు/ కష్టములు – ఒకఱికొకఱు ఏమియు కాని వారిని సైతము కలుపును. వఱదలో కొట్టుక పోవుచున్నప్పుడు సాధారణముగాను, సహజముగాను పరస్పర జాతివిరోధులైన పామును, ముంగిసయు ఒకే చెట్టుమొద్దు మీఁద ఎక్కవచ్చును.

SUMMARY : Good times unite friends and relations. However tough times unite even those who are just nobodies to each other. The snake and mongoose may board a single tree trunk while getting washed away in the flood.

**వెల్మిరిక మున్నంగి** ॥ కనులారఁ గన్నది తరువాత, నెనపు నెమరునఁ బలుచఁబాఱున్ ;
నెనపైనది నుడికానువునన్, వినుచుడు మఱియుఁ బలుచఁబాఱున్ ; 46
వినిచిన దాని వ్రాల పొడలో, జొనుప నింకను బలుచబాఱున్ ;
వ్రాసినది సదువునపు డక్కడ, వ్రాలున దొకటి తెలియున దొకటి ; 47
కల్గిన చదువులు వ్రాయికలున్, నాల్గవ వెరసి మార్చిల్లికలు. 48

**మాటల విడఁదీత (పద విభాగము) :** కనులు + ఆరన్ + కన్నది, తరువాతన్, నెనపు–నెమరునన్ + పలుచఁబాఱున్, నెనపు + ఐనది, నుడి–కానువునన్, వినుచుడున్, మఱి + ఉన్, + పలుచఁబాఱున్, వినిచిన–దానిన్, వ్రాల, పొడలోన్ + చొనుపన్ + ఇంకను + పలుచబాఱున్, వ్రాసినది + చదువు + అపుడు + అక్కడన్, వ్రాలునది + ఒకటి, తెలియునది + ఒకటి, కల్గిన, చదువులున్, వ్రాయికలున్, నాల్గవ, వెరసి, మార్బిల్లికలు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కనులు + ఆరన్ = ప్రత్యక్షముగా ; కన్నది = చూచిన విషయము ; నెనపు–నెమరునన్ = జ్ఞాపకములను నెమరు వేసికొను క్రమములో ; నెనపు + ఐనది = గుర్తుకు వచ్చిన విషయము ; నుడి–కానువునన్ = భాష రూపములో ; వినుచుడున్ = వినిపింపఁగా ; మఱి + ఉన్ = ఇంకను ; వ్రాల పొడలోన్ = అక్షర రూపములో ; చొనుపన్ = ప్రవేశపెట్టఁగా ; వ్రాలునది = అలరారు నది/ పడునది ; కల్గిన = ఉండిన ; వ్రాయికలున్ = రచనలును ; నాల్గవ వెరసి = నాలుఁగు వరుస–సంఖ్య గల ; మార్బిల్లికలు = ప్రతిబింబములు.

**లోవాఱిక (తాత్పర్యము) :** కట్టెదుట చూచిన విషయము కూడ దానిని జ్ఞాపకము చేసికొనునప్పుడు కొంత మఱుఁగగును. జ్ఞాపకము వచ్చిన విషయము కూడ మాటలలో పెట్టి చెప్పినప్పుడు ఇంకొంత మఱుఁగుపడును. చెప్పిన దానిని అక్షరరూపములో పెట్టినప్పుడు ఆ సమాచా–రము మఱింత మసక యగును. వ్రాసినప్పుడు వ్రాతరి అనుకొన్నదొకటిగాను, చదువరి ఆకళించుకొనునది మఱియొకటిగాను మారును. ఈ విధముగా జ్ఞాన–విజ్ఞాన–సమాచారములన్నియు బయటికి వచ్చుతఱికి తమ స్వరూపములనే కోల్పోవును. అందుచేత మన విద్యలును, వ్రాతలును నాల్గవ సంఖ్య గల ప్రతిఫలనములే. అపార్థమునకు గుఱి అగుటయే వీటి అంతిమ గతి.

SUMMARY : What one has seen with his own eyes may get blurry while recalling it. Even the remembered thing may get further hazy while putting it in words. The thing described in words may become even more indistinct when reduced to writing. The writer may intend something, but the reader may read another into it. Thus, all knowledge and information lose their prestine form by the time they are made public. They are just the 4th medium reflections ripe for misunderstandings.

**వాణిద** ‖ దాతీవు మ్రైమాపునన్ దానగుఁ దండ్రి పెద్దన్న ;
ఎలమినేస్తమగుఁ గొడుకు ౧ ఎగోదరియై కాంచరులకు ;
హెత్తరపుఁ గ్రేణికి నెచ్చెలి యెదిగెనేన్ గ్రోవానే ;
కడతేఱన్ మార్తుండును గాదిలి చెలికిన్ దీటే. 49

**మాటల విడఁదీత (పద విభాగము) :** దాతీవు–మ్రైమాపునన్ + తాన్ + అగున్ + తండ్రి, పెద్ద + అన్న, ఎలమి–నేస్తము + అగున్ + కొడుకు, ఎగోదరి + ఐ, కాంచరులకున్, హెత్తరపుం + క్రేణికిన్, నెచ్చెలి + ఎదిగెన్ + ఏనిన్ + క్రోవాన్ + ఏ, కడతేఱన్, మార్తుండును + కాదిలి, చెలికిన్, దీటే.

**చఱమోలి (అన్వయ క్రమము) :** దాతీవు–మ్రైమాపునన్ పెద్ద అన్న తాన్ తండ్రి అగున్. కొడుకు ఎగోదరి ఐ కాంచరులకున్ ఎలమి–నేస్తము అగున్. నెచ్చెలి హెత్తరపుం క్రేణికిన్ ఎదిగెన్ ఏనిన్ క్రోవాన్ + ఏ. మార్తుండును కడతేఱన్ కాదిలి చెలికిన్ దీటే.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** దాతీవు–మ్రైమాపునన్ = జన్మదాత యొక్క దేహాంతమునందు (తండ్రి చనిపోయిన తరువాత) ; తాన్ = తానే ; ఎలమి–నేస్తము = ప్రియ మిత్రుఁడు ; ఎగోదరి + ఐ = వయోజనుఁడై (పెద్దవాఁడై) ; కాంచరులకున్ = తల్లిదండ్రులకు ; హెత్త

రపుం + క్రేణికిన్ = ఉన్నత పదమునకు (పదవికి) ; నెచ్చెలి = ప్రాణ స్నేహితుఁడు ; ఎదిగెన్ + ఏనిన్ = ఎదిగినచో ; క్రోవాన్ + ఏ = ఆగంతుకుఁడే (క్రొత్తవాఁడే) ; కడతేఱన్ = చనిపోవఁగా (చనిపోయినచో) ; మార్తుండును = శత్రువు కూడ ; కాదిలి చెలికిన్ = ప్రియ స్నేహితునితో ; దీటే = సమానమే.

**లోవాతిక (తాత్పర్యము) :** తండ్రి చనిపోయిన పిదప పెద్దన్న (ఆతని పెద్దకొడుకు) తానే ఆ కుటుంబమునకు తండ్రి (వంటివాఁడు) అగును. వయస్సు వచ్చిన తరువాత కన్నకొడుకు సైతము తల్లిదండ్రులకు ప్రియ స్నేహితునితో సముఁడే. ఉన్నత పదమునకు చేరిన ప్రాణ స్నేహితుఁడు కూడ అపరిచితునితో సరిసాటియే. చనిపోయిన శత్రువు ప్రియ స్నేహితునికి దీటే. (ఆతఁడింక ఏ కీడును తలపెట్టలేఁడు గనుక).

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** (౧) మానవ సంబంధములు ఎల్లప్పుడును ఒక్కలాగుననే ఉండవు. ఆయా మార్పులను బట్టి మనుష్యులతో మనము మెలఁగవలసిన తీరును కూడ మార్చుకొనక తప్పదని భావము. కాదని మొండికేసి అంతకు ముందటి వలెనె మెలఁగినచో కడగండ్లును, మమస్తాపమును తప్పవు.

(౨) దాయు = పుట్టుట ; దాత(ము) = పుట్టుక ; దాత + ఈవు = **దాతీవు** = పుట్టుకను ఇచ్చువాఁడు = తండ్రి.

SUMMARY : The eldest son becomes the virtual father (head) of the family after his father's demise. For the parents, their son is as good as a bosom friend subsequent to his attaining adulthood. A bosom friend too becomes a veritable stranger upon his elevation to a high office. An enemy who has expired is equal to a bosom friend (since he will no longer be able to harm us).

*(Human relations would not be static, as human nature is not static. One needs to update oneself in keeping with the emergent changes).*

**దాసానిక॥** క్రాఁక మీఁద నున్న కట్టి కరకంటిపైఁ బడిన
దెబ్బఁ దేలు వంపుఁ దీయలేము చల్లారఁగా ;
కనలెసరేఁక-యొడికారముల నన్నవి నేటినవి
కావించినవియు మార్వనరిది వెనుగైకొనన్. 50

**మాటల విడఁదీత (పద విభాగము) :** క్రాఁక మీఁదన్ + ఉన్న, కట్టి, కరకంటిపైన్ + పడిన, దెబ్బన్ + తేలు, వంపున్ + తీయన్ + లేము, చల్ల + వారఁగాన్, కనల్ + ఎసరేఁక–ఒడికారములన్ + అన్నవి, నేటినవి, కావించినవి + ఉన్, మార్వన్ + అరిది, వెను–గైకొనన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** క్రాఁక మీఁదన్ ఉన్న కట్టి కరకంటిపైన్ పడిన దెబ్బన్ + తేలు వంపున్ చల్ల వాఱఁగాన్ తీయన్ లేము. కనల్–ఎసరేఁక–ఒడికారములన్ అన్నవి నేటినవి కావించినవి + ఉన్ మార్వన్ అరిది వెను–గైకొనన్ (+ అరిది).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** క్రాఁక మీఁదన్ + ఉన్న = వేఁడిమి గలిగి ఉన్న ; కట్టి కరకంటిపైన్ = నల్లలోహము (ఇనుము) మీఁద ; పడిన దెబ్బన్ = పడిన దెబ్బ వలన ; తేలు = స్పష్టపడిన ; తీయన్ + లేము = సరిచేయలేము ; చల్ల + వారఁగాన్ = చల్లబడిన తరువాత ; కనల్ + ఎసరేఁక–ఒడికారములన్ = కోపము, భావోద్వేగము, ఆవేశముల వలన ; అన్నవి = మాటాడినవి ; నేటినవి = నిర్ణయించినవి ; కావించినవి + ఉన్ = చేసినవి కూడ ; మార్వన్ + అరిది = మార్చుకొనుట (దిద్దుకొనుట) కష్టము ; వెను–గైకొనన్ + అరిది = ఉపసంహరించుకొనుట కష్టము.

**లోవాతిక (తాత్పర్యము) :** వేఁడివేఁడిగా క్రాఁచిన ఇనుము మీఁద దెబ్బ వేసినప్పుడు తిరిగిన వంపును — అది చల్లబడిన పిదప సరిచేయుట అసాధ్యము. అదే విధముగా మనుష్యులు కోపములోను, భావోద్వేగముల వశమునను, ఆవేశముల మున్నూకునను పలికిన మాటలను, తీసి

కొన్న నిర్ణయములను, చేసిన పనులను దిద్దుకొనుట కష్టము. వెనుకకు తీసికొనుట కూడ కష్టము.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** నీ మానసిక స్థితి ఎట్లున్నను ఒక మాట అనుటకు, ఒక నిర్ణయమును తీసికొనుటకు, ఒక పని చేయుటకును ముందే బాగుగా ఆలోచించుకొమ్మని భావము.

SUMMARY : It is impossible to mend the bend that formed by a blow on heated iron. In the same way, it is hard to make amendments to and withdraw the words spoken or the choices made or the acts done in the heat of a moment, being triggered by anger, emotion and rage.

*(Think well before you speak and act).*

**అవిగింగ** || బయటి దెబ్బలకుఁ దట్టుకొనఁజాలును సీమ ;
లోని దెబ్బలకు మట్టు కోర్వలేదు సుమా !
లోన నుండి మేనికొక సోంకు సేయు సేఁగిని,
బయటి నుండి తగిలిన రయ్య సెయ్యఁగలదే ? 51

**మాటల విడఁదీత (పద విభాగము) :** బయటి–దెబ్బలకున్ + తట్టుకొనన్ + చాలును, సీమ, లోని–దెబ్బలకున్, మట్టుకున్ + ఓర్వన్–లేదు, సుమా, లోన నుండి, మేనికిన్ + ఒక, సోంకు + చేయు, సేఁగిని, బయటి నుండి, తగిలిన, రయ్య + చెయ్యన్ + కలదే.

**చఱమోలి (అన్వయ క్రమము) :** సీమ బయటి దెబ్బలకున్ తట్టుకొనన్ చాలును.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సీమ = దేశము ; మేనికిన్ = శరీరమునకు ; సోంకు = అంటుజబ్బు ; సేఁగిని = నష్టమును ; రయ్య = గాయము.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : A country can fend off the blows from outside, but not those from inside. Can a wound on the surface of the body inflict as much of a damage as an inner infection can?

**అవిగింగ జంట** || తేఁటి యెగురుఁ బూల తావి వచ్చు క్రేవకున్ ;
దోమ రీవుఁ జెమటకంపు తాఁకిన కడకున్ ;
పులి మెసలు నెత్తుటి పొడ ముచ్చూచికొనుచున్ ;
నింపీరియపు గౌలు కడ నిలఁబడున్ బలానువు ; 52
ఎవఱు దేని యాకట్టు బిట్టు సవిల్లెదరొ
వారల కదియ చూపుఁ దగిన బ్రదుకుదెరువున్. 53

**మాటల విడఁదీత (పద విభాగము) :** తేఁటి + ఎగురున్ + పూల, తావి, వచ్చు, క్రేవకున్, దోమ, రీవున్, చెమట–కంపు, తాఁకిన, కడకున్, పులి, మెసలున్, నెత్తుటి, పొడన్, ముచ్చూచికొనుచున్, నింపీరియపుం, గౌలు కడన్, నిలఁబడున్, బలానువు, ఎవఱు, దేని + ఆకట్టున్, బిట్టు, సవిల్లెదరు + ఒ, వారలకున్ + అది + అ, చూపున్ + తగిన, బ్రదుకు + తెరువున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తేఁటి పూల తావి వచ్చు క్రేవకున్ ఎగురున్. చెమట–కంపు తాఁకిన కడకున్ దోమ రీవున్. పులి నెత్తుటి పొడన్ ముచ్చూచికొనుచున్ మెసలున్. బలానువు నింపీరియపుం గౌలు కడన్ నిలఁబడున్. ఎవఱు దేని ఆకట్టున్ బిట్టు సవిల్లెదరు + ఒ అది + అ వారలకున్ తగిన బ్రదుకు–తెరువున్ చూపున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తేఁటి = తేనెటీఁగ ; తావి = వాసన ; క్రేవకున్ = దిక్కునకు ; రీవున్ = ఎగురును ; కడకున్ = చోటికి ; మెస లున్ = తిరుగాడును ; నెత్తుటి పొడన్ = జాడ ; ముచ్చ్యాచికొనుచున్ = వాసన చూచుచు ; నింపీరియపుం గౌలు కడన్ = మలపు గబ్బు దగ్గర ; బలానువు = పంది ; ఆకట్టున్ = ఆకర్షణమును ; బిట్టు = గాఢముగాన్ ; సవిల్లెదరు + ఒ = అనుభూతి చెందెదరో ; అది + = అదే.

**లోవాటిక (తాత్పర్యము) :** తేనెటీఁగ పూల సువాసన వచ్చిన దిక్కునకేసి ఎగురును. దోమ – చెమటకంపు వచ్చు చోటికి ఎగురును. పులి – నెత్తుటి జాడలను వాసన చూచుచు తిరుగును. పంది – పీతిరి కంపు ఉన్నచోటును వెదకికొని పోయి అక్కడ నిలఁబడును. ఈ విధముగా ఎవటిని ఏది ఆకర్షించునో అదే వారికి తగ్గ ఉపాధిని చూపును. కడుపు నింపును.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** (౧) "మనిషి ఆసక్తులే తన భవిష్యమును నిర్ణయించు" నని భావము.

(౨) <u>బలానువు</u> = బల్ + అనువు = ఎక్కువగా అనునది = ఎక్కువగా మెక్కునది (పంది).

SUMMARY : The bee flies in the direction of the fragrance of flowers. The mosquito flies to the source of the smell of sweat. The pig goes in search of the stench of excreta and stands there. The tiger roams about smelling the traces of blood. Thus, whoever is strongly attracted to whatever, he/ she is provided with a livelihood by the same.

*(Your future is decided by what you are attracted to).*

**వెల్మిరిక ‖** హెత్తరులు సూపెద రర్మిలిన్ ; దిగువరులు సూపెదరు మేవణి ;
రెండును గా వాయిమాడ్కి ; మొదటిది వాన – రెండవది పొగ. 54

**మాటల విడఁదీత (పద విభాగము) :** హెత్తరులు + చూపెదరు + అర్మిలిన్ దిగువరులు + చూపెదరు మేవణిన్ రెండును + కావు + ఆయిమాడ్కి మొదటిది వాన రెండవది పొగ.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** హెత్తరులు అర్మిలిన్ చూపెదరు. దిగువరులు మేవణిన్ చూపెదరు. రెండును ఆయిమాడ్కి కావు. మొదటిది వాన. రెండవది పొగ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** హెత్తరులు = ఉన్నతులు/ అగ్రజులు ; అర్మిలిన్ = వాత్సల్యమును ; దిగువరులు = క్రిందివారు/ అనుజులు ; మేవణిన్ = వినయమును ; రెండును = వాత్సల్యము మఱియు వినయము ; ఆయిమాడ్కి = సదృశము (ఒక్కలాటివి).

**లోవాటిక (తాత్పర్యము) :** పెద్దలు వాత్సల్యమును చూపెదరు. పిన్నలు వినయమును చూపెదరు. కాని ఈ రెండును లోలోపల ఒకటి కావు. వాత్సల్యము వాన వంటిది. పైనుండి క్రిందికి కురియును. వినయము పొగ వంటిది. క్రిందినుండి పైకి పోవును. వాన క్రిందివారికి పనికి వచ్చును. కాని పొగ వలన పైవారికి ఉపయోగమేమియు లేదు.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** వినయమున కన్న వాత్సల్యము గొప్పదని భావము.

SUMMARY : Juniors show obedience/ humility, while elders show affection. But obedience is one thing and affection, quite another. The former is like smoke, while latter is like rain. Smoke goes upwards while rain falls downwards. Smoke is of no use for those above, while rain is of immense use for the those below.

*(The poet implies that the elders' affection is greater than the obedience shown by the*

*young).*

**తెల్మిరిక మున్నంగి ॥** వక్కళపాటియె సీమ ౨ అయి-నిల్కను గూర్చి వాపోవుట ;
వెక్కసమ్ము గంగినోలుల, లోని నిక్కము లెఱిఁగించుట ; 55
వేసటకా నైకలెర్మ్ముల, లోలోరువుల వినవలయుట ;
చెనుపరి వాగుడె మైకట్టు- గుట్టులను గుఱించి చెప్పుట ; 56
మెలగరంపు మాటకములవి, మేల్తనిల్లవు దేనికైన,
"బాగుబాగు" లకు నొండోరు- బాగుమల్కలకును దప్పన్. 57

**మాటల విడఁదీత (పద విభాగము) :** వక్కళ-పాటి + ఎ, సీమ-అయి-నిల్కను + కూర్చి, వాపోవుట, వెక్కసమ్ము, గంగి-నోలులలోని, నిక్కముల్ + ఎఱిఁగించుట, వేసటకాన్ + ఐకలి + ఎర్మ్మల, లో-లోరువులన్, వినన్ వలయుట, చెనుపరి, వాగుడు + ఎ, మైకట్టు-గుట్టులను + కుఱించి, చెప్పుట, మెలగరంపుం + మాటకముల్ + అవి, మేల్తనిల్లవు, దేనికిన్ + ఐనన్, బాగు-బాగులకున్ + ఒండోరు-బాగు-మల్కలకును + తప్పన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** సీమ-అయి-నిల్కను కూర్చి వాపోవుట వక్కళ-పాటి + ఎ. గంగి-నోలులలోని నిక్కముల్ ఎఱిఁగించుట వెక్కసమ్ము. ఐకలి-ఎర్మ్మల లో-లోరువులన్ వినన్ వలయుట వేసటకాన్. మైకట్టు- గుట్టులను కుఱించి చెప్పుట చెనుపరి వాగుడు + ఎ. మెలగరంపుం మాటకముల్ అవి బాగు-బాగులకున్ ఒండోరు- బాగు-మల్కలకును తప్పన్ దేనికిన్ ఐనన్ మేల్తనిల్లవు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వక్కళ-పాటి + ఎ = విప్లవ ప్రాయమే ; సీమ-అయి-నిల్కను + కూర్చి = దేశ పరిస్థితిని గుఱించి ; వెక్క సమ్ము = దుర్భరము/ దుస్సహము ; గంగి-నోలులలోని = పవిత్ర గ్రంథములలోని ; నిక్కముల్ = సత్యములను ; ఎఱిఁగించుట = తెలి యఁజేయుట ; వేసటకాన్ = విసుగు రప్పించునట్టిది ; ఐకలి + ఎర్మ్మల = ప్రకృతిశాస్త్రముల యొక్క ; లో-లోరువులన్ = లోపలి వివర ములను గుఱించి ; వినన్ వలయుట = వినవలసి వచ్చుట ; చెనుపరి వాగుడు + ఎ = అశ్లీల ప్రలాపమే (బూతి మాటలే) ; మైకట్టు- గుట్టు లను + కుఱించి = శారీర శాస్త్రపు రహస్యములను గుఱించి ; మెలగరంపుం మాటకముల్ = వ్యవహార సంభాషణములు ; అవి = (పాద పూరణము) ; మేల్తనిల్లవు = పనికిరావు/ ఉపయోగపడవు ; బాగు-బాగులకున్ = లెస్స లెస్స అని ఒకటి నొకఱు పొగడుకొనుటకు ; ఒండోరు- బాగు-మల్కలకును + తప్పన్ = పరస్పర కుశల ప్రశ్నలకు తప్ప.

**లోవాఱిక (తాత్పర్యము) :** సమాజమునకు — దేశ పరిస్థితిని గుఱించి వాపోవుట విప్లవముతో సమానము. పవిత్ర గ్రంథములలోని సత్యము లను వివరించుట జనమునకు దుర్భరము. విజ్ఞానశాస్త్ర విషయములను వినిపించినచో విసుగు. శారీరశాస్త్రములోని రహస్యములను మాట లాడుట బూతి ప్రసంగముతో సరిసాటి. వీటి ప్రస్తావన లేని కేవల వ్యవహార సంభాషణములు — ఒకటినొకఱు "లెస్స, లెస్స" అనుకొను-టకు, "ఎట్లున్నారు? బాగున్నారా?" అని కుశల ప్రశ్నలు వేయుటకు మాత్రమే పనికివచ్చును.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** సబ్జెక్టు ప్రస్తావనలు సమాజమునకు కిట్టవనియు, కాని లోక సాధారణమైన వ్యవహార సంభాషణ ముల వలన బుఱ్ఱ పెద్దగా ఎదుగదనియు భావము.

SUMMARY : In the society's view, lamenting on the conditions in the country equals mutiny. Being appraised of the scriptural truths is unbearable. Listening to scientific details is monotonous. Speaking of anatomical secrets tantamounts to prurient talk. However, mere exchange of words without these topics only serves the purpose of sharing sweet nothings.

**దాసానిక ॥** గ్రుడ్డు లోపలనే కానువు దిద్దికొనును బులుగు ;

గడ్డుపోరికి వలసిన బ్రోమిచ్చు లోని జిలుగు ;
నాలుఁగు గోడలని నవ్వుటాలకు డిగ్గనేల ?
నారు వోసికొన్న దచటనె మన మెఱిఁగినదెల్ల. 58

**మాటల విడఁదీత (పద విభాగము) :** గ్రుడ్డు లోపలన్ + ఏ, కానువున్, దిద్దికొనును + పులుగు, గడ్డు–పోరికిన్, వలసిన, బ్రోమున్ + ఇచ్చున్, లోని, జిలుగు, నాలుఁగు గోడలు + అని, నవ్వుటాలకున్, డిగ్గన్ + ఏల, నారు + పోసికొన్నది + అచటన్ + ఎ, మనము + ఎఱిఁగినది + ఎల్లన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** గ్రుడ్డు లోపలన్ + ఏ పులుగు కానువున్ దిద్దికొనును, లోని జిలుగు గడ్డు-పోరికిన్ వలసిన బ్రోమున్ + ఇచ్చున్. నాలుఁగు గోడలు అని నవ్వుటాలకున్ డిగ్గన్ ఏల? మనము ఎఱిఁగినది + ఎల్లన్ అచటన్ + ఎ నారు పోసికొన్నది.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కానువున్ దిద్దికొనును = రూపు దిద్దుకొనును ; పులుగు = పక్షి ; గడ్డు–పోరికిన్ = ఘోర యుద్ధమునకు ; వలసిన = కావలసిన ; బ్రోమున్ + ఇచ్చున్ = శక్తి నిచ్చును ; లోని జిలుగు = శరీరము లోపలి సంక్లిష్టత ; నవ్వుటాలకున్ = నవ్వులాట లకు ; డిగ్గన్ + ఏల = దిగుట ఎందుకు ; నారు + పోసికొన్నది = మొదలైనది.

**లోవాఱిక (తాత్పర్యము) :** గ్రుడ్డులోనే పక్షి రూపొందును. ఘోర యుద్ధము చేయను అవసరమైన శక్తి కలుగుటకు కారణము శరీరము లోపలి అవయవములైన గుండె, ఊపిరితిత్తులు, నీర్పాయిలే తప్ప బయటివైన కాల్సేతులు మఱియు వాటి కండలు కావు. కాఁబట్టి నాలుఁగు గోడల నడుమ కాలము గడుపువారిని గుఱించి నవ్వులాటకు దిగుటెందుకు? మనకు తెలిసిన ప్రతి విషయమును ఒకప్పుడు నాలుఁగు గోడల నడు మనే మొదలైనది సుమా.

SUMMARY : A bird takes shape only in an egg. Similarly, it is only the internal organs like heart, lungs and kidneys but not the outer ones like hands, legs and their muscles which are the source of the energy to fight a battle. Then why mock the people who confine themselves to four walls? All that we knew was born inside the four walls only.

**పస్పియ** ॥ క్రమికి సరిపోలుఁ గతుకని వడ్డన ; చేరవణి నెఱవేర్పని చేమాట ;
త్యాలికిన్ సాటి దాఁచిన మొల్లము ; దొంగతనంబున కెన తొండుతనము. 59

**మాటల విడఁదీత (పద విభాగము) :** క్రమికిన్ సరిపోలున్ + కతుకని, వడ్డన, చే–రవణి, నెఱవేర్పని, చే–మాట, త్యాలికిన్, సాటి, దాఁచిన, మొల్లము, దొంగతనంబునకున్ + ఎన, తొండుతనము.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** కతుకని వడ్డన క్రమికిన్ సరిపోలున్. నెఱవేర్పని చే–మాట చే–రవణి. దాఁచిన మొల్లము త్యాలికిన్ సాటి. తొండుతనము దొంగతనంబునకున్ ఎన.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** క్రమికిన్ = హత్యకు ; కతుకని = తినని ; వడ్డన = వడ్డించిన పదార్థములు ; చే–రవణి = చేబదులు (అప్పు) ; చేమాట = వాగ్దానము ; త్యాలికిన్ = రోగమునకు ; మొల్లము = ధనము ; ఎన = ఒకటి ; తొండుతనము = ధూర్తత్వము.

**లోవాఱిక (తాత్పర్యము) :** అన్నము పెట్టించుకొని దానిని తినుట పూర్తిచేయకే వెడలిపోవుట హత్యవంటిది. మాట ఇచ్చి దానిని నెఱవేర్చని పక్షములో అప్పుపడ్డట్లే లెక్క. దేనికిని వెచ్చింపకుండ, ఎవఱికిని ఇవ్వకుండ దాఁచుకొన్న పైకము జబ్బునకు సరిసాటి. వంకరటింకరగా నడచుకొనుట దొంగతనమునకు దీటైనది.

**పైమాల విడఁబఱ్చు (విశేష వివరణము) :** క్రమికి సరిపోలుఁ గతుకని వడ్డన – లోకములో పలువుఱు పేఁదలు తిండి లేక బాధలు పడుచున్నారు. అటువంటప్పుడు తిండిని తినకుండ దండుగ చేయుట అట్టివారిని చంపుటయే అగును. ఎంగిలి చేసి పారవేయు అన్నమును

అంతకు ముందే పేఁదలకు చేరవేయఁగల్గినచో అది దండుగ కాదు. ఆ పేఁదలు కూడ అది తిని ప్రాణములను నిలుపుకొందురని భావము.

SUMMARY : Leaving without finishing a meal after it was served is like committing a murder. The one who failed to keep his word is as good as a debtor. The money stashed away without spending or donating is like a disease. Rouguishness is self-same as theft.

**అవిగింగ జంట** ॥ "ఒందనించు ౨ పరిని వాయరమె" ౨ అని కొందఱు

"కూడఁగట్టు వారిని గొల్వలి" ౨ అని కొందఱుఁ

"గలుపున్ నిక్కముగఁ గాఁపుటిర" వని కొందఱు,

"లంకెవేయుఁ డ్రే" సని లాతులును బల్కెదరు ; 60

నికమాటలివి ౨ అన్నియుఁ బేరామని దనుకన్ ;

అక్కఱలే వంచమగు నగచాట్ల యెడరన్. 61

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒందనించున్, పరిని, వాయరము + ఎ, అని, కొందఱున్, కూడఁగట్టున్, వారిని + కొల్వలి + అని, కొందఱున్ + కలుపున్, నిక్కముగన్ + కాఁపు + ఇరవు + అని, కొందఱున్, లంకె-వేయున్ + త్రేసు + అని, లాతులును + పల్కెదరు, నిక-మాటల్ + ఇవి, అన్ని + ఉన్, పేర్ + ఆమని, దనుకన్, అక్కఱలు + ఏ, వంచము + అగున్ + అగచాట్ల, ఎడరన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** "పరిని వాయరము + ఎ ఒందనించున్" అని కొందఱున్, "వారిని కొల్వలి కూడఁగట్టున్" అని కొందఱున్, "కాఁపు ఇరవు నిక్కముగన్ కలుపున్" అని కొందఱున్, "త్రేసు లంకె-వేయున్" అని లాతులును పల్కెదరు. పేర్ + ఆమని దనుకన్ ఇవి అన్ని + ఉన్ నిక-మాటల్. అగచాట్ల ఎడరన్ అక్కఱలు + ఏ వంచము అగున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒందనించున్ = ఏకము చేయును ; పరిని = జనమును ; వాయరము + ఎ = భాషయే ; కూడఁగట్టున్ = సంఘటితము చేయును ; కొల్వలి = మతము ; నిక్కముగన్ = నిజముగా ; కాఁపు + ఇరవు = నివాస స్థలము ; లంకె-వేయున్ = అనుసంధానము చేయును ; త్రేసు = జాతి ; లాతులును = ఇతరులును ; నిక-మాటల్ = సత్య వచనములు ; పేర్ + ఆమని దనుకన్ = సంపదల కాలము వరకు ; అక్కఱలు + ఏ = అవసరములే ; వంచము + అగున్ = ముఖ్యమగును ; అగచాట్ల ఎడరన్ = తిప్పలు పడు వేళలో.

**లోవాఱిక (తాత్పర్యము) :** "జనమును భాషయే ఏకము చేయును" అని కొందఱందురు. "కాదు, మతమే వారిని కూడఁగట్టఁగలదు" అని మఱికొందఱు పల్కెదరు. "ఉమ్మడి నివాస ప్రాంతమే ప్రజలను కలుపును" అని ఇంకొందఱు చెప్పెదరు. "జాతిగుర్తింపే వారి నడుమ గల లంకె" అని వేఱొకఱు సెలవిచ్చెదరు. సంపదలు గల కాలములో (పేరామనిలో) ఈ మాటలన్నియు నిజమే కాని ఇక్కట్టులు ఎదురైనప్పుడు మట్టుకు అవసరములే ముఖ్యమగును. అందఱిని ఆ అవసరములే కలుపును.

**పైమాల విడఁబఱుపు (విశేష వివరణము) :** పేరామని = పేరు + ఆమని = పెద్ద ఋతువు = సంపదల కాలము. దీనికే సంక్రాంతి పండుగ అని మఱియొక అర్థము కలదు.

SUMMARY : Some say, "*A common language unites people.*" Some others say, "*A common religion welds them together.*" A few others say, "*A common habitation aligns them perfectly.*" The rest say, "*A common racial identity binds them together.*" All these words are true in the heydays. However, it is only needs which ultimately matter and which bring them together during tough times.

**అవిగింగ** ॥ నడితి-దన్నేరుముల కలిమియున్ లేమియున్ ౨

కత మొక్క త్రేసు యొక్క యెగురాలకములకు ;

మ్రాని చేవ సచ్చుడు మాన్పమెంత సేసిన

మడియకుండ నాఁపుట మఱి రెంచకుఁ దరమే? 62

**మాటల విడఁదీత (పద విభాగము) :** నడితి + తన్వేరుముల, కలిమి + ఉన్, లేమి +ఉన్, కతము + ఒక్క, త్రేసు యొక్క + ఎగు–రాలకములకున్, మ్రాని, చేవ + చచ్చుడున్, మాన్పము + ఎంత + చేసినన్, మడియక + ఉండన్ + ఆఁపుట, మఱి, రెంచకున్ + తరమే?

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒక్క త్రేసు యొక్క ఎగు–రాలకములకున్ నడితి –తన్వేరుముల కలిమి + ఉన్ లేమి + ఉన్ కతము.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నడితి + తన్వేరుముల = నీతి–ఆత్మాభిమానములను ; కలిమి + ఉన్ = కలిగి ఉండుటయు ; లేమి + ఉన్ = లేకపోవుటయు ; కతము = కారణము ; ఒక్క త్రేసు యొక్క = ఒక జాతి యొక్క ; ఎగు–రాలకములకున్ = ఉత్థాన పతనములకు ; మ్రాని చేవ = చెట్టు యొక్క చేవ ; చచ్చుడున్ = చావఁగా (చచ్చిన తరువాత) ; మాన్పము = చికిత్స ; ఎంత + చేసినన్ = ఎంత చేసినను ; మడియక + ఉండన్ = చావకుండ ; రెంచకున్ = మనిషికి ; తరమే = సాధ్యమా?

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక జాతి పైకి వచ్చుటకు మఱియు పడిపోవుటకు దానికి వరుసగా నీతి ఉండుటయు, లేకపోవుటయు కారణములు. వరుసగా ఆత్మాభిమానము ఉండుటయు లేకపోవుటయు కారణములు. ఒక చెట్టులోని చేవ నిండా చచ్చిన పిమ్మట దానికి ఎంత చికిత్స చేసినను అది చావకుండ బ్రదికించుట మనిషికి శక్యమా?

**పైమాల విడఁబఱ్రు (విశేష వివరణము) :** ఇక్కడ వరుసగా అనఁగా — పైకి వచ్చుటకు నీతి మఱియు ఆత్మాభిమానము ఉండుట కారణము. పడిపోవుటకు అవి లేకపోవుట కారణము.

SUMMARY : Being in possession of ethics and pride and their lack – account for the rise and fall of a nation respectively. Is it possible to give life to a tree whose pith died out, no matter however one got it treated?

**అవిగింగ** ‖ మతకరుల మంచికి మైమఱచు నొలవునకు

లెస్సరుల చెడు నరిగించుకొనఁ గాదు తరము ;

పగటి వేఁడిగాలికి బామునొందనివారె

వేసవి వెన్నెల నునువెచ్చదనము నోఁపరు. 63

**మాటల విడఁదీత (పద విభాగము) :** మతకరుల, మంచికిన్, మైమఱచు + ఒలవునకున్, లెస్సరుల, చెడున్ + అరిగించుకొనన్ + కాదు, తరము, పగటి, వేఁడి, గాలికిన్, బామున్ + ఒందని–వారు + ఎ, వేసవి–వెన్నెల–నునువెచ్చదనమున్ + ఓఁపరు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మతకరుల మంచికిన్ మైమఱచు ఒలవునకున్ లెస్సరుల చెడున్ అరిగించుకొనన్ తరము కాదు. పగటి వేఁడి గాలికిన్ బామున్ ఒందని–వారు + ఎ వేసవి–వెన్నెల–నునువెచ్చదనమున్ ఓఁపరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మతకరుల = మాయగాళ్ళ యొక్క (మాయావుల యొక్క) ; మంచికిన్ = మంచితనమునకు ; మైమఱచు = పరవశించు ; ఒలవునకున్ = లోకమునకు ; లెస్సరుల = మంచివారి యొక్క ; అరిగించుకొనన్ = జీర్ణించుకొనుట(కు) ; తరము = సాధ్యము ; బామున్ + ఒందని–వారు + ఎ = ఇబ్బందిపడనివారే ; ...నునువెచ్చదనమున్ = కొద్దిపాటి వెచ్చదనమును ; ఓఁపరు = సహింపరు.

**లోవాఱిక (తాత్పర్యము) :** చెడ్డవారిలో కాసంత మంచితనము కనిపించినను లోకము పులకించిపోవును. కాని అదే లోకము మంచివారిలో

కాసంత చెడు కనిపించినచో దానిని జీర్ణించుకొనఁజాలదు. పగటిపూఁట వేఁడిగాలిని ఓర్పుగా భరించిన జనమే వేసంగి రాత్రివేళ "వెన్నెల యొక్క నునువెచ్చదనము బాగులే"దని విసిగికొందురు.

SUMMARY : The world is carried away by just an iota of kindness displayed by the wicked. The same world cannot digest a modicum of negativity perceptible in good people. The same people who patiently put up with the hot gales during the day complain of the warmth of the moonlight in the mid-summer night.

**గోరంటిక**॥ ఎఱిఁగినచోఁ జెప్పలేదెందు కందురు ;ఎలుఁగెత్తి వాక్రువ్వ వినువారెందఱు?
విన్నవారిలోన నమ్మువారెందఱు? నమ్మినను దానిపైఁ గెలసించునదెవఱు? 64

**మాటల విడఁదీత (పదవిభాగము) :** ఎఱిఁగినచోన్ + చెప్పలేదు + ఎందుకున్ + అందురు, ఎలుఁగు + ఎత్తి, వాక్రువ్వన్, వినువార్ + ఎందఱు, విన్న-వారిలోనన్, నమ్ము-వార్ + ఎందఱు, నమ్మినను, దానిపైన్ + కెలసించునది + ఎవఱు?

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱుమమ్మాటిక :** వాక్రువ్వన్ = పలుకఁగా / పలికినప్పుడు ; కెలసించునది = చర్య తీసికొనునది.

**లోవాఱిక :** (సుబోధము).

SUMMARY : Folks ask others often, "*Why did you not tell us the truth if you knew it already?*" But who is there to listen to it if told? How many are there to believe in it even if they heard it? Who is there to act upon it even if a few are convinced of its veracity?

**గోరంటిక**॥ ఎన్నడు పేర్మించిన దెఱుక నానసము? తన పయి నినుదెల్మి దానికి వెక్కసము ;
తాఁ గూర్కుచుండ లేచి కూర్చున్నవార్, బరికాఱని యెంచి వరకించును గాంచి. 65

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎన్నడు, పేర్మించినది + ఎఱుకన్ + ఆనసము, తన పయిన్ + ఇనుదెల్మి, దానికిన్, వెక్కసము, తాన్ + కూర్కుచున్ + ఉండన్, లేచి, కూర్చున్న-వార్, బరికాఱు + అని + ఎంచి, వరకించును + కాంచి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఆనసము ఎఱుకన్ ఎన్నడు పేర్మించినది? తన పయిన్ ఇనుదెల్మి దానికిన్ వెక్కసము తాన్ కూర్కుచున్ ఉండన్ లేచి కూర్చున్న-వార్ బరికాఱు అని ఎంచి వరకించును కాంచి.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పేర్మించినది = గౌరవించినది ; ఎఱుకన్ = జ్ఞానమును ; ఆనసము లోకము ; తన పయిన్ = తనకంటె ; ఇనుదెల్మి = మెఱుఁగుగా (ఎక్కువ) తెలిసి ఉండుట ; వెక్కసము = దుర్భరము ; కూర్కుచున్ + ఉండన్ = నిద్రపోవుచుండఁగా ; బరికాఱు + అని + ఎంచి వరకించును + కాంచి.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఈ లోకము (లోకులు) జ్ఞానమును ఎప్పుడు గౌరవించినది? (ఎప్పుడును గౌరవింపలేదని భావము). ఎందుకనఁగా తనకంటె ఒక విడివ్యక్తికి కాసంత ఎక్కువ తెలిసియుండుటనే అది భరింపఁజాలదు. తాను నిద్రపోవుచుండఁగా ఎవరైన లేచి కూర్చున్నచో "ఆతఁడు దొంగ కావచ్చు" నని అనుమానించి లోకము వానిని పట్టి శిక్షించును.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఈ లోకమునకు జ్ఞానము నిజముగా అక్కఱలేదు. వ్యక్తులందఱు తనను నూటికి నూఱుపాళ్ళు అనుసరించి నడచుకొన్నచో అది చాలును.

SUMMARY : When did the world respect knowledge? For it cannot tolerate the individual knowing a little more than itself. It punishes those who are awake while it is asleep, suspecting them to be thieves.

*(Society does not wish for knowledge but only the individuals who carry themselves in step with itself up to 100 per cent).*

**పస్సియ** ॥ విలువ యెఱుఁగరు వేల్పుఁదాయములది ; వెట్టిగఁ దలఁతు "రది యెలవంచి" ౨ అని,
"పలువుఱివి యెట్లు తాయము లగు" నని ; హెచ్చు గ్రచ్చుక చచ్చెదరు కొట్టుక. 66

**మాటల విడఁదీత (పద విభాగము) :** విలువ + ఎఱుఁగరు, వేల్పుం + తాయములది, వెట్టిగన్, తలఁతుర్ + అది + ఎలవంచి, అని, పలువుఱివి, + ఎట్లు, తాయముల్ + అగున్ + అని, హెచ్చు + క్రచ్చుక, చచ్చెదరు, కొట్టుక.

**చఱమోలి (అన్వయ క్రమము) :** విలువ వేల్పుం + తాయములది ఎఱుఁగరు. అది ఎలవంచి అని వెట్టిగన్ తలఁతుర్. పలువుఱివి ఎట్లు తాయముల్ అగున్ అని (తలఁతుర్). హెచ్చు క్రచ్చుక కొట్టుక చచ్చెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వేల్పుం + తాయములది విలువ = దేవుని వరముల విలువను ; తలఁతుర్ = భావించెదరు ; అది = ఆ దైవ వరము ; ఎలవంచి = సర్వసాధారణము ; పలువుఱివి = పలువుఱి వద్ద ఉన్నవి ; తాయముల్ = ప్రత్యేక వరములు ; హెచ్చు + క్రచ్చుక = ఎక్కువకై ఆశించి ; చచ్చెదరు కొట్టుక = కొట్టుకొని చచ్చెదరు.

**లోవాఱిక (తాత్పర్యము) :** తమకు దేవుఁడిచ్చిన వరముల విలువను జనము తెలిసికొనరు. "ఆయా వరములు అందఱికిని సర్వ సామాన్య-ముగా ఉన్నవి కదా? అందులో దేవుఁడు మనలను ప్రత్యేకముగా అనుగ్రహించినది ఏమున్నది?' అనుకొందురు. ఆ భావనలో – "ఇంకను ఎక్కువ కావలె" నని ఆశపడి అందుకోసము ఒకఱితో ఒకఱు కొట్లాడి చచ్చెదరు.

**పైమాల విడఁబఱ్చు (విశేష వివరణము) :** ఇది – తమకు ఉన్నవాటి పట్ల జనములో తృప్తి లేకపోవుటను గూర్చిన పద్యము. సర్వ సామాన్య ములని భావించఁబడు కాల్చేతుల వంటివి కూడ అనుగ్రహములే. ఆ విషయము – వాటిని పోఁగొట్టుకొన్నప్పుడే తెలియును.

SUMMARY : Folks do not know the value of the gifts bestowed upon them by God. They think that the so-called gifts are just common possessions owned by everyone and therefore, there is nothing special worth mentioning about them. Thus deluded, they aspire for more (than what God has given them) and perish in fights.

*(Even the so-called common possessions like hands and legs are God's gifts. The fact is realized only when they are lost).*

**అవిగింగ** ॥ కొఱలవు త్రెటినెమ్మనములు నొలమేళ్చారయ ;
కొందఱు వాటింప నేర్తు రందఱకును రయ్య ;
కొందఱె కావింపలే రందఱకును మేలు ;
అందఱె చేతులు వడిననె ౨ అది జరుగఁబోలు. 67

**మాటల విడఁదీత (పద విభాగము) :** కొఱలవు, త్రెటియ + నెమ్మనములున్, ఒల–మేళ్ళన్ + ఆరయన్, కొందఱు, వాటింపన్, నేర్తురు +

అందఱకును, రయ్యన్, కొందఱు + ఎ, కావింపన్ లేరు + అందఱకును, మేలు, అందఱి, చేతులు + పడినన్ + ఎ, అది, జరుగన్ + పోలున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఆరయన్ త్రెటియ-నెమ్మనములున్ ఒల-మేళ్ళు కొఱలవు. కొందఱు అందఱకును రయ్యన్ వాటింపన్ నేర్తురు. కొందఱు + ఎ అందఱకును మేలు కావింపన్ లేరు. అందఱి చేతులు పడినన్ + ఎ అది జరుగన్ పోలున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కొఱలవు = నివసింపవు (ఉండవు) ; త్రెటియ + నెమ్మనములున్ = విశ్వశాంతులును ; ఒల-మేళ్ళున్ = లోకోపకారములును ; ఆరయన్ పరిశీలింపఁగా ; వాటింపన్ నేర్తురు = కలిగింపఁగలరు ; రయ్యన్ = గాయమును ; కొందఱు + ఎ = కేవలము కొందఱే ; కావింపన్ లేరు = చేయలేరు ; పడినన్ + ఎ పడినప్పుడు మాత్రమే ; అది = ఆ మేలు ; జరుగన్ + పోలున్ = జరుగవచ్చును.

**లోవాఱిక (తాత్పర్యము) :** విశ్వశాంతులు, లోక కల్యాణముల వంటివి ఏమియు లేవు. ఎందుకనఁగా లోకములో కొందఱు అందఱికిని నష్టమును కలిగింపఁగలరు. కాని కేవలము కొందఱు కలిసి అందఱికిని మేలు చేయఁజాలరు. అందఱికిని మేలు జరుగవలె నన్నచో అందఱును తమ వంతుగా తలా ఒక చేయి వేయక తప్పదు.

SUMMARY : There does not exist anything like universal peace or public welfare, for a few can cause harm to everyone, but a few cannot do good to all. Therefore, should all be benefited, then all need to chip in their mite.

**దాసానిక మున్నంగి ॥** గఱపరి యే నేరికఁ దగ దరివల్కవలయునో
నేరువాను లాయనకు నేరుగఁ జెప్పెదరేని,
లెసకాన్ ౨ ఏ మందు లెంత తన కివ్వవలయునో
వెస నోవరియే వానితో నొడువుచుండెనేనిఁ , 68
దమ నెట్లు వెంపఁగాఁ దగునో ౨ అది కాంచరులకు
వారి మయ్యాతయే వాకొనుచుండెనేనిఁ ,
బాటికాను తన కే పాటి వరకమ్మును మీఁదు-
పేటవలెనో నేఱస్తుఁడె చాటుచుండెనేనిఁ , 69
గొఱ యేమి టిఁక గఱపరులతో లెసకానులతోఁ
గాంచరులతోఁ బాటికాను-వ్రాతరుల తోడన్? 70

**మాటల విడఁదీత (పద విభాగము) :** గఱపరి, ఏ, నేరికన్ + తగన్, దరివల్కన్ వలయున్ + ఓ, నేరువానుల్ + ఆయనకున్, నేరుగన్ + చెప్పెదర్ + ఏనిన్, లెసకాన్, ఏ, మందులు + ఎంత, తనకున్ + ఇవ్వన్ వలయున్ + ఓ, వెసన్, నోవరి + ఏ, వానితోన్, నొడువుచున్ + ఉండెన్ + ఏనిన్ + తమన్ + ఎట్లు, పెంపఁగాన్ + తగున్ + ఓ, అది, కాంచరులకున్, వారి, మయ్యాత + ఏ, వాకొనుచున్ + ఉండెన్ + ఏనిన్, పాటికాను, తనకున్ + ఏ, పాటి, వరకమ్మును, మీఁదుపేటన్ వలెన్ + ఓ, నేఱస్తుఁడు + ఎ, చాటుచున్ + ఉండెన్ + ఏనిన్ + కొఱ + ఏమిటి + ఇఁకన్, గఱపరులతోన్, లెసకానులతోన్ + కాంచరులతోన్ + పాటికాను-వ్రాతరుల తోడన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** .....ఏనిన్ ఇఁకన్ గఱపరులతోన్ లెసకానులతోన్ కాంచరులతోన్ పాటికాను-వ్రాతరుల తోడన్ కొఱ ఏమిటి. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గఱపరి = అధ్యాపకుఁడు ; నేరికన్ = పాఠమును ; తగన్ = తగినట్లుగా ; దరివల్కన్ వలయున్ + ఓ = ఉపదేశింపవలెనో ; నేరువానుల్ విద్యార్థులు ; చెప్పెదర్ + ఏనిన్ = చెప్పినచో ; లెసకాన్ = వైద్యుఁడు ; వెసన్ = వెంటనే ; నోవరి + ఏ =

రోగియే ; నొడువుచున్ + ఉండెన్ + ఏనిన్ = చెప్పుచున్నట్లయిన ; కాంచరులకున్ = తల్లిదండ్రులకు ; మయ్యాత + ఏ = సంతానమే ; వాకొనుచున్ + ఉండెన్ + ఏనిన్ = ఉపన్యసించుచున్న పక్షములో ; పాటికాను = న్యాయమూర్తి ; ఏ పాటి = ఏ మాత్రపు ; వరకమ్మును = శిక్షను ; మీఁదుపేటన్ వలెన్ + ఓ = విధింప వలెనో ; కొఱ = ప్రయోజనము ; వ్రాతరుల తోడన్ = రచయితలతోను.

**లోవాఱిక (తాత్పర్యము) :** అధ్యాపకుఁడు తమకు ఏ పాఠమును బోధింప వలెనో విద్యార్థులే ఆయనకు చెప్పుచున్నచో, వైద్యుఁడు తనకు ఏ మందు ఎంత ఇవ్వవలెనో రోగియే ఆయనకు సూచించుచున్నచో, తమను ఎట్లు పెంచవలెనో పిల్లలే తల్లిదండ్రులకు ఉపన్యసించుచున్నచో, తనకు ఎంత శిక్ష వేయవలెనో అది న్యాయమూర్తికి నేఱస్తుఁడే నిర్దేశించుచున్నచో – ఇఁక ప్రపంచమునకు అధ్యాపకులతోను, వైద్యులతోను, తల్లిదండ్రులతోను, న్యాయమూర్తులతోను, రచయితలతోను పని ఏమున్నది?

**వైమాల విడఁబఱ్పు (విశేష వివరణము) :** ఇందులో రచయితల ప్రస్తావనయే ముఖ్యమైనది. మిగితావి పోలికలు మాత్రమే.

SUMMARY : Why does the world need teachers, doctors, parents, judges and writers any–more – if students tell their teacher what lesson they should be taught, if the patient speci–fies to his doctor what medicine he should be administered with what potency, if children lecture to their parents on how to bring them up, if the convict specifies to the judge the quantum of punishment he should be awarded – then why does the world need teachers, doctors, parents, judges and writers?

*(Though the verse only makes a passing reference to writers, it is in deed, the central point, with the other references being only similes).*

**వెల్మిరిక** ॥ సాఁబాలు కడగండ్ల కొలవునఁ , గతము తారి పారిలేమియే ;
నిక్కమిది సరిసాటిగా వే- దారుల యెడఁ ద్రేసుల యెడలన్. 71

**మాటల విడఁదీత (పద విభాగము) :** సాఁబాలు, కడగండ్లకున్ + ఒలవునన్ + కతము, తారి, పారిలేమి + ఏ, నిక్కము + ఇది, సరిసాటిగాన్, వేదారుల ఎడన్, త్రేసుల ఎడలన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఇది వేదారుల ఎడన్ త్రేసుల ఎడలన్ సరిసాటిగాన్ నిక్కము. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సాఁబాలు= సగము పాలు (అర్ధభాగము) ; కడగండ్లకున్ = కష్టములకు ; ఒలవునన్ = ప్రపంచములో; కతము కారణము ; తారి = స్వంత ; పారిలేమి + ఏ = భూమి లేకపోవుటయే ; నిక్కము = నిజము ; సరిసాటిగాన్ = వేదారుల ఎడన్ = వ్యక్తుల విషయములో ; త్రేసుల ఎడలన్ = జాతుల విషయములోను.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఈ ప్రపంచములో జనముల కష్టములకు సగము కారణము – వారికి స్వంత భూమి లేకపోవుట. ఇది మానవ వ్యక్తుల విషయములో ఎంత నిజమో మానవ జాతుల విషయములోను అంతే నిజము.

SUMMARY : Nearly half of the people's hardships are accounted for by their non–possession of land. This as much true of human races as of human individuals.

**పస్సియ జంట** ॥ చక్క మాటలాడఁడు సమయువు తన, సరికారిటి విర్వియమును గుఱించి ;
"కడిదమ్ము లాహ" ౨ అని గుర్తెఱుఁగు, బిస్త దాపరించిన వెనుకటనే ; 72
కలఁ గనుచున్నంత సేఁపు నెవ "అది, కల" ౨ అనుచుఁ బాఱఁజూచునది? 73

**మాటల విడఁదీత (పద విభాగము) :** చక్క, మాటలాడఁడు, సమయువు, తన, సరికారిటి, విర్వియమును + కుఱించి, కడిదమ్ము, లాహ, అని, గుర్తెఱుఁగున్, బిస్త, దాఁపరించిన, వెనుకటన్ + ఏ, కలన్ + కనుచున్ + ఉన్న + అంత–సేఁపున్ + ఎవఱు + అది, కల, అనుచున్ + పొఱఁజూచునది.

**చఱమోలి (అన్వయ క్రమము) :** సమయువు తన సరికారిటి విర్వియమును + కుఱించి చక్క మాటలాడఁడు. బిస్త దాఁపరించిన వెనుకటన్ + ఏ కడిదమ్ము లాహ అని గుర్తెఱుఁగున్. కలన్ కనుచున్ ఉన్న–అంత–సేఁపున్ అది కల అనుచున్ పొఱఁజూచునది ఎవఱు?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చక్క = చక్కగా ; సమయువు = మర్త్యుఁడు (మానవుఁడు) ; సరికారిటి = సమకాలీన– ; విర్వియమును + కుఱించి = ప్రపంచమును గుఱించి ; కడిదమ్ము = గతము ; లాహ = స్వర్గము ; బిస్త = నరకము ; వెనుకటన్ + ఏ = తరువాతనే ; పొఱఁజూచునది = గమనించునది.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనిషి తాను బ్రదుకుచున్న కాలమును గుఱించి ఎప్పుడును సరిగా మాటలాడఁడు. అందులో తప్పులే వెదకుచుండును. నరకము వంటి కాలము సంప్రాప్తించిన తరువాతనే "కడచిన కాలము (ఒకనాటి వర్తమానము) స్వర్గతుల్యము" అని గుర్తెఱుఁగును. కల గనుచున్నంత సేఁపు అది కలయే అని గమనించుకొనువారెవఱు? (అందమైన వర్తమానము కూడ అటువంటిదేనని భావము. అది జాఱిపోవును).

SUMMARY : Man never speaks fairly of the present but only finds faults with it. He comes to realize that the past was heavenly only after stepping in hellish times. Who does realize that it is just a dream as long as he is asleep? (A beautiful past passes away like a beautiful dream).

**పస్సియ** ॥ నాయనతోడి మార్తము తెచ్చు మఱి, నాలుఁగైదు మార్తముల నదనముగాన్ ;
తల్లితోడి మార్త మెన్ని దెచ్చునొ, తరము గాదు పలుకఁ బ్రెబ్బోతిగాన్. 74

**మాటల విడఁదీత (పద విభాగము) :** నాయనతోడి, మార్తము, తెచ్చున్, మఱి, నాలుఁగు + ఐదు, మార్తములన్ + అదనముగాన్, తల్లితోడి, మార్తము + ఎన్ని + తెచ్చున్ + ఒ, తరము + కాదు, పలుకన్ + ప్రెబ్బోతిగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నాయనతోడి మార్తము మఱి నాలుఁగు ఐదు మార్తములన్ అదనముగాన్ తెచ్చున్. తల్లితోడి మార్తము ఎన్ని తెచ్చున్ + ఒ ప్రెబ్బోతిగాన్ పలుకన్ తరము కాదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నాయనతోడి = తండ్రితోడి ; మార్తము = శత్రుత్వము ; తరము + కాదు = శక్యము కాదు ; పలుకన్ = చెప్పుటకు ; ప్రెబ్బోతిగాన్ = ఖచ్చితముగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Enmity with the father only generates 4 or 5 other enmities in extra. However, it is not possible to count the number of additional enmities that one will invite by antagonizing his mother.

**పస్సియ జంట** ॥ మలిపదుల చివరన్ దా నెట్టిఁడో, మనియెడు నట్టులె బ్రదింబారునున్ ;
పిన్ననాటి పెడజందముల మొలక, లెదుగుఁ బెద్దపుడు మఱ్ఱిమ్రానులై ; 75
కాంచరుల పెడజందముల డగరలు, కలుగుఁ గందులన్ రంపెలానులై ;

ముదిరిపోయిన వెనుక మారలేవు ; ముందె యారసికో మారఁజాలెదు. 76

**మాటల విడఁదీత (పద విభాగము) :** మలిపదుల, చివరన్ + తాన్ + ఎట్టిఁడు + ఓ, మనియెదున్ + అట్టుల్ + ఎ, బ్రదింబారున్ + ఉన్, పిన్న-నాటి, పెడజందముల, మొలకల్ + ఎదుగున్ + పెద్ద + అపుడు, మఱ్ఱి-మ్రానుల్ + ఐ, కాంచరుల, పెడజందముల, దగరలు, కలుగున్ + కందులన్, రంపెలానులు + ఐ, ముదిరి-పోయిన, వెనుకన్, మారన్ లేవు, ముందు + ఎ, + ఆరసికోన్, మారన్ + చాలెదు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మలిపదుల చివరన్ తాన్ ఎట్టిఁడు + ఓ అట్టుల్ + ఎ బ్రదింబారు + ఉన్ మనియెదున్. పిన్న-నాటి పెడజందముల మొలకల్ పెద్ద అపుడు మఱ్ఱి-మ్రానుల్ ఐ ఎదుగున్. కాంచరుల పెడజందముల దగరలు కందులన్ రంపెలానులు ఐ కలుగున్. ముదిరి-పోయిన వెనుకన్ మారన్ లేవు ముందు + ఎ ఆరసికోన్ మారన్ చాలెదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మలిపదుల చివరన్ = కౌమార వయస్సు చివరిలో ; ఎట్టిఁడు + ఓ = ఎటువంటివాఁడో ; మనియెదున్ = బ్రదుకును ; బ్రదింబారున్ + ఉన్ = జీవితాంతము ; పిన్న-నాటి = బాల్యములోని ; పెడజందముల మొలకలు = దుస్సంస్కారములు అనెడి మొలకలు ; కాంచరుల = తల్లిదండ్రుల యొక్క ; పెడజందముల దగరలు = దుస్సంస్కారములు అను దెయ్యములు ; కలుగున్ = అవతరించును ; కందులన్ = పిల్లలలో ; రంపెలానులు + ఐ = రాక్షసులై ; ఆరసికోన్ = గమనించుకొన్నచో ; మారన్ + చాలెదు = మారఁగలవు.

**లోవాటిక (తాత్పర్యము) :** మనిషి మనస్సు కౌమార వయస్సు చివరిలో – అనఁగా 19 లేదా 20 ఏండ్లప్పుడు ఎట్లుండునో జీవితాంతము దాదాఁపుగా అట్లే ఉండును. చిన్ననాడు చిఱు మొలకలుగా ఉన్న దుస్సంస్కారములు పెద్దయిన తరువాత మఱ్ఱిచెట్ల వలె విస్తరించును. తల్లి దండ్రులలో కేవలము దెయ్యముల వలె ఉండు దుస్సంస్కారములు వారి పిల్లలలో రాక్షస ప్రమాణముల నందుకొనును. దుష్ట సంస్కారములు ముదిరిపోయిన తరువాత నీవు మారలేవు. (మారుటకు ఇష్టము ఉండదు). ముందే – అనఁగా చిన్న వయస్సులోనే గమనించుకొన్నచో మారఁగలవు.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** (౧) కొందఱు కౌమార ప్రాయము అందురు. అది వైరిసమాసము. ఎందుకనఁగా కౌమారము సంస్కృతము. ప్రాయము తెలుఁగు. ప్రాయమునకును ప్రాఁతకు సంబంధము కలదు. కనుక ప్రాయము సంస్కృతములోనికి పోయిన ఒక అచ్చతెలుఁగు మాట.

(౨) మలిపదులు = పదేండ్లకు మించిన వయస్సు మఱియు పది అను మాటతో మొదలగు సంఖ్యల చివర. అనఁగా Teenage లేక కౌమార వయస్సు.

SUMMARY : Man will be the same throughout his life as he is at the end of the teenage. The sprouts of bad culture germinated in one's childhood will grow to be expansive like a bunyan tree in the adulthood. The ghosts of bad culture present in the parents will become demons in their children. You cannot change yourself

after the bad culture got advanced but only before it does, at a young age.

**గోరంటిక ॥** నేఅల్వి కోసము నెమకు సరికందని ; నెరసుల కోసమ్మై సీకఅదారి ;

తేఁటులు వెదకును ౨ పూఁదేనియ కోసము ; నక్కలు వెదకుఁ జాటుబొక్కల కోసము. 77

**మాటల విడఁదీత (పద విభాగము) :** నేఅల్వి కోసము, నెమకున్, సరికందని, నెరసుల కోసము + ఐ, సీకఅదారి, తేఁటులు, వెదకును, పూవు+ తేనియ కోసము, నక్కలు. వెదకున్ + చాటు-బొక్కల కోసము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** సరికందని నేఅల్వి కోసము నెమకున్. సీకఅదారి నెరసుల కోసము ఐ (నెమకున్). తేఁటులు పూవు+

తేనియ కోసము వెదకును. నక్కలు చాటు-బొక్కల కోసము వెదకున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నేఱల్వి కోసము = నేర్చుకొనఁదగిన విషయము కోసము ; నెమకున్ = శోధించును ; సరికందని = సహృదయుఁడు ; నెరసుల కోసము + ఐ = దోషముల కోసము ; సీకఱదారి = దుష్ట మేధావి ; తేఁటులు = తేనెటీఁగలు.

**లోవాఱిక (తాత్పర్యము) :** సహృదయుఁడు "ఇందులో నేర్చుకొనుటకు విషయమేమైన కలదా? లేదా?" అని వెదకుచుండును. ధూర్త మేధావి "దోషములు/ లోపములు ఎక్కడ ఉన్నవో?" అని శోధించును. తేనెటీఁగలు పూల తేనె కొఱకు వెదకును. నక్కలు రహస్యమైన గుంటల కోసము చూచును. (సహృదయులు తేనెటీఁగల వంటివారనియు, ధూర్త మేధావులు నక్కల వంటివారనియు భావము).

SUMMARY : A sympathetic thinker looks for the things worth learning in everything. The evil genius would be on the look out for defects and faults. Bees search for nectar and jackals, for pits.

**గంగేరిక జంట ॥** కడు హెచ్చరా ! హెచ్చరా !! పచ్చి, కల్లల వాపఱపంబు పట్లన్ ;
ఆవగింజంత నీ వీసరము ౦ , అందించు మార్తుఱ కాస్కారము ; 78
చెట్టల యొలవు నీ మందనమున్, సొట్టద్దముల గుండా చూచున్ ;
గబ్బానసము నీ సీదనమున్ ౦ , ఉబ్బద్దముల గుండా అరయున్. 79

**మాటల విడఁదీత (పద విభాగము) :** కడు, హెచ్చరా, హెచ్చరా, పచ్చి, కల్లల, వాపఱపంబు పట్లన్, ఆవ-గింజ + అంత, నీ, వీసరము, అందించున్, మార్తుఱకున్ + ఆస్కారమున్, చెట్టల + ఒలవు, నీ, మందనమున్ (మంచి + తనమున్), సొట్ట + అద్దముల గుండా, చూచున్, గబ్బు + ఆనసము, నీ, సీదనమున్, ఉబ్బు + అద్దముల గుండా, అరయున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పచ్చి కల్లల వాపఱపంబు పట్లన్ కడు హెచ్చరా హెచ్చరా. ఆవ-గింజ-అంత నీ వీసరము మార్తుఱకున్ ఆస్కారమున్ అందించున్.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కడు హెచ్చరా హెచ్చరా = బహు జాగ్రత్త జాగ్రత్త ; పచ్చి కల్లల వాపఱపంబు పట్లన్ = పచ్చి బొంకుల ప్రచారము విషయములో ; వీసరము = లోపము ; మార్తుఱకున్ = శత్రువులకు ; ఆస్కారమున్ = అవకాశమును ; చెట్టల + ఒలవు = దోషమయ లోకము ; మందనమున్ = మంచితనమును ; సొట్ట + అద్దముల గుండా = పుటాకార కటకముల ద్వారా ; గబ్బు + ఆనసము = దుర్గంధ భూయిష్ఠమైన సంఘము ; సీదనమున్ = చెడ్డతనమును ; ఉబ్బు + అద్దముల గుండా = కుంభాకార కటకముల ద్వారా ; అరయున్ = పరీక్షించును.

**లోవాఱిక (తాత్పర్యము) :** నిన్ను గుఱించి సంఘమున జరుగఁబోవు దుష్ప్రచారము విషయములో కడు జాగ్రత్తగా నుండుము. నీవు చేయు ఆవగింజంత పొఱఁబాటు నీ శత్రువులకు సువర్ణావకాశముగా మారఁగలదు. స్వయముగా దోషభూయిష్ఠమైన ఈ ప్రపంచము నీ మంచి తనమును పుటాకార కటకములో నుండి చూచి తగ్గించును. నీ చెడ్డతనమును మట్టుకు కుంభాకార కటకములో నుండి పరీక్షించి చూచి నిన్నెఱపాటు నటించును.

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** పుటాకార కటకములలో నుండి వస్తువులు దూరముగాను చిన్నగాను అగుపడును. కుంభాకార కటకముల (భూతద్దముల) లో నుండి అవి దగ్గరగాను, పెద్దగాను కనిపించును.

SUMMARY : Beware of the bad propaganda of pure falsehoods that is going to be launched against you. A minute mistake on your part will afford your enemies a golden opportunity to frame you. The evil world views your goodness from a concave lens, but examines your nega-

tive side from a convex lens.

**పస్సియ జంట** ॥ గోసు లేదు మంచిఁ దలపోయుటన్, గొనకొని మంచిఁ జేయలేకున్నను ;
ఒలి మానఁదలఁచు నొక్కొక దొంగయు, నొక్కొక మాటు, కాని మానలేఁడు ; 80
పడుపు మానఁగోరెడి వెలయాలున్ ౨ బయటఁబడఁజాల దంత తేలికగ ;
కొంగమండ్ర మను కూట మెవటైన, గొప్ప తలఁపుఁ దలంచి చేయనోడ. 81

**మాటల విడఁదీత (పద విభాగము) :** గోసు, లేదు, మంచిన్ + తలపోయుటన్ + కొనకొని, మంచిన్ + చేయన్ + లేక + ఉన్నను, ఒలిన్ + మానన్ + తలఁచున్ + ఒక్క + ఒక, దొంగ + ఉన్ + ఒక్క + ఒక, మాటు, కాని, మానన్ లేఁడు, పడుపున్, మానన్ + కోరెడి, వెలయాలు + ఉన్, బయటన్ + పడన్ + చాలదు + అంత, తేలికగన్, కొంగ–మంద్రము + అనున్, కూటము + ఎవఱు + ఐనన్, గొప్ప తలఁపున్ + తలంచి, చేయన్ + ఓడన్.

**చఱమొలి (అన్వయ క్రమము) :** కొనకొని మంచిన్ చేయన్ లేక ఉన్నను మంచిన్ తలపోయుటన్ గోసు లేదు. ఒక్క + ఒక దొంగ + ఉన్ ఒక్క + ఒక మాటు ఒలిన్ మానన్ తలఁచున్ కాని మానన్ లేఁడు. పడుపున్ మానన్ కోరెడి వెలయాలు + ఉన్ అంత తేలికగన్ బయటన్ పడన్ చాలదు. ఎవఱు ఐనన్ గొప్ప తలఁపున్ తలంచి చేయన్ ఓడన్ కూటము కొంగ–మంద్రము అనున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గోసు లేదు = తప్పు లేదు ; మంచిన్ + తలపోయుటన్ = మంచిని ఆలోచించుటలో ; కొనకొని = ప్రయత్నించి ; చేయన్ + లేక + ఉన్నను = చేయలేకపోయినను ; ఒలిన్ = దొంగతనమును ; మానన్ + తలఁచున్ = మానవలె ననుకొనును ; ఒక్క + ఒక దొంగ + ఉన్ = అరుదుగా ఒక దొంగ కూడ ; ఒక్క + ఒక మాటు = అరుదుగా ఒక్కొక్క సారి ; పడుపున్ = వ్యభిచారమును ; మానన్ + కోరెడి = మానవలె నని అనుకొనునట్టి ; వెలయాలు + ఉన్ = వేశ్య కూడ ; కొంగ–మంద్రము = కొంగతపస్సు ; కూటము = సంఘము ; తలంచి = సంకల్పించి ; చేయన్ + ఓడన్ = చేయలేక పోయినచో .

**లోవాటిక (తాత్పర్యము) :** మంచిని వెనువెంటనే ప్రయత్నించి చేయలేకపోయినను దానిని గుఱించి ఆలోచించుట తప్పు కాదు. అరుదుగా ఒక్కొక్క దొంగ దొంగతనములను మానవలె నని అనుకొనును గాని వెంటనే మానలేఁడు. అట్లే అరుదుగా ఒక్కొక్క వెలయాలు వ్యభిచారమును మానవలె నని అనుకొనును గాని వెంటనే అందునుండి బయట పడఁజాలదు. ఒకవేళ ప్రయత్నించి విఫలమైనచో సమాజము ఆ ప్రయత్నములకు కొంగజపములనియు, పిల్లి తపస్సులనియు పేరుపెట్టి ఎగతాళి చేయును.

SUMMARY : It is not wrong to think about good things even if one is not able to try and accomplish them in the immediate present. Rarely a thief may consider the option of quitting his profession, but he cannot all of a sudden. Similarly, even a sex-worker may occasionally wish to leave her profession, but she cannot all of a sudden. Moreover, society terms it a dishonest effort if someone tries and fails in his/ her endeavour to do good things.

**వెల్మీరిక జంట** ॥ పులుగులకు రెంచతాఁకే యేవ ; వాఁడు ముట్టినది విడచు ౨ చావ ;
ముదిమియుఁ ద్యాలు నింపిరి గిట్టుఁ , గల పుట్టువు వేల్పులకుఁ దిట్టు ; 82
బ్రోము లపాపర్వము గలిగిన, వేల్పుదన మాతటికిఁ జులుకన ;
ఎవ్వటి యువైనపు టైనిల్కలే, వారికి "లెస లె" స్సనిపించులే. 83

**మాటల విడఁదీత (పద విభాగము) :** పులుగులకున్, రెంచ–తాఁకే + ఏవ, వాఁడు, ముట్టినది, విడచున్ + చావన్, ముదిమి + ఉన్, + త్యాలు + ఉన్, నింపిరి, గిట్టు + ఉన్ + కల, పుట్టువు, వేల్పులకున్ + తిట్టు, బ్రోముల్ + అపా–పర్వమున్ + కలిగిన, వేల్పుదనము +

ఆతటికిన్, + చులుకన, ఎవ్వటి + ఇవైనపు + ఐనిల్కల్ + ఏ, వారికిన్, లెస-లెస్స + అనిపించున్, లే.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పులుగులకున్ రెంచ-తాఁకే ఏవ వాఁడు ముట్టినది విడచున్ చావన్ ముదిమి + ఉన్ త్యాలు + ఉన్ నింపిరి గిట్టు + ఉన్ కల పుట్టువు వేల్పులకున్ తిట్టు బ్రోముల్ అపా-పర్వమున్ కలిగిన వేల్పుదనము ఆతటికిన్ చులుకన ఎవ్వటి ఇవైనపు ఐనిల్కల్ + ఏ వారికిన్ లెస-లెస్స అనిపించున్ లే.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పులుగులకున్ = పక్షులకు ; రెంచ-తాఁకే = మానవస్పర్శమే ; ఏవ = ఱోత ; ముట్టినది = ముట్టిన పక్షిని ; విడచున్ = వదలివేయును ; చావన్ = చచ్చుటకై (చావుము అని) ; ముదిమి + ఉన్ = ముదుసలితనమును ; త్యాలు + ఉన్ = రోగము కూడ ; నింపిరి = మలము ; గిట్టు + ఉన్ = చావు కూడ ; కల = కలిగిన ; పుట్టువు = జన్మ ; వేల్పులకున్ = దేవతలకు ; తిట్టు = శాపము/ దూషణము; బ్రోముల్ = (మాయా) శక్తులు ; అపా-పర్వము + ఉన్ = నిత్య/ శాశ్వత యౌవనము కూడ ; వేల్పుదనము = దేవత్వము ; ఆతటికిన్ = అవధూతకు ; చులుకన = లోఁకువ ; ఇవైనపు = ప్రస్తుత- ; ఐనిల్కల్ + ఏ = పరిస్థితులే ; లెస-లెస్స = బాగు బాగు.

**లోవాఱిక (తాత్పర్యము) :** పక్షులకు మనిషి స్పర్శయే అసహ్యము. అతఁడు ముట్టుకొన్న పక్షిని అవి తమ గుంపులో చేరనివ్వవు. "చావుము పొ"మ్మని వదలివేయును. ముదుసలితనమును, జబ్బులును, మలమూత్రములును, చావును గల మానవజన్మ దేవతలకు శాపముతో సమానము (తిట్టుతో కూడ). శక్తులును నిత్యయౌవనమును గల దేవతాశరీరము కూడ జీవన్ముక్తులైన అవధూతల కనురోకలో హీనము. అయినను ఎవఱున్న స్థితిలో వారికి తమ స్థితియే "మేలు మే"లనిపించును.

SUMMARY: Birds hate human touch and leave to die the ones among them which have thus been touched. Gods (angels) consider to be a curse the human incarnation which suffers from imperfections such as bodily impurities, disease, old age and death. Liberated souls look down upon even the angelic birth although it is associated with superhuman powers and eternal youth. Thus, to each one, their own condition feels like the most perfect.

**గంగేరిక ||** ఏతెంచి నిలచి యేఁగిన బండి, యేర్పడినట్లో నిలచిన చోట?

బల్ కెళ వూరు సనెడి తెఱువరులు, పరి కామతిల్లు కొడుకుఁగూఁతులు. 84

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏతెంచి నిలచి + ఏఁగిన బండి + ఏర్పడిన + అట్లు + ఓ నిలచిన చోటన్ బల్ కెళవు + ఊరు + చనెడి తెఱువరులు పరికిన్ + ఆమతిల్లు కొడుకు + కూఁతులు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఏతెంచి నిలచి ఏఁగిన బండి నిలచిన చోటన్ ఏర్పడిన అట్లు + ఓ ? పరికిన్ ఆమతిల్లు కొడుకు- కూఁతులు బల్ కెళవు + ఊరు చనెడి తెఱువరులు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఏతెంచి = వచ్చి ; నిలచి = ఆఁగి ; ఏఁగిన = వెడలిన ; ఏర్పడిన + అట్లు + ఓ = మొదలైనట్లా? ; నిలచిన చోటన్ (తాను) ఆఁగిన చోట ; బల్ కెళవు = మిక్కిలి దూరము ; ఊరు + చనెడి = ప్రయాణించునట్టి ; తెఱువరులు = పాంథులు (బాటసారులు) ; పరికిన్ = జనమునకు ; ఆమతిల్లు = ఉద్భవించునట్టి.

**లోవాఱిక (తాత్పర్యము) :** మన దగ్గరికి వచ్చి ఆఁగి మరల వెడలిన బండి — మన దగ్గరే మొట్టమొదటి సారిగా బయలుదేఱినట్లు కాదు గదా ! మనమున్న చోటు దానికి గల పలు మజిలీలలో ఒకటి మాత్రమే. అట్లే జనము తమ కొడుకులనియు, కూఁతుళ్ళనియు భావించువారు బహుదూరపు బాటసారులు. వారొకనాడు తటాలున వచ్చి కొంతకాలము పాటు తల్లిదండ్రుల యొద్ద ఉండి మరల ఎచ్చటికో తరలిపోవువారు మాత్రమే.

SUMMARY : May we say that the coach which has briefly sojourned near us and then set out for elsewhere, originated at our place? Similarly, the souls whom folks deem to be their sons and daughters are in fact, passengers of a long haul who have suddenly made their app–earance in their parents' houses and will leave them after some time.

**వెల్మీరిక** ॥ తందరుసు కవ యెడాటమునన్ , బెండ్లామును బెనిమిటి కాఁచున్ ;
ఈలువితల యెడాటమున మటు, కీవిడయె ౨ ఆయనను గాఁచున్. 85

**మాటల విడఁదీత (పద విభాగము) :** తందరుసు, కవ + ఎడాటమునన్, పెండ్లామును + పెనిమిటి, కాఁచున్ + ఈలువితల + ఎడాటమునన్, మటుకున్, ఈవిడ + ఏ, ఆయనను + కాఁచున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తందరుసు = సాధారణమైన ; కవ = జంట యొక్క ; ఎడాటమునన్ = విషయములో ; పెండ్లామును = భార్యను ; పెనిమిటి = భర్త ; కాఁచున్ = కాఁపాదును ; ఈలువితల = పతివ్రతల యొక్క ; ఎడాటమునన్ = విషయములో ; మటుకున్ = మాత్రము.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : In the case of ordinary couples, the husband protects his wife, whereas in the case of dedicated wives, it is the wife herself who protects her husband.

**గోరంటిక** ॥ అమరములు కతమో పెణ్మీసికమునకు? పెణ్మీసిక మ్మమరములకుం గతమో?
అమరములకై మంది మనువాడెదరో? మనువాడ నమరములఁ బనిఁ జేసెదరో?
మనువేది, పెణ్మీసి కౌలంకె లేక? 86

**మాటల విడఁదీత (పద విభాగము) :** అమరములు, కతము + ఓ, పెణ్ + మీసికమునకున్, పెణ్ + మీసికమ్ము + అమరములకున్ + కతము + ఓ, అమరములకై, మంది, మనువు + ఆడెదరు + ఓ, మనువు + ఆడన్ + అమరములన్ + పనిన్ + చేసెదరు + ఓ, మనువు + ఏది, పెణ్ + మీసి–కౌలంకె, లేక?

**చఱమోలి (అన్వయ క్రమము) :** అమరములు కతము + ఓ పెణ్ + మీసికమునకున్ పెణ్ + మీసికమ్ము అమరములకున్ కతము + ఓ? అమరములకై మంది మనువు ఆడెదరు + ఓ? మనువు ఆడన్ + అమరములన్ పనిన్ చేసెదరు + ఓ? మనువు ఏది పెణ్ + మీసి–కౌలంకె లేక?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అమరములు = వ్యవస్థలు ; కతము + ఓ = కారణమా? ; పెణ్ + మీసికమునకున్ = స్త్రీ–పురుష సంబంధమునకు ; మంది = జనము ; మనువు + ఆడెదరు + ఓ = పెండ్లాడెదరా? ; మనువు + ఆడన్ = పెండ్లాడుటకు ; అమరములన్ = వ్యవస్థలలో ; పనిన్ + చేసెదరు + ఓ = పని చేసెదరా? ; మనువు + ఏది = పెండ్లి ఎక్కడ? ; పెణ్ + మీసి–కౌలంకె = స్త్రీ–పురుష అనుబంధము లేనప్పుడు.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఆడు–మగ కలసి ఉండుటకు వ్యవస్థలు కారణమా? వ్యవస్థలు కొనసాఁగుటకు ఆడు–మగ కలసి ఉండుట కారణ–మా? (రెండవదే అని కవి భావము). వ్యవస్థల కోసము జనము పెండ్లాడెదరా? లేక పెండ్లాడుట కొఱకు వ్యవస్థలలో పని చేసెదరా? ప్రకృతిలో స్త్రీపురుష అనుబంధము అంతకు ముందే లేనిచో సమాజములో మట్టుకు పెండ్లి అను వ్యవస్థ ఎక్కడి నుంచి వచ్చును?

SUMMARY : Do institutions account for male-female relationship or is it the other way round? Do folks marry for the sake of running institutions? Or Do they work for the institutions to marry? Where did the institution of marriage originate, had there been no male-female relationship already in the Nature?

**తమ్మిక** ॥ వల్లరమా? మిడియారమా? అల్లంత కెళవగు దొరతనమా?
చెల్లఁజేయును మీసిపైదలుల వల్లమాలిన వలపుఁగలయికన్?
వా రెవ్వఙును గారు సుమీ, పాల్- గారు బుగ్గల పసివార్ వసులన్. 87

**మాటల విడఁదీత (పద విభాగము) :** వల్లరము + ఆ, మిడియారము + ఆ, అల్ల + అంత, కెళవు + అగు, దొరతనము + ఆ, చెల్లన్ + చేయును, మీసి + పైదలుల, వల్లమాలిన, వలపు + కలయికన్, వార్ + ఎవ్వఙును + కారు, సుమీ, పాల్- కారు, బుగ్గల, పసి-వార్ వసులన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మీసి-పైదలుల వల్లమాలిన వలపు-కలయికన్ చెల్లన్-చేయును వల్లరము + ఆ? మిడియారము + ఆ? అల్ల-అంత కెళవు అగు దొరతనము + ఆ? పాల్- కారు బుగ్గల పసి-వార్ వసులన్ వార్ ఎవ్వఙును కారు సుమీ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వల్లరము + ఆ = మంత్రమా? ; మిడియారము + ఆ = పౌరోహిత్యమా? ; అల్ల + అంత = ఎక్కడనో ; కెళవు + అగు = దూరముగా ఉన్న ; దొరతనము + ఆ = ప్రభుత్వమా? ; చెల్లన్ + చేయును = చెల్లుబాటు చేయునది ; మీసి + పైదలుల = పురుష-స్త్రీల యొక్క (ఇక్కడ "స్త్రీపురుషుల యొక్క" అని అర్థము చేసికొనవలె) ; వల్లమాలిన = అపారమైన ; వలపు + కలయికన్ = వలపుతో కూడిన సంభోగమును ; సుమీ = చూడుమీ ; పసి-వార్ వసులన్ = పసిబిడ్డలు తప్ప.

**లోవాఱిక (తాత్పర్యము) :** పరస్పర ఆకృష్టులైన స్త్రీపురుషుల ప్రేమపూర్ణ సంగమమును చెల్లుబాటు చేయునది ఎవఙు? మంత్రములా? పురోహితులా? ఎక్కడనో దూరముగా ఉన్న ప్రభుత్వమా? వీరెవఙును కాదు. వారికి పుట్టఁబోవు పసిబిడ్డలు తమకు తెలియకుండనే ఆ సంగమమును పవిత్రము చేసెదరు. (వారి పుట్టుకయే స్త్రీపురుషులను మాన్య పితరులుగా మార్చి వారిని పవిత్రము చేయును).

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** పిల్లల పుట్టుక ఆడు-మగ కలయికకు ఒక మహోన్నత ప్రయోజనమును కల్పించును. అది స్త్రీ-పురుషులను మాన్య పితరులుగా మార్చి వారిని పవిత్రము చేయును. అందువలన – పిల్లలు తల్లిదండ్రులకు ఋణపడు దాని కన్న తల్లి-దండ్రులు పిల్లలకు ఋణపడునదే ఎక్కువ.

SUMMARY : Who do validate the the passionate love-making between a couple? The holy hymns? The priests? Or the governments? None of these but only the kids who are going to be born to them.

**గంగేరిక** ॥ వలయుఁ గూర్మింప నొక ఆండ్రకున్ ; కూర్మింప నొకటి మగవాండ్రకున్ ;
కందురు మన్నివానుల నాండ్రు ; మన్నిమాల్ మైతులన్ మగవాండ్రు. 88

**మాటల విడఁదీత (పద విభాగము) :** వలయున్ + కూర్మింపన్ + ఒకఙు + ఆండ్రకున్ కూర్మింపన్ + ఒకటి, మగ-వాండ్రకున్, కందురు, మన్నివానులన్ + ఆండ్రు, మన్నిమాల్, మైతులన్, మగ-వాండ్రు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఆండ్రకున్ కూర్మింపన్ ఒకఙు వలయున్. మగ-వాండ్రకున్ కూర్మింపన్ ఒకటి (వలయున్). ఆండ్రు మన్నివానులన్ కందురు. మగ-వాండ్రు మన్నిమాల్ మైతులన్ (కందురు).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వలయున్ = కావలెను ; కూర్మింపన్ = ప్రేమించుటకై ; ఒకఱు = ఒక మనిషి ; ఆండ్రకున్ = స్త్రీలకు ; కూర్మింపన్ + ఒకటి = ఒక వస్తువు ; కందురు = ప్రసవించెదరు ; మన్నివానులన్ = ప్రాణము గలవారిని ; మన్నిమాల్ = జీవము లేని ; మైతులన్ = సంస్థలను.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఆడువారు ఒకఱిని ప్రేమింపఁగోరెదరు. మగవారు ఒక వస్తువును ప్రేమింపఁగోరెదరు. కనుక స్త్రీలు ప్రాణమున్న మనుష్యులకు జన్మ నిచ్చెదరు. పురుషులు ప్రాణము లేని సంస్థలను సిద్ధాంతములను నెలకొల్పెదరు.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** మన్ని = ప్రాణము.

SUMMARY : Women want to love a person and men, a thing. Therefore, women give birth to living beings while men father lifeless organizations/ institutions and ideologies/ theories.

**గోరంటిక జంట** ॥ వలనుపడదు టూకితనము పైదలులకు ; లలివడరు తేఁటవలుకఁగ మగవారలు ;
మేర-మన్దీరు లేర్పఱచెద రొకఱు ; కతనాటి వాల్కమును బొదలింతు రొకఱు ; 89
కలయని కోపు లీ కాకడలు రెండున్ ; కడవఁబెట్టుత నొండోరు కాదిలి మైన్. 90

**మాటల విడఁదీత (పద విభాగము) :** వలను-పడదు, టూకితనము, పైదలులకున్, లలి-పడరు, తేఁట-పలుకఁగన్, మగ-వారలు, మేర-మంచి + తీరుల్ + ఏర్పఱచెదర్ + ఒకఱు, కతనాటి, వాల్కమును + పొదలింతురు + ఒకఱు, కలయని, కోపుల్ + ఈ, కాకడలు రెండున్, కడవన్ + పెట్టుతన్ + ఒండోరు, కాదిలి మైన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** పైదలులకున్ టూకితనము వలనుపడదు. మగవారలు తేఁటపలుకఁగన్ లలిపడరు. ఒకఱు మేర-మంచి + తీరుల్ + ఏర్పఱచెదర్. ఒకఱు కతనాటి వాల్కమును + పొదలింతురు. ఈ కాకడలు రెండున్ కలయని కోపుల్. ఒండోరు కాదిలి మైన్ కడవన్ + పెట్టుతన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** టూకితనము = క్లుప్తత ; పైదలులకున్ = స్త్రీలకు ; లలి-పడరు = ఇష్ట పడరు ; తేఁట-పలుకఁగన్ = స్పష్టముగా చెప్పుటకు ; మేర-మన్ + తీరుల్ = మర్యాదలను, పద్ధతులను ; కతనాటి = తార్కికమైన ; వాల్కమును = వైఖరిని ; పొదలింతురు = పెంపొందించెదరు ; కలయని కోపుల్ = కలవని ధ్రువములు ; ఈ కాకడలు = ఈ తత్త్వములు ; కడవన్ + పెట్టుతన్ = అధిగమించెదరు గాక ; ఒండోరు = పరస్పర- ; కాదిలి మైన్ = ప్రేమతో.

**లోవాఱిక (తాత్పర్యము) :** దేనినైనను క్లుప్తముగా చెప్పుట స్త్రీలకు సరిపడదు. అట్లే దేనినైనను స్పష్టముగా చెప్పుట పురుషులకు ఇష్టముండదు. ఈ లింగజాతులలో ఒకఱు సమాజములో మర్యాదలును, మంచి పద్ధతులును ఏర్పడుటకు కారణమయ్యెదరు. మఱియొకఱు మనుష్యులలో తార్కిక ధోరణిని పెంపొందించెదరు. ఇవి ఎక్కడను కలయని ఉత్తర దక్షిణ ధ్రువములు. అయినను ఇవి రెండును అవసరమే. కనుక స్త్రీ-పురుషులు పరస్పర ప్రేమ సహాయముతో ఈ తేడాలను అధిగమించెదరు గాక !

SUMMARY : Women are not comfortable with abridging topics. To elaborate on anything is not men's cup of tea. One of these genders establishes manners and etiquette in the society, while the other promotes a logical bent of mind. Both are indispensable in spite of being poles apart. May folks overcome these gender differences by way of mutual love !

**రాల్మిక జంట** ॥ మగవారి కావళంబుల సగ మావలి మెచ్చింపన్ ;
మగువల గర్గలములలో సగ మావలి నలరింపన్ ; 91
మగవారు కావించెదరు విఱివియము నోర్పాదుగాన్ ;

మగువలుఁ బొనరింతురు బ్రదిమాన మిది బ్రదుకల్విగాన్. 92

**మాటల విడఁదీత (పద విభాగము) :** మగ–వారి, కావళంబులన్, సగము + ఆవలిన్, మెచ్చింపన్, మగువల, గర్గలములలోన్, సగము + ఆవలిన్, అలరింపన్, మగ–వారు, కావించెదరు, విఱివియమున్ + ఓర్పాదుగాన్, మగువలున్ + పొనరింతురు, బ్రదిమానము + ఇది, బ్రదుకల్విగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మగవారి కావళంబులన్ సగము ఆవలిన్ మెచ్చింపన్. మగువల గర్గలములలోన్ సగము ఆవలిన్ అలరింపన్. మగవారు విఱివియమున్ ఓర్పాదుగాన్ కావించెదరు. మగువలున్ బ్రదిమానము ఇది బ్రదుకల్విగాన్ పొనరింతురు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కావళంబులన్ = పాపములలో ; ఆవలిన్ = అవతలి పక్షమును ; మెచ్చింపన్ = సంతోషపెట్టుటకు ; గర్గల ములలోన్ = పుణ్యములలో ; అలరింపన్ = సంతోషపెట్టుటకు ; కావించెదరు = చేసెదరు ; విఱివియమున్ = లోకమును ; ఓర్పాదుగాన్ = ఓర్వఁదగినదిగా ; పొనరింతురు = చేసెదరు ; బ్రదిమానము + ఇది = ఈ జీవితమును ; బ్రదుకల్విగాన్ = బ్రదుకఁదగినదిగా (బ్రదుకు టకు సుఖమైనదిగా). .

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Men render the world bearable while women make life livable.

*(The rest is obvious).*

**వెల్మిరిక ||** విడిపోయిన పదపడియున్ దా, రొండొరులఁ దలపోయుచున్నన్,

విడిపోవలేదు నిక్కముగాఁ , గలసి యున్నారు కలకారుగా. 93

**మాటల విడఁదీత (పద విభాగము) :** విడిపోయిన, పదపడి + ఉన్ + తార్ + ఒండొరులన్ + తలపోయుచున్ + ఉన్నన్, విడి–పోవన్ లేదు, నిక్కముగాన్ + కలసి + ఉన్నారు, కలకారుగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** విడిపోయిన పదపడి + ఉన్ తార్ ఒండొరులన్ తలపోయుచున్ ఉన్నన్ నిక్కముగాన్ విడి–పోవన్ లేదు. కలకారుగాన్ కలసి ఉన్నారు

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** విడిపోయిన పదపడి + ఉన్ = విడిపోయిన తరువాత కూడ ; తార్ = తాము ; ఒండొరులన్ = ఒకఱి నొకఱు ; తలపోయుచున్ + ఉన్నన్ = ఆలోచించుచున్నచో ; నిక్కముగాన్ = నిజముగా ; కలకారుగాన్ = శాశ్వతముగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** "ఒకఱిని గూర్చి ఒకఱు ఆలోచింపక ఉండలేనప్పుడు విడిపోవుట అకక్కఱ" అని కవి భావము.

SUMMARY : If two people keep thinking about each other even after parting ways, they are as good as stuck together for ever but not really separated.

*(The poet implies that it is in deed in vain to fall out if they cannot help thinking about each other).*

**వాణిద ||** లాసిగ నగి మఱువఁజాలెదరు లాతుల కడసేతల ;

మగవానికి మగువ వలన - మగువకు మగవాని వలన

నగు మంచి చెడుగౌపొందులు మఱువర్ది బ్రదిమానము ;

బల్ పోతరి మస్తరము బల్ మడిమంచ యీ తౌలము. 94

**మాటల విడఁదీత (పద విభాగము) :** లాసిగన్, నగి, మఱువన్ + చాలెదరు, లాతుల, కడ–సేతలన్, మగ–వానికిన్, మగువ వలనన్, మగువకున్, మగ–వాని వలనన్ + అగు, మంచి–చెడుగు + ఔపొందులు, మఱువర్ది, బ్రదిమానమున్, బల్–పోతరి–మస్తరమున్, బల్–మడిమంచ + ఈ, తౌలము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** లాతుల కడ–సేతలన్ లాసిగన్ నగి మఱువన్ చాలెదరు. మగవానికిన్ మగువ వలనన్ మగువకున్ మగ–వాని వలనన్ అగు మంచి–చెడుగు– ఔపొందులు బ్రదిమానమున్ మఱువర్ది. ఈ తౌలము బల్–పోతరి–మస్తరమున్ బల్–మడి మంచ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** లాసిగన్ = బిగ్గరగా ; నగి = నవ్వి ; మఱువన్ + చాలెదరు = మఱచిపోఁగలరు ; లాతుల = ఇతరుల ; కడ–సేతలన్ = గతకాలపు పనులను ; ఔపొందులు = అనుభవములు ; మఱువర్ది = మఱువరానిది ; బ్రదిమానమున్ = జీవితమంతయు ; బల్–పోతరి–మస్తరమున్ = మిక్కిలి బలమైన బంధమును ; బల్–మడిమంచ = మిక్కిలి బలహీనము ; ఈ తౌలము = ఈ స్త్రీపురుష సంబంధము.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఇతరులు తమ పట్ల చేసిన గతకాలపు చేష్టలన్నింటిని జనము చాల తేలికగా నవ్వివేసి మఱచిపోఁగలరు. కాని మగవారు తమకు దగ్గఱైన ఆడువారి వలనను, అట్లే ఆడువారు తమకు దగ్గఱైన మగవారి వలనను కలిగిన మంచి–చెడు అనుభవములను మఱచిపోవుట జీవితాంతము అసాధ్యమే. స్త్రీపురుష సంబంధము ఈ ప్రపంచములో అన్నింటి సంబంధముల కన్నను మిక్కిలి బలమైనది. అదే సమయములో వాటన్నిఁటి కన్నను ఇది మిక్కిలి బలహీనమైనది కూడ.

SUMMARY : Folks can easily laugh off and forget the things done by others in the past. How ever, they cannot do so in the case of the good and bad experiences they underwent at the hands of the men and women who became intimate to them. Man–woman relationship is the most powerful one among all in the world. At the same time, it is the most feeble one too.

**వెల్మిరిక తగ్గు** ॥ తప్పుఁ జేయఁగూడదని తెలియఁ , జెప్పుటకే వరకంబులు ;
సమారాకమును బొంది రెంచ, సామించున దేమున్నది ? 95

**మాటల విడఁదీత (పద విభాగము) :** తప్పున్ + చేయన్ + కూడదు + అని, తెలియన్ + చెప్పుటకున్ + ఏ, వరకంబులు, సమా–రాకమును + పొంది, రెంచ, సామించునది + ఏమి + ఉన్నది ?

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వరకంబులు = శిక్షలు ; సమా–రాకమును = మరణ దండనమును ; రెంచ = మనిషి ; సామించునది = అభ్యసించునది.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Punishments are meant for teaching the felon that crime should not be resort–ed to. But what is there to learn and apply to a felon's life if he is awarded death penalty?

**తామరిక** ॥ ఎలసోయి కెదిరిగ వింత కావళముల కొడిగట్టుచున్న బల్-
కట్టిఁడి యేలుకోటిని వడిఁ గట్టడి సేయన్ విడ్డూరపుఁ
జట్టములు వచ్చు టక్కఁజమే? మేటి చెలి ౨ అనిపించుకొను నిల-

వేఁపిని గలిదము పొలియింపరె, వెఱ్ఱిదై యెల్లఱఁ గఱువఁబోన్? 96

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎలసోయికిన్ + ఎదిరిగన్, వింత, కావళములకున్ + ఒడిగట్టుచున్ + ఉన్న, బల్-కట్టిఁడి, ఏలుకోటిని, వడిన్ + కట్టడి + చేయన్, విడ్డూరపుం + చట్టములు, వచ్చుట + అక్కజము + ఏ, మేటి, చెలి, అనిపించుకొను + ఇల-వేఁపిని + కలిదము, పొలియింపరు + ఎ, వెఱ్ఱిది + ఐ, ఎల్లఱన్ + కఱువన్ + పోన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ...వెఱ్ఱిది ఐ ఎల్లఱన్ కఱువన్ పోన్.మేటి చెలి అనిపించుకొను ఇల-వేఁపిని కలిదము పొలియింపరు + ఎ. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎలసోయికిన్ = ఇంగితజ్ఞానమునకు ; ఎదిరిగన్ = విరుద్ధముగా ; వింత కావళములకున్ = విచిత్రమైన పాపములకు ; ఒడిగట్టుచున్ + ఉన్న = పాల్పడుచున్న ; బల్-కట్టిఁడి = మిక్కిలి విశృంఖలమైన/ అరాచకమైన ; ఏలుకోటిని = పౌరులను ; వడిన్ = తొందఱగా ; కట్టడి + చేయన్ = అదుపు చేయుటకు ; విడ్డూరపుం + చట్టములు = విచిత్ర శాసనములు ; అక్కజము + ఏ = ఆశ్చర్యకరమా? ; మేటి చెలి = ప్రాణమిత్రము ; ఇల-వేఁపిని = పెంపుడు కుక్కను ; కలిదము = కూడా ; పొలియింపరు + ఎ = చంపరా? ; ఎల్లఱన్ = అందఱిని ; కఱువన్ + పోన్ = కఱుచుటకు ప్రయత్నింపఁగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** "మనుష్యులు ఇట్లు కూడ చేసెదరా?" అని ఇంగితజ్ఞానులలో నివ్వెఱపాటును కలిగించు వింత పాపములకు దిగు నట్టి అరాచకపు పౌరులను అదుపు చేయుటకై అంతకన్న విడ్డూరపు చట్టములు వచ్చుటలో ఆశ్చర్యము ఏమున్నది? పెంపుడు కుక్కను ప్రాణ మిత్రము వలె చూచుకొనువారు కూడ — అది వెఱ్ఱెత్తి అందఱి మీఁదఁ బడి కఱవఁజూచినచో దానిని పెద్దనిదుర పుచ్చెదరు కదా?

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** (౧) ఏలుకోటి = పౌరుఁడు/ పౌరురాలు/ పౌరులు. ఇది లింగ-వచన-రహితమైన నామవాచకము.

(౨) సంఘశాంతికై మరణ శిక్షల వంటి అమానుష చర్యలు తప్ప వేఱే విడఁద్రెంపు లేదన్న పొఱఁబాటు ఎంచిక విఱివిగా ప్రాఁకిపోవుటకు కారణము — కొందఱు పాల్పడుచున్న వింత-విడ్డూరపు నేఱములేనని, కనుక అటువంటి నేఱములకు ఒడిగట్టవలదనియు సందేశము.

SUMMARY : What is there to wonder at, if weird laws are enacted to control the unruly citizens who commit the sort of sins which bewilder those with commonsense? Even those who treat a pet dog like their bosom friend, put it down, if he turns rabid and tries to bite everyone, don't they?

**నల్వతమ్మిక ॥** మందిమేలును గుఱించియె నెఱించు మందొరతనంబును మన్యకట్టును,
దొడరి రవణిల్లు మన్మందియమును దొరకు టరిది యే కారుఁద్రుంకమునను,
రెప్పమొండోరు పొంతనారులగు నబ్బగొడుకుల వలె నానసమునన్. 97

**మాటల విడఁదీత (పద విభాగము) :** మంది-మేలును + కుఱించి + ఎ, నెఱించు, మంచి + దొరతనంబును, మన్యకట్టును + తొడరి, రవణిల్లు, మంచి + మందియమును, దొరకుట + అరిది + ఏ, కారు-త్రుంకమునను, రెప్పము + ఒండోరు-పొంతనారులు + అగు + అబ్బ + కొడుకుల వలెన్ + ఆనసమునన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఏ కారు-త్రుంకమునను మంది-మేలును కుఱించి + ఎ నెఱించు మంచి-దొరతనంబును మన్యకట్టును తొడరి రవణిల్లు మంచి-మందియమును రెప్పము ఒండోరు-పొంతనారులు అగు అబ్బ -కొడుకుల వలెన్ ఆనసమునన్ దొరకుట అరిది.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మంది-మేలును + కుఱించి + ఎ = ప్రజాహితమును గుఱించి మట్టుకే ; నెఱించు = చింతించునట్టి ; మంచి + దొరతనంబును = మంచి ప్రభుత్వమును ; మన్యకట్టును = రాజ్యాంగమును ; తొడరి = అనుసరించి ; రవణిల్లు = వర్తించునట్టి ; మంచి

+ మందియమును = మంచి జనాభాయు ; అరిది = అపరూపము ; ఏ కారు-త్రుంకముననను = ఏ కాలఖండములో నైనను ; రెప్పము = పూర్తిగా ; ఒండోరు-పొంతనారులు = పరస్పర సమన్వయ వంతులు ; ఆనసమునన్ = లోకములో.

**లోవాఱిక (తాత్పర్యము) :** జనశ్రేయమును గుఱించి మట్టుకే ఆలోచించు ప్రభుత్వము ఉండుటయు, దాని క్రింద – రాజ్యాంగము ననుసరించి నడచుకొనునట్టి జనాభా ఉండుటయు – పరస్పర సమన్వయము గల తండ్రిగొడుకులు ఉండుట వలెనె – ఏ కాలఖండములో నైన మిక్కిలి అపరూపము.

SUMMARY : At any time in history, seldom do we find a good government which only keeps public good in view and the kind of populace which follows the Constitution – just like it is to find a duo of father and son who are fully compatible with each other.

**అవిగింగ ॥** తొంగలింప నలవియే దొరతనము వారికిఁ
ద్రొక్కటపడుచుండఁగ మిక్కిలి యేలుకోటి?
మిన్నెత్తు మ్రాఁకులకును బైలమెట్లు వచ్చు,
గ్రిన్నేలబారు గఱికక కంటుకొనఁగఁ జిచ్చు? 98

**మాటల విడఁదీత (పద విభాగము) :** తొంగలింపన్ + అలవి + ఏ, దొరతనము-వారికిన్ + త్రొక్కటపడుచున్ + ఉండఁగన్, మిక్కిలి, ఏలుకోటి, మిన్ను + ఎత్తు, మ్రాఁకులకును + పైలము + ఎట్లు, వచ్చున్ + క్రిందన్ + నేలబారు-గఱికకున్ + అంటుకొనఁగన్ + చిచ్చు?

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఏలుకోటి మిక్కిలి త్రొక్కటపడుచున్ ఉండఁగన్ దొరతనము వారికిన్ తొంగలింపన్ అలవి + ఏ? క్రిందన్ + నేలబారు-గఱికకున్ చిచ్చు అంటుకొనఁగన్ మిన్ను + ఎత్తు మ్రాఁకులకును పైలము ఎట్లు వచ్చున్?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తొంగలింపన్ = వెలిఁగిపోవుట ; అలవి + ఏ = సాధ్యమా? ; దొరతనము వారికిన్ = ప్రభుత్వమువారికి ; త్రొక్కటపడుచున్ + ఉండఁగన్ = సంకటపడుచు ఉండఁగా ; మిక్కిలి = ఎక్కువగా ; ఏలుకోటి = పౌరులు ; మిన్ను + ఎత్తు = ఆకాశ ప్రమాణముగా పెరిగిన ; మ్రాఁకులకును = మహావృక్షములకైనను ; పైలము = భద్రత ; గఱికకున్ = గడ్డికి ; చిచ్చు = కార్చిచ్చు/ అడవి మంట.

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రజలు కష్టపడుచుండఁగా ప్రభుత్వము సుఖపడుట సాధ్యమేనా? అడవిలో నేల మీఁది గడ్డికి నిప్పంటుకొనఁగా ఆకాశమంత ఎత్తు ఎదిగిన మహావృక్షములకు మాత్రము రక్షణ ఉండునా?

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** 'మ్రాను' మొదలైన మాటలకు బహువచన 'లు' ప్రత్యయము చేరినప్పుడు ఆ మాటచివరి 'ను' వర్ణక మునకు అరసున్న మున్నరించిన 'కు' వర్ణకము ఆదేశమగును.
మ్రాను + లు = మ్రాకులు. ఇట్లే-
కొలను + లు = కొలఁకులు.
వలను + లు = వలఁకులు (దిక్కులు).

SUMMARY : Can a government be happy while the people languish? No matter however tall they grew, can the big trees in a forest remain safe if the grass on the ground catches fire?

**సంపంగి జంట ॥** ఉల్లాప త్యాలు బరిమీఱిన కాసుల క్రచ్చు ;
ఉంట నది యెల్లలకుఁ దందరుసని పరి యెంచు ;
ఆ వేదుఱి నోవరుల తలల కెక్క దెద్దియు,

నొక కూర్మి యొక హాళి యొక నడితి యొక కాకడ, 99
యొక కావళ మొక గర్గల మొక రెందౌలమున్ ;
కీడించెద రొరులకు బుఙ్ఙ సెడినవారి వలె ;
పగటి కలలఁ దేలెదరు తల పాడైనటులే ;
వారినే పరి ౨ అగ్గింతురు గెలువానులుగాన్. 100

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఉల్లాప–త్యాలు, బరి–మీఱిన, కాసుల, క్రచ్చు, ఉంటన్ + అది + ఎల్లఱకున్ + తందరుసు + అని, పరి + ఎంచున్, ఆ, వేదుఱి, నోవరుల, తలలకున్ + ఎక్కదు + ఎద్దియున్ + ఒక, కూర్మి + ఒక, హాళి + ఒక, నడితి + ఒక, కాకడ + ఒక, కావళము + ఒక, గర్గలము + ఒక, రెంచ + తౌలమున్, కీడించెదరు + ఒరులకున్, బుఙ్ఙ + చెడిన–వారి, వలెన్, పగటి, కలలన్ + తేలెదరు, తల, పాడు + ఐన + అటుల్ + ఏ, వారిన్ + ఏ, పరి, అగ్గింతురు, గెలువానులుగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** బరి–మీఱిన కాసుల క్రచ్చు ఉల్లాప–త్యాలు. అది ఎల్లఱకున్ ఉంటన్ (అది) తందరుసు అని పరి ఎంచున్. ఆ వేదుఱి నోవరుల తలలకున్ ఒక కూర్మి ఒక హాళి ఒక నడితి ఒక కాకడ ఒక కావళము ఒక గర్గలము ఒక రెంచ తౌలమున్ ఎద్దియున్ ఎక్కదు. బుఙ్ఙ చెడిన–వారి వలెన్ ఒరులకున్ కీడించెదరు. తల పాడు ఐన అటుల్ + ఏ పగటి కలలన్ తేలెదరు. వారిన్ + ఏ పరి గెలువానులుగాన్ అగ్గింతురు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఉల్లాప–త్యాలు = మానసిక రోగము ; బరి–మీఱిన = మితిమీఱిన ; కాసుల క్రచ్చు = ధనాశ ; ఉంటన్ + అది = అది ఉండుట చేత ; ఎల్లఱకున్ = అందఱికిని ; తందరుసు = సాధారణము ; పరి = ప్రజ ; ఎంచున్ = భావించును ; ఆ వేదుఱి నోవరుల = ఆ రోగము గల రోగుల యొక్క ; ఎద్దియున్ = ఏదియు ; కూర్మి = ప్రేమ ; హాళి = ఆసక్తి ; నడితి = నీతి ; కాకడ = తత్త్వము ; + కావళము = పాపము ; గర్గలమున్ = పుణ్యము కూడ ; రెంచ + తౌలమున్ = మానవ సంబంధము కూడ ; కీడించెదరు = అపకారము చేసెదరు ; ఒరులకున్ = ఇతరులకు ; బుఙ్ఙ + చెడిన–వారి వలెన్ = మతి పోయినవారి వలె ; అగ్గింతురు = పొగడెదరు ; గెలువాను లుగాన్ = విజేతలు అని.

**లోవాఱిక (తాత్పర్యము) :** మితిమీఱిన ధనాశ ఒక మానసిక రోగము. కాని ఆ రోగము సమాజములో అందఱికిని ఉండుట చేత దానిని ఎవ ఱును రోగముగా చూడరు. పైపెచ్చు సర్వసాధారణ విషయముగా భావించెదరు. ఆ రోగ లక్షణములు ఎట్లుండు ననఁగా – ఆ పిచ్చి పట్టిన వారికి ఒక ప్రేమ, ఒక ఆసక్తి, ఒక నీతి, ఒక తత్త్వచింతన, పాపపుణ్యములు, మానవ సంబంధములు – ఏవియు ఉండవు. అచ్చము మతి పోయినవారి వలెనె ఇతరులకు అపకారము చేసెదరు. అట్లే పగటి కలలలో మునిఁగి తేలుచుందురు. కాని ఆ మానసిక రోగులనే జనము విజేతలని పొగడుచుందురు.

SUMMARY : Excessive avarice is a mental disease too. However, no one considers it as such, since nearly everyone in the society has it. The symptoms of the disease manifest themselves in the form of disinterest in everything like love, ethics, philosophy and human relations. They harm others and engage in avaricious revelry just like maniacs. Yet folks only praise those mental patients as winners.

***తలిరిక (అవతారిక) :*** *విద్యార్థులును, వ్యాపారులును, ఉద్యోగస్థులును, కృషీవలులు మఱియు తదితరులు తాము చేయు పనుల నిత్యక్రమమును మానరాదనియు, అకక్కఱగా సెలవు తీసికొనఁగూడదనియు ఈ క్రింది పద్యములలో చెప్పుచున్నాఁడు.*

**దాసానిక జంట** ॥ చన మానకు బడికిన్ జదివించిన లేకున్నన్ ;
మూాయకు కొట్టుఁ గొనువార్ మూఁగినన్ లేకున్నన్ ;

పాఱు కెల్సమిలికిన్ బని యున్నన్ లేకున్నన్ ;
పొమ్ము పొలమునకు నారుఁ బోసినన్ లేకున్నన్ ; 101
మ్రొక్కు వంకటికిఁ దాయమిచ్చినన్ లేకున్నన్ ;
కదల్పు హుమాతిఁ దరల వలసినన్ లేకున్నన్. 102

**మాటల విడఁదీత (పద విభాగము) :** చనన్ + మానకు, బడికిన్ + చదివించినన్, లేక + ఉన్నన్, మూయకు, కొట్టున్ + కొను-వార్, మూఁగినన్, లేక + ఉన్నన్, పాఱు, కెల్సమిలికిన్ + పని + ఉన్నన్, లేక + ఉన్నన్, పొమ్ము, పొలమునకున్, నారున్ + పోసినన్, లేక + ఉన్నన్, మ్రొక్కు, వంకటికిన్ + తాయము + ఇచ్చినన్, లేక + ఉన్నన్, కదల్పు, హుమాతిన్ + తరల వలసినన్, లేక + ఉన్నన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చదివించినన్ లేక ఉన్నన్ బడికిన్ చనన్ మానకు. కొనువార్ మూఁగినన్ లేక ఉన్నన్ కొట్టున్ మూయకు. పని ఉన్నన్ లేక ఉన్నన్ కెల్సమిలికిన్ పాఱు. నారున్ పోసినన్ లేక ఉన్నన్ పొలమునకున్ పొమ్ము. తాయము ఇచ్చినన్ లేక ఉన్నన్ వంకటికిన్ మ్రొక్కు. తరల వలసినన్ లేక ఉన్నన్ హుమాతిన్ కదల్పు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చనన్ + మానకు = పోవుట మానవలదు ; చదివించినన్ = పాఠములు చెప్పినను ; లేక + ఉన్నన్ = లేక పోయినను ; కొట్టున్ = దుకాణమును ; పాఱు = పరుగెత్తుము ; కెల్సమిలికిన్ = కార్యాలయమునకు ; వంకటికిన్ = భగవంతునికి ; తాయము + ఇచ్చినన్ = వరమిచ్చినను ; కదల్పు = కదిలింపుము ; హుమాతిన్ = వాహనమును ; తరల వలసినన్ = ప్రయాణింప వలసినను.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఏ పని నైనను నిత్యక్రమముగా చేయుట అలవడనిచో దానిపై శ్రద్ధ తగ్గును. ఆ తరువాత ఓటములే ఎదురగు నని భావము.

SUMMARY : Go to school whether the lessons are taught there or not. Keep your shop open whether customers throng it or not. Hurry up to the office whether there is work to do or not. Daily make it to the farm whether saplings are planted there or not. Kneel before God whether He grants you boons or not. Start your vehicle everyday whether you commute/ travel or not.

**దాసానిక** ॥ సామఱి మఱపిదమౌఁ జదువులుఁ దాళీకములున్ ;
పైసరమునఁ మసఁగక మాసెడుఁ బెణ్మీసికమున్ ;
ఆసాదింపక తెగు వంకునెరిమారి లంకెల్,
నానాడుఁ జనక కొలువున్ బోనాడుకొన్నటులె. 103

**మాటల విడఁదీత (పద విభాగము) :** సాము+ అఱి, మఱపిదము + ఔన్ + చదువులున్ + తాళీకములున్, పైసరమునన్, మసఁగక, మాసెడున్ + పెణ్ + మీసికమున్, ఆసాదింపక, తెగున్, వంకు-నెరిమారి-లంకెల్, నాడున్ + నాడున్, చనక, కొలువున్ + పోనాడుకొన్న + అటులె.

**చఱమోలి (అన్వయ క్రమము) :** సాము+ అఱి మఱపిదము ఔన్ చదువులున్ తాళీకములున్ పైసరమునన్ మసఁగక మాసెడున్ పెణ్ + మీసికమున్ ఆసాదింపక తెగున్ వంకు-నెరిమారి-లంకెల్ నాడున్-నాడున్ చనక కొలువున్ పోనాడుకొన్న అటులె.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సాము+ అఱి = అభ్యాసము లోపించి ; మఱపిదము + ఔన్ = విస్మృతమగును ; తాళీకములున్ = సామ

ర్థ్యములు (నేర్పులు / నైపుణ్యములు) కూడ ; పైసరమునన్ = సంభోగమునందు ; మసఁగక = విజృంభింపనిచో ; మూసెడున్ = మందగించును ; పెణ్ + మీసికమున్ = స్త్రీపురుష సంబంధము కూడ ; ఆసాదింపక = పూజింపనిచో ; తెగున్ = తెగిపోవును ; వంకు-నెరిమారి-లంకెల్ = భగవంతునికి భక్తునికి గల సంబంధము ; నానాడున్ (నాడున్ + నాడున్) = ప్రతి దినమును ; చనక = పోకపోవుట వలన ; కొలువున్ = ఉద్యోగమును ; పోనాడుకొన్న + అటులె = పోఁగొట్టుకొన్న విధముగానే.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఎల్లప్పుడును సాధన చేయకపోవుట చేత విద్యలును, నైపుణ్యములును మఱపునకు వచ్చును. అప్పుడప్పుడైనను సంభోగింపనిచో స్త్రీపురుషుల నడుమ ఆత్మీయ సంబంధము క్షీణించును. ప్రతి దినము పూజ చేయనిచో భగవంతునికి భక్తునికి నడుమ సాన్నిహిత్యము తెగిపోవును. ఏ విధముగా నైతే ప్రతి దినము పోయి పనిచేయక పోవుట వలన ఉద్యోగము పోవునో అట్లే ఈ విషయములు సైతము జరుగును.

SUMMARY : Studies and skills go into oblivion for want of regular practice. Man-woman relationship gradually dies down for want of occasional sexual intercourse. The devotee moves farther away from God if the former ceases to worship the latter regularly. These things occur the same way a job is lost owing to one's irregularity.

**తామరిక ॥** మప్పితము గావలయు మడియువు తన మట్టమువారి తరమునకు,
మార్తమునందు నేస్తమునందు మరుఁగూర్మలందు మనువునందు,
పాలివానికమందు వాటులయం దిరుగువొరుగం దెరవందు,
నావపాఱికల వెల్లడియం దెపుడున్ సరియాలుటి పరికిన్. 104

**మాటల విడఁదీత (పద విభాగము) :** మప్పితము + కావలయున్, మడియువు, తన, మట్టము-వారి, తరమునకున్, మార్తమునందున్, నేస్తమునందున్, మరులు + కూర్మలందున్, మనువునందున్, పాలివానికమందున్, వాటులయందున్ + ఇరుగు + పొరుగందున్ + ఎరవందున్ + ఆవపాఱికల, వెల్లడియందున్ + ఎపుడున్, సరియాలుటి, పరికిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మడియువు మార్తమునందున్ నేస్తమునందున్ మరులు-కూర్మలందున్ మనువునందున్ పాలివానికమందున్ వాటులయందున్ ఇరుగు-పొరుగందున్ ఎరవందున్ ఆవపాఱికల వెల్లడియందున్ ఎపుడున్ తన మట్టము-వారి తరమునకున్ సరియాలుటి పరికిన్ మప్పితము కావలయున్.

**కుఱు మమ్మాఱిక (లఘుటీక) :** మప్పితము = పరిమితము ; మడియువు = మర్త్యుఁడు ; తన మట్టము-వారి = తన స్థాయికి చెందినవారి యొక్క ; తరమునకున్ = శ్రేణికి ; మార్తమునందున్ = శత్రుత్వములోను ; నేస్తమునందున్ = స్నేహములోను ; మరులు + కూర్మలందున్ = కామములోను, ప్రేమలోను ; మనువునందున్ = పెండ్లిలోను ; పాలివానికమందున్ = భాగస్వామ్యములోను ; వాటులయందున్ = వాదనలలోను ; ఇరుగు + పొరుగందున్ = పొరుగు కాఁపరస్తుఁడుగా ఉండుటలోను ; ఎరవందున్ = అప్పులు తీసికొనుటలోను / ఇచ్చుటలోను ; ఆవపాఱికల వెల్లడియందున్ = ఆలోచనలను పంచుకొనుటలోను ; సరియాలుటి పరికిన్ = తనవంటి స్వభావము గల జనమునకు.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనుష్యుఁడు ఈ క్రింది విషయములలో ఎల్లప్పుడును తన స్థాయికి చెందినవారికిని మఱియు తనవంటి స్వభావము గలవారికే పరిమితము కావలెను. (౧) శత్రుత్వము పెట్టుకొనుట (౨) స్నేహము చేయుట (౩) సంభోగించుట (౪) ప్రేమించుట (౫) పెండ్లి చేసికొనుట (౬) వ్యాపార వ్యవహారములలో భాగస్వామ్యము (౭) ఏదైన ఒక విషయమును గుఱించి వాదించుట (౮) నివాసమును ఏర్పఱుకొనుట (౯) అప్పులు తీసికొనుట లేదా ఇచ్చుట (౧౦) ఆలోచనలను పంచుకొనుట.

SUMMARY : Man should limit his interaction to the people of his own status and nature in

the following matters : (1) Enmity (2) Friendship (3) Copulation (4) Love/ Romance (5) Marriage (6) Business or event partnership (7) Argument (8) Sharing a neighbourhood (9) Giving or taking loans (10) Sharing opinions.

**అసిగంగేరిక॥** చెరి చేబైలన్ జెలఁగును గొన్ని, మఱువల్కులు మాలిన మల్కలు,
విడఁద్రెంపరాని కైపదములు ; అంతమట్టునఁ ద్రోసిపుచ్చకు-
మా చేబైలి నెనమొత్తముగాన్. 105

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెరి చేబైలన్ + చెలఁగును + కొన్ని, మఱువల్కులు మాలిన, మల్కలు విడఁద్రెంపన్, రాని, కైపదములు, అంత–మట్టునన్ + త్రోసిపుచ్చకుము + ఆ, చేబైలిన్ + ఎనమొత్తముగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చెరి చేబైలన్ మఱువల్కులు మాలిన మల్కలు (మఱియు) విడఁద్రెంపన్ రాని కైపదములు కొన్ని చెలఁగును. అంత–మట్టునన్ ఆ చేబైలిన్ ఎనమొత్తముగాన్ త్రోసిపుచ్చకుము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చెరి చేబైలన్ = ప్రతి రంగములోను ; చెలఁగును = వ్యాపించును ; మఱువల్కులు మాలిన = సమాధాన ములు లేని ; మల్కలు = ప్రశ్నలు ; విడఁద్రెంపన్ రాని = పరిష్కరించుట వీలుపడని ; కైపదములు = సమస్యలు ; అంత–మట్టునన్ = అంతమాత్రము చేత ; ఆ చేబైలిన్ = ఆ రంగమును ; ఎనమొత్తముగాన్ = ఏకమొత్తముగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Every field abounds in several unanswered questions and unsolved problems. But do not dismiss those fields altogether, citing the stalemates.

**<u>చదును అవిగింగ మున్నంగి :</u>**

తానేమి గఱచెనో తారివానులు వలుక,
మామఱించు నదియే మస్తరించిన చిలుక ;
విచ్చుగ నెగసి లోన నచ్చునదే మెసవెడి
ద్రిచ్చు కుహువాలతియ మెచ్చగు విసువు లేక ; 106
కోట నాఁటిన కట్టి గంగేరిక కుసుకున్ ;
పెరట నాఁట నదియే పెరిగి రేటఁ దనుకున్ ;
చిఱుగుంతలన్ నిలువజేసిన నీరు లొగ్గిఁడి ;
పరువళ్ళు ద్రొక్కుచున్ బాఱు నీరె యొబ్బిడి ; 107
మస్తరంబున లేని మస్టాడమి కొనసాఁగు ;
విచ్చుకంబునఁ దామె వీసరంబు లొదుగు ;
తన్నాటికమునఁ దన వేదారిమి విఱియు ;
సరిసాటి యివి రెంబసరములకుఁ ద్రేసులకు. 108

**మాటల విడఁదీత (పద విభాగము) :** తాన్ + ఏమి, గఱచెన్ + ఓ, తారివానులు + పలుకన్, మామఱించున్ + అది + ఏ, మస్తరించిన, చిలుక, విచ్చుగన్ + ఎగసి, లోనన్, నచ్చునది + ఏ, మెసవెడి, ద్రిచ్చు, కుహువా + ఆలతి + అ, మెచ్చు + అగున్, విసువు, లేక, కోటన్, నాఁటిన, కట్టి, గంగేరిక, కుసుకున్, పెరటన్, నాఁటన్ + అది + ఏ, పెరిగి, రేటన్ + తనుకున్, చిఱు–గుంతలన్, నిలువ + చేసిన, నీరు,

లొగ్గిఁడి, పరువళ్ళు + త్రొక్కుచున్ + పాఱు, నీరు + ఎ + ఒబ్బిడి, మస్తరంబునన్, లేని, మస్టు + ఒడమి, కొనసాఁగున్, విచ్చుకంబునన్, తాము + ఎ, వీసరంబుల్ + ఒదుగున్, తన్పాటికమునన్ + తన, వేదారిమి, విఱియున్, సరిసాటి + ఇవి, రెంచ + పసరములకున్ + త్రేసులకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** : తారివానులు పలుకన్ తాన్ ఏమి గఱచెన్ + ఓ మస్తరించిన చిలుక అది + ఏ మామఱించున్, విచ్చుగన్ ఎగసి లోనన్ నచ్చునది + ఏ మెసవెడి ద్రిచ్చు కుహువా + ఆలతి + అ విసువు లేక మెచ్చు అగున్. కోటన్ నాఁటిన కఱ్ఱి గంగేరిక కునుకున్. పెరటన్ నాఁటన్ అది + ఏ పెరిగి రేటన్ తనుకున్. చిఱు-గుంతలన్ నిలువ చేసిన నీరు లొగ్గిఁడి. పరువళ్ళు త్రొక్కుచున్ పాఱు నీరు + ఎ ఒబ్బిడి. మస్తరంబునన్ లేని మస్టు ఒడమి కొనసాఁగున్. విచ్చుకంబునన్ తాము + ఎ వీసరంబుల్ ఒదుగున్. తన్పాటికమునన్ తన వేదారిమి విఱియున్. ఇవి రెంచ-పసరములకున్ త్రేసులకున్ సరిసాటి.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గఱచెన్ + ఓ = నేర్చుకొనెనో ; తారివానులు = యజమానులు ; పలుకన్ = చెప్పఁగా ; మామఱించున్ = పునరావృత్తము చేయును (repeat చేయును) ; అది + ఏ = ఆ మాటనే ; మస్తరించిన చిలుక = బంధించిన చిలుక ; విచ్చుగన్ = స్వేచ్ఛగా ; ఎగసి = ఎగిరి ; లోనన్ = మనస్సులో ; మెసవెడి = తినునట్టి ; ద్రిచ్చు = అదృశ్యమైన ; కుహువా + ఆలతి + అ = కోకిల గానమే ; మెచ్చు + అగున్ = ప్రశస్తమగును ; కఱ్ఱి గంగేరిక = కృష్ణ తులసి (నల్ల గగ్గెర) మొక్క ; కునుకున్ = నిద్రపోవును ; పెరటన్ = దొడ్డిలో ; నాఁటన్ = నాటఁగా (నాఁటినప్పుడు) ; అది + ఏ = ఆ కృష్ణతులసి మొక్కయే ; రేటన్ = భుజమును ; తనుకున్ = తాఁకును ; లొగ్గిఁడి = మురికి ; పాఱు = ప్రవహించునట్టి ; ఒబ్బిడి = శుభ్రము ; మస్తరంబునన్ = బంధనములో ; లేని మస్టు = అంతకు ముందు లేని కాలుష్యము ; ఒడమి = పుట్టి ; విచ్చుకంబునన్ = స్వాతంత్ర్యమునందు ; తాము + ఎ = తమంతట తామే ; వీసరంబుల్ = ఆ లోపములు ; ఒదుగున్ = సర్దుకపోవును ; తన్పాటికమునన్ = స్వేచ్ఛ వలన ; వేదారిమి = వ్యక్తిత్వము ; విఱియున్ = వికసించును ; సరిసాటి = సమానము ; ఇవి = ఈ సత్యములు ; రెంచ + పసరములకున్ = మనుష్యులకును, జంతువులకును ; త్రేసులకున్ = మానవ జాతులకును.

**లోవాఱిక (తాత్పర్యము) :** పంజరములో బంధించఁబడిన చిలుక — తన యజమానులు తనకు ఏయే మాటలు నేర్పిరో అవి తప్ప ఇంకే-మియు పలుకఁజాలదు. కాని స్వేచ్ఛగా ఎగురుచు తనకు ఇంపైనది తిని బ్రదుకునట్టి కోయిల చెట్ల కొమ్మల నడుమ అదృశ్యముగా దాఁగి పాడు పాట ఎన్ని సార్లు విన్నను విసుగు రాదు. తులసికోటలో నాఁటిన కృష్ణతులసి (నల్ల గగ్గెర) మొక్క తొందఱలోనే నిద్రపోవచ్చును. కాని అదే మొక్కను పెరటిలో మామూలు మట్టిలో నాఁటినచో అది భుజమెత్తు ఎదుగును. చిన్న చిన్న గుంటలలో నిలువ చేసిన నీరు త్వరలోనే పాడయి అశుభ్రమగును. కాని స్వేచ్ఛగా ప్రవహించు నీరు ఎల్లప్పుడును శుభ్రముగానే ఉండును. మనుష్యులను బంధనములో పెట్టినచో — వారిలో అంతకు ముందు లేని కల్మష భావములు క్రొత్తగా పుట్టి ఆ తరువాత శాశ్వతముగా కొనసాఁగును. స్వేచ్ఛ గల మానవులలో ఆ కల్మషము తనంత తానే అణఁగి సర్దుకపోయి సమన్వయము నొందును. స్వేచ్ఛగా ఉన్నచో తన వ్యక్తిత్వము వికసించును. ఈ సత్యములు మనుష్యుల యొక్క, జంతువుల యొక్క మఱియు మానవ జాతుల విషయములలో సమానముగ వర్తించును.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** తులసి పవిత్రమైన మొక్క గనుక అది వాడి వాలిపోయినచో 'చనిపోయినది' అనుట సంప్రదా-యము కాదు. అందువలన కునుకున్/ నిద్రపోవును అని ఎసవాడఁబడినది.

SUMMARY : The parrot in a cage cannot utter a single word other than repeating what it has been taught by its masters. But the original song of the invisible cuckoo which freely flies and feasts on whatever it likes, sounds melodious shorn of monotony. The *Black Tulasi* (*Ocimum tenuiflorum* or the Holy Basil) plant may die if grown in a mud-filled trough. But the same plant may grow to touch our shoulders if planted in the soil of the backyard. The water contained in small puddles may get dirty very soon. But that in an ever-flowing stre-am always remains fresh. Similarly if humans are put in confinement, kind of mental

impurity which was previously unseen, may creep in and persist for life. The same impurity gets harmonised and subdued when they are free. Thus one's personality blossoms only in freedom.The same equally applies to human individuals, their races and other beings as well.

: సంచమర్తి చెబకము :

**ఇది**

**వాచస్పతి బిరుదుని సంతరిదమైన వల్మిరిగమను నెఱింపటి కావింతయందు**

**రెండవ వీటగు కానస త్రోవలో నాల్గవ సంచము**

**మొత్తము ముగిసినది.**

**|| మేల్గాతన్ ||**

**మాటల విడఁదీత (పద విభాగము) :** వాచస్పతి–బిరుదుని, సంతరిదము + ఐన, వల్మిరిగము + అను, నెఱింపటి, కావింతయందున్, రెండవ వీటు + అగు, కానస–త్రోవలో, నాల్గవ, సంచము, మొత్తము, ముగిసినది.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వాచస్పతి–బిరుదుని సంతరిదము + ఐన వల్మిరిగము + అను నెఱింపటి కావింతయందున్ రెండవ వీటు + అగు కానస–త్రోవలో నాల్గవ సంచము మొత్తము ముగిసినది.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వాచస్పతి–బిరుదుని = వాచస్పతి అను బిరుదము గల కవి యొక్క ; సంతరిదము + ఐన = ప్రణీతమైన ; నెఱింపటి కావింతయందున్ = చింతనాత్మక కావ్యమునందు ; మూఁడవ వీటు + అగు = మూఁడవ భాగమైన ; కానస–త్రోవలో = లోక మార్గములో ; నాల్గవ సంచము = నాల్గవ అధ్యాయము ; మేల్గాతన్ (మేల్ + కావుతన్) = శుభమస్తు.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

: SUMMARY:

Thus concludes the fourth chapter of the second part named

*Kaanasa Trova* in the work *Valmirigamu* written

By

Vachaspathi.

---

# వళ్మిరిగము

## రెండవ వీటు – కానస త్రోవ

ఐదవ సంచము

### హంజియము

**అవిగింగ || సాకతించు ప్రెందాన్ ! జాలిమెయి మాకున్ ౨ ,**

**కంటగమే లేని కదువెల్క కూఱిమిన్ ౨ ,**

**కఱటితనంబు మాలిన కఱదోపకమున్,**

**బ్రామిడిక మ్మేదిన బలిమి-దేఁకువలన్,**

**దెక్కునిక్కు లెఱుఁగని చక్కదీమసమున్.** 1

**మాటల విడఁదీత (పద విభాగము) :** సాకతించు, ప్రెందాన్, జాలిమెయిన్, మాకున్, కంటగము + ఏ, లేని, కదు–వెల్క, కూఱిమిన్, కఱటితనంబున్, మాలిన, కఱద + ఓపకమున్, ప్రామిడికమ్ము + ఏదిన, బలిమి–తేఁకువలన్, టెక్కునిక్కుల్ + ఎఱుఁగని, చక్క–దీమసమున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ప్రెందాన్ కంటగము + ఏ లేని కదు–వెల్క కూఱిమిన్ కఱటితనంబున్ మాలిన కఱద + ఓపకమున్ ప్రామిడికమ్ము + ఏదిన బలిమి–తేఁకువలన్ టెక్కునిక్కుల్ ఎఱుఁగని చక్క–దీమసమున్ మాకున్ జాలిమెయిన్ సాకతించు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సాకతించు = అనుగ్రహింపుము ; ప్రెందాన్ = ఓ పరమాత్మా ; జాలిమెయిన్ = కరుణతో ; కంటగము + ఏ = ద్వేషమే ; కదు–వెల్క కూఱిమిన్ = మిక్కిలి నిర్మలమైన ప్రేమను ; కఱటితనంబున్ మాలిన = వంచకత్వము లేని : కఱద + ఓపకమున్ = మేధాశక్తిని ; ప్రామిడికమ్ము + ఏదిన = క్రౌర్యమును విడనాడిన ; బలిమి–తేఁకువలన్ = బలధైర్యములను ; టెక్కునిక్కుల్ + ఎఱుఁగని = గర్వమదములు తెలియని ; చక్క–దీమసమున్ = మంచి ఆత్మవిశ్వాసమును.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఓ పరమాత్మా ! మాపై కరుణ జూపి ద్వేషము లేని నిర్మల ప్రేమను అనుగ్రహింపుము. మోసకారితనము లేని మేధా శక్తిని ప్రసాదింపుము. క్రూరత్వము లేని బలధైర్యములను దయసేయుము. గర్వాహంకారములు లేని ఆత్మవిశ్వాసమును అందింపుము.

**వైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** (౧) ద్వేషము లేని ప్రేమ : ఈ లోకములో ప్రతి ప్రేమయు ఒక ద్వేషమునకు సైతము దారిదీయును. కనుక అటువంటి ప్రేమ తనకు వలదనుచున్నాఁడు కవి. ఎందుకనఁగా — అటువంటి ప్రేమ అంతిమముగా పాపాచరణమునందే పర్యవ–సించును.

(౨) లోకములో మంచివారు తెలివిని ఎక్కువగా చూపరు. అట్లే తెలివిమంతులు కూడ మంచితనమును ఎక్కువగా చూపరు. కనుక అటు–వంటి మేధాశక్తి తనకు వలదనుచున్నాఁడు కవి. ఇట్లే మిగితా పంక్తులను సైతము ఆకళించుకొనునది.

SUMMARY : Oh Universal Soul ! Kindly grace us with pure love devoid of all hate. Merci–

fully bestow upon us intellect unalloyed with deceptiveness. Confer on us strength and courage bereft of cruelty. And give us true self-confidence shorn of pride and ego.

**గోరంటిక జంట ||** మనవంటివారు మనకు దొరుకనప్పుడు, మనల నెవఱు నాకళించుకొననప్పుడు
మనకుఁ దగని చోఁగారులఁ బడినప్పుడు, మొప్పెలౌదుము మనలము తప్పుడౌదుము ; 2
పెంకెలౌదుము మనము పెడసరులమును ; తనరము లేవి యేవి ౨ అకోరల్వియో
మన మౌదు మవి యెల్ల మంది కనురోక, నడివాగు డగున్ విడఁబర్పఁజూచినన్. 3

**మాటల విడఁదీత (పద విభాగము) :** మన-వంటి-వారు, మనకున్, దొరుకని + అప్పుడు, మనలన్, ఎవఱున్ + ఆకళించుకొనని + అప్పుడు, మనకున్ + తగని, చోన్ + కారులన్ + పడిన + అప్పుడు, మొప్పెలు + ఔదుము, మనలము, తప్పుడు + ఔదుము, పెంకెలు + ఔదుము, మనము, పెడసరులమును, తనరములు + ఏవి + ఏవి, అకోరల్వి + ఓ, మనము + ఔదుము + అవి + ఎల్లన్, మంది-కను-రోకన్ + అడివాగుడు + అగున్, విడఁబర్పన్ + చూచినన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....మనలము పెడసరులమును (ఔదుము). మంది-కను-రోకన్ తనరములు ఏవి ఏవి అకోరల్వి + ఓ అవి ఎల్లన్ మనము ఔదుము. విడఁబర్పన్ చూచినన్ అడివాగుడు అగున్. (మిగితా సుబోధము)

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఆకళించుకొనని + అప్పుడు = అర్థము చేసికొనని అప్పుడు ; చోన్ + కారులన్ = దేశకాలములలో ; మొప్పెలు = మూఢులు ; మనలము = మనము ; పెడసరులమును = అవిధేయులము/ పరాఙ్ముఖులము ; తనరములు = గుణములు ; అకోరల్వి + ఓ = అవాంఛనీయమో ; మంది-కను-రోకన్ = ప్రజల దృక్కోణములో ; అడివాగుడు = అధిక ప్రసంగము ; విడఁబర్పన్ + చూచినన్ = వివరించుటకు ప్రయత్నించినను.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** "మీరనుకొనుచున్న దుర్గుణములు నాకు లేవు" అని వివరింపఁబోయినను జనము పట్టించుకొనరు. పైపెచ్చు ఆ వివరణమును అతివాగుడు అను మఱియొక దుర్గుణముగా తలఁచెదరని భావము.

SUMMARY : When likeminded people are not to be found, when we are not properly understood by anyone and when we find ourselves in ill-deserved times and at unbecoming places, we are taken for fools or felons. We are deemed to be recalcitrant and non-cooperative. Not just that, we become every other thing that folks consider anathema. Even if we try to clear their misunderstanding, the attempt will be looked upon down as sheer verbosity.

**గోరంటిక జంట ||** ఒకనాటి ౨ ఔఁదలఁదాలుపేలుకోటి, మఱునాటి మడమఁ ద్రిప్పని మర్లఁబాటి ;
తొలినాటి వేఁడి నెత్తుటి తిరుగుబాటి, మఱునాటి దొరతనమునందుఁ బ్రెన్ పాతి ; 4
ఒకప్పటి చల్లటి యుల్లపు టేల్వాను, మఱుసటి నల్లఁద్రావుడు టెక్కలికాను ;
ఎడతెగని తిరుకమిది పెడఁబాయ నరిది ; పడఁగొట్టువారును బడఁగొట్టఁబడెదరు. 5

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒక-నాటి, ఔఁదలఁదాలుపు + ఏలుకోటి, మఱు-నాటి, మడమన్ + త్రిప్పని, మర్లఁబాటి, తొలి-నాటి, వేఁడి-నెత్తుటి, తిరుగుబాటి, మఱు-నాటి, దొరతనమునందున్, ప్రెన్ పాతి, ఒక + అప్పటి, చల్లటి + ఉల్లపు + ఏల్వాను, మఱుసటి నల్లఁద్రావుడు, టెక్కలికాను, ఎడతెగని, తిరుకము + ఇది, పెడఁబాయన్ + అరిది, పడఁగొట్టు-వారును + పడఁగొట్టన్ + బడెదరు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఔఁదలఁదాలుపు = విధేయమైన ; ఏలుకోటి = పౌరులు ; మడమన్ + త్రిప్పని = వెనుకకు తగ్గని ; మర్లఁబాటి = విప్లవకారులు ; తొలి-నాటి = ముందునాళ్ళకు చెందిన ; తిరుగుబాటి = విప్లవకారుఁడు ; మఱు-నాటి = ఆ తరువాతి నాళ్ళయందలి ; దొరతనమునందున్ = ప్రభుత్వములో ; ప్రెన్ పాతి = పెద్ద సభ్యుఁడు ; చల్లటి + ఉల్లపు = మంచి మనస్సు గల ; ఏల్వాను = పరిపాలకుఁడు ; మఱుసటి = తరువాతి కాలపు ; నల్లఁద్రావుడు = రాక్షస- ; టెక్కలికాను = చోరుఁడు ; ఎడతెగని = విరామము లేని/ ఆఁగని ; తిరుకము = చక్రము ; పెడఁబాయన్ + అరిది = వదిలించుకొనుట కష్టమైనది.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒకనాడు వినయ విధేయతలతో తలవాంచి ఆజ్ఞాబద్ధులైన పౌరులే ఆ తరువాతి కాలములో ఎంతమాత్రమును వెనుకకు తగ్గని విప్లవకారు లయ్యెదరు. ఒకనాడు ఆవేశముతో వ్యవస్థపై తిరుగఁబడ్డ విప్లవకారుఁడు ఆ తరువాత తానే స్వయముగా ప్రభు-త్వములో ఒక ప్రముఖ సభ్యుఁ డగును. ఒకనాడు మంచి మనస్సుతో ప్రజలను చూచుకొన్న పరిపాలకుఁడే తరువాతి కాలములో వారి రక్తమును త్రాఁగునట్టి రాక్షసుఁడును, దొంగయు అగును. ఈ కాల పరిణామము విరామము లేకుండ తిరుగాడు చక్రము. దీని నుండి తప్పించుకొనుట అసాధ్యము.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఏలుకోటి = పౌరుఁడు/ పౌరురాలు/ పౌరులు. ఇదే ఏకవచనము మఱియు బహువచనము కూడ.

SUMMARY: The same citizens who once obediently took orders will become uncompromising revolutionaries in the latter times. The same passionate hot-blooded revolutionary will take a prominent place in the government in the days to follow. The same ruler who once treated his subjects with untold warmth will become a blood-sucking demon and thief. This is an unending cycle of history, from which it is hard to break free.

**అవిగింగ ||** ఆవు సేల మేయఁ గ్రేపు గట్టున మేయునే ?
నెరసులకు వేదారుల వరకింప నేమిటికి ?
వెలిబైలును పైవారును జేయఁగఁ దప్పుడు
తలఁపులుఁ బనులు, వేదార్ బాగుపడుటెప్పుడు ?
వరకించువా రెవఱు పైవారి తప్పులకు ? 6

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఆవు + చేలన్, మేయన్ + క్రేపు, గట్టునన్, మేయున్ + ఏ, నెరసులకున్, వేదారులన్, వరకింపన్ + ఏమిటికిన్, వెలిబైలును, పైవారును, చేయఁగన్ + తప్పుడు, తలఁపులున్+ పనులున్, వేదార్ బాగుపడుట + ఎప్పుడు, వరకించు-వార్ + ఎవఱు, పై-వారి, తప్పులకున్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ఆవు చేలన్ మేయన్ క్రేపు గట్టునన్ మేయున్ + ఏ? నెరసులకున్ వేదారులన్ వరకింపన్ ఏమిటికిన్? వెలిబైలును పైవారును చేయఁగన్ తప్పుడు తలఁపులున్ పనులున్ వేదార్ బాగుపడుట ఎప్పుడు? పై-వారి తప్పులకున్ వరకించు-వార్ ఎవఱు?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** క్రేపు = దూడ ; నెరసులకున్ =దోషములకు ; వేదారులన్ = వ్యక్తులను ; వరకింపన్ + ఏమిటికిన్ = శిక్షింపనేల ; వెలిబైలును = బాహ్యావరణము (సమాజము) మఱియు.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Would a calf graze on the embankment while its mother grazes the crop? Why punish individuals for the wrong concepts and deeds of the external sphere (society) ? Who is

going to punish the highers-up for their wrongs?

**వెల్మిరిక ॥** పెద్దలెంత దద్దటించినను, జెరి తరమును గొంౘ్రొత్తగానె,
యెడాటముల నెఱుంగక తీఱ, దాంకము లకమనీకులే సుమి. 7

**మాటల విడఁదీత (పద విభాగము) :** పెద్దలు + ఎంత దద్దటించినను + చెరి తరమును + క్రొత్త + క్రొత్తగాన్ + ఎ + ఎడాటములన్ + ఎఱుంగక తీఱదు + ఆంకముల్ + అకమనీకులు + ఎ, సుమి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** దద్దటించినను = బిగ్గరగా చెప్పినను ; ఎడాటములన్ = విషయములను ; ఎఱుంగక తీఱదు = తెలిసికొనక తప్పదు ; ఆంకముల్ = పుస్తకములు ; అకమనీకులే = నిర్జీవులే.

**లోవాటిక (తాత్పర్యము) :** పెద్దలు ఎంతగా గొంతు చించుకొని ఘోషించి చెప్పినను, ప్రతి తరములోను పిన్నలు ప్రతి విషయమును తమంతట తామే అనుభవించి కొంౘ్రొత్తగా తెలిసికొనక తప్పదు. పుస్తకములు కొంతవరకు సహాయకారులే కాని అవి నిర్జీవులు.

SUMMARY: No matter how loudly elders thunder to teach the young, the successive generation has no choice but to know everything all by itself. Books are helpful to an extent, but for the fact that they are lifeless.

**గంగేరిక మున్నంగి ॥** పరి యెంత లలానెదరు పోరుల ; కాననిచో వెదకెదరు మార్తుల ;
చిక్కనిచోఁ దమలోనె కొందఱ నెక్కించెదరు గా-మిరుందమున్ ; 8
పరి యెంత లలానెదరు బ్రుంకము ; పండుగ యొకటి దాని కోసరము ;
పరి యెంత లలానెదరు కాటియ, నెరసులకు వరకంబుల పేరున ; 9
మార్తమేది పనిసేయదు కఱద ; మందియందుఁ గలసికట్టు కొఱత ;
మార్తము మంచి రాఁబడిహొాంతము ; దాని మీఁ దానిద మెల్లమరము. 10

**మాటల విడఁదీత (పద విభాగము) :** పరి + ఎంత, లలానెదరు, పోరులన్, కాననిచోన్, వెదకెదరు, మార్తులన్, చిక్కనిచోన్, తమలోన్ + ఎ, కొందఱన్ + ఎక్కించెదరు, గా-మిరుందమున్, పరి + ఎంత, లలానెదరు, బ్రుంకమున్, పండుగ + ఒకటి, దాని కోసరము, పరి + ఎంత, లలానెదరు, కాటియన్, నెరసులకున్, వరకంబుల, పేరునన్, మార్తమున్ + ఏది, పని + చేయదు, కఱద, మందియందున్ + కలసికట్టు, కొఱత, మార్తము, మంచి, రాఁబడి-హొాంతము, కని, కుందుట, దాని మీఁదన్ + ఆనిదము + ఎల్ల + అమరము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పరి పోరులన్ ఎంత లలానెదరు ! కాననిచోన్ మార్తులన్ వెదకెదరు. చిక్కనిచోన్ తమలోన్ + ఎ కొందఱన్ గా-మిరుందమున్ ఎక్కించెదరు. పరి బ్రుంకమున్ ఎంత లలానెదరు !! దాని కోసరము పండుగ ఒకటి. నెరసులకున్ వరకంబుల పేరునన్ పరి కాటియన్ ఎంత లలానెదరు !! మార్తమున్ ఏది కఱద పని చేయదు. మందియందున్ కలసికట్టు కొఱత. మార్తము మంచి రాఁబడి-హొాంతము. దాని మీఁదన్ ఎల్ల అమరము ఆనిదము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పరి = ప్రజ ; లలానెదరు = ఆస్వాదించెదరు ; పోరులన్ = యుద్ధములను ; కాననిచోన్ = కనఁబడనిచో ; మార్తులన్ = శత్రువులను ; గా-మిరుందమున్ = బలిపీఠమును ; బ్రుంకమున్ = విలయమును (విధ్వంసమును) ; కాటియన్ = హింసను ; నెరసులకున్ = దోషములకు ; వరకంబుల పేరునన్ = శిక్షల పేరుతో ; మార్తము + ఏది = శత్రుత్వమును వదలి ; కఱద = బుద్ధి/ మేధ ; మందియందున్ = జనమునందు ; కలసికట్టు = ఐకమత్యము ; కొఱత = లోపించినట్టిది ; రాఁబడి-హొాంతము = ఆదాయమును దెచ్చి పెట్టు పరిశ్రమ ; ఆనిదము = ఆధారపడినట్టిది (dependent) ; ఎల్ల + అమరము = మొత్తము వ్యవస్థ.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఆహా ! పైకి యుద్ధములను విమర్శించుచున్నట్లుగా కనిపించు జనము లోలోపల వాటిని ఎంత ఆస్వాదించెదరో కదా ! యుద్ధములు బయట కనిపింపనిచో తమలోనే కొందఱు శత్రువులను వెదకి వారితో యుద్ధమునకు దిగెదరు. వారితో యుద్ధము వీలు పడనిచో వారిని బలిపీఠమెక్కించెదరు. జనము విధ్వంసమును ఎంత ఆస్వాదించెదరో కదా! అందుకోసమై వారికొక పండుగ కూడ ఉన్నది. అట్లే జనము హింసను ఎంత ఆనందించెదరో కదా ! దోషులని పేరుపెట్టఁబడిన మానవులను శిక్షల పేరిట హింసించుచుండఁగా మిక్కిలి సంతోషించెదరు. శత్రుత్వము లేనిచో మనుష్యుల బుఱ్ఱ పనిచేయదు. జనములో ఐకమత్యము లుప్తము. అందువలన ఏకమగుటకై వారికొక ఉమ్మడి శత్రువు తప్పనిసరిగా కావలె. శత్రుత్వము ఒక మంచి ఆదాయమార్గము కూడ. మొత్తము వ్యవస్థయే మనిషికి–మనిషికి నడుమ గల శత్రుత్వముల మీఁద ఆధారపడి నడచుచున్నది.

SUMMARY : Wow ! How folks enjoy wars though they outwardly seem to be condemning them ! When they have no wars to enjoy, they search for some enemies among themselves and resort to fights. If a fight is not possible, they sacrifice someone at the altar. How folks enjoy destruction ! They have a festival too for celebrating it. How folks enjoy violence, drawing pleasure from the torture of the human who are named culprits ! The human mind undergoes a block if it finds nothing to hate. Folks are perpetually in the need of a common enemy to unite against. Enmity is avenue of revenue too. The entire system itself runs on the concept of enmity.

**పస్పియ** ॥ మీలుమాలుగాఁ గతనయు నొడువుల్, కొల్లబోవుడు మొదలగు నటుపయిన్,
త్రేసును దెగను త్రెవను లెంబి బ్రదుకు- దెరువును గాంచరులన్ గడిదమున్
గూర్చి విళంగీల్, కూల్చుట పరువున్. 11

**మాటల విడఁదీత (పద విభాగము) :** మీలుమాలుగాన్ + కతన + ఉన్, నొడువుల్, కొల్లబోవుడున్, మొదల్ + అగున్, అటు–పయిన్ + త్రేసును + తెగను + త్రెవను, లెంబిన్, బ్రదుకుదెరువును + కాంచరులన్ + కడిదమున్ + కూర్చి, విళంగీల్, కూల్చుట, పరువున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కతన + ఉన్ నొడువుల్ మీలుమాలుగాన్ కొల్లబోవుడున్ అటు–పయిన్ త్రేసును తెగను త్రెవను లెంబిన్ బ్రదుకుదెరువును కాంచరులన్ కడిదమున్ కూర్చి విళంగీల్, పరువున్ కూల్చుట మొదల్ అగున్

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మీలుమాలుగాన్ = నిశ్శేషముగా ; కతన + ఉన్ = తర్కము మఱియు ; నొడువుల్ = వాక్యములు కూడ ; కొల్లబోవుడున్ = ఖాళీ కాఁగా ; అటు–పయిన్ = ఆ తరువాత ; త్రేసును = జాతిని ; తెగను = ఉపజాతిని ; త్రెవను = కులమును ; లెంబిన్ = కుటుంబమును ; బ్రదుకుదెరువును = జీవనోపాధిని ; కాంచరులన్ = తల్లిదండ్రులను ; కడిదమున్ = గతమును ; కూర్చి = గుఱించి ; విళంగీల్ = నిందలు.

**లోవాఱిక (తాత్పర్యము) :** (ఒక చర్చ లేదా వాదము చేయునప్పుడు) తమ దగ్గర వాదనీయాంశమునకు సంబంధించి తర్కము మఱియు మాటలు (సమాచారము) పూర్తిగా ఖాళీ అయిన తరువాత ఇఁక అప్పుడు మొదలగును — ప్రతివాదుల జాతిని గూర్చి, ఉపజాతిని గూర్చి, కులమును గూర్చి, కుటుంబమును గూర్చి, జీవనోపాధిని గూర్చి, తల్లిదండ్రులను గూర్చి, గతమును గూర్చి నిందలు, ఎగతాళులు మఱియు వాటి ఆధారమగా పరువు దీయుటలు.

SUMMARY : (While participating in a debate or argument), after one completely runs short of logic and information on the talking point, then commence blames, mockery and defamation on the basis of the rival argumentators' race, tribe, caste, family, livelihood, parents and

past record.

**వెల్మిరిక** ॥ వలపు నిలచును దనీవు దనుక ౦ ; చెలిమి రో-యీావికోలు దనుక ;
వరవ మణియంపు దక్కు దనుక ; మేరిక యొక చెడుపల్కు దనుక. 12

**మాటల విడఁదీత (పద విభాగము) :** వలపు, నిలచును, దనీవు దనుకన్, చెలిమి, రో–యీావికోలు దనుకన్, వరవ, మణియంపుం, దక్కు దనుకన్, మేరిక + ఒక చెడు–పల్కు దనుకన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వలపు దనీవు దనుకన్ నిలచును. చెలిమి రో–యీావికోలు దనుకన్ (నిలచును). వరవ మణియంపుం దక్కు దనుకన్ (నిలచును). మేరిక ఒక చెడు–పల్కు దనుకన్ (నిలచును)..

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వలపు = అనురాగము ; దనీవు దనుకన్ = సంభోగము వరకు ; చెలిమి = స్నేహము ; రో–యీావికోలు దనుకన్ = డబ్బు వ్యవహారములు జరుగనంత వరకు ; వరవ = సేవ ; మణియంపుం దక్కు దనుకన్ = అధికార ప్రాప్తి వరకు ; మేరిక = మర్యాద.

**లోవాఱిక (తాత్పర్యము) :** స్త్రీపురుషులు ఎప్పటి వరకైతే సంభోగింపరో అప్పటి వరకు వారి నడుమ ప్రేమ నిలఁబడును. మిత్రులు ఎంత కాలము పాటు డబ్బు వ్యవహారములలో పాల్గొనరో అంతకాలము వారి మైత్రి నిలఁబడును. మనుష్యులకు ఎంత వరకు రాజకీయ అధికా–రము ప్రాప్తింపదో అంతవరకు వారు ప్రజలకు సేవ చేసెదరు. ఇద్దఱి నడుమ ఎంతవరకు చెడ్డమాటలు జరుగవో అంతవరకు వారి పరస్పర మర్యాదలు కొనసాఁగును.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఆడు–మగ సంభోగించిన తరువాత వారి నడుమ కామమే తప్ప ప్రేమ మిగులదని భావము. ఇది సామాన్యుల విషయము.

SUMMARY : (Unmarried) Couples can retain their romantic love as long as they do not take part in copulation. Friends can retain their amity as long as they do not participate in mone–tary affairs. Leaders keep serving people as long as they do not capture political power. Pro–tocols will be in vogue between two persons as long as one of them does not say bad words to / about the other.

**గోరంటిక** ॥ ఎలుఁగెత్తనేలా మంది కెల్లప్పుడు, నివైనముననే బ్రదిమానింపుఁ డనుచు ?
చేయున దదియే వా రప్పసం బొకఱు, సెప్పినను జెప్పక మఱి మిన్నకున్నను. 13

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎలుఁగు + ఎత్తన్ + ఏలా మందికిన్ + ఎల్ల + అప్పుడున్ + ఇవైనమునన్ + ఏ బ్రదిమానింపుఁడు + అనుచున్ చేయునది + అది + ఏ వార్ + అప్పసంబు + ఒకఱు + చెప్పినను + చెప్పక మఱి మిన్నక + ఉన్నను.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎల్ల + అప్పుడున్ ఇవైనమునన్ + ఏ బ్రదిమానింపుఁడు అనుచున్ మందికిన్ ఎలుఁగు ఎత్తన్ ఏలా? ఒకఱు చెప్పినను చెప్పక మఱి మిన్నక ఉన్నను వార్ అప్పసంబు చేయునది అది + ఏ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎలుఁగు + ఎత్తన్ + ఏలా = గొంతెత్తుట ఎందుకు ; మందికిన్ = జనమునకు ; ఇవైనమునన్ + ఏ = ప్రస్తుతములోనే (వర్తమానములోనే) ; బ్రదిమానింపుఁడు = జీవింపుఁడు ; అప్పసంబు = అనునిత్యము/ ఎల్లప్పుడు ; మిన్నక + ఉన్నను = ఊరకున్నను.

**లోవాఱిక (తాత్పర్యము) :** "వర్తమానములో జీవించుఁడు" అని జనమునకు ప్రత్యేకముగా ఎలుగెత్తి ఘోషించుట ఎందుకు? ఆ విషయమును

తమకు ఒకఉ చెప్పినను, చెప్పకపోయినను, లేదా ఊరకున్నను, అంతిమముగా వారు అనునిత్యము చేయునది అదే లెమ్ము.

SUMMARY : Why loudly tell people to live in the present? That is what they exactly do day in and day out, whether you tell them or not.

**వెల్మిరిక ॥** తన్నేర్మితని యౌ ముల్చకు, న్నెన్నరాని బైడాలమగున్,
జెన్నుగ "నింకొంత తెలియు" మని, చెప్పిరేని నెవ్వారయినన్. 14

**మాటల విడఁదీత (పద విభాగము) :** తన్–నేర్మి–తని + ఔ, ముల్చకున్ + ఎన్నన్–రాని, బైడాలము + అగున్ + చెన్నుగన్ + ఇంకన్ + కొంత, తెలియుము + అని, చెప్పిరి + ఏనిన్ + ఎవ్వార్ + అయినన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఇంకన్ కొంత చెన్నుగన్ తెలియుము అని ఎవ్వార్ అయినన్ చెప్పిరి ఏనిన్ తన్–నేర్మి–తని ఔ ముల్చకున్ + ఏన్నన్–రాని బైడాలము అగున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తన్–నేర్మి–తని = తన విద్యతో తాను తృప్తి చెందువా'డు ; ఔ = అయిన ; ముల్చకున్ = మూర్ఖునికి ; ఎన్నన్–రాని = కొలువరానంత ; బైడాలము = రౌద్రము ; అగున్ = కలుగును ; చెన్నుగన్ = బాగుగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** "ఈ విషయమును గూర్చి మఱికొంత తెలిసికొనుము" అని ఎవడైన తనతో చెప్పినచో – తన విద్యతో తాను తృప్తిపడు మూర్ఖునికి చెప్పలేనంత ఆగ్రహోదగ్రము కలుగును.

SUMMARY : The one who is content with his current level of education is enraged beyond description when someone advises him to know more about a particular topic.

**గంగేరిక ॥** నడిపించుఁ బెక్కండ్ర వడారము నంటు-కంటులుఁ జేవాడుకలే ;
కతనయు విడఁగాంచికయు వాయము, క్రచ్చుకొనఁ బసరముల నుండి వలె. 15

**మాటల విడఁదీత (పద విభాగము) :** నడిపించున్ + పెక్కండ్రన్, వడారము, నంటు–కంటులున్ + చేవాడుకల్ + ఏ, కతన + ఉన్, విడఁగాంచిక + ఉన్, వాయము, క్రచ్చుకొనన్ + పసరముల నుండి వలెన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పెక్కండ్రన్ వడారము నంటు–కంటులున్ చేవాడుకల్ + ఏ నడిపించున్. కతన + ఉన్ విడఁగాంచిక + ఉన్ క్రచ్చుకొనన్ పసరముల నుండి వలెన్ వాయము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పెక్కండ్రన్ = చాలమందిని ; వడారము = కేవలము ; నంటు–కంటులున్ = రాగద్వేషములు కూడ ; చేవాడుకల్ + ఏ = ఆచారములే ; కతన + ఉన్ = తర్కము మఱియు ; విడఁగాంచిక + ఉన్ = విచక్షణ జ్ఞానమును ; వాయము – దండుగ ; క్రచ్చుకొనన్ = ఆశించుట ; పసరముల నుండి వలెన్ = జంతువుల నుండి ఆశించినట్లుగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** లోకములో చాలమందిని తరతరాల ఆచారములును, తమ రాగద్వేషములును, వాటి నుండి పుట్టిన భావోద్వేగ–ములు మాత్రమే నడిపించును. అంతే తప్ప తర్కము, విచక్షణ జ్ఞానము కాదు. ఈ కడపటి రెంటిని జంతువుల నుండి ఆశించుట ఎంత వ్యర్థమో మనుష్య సమూహముల నుండి ఆశించుట కూడ అంతే వ్యర్థమని భావము.

**వైమాల విడఁబఱు (విశేష వివరణము) :** ఇది విడివ్యక్తులకు అదుకరిల్లదు.

SUMMARY: Many in the world are led by generations-long customs and their personal feel-ings of love and hate. So it is as futile to expect reason and judiciousness from human groups as from animals.

**పస్సియ జంట** ॥ కడిఁదిపడకుండ గడింపవలె నని, దొంగతనములకుఁ దొడఁగెదరు కాని
పేఁటలు దిరుగుట వాటముఁ జూచుట, యెడఁ గనిపట్టుట నడిరే లేచుట 16
చమురుఁబూతలును కురుల గీతలును, బనిమూటుల సైపఱచికొనుటలును
బ్రోపోరు వేపుల కండ్లఁ బడకుండుటయుఁ , గడిఁదు లివి కావే? ఇడు మేమి స్రగ్గె? 17

**మాటల విడఁదీత (పద విభాగము) :** కడిఁది–పడకుండన్, గడింపవలెన్ + అని, దొంగతనములకున్ + తొడఁగెదరు, కాని, పేఁటలు + తిరుగుట, వాటమున్ + చూచుట, ఎడన్ + కనిపట్టుట, నడి–రే, లేచుట, చమురు + పూతలును, కురుల, గీతల్ + ఉను + పనిమూటులన్, సైపఅచికొనుటల్ + ఉను + ప్రోపోరు–వేపుల కండ్లన్ + పడక + ఉండుట + ఉన్, కడిఁదుల్ + ఇవి, కావు + ఏ, ఇడుమ + ఏమి, స్రగ్గెన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కడిఁది–పడకుండన్ గడింపవలెన్ అని దొంగతనములకున్ + తొడఁగెదరు కాని పేఁటలు తిరుగుట వాటమున్ చూచుట ఎడన్ కనిపట్టుట నడి–రే లేచుట చమురుపూతలును కురుల గీతల్ + ఉను పనిమూటులన్ సైపఱచికొనుటల్ + ఉను ప్రోపోరు–వేపుల కండ్లన్ పడక ఉండుట + ఉన్ కడిఁదుల్ ఇవి కావు + ఏ ఇడుమ ఏమి స్రగ్గెన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కడిఁది–పడకుండన్ = కష్టపడకుండ ; గడింపవలెన్ = సంపాదింపవలెను ; తొడఁగెదరు = పూనుకొనెదరు ; వాటమున్ = ఒడుపును/ పని చేయు కోణమును ; ఎడన్ = వేళను ; నడి–రే = అర్ధరాత్రి ; కురుల గీతల్ + ఉను = తలవెంట్రుకలను గీయుట/ కొరుగుట మఱియు ; పనిమూటులన్ = సాధనములను ; సైపఅచికొనుటల్ + ఉను = సిద్ధము చేసికొనుట కూడ ; ప్రోపోరు–వేపుల = భటుల మఱియు కుక్కల యొక్క ; కావు + ఏ = కావా? ; ఇడుమ = కష్టము ; స్రగ్గెన్ = తగ్గినది.

**లోవాఱిక (తాత్పర్యము) :** కష్టపడకుండ ధనసంపాదన చేయవలెనని తలంచి కొందఱు దొంగతనములకు పూనుకొందురు. కాని వాటిలో కూడ చాల కష్టమున్నది. దొంగతనమునకు అనువైన చోటు కోసము పేఁటలు తిరుగుట, లోపల చొఱఁబడుటకు తగిన కోణమును వెద–కుట, వేళ చూచికొనుట, అర్ధరాత్రి పూఁట మేల్కొని ఉండుట, ఒంటికి నూనె పూసికొనుట, జుట్టును కుఱుచగా కత్తిరించుకొనుట, పనిము–ట్లను సమకూర్చుకొనుట, భటులకు మఱియు కుక్కలకు చిక్కకుండుట — ఇవి అన్నియు కష్టములు కావా? శ్రమ ఏమి తగ్గినది?

**పైమాల విడఁబఱు (విశేష వివరణము) :** ఈ శ్రమలకు మారు పట్టపగలు ఎవఱి యొద్దనైన పనిచేసి డబ్బు గడించుట మేలని భావము.

SUMMARY : Some resort to thefts and robberies in order to earn money the easy way. How–ever, thefts and robberies are fraught with risks too. Finding a suitable location and time, looking for a convenient entry point, staying up at late night, smearing the body with oil, cu–tting hair short, being wary of the police and dogs — aren't all of these risks? Does hardship get any less?

**అవిగింగ** ॥ తన యెసరేఁకల నణఁచికొన నేర్వనివాఁడు
కావళియుఁ గ్రమికానుఁ గాఁబోవు నొకనాడు ;
పుట్టనున్న పాము పట్టపగలు బయటఁ దల-
వెట్టినచోఁ జంపున్ లేదా చంపఁబడున్. 18

**మాటల విడఁదీత (పద విభాగము) :** తన + ఎసరేఁకలన్ + అణఁచికొనన్, నేర్వని–వాఁడు, కావళి + ఉన్ + క్రమికాను + ఉన్, కాన్ + పోవున్ + ఒక–నాడు, పుట్టన్ + ఉన్న, పాము, పట్ట–పగలు, బయటన్ + తల + పెట్టినచోన్ + చంపున్, లేదు + ఆ, చంపన్ + పడున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తన + ఎసరేఁకలన్ అణఁచికొనన్ నేర్వని–వాఁడు ఒక–నాడు కావళి + ఉన్ + క్రమికాను + ఉన్ కాన్ పోవున్. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎసరేఁకలన్ = భావోద్వేగములను ; అణఁచికొనన్ నేర్వని–వాఁడు = అణఁచికొనుట చేతఁగానివాఁడు ; కావళి + ఉన్ = పాపి మఱియు ; క్రమికాను + ఉన్ = హంతకుఁడు కూడ ; కాన్ + పోవున్ = అగును ; పుట్టన్ = పుట్టలో.

**లోవాఱిక (తాత్పర్యము) :** తన భావోద్వేగములపై తనకే అదుపు లేనివాఁడు, మఱియు వాటిని అణఁచుకొనుట చేతఁగానివాఁడు ఏదియో ఒకనాడు పాపాత్ముఁడును, హంతకుఁడును అగును. పుట్టలోని పాము బయట తలపెట్టినచో అది ఆ క్షణమునకు అక్కడ ఎవఱున్నచో వారిని కాటువేయును. లేదా వారిచేత చంపఁబడును.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** భావోద్వేగములు పాముల వంటివి అని భావము. వాటిని ప్రతిసారి వెల్లడి చేయకుండ పుట్టకే (మనస్సునకే) పరిమితము చేయవలె.

SUMMARY : The one who cannot suppress his emotions by virtue of not being in control of them – will, one day, become a sinner and a murderer. A snake which stuck out its head out of its hole, will kill anyone that is nearby at that moment. Or it will be killed by them.

*(Emotions are like snakes. Better confine them to one's mind for ever, never letting them out in any manner).*

**దాసానిక ||** తట్టుకోలు మీఁదానిదము గట్టి తిమ్మనమ్ము ;
సైరణ మీఁదానిద మెల్లకూటబ్రదిమానము ;
తోడుపాటు మీఁదానిదము తొంబతీరుంటము ;
వేచిచూపు మీఁదానిదము వెలుఁకువ పవైనము. 19

**మాటల విడఁదీత (పద విభాగము) :** తట్టుకోలు మీఁదన్ + ఆనిదము, గట్టి, తిమ్మనమ్ము, సైరణ మీఁద + ఆనిదము + ఎల్ల–కూట–బ్రదిమానము, తోడుపాటు మీఁద + ఆనిదము, తొంబ–తీరుంటము, వేచి–చూపు మీఁద + ఆనిదము, వెలుఁకువ, పవైనము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** గట్టి తిమ్మనమ్ము తట్టుకోలు మీఁదన్ ఆనిదము. ఎల్ల–కూట–బ్రదిమానము సైరణ మీఁదన్ ఆనిదము. తొంబ–తీరుంటము తోడుపాటు మీఁదన్ ఆనిదము. వెలుఁకువ పవైనము వేచి–చూపు మీఁదన్ ఆనిదము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తట్టుకోలు మీఁదన్ = రోగములకు తట్టుకొను శక్తి మీఁద ; ఆనిదము = ఆధారపడినట్టిది ; గట్టి తిమ్మనమ్ము = దృఢమైన స్వస్థత ; సైరణ మీఁద = సహనము/ ఓర్పు మీఁద ; ఎల్ల–కూట–బ్రదిమానము = సంఘము యొక్క మొత్తము జీవితము ; తోడుపాటు మీఁద = సహకారము మీఁద ; తొంబ–తీరుంటము = జాతియు, దాని నాగరికతయు ; వేచి–చూపు మీఁద = ఎదురుచూచుట మీఁద ; వెలుఁకువ పవైనము = ప్రకాశవంతమైన భవిష్యత్తు. .

**లోవాఱిక (తాత్పర్యము) :** దృఢమైన ఆరోగ్యము రోగనిరోధక శక్తి మీఁద ఆధారపడినట్టిది. సంఘజీవితమంతయు ఒకఱి తత్త్వమును ఒకఱు ఓర్చుకొనుట మీఁద ఆధారపడినట్టిది. ఒక జనజాతియు దాని నాగరికతయు వారిలో వారికున్న సహకారము మీఁద ఆధారపడినట్టిది. ఎవఱి ఉజ్జ్వల భవిష్యత్తయినను వేఁచిచూచుట మీఁద ఆధారపడి ఉండును.

SUMMARY : Robust health hinges on one's immunity. All social life depends on tolerating each other's mentalities. A nation and its civilization stands on internal cooperation. Bright future rests on the willingness to wait for the same.

**దిర్పెనిక** ॥ తానుక మోళ ముల్లమును, గఱదయుఁ జొఅఁబెట్టి గాసిల్లుచుఁ
గరగించి వేసి మొల్లమును, బ్రదిమిని ౨ తడకారు వెచ్చించుచుఁ
దుదికానువు కడివోవఁగఁ జేసిన పనికి మేల్తనమేమీ?
తనకే తనివీని గోలఁ దలకెత్తికొననేల? చెడనేల? 20

**మాటల విడఁదీత (పద విభాగము) :** తానుకమున్ + ఓళమున్ + ఉల్లమును, కఱద + ఉన్ + చొఅన్ + పెట్టి, గాసిల్లుచున్ + కరగించి వేసి, మొల్లమును, బ్రదిమిని, తడ–కారు, వెచ్చించుచున్ + తుది–కానువు, కడి+ పోవఁగన్ + చేసిన, పనికిన్, మేల్తనము + ఏమీ, తనకున్ + ఏ, తనివిన్ + ఈని, గోలన్ + తలకున్ + ఎత్తికొనన్ + ఏల, చెడన్ + ఏల.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....మొల్లమును కరగించి వేసి... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తానుకమున్ = ఆత్మను ; ఓళమున్ = శరీరమును ; ఉల్లమును = మనస్సును ; కఱద + ఉన్ = బుద్ధిని ; చొఅన్ + పెట్టి = చొప్పించి ; గాసిల్లుచున్ = శ్రమపడుచు ; మొల్లమును = ధనమును ; బ్రదిమిని = ఆయుష్షులో ; తడ–కారు = చిరకాలమును ; వెచ్చించుచున్ = ఖర్చు చేయుచు ; తుది–కానువు = చిట్టచివరి రూపము ; కడి+ పోవఁగన్ = దండుగ అగునట్లుగా ; మేల్తనము + ఏమీ = ప్రయోజనమేమిటి ; తనివిన్ + ఈని = తృప్తి నివ్వని ; గోలన్ = తగులాటమును.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక పని చేయునప్పుడు — ఒక ప్రక్కన అందులో తన ఆత్మను, శరీరమును, మనస్సును చొప్పించి శ్రమపడుచు, మఱియొక ప్రక్కన ధనమును ఆయుష్యమును ఖర్చుచేసి — ఆ పని యొక్క చిట్టచివరి రూపమును పాడుచేసి పని అంతయు వ్యర్థము చేసినచో ప్రయోజనమేమి? తనకే తృప్తి నివ్వని తగులాటమునకు పూనుకొనుట ఎందుకు? చివరికి దానిని చెడఁగొట్టుట ఎందుకు?

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఇది మన దేశములో పలువుఱు పనివారును, ఉద్యోగులును, పారిశ్రామికులును చేయునట్టిది. చేయు పని మీఁద శ్రద్ధ ఉన్నచో అదే శ్రమకు, ఖర్చునకు, కాలమునకు అంతకన్న మంచి ఫలితమును సాధింపవచ్చునని భావము.

SUMMARY : What is the use if the final shape of a work comes out spoiled after all the trouble taken by investing one's soul, body and mind in it and spending a lot of money and a whale of time on it? Why take up a work which finally gives no satisfaction to one's own self? Why spoil it after taking it up?

**రాల్మిక మున్నంగి** ॥ జక్కంబుఁ జదివి యెవ్వఱు, సక్క మాటాడఁదలఁతురు?
చట్టంబుఁ జదివి యెవ్వఱు, జానుగా నడువఁదలఁతురు? 21
కొల్వలి కట్టళ్ళ చొప్పున, నిల్వరించుకొనున దెవఱు?
కూటమె జక్కముఁ జట్టము గన్నేలదియ తొడరెదరు ; 22
కేల్మోడ్చి పుస్తెకమ్ములు- , కెడముండి కైసల్పెదరు. 23

**మాటల విడఁదీత (పద విభాగము) :** జక్కంబున్ + చదివి + ఎవ్వఱు, చక్క–మాటాడన్ + తలఁతురు, చట్టంబున్ + చదివి + ఎవ్వఱు, జానుగాన్, నడువన్ + తలఁతురు, కొల్వలి–కట్టళ్ళ, చొప్పునన్, నిల్వరించుకొనునది + ఎవఱు, కూటము + ఎ, జక్కమున్ + చట్టమున్, గన్నేలు + అది + అ, తొడరెదరు, కేల్ + మోడ్చి, పుస్తెకమ్ములకున్ + ఎడము + ఉండి, కైసల్పెదరు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** జక్కంబున్ = వ్యాకరణమును ; చక్క–మాటాడన్ + తలఁతురు = చక్కగా మాటలాడవలె ననుకొందురు ; జానుగాన్ = అందముగా / బాగుగా ; నడువన్ + తలఁతురు = ప్రవర్తింపవలె ననుకొందురు ; కొల్వలి–కట్టళ్ళ చొప్పునన్ = మతపు విధి–

నిషేధముల మేరకు ; నిల్వరించుకొనునది = నిగ్రహించుకొనునది ; కూటము + ఎ = సమాజమే ; గన్నోలు = పవిత్ర గ్రంథము ; అది + అ = దానినే ; తొడరెదరు = అనుసరించెదరు ; కేల్ + మోడ్చి = చేతులు జోడించి ; పుస్తెకమ్మలకున్ = పుస్తకములకు ; ఎడము + ఉండి = దూరముగా ఉండి ; కైసల్పెదరు = పూజించెదరు.

**లోవాటిక (తాత్పర్యము) :** వ్యాకరణమును చదివి భాష బాగుగా మాటలాడవలె నని ఎవఱు కోరెదరు? చట్టములను చదివి బాగుగా ప్రవ-ర్తింపవలె నని ఎవఱు అనుకొందురు? మతము విధించిన నియమాల ప్రకారము తమను తాము నిగ్రహించుకొనునది ఎవఱు? జనము-నకు సమాజమే వ్యాకరణము, చట్టము మఱియు పవిత్ర గ్రంథము కూడ. అన్ని విషయములలోను దానినే వారు అనుసరించెదరు. మహా అయితే వ్యాకరణములకు, చట్టములకు, పవిత్ర గ్రంథములకు దూరము నుండియే ఒక నమస్కారము చేసెదరు. అంతే !

SUMMARY: Who wants to read the grammar to speak a language well thereby? Who wishes to study law to carry himself flawlessly? Who wishes to restrain himself according to the strictures of the religion? To folks, the society itself is the grammar, the law and the Holy Book too, and they follow it in all matters. At the most, they may worship the books, stand-ing at a distance from them.

**గోరంటిక** ॥ ఏ మట్టుండు మాట లే నుడినైనను ౨ , ఏఁపుగ దీవింప నొరుల నింపుగాను?
ఆడిపోసికొనఁగ నాఱునూఱులుండు ; మంచి విర్వియంబునఁ గొంచెమే సుమీ ! 24

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏ, మట్టు + ఉండున్, మాటలు + ఏ, నుడిన్ + ఐనను, ఏఁపుగన్, దీవింపన్ + ఒరులన్ + ఇంపుగాను, ఆడిపోసికొనఁగన్ + ఆఱు-నూఱులు + ఉండున్, మంచి, విర్వియంబునన్ + కొంచెము + ఏ, సుమీ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఏ నుడిన్ ఐనను ఒరులన్ ఏఁపుగన్ ఇంపుగాను దీవింపన్ మాటలు ఏ మట్టు ఉండున్?.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఏ మట్టు = ఏ మాత్రము ; ఏ నుడిన్ + ఐనను = ఏ భాషలో అయినను ; ఏఁపుగన్ = పెంపు కలుగునట్లుగా ; దీవింపన్ = ఆశీర్వదించుటకు ; ఒరులన్ = ఇతరులను/ వేఱేవారిని ; ఇంపుగాను = శ్రావ్యముగా/ ప్రియముగా/ ఇష్టముగా ; ఆడిపోసికొనఁగన్ = తిట్టిపోయుటకు ; ఆఱు-నూఱులు = అసంఖ్యాకములు ; విర్వియంబునన్ = లోకములో ; సుమీ = చూడుమీ.

**లోవాటిక (తాత్పర్యము) :** ఇతరులకు అభ్యుదయము కలుగునట్లుగా దీవించుట కోసము పనికివచ్చు ప్రియమైన మాటలు ఏ భాషలో అయినను ఏమాత్రము ఉండును? తిట్టిపోయుటకు మాత్రము కొన్ని వందల మాటలు ఉండును. దీనిని బట్టి మానవాళిలో మంచి కొంచెమే నని తెలియుచున్నది కదా !

SUMMARY : How many nice words do exist in any language to bless others with prosperity? Hundreds sure exist to abuse them. By this, it is clear that goodness is scarce in the world/ mankind.

**రాల్మిక జంట** ॥ పొఱఁబాటు సేయరు వేల్పు, లెఱిఁగెదరు కనుక నెల్లయు ;
పొఱఁబాటు సేయు మనీకు, లెఱుఁగవు కనుక నేమియు ; 25
పొఱఁబాటు సేతురు రెంచ లెఱిఁగియు నొక్కొక్క మారు ;
పొఱఁబడి నేర్తురు వఠరలు ; నేర్వ రోగు లెన్ని యైన. 26

**మాటల విడఁదీత (పద విభాగము) :** పొఱఁబాటు + చేయరు, వేల్పులు + ఎఱిఁగెదరు, కనుకన్ + ఎల్లయున్, పొఱఁబాటు + చేయున్,

మనీకుల్ + ఎఱుఁగవు, కనుకన్ + ఏమియున్, పొఅఁబాటు + చేతురు, రెంచల్ + ఎఱిఁగియున్ + ఒక్క + ఒక్క, మారు, పొఅఁబడి, నేర్తురు, వఠరలు, నేర్వరు + ఓగుల్ + ఎన్ని + ఐనన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వేల్పులు ఎల్లయున్ ఎఱిఁగెదరు కనుకన్ పొఅఁబాటు చేయరు. మనీకుల్ ఏమియున్ ఎఱుఁగవు కనుకన్ పొఅఁబాటు చేయున్. రెంచల్ ఒక్క + ఒక్క మారు ఎఱిఁగియున్ పొఅఁబాటు చేతురు. వఠరలు పొఅఁబడి నేర్తురు. ఎన్ని ఐనన్ ఓగుల్ నేర్వరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వేల్పులు = దేవతలు ; ఎఱిఁగెదరు = తెలిసికొని ఉందురు ; ఎల్లయున్ = అంతయు ; మనీకుల్ = జీవులు ; రెంచల్ = మనుష్యులు ; ఎఱిఁగియున్ = తెలిసి కూడ ; పొఅఁబడి = పొఅబాటు తలఁపులు తలఁచి ; వఠరలు = ప్రౌఢులు ; ఓగుల్ = దుష్టులు ; ఎన్ని + ఐనన్ = ఎన్ని తప్పులు జరిగినను.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Gods and goddesses know everything and therefore, make no mistake. Living beings know not anything and therefore, make mistakes. Humans make mistakes in spite of knowing a lot. However, the mature learn from their mistakes while the wicked do not learn anything from any number of mistakes made.

**రాల్మిక జంట** ‖ నాల్వుఱ కెఱుక సుమీ, నీ, బ్రాకవోఁతరంబులన్ని ;
కలిగించిన పైవానికిఁ , గాంచరులకు నెచ్చెలులకుఁ 27
బైపెచ్చు నిన్నె యారయు, పగతుఱకుఁ దెందేఁటగా ;
నీకు మటుకే యొలవున, నీ వాకళింపు కానిది. 28

**మాటల విడఁదీత (పద విభాగము) :** నాల్వుఱకున్ + ఎఱుక, సుమీ, నీ, బ్రాక+ పోఁతరంబులు + అన్ని, కలిగించిన, పై-వానికిన్ + కాంచరులకున్, నెఱి + చెలులకున్ + పై-పెచ్చు, నిన్నున్ + ఎ + ఆరయు, పగతుఱకున్ + తేఁట + తేఁటగాన్, నీకున్, మట్టుకున్ + ఎ, + ఒలవునన్ + ఈవు + ఆకళింపు, కానిది.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నీ బ్రాక+ పోఁతరంబులు అన్ని నాల్వుఱకున్ ఎఱుక సుమీ. (నిన్ను) కలిగించిన పై-వానికిన్, కాంచరులకున్, నెఱి + చెలులకున్, పై-పెచ్చు నిన్నున్ + ఎ ఆరయు పగతుఱకున్. నీకున్ మట్టుకున్ + ఎ ఒలవునన్ ఈవు తేఁట + తేఁటగాన్ ఆకళింపు కానిది.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నాల్వుఱకున్ = నలుఁగురికి ; ఎఱుక సుమీ = విదితము సుమా ; బ్రాక+ పోఁతరంబులు = బలాబలములు ; కలిగించిన = పుట్టించిన ; పై-వానికిన్ = భగవంతునికి ; కాంచరులకున్ = తల్లిదండ్రులకు ; నెఱి + చెలులకున్ = ప్రాణమిత్రులకు ; పై-పెచ్చు = మీఁదుమిక్కిలి ; ఆరయు = పరిశీలించునట్టి/ గమనించునట్టి ; పగతుఱకున్ = శత్రువులకు ; తెందేఁటగాన్ (తేఁట + తేఁటగాన్) = సుస్పష్టముగా ; నీకున్ మట్టుకున్ + ఎ = నీకు మాత్రమే ; ఒలవునన్ = ప్రపంచములో ; ఈవు = నీవు ; ఆకళింపు కానిది = అర్థము కానిది.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఈ ప్రపంచములో నీ బలములను గూర్చియు, బలహీనతలను గూర్చియు సుస్పష్టముగా తెలిసినవారు నలుఁగుఱు కలరు. ఒకటి – నిన్ను పుట్టించిన భగవంతుఁడు. రెండు – నిన్ను కన్న నీ తల్లిదండ్రులు. మూఁడు – నీ ప్రాణ స్నేహితులు. నాలుఁగు – నీ శత్రువులు. ఇఁక "నీ సంగతి పూర్తిగా అర్థము కానిది ఎవఱికి?" అనఁగా "నీకే".

SUMMARY : There are 4 people in the world who have clarity about your strengths and

weaknesses. One – God who created you. Two – your parents. Three – your bosom friends. Four – your arch enemies. It is only you who does not have any clarity about yourself.

**పస్పియ జంట** ॥ పదుగుఱు కాంచువుల పెట్టు వెట్టము ; పదుగుఱు నేస్తుల పెట్టొక పెండ్లము ;
పది దొరతనముల పెట్టొక పెన్మిటి ; పది మాన్పంబుల పెట్టొక కూఁతురు ; 29
ఎంతమంది యున్నను నేరువాను- లెన గారొక్క కన్న కొడుకునకున్. 30

**మాటల విడఁదీత (పద విభాగము) :** పదుగుఱు, కాంచువుల, పెట్టు, వెట్టము, పదుగుఱు, నేస్తుల, పెట్టు + ఒక, పెండ్లము, పది, దొరతనముల, పెట్టు + ఒక, పెన్మిటి, పది, మాన్పంబుల, పెట్టు + ఒక, కూఁతురు, ఎంత–మంది + ఉన్నను, నేరువానులు + ఎన, కారు + ఒక్క, కన్న–కొడుకునకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ... నేరువానులు ఎంత–మంది ఉన్నను ఒక్క కన్న కొడుకునకున్ ఎన కారు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పదుగుఱు కాంచువుల పెట్టు = పదిమంది గురువులతో సమానమైన శక్తి ; వెట్టము = శత్రువు ; దొరతనముల = ప్రభుత్వముల యొక్క ; పెన్మిటి = భర్త ; పది మాన్పంబుల = పది చికిత్సల యొక్క ; నేరువానులు = విద్యార్థులు/ శిష్యులు ; ఎన కారు = ఒకటి కారు/ సమానము కారు.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : A potential enemy is equal to the sumtotal of 10 teachers. A loyal wife is equal to 10 friends. A loving husband is equal to 10 protective governments. A caring daughter is equal to 10 medical treatments. But no matter howmany they are, one's students are by no means a match to one's biological son.

**గంగేరిక** ॥ పులులుఁ గారు, చిఱుతపులులుఁ గారు, రెంచలు మనఁ దమ మానానఁ దారు ;
"అయినను నాకే" లందురు పయికి ; అట్లుండఁజాలుదురె లోపలికి ? 31

**మాటల విడఁదీత (పద విభాగము) :** పులులున్ + కారు, చిఱుత–పులులున్ + కారు రెంచలు మనన్ + తమ మానానన్ + తారు అయినను నాకున్ + ఏల + అందురు పయికిన్ + అట్లు + ఉండన్ + చాలుదురు + ఎ లోపలికిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** రెంచలు తమ మానానన్ తారు మనన్ పులులున్ కారు, చిఱుత–పులులున్ కారు. పయికిన్ "అయినను నాకున్ ఏల" అందురు. లోపలికిన్ అట్లు ఉండన్ + చాలుదురు + ఎ?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** రెంచలు= మనుష్యులు ; మనన్ = మనుటకు/ బ్రదుకుటకు ; తమ మానానన్ = తమ దారిన ; తారు = తాము.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఎవటి దారిన వారు వేఱేవారితో తగులము లేకుండ బ్రదుకుటకు మానవులు పులులో, చిఱుతపులులో కారు. వారు సంఘజీవులు. పైకి మట్టుకు "అయినా నాకెందుకు?" అని తఱచుగా పల్కెదరు. కాని నిక్కముగా లోపల అట్లే అంటియు ముట్టని విధము–గా ఉండఁగలరా?

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** పులిజాతికి చెందిన జంతువులు సంఘజీవులు కావు. అవి ఎల్లప్పుడును ఒంటరిగానే బ్రదుకు–చుండును.

SUMMARY : Humans are neither tigers nor panthers to go their way all alone without any

connection to the rest. They are social beings. However they outwardly say, ***"Not my head-ache"*** or "*None of my business*" on every matter. But can they actually remain like that inside of their minds?

*(Animals of the feline category are solitary beings).*

**పొన్నిక ||** అసదు గాత ౨ తారివా నొసఁగు జీతములు ;

విసిగించుతఁ గ్రొత్తక్కఱలు వేఁకరములు ;

వాతికాసులకు మటు కలవడఁబోకుమీ ;

వాడవదినెతనమును బఱియు గుట్టుకలిమి. 32

**మాటల విడఁదీత (పద విభాగము) :** అసదు, కాతన్ (కావుతన్), తారివాన్ + ఒసఁగు, జీతములు, విసిగించుతన్ + క్రొత్త + అక్కఱలున్, వేఁకరములున్, వాతి-కాసులకున్, మటుకున్ + అలవడన్ + పోకుము + ఈ, వాడవదినె-తనము + ఉను, బఱి + ఉన్, గుట్టు-కలిమి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తారివాన్ ఒసఁగు జీతములు అసదు కాతన్. క్రొత్త అక్కఱలున్ వేఁకరములున్ విసిగించుతన్. వాతి-కాసులకున్ మటుకున్ అలవడన్ పోకుము + ఈ. అది గుట్టు-కలిమి వాడవదినె-తనము + ఉను బఱి + ఉన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అసదు = అల్పము ; కాతన్ (కావుతన్/ అగుతన్) = అగుఁ గాక ; తారివాన్ = యజమానుఁడు ; ఒసఁగు = ఇచ్చునట్టి ; అక్కఱలున్ = అవసరములు మఱియు ; వేఁకరములున్ = ఉపద్రవములు కూడ ; వాతి-కాసులకున్ = లంచములకు ; మటుకున్ = మాత్రము ; అలవడన్ + పోకుము + ఈ = అలవాటు చేసికొనఁ బోవకుమా ; వాడవదినె-తనమును = వేశ్యాత్వము మఱియు ; బఱి + ఉన్ = దొంగతనము కూడ ; గుట్టు-కలిమి = రహస్య సంపద.

**లోవాఱిక (తాత్పర్యము) :** నీ యజమానుఁడు నీకిచ్చు జీతము స్వల్పమే కావచ్చును. క్రొత్త క్రొత్త అవసరములును, ఉపద్రవములును తలయెత్తి నిన్ను విసిగింపవచ్చును. అయినను లంచములను పట్టుటకు మట్టుకు అలవడవలదు. రహస్య సంపాదనము/ రహస్య సంపద అన్నది వేశ్యావృత్తితోను, దొంగతనముతోను సమానము సుమా!

SUMMARY : The salary you receive from your master may be less. New needs and calami-ties may nag you. Yet do not get used to taking bribes. Secret earnings/ riches are equal to prostitution and robbery.

***తలిరిక (అవతారిక)*** *: ఈ క్రింది పద్యమున "ఏది ఏమైనను ఆరోగ్యమును గాఁపాడుకొనక తీఱ" దనుచున్నాఁడు.*

**గోరంటిక ||** ఒకటి గుఱి, మఱియొకటి దారి యొలవునన్ ;

ఒకటి కొఱ, మఱియొకటి కొఱముట్టరయన్ ;

గుఱియు దారియుఁ గొఱయుఁ గొఱముట్టును దా,

నయి వరలు వింత విడ్డూరపు వందము,

కోసాకతమీ యొళము ; కాఁపాడుకొనుము. 33

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒకటి, గుఱి, మఱి + ఒకటి, దారి + ఒలవునన్, ఒకటి, కొఱ, మఱి + ఒకటి, కొఱముట్టు + అరయన్, గుఱి + ఉన్, దారి + ఉన్ + కొఱ + ఉన్ + కొఱముట్టు + ఉను + తాన్ + అయి, వరలు, వింత, విడ్డూరపు, వందము, కో-సాకతము + ఈ + ఒళము, కాఁపాడుకొనుము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** అరయన్ ఒలవునన్ ఒకటి గుఱి. మఱి + ఒకటి దారి.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గుఱి = లక్ష్యము/ ధ్యేయము ; ఒలవునన్ = లోకములో; కొఱ = ప్రయోజనము ; కొఱముట్టు = సాధనము ; అరయన్ = పరీక్షింపఁగా ; వరలు = అలరారునట్టి ; వందము = వస్తువు ; కో-సాకతము = దైవానుగ్రహము ; ఈ + ఓళము = ఈ శరీరము.

**లోవాఱిక (తాత్పర్యము) :** పరీక్షింపఁగా — ఈ లోకములో ఒకటి లక్ష్యమును, మఱియొకటి దానిని సాధించు మార్గమును అయి ఉండును. (అనఁగా లక్ష్య-మార్గములు వేర్వేఱయి ఉండును). అట్లే ఒకటి ప్రయోజనముగాను, మఱియొకటి దానిని నెఱవేర్చు సాధనముగాను ఉండును. (అనఁగా ప్రయోజన-సాధనములు వేర్వేఱై ఉండును). కాని వింతగా విడ్డూరముగా మానవ దేహము మటుకు ఏకకాలములో మనిషికి గమ్యమును, అదే సమయములో మార్గము కూడ తానే అయి ఉన్నది. అట్లే ఇది ఏకకాలములో ప్రయోజనమును, సాధనము కూడ తానే అయి ఉన్నది. ఇట్టి ఈ దేహము నీకు దైవానుగ్రహ సిద్ధము. కనుక దీనిని ఎట్లయినను కాఁపాడుకొనుము.

SUMMARY : When examined closely, the destination and the path are often separate in the world. Similarly, the purpose and the means to serve it are separate too. However, curiously enough, the human body is, at a time, both the destination and the path. It is simultaneously the purpose and the means as well. As such, it is God's gift which needs to be safeguarded/ cared for at any cost.

**గంగేరిక ||** కఱదమాలుర తొలిప్రాపు కత్తి ; తనరమాలుర నగవంచి కలిమి ;
తాణమాలుర యెస్తలి గొంతుక ; చేవమాలురు సేయఁగల దలుక. 34

**మాటల విడఁదీత (పద విభాగము) :** కఱదమాలుర, తొలి, ప్రాపు, కత్తి, తనరమాలుర, నగ-వంచి, కలిమి, తాణమాలుర + ఎస్తలి, గొంతుక, చేవమాలురు + చేయన్ + కలది + అలుక.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కఱదమాలుర = బుద్ధిహీనుల యొక్క ; తొలి ప్రాపు = మొదటి శరణ్యము/ ఆశ్రయము ; తనరమాలుర = గుణహీనుల యొక్క ; నగ-వంచి = ఒకే ఒక నగ ; కలిమి = సంపద ; తాణమాలుర = శక్తిహీనుల ; ఎస్తలి = సాధనము ; గొంతుక = కంఠస్వరము ; చేవమాలురు = సారహీనులు.

**లోవాఱిక (తాత్పర్యము) :** బుద్ధిహీనుల ప్రథమాశ్రయమే కత్తి. గుణహీనులకున్న ఏకైక ఆభరణము సంపద. శక్తిహీనులకున్న ఏకైక సాధ-నము గొంతుక. సత్తా లేనివారు చేయఁగల ఒకే ఒక్క పని అలుగుట (కోపించుట).

SUMMARY : The sword is the very first resort of choice for the mindless. Wealth is the only attraction with the lowly characters. A loud voice is the singular appliance that the weak can boast of. Anger is the only thing that the incompetent can act out.

**దాసానిక ||** "ఇట్లున్న మేలు కూటమున, కట్లయిన మే" లని,
జుట్లు పట్టుక కఱదారులు బట్టతల లగుదురు ;
అక్కఱలేదు పరి కచ్చుకట్టుల నడితి-కతనలు ;
ఒక్క సరియ సందు తమకు దక్కెనే నది సాలు. 35

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఇట్లు + ఉన్నన్, మేలు, కూటమునకున్ + అట్లు + అయినన్, మేలు + అని, జుట్లు, పట్టుక,

కఱదారులు, బట్ట–తలలు + అగుదురు, అక్కఱ–లేదు, పరికిన్ + అచ్చుకట్టుల, నడితి–కతనలు, సరియ, సందు, తమకున్, దక్కెన్ + ఏన్ + అది + చాలు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కూటమునకున్ ఇట్లు ఉన్నన్ మేలు, అట్లు అయినన్ మేలు అని కఱదారులు జుట్లు పట్టుక బట్ట–తలలు అగుదురు. పరికిన్ అచ్చుకట్టుల నడితి–కతనలు అక్కఱ లేదు. తమకున్ సరియ సందు దక్కెన్ + ఏన్ అది చాలు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కూటమునకున్ = సంఘమునకు ; కఱదారులు = మేధావులు ; పరికిన్ = జనమునకు ; అచ్చుకట్టుల = వ్యవస్థల యొక్క ; నడితి–కతనలు = నీతి మఱియు తర్కబద్ధత ; సరియ = అవకాశము ; దక్కెన్ + ఏన్ = దొరికినచో.

**లోవాఱిక (తాత్పర్యము) :** " ఇట్లున్నచో సమాజమునకు మంచిది. కాదు, అట్లున్నచో మంచిది" అని మేధావులు చర్చించి, వాదించి, జుట్టు –జుట్టు పట్టుకొని చివరికి బట్టతల లయ్యెదరు. కాని సామాన్య జనమునకు ఆ చర్చలతోను, వాదములతోను పనిలేదు. వ్యవస్థలు నీతిగా ఉన్నవా? లేవా? అవి తర్కబద్ధముగా నడచుచున్నవా? లేదా? అది కూడ అక్కఱలేదు. వారికి కావలసినదెల్ల – ఆ వ్యవస్థలలో తమకు కూడ ఒక సందు, ఒక అవకాశము దొరకుట మాత్రమే. అది ఎట్లు జరిగినను వారికి అభ్యంతరము లేదు.

**వైమాల విడఁబఱుపు (విశేష వివరణము) :** <u>బట్టతలలు</u> = బట్టతలలు గలవారు – బహుప్రీహి సమాసము.

SUMMARY : Intellectuals' heads grow bald, having debated and argued hard on the best way forward to do public good. But that public cares little for the ethics and logicality of the systems. What all they desperately want is just to find a room, an opportunity somewhere in the system. They are least bothered about the details of how it happens.

**వెల్మిరిక జాలు** ॥ అడివల్కు్క లిన్చు నందఱకు ; కలిగింపవు నికమాటలు సుమాళమున్ ;
మనఁజాలుదుమె యొక్క తవనయు, నడివల్కులు నికమాటలగు నొలవున ? 36

**మాటల విడఁదీత (పద విభాగము) :** అడివల్కుల్ + ఇన్చున్ + అందఱకున్, కలిగింపవు, నిక–మాటలు, సుమాళమున్, మనన్ + చాలుదుము + ఎ + ఒక్క, తవన + ఉన్ + అడివల్కులు, నిక–మాటలు + అగు + ఒలవునన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** అందఱకున్ కఅడివల్కుల్ ఇన్చున్. నిక–మాటలు సుమాళమున్ కలిగింపవు. అడివల్కులు నిక–మాటలు + అగు ఒలవునన్ ఒక్క తవన + ఉన్ మనన్ చాలుదుము + ఎ?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అడివల్కుల్ = అతిశయోక్తులు ; ఇన్చున్ = నచ్చును ; నిక–మాటలు = సత్యవాక్కులు ; సుమాళమున్ = భావోద్రేకమును (excitement) ; మనన్ + చాలుదుము + ఎ = మనఁగలమా / బ్రదుకఁగలమా ; తవన + ఉన్ = నిమిషము కూడ ; ఒలవునన్ = లోకములో.

**లోవాఱిక (తాత్పర్యము) :** అందఱికిని అతిశయోక్తులే నచ్చును. ఎందుకనఁగా సత్యవాక్కులు భావోద్రేకమును కలిగించపవు, రంజింపఁ జేయవు. కాని మనుష్యులు పలికిన ప్రతి అతిశయోక్తియు నిజమైపోవునట్టి వింత ప్రపంచమును ఒక్కసారి ఊహించుకొనుము. అటువంటి ప్రపంచములో మనము ఒక్క నిమిషమైనను మనఁగలమా?

SUMMARY : Everyone likes hyperboles, for truths fail to excite folks. But just try to imagine a weird world where every hyperbole uttered will come true. Can we survive in such a world even for a moment?

**గోరంటిక** ॥ లెంబి బాగుండు నెడవాను బాగున్న ; కూటంబు తులకించు లెంబి తులకింప ;

సీమ తనరారు ౨ కూటంబు తనరార ; ఒలవు పరిడవిల్లు సీమ పరిడవిల్ల. 37

**మాటల విడఁదీత (పద విభాగము) :** లెంబి, బాగుండున్ + ఎడవాను, బాగున్నన్, కూటంబు, తులకించున్, లెంబి, తులకింపన్, సీమ, తనరారున్, కూటంబు, తనరారన్, ఒలవు, పరిడవిల్లున్, సీమ, పరిడవిల్లన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎడవాను బాగున్నన్ లెంబి బాగుండున్. లెంబి తులకింపన్ కూటంబు తులకించున్. కూటంబు తనరారన్ సీమ తనరారున్. సీమ పరిడవిల్లన్ ఒలవు పరిడవిల్లున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** లెంబి = కుటుంబము ; బాగుండున్ = శోభించును ; ఎడవాను = వ్యక్తి ; కూటంబు = సంఘము ; తులకించున్ = ప్రకాశించును ; సీమ = దేశము ; తనరారున్ = అలరారును ; ఒలవు = ప్రపంచము ; పరిడవిల్లున్ = విలసిల్లఁగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** వ్యక్తి బాగున్నచో కుటుంబము కూడ బాగుండును. కుటుంబము ప్రకాశించుచున్నచో సంఘము కూడ ప్రకాశించును. సంఘము అలరారినచో దేశము కూడ అలరారును. దేశము విలసిల్లినచో ప్రపంచము కూడ విలసిల్లును.

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** (౧) ఇది క్రింది మట్టమున మొదలుపెట్టి పైమట్టము వరకు బాగుచేయు మానవతావాద విధానము. ఇది మిక్కిలి నెమ్మది అయినను దీర్ఘకాలిక ప్రభావము గలది. ఇందులో విడివ్యక్తియే కేంద్రము. సామూహిక స్వరూపములు కావు.

(౨) వీటిలో దేని దారి దానిది కాదనియు, ఇవన్నియు ఒకదాని మీఁద ఒకటి ఆనకపడి ఉన్నవనియు భావము.

SUMMARY : The family will do well too, if the individual does well. If the family shines, the society will shine too. If the society flourishes, the country will flourish too. If the country prospers, the world will prosper too.

**గోరంటిక జంట** ॥ అకరుఁ దుమురుఁ దాఁకుఁ దోడ్తోడుగాఁ , జలచల్లని కమ్మతెమ్మెఱ వీవఁగా ;
వేసవి వాన వెంటఁ దీసికొని వచ్చుఁ , జలిమితోఁ బాటు వలిగండ్లను బెచ్చు ; 38
కావలసిన మంచి మొక్కలకుఁ బ్రక్కనఁ , గలుపుమొక్కలు కలిదము పెరుగును ౨ చేన ;
నలువుఱ నోళ్ళలో నానినప్పు డొదవు, నాసియు వాసిపేరు లాయిసారిగాన్. 39

**మాటల విడఁదీత (పద విభాగము) :** అకరున్ + తుమురున్ + తాఁకున్ + తోడ్తోడుగాన్ + చల-చల్లని కమ్మ-తెమ్మెఱ, వీవఁగాన్, వేసవి-వాన, వెంటన్ + తీసికొని వచ్చున్, చలిమితోన్ + పాటు, వలిగండ్లను, పెచ్చు, కావలసిన, మంచి, మొక్కలకున్ + ప్రక్కనన్ + కలుపు-మొక్కలు, కలిదము, పెరుగును, చేనన్, నలువుఱ, నోళ్ళలోన్, నానిన + అప్పుడు + ఒదవున్, నాసి + ఉన్, వాసి, పేరులు + ఆయిసారి గాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చల-చల్లని కమ్మ-తెమ్మెఱ వీవఁగాన్ అకరున్ తుమురున్ తోడ్తోడుగాన్ తాఁకున్. వేసవి-వాన చలిమితోన్ పాటు పెచ్చు వలిగండ్లను వెంటన్ తీసికొని వచ్చున్. చేనన్ కావలసిన మంచి మొక్కలకున్ ప్రక్కనన్ కలుపు-మొక్కలు కలిదము పెరుగును. నలువుఱ నోళ్ళలోన్ నానిన అప్పుడు నాసి + ఉన్ వాసి పేరులు ఆయిసారిగాన్ ఒదవున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అకరున్ = పుప్పొడి మఱియు ; తుమురున్ = దుమ్ము కూడ ; తోడ్తోడుగాన్ = సమాంతరముగా ; కమ్మ-తెమ్మెఱ = సురభి మారుతము ; వీవఁగాన్ = వీచినప్పుడు ; చలిమితోన్ + పాటు = చల్లదనముతో సహా ; వలిగండ్లను = మంచు ముక్కలను ; పెచ్చు = మిక్కిలి ; కావలసిన = అవసరమైన ; కలిదము = సహితము/ సైతము ; చేనన్ = పంటచేనిలో ; ఒదవున్ = జనించును/ పుట్టుకొని వచ్చును ; నాసి + ఉన్ = తక్కువ నాణ్యము గల మఱియు ; వాసి = నాణ్యమైన ; పేరులు = కీర్తులు ; ఆయిసారిగాన్ = ఒకే సారి/ ఏకకాలములో.

**లోవాఱిక (తాత్పర్యము) :** చల్లచల్లని కమ్మతెమ్మెఱ వీచినప్పుడు పూల పుప్పొడియు, దుమ్మును సమాంతరముగా వచ్చి సోఁకును. మందు-

వేసవిలో కురిసిన వాన, చల్లదనముతో పాటు పంటలను నాశనము చేయు మంచుముక్కలను కూడ మోసుక వచ్చును. పంటచేనిలో అవ-సరమైన మంచి మొక్కలతో పాటు అనవసరమైన కలుపుమొక్కలు కూడ పెరుగును. అట్లే ఒకటి పేరు నలుగురి నోళ్ళలో నానుట మొదలై-నప్పుడు అతనికి/ ఆమెకు మంచి పేరు, చెడ్డపేరు రెండును ఒకే సారి సంప్రాప్తించును.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** కనుక మంచి పేరికి పొంగను వలదు. చెడ్డపేరికి క్రుంగను వలదని భావము. జనము నిన్ను గుఱించి ఏమని అనుకొనుచున్నారో అది నీవు పూర్తిగా కావు. కానక్కఱలేదు.

SUMMARY : Pollen of flowers and dust come together to hit us when a cool breeze blows. A summer shower brings hailstones along with coolness. Weeds grow alongside the useful plan-tation in a farm. Similarly, man earns good and bad names simultaneously when he begins to figure frequently in the public chat.

*(Be unmoved by both fame and bad name. You are not completely what folks assume. You need not be).*

**తామరిక ॥** మట్టుమేరికలే పట్టు, నీ మంచి కొఱగాదు కూటమునకు ;
మట్టుమేరికలను బాటించునట్టివాఁడు మంచియె దానికిఁ ,
బాటింపులవి త్రసనలైనను, బటారుగ మరపాటి యైనను. 40

**మాటల విడఁదీత (పద విభాగము) :** మట్టు–మేరికలు + ఏ, పట్టున్, నీ, మంచి, కొఱ + కాదు, కూటమునకున్, మట్టు–మేరికలను + పాటించు + అట్టి–వాఁడు, మంచి + ఎ, దానికిన్ + పాటింపులు + అవి, త్రసనలు + ఐనను, బటారుగన్, మరపాటి, ఐనను.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కూటమునకున్ మట్టు–మేరికలు + ఏ పట్టున్. నీ మంచి కొఱ కాదు. పాటింపులు – అవి త్రసనలు ఐనను, బటారుగన్ మరపాటి ఐనను, మట్టు–మేరికలను పాటించు అట్టి–వాఁడు దానికిన్ మంచి + ఎ..

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మట్టు–మేరికలు + ఏ = గౌరవ మర్యాదలే ; పట్టున్ = హత్తుకొనును ; కొఱ + కాదు = పనికిరాదు ; కూటమునకున్ = సంఘమునకు ; పాటించు+ అట్టి–వాఁడు = అనుష్ఠించు వాఁడు ; దానికిన్ = సమాజమునకు ; పాటింపులు + అవి = ఆ ఆచరణలు ; త్రసనలు + ఐనను = నటనలు అయినను ; బటారుగన్ = బహిరంగముగా ; మరపాటి ఐనను = యాంత్రికమైనను.

**లోవాఱిక (తాత్పర్యము) :** సమాజమునకు తరతరాల గౌరవ మర్యాదలను బయట పాటించుటయే కావలెను తప్ప నీ లోపలి మంచితనము అక్కఱలేదు. అట్లు పాటించువాఁడు దాని దృష్టిలో మంచివాఁడే. ఆ పాటించుట వట్టి నటనయే అయినను, తేఁటతెల్లముగా యాంత్రికమే అయినను దానికి ఇష్టమే.

SUMMARY : Society just wants your compliance with age-old protocols but not your innate goodness. Whoever complies with them, is quite a good one in its view, whether the compli-ance is just fake or obviously mechanical.

**గోరంటిక జంట ॥** ఏదియో యొక గడితియందె బ్రదుకుటయు, నెదిరివాటు విన నొల్లకుండుటయు
నొపొందు నుండి నేర్చికొనకుండుటయుఁ , గనులారఁ గన్నది కూడఁ గా దనుటయు 41
వంచగ్రించల వేర్మిఁ బాటింపమియు , మాట లెడాపెడ నోట రానిచ్చుటయుఁ ,
జొకట్ల విచ్చులవిడి జవదాఁటులున్, దీర్తేనులివి నికాప ప్రల్లదునకున్. 42

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏది + ఓ + ఒక, గడితియందున్ + ఎ, బ్రదుకుట + ఉన్ + ఎదిరివాటున్, వినన్ + ఒల్లక + ఉండుట + ఉన్ + ఔపోందు నుండి, నేర్చికొనక + ఉండుట + ఉన్ + కనులారన్ + కన్నది, కూడన్ + కాదు + అనుట + ఉన్, వంచ + క్రించల, వేర్మిన్ + పాటింపమి + ఉన్, మాటలు + ఎడా–పెడ, నోటన్, రాన్ + ఇచ్చుట + ఉన్ + చౌకట్ల, విచ్చులవిడి జవదాఁటులున్ + తీర్తేనుల్ + ఇవి, నికాప, ప్రల్లదునకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....ఇవి నికాప ప్రల్లదునకున్ తీర్తేనులు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గడితియందున్ + ఎ = కాలార్థకము (tense) నందే ; ఎదిరివాటున్ = ప్రతివాదమును ; వినన్ + ఒల్లక + ఉండుట + ఉన్ = వినుటకు ఇష్టపడక పోవుటయు ; ఔపోందు నుండి = అనుభవము నుండి ; వంచ + క్రించల = ముఖ్యాముఖ్యముల యొక్క ; వేర్మిన్ = వ్యత్యాసమును ; పాటింపమి + ఉన్ = పాటింపక పోవుటయు ; చౌకట్ల = నియమములను ; విచ్చులవిడి = విశృంఖలముగా ; జవదాఁటులున్ = ఉల్లంఘించుటలును ; తీర్తేనుల్ = లక్షణములు ; నికాప = అసలైన/ యథార్థమైన ; ప్రల్లదునకున్ = దుర్మార్గునకు.

**లోవాఱిక (తాత్పర్యము) :** నిజమైన దుష్టుని లక్షణములు ఎట్లు ఉండుననఁగా — ఆతఁడు మానసికముగా ఎల్లప్పుడును గతమునందో, వర్తమానమునందో, భవిష్యమునందో బ్రదుకుచుండును. (మూఁడు కాలములను సమానముగా లెక్కలోనికి తీసికొనఁడు). తన వాదనకు ప్రతివాదనను వినుటకిష్టపడఁడు. అనుభవముల నుండి గుణపాఠములను నేర్చుకొనఁడు. పైపెచ్చు కళ్ళార చూచిన దానిని సైతము "కాదు, లేదు" అనును. ముఖ్యములను అముఖ్యములుగాను, అముఖ్యములను ముఖ్యముగాను భావించును. మాటలాడునప్పుడు ఆలోచింపఁడు. (నోటికి ఏది వచ్చిన అదే మాటలాడును). నియమ నిబంధనలను యథేచ్ఛగా ఉల్లంఘించును.

SUMMARY : **The giveaways of an absolutely wicked person are** : that he exclusively lives only in one tense and refuses to take the other two tenses into account. He refuses to listen to counter-points and counter-arguments. He won't draw lessons from experience and more-over, denies even the things which are plainly visible to the naked eye. He mistakes insigni-ficant things for the significant and *vice versa*. He is reckless while talking and flouts rules and regulations with ruthless abandon.

**అవిగింగ** ॥ కొల్వలి కాదు లెప్పము కొఱముట్టె సుమ్మీ ;
ఏలకము కాదు వే, ల్వెస్తలియే తమ్మీ !
మనుకవయే వంచ మఱి మిడియారి కన్నన్ ;
మెలఁగరులే హిర్సము నడివానుల మీఁదన్. 43

**మాటల విడఁదీత (పద విభాగము) :** కొల్వలి, కాదు, లెప్పము, కొఱముట్టు + ఎ, సుమ్మీ, ఏలకము, కాదు, వేల్పు + ఎస్తలి + ఏ, తమ్మీ, మనుకవ + ఏ, వంచ, మఱి, మిడియారి కన్నన్, మెలఁగరులు + ఏ, హిర్సము, నడివానుల మీఁదన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కొల్వలి లెప్పము కాదు, కొఱముట్టు + ఎ సుమ్మీ ! ఏలకము వేల్పు కాదు, ఎస్తలి + ఏ తమ్మీ ! మిడియారి కన్నన్ మనుకవ + ఏ మఱి వంచ. నడివానుల మీఁదన్ మెలఁగరులు + ఏ హిర్సము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కొల్వలి = మతము ; లెప్పము = లక్ష్యము ; కొఱముట్టు + ఎ = సాధనమే ; సుమ్మీ = చూడుమీ ; ఏలకము = ప్రభుత్వము ; వేల్పు = దేవుఁడు ; ఎస్తలి + ఏ = ఉపకరణమే ; తమ్మీ = తమ్ముఁడా ; మనుకవ + ఏ = పెండ్లిజంటయే (వధూవరులే) ; మఱి వంచ = ముఖ్యతరము ; మిడియారి కన్నన్ = పురోహితుని కన్న ; మెలఁగరులు + ఏ = వ్యవహర్తలే ; హిర్సము = ప్రధానము ; నడివానుల మీఁదన్ = మధ్యవర్తుల కంటెను.

**లోవాటిక (తాత్పర్యము) :** మతము మానవునికి అంతిమ లక్ష్యము కాదు. అది ఒక సాధనము మాత్రమే. ప్రభుత్వము భగవంతుఁడు కాదు. అది కూడ ఒక ఉపకరణము మాత్రమే. పెండ్లి చేయు పురోహితుని కంటెను పెండ్లి చేసికొను వధూవరులే ముఖ్యము. పొత్తు కుదుర్చు మధ్య వర్తుల కన్నను పొత్తు చేసికొనుచున్న యథార్థమైన వ్యవహర్తలే ప్రధానము.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఆధ్యాత్మికులకు దేవుఁడే అంతిమ లక్ష్యము. మతము కాదు. మతములు పుట్టక ముందు కూడ దేవుఁడు ఉండెను. అట్లే అవన్నియు నశించిపోయిన తరువాత కూడ దేవుఁడు ఉండును.

SUMMARY : Religion is only an implement but not man's ultimate goal. The government is only a instrument too, but not God Almighty. The marrying couple matter more than the priest. The actual parties to a deal are more important than the middlemen.

**వాణిద ॥** తెందెఱఁగులు మామిడిపండ్లు ; తెగలు ప్రె క్కూరవేహులు ;
త్రేయలు ప్రెక్కు దవసములు ; ఒక్క తెఱఁగు కాదేదియు ;
చక్క నామతి నారయుమి ; పరిపరికముఁ బగయకుమీ. 44

**మాటల విడఁదీత (పద విభాగము) :** తెఱఁగు + తెఱఁగులు, మామిడి–పండ్లు, తెగలు, ప్రెక్కు + ఊర–వేహులు, త్రేయలు, ప్రెక్కు, దవసములు, ఒక్క, తెఱఁగు, కాదు + ఏది + ఉన్, చక్కని + ఆమతిన్ + ఆరయుము + ఇ, పరిపరికమున్ + పగయకుము + ఇ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మామిడి–పండ్లు తెఱఁగు + తెఱఁగులు. ఊర–వేహులు ప్రెక్కు తెగలు. దవసములు ప్రెక్కు త్రేయలు. ఏది + ఉన్ ఒక్క తెఱఁగు కాదు. చక్కని ఆమతిన్ + ఆరయుము + ఇ. పరిపరికమున్ పగయకుము + ఇ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తెందెఱఁగులు (తెఱఁగు + తెఱఁగులు) = రక రకాలు ; తెగలు = ఉపజాతులు ; ప్రెక్కు = బహుళము ; ఊర–వేహులు = గ్రామసింహములు ; త్రేయలు = జీవజాతులు ; దవసములు = ధాన్యములు ; చక్కని + ఆమతిన్ = అందమైన సృష్టిని ; ఆరయుము + ఇ = పరిశీలింపుము ; పరిపరికమున్ = వైవిధ్యమును ; పగయకుము + ఇ = ద్వేషింపకుము.

**లోవాటిక (తాత్పర్యము) :** మామిడిపండ్లలో రక రకాలు ఉన్నవి. కుక్కలలో పలు ఉపజాతులు ఉన్నవి. అట్లే ఒక్కొక్క ధాన్యములోను చెప్ప లేనన్ని శ్రేణులున్నవి. ఇంతటి బాహుళకముతో కూడుకొన్న ఈ సృష్టిని మురిపెముగా పరిశీలింపుము. అంతే తప్ప వైవిధ్యమును ద్వేషిం–పకుము.

SUMMARY : Mangoes are of several types. Dogs are of umpteen number of breeds. Each grain has many sub–varieties in it. Look at the creation of infinite variegation with amaze–ment, but do not ever hate diversity. *(Diversity is the law of the creation. If you hate divers–ity, it is as good as hating the creation itself).*

**మొల్ల ॥** ఒకటిఁ బోలు రెంచ మఱియొక ఉండరు ; కాని యొకటి పని నొరులు సేయఁగలరు ;
ఏ చోటును గాని నింపరిది గాదు ; ఏతుహేను లీఁగి నీ సాతమాడు. 45

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒకటిన్ + పోలు, రెంచ, మఱి + ఒకఱు + ఉండరు, కాని, ఒకటి, పనిన్ + ఒరులు + చేయన్ + కలరు, ఏ, చోటును + కాని, నింపరిది, కాదు, ఏతు–హేనులు + ఈఁగి, నీ, సాతము + ఆడు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** రెంచ = మనిషి ; ఒరులు = ఇంకొకఱు ; నింపరిది కాదు = భర్తీ చేయుటకు సాధ్యము కానిది కాదు ; ఏతు–

హేనులు = గర్వ–అహంకారములను ; ఈఁగి = విడచి ; సాతము + ఆడు = పాత్ర పోషించుము.

**లోవాఱిక (తాత్పర్యము) :** సుబోధము.

SUMMARY : No one is like the other. But one's work can be done by others too. So no one is irreplaceable. Do your duty without pride and ego, being mindful of this fact.

**పొన్నిక ||** పన్నలకుం బరువమొసఁగు మణియమొల్లములు ;

ముదిమించుఁ గోడెల మోపిక-ననుపోటలు. 46

**మాటల విడఁదీత (పద విభాగము) :** పన్నలకున్ + పరువమున్ + ఒసఁగున్, మణియ–మొల్లములు, ముదిమించున్ + కోడెలన్, మోపిక–ననుపు + ఓటలు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మణియ–మొల్లములు పన్నలకున్ పరువమున్ ఒసఁగున్. మోపిక–ననుపు + ఓటలు కోడెలన్ ముదిమించున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పన్నలకున్ = ముదుసలులకు ; పరువమున్ = యౌవనమును ; ఒసఁగున్ = ఇచ్చును ; మణియ–మొల్లములు = అధికారము మఱియు ధనము ; ముదిమించున్ = ముదుసలివారుగా చేయును ; కోడెలన్ = యౌవనులను ; మోపిక–ననుపు + ఓటలు = బాధ్యతలు మఱియు ప్రేమలో పరాజయములు.

**లోవాఱిక (తాత్పర్యము) :** అధికారము మఱియు ధనము సమకూడినచో ముదుసలివారికి తిరిగి యౌవనము పొటమరించును. బాధ్యతలు మీఁద–పడినప్పుడును, ప్రేమవ్యవహారములో మోసపోయినప్పుడును పడుచువారికి ముందే ముదిమి ముసురుకొనును.

SUMMARY : Sudden acquisition of political power and wealth bring back youth to the aged, while family responsibilities and jilted love lead to the premature onset of old age in the young people.

**పొన్నిక ||** తానొరుల ప్రాపగుట మగవానికిఁ దనివి ;

మగఁడు తనకు లోఁబడుచో మగువకు గెలివి. 47

**మాటల విడఁదీత (పద విభాగము) :** తాన్ + ఒరుల, ప్రాపు + అగుట, మగ–వానికిన్ + తనివి, మగఁడు, తనకున్, లోఁబడుచోన్, మగువకున్, గెలివి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే)

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒరుల ప్రాపు = ఇతరులకు ఆశ్రయము ; తనివి = తృప్తి ; గెలివి = సంతోషము.

**లోవాఱిక (తాత్పర్యము) :** తాను ఇతరులకు ఆశ్రయభూతుఁడగుట (ఇతరులు తన మీఁద ఆధారపడుట) మగవానికి చెప్పలేనంత సంతోష–మును కలిగించును. ఆ మగవాఁడు తనకు వశ్యుఁడగుట మగువకు వల్లమాలిన ఆనందమును కలిగించును.

**పైమాల విడఁబఱు (విశేష వివరణము) :** "అయ్యా ! మీరే మాకు దిక్కు." అన్న వారి కోసము మగవాఁడు తన ప్రాణముల నర్పించుట–కైనను సిద్ధపడునని భావము.

SUMMARY : Man is elated beyond description by the fact that others are dependent on him. Woman is delighted beyond imagination if such a man surrenders to her.

**కలిగోటిక**॥ వణికమ్ముగ వందమ్ములు వెలవెట్టక రావలె నని, ప్రా-
వణముగ నెవటో యొక అవి నీకుఁ దెచ్చి యివ్వవలె ననియుఁ
గ్రచ్చుకొనకు ; మొక్కొక్క యురువు ముచ్చటగా సయారింపఁ
గొందఱు కొంచోడ్చి యుందు రెడ-లిబ్బి-నలిగమ్ములఁ బోసి ;
వణికమ్ములు మ్రుచ్చిలికలే ; తమవైన న ట్లివ్వరులే. 48

**మాటల విడఁదీత (పద విభాగము) :** వణికమ్ముగన్, వందమ్ములు, వెల + పెట్టక, రావలెన్ + అని, ప్రావణముగన్ + ఎవటో + ఒకఱు + అవి, నీకున్ + తెచ్చి + ఇవ్వవలెన్ + అనియున్ + క్రచ్చుకొనకుము + ఒక్క + ఒక్క, ఉరువున్, ముచ్చటగాన్, సయారింపన్ + కొందఱు, కొంచు + ఓడ్చి + ఉందురు + ఎడ–లిబ్బి–నలిగమ్ములన్ + పోసి, వణికమ్ములు, మ్రుచ్చిలికలు + ఏ, తమవి + ఐనన్ + అట్లు + ఇవ్వరు లే.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....ఒక్క + ఒక్క ఉరువున్ ముచ్చటగాన్ సయారింపన్ ఎడ–లిబ్బి–నలిగమ్ములన్ పోసి కొందఱు కొంచు ఓడ్చి + ఉందురు.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వణికమ్ముగన్ = ఉచితముగా/తేరగా ; వందమ్ములు = వస్తువులు ; ప్రావణముగన్ = బహుమానముగా ; క్రచ్చుకొనకుము = ఆశింపకుము ; ఉరువున్ = అంశమును/ వస్తువును ; సయారింపన్ = తయారు చేయుటకు ; కొంచు + ఓడ్చి + ఉందురు = చెమటోడ్చి ఉందురు ; ఎడ–లిబ్బి–నలిగమ్ములన్ = సమయమును, ధనమును మఱియు పదార్థములను ; మ్రుచ్చిలికలు + ఏ = దొంగతనములే.

**లోవాఱిక (తాత్పర్యము) :** వెల ఇచ్చి కొనకుండనే నీకు వస్తువులు రావలె ననియు, ఎవడైన వాటిని నీకు బహుమానముగా తెచ్చి ఇవ్వవలె ననియు ఆశింపవలదు. ఒక్కొక్క వస్తువు తయారగుట వెనుక ఎంతోమంది ఉందురు. వారు దానిని చేయుటకై తమ సమయమును, ధన–మును మఱియు పదార్థములను వెచ్చము జేసి చెమటోడ్చి ఉందురు. వారి శ్రమఫలితములైన వస్తువులను ఉచితముగా పొందుట వారికి అన్యాయము చేయుటయే. కనుక అట్లు పొందుట దొంగతనముతో సమానమే. ఊరక వచ్చువాటిపై మోజుపడువారు తమ వస్తువులను మాత్రము ఎవ్వఱికిని ఉచితముగా ఇవ్వరు.

SUMMARY : Do not expect to acquire things free of cost. Also do not expect someone to bring them to you as gifts. Behind each object, there would be many who worked hard by the sweat of the brow, investing their time, money and material in it. To obtain the outcome of their labour free of cost, is nothing but doing injustice to them. All the things thus obtained are as good as stolen goods. The same people who are after freebies would not offer their own things to others for free.

**పస్పియ జంట**॥ తార్మి యున్నను దిట్టకుము ; నీకున్, మణియమున్నను గొట్టకుము బిట్టుగఁ ;
చెలిమి యున్న నడిచెఱుకులేయకుము ; మఱువరు మంది, మఱచినట్లు లుందు ; 49
రెదురేసెదరు నీకు సరిసరియన్ ; ఒల వెల్ల లాసీమ నిన్ను వసిలి. 50

**మాటల విడఁదీత (పద విభాగము) :** తార్మి + ఉన్నను + తిట్టకుము, నీకున్, మణియము + ఉన్నను + కొట్టకుము, బిట్టుగన్, చెలిమి + ఉన్నన్ + అడిచెఱుకుల్ + ఏయకుము, మఱువరు, మంది, మఱచిన + అట్టుల్ + ఉందురు + ఎదురు + ఏసెదరు, నీకున్, సరి–సరియన్, ఒలవు + ఎల్లన్, లాసీమ, నిన్నున్, వసిలి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నీకున్ తార్మి ఉన్నను తిట్టకుము. మణియము ఉన్నను కొట్టకుము. బిట్టుగన్ చెలిమి ఉన్నన్ అడిచెఱుకుల్ +

ఏయకుము. మంది మఱువరు. మఱచినట్టుల్ ఉందురు. నీకున్ సరి–సరియన్ ఎదురు + ఏసెదరు. నిన్నున్ వసిలి ఒలవు ఎల్లన్ లాసీమ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తార్మి = హక్కు ; మణియము = అధికారము ; బిట్టుగన్ = గాఢముగా ; చెలిమి = స్నేహము ; అడి చెఱుకుల్ = అతి ఛలోక్తులు ; ఏయకుము = ప్రయోగింపకుము ; ఎదురు + ఏసెదరు = తిరిగి ప్రయోగించెదరు ; సరి–సరియన్ = సరైన అవకాశమునందు ; ఒలవు = ప్రపంచము ; ఎల్లన్ = అంతయు ; (నీకున్ – అధ్యాహారము) లాసీమ = విదేశము ; నిన్నున్ వసిలి = నీవు తప్ప.

**లోవాటిక (తాత్పర్యము) :** హక్కు ఉన్నను తిట్టవలదు. అధికారము ఉన్నను కొట్టవలదు. ఒకఱితో నీకు ప్రగాఢమైన మైత్రి ఉన్నను వారికి గ్రుచ్చుకొనునంత పదునైన ఛలోక్తులను వారి మీఁద ప్రయోగింపవలదు. వారు వాటిని మఱచిపోరు కాని పైకి మఱచినట్లు నటించెదరు. ఒక మంచి అవకాశము చిక్కఁగానే వాటిని వారు నీ మీఁదికి ఎదురు–ప్రయోగించెదరు. **నీకు జనము, నీవనుకొనుచున్నంత ఆప్తులు కారు.** నీవు తప్ప ఈ ప్రపంచమంతయు నీకు విదేశముతో సమానమని తెలిసికొని అందఱితోను జాగ్రత్తగా ఉండుము.

SUMMARY : Do not scold anyone even if you have the right to. Do not beat/ hit anyone even if you have the power. Do not crack nasty jokes on anyone even if you have thick frien–dship with them. Folks do not ever forget these things, but pretend to have forgotten. How–ever they will repay you in kind at the right opportunity. **Those whom you deem to be the intimate ones, are not really so.** Barring yourself, the entire world is as good as an alien land unto you. Bear this fact in your mind and exercise caution. (Be within your limits).

**వెల్మొరిక జంట ॥** కోవెల వెలుపల ౨ కూటమె తన, కూర్చువేల్పుఁ గాంచరియుఁ గాంచు-

వన్ని తప్పుల కొడిగట్టుఁ దా, దాని మెచ్చింపఁ బెద్దకారు ; 51

మన్నింపుల కిడుమదాఁటునకు, మటుకుఁ బ్రాపించును దా నంకు. 52

**మాటల విడఁదీత (పద విభాగము) :** కోవెల వెలుపలన్, కూటము + ఎ, తన, కూర్చు–వేల్పున్ + కాంచరి + ఉన్ + కాంచువు + అన్ని, తప్పులకున్ + ఒడిగట్టున్ + తాన్, దానిన్, మెచ్చింపన్ + పెద్ద–కారు, మన్నింపులకున్ + ఇడుమ–దాఁటునకున్, మటుకున్ + ప్రాపించును + తాన్ + అంకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కోవెల వెలుపలన్ కూటము + ఎ తన కూర్చు–వేల్పున్ కాంచరి + ఉన్ కాంచువు. తాన్ దానిన్ మెచ్చింపన్ అన్ని తప్పులకున్ పెద్ద–కారు ఒడిగట్టున్. మన్నింపులకున్ ఇడుమ–దాఁటునకున్ మటుకున్ తాన్ అంకున్ ప్రాపించును.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కోవెల వెలుపలన్ = గుడికి బయట ; కూటము + ఎ = సమాజమే ; కూర్చు–వేల్పున్ = ఇష్టదేవత ; కాంచరి + ఉన్ = తల్లి మఱియు తండ్రి ; కాంచువు = గురువు ; పెద్ద–కారు = చాల కాలము పాటు ; మన్నింపులకున్ = క్షమార్పణలకు ; ఇడుమ–దాఁటునకున్ = కష్టములను కడచుటకు ; ప్రాపించును = ఆశ్రయించును ; అంకున్ = భగవంతుని.

**లోవాటిక (తాత్పర్యము) :** గుడి బయట తాను కడపు జీవితములో మనిషి సమాజమునే తన ఇష్టదేవతగాను, తల్లిగాను, తండ్రిగాను, గురువుగాను భావించి ఉపాసించును. కాని చేసిన పాపములకు క్షమార్పణలు వేఁడుటకును, ఆ పాప ఫలితముగా దాఁపరించిన ఇక్కట్లను దాఁటుటకు మాత్రము గుడిలో దేవుని ఆశ్రయించును.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** మనిషిని ఆ పరిస్థితిలోనికి నెట్టునది — ఆతనికి సమాజము పట్లను, దాని విలువల వ్యవస్థ పట్లను ఉన్న అమితమైన గుఱియే. ఆ పిచ్చిగుఱి పోవనంత కాలము ఎన్నిసారులు దేవుఁడు మనిషిని మన్నించినను, కాఁపాడినను ప్రయోజనము లేదని తాత్పర్యము. మరల మరల ఆ తప్పులనే మామఱించు నని కూడ కవిభావము.

SUMMARY : To man, society itself is the beloved God, parent and preceptor while he is out-side of the temple. However, he subsequently takes shelter in God for the sake of pardon and tiding over hardships.

*(It is the society and its flawed value system which actually account for his predicament. Man repeats the same mistakes over and again as long as he believes in the value system, no matter howmany times God saved and forgave him, implies the poet).*

**దాసానిక ॥** ఎఱుపెక్కిన తూర్పుకేసి యెగిరిపోయిన పులుగు
పడమర తొగరగుచుండఁగ నింటికై వెనుదిరుగు ;
కన్నతల్లిఁ గలిగినూరిఁ గడుపుఁ దిప్పల వలనఁ
గైవీడిన మఱురాకడ మఱువరా దెన్నడున్ ;
ఇట్టిద సూ తనదైన చెరిది గట్టిగఁ దలవన్. 53

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎఱుపు + ఎక్కిన, తూర్పు కేసి, ఎగిరిపోయిన, పులుగు, పడమర, తొగరు + అగుచు + ఉండఁగన్ + ఇంటికై, వెనుదిరుగున్, కన్న-తల్లిన్ + కలిగిన + ఊరిన్ + కడుపు + తిప్పల, వలనన్ + కైవీడినన్, మఱు-రాకడన్, మఱువన్ + రాదు + ఎన్నడున్, ఇట్టిది + అ, సూ, తనది + ఐన, చెరిది, గట్టిగన్ + తలవన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎఱుపు ఎక్కిన తూర్పుకేసి ఎగిరిపోయిన పులుగు పడమర తొగరు అగుచు ఉండఁగన్ ఇంటికై వెను దిరుగున్. కన్న-తల్లిన్ కలిగిన ఊరిన్ కడుపు-తిప్పల వలనన్ కైవీడినన్ మఱు-రాకడన్ ఎన్నడున్ మఱువన్ రాదు. గట్టిగన్ తలవన్ ఇట్టిది + అ సూ తనది ఐన చెరిది.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తూర్పు కేసి = తూర్పు వైపుగా ; పులుగు = పక్షి ; తొగరు = ఎఱుపు ; కలిగిన + ఊరిన్ = పుట్టిన ఊరిని ; కడుపు + తిప్పల వలనన్ = ఆఁకటి బాధతో ; కైవీడినన్ = విడచి వెడలినను ; మఱు-రాకడన్ = తిరిగి వచ్చుటను ; ఇట్టిది + అ సూ = ఇట్టిదే సుమా.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : The bird which flew away to the reddening East, returns home when it is the West's turn to redden. Although one is forced to leave one's birth-mother and the native town for elsewhere due to the pangs of hunger, one should not forget to return to one's roots. This applies not to just the mother and native place, but everything belonging to one.

**దాసానిక జంట ॥** పడమట ద్రిచ్చుమొగమైన ౨ అంజూట్టము లేచు-
న్నప్పస మటు మఱునా డక్కజముగఁ దూర్పుకనుమ ;
కుంది డింది మ్రందినటు మంది కగుపించువారు ౨ ,
అదాటుగా నెటారిల్లెద రంచించని తీరు ౨ , 54
ఇనుమడించు బ్రోముతో నిట్టలంపు టాముతోన్ ;
కమలకు మురియకు మెవ్వఱి కైవ్రాలిక కెడఁదలోన్. 55

**మాటల విడఁదీత (పద విభాగము) :** పడమటన్, ద్రిచ్చుమొగము + ఐన, అంజూట్టము, లేచున్ + అప్పసము + అటు, మఱు-నాడు +

అక్కజముగన్ + తూర్పు–కనుమన్, కుంది, డింది, మ్రందిన + అటు, మందికిన్ + అగుపించు–వారు, అదాటుగాన్ + ఎటారిల్లెదర్ + అంచించని, తీరు, ఇనుమడించు, బ్రోముతోన్ + ఇట్టలంపు + ఆముతోన్, కమలకు, మురియకుము + ఎవ్వఱి, క్రైవాలికకున్ + ఎడఁదలోన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పడమటన్ ద్రిచ్చుమొగము ఐన అంజుట్టము అప్పసము అటు–మఱు–నాడు అక్కజముగన్ తూర్పు–కనుమన్ లేచున్. కుంది డింది మ్రందిన అటు మందికిన్ అగుపించు–వారు ఇనుమడించు బ్రోముతోన్ ఇట్టలంపు ఆముతోన్ అంచించని తీరు అదాటుగాన్ ఎటారిల్లెదర్. ఎవ్వఱి క్రైవాలికకున్ ఎడఁదలోన్ కమలకు. మురియకుము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ద్రిచ్చుమొగము = అదృశ్యము ; అంజుట్టము = సూర్యుఁడు ; లేచున్ = పొడచును (ఉదయించును) ; అప్పసము =అనునిత్యము ; అటు–మఱు–నాడు = ఆ మఱునాడు ; అక్కజముగన్ = ఆశ్చర్యముగా ; తూర్పు–కనుమన్ = తూర్పు కొండల శ్రేణిలో ; కుంది = బాధపడి ; డింది = క్షీణించి ; మ్రందిన + అటు = అంతరించినట్లు ; మందికిన్ = జనమునకు ; అగుపించు–వారు = కనిపించువారు ; అదాటుగాన్ = ఆకస్మికముగా ; ఎటారిల్లెదర్ = ప్రత్యక్షమయ్యెదరు ; అంచించని తీరు = ఊహించని/ అనుకొనని తీరుగా ; ఇనుమడించు = రెట్టింపైన ; బ్రోముతోన్ = శక్తితో ; ఇట్టలంపు = విపరీతమైన ; ఆముతోన్ = ఉద్ధతితో ; కమలకు = వివర్ణము కాకుము ; మురియకుము = సంతోషింపకుము ; క్రైవాలికకున్ = పతనమునకును ; ఎడఁదలోన్ = హృదయములో.

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రతిదినమును పడమట మాయమైనట్లుగా కానవచ్చు సూర్యుఁడు మఱునాడు తూర్పుకనుమలలో మరల ఉజ్వలముగా ఉదయించును. అదే విధముగా, "బాధలుపడి, క్రుంగిపోయి, **క్షీణించి** అంతరించినా" రని జనమెవఱి గుఱించి అయితే అనుకొం–దురో వారే భవిష్యత్తులో ఒకనాడు ఆకస్మికముగా రెట్టించిన శక్తిసామర్థ్యములతోను, మిక్కిలిన ఆత్మవిశ్వాసముతోను ప్రత్యక్షమయ్యెదరు. కనుక ఎవఱైనను పతనమైనందుకు విచారించను వలదు. లేదా ఆనందించను వలదు.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** <u>అంజుట్టము</u> = అందఱి + చుట్టము (లోకబాంధవుఁడు) — ఆద్యక్షర శేషత్వము.

SUMMARY : The Sun which regularly appears to be vanishing in the West, reappears afresh the very next day in the Eastern range of mountains. Similarly the ones who are thought to have suffered, declined and perished, will one day reappear with redoubled vigor and confid–ence. Therefore, do not despair, nor rejoice at anyone's downfall.

**మొల్ల ॥** మరులుగొన్నా నని మనువాడెద నని, మగువయు మగవాఁడు నొండొరులకుఁ జే-
మాట యిచ్చి క్రచ్చుగొల్పి మారుటయు, మనువాడినను మీఁద మాయమగుటయు,
మఱిమఱి మఱకలగు మఱునాళులకున్. 56

**మాటల విడఁదీత (పద విభాగము) :** మరులు–కొన్నాను + అని, మనువు + ఆడెదన్ + అని, మగువ + ఉన్, మగ–వాఁడు + ఉన్, ఒండొరులకున్ + చేమాట + ఇచ్చి, క్రచ్చు–కొల్పి, మారుట + ఉన్, మనువు + ఆడినను, మీఁదన్, మాయము + అగుట + ఉన్, మఱి–మఱి, మఱకలు + అగున్, మఱు–నాళులకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....మఱు–నాళులకున్ మఱి–మఱి మఱకలు అగున్. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మరులు–కొన్నాను = ప్రేమించినాను/ మనసుపడ్డాను ; మనువు + ఆడెదన్ = పెండ్లాడెదను ; ఒండొరులకున్ = ఒకఱికొకఱు ; చేమాట = వాగ్దానము ; క్రచ్చు–కొల్పి = ఆశపెట్టి ; మీఁదన్ = తరువాత ; మఱి–మఱి = మిక్కిలి ; మఱకలు + అగున్ = కళంకములు అగును ; మఱు–నాళులకున్ = తరువాతి కాలములో.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఆడుది గానీ, మగవాఁడు గానీ, "నేను నీ మీఁద మనసుపడ్డాను. పెండ్లి చేసికొనెద" నని వాగ్దానము చేసి, ఆశలు

రేకెత్తించి ఆ తరువాత మాట తప్పుటయు, లేదా పెండ్లి చేసికొని కనఁబడకుండ పోవుటయు – ఈ పనులు వారికి తరువాతి కాలములో గొప్ప కళంకములుగా పరిణమించును.

SUMMARY : If a man or woman went back on their word after expressing love, or if they disappeared out of the sight of the spouse soon after the wedding, the act will be a big blot. *(Means – such ones will have to face bitter consequences in the latter times).*

**వెల్మిరిక ॥** చెవిని బెట్టుము చెడును గలిదము ; చేరి చూడుము చెడును మెలిదము ;
చెడును గుఱించియుఁ దెలిసికొనుము ; మంచియు నపుడె మానుగఁ దెలియు. 57

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెవిని + పెట్టుము, చెడును + కలిదము, చేరి, చూడుము, చెడును, మెలిదము, చెడును, గుఱించి + ఉన్, తెలిసికొనుము, మంచి + ఉన్ + అపుడు + ఎ, మానుగన్ + తెలియున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చెడును కలిదము చెవిని + పెట్టుము. చెడును మెలిదము చేరి చూడుము.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చెవిని + పెట్టుము = వినుము ; కలిదము = సహితము ; మెలిదము = సహితము ; మానుగన్ = చక్కగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Lend an ear to bad things as well. Approach and behold the evil too. Get to know it intimately. Only then you will know what good things are like.

**గోరంటిక ॥** ఒంటి విడక మున్న వారకముఁ దీర్పుము ; మంటఁ గలయు మున్న మన్నింపు వేఁడుము ;
కన్నుమూయక మున్న తరుకుందువడుము ; పొలియుటకు మున్న ప్రోజముఁ బొనరింపుము. 58

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒంటిన్, విడక, మున్ను + అ, వారకమున్ + తీర్పుము, మంటన్ + కలయు, మున్ను + అ, మన్నింపున్, వేఁడుము, కన్ను–మూయక, మున్ను + అ, తరుకుందు + పడుము, పొలియుటకున్, మున్ను + అ ప్రోజమున్ + పొనరింపుము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒంటిన్ = శరీరమును ; విడక మున్ను + అ = వదలివేయక ముందే ; వారకమున్ = ఋణమును ; మంటన్ = మట్టిలో / మంటలలో ; కలయు మున్ను + అ = కలసిపోవుటకు ముందే ; మన్నింపున్ = క్షమార్పణ ; కన్ను–మూయక మున్ను + అ = చనిపోవక ముందే ; తరుకుందు + పడుము = పశ్చాత్తాప పడుము ; పొలియుటకున్ మున్ను + అ = నశించుటకు ముందే ; ప్రోజమున్ = ప్రాయశ్చిత్తమును ; పొనరింపుము = ఆచరింపుము.

**లోవాఱిక (తాత్పర్యము) :** చనిపోవుటకు ముందే 4 పనులను పూర్తిచేయుము. అవి ఏవనఁగా – (1) తీర్చవలసి ఉన్న అప్పులన్నియు తీర్చి వేయుట. (2) ఎవఱికైతే నీ వలన నష్టము మఱియు అవమానము జరిగినదో వారి యొద్దకు పోయి క్షమాపణ వేఁడుట. (3) నీవు చేసిన – ప్రతిక్రియ లేని అపరాధములకు మనస్ఫూర్తిగా పశ్చాత్తాప పడుట. (4) నీకు శక్తి ఉన్నచో ఆ అపరాధములకు తగు విధముగా ప్రాయశ్చి–త్తము చేసికొనుట.

SUMMARY : Finish 4 tasks well before you breathe your last. (1) Repaying all the debts you owed. (2) Begging for the pardon of those who lost something because of you and were agoni–zed/ humiliated by you. (3) Honestly repenting for the sort of the wrongs which cannot be undone. (4) Performing suitable atonement for the wrongs committed, if you can.

**వెల్మీరిక ॥** ఇండ్లకు వలయు సోరణగండ్లు ; మేనికి వలయు మూసోణములు ;
సీమల నడు మంపుదేఱము- లలజందముల కీవికోలులు ;
తొలములకుఁ బోకరాకడలు. 59

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఇండ్లకున్, వలయున్, సోరణగండ్లు, మేనికిన్, వలయున్, మూ–సోణములు, సీమల నడుమన్ + అంపుదేఱములు + అలజందములకున్ + ఈవికోలులు, తొలములకున్ + పోక–రాకడలు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఇండ్లకున్ సోరణగండ్లు వలయున్. మేనికిన్ మూ–సోణములు వలయున్. సీమల నడుమన్ + అంపు దేఱములు వలయున్. అలజందములకున్ + ఈవికోలులు వలయున్. తొలములకున్ + పోక–రాకడలు వలయున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వలయున్ = కావలె ; సోరణగండ్లు = కిటికీలు ; మేనికిన్ = శరీరమునకు ; మూ–సోణములు = ముక్కు పుటాలు ; సీమల నడుమన్ = దేశముల మధ్య ; అంపుదేఱములు = వాణిజ్యములు ; అలజందములకున్ = సంస్కృతులకు ; ఈవికోలులు = ఇచ్చి పుచ్చుకొనుటలు ; తొలములకున్ = సంబంధములకు ; పోక–రాకడలు = వచ్చి పోవుటలు.

**లోవాఱిక (తాత్పర్యము) :** గాలి ఆడుటకై ఇండ్లకు కిటికీలును, శరీరమునకు ముక్కుపుటాలు ఉన్నట్లే దేశములు బ్రదుకవలె నన్నచో వాటి నడుమ వాణిజ్య సంబంధములు ఉండవలె. సంస్కృతులు నిలఁబడవలె నన్నచో వాటి నడుమ ఇచ్చిపుచ్చుకొనుట ఉండవలె. అదే విధముగా మానవ సంబంధములు నిలఁబడవలె నన్నచో – వారు ఒండొరుల కడకు తఱచుగా వచ్చుచు, పోవుచు ఉండవలె.

SUMMARY : Just as houses have windows and the body has nostrils to breathe, countries need to have commerce running between them, should they survive. Diverse cultures should be mutually reciprocal to be able to endure. Similarly humans should often visit each other's houses to keep their friendship going on.

**గంగేరిక జంట ॥** మంచిమాట యొకటి నీవన్నది, మసలకుండుఁ జీమచిటుక్కు వలె ;
చెడ్డమాట యొకటి నీవన్నది, చేరుఁ గ్రేవంచుల నురుము వలె ; 60
నెరసుమట్టుఁజూపఱి కూట- మిది మార్దర్ది ; యీావ మారవలె. 61

**మాటల విడఁదీత (పద విభాగము) :** మంచి, మాట + ఒకటి, నీవు + అన్నది, మసలక + ఉండున్ + చీమ–చిటుక్కు వలెన్, చెడ్డ, మాట + ఒకటి, నీవు + అన్నది, చేరున్ + క్రేవ + అంచులన్ + ఉరుము వలెన్, నెరసు–మట్టు + చూపఱి, కూటము + ఇది, మార్దర్ది, ఈవు + అ, మారన్ వలెన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నీవు అన్నది మంచి మాట ఒకటి చీమ–చిటుక్కు వలెన్ మసలక ఉండున్. నీవు అన్నది చెడ్డ మాట ఒకటి+ క్రేవ + అంచులన్ ఉరుము వలెన్ చేరున్. కూటము నెరసు–మట్టు చూపఱి. ఇది మార్దర్ది. ఈవు + అ మారన్ వలెన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మసలక + ఉండున్ = తిరుగాడకుండ/ కదలకుండ ఉండును ; చీమ–చిటుక్కు వలెన్ = చీమ చిటుక్కు మన్న సవ్వడి వలె ; క్రేవ + అంచులన్ = దిగంతములను ; నెరసు–మట్టు + చూపఱి = దోషములను మట్టుకే చూచునది ; కూటము = సమాజము ; మార్దర్ది = మారుట అసాధ్యమైనది ; ఈవు + అ = నీవే.

**లోవాఱిక (తాత్పర్యము) :** నీవు పలికిన ఒక మంచిమాట ఎవటి చెవులలోను పడకుండ చీమ చిటుక్కుమన్న సవ్వడి వలెనె నిమ్మళముగా అక్కడనే అణఁగిపోవును. కాని నీవు పలికిన ఒక చెడ్డమాట మట్టుకు ఉరుము చప్పుడు వలె దిగంతముల వరకు ప్రాఁకిపోయి నీకు చెడ్డపేరు దెచ్చును. సమాజము దోషైకదృక్కు *(నెరసుమట్టుఁజూపఱి).* అది నీ దోషములనే తప్ప గుణములను చూడదు. అది అంతే, మారదు. దాని తత్త్వమును గ్రహించి నీవే మారవలె.

SUMMARY : The sound of a good word said by you falls on no one's ears, but gets subdued into silence like that of an ant. However, that of a bad word from your mouth spreads all over the horizon like thunder and brings you disrepute. The society perceives only your vices but not your virtues. So you need to change yourself, as it won't ever.

**అవిగింగ ||** చినుకుఁ జినుకుఁ జేరి ముంచెత్తెడు వాఁకై ;
పరక పరక కలసి పట్టు నేన్గును మోకై ;
పోగు పోగుఁ గూడి ప్రోచుఁ బేర్మిని మడుగై ;
కలుగుఁ గలిమి బలిమి కలసికట్టున నిరుకై. 62

**మాటల విడఁదీత (పద విభాగము) :** చినుకున్ + చినుకున్ + చేరి, ముంచి + ఎత్తెడున్, వాఁక + ఐ, పరక, పరక, కలసి, పట్టున్ + ఏన్గును, మోకు + ఐ, పోగు, పోగున్ + కూడి, ప్రోచున్ + పేర్మిని, మడుగు + ఐ, కలుగున్ + కలిమి, బలిమి, కలసికట్టునన్, నిరుకు + ఐ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చినుకున్ చినుకున్ చేరి వాఁక + ఐ ముంచి ఎత్తెడున్. పరక పరక కలసి మోకు + ఐ ఏన్గును పట్టున్. పోగు పోగున్ కూడి మడుగు + ఐ పేర్మిని ప్రోచున్. కలసికట్టునన్ కలిమి బలిమి నిరుకు + ఐ కలుగున్.

**కుఱు మప్మాటిక (లఘుటీక) :** వాఁక + ఐ = ప్రవాహమై ; పట్టున్ = నిలువరించును/ అదుపు చేయును ; మోకు + ఐ = పెనుత్రాడై ; పోగు పోగున్ = ఒక్కొక్క నులిదారమును ; కూడి = కలసి ; ప్రోచున్ = కాఁపాడును ; పేర్మిని = గౌరవమును ; మడుగు + ఐ = బట్టయై ; కలిమి = సంపద ; బలిమి = బలము ; కలసికట్టునన్ = ఐకమత్యమునందు ; నిరుకు + ఐ = ఖాయమై/ ఖాయముగా/ నిశ్చయముగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** వానచినుకులన్నియు కలసి పెనుప్రవాహమై ఊళ్ళను ముంచెత్తును. గడ్డిపరకలన్నియు కలసి పెనుమోకై ఏనుగును సైతము కట్టివేయును. నులిదారములన్నియు కలసి బట్టగా రూపొంది మనిషి మానమును కాఁపాడును. మానవులకు ఐకమత్యము చేత నిశ్చయముగా సంపదయు, బలమును కలుగును.

SUMMARY : The drops of a drizzle form together rapids which flood villages. The dry blades of grass form together a jumbo rope which keeps even an elephant arrested. Slender strands of a thread form together a cloth which protects the human's honour. Men sure derive pros-perity and strength from their unity.

**పొన్నిక ||** మడియువ తౌలముల్ మన్నికై చెన్నగున్,
మరులు మణియము మాడలు మనోజ యీలుగుఁ ,
దలవని తలఁపుగఁ దా మరుదెంచి వాటన్,
దల దూరింపనంత తఱియు నెప్పాటన్. 63

**మాటల విడఁదీత (పద విభాగము) :** మడియువ, తౌలముల్, మన్నిక + ఐ, చెన్ను + అగున్, మరులున్, మణియమున్, మాడలున్, మనోజ + ఈలుగున్, తలవని, తలఁపుగన్ + తాము + అరుదెంచి, వాటన్ + తలన్, దూరింపని + అంత, తఱి + ఉన్ + ఏ + పాటన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మరులున్ మణియమున్ మాడలున్ మనోజ ఈలుగున్ తలవని తలఁపుగన్ తాము అరుదెంచి వాటన్ ఏ + పాటన్. తలన్ దూరింపని అంత తఱి + ఉన్ మడియువ తౌలముల్ మన్నిక + ఐ చెన్ను అగున్.

**కుఱు మప్మాటిక (లఘుటీక) :** మడియువ తౌలముల్ = మానవ సంబంధములు ; మన్నిక + ఐ = కలకారు నిలచునట్టివై ; చెన్ను + అగున్ = బాగుండును ; మరులున్ = కామమును ; మణియమున్ = అధికారమును ; మాడలున్ = ధనమును ; మనోజ = వృత్తియు ; ఈలుగున్

= చావును ; తలవని తలఁపుగన్ = అనుకొనకుండ/ అనూహ్యముగా ; అరుదెంచి = వచ్చి ; వాటన్ = వాటిలో ; తలన్ దూరింపని + అంత తఱి ఉన్ = తల దూర్చనంత కాలము ; ఏ + పాటన్ = ఏ విధముగాను.

**లోవాఱిక (తాత్పర్యము) :** మానవ సంబంధములలోనికి – కామవాంఛ, అధికారము, ధనము, వృత్తిపరమైన స్వార్థములు, మరణము — ఇవి అనూహ్యముగా వచ్చివేసి వాటిలో తల దూర్చనంత కాలము అవి బాగుగనే ఉండును.

SUMMARY : Human relations would be just fine as long as lust, power, money, professional interests and death unexpectedly rush in and intervene.

**గోరంటిక ॥** రాటలు నాలుఁగే కూటమెల్లాకున్, లెంక లాసాదు లెఱఁపరు లిల్లాండ్రున్ ;

కూటంబు కూలుఁ గూళలు వీ రయినన్, బని వీరిది లోనకరిప్రా పగుటన్. 64

**మాటల విడఁదీత (పద విభాగము) :** రాటలు, నాలుఁగు + ఏ, కూట–మెల్లాకున్, లెంకలు + ఆసాదులు + ఎఱఁపరులు + ఇల్లాండ్రున్ కూటంబు, కూలున్ + కూళలు, వీరు + అయినన్, పని, వీరిది, లోన–కరి–ప్రాపు + అగుటన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** కూట–మెల్లాకున్ రాటలు నాలుఁగు + ఏ. లెంకలు ఆసాదులు ఎఱఁపరులు ఇల్లాండ్రున్. వీరిది పని లోన–కరి–ప్రాపు అగుటన్ వీరు కూళలు అయినన్ కూటంబు కూలున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** రాటలు = స్తంభములు ; కూట–మెల్లాకున్ = సమాజము అను మండపమునకు ; లెంకలు = సైనికులు ; ఆసాదులు = పూజారులు ; ఎఱఁపరులు = ఉపాధ్యాయులు ; ఇల్లాండ్రున్ = గృహిణులు ; కూళలు = చెడ్డవారు ; పని వీరిది = వీరి పని (వీరు చేయవలసిన పని) ; లోన–కరి–ప్రాపు = మనస్సాక్షియే ఆశ్రయముగాఁ గలది ; అగుటన్ = అగుట చేత.

**లోవాఱిక (తాత్పర్యము) :** సమాజము అను మండపమును నిలఁబెట్టు మూలస్తంభముల వంటివారు నలుగుఱు. వారు — సైనికులు, పూజా–రులు, ఉపాధ్యాయులు మఱియు గృహిణులు. వీరి పనిని, యాంత్రికమైన కర్తవ్యముగా కాక, హృదయపూర్తిగా మనస్సాక్షి నాశ్రయించి చేయవలసి ఉండును కనుక, వీరు గనుక చెడ్డవారైనచో సమాజ భవనము నిట్టనిలువున కూలిపోవును.

**పైమాల విడఁబఱ్పు (విశేష వివరణము) :** సమాజమునందలి మిగితావారి మంచితనమీ నాలుఁగు శ్రేణులవారి మంచితనము మీఁదనే ఆనకపడి యున్నది.

SUMMARY : The social edifice primarily stands on 4 pillars, namely, armymen, priests, tea–chers and housewives. If these pillars get corrupted, the edifice collapses miserably, as the work of these people is not something to be done mechanically, but with the fullest dedication and from the depths of the conscience.

**తంగేడుక జంట ॥** చెప్పి తప్పు డవనేల? అప్పగింపుము కనుసెవు-

లొప్పరు మన నని తోపఁ, దప్పుకొని మిన్నక నీ, 65

నప్పిన చొప్పునఁ జేయు- ముప్పందింప కసదున్. 66

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెప్పి, తప్పుడు + అవన్ + ఏల, అప్పగింపుము, కను + చెవుల్ + ఒప్పరు, మనన్ + అని, తోపన్ + తప్పుకొని, మిన్నక, నీ, నప్పిన, చొప్పునన్ + చేయుము + ఉప్పు + అందింపక + అసదున్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** చెప్పి తప్పుడు అవన్ ఏల? ఒప్పరు మనన్ అని తోపన్ కను + చెవుల్ అప్పగింపుము. తప్పుకొని అసదున్ ఉప్పు అందింపక నీ నప్పిన చొప్పునన్ మిన్నక చేయుము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చెప్పి = తెలియఁజేసి ; తప్పుడు = దోషి ; అవన్ + ఏల = అగుట ఎందుకు ; ఒప్పరు = ఒప్పుకొనరు ; మనన్ = మన మాటలకు ; తోపన్ = స్ఫురింపఁగా ; మిన్నక = నిశ్శబ్దముగా ; నీ నప్పిన చొప్పునన్ = నీకు అనువైన విధముగా ; ఉప్పు + అందింపక = తెలియనివ్వక ; అసదున్ = కొంచెము కూడ.

**లోవాటిక (తాత్పర్యము) :** నీవేమి చేయ నున్నావో ముందే ఒరులకు తెలియఁజేసి వారి కనురోకలో దోషి వగుట ఎందుకు? "మన మాటలకు / ప్రతిపాదనములకు వారు ఒప్పుకొనరు" అని ముందే తట్టినప్పుడు, వారు చెప్పుదానిని కనుసెవు లప్పగించి విని, ఆ తరువాత వారి నుండి తప్పుకొని నీకెట్లు అనువుగా ఉండునో అట్లు నిశ్శబ్దముగా చేసికొనుము.

SUMMARY : Why appear guilty in the eyes of others by revealing to them in advance what you propose to do? When you smell that they are unlikely to accept your proposals, be just a passive listener to their words and later, quietly do what suits you the best.

**పస్సియ** ॥ కాంచువు లార్వుఱు సాలెద రన్నియు, గఱపన్, ద్యాలును లొల్లగారమున్,
విన్నము నేస్త-చుట్టముల చావును, రో-కోల్పోకయు మోసపోకయున్. 67

**మాటల విడఁదీత (పద విభాగము) :** కాంచువుల్ + ఆర్వుఱు + చాలెదరు + అన్ని + ఉన్ + కఱపన్ + త్యాలు + ఉను, లొల్లగారము + ఉన్, విన్నము + ఉన్, నేస్త–చుట్టముల, చావు + ఉను, రో–కోల్పోక + ఉన్, మోసపోక + ఉన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** అన్ని + ఉన్ కఱపన్ ఆర్వుఱు కాంచువుల్ చాలెదరు. త్యాలు + ఉను లొల్లగారము + ఉన్ విన్నము + ఉన్ నేస్త–చుట్టముల చావు + ఉను రో–కోల్పోక + ఉన్ మోసపోక + ఉన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కాంచువుల్ = గురువులు ; కఱపన్ = నేర్పుటకు/ బోధించుటకు ; త్యాలు + ఉను = జబ్బు మఱియు ; లొల్లగారము + ఉన్ = పేదఱికమును ; విన్నము + ఉన్ = అవమానమును ; నేస్త–చుట్టముల = మిత్రబాంధవుల యొక్క ; రో–కోల్పోక + ఉన్ = ధన నష్టమును ; మోసపోక + ఉన్ = మోసపోవుటయు.

**లోవాటిక (తాత్పర్యము) :** అన్ని జీవిత పాఠములను కూలంకషముగా నేర్పఁగల గురువులు ఆఱుగురు కలరు. వారు ఎవఱనఁగా – జబ్బు, పేదఱికము, అవమానము, సన్నిహిత బంధుమిత్రుల చావు, ధన నష్టము మఱియు మోసపోవుట.

SUMMARY : Six preceptors can teach you all lessons of life. They are : disease, poverty, humiliation, demise of close friends and relations, monetary loss and fraud.

**వాఁణిద** ॥ నీ నేర్చు లా-వాయరము నీ నుడితోడఁ బోల్పకుము ;
కాఁబల్క నెఱిఁగి పరిపరి కాంచకు నీ విన్నరాది ;
అలవైనముఁ గాఁదేల్పకు కలనాళుల కనురోకన్ ;
కతింపకుము కొల్వలులన్ గాంచువులన్ వేలుపులన్. 68

**మాటల విడఁదీత (పద విభాగము) :** నీ, నేర్చు, లా–వాయరమున్, నీ, నుడితోడన్ + పోల్పకుము, కాఁబల్కన్ + ఎఱిఁగి, పరిపరి, కాంచకు, నీ, విన్నరాదిన్, అలవైనమున్ + కాఁదేల్పకు, కల–నాళుల, కను–రోకన్, కతింపకుము, కొల్వలులన్ + కాంచువులన్, వేలుపులన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నీ నేర్చు లా–వాయరమున్ నీ నుడితోడన్ పోల్పకుము. కాఁబల్కన్ ఎఱిఁగి నీ విన్నరాదిన్ పరిపరి కాంచకు. అలవైనమున్ కల–నాళుల కను–రోకన్ కాఁదేల్పకు. కొల్వలులన్ కాంచువులన్ వేలుపులన్ కతింపకుము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నీ నేర్చు = నీవు నేర్చుకొనుచున్న ; లా–వాయరమున్ = పరభాషను ; నీ నుడితోడన్ = నీ భాషతో ;

కాఁబల్కన్ + ఎఱిఁగి = జోస్యము చెప్పుట నేర్చుకొని ; పరిపరి = మాటిమాటికి ; కాంచకు = చూచుకొనకుము ; నీ విన్నరాదిన్ = నీ జాతకమును ; అలవైనమున్ = ఇతిహాసమును ; కాఁదేల్పకు = నిర్ణయింపకు ; కల–నాళుల = (ఇప్పుడు) ఉన్న దినముల యొక్క ; కను–రోకన్ = దృక్కోణము నుండి ; కతింపకుము = తర్కింపకుము ; కొల్వులులన్ = మతములను గూర్చి ; కాంచువులన్ = గురువులను గూర్చి ; వేలుపులన్ = దేవీ–దేవతలను గూర్చి.

**లోవాఱిక (తాత్పర్యము) :** నీవొక పరాయి భాషను నేర్చుకొనుచున్నప్పుడు దానిని నీ మాతృభాషతో పోల్చవలదు. నీవు జోస్యము చెప్పుట నేర్చుకొన్నచో మాటిమాటికి నీ జాతకమును నీవే పరీక్షించుకొనవలదు. ఏనాటివో అయిన ఇతిహాసములను గుఱించి ఈనాటి దృక్పథము నుండి తీర్పు తీర్చవలదు. మతములను, గురువులను, దేవీ–దేవతలను కండ్లు మూసికొని అనుసరించుటయే (లేదా మానుటయే) తప్ప వారిని గుఱించి తద్దయు లోఁతుగా తర్కించుట కూడదు.

SUMMARY : Do not compare the language you are learning, with your mother tongue. Do not frequently examine your own horoscope, if you know astrology/ palmistry. Do not judge/ analyze epics from a contemporary standpoint. You worship religions, religious masters, gods and goddesses or you don't, but do not ever reason about them.

**సంపంగి ॥** తిరియకుమా నీ కలవోకగఁ దారసిల్లిన
తీయనౌపొందులు తిరిగి తిరిగి కావలె నని ;
వందముల తీపి వాని ౦ అందరామియందే ;
కూటి విలువ యాఁకటన్, గూరుకుది త్రొక్కటన్ ;
కెళవై పిదప లలాను కావలసిన మెలపున్. 69

**మాటల విడఁదీత (పద విభాగము) :** తిరియకుము + ఆ, నీకున్ + అలవోకగన్ + తారసిల్లిన, తీయని + ఔపొందులు, తిరిగి, తిరిగి, కావలెన్ + అని, వందముల, తీపి, వాని, అందరామియందే, కూటి, విలువ, ఆఁకటన్ + కూరుకుది, త్రొక్కటన్, కెళవు + ఐ, పిదపన్, లలాను, కావలసిన, మెలపున్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** నీకున్ అలవోకగన్ తారసిల్లిన తీయని ఔపొందులు తిరిగి తిరిగి కావలెన్ అని తిరియకుము + ఆ. వందముల తీపి వాని అందరామియందే. కూటి విలువ ఆఁకటన్. కూరుకుది త్రొక్కటన్. కెళవు + ఐ పిదపన్ కావలసిన మెలపున్ లలాను.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తిరియకుము + ఆ = వేఁడకు సుమా ; అలవోకగన్ = యాదృచ్ఛికముగా ; తారసిల్లిన = ఎదురైన ; ఔపొందులు = అనుభవములు ; వందముల తీపి = వస్తువుల తీపి ; వాని అందరామియందే = అవి దొరుకక పోవుటలోనే (కలదు) ; కూటి విలువ = తిండి విలువ ; ఆఁకటన్ = ఆఁకటిలోనే (కలదు) ; కూరుకుది = నిద్ర యొక్క విలువ ; త్రొక్కటన్ = శ్రమలోనే (కలదు) ; కెళవు + ఐ = దూరమై ; పిదపన్ = ఆ తరువాత ; లలాను = ఆస్వాదించుము ; మెలపున్ = సుఖమును.

**లోవాఱిక (తాత్పర్యము) :** వాటంతట అవిగా నీకు తటస్థించిన తీయని అనుభవములు మరల మరల కావలె నని వేఁడకుము (కోరుకొన–కుము). వస్తువుల తీపి వాటిలో స్వతహా లేదు. అవి దొరుకక పోవుటలోనే ఉన్నది. తిండి విలువ ఆఁకటిలోనే గలదు. నిద్ర విలువ శ్రమలోనే కలదు. తీయని అనుభవములకు కొంతకాలము పాటు దూరమై అటుపిమ్మట వాటిని ఆస్వాదించినచో అవి ఎక్కువ తీయగా ఉండును..

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** (౧) వస్తువులు దొరుకనప్పుడే ఎక్కువ తీయగా అనిపించును. (౨) శ్రమపడని వానికి నిద్ర కూడ సుఖము నివ్వదు. (౩) అప్పసము ఆస్వాదించుచో తీయని అనుభవములు కూడ దోగర పుట్టించు నని భావము.

SUMMARY : Do not aspire for the sweet experiences that sponteneously crossed your path. Things do not possess any sweetness in themselves. Sweetness of things actually lies in their

absence. The value of food lies in hunger and that of sleep, in labour. Keep off sweet experie-nces for some time, should you really enjoy them.

**దాసానిక॥** అక్కఱల్ పురికొల్ప సల్పెద రన్ని కెలసముల్ ;
టెక్కు నొందెద రవి సల్పినందుకుఁ దరువాతన్ ;
సొఱిది నెసమార్తు రది యొక కూటాప విలువగాన్ ;
గేలింతురు కుందింతు రది కావింపని వారి ; 70

**మాటల విడఁదీత (పద విభాగము) :** అక్కఱల్, పురికొల్పన్, సల్పెదరు + అన్ని, కెలసముల్, టెక్కున్ + ఒందెదరు + అవి, సల్పిన + అందుకున్ + తరువాతన్, సొఱిదిన్ + ఎసమార్తురు + అది + ఒక, కూటాప, విలువగాన్, గేలింతురు, కుందింతురు + అది, కావింపని వారిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** అక్కఱల్ పురికొల్పన్ అన్ని కెలసముల్ సల్పెదరు. అవి సల్పిన అందుకున్ టెక్కున్ ఒందెదరు. తరువాతన్ సొఱిదిన్ అది ఒక కూటాప విలువగాన్ ఎసమార్తురు. అది కావింపని వారిన్ గేలింతురు. కుందింతురు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అక్కఱల్ = అవసరములు ; పురికొల్పన్ = ప్రేరింపఁగా ; సల్పెదరు = చేసెదరు ; కెలసముల్ = పనులను ; టెక్కున్ + ఒందెదరు = గర్వమును పొందెదరు ; సొఱిదిన్ = క్రమముగా ; ఎసమార్తురు = పరిణమింపఁజేసెదరు ; అది = దానిని ; ఒక కూటాప విలువగాన్ = సామాజిక విలువగా ; గేలింతురు = ఎగతాళి చేసెదరు ; కుందింతురు = బాధపెట్టెదరు ; కావింపని వారిన్ = చేయని వారిని.

**లోవాఱిక (తాత్పర్యము) :** జనము ఏ పని జేసినను ఒక అనివార్యమైన అవసరము కొలఁది చేసెదరు. కాని ఆ తరువాత కొంత కాలమునకు ఆ పని తాము ఎందుకు చేయుచున్నారో మఱచిపోయి అది చేసినందుకు ఊరక గర్వపడసాఁగెదరు. క్రమముగా దానినొక సామాజిక విలువగా మార్చెదరు. ఆ పని చేయని వారిని ఎగతాళి చేయుట, బాధించుట మొదలుపెట్టెదరు.

SUMMARY : Folks do everything oout of some pressing necessity. Later they forget what spurred them into doing it and unnecessarily get proud of the act. They convert it into a social value to be followed by everyone else and harass others by mocking them for the crime of not conforming with it.

**పొన్నిక॥** చంపకుమీ నీ యోముఁ జొచ్చిన వారిన్ ; చంపకుమీ నీకు వేఁగుఁ దెచ్చు వారిన్ ;
చంపకుమీ నీకు మేలు సేసిన వారిన్ ; చంపకుమీ పిల్లలన్ ౧ చూలికందులన్. 71

**మాటల విడఁదీత (పద విభాగము) :** చంపకుము + ఈ, నీ + ఓమున్ + చొచ్చిన–వారిన్, చంపకుము + ఈ, నీకున్, వేఁగున్ + తెచ్చు – వారిన్, చంపకుము + ఈ, నీకున్, మేలు + చేసిన, వారిన్, చంపకుము + ఈ, పిల్లలన్, చూలి–కందులన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నీ ఓమున్ చొచ్చిన వారిన్ చంపకుము + ఈ. నీకున్ వేఁగున్ తెచ్చు వారిన్ చంపకుము + ఈ. నీకున్ మేలు చేసిన వారిన్ చంపకుము + ఈ. పిల్లలన్ చూలి–కందులన్ చంపకుము + ఈ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నీ + ఓమున్ + చొచ్చిన వారిన్ = నీకు శరణుఁ జొచ్చినవారిని ; వేఁగున్ = సందేశమును ; చూలి–కందులన్ = గర్భస్థ శిశువులను.

**లోవాఱిక (తాత్పర్యము) :** 16 తెఱఁగుల వారిని ఎట్టి పరిస్థితులలోను చంపవలదు. వారు ఎవఱనఁగా – (1) కాఁపాడుమనుచు నీ శరణుఁజొచ్చిన వారు (2) నీకు వార్తలనో, దౌత్యసందేశమునో మోసుక వచ్చు వార్తాహరులు మఱియు దూతలు (3) నీకు చిన్నదో పెద్దదో

ఒక మేలు చేసినవారు (4) యౌవనమునకు రాని పిల్లలు (5) తల్లికడుపులో ఉన్న పిల్లలు. *(మిగితాది – తరువాతి అల్లుతో పొందిక).*

SUMMARY : Abstain from killing 16 types of people. They are : (1) Those who took shelter in you for protection (2) Those who carried some information or a diplomatic message to you (3) Those who did you a big or small favour. (4) The children who did not yet attain puberty (5) The kids in the womb….

*(To be read in conjunction with the next verse).*

**దాసానిక ॥** చంపకుమీ పెద్దలన్ బేదలన్ బైదలులన్ ; చంపకుమీ నీకుఁ గీడు సల్పకున్న వారిన్ ;
చంపకుమీ మేనచుట్టంబులన్ విరుందులన్ ; చంపకుమీ కొనఁటులన్ నోవరులన్ వగ్గులన్ ;
చంపకుమీ బడుగులన్ గైదువూనని వారిన్. 72

**మాటల విడఁదీత (పద విభాగము) :** చంపకుము + ఈ పెద్దలన్ + పేఁదలన్ + పైదలులన్, చంపకుము + ఈ, నీకున్ + కీడు + చల్పక + ఉన్న–వారిన్, చంపకుము + ఈ, మేన–చుట్టంబులన్, విరుందులన్, చంపకుము + ఈ, కొనఁటులన్, నోవరులన్, వగ్గులన్, చంపకుము + ఈ, బడుగులన్ + కైదువు + ఊనని–వారిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పెద్దలన్ పేఁదలన్ పైదలులన్ చంపకుము + ఈ. నీకున్ కీడు చల్పక ఉన్న–వారిన్ చంపకుము + ఈ. మేన–చుట్టంబులన్ విరుందులన్ చంపకుము + ఈ. కొనఁటులన్ నోవరులన్ వగ్గులన్ చంపకుము + ఈ. బడుగులన్ కైదువు ఊనని–వారిన్ చంపకుము + ఈ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పైదలులన్ = స్త్రీలను ; కీడు = అపకారమును ; చల్పక + ఉన్న–వారిన్ = చేయని వారిని ; మేన–చుట్టంబులన్ = రక్తసంబంధీకులను ; విరుందులన్ = అతిథులను ; కొనఁటులన్ = వికలాంగులను ; నోవరులన్ = రోగులను ; వగ్గులన్ = ముదుసలివారిని ; బడుగులన్ = బలహీనులను ; కైదువు = ఆయుధమును ; ఊనని–వారిన్ = చేత పట్టని వారిని.

**లోవాఱిక (తాత్పర్యము) :** *(మీఁది అల్లుతో పొందిక).* చంపఁగూడని వారిలో మిగిలిన పదునొకండు తెఱఁగులు ఎవఱనఁగా : (6) తల్లి–దండ్రులు, అన్నలు, అవ్వ–తాతలు, పెదనాయన, చిననాయన, పెద్దమ్మ , పిన్నమ్మ, మామయ్యలు, గురువులు మొదలైన పెద్దలు (7) పేఁద వారు (8) స్త్రీలు (9) నీకెప్పుడు గానీ ఏ అపకారమును గానీ తలపెట్టనివారు (10) నీ రక్త సంబంధీకులు (11) అతిథులు (12) వికలాంగులు (13) రోగులు (14) వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులు (15) బలహీనులు (16) నిరాయుధులు.

SUMMARY : ….The other 11 types of people who should not ever be killed, are : (6) Elders, like your parents, grand parents, elder brothers, uncles, teachers etc. (7) The poor (8) Women (9) Those who never harmed you (10) Your blood-relations (11) Guests (12) The handicapped (13) Patients (14) The aged and the knowledgeable (15) The weak (16) The unarmed.

*(To be read in conjunction with the preceding verse).*

**అవిగింగ ॥** మగువల ౨ అయినిల్కు మగవారలఁ బట్టియే ;
మానుగఁ దాము లేక మగవారలు మగువల
నిలువరింపఁ బూను టది యే జోక నైతి?
నెసరు వెలుఁగ మానిన నెలఱేఁడు వెలుఁగునే? 73

**మాటల విడఁదీత (పద విభాగము) :** మగువల, అయినిల్కి, మగ–వారలన్ + పట్టి + ఏ, మానుగన్ + తాము, లేక, మగ–వారలు, మగువలన్, నిలువరింపన్ + పూనుట + అది + ఏ, జోకన్ + ఐతి, నెసరు, వెలుఁగన్ + మానినన్, నెల–తేఁడు, వెలుఁగున్ + ఏ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అయినిల్కి = పరిస్థితి ; మానుగన్ = బాగుగా / చక్కగా ; తాము లేక = తాము ఉండకుండ ; నిలువరింపన్ + పూనుట = అదుపు చేయఁబూనుట ; ఏ జోకన్ = ఏ విధముగా ; ఐతి = సంభవము / సాధ్యము ; నెసరు = సూర్యుఁడు ; వెలుఁగన్ = వెలుఁగుట ; మానినన్ = మానినచో ; నెల–తేఁడు = చంద్రుఁడు.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఆడువారి పరిస్థితి మగవారిని బట్టియే ఉండును. మగవారు – తాము సరిగా నడచుకొనకుండ ఆడువారిని అదుపు చేయఁదలఁచుకొనుట ఏ విధముగా తార్కికము?

SUMMARY : Women's attitude is a response to that of men. How logical is it on the part of men to try to control women while they themselves are not right?

**గంగేరిక॥** ఎడఁగాఁపమె యెల్ల మార్తములకుఁ , దెఱపికయే యెల్ల త్యాలులకును,<br>
గార్గడితియె ౨ అన్ని కుందులకును, విడఁద్రెంపులు హుళకి వీని వసిలి. 74

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎడఁగాఁపము + ఎ + ఎల్ల, మార్తములకున్ + తెఱపిక + ఏ + ఎల్ల, త్యాలులకును + కార్–గడితి + ఎ, అన్ని, కుందులకును, విడఁద్రెంపులు, హుళకి, వీనిన్, వసిలి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎడఁగాఁపము + ఎ ఎల్ల మార్తములకున్ (విడఁద్రెంపు). తెఱపిక + ఏ ఎల్ల త్యాలులకును (విడఁద్రెంపు). కార్–గడితి + ఎ అన్ని కుందులకును (విడఁద్రెంపు). విడఁద్రెంపులు హుళకి వీనిన్ వసిలి.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎడఁగాఁపము + ఎ = దూరముగా నివసించుటయే ; ఎల్ల మార్తములకున్ = అన్ని శత్రుత్వములకు ; తెఱపిక + ఏ = విశ్రాంతియే ; ఎల్ల త్యాలులకును = అన్ని జబ్బులకును ; కార్–గడితి + ఎ = కాలము కడచుటయే ; అన్ని కుందులకును = అన్ని వేదనలకును ; విడఁద్రెంపులు = పరిష్కారములు ; హుళకి = శూన్యము ; వీనిన్ వసిలి = ఇవి తప్ప.

**లోవాఱిక (తాత్పర్యము) :** దూర దూరముగా ఉన్నచో అన్ని శత్రుత్వములును ఉపశమించును. బాగుగా విశ్రాంతి తీసికొన్నచో అన్ని జబ్బులును కుదురును. కాలము కడవఁగా కడవఁగా అన్ని వేదనలును మాయమగును. సమస్యలకు ఇంత కన్న మెఱుఁగైన పరిష్కారములు లేవు.

SUMMARY : All enmity goes away if the disputing parties start living apart. All diseases get cured if the patient has enough rest. All agonies will disappear with the passage of time. Problems do not have better solutions than these.

**రాల్మిక॥** మేనిఁ బంచుకొనును మెలఁత ; మానుగ నాస్తి మయ్యాత ;<br>
వేడ్కల నేస్తజుట్టములు ; రాఁబడిపాల్ దొరతనములు ;<br>
నెఱింపుల నెలియ తరములు. 75

**మాటల విడఁదీత (పద విభాగము) :** మేనిన్ + పంచుకొనును, మెలఁత, మానుగన్ + ఆస్తిన్, మయ్యాత, వేడ్కలన్, నేస్త + చుట్టములు, రాఁబడి–పాల్, దొరతనములు, నెఱింపులన్, ఎలియ–తరములు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మెలఁత మేనిన్ పంచుకొనును. మయ్యాత మానుగన్ ఆస్తిన్ (పంచుకొనును). నేస్త + చుట్టములు వేడ్కలన్ (పంచుకొందురు). దొరతనములు రాఁబడి–పాల్ (పంచుకొనును). ఎలియ–తరములు నెఱింపులన్(పంచుకొనును).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మేనిన్ = శరీరమును ; మెలఁత = స్త్రీ (భార్య) ; మానుగన్ = చక్కగా ; మయ్యాత = సంతానము ; వేడ్కలన్ = శుభకార్యములను ; నేస్త + చుట్టములు = మిత్ర-బాంధవులు ; రాఁబడి-పాల్ = ఆదాయములో ఒక భాగమును ; దొరతనములు = ప్రభుత్వములు ; నెఱింపులన్ = చింతనలను (ఆలోచనాధారలను) ; ఎలియ-తరములు = భవిష్యపు తరములు.

**లోవాఱిక (తాత్పర్యము) :** భార్య తన భర్తలో అర్ధభాగమును పంచుకొని అర్ధాంగి అగును. సంతానము తండ్రి ఆస్తిని సరి-సమానముగా పంచుకొనును. బంధుమిత్రులు శుభకార్యముల ఆనందమును పంచుకొందురు. ప్రభుత్వములు పౌరుని ఆదాయములో సగము పంచుకొనును. మానవుని చింతనను మట్టుకు తరువాతి తరములే పంచుకొనును.

**వైమాల విడఁబఱ్రు (విశేష వివరణము) :** అనంత కాలగతిలో ఒకనాటి చింతనలు తప్ప మిగితావి అన్నియు మాయమగు నని భావము,

SUMMARY : The wife shares half of her husband's existence and becomes his better half. The offspring shares the father's property evenly. Friends and relations share the joy of celebrations. Governments share a portion of the citizen's income. But man's thoughts are shared only by future generations. *(In course of time, nothing of value remains among man's possessions, except his thoughts and words).*

**అవిగింగ జంట ॥** బల్ వగవకు బ్రదివై వహివానవు గావని ;
పదనైరి విన్నముల కట్టేండ్రు పదపడి ;
బ్రదివినుకను గమికిలింప బల్మి వలెన్ మిక్కిలి ;
లేనిచోఁ బరువుఁదీసి నినుఁ జంపెద రెదిరి. 76
తొలుత గొప్పయె వినుక ; వలదనిపించు వెనుక ;
మన్నింపఁబడదు చిఱుతప్పులకును బేరుక ;
తానుక నీది మైవీడి తరలిపోయినను
కానుక తప్పక నీ గాసికిఁ దా వచ్చున్. 77

**మాటల విడఁదీత (పద విభాగము) :** బల్-వగవకు, బ్రదివి + ఐ, వహివాను + అవు, కావు + అని, పదను + ఐరి, విన్నములకున్ + అట్టేంఢ్రు, పదపడి, బ్రది-వినుకను, కమికిలింపన్, బల్మి, వలెన్, మిక్కిలి, లేనిచోన్, పరువున్ + తీసి, నినున్ + చంపెదరు + ఎదిరి, తొలుతన్, గొప్ప + ఎ, వినుక, వలదు + అనిపించున్, వెనుకన్, మన్నింపన్ + పడదు, చిఱు-తప్పులకును + పేరుక, తానుక, నీది, మై-వీడి, తరలి-పోయినను, కానుక, తప్పక, నీ గాసికిన్ + తాన్, వచ్చున్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** బ్రదివి + ఐ వహివాను + అవు కావు అని బల్ వగవకు. అట్టేంఢ్రు పదపడి విన్నములకున్ పదను ఐరి. బ్రది-వినుకను కమికిలింపన్ మిక్కిలి బల్మి వలెన్. లేనిచోన్ ఎదిరి పరువున్ తీసి నినున్ చంపెదరు. వినుక తొలుతన్ గొప్ప + ఎ. వెనుకన్ వలదు అనిపించున్. చిఱు-తప్పులకును పేరుక మన్నింపన్ పడదు. నీది తానుక మై-వీడి తరలి-పోయినను నీ గాసికిన్ కానుక తాన్ తప్పక వచ్చున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** బల్-వగవకు = మిక్కిలి చింతింపకుము ; బ్రదివి + ఐ = బ్రదికి ఉన్నవాఁడవై ; వహివాను + అవు = కీర్తిమంతుఁడవు ; పదను + ఐరి = పాత్రమైనారు ; విన్నములకున్ = అవమానములకు ; అట్టేంఢ్రు = అటువంటివారు ; పదపడి = తరువాత ; బ్రది-వినుకను = బ్రదికి ఉండఁగా కలిగిన ప్రఖ్యాతిని ; కమికిలింపన్ = పట్టుకొనుటకు ; మిక్కిలి బల్మి వలెన్ = చాల బలము కావలెను ; ఎదిరి = ప్రత్యర్థులు ; తొలుతన్ = మొదట ; వినుక = కీర్తి ; పేరుక = కీర్తి ; నీది తానుక = నీ ఆత్మ ; మై-వీడి = శరీరమును వీడి.

**లోవాఱిక (తాత్పర్యము) :** బ్రదికి ఉండఁగా కీర్తిమంతుఁడవు కాలేదని అతిగా విచారింపకుము. లోఁగడ అట్లు కీర్తిని పొందినవారు చని–పోయిన తరువాత చాల అవమానములకు గుఱియైనారు సుమా ! బ్రదికి ఉండగా కలిగిన కీర్తిని పట్టుకొనుట మఱియు నిలఁబెట్టుకొనుట చాల కష్టము. దానికి చాల బలము కావలెను. లేనిచో నీ ప్రత్యర్థులు నీ పరువు తీసి (నిన్ను మానసికముగా) చంపెదరు. కీర్తి మొదట గొప్ప గానే అనిపించును. కాని కొంతకాలము తరువాత "వలదు" అనిపించును. నీ గొప్పతనమును గూర్చి జనము చెప్పుకొనక పోయినచో పో నిమ్ము. నీ ఆత్మ నీ శరీరమును విడచిన తరువాత నైనను నీవు పడ్డ కష్టమునకు ప్రతిఫలము/ బహుమతి రావలసిన చోటు నుండి తప్పక వచ్చును.

SUMMARY : Do not worry in excess over not becoming famous while you are alive. In the past, those who became famous during their lifetime, were subjected to abject humiliations after they died. It is hard to handle the fame earned during one's lifetime, unless one is bac–ked by lots of power and support, as rivals are on the prowl to murder you psychogically by defaming you by some other or means. Fame feels great in the beginning, but appears un–wanted after sometime. If folks don't talk about you, leave it. You will sure, receive a suitable reward for your labour from where it is due, at least after your soul left its mortal frame.

**అవిగింగ ॥** మారుదీటు లేదు మందురా-నెసర్లకున్ ;
మారుదీటు లేదు మఱిదమున కుప్పునకున్ ;
మారుదీటు లేదు మగువకు మగవానికిన్ ;
మారుదీటు లేదు మన్యము వసిలి మందికి. 78

**మాటల విడఁదీత (పద విభాగము) :** మారుదీటు, లేదు, మందురా–నెసర్లకున్, మారుదీటు, లేదు, మఱిదమునకున్ + ఉప్పునకున్, మారుదీటు, లేదు, మగువకున్, మగవానికిన్, మారుదీటు, లేదు, మన్యమున్, వసిలి, మందికిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మందురా–నెసర్లకున్ మారుదీటు లేదు. మఱిదమునకున్ ఉప్పునకున్ మారుదీటు లేదు. మగువకున్ మగవానికిన్ మారుదీటు లేదు. మన్యమున్ వసిలి మందికిన్ మారుదీటు లేదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మారుదీటు = ప్రత్యామ్నాయము ; మందురా–నెసర్లకున్ = చంద్రసూర్యులకు ; మఱిదమునకున్ = నేతికి ; మన్యమున్ వసిలి = రాజ్యము తప్పు ; మందికిన్ = జనమునకు.

**లోవాఱిక (తాత్పర్యము) :** సూర్యచంద్రులకు, నేతికి, ఉప్పునకు, స్త్రీపురుషులకు, రాజ్యము (ప్రభుత్వము) నకు ప్రత్యామ్నాయములు లేవు.

**వైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** తమ పాత్రలను తాము గాక వేఱెవ్వఱును పోషింపఁజాలరని భావము.

SUMMARY : There are no alternatives to the Sun, the Moon, salt, clarified butter, man, woman and the State (government).

**వాఱిద ॥** ఉన్న సీమ దొరతనమున కొగ్గకుండరాదు తలన్ ;
కొఱలునాటి మందినుడిని గఱవకుండరా దెపుడున్ ;
ఇరుగువొరుగువారి గరుసు లీసడింపక యోర్చుతన్ ;
ఎడాపతనము పనికిరా దెలకంటగపా దగుటన్. 79

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఉన్న, సీమ –దొరతనమునకున్ + ఒగ్గక + ఉండరాదు, తలన్, కొఱలు–నాటి, మంది–నుడిని, గఱవక

+ ఉండరాదు + ఎపుడున్, ఇరుగు + పొరుగు-వారి, గరుసుల్ + ఈసడింపక + ఓర్చుతన్, ఎడాపతనము, పనికిన్-రాదు + ఎలకంటగ పాదు + అగుటన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఉన్న సీమ దొరతనమునకున్ తలన్ ఒగ్గక ఉండరాదు. కొఱలు-నాటి మంది-నుడిని ఎపుడున్ గఱవక ఉండరాదు. ఇరుగు పొరుగు-వారి గరుసుల్ ఈసడింపక ఓర్చుతన్. ఎడాపతనము ఎలకంటగపాదు అగుటన్ పనికిన్-రాదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఉన్న = ప్రస్తుతము కాఁపరమున్న ; సీమ = దేశము యొక్క ; దొరతనమునకున్ = ప్రభుత్వమునకు ; ఒగ్గక = వాల్చక ; కొఱలు-నాటి = నివాస ప్రాంతములోని ; మంది-నుడిని = ప్రజల భాషను ; గఱవక = నేర్చుకొనక ; గరుసుల్ = ఆచారములను ; ఈసడింపక = నిరసింపక ; ఓర్చుతన్ = సహించెదరు గాక ; ఎడాపతనము = ప్రత్యేకత్వము (విడిగా ఉండుట) ; పనికిన్-రాదు = ఉపయోగకరము కాదు ; ఎలకంటగపాదు = సకల ద్వేష్యము (అందఱి చేతను ద్వేషింపఁబడునది) ; అగుటన్ = అగుట చేత.

**లోవాఱిక (తాత్పర్యము) :** కాఁపరమున్న దేశము యొక్క ప్రభుత్వమునకు మఱియు దాని చట్టములకు తలయొగ్గక ఉండరాదు. తాను నివాసమున్న ప్రాంతమునందలి జనభాషను నేర్చుకొనక ఉండరాదు. చుట్టుప్రక్కల వారి ఆచార వ్యవహారములను ఈసడించుకొనక వాటిని ఓర్చుకొనునది. ఈ విధముగా "మేము తక్కినవారి కన్న వేఱు" అన్న భావనను దూరముగా పెట్టవలెను. అట్టి భావన అందఱి ద్వేషమునకు పాత్రమయ్యేని సుమా !

SUMMARY : One should be loyal to the government and laws of the country where one lives. One should learn the people's language of the region which one made one's home. One should be tolerant to the customs of the people in one's neighbourhood without expressing dissent. Like this, one should keep off all feelings of separateness, for such feelings attract hate from every quarter.

**తెల్మిరిక ॥** కాసులు గలవాని జలుబును, గ్రక్కదలపు పరి-యుబు సగున్ ;
అవి లేనివాని కాకిచా- , వైనఁ జేయ దే చప్పుడున్. 80

**మాటల విడఁదీత (పద విభాగము) :** కాసులు, కల-వాని, జలుబు + ఉను, గ్రక్కదలపుం, పరి-ఉబుసు + అగున్, అవి, లేని-వాని, కాకి-చావు + ఐనన్ + చేయదు + ఏ, చప్పుడు + ఉన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....అవి లేని-వాని కాకి-చావు ఐనన్ ఏ చప్పుడు + ఉన్ చేయదు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కాసులు = డబ్బులు ; గ్రక్కదలపుం = సంచలనాత్మకమైన ; పరి-ఉబుసు = బహిరంగ వార్త ; అవి = ఆ డబ్బులు ; లేని-వాని = లేనివాని యొక్క ; కాకి-చావు = అపమృత్యువు.

**లోవాఱిక (తాత్పర్యము) :** ధనికుని జలుబు కూడ లోకములో సంచలనాత్మక వార్త అగును. కాని దరిద్రుని దుర్మరణము సైతము ఏ చప్పుడును చేయక జరిగిపోవును.

SUMMARY : Even the common cold that a rich man suffers from, becomes a sensational gossip in the world. However, even the unnatural and untimely death of a pauper passes off without making a faint noise.

**అవిగింగ ॥** ఒకనాటి ౨ ఆయిపరిటి తరునాటి తెరలిటి ;
ఒకప్పటి యిరవాటి మరునాటి యొలవాటి ;

ఇదివరకటి వేదారీనాటి కెలదారి ;

అసిగాంచకు మేదియుం ; అంచింపలే మెలియు. 81

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒక-నాటి, ఆయిపరిటి, తరునాటి, తెరలిటి, ఒక + అప్పటి, ఇరవాటి, మరునాటి + ఒలవాటి, ఇదివరకటి, వేదారి + ఈ-నాటికిన్ + ఎలదారి, అసిగాంచకుము + ఏది + ఉన్, అంచింపన్ లేము + ఎలి + ఉన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ...అసిగాంచకుము + ఏది + ఉన్ అంచింపన్ లేము + ఎలి + ఉన్. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఆయిపరిటి = ఆవాసీయము (communal) ; తరునాటి = తరువాతి కాలపు ; తెరలిటి = జాతీయము ; ఇరవాటి = స్థానికము ; ఒలవాటి = అంతర్జాతీయము ; వేదారి = వ్యక్తిగతము ; ఎలదారి = అందఱి మార్గము ; అసిగాంచకుము = తక్కువగా చూడ కుము ; అంచింపన్ లేము = ఊహింపఁజాలము ; ఎలి + ఉన్ = ఱేపటిని.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒకనాడు ఒకానొక మారుమూల ఆవాసమున (commune) కే పరిమితమైన లక్షణము ఆ తరువాతి కాలములో జాతీయ లక్షణమై పోవును. ఒకప్పుడు స్థానికమో, ప్రాంతీయమో అయిన విషయము ఆ తరువాతి కాలములో అంతర్జాతీయమైపోవును. ఇదివరకు వడారము ఒక వ్యక్తిగత అభిరుచిగానే ఉన్నట్టిది, ఇప్పుడు అందఱను త్రొక్కునట్టి దారి కావచ్చును. కనుక దేనిని గానీ, ఎవఱిని గానీ తక్కువగా చూడవలదు. దేని/ ఎవఱి భవిష్యత్తు ఎట్లుండునో మనము ఊహింపఁజాలము.

**పైమాల విడఁబఱు (విశేష వివరణము) :** ఆయిపరి = Commune/ community.

SUMMARY : A feature that once got confined to just a commune will spread nation-wide later. A matter which is limited to just a locality or region may go global afterwards. What used to be someone's personal taste may be everyone's favourite path now. Therefore, do not look down on anything or anyone. We cannot hazard a guess as to what future will be like.

**అవిగింగ ॥** విలువ, క్రేణికే ప్రెమ్మాట వింగడములన్ ;

గుఱుతింపు రోఁబ్రెక్కువకే గుజాఱిగములన్ ;

పోతరమునకే నెఱోల దొరతనములలోన్ ;

నోలెఱుకకే పెద్దపీట గ్రబుల నడుమన్ ;

పేఱిమించు వా రెవఱు రెంచను రెంచగాన్? 82

**మాటల విడఁదీత (పద విభాగము) :** విలువ, క్రేణికిన్ + ఏ, ప్రెమ్మాట-వింగడములన్, గుఱుతింపు, రో + ప్రెక్కువకున్ + ఏ, గుజాఱిగములన్, పోతరమునకున్ + ఏ, నెఱోల, దొరతనములలోన్, నోల్ + ఎఱుకకున్ + ఏ, పెద్ద, పీట, గ్రబుల, నడుమన్, పేఱిమించు-వారు + ఎవఱు, రెంచను, రెంచగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ప్రెమ్మాట-వింగడములన్ క్రేణికిన్ + ఏ విలువ. గుజాఱిగములన్ రో -ప్రెక్కువకున్ + ఏ గుఱుతింపు. దొరతనములలోన్ పోతరమునకున్ + ఏ నెఱోల. గ్రబుల నడుమన్ నోల్ -ఎఱుకకున్ + ఏ పెద్ద పీట. రెంచను రెంచగాన్ పేఱిమించు-వారు ఎవఱు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** క్రేణికిన్ + ఏ = పదవికే ; ప్రెమ్మాట-వింగడములన్ = రాజకీయ వర్గములలో ; రో + ప్రెక్కువకున్ + ఏ = ధన బాహుళ్యమునకే ; గుజాఱిగములన్ = ధనిక వర్గములలో ; పోతరమునకున్ + ఏ = బలమునకే ; నెఱోల = అభిషేకము (పట్టాభి షేకము) ; దొరతనములలోన్ = ప్రభుత్వములలో ; నోల్ + ఎఱుకకున్ + ఏ = పుస్తక జ్ఞానమునకే ; గ్రబుల నడుమన్ = పండితుల మధ్య ; పేఱిమించు-వారు = గౌరవించువారు ; రెంచను = మనిషిని ; రెంచగాన్ = మనిషిగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** రాజకీయ వర్గములలో పదవికే విలువ. ధనిక వర్గములలో ధన బాహుళ్యమునకే గుర్తింపు. ప్రభుత్వములలో బల-మునకే పట్టాభిషేకము. పండితుల మధ్య పుస్తక జ్ఞానమునకే పెద్దపీట. తమ తమ అభిమాన విషయములనే తప్ప వీరెవ్వఱును మనిషిని మనిషిగా గుర్తింపరు, గౌరవింపరు.

SUMMARY : Only an office holds value in political circuits. Only affluence receives recogni-tion in the aristocracy. Only strength is accorded a red carpet welcome by governments. Only bookish knowledge is placed on a high pedestal by scholars. None of these people recognises or respects a human as a human.

**వాఱిద ||** తప్పును దప్పని తెఱపగఁ దెలుపఁగఁజాలనప్పు డా,
తప్పున కీవ గావవగు ముప్పు వొంచియుండు ఱేపు ;
అలరకుము నేడుంటి నని హాయిగ మిన్నకుండుటన్ ;
**కారు కసిని దీర్చికొనున్ ; జరిమి సైదిఁ దీసికొనున్ ;**
ఐకలి పాటి నొనర్చున్ ; లెక్కలు సరిసేయఁబడున్. 83

**మాటల విడఁదీత (పద విభాగము) :** తప్పును + తప్పు + అని, తెఱపగన్ + తెలుపఁగన్ + చాలని + అప్పుడు + ఆ, తప్పునకున్ + ఈవు + అ, గావు + అవు + అగు, ముప్పు + పొంచి + ఉండున్, ఱేపు, అలరకుము, నేడు + ఉంటిన్ + అని, హాయిగన్, మిన్నక + ఉండుటన్, కారు, కసిని + తీర్చికొనున్, జరిమి + చైదిన్ + తీసికొనున్, ఐకలి, పాటిన్ + ఒనర్చున్, లెక్కలు, సరి + చేయన్ + పడున్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** తప్పును తప్పు అని తెఱపగన్ తెలుపఁగన్ చాలని అప్పుడు ఱేపు ఆ తప్పునకున్ ఈవు + అ గావు + అవు అగు ముప్పు పొంచి ఉండున్. మిన్నక ఉండుటన్ నేడు హాయిగన్ ఉంటిన్ + అని అలరకుము. కారు కసిని తీర్చికొనున్. జరిమి చైదిన్ తీసికొనున్. ఐకలి పాటిన్ ఒనర్చున్. లెక్కలు సరి చేయన్ పడున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తెఱపగన్ = బహిరంగముగా / పైకి ; తెలుపఁగన్ + చాలని + అప్పుడు = తెలియఁజేయనప్పుడు ; ఈవు + అ = నీవే ; గావు + అవు + అగు = బలిపశువవు అగునట్టి ; మిన్నక + ఉండుటన్ = మౌనముగా ఉండుట చేత ; అలరకుము = సంతో షింపకుము ; కారు = కాలము ; జరిమి = చరిత్ర ; చైదిన్ తీసికొనున్ = చర్య తీసికొనును ; ఐకలి = ప్రకృతి ; పాటిన్ = న్యాయమును ; ఒనర్చున్ = చేయును.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక తప్పు జరుగుచున్నప్పుడు "అది తప్పు" అని తెలిసి కూడ నీవు దానిని వ్యతిరేకించుచు బహిరంగముగా ఎలు-గెత్తనిచో ఱేపేదో ఒకనాడు అదే తప్పునకు నీవు (లేదా నీవారు) కూడ బలి కావలసి ఉండును. "ఇప్పుడు నేను నోరు మూసికొని ఉండుట వలన సుఖముగా ఉన్నా"నని సంతోషింపవలదు. **కాలము కసి తీర్చికొనును. చరిత్ర చర్య తీసికొనును.** ప్రకృతి తనదైన న్యాయమును అమలు జరుపును. మంచివారల యొక్కయు, చెడ్డవారల యొక్కయు పాపపుణ్యముల లెక్కలు సరిచేయఁబడును.

SUMMARY : If you fail to openly raise your voice against a wrong that takes place well under your nose, you (or your people) will have to fall victim to the same wrong in future. Do not feel happy that you are presently safe by keeping quiet now. **Time will take revenge. History will take action.** Nature will implement Her own version of justice. The accounts of good and bad will be settled.

**అవిగింగ ||** బిట్టు నీతోఁ బోరి బిరానఁ దీరు మారి

చెలిమి వలయుఁ దన కనుచుఁ జేసాచు వానిన్
నమ్మకుము కలనైనఁ గొమ్మ నిచ్చెద నన్న ;
పన్నుగడ కావచ్చు నిన్ను మంపున ముంప. 84

**మాటల విడఁదీత (పద విభాగము) :** బిట్టు, నీతోన్ + పోరి, బిరానన్ + తీరు, మారి, చెలిమి, వలయున్ + తనకున్ + అనుచున్ + చే + చాచు, వానిన్, నమ్మకుము, కలన్ + ఐనన్ + కొమ్మన్ + ఇచ్చెదన్ + అన్నన్, పన్నుగడ, కావచ్చున్, నిన్నున్, మంపునన్, ముంపన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** బిట్టు నీతోన్ పోరి బిరానన్ తీరు మారి "చెలిమి తనకున్ వలయున్" అనుచున్ చే చాచు వానిన్ "కొమ్మన్ ఇచ్చెదన్" అన్నన్ కలన్ ఐనన్ నమ్మకుము. నిన్నున్ మంపునన్ ముంపన్ పన్నుగడ కావచ్చున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** బిట్టు = గాఢముగా ; పోరి = పోరాడి ; బిరానన్ = తొందఱగా ; తీరు మారి = వైఖరి మార్చుకొని ; చెలిమి = స్నేహము ; వలయున్ = కావలెను ; కలన్ + ఐనన్ = కలలో నైనను ; కొమ్మన్ = అమ్మాయిని ; పన్నుగడ = పన్నాగము ; మంపునన్ = మత్తులో ; ముంపన్ = ముంచుటకు.

**లోవాఱిక (తాత్పర్యము) :** నీతో చాల కాలము పాటు పోరాడి అటుపిమ్మట హఠాత్తుగా, "నాకు నీతో మైత్రి కావలె" నను వానిని ఎట్టి పరి-స్థితులలోను నమ్మవలదు సుమా ! వాఁడు "పిల్లనిచ్చి పెండ్లి చేసెద" నన్నను నమ్మవలదు. వాఁడు చెప్పు మాటలు - నిన్ను మత్తులో ముంచు టకును, ఆపైన దెబ్బ కొట్టుటకును పన్నిన ఒక క్రొత్త పన్నాగము కావచ్చును.

SUMMARY : Do not ever trust the one who bitterly fought you for a long time, but who suddenly makes an offer of friendship, even if he proposes to give his daughter/ sister in marriage to you. His offers may be a novel conspiracy hatched to deal a blow to you while you are off the guard.

**అసి-అవిగింగ ॥** బలిమి గట్టిది కొఱవాన్, కలను కలిగిననే,
నిలుప న్నొక తెరలిక సీమ-సపాటన్ ;
కలన నోడిన పదపడియు నవబల్మి సీమ,
నిలుపఁగఁజాలు నలజందరుల కానువన్. 85

**మాటల విడఁదీత (పద విభాగము) :** బలిమి, గట్టిది కొఱవాన్, కలను, కలిగినన్ + ఏ, నిలుపన్ + ఒక, తెరలిక, సీమ-సపాటన్, కలనన్ + ఓడిన, పదపడి + ఉన్, నవ-బల్మి, సీమన్, నిలుపఁగన్ + చాలున్ + అలజందరుల, కానువన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కలను కలిగినన్ + ఏ ఒక తెరలిక సీమ-సపాటన్ నిలుపన్ గట్టిది బలిమి కొఱవాన్. కలనన్ ఓడిన పదపడి + ఉన్ నవ-బల్మి అలజందరుల కానువన్ సీమన్ నిలుపఁగన్ + చాలున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** బలిమి గట్టిది = గట్టి బలిమి ; కొఱవాన్ — ప్రయోజనకరము ; కలను = యుద్ధము ; కలిగినన్ + ఏ = ఏర్ప డినప్పుడే ; నిలుపన్ = నిలఁబెట్టుటకు ; ఒక తెరలిక = ఒక జనజాతి యొక్క ; సీమ-సపాటన్ = దేశ ప్రతిపత్తిని ; కలనన్ = యుద్ధములో ; ఓడిన పదపడి + ఉన్ = ఓడిపోయిన తరువాత ; నవ-బల్మి = మృదు బలము ; సీమన్ = దేశమును ; నిలుపఁగన్ + చాలు = నిలఁ బెట్టఁగల్గును ; అలజందరుల కానువన్ = సాంస్కృతికుల రూపములో.

**లోవాఱిక (తాత్పర్యము) :** కఠిన సత్తా (hard power) అన్నది ఒక యుద్ధము వచ్చినప్పుడు ఒక జనజాతి యొక్క దేశ హోదాను నిలఁ బెట్టుటకై పనికి వచ్చును. అయితే, యుద్ధములో ఓడిపోయిన తరువాత కూడ సాంస్కృతికుల రూపములో దేశమును దేశముగా నిలఁబెట్టు నది ఆ దేశపు మృదుసత్తా (soft power) యే.

**వైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** (౧) కఠిన సత్తా అనఁగా ధనము, పంటలు, సైన్యము, ఆయుధములు, వాణిజ్యము. (౨) మృదు-సత్తా అనఁగా భాషాసారస్వతములు, కళలు, శాస్త్రములు, మతము, ఆచార వ్యవహారములు.

(౩) సాంస్కృతికులు అనఁగా సాంస్కృతికాంశములే తమ సంప్రదాయముగాను, అభిరుచిగాను, వృత్తిగాను కలవారు. అనఁగా పండి-తులు, కళాకారులు, చేతి పనులవారు, మతగురువులు మున్నగువారు.

SUMMARY : Hard power comes handy only when a war breaks out to defend the sovereignty of a nation. On the other hand, soft power sustains the country in the form of the cultural classes even after it lost a war.

**మోదువిక** ॥ అమ్మనాయనల యెడఁబాటంచనయె గుబులు కొండికకు ;
మేనిని జెలియఁ దొరఁగుటయె యెదలోన ఊలు కోడెకున్ ;
ఆస్తిరామి రో-సేఁగి యెదఁజిచ్చులు నడిప్రాయరికి ;
అసిగర్గలముఁ గడ-కావళములు గ్రుచ్చు ముదికందనన్. 86

**మాటల విడఁదీత (పద విభాగము) :** అమ్మ-నాయనల + ఎడఁబాటు + అంచన + ఎ, గుబులు, కొండికకున్, మేనిని + చెలియన్ + తొరఁగుట + ఎ + ఎదలోనన్, ఊలు, కోడెకున్, ఆస్తి-రామి, రో-సేఁగి + ఎదన్ + చిచ్చులు, నడిప్రాయరికిన్, అసిగర్గలమున్ + కడ-కావళములు, గ్రుచ్చున్, ముది-కందనన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కొండికకున్ అమ్మ-నాయనల + ఎడఁబాటు + అంచన + ఎ గుబులు. మేనిని + చెలియన్ + తొరఁగుట + ఎ కోడెకున్ ఎదలోనన్ ఊలు. నడిప్రాయరికిన్ ఆస్తి-రామి రో-సేఁగి + ఎదన్ + చిచ్చులు. అసిగర్గలమున్ + కడ-కావళములు ముది-కందనన్ గ్రుచ్చున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అంచన + ఎ = ఊహయే ; గుబులు = మనోవ్యథ ; కొండికకున్ = పసివానికి / పసిదానికి ; మేనిని = శరీరమును ; చెలియన్ = ప్రియురాలిని ; తొరఁగుట + ఎ = విడచి పోవుటయే ; ఎదలోనన్ ఊలు = గుండెలో ఊళ్లు పడినట్లు ; కోడెకున్ = యువకునికి ; ఆస్తి-రామి = ఆస్తి రాకపోవుట ; రో-సేఁగి = ధన నష్టము ; ఎదన్ = గుండెలో ; చిచ్చులు = మంటలు ; నడిప్రాయరికిన్ = మధ్య నయస్కునికి ; అసిగర్గలమున్ = తక్కువ పుణ్యము మఱియు ; కడ-కావళములు = గతకాలపు పాపములు కూడ ; గ్రుచ్చున్ = పొడుచును ; ముది-కందనన్ = ముదుసలివాని హృదయమును.

**లోవాఱిక (తాత్పర్యము) :** "అమ్మనాయనలకు దూరము కావలసి వచ్చునేమో" అన్న ఊహయే పసివారికి గుబులు పుట్టించును. చని-పోవలసి వచ్చుట, ప్రియురాలిని వదులుకొనుట — ఇవి పడుచువానికి గుండెలో ఊళ్ళు పడినంత పని చేయును. రావలసిన ఆస్తి రాకపో-వుట, మీఁదుమిక్కిలి ధన నష్టము జరుగుట — ఇవి మధ్యవయస్కుని గుండెలో మంటలు రేఁపును. తన బ్రదిమానమునందు చాల తక్కువ పుణ్యము చేసి ఉండుట, ఓపిక ఉన్న నాళ్లలో చేసిన పాపాల జ్ఞాపకాలు — ఇవి ముదుసలివాని గుండెలో పదేపదే గ్రుచ్చుకొనుచుండును.

SUMMARY : The very thought of getting distanced from its parents would be a source of worry for a child. That of having to die and losing his ladylove would be the rocks thrown in the calm waters of a young man's heart. The facts of the non-accrual of the property due to him and moreover, loss of money cause heartburn in a middle-aged man. The memories of the sins committed in the past and the fact of having less *punyam* prick an old man.

**అవిగింగ** ॥ కలుగదు పెద్దనాటి చెలుములకుఁ గాదిలికిఁ,

బెరిమకు బలిమి పిన్ననాటి వాటి పోలికి ;
మీఁదుమిక్కిలి పైకి వెలిబుచ్చినయప్పుడు ;
"మీరు పెద్ద"లని మొదలుపెట్టిన నమ్మకుఁడు. 87

**మాటల విడఁదీత (పద విభాగము) :** కలుగదు, పెద్ద–నాటి, చెలుములకున్ + కాదిలికిన్ + పెరిమకున్, బలిమి, పిన్న–నాటి, వాటి, పోలికిన్, మీఁదుమిక్కిలి, పైకిన్, వెలి + పుచ్చిన + అప్పుడు, మీరు, పెద్దలు + అని, మొదలు–పెట్టినన్, నమ్మకుఁడు.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** పెద్ద–నాటి చెలుములకున్ + కాదిలికిన్ + పెరిమకున్ పిన్న–నాటి వాటి పోలికిన్ బలిమి కలుగదు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కలుగదు = ఏర్పడదు ; పెద్ద–నాటి = ఎదిగిన నాళ్లలోని ; చెలుములకున్ = స్నేహములకు ; కాదిలికిన్ = ప్రేమకు ; పెరిమకున్ = గౌరవమునకు ; బలిమి = బలము ; పిన్న–నాటి వాటి పోలికిన్ = చిన్ననాటి భావముల వలె ; మీఁదుమిక్కిలి = పైపెచ్చు.

**లోవాఱిక (తాత్పర్యము) :** చిన్నప్పుడే ఏర్పడ్డ స్నేహ–ప్రేమ–గౌరవాలలోని ప్రగాఢత పెరిగి పెద్దయినప్పుడు క్రొత్తగా కలిగిన స్నేహ–ప్రేమ–గౌరవాలలో ఉండదు. పైపెచ్చు ఆ భావములను పైకి వెల్లడి చేసినప్పుడు అవి మఱింత పలుచబడును. వాటికి నమ్మిబాటు (విశ్వసనీ–యత) తగ్గును. మచ్చుకు – ఎవడైనను పైకి, "మీరు పెద్దలు, అది, ఇది" అన్నచో – వారు నిన్ను గౌరవించుచున్నారని నమ్మరాదు.

SUMMARY : The depth of the feelings of friendship, love and respect that formed in the for–mative years, will be missing in those of adulthood, esp. when they are put explicitly. For in–stance, you need not believe the one who outwardly says, *"Sir ! You are an elder, so and so."* Etc.

**రాల్మిక మున్నంగి ||** మొదలుపెట్టఁగలవు పోరి ; నది ముగింపలేవు కోరి ;
ఇసపాయి బిరడాఁ దెఱచి, రంపెలాని వెలికి విడచి 88
పంపలేవు తను మాటికి, ససేమిరా లోపలికిన్ ;
"ఆఁకలాఁక" లనును వాఁడు ; అంచున నీవె తన కూడు. 89
ఎడ్డె గుఱ్ఱంబుల తేరు ౨ , ఎటకో కొంపోవుఁ బోరు ;
ఉబుసుపోక వాటి నురక, చబుకేయకు మసివాఱఁగ. 90

**మాటల విడఁదీత (పద విభాగము) :** మొదలు–పెట్టన్ + కలవు, పోరిన్ + అది, ముగింపన్ + లేవు, కోరి, ఇసపాయి–బిరడాన్ + తెఱచి, రంపెలానిన్, వెలికిన్, విడచి, పంపన్ లేవు, తనున్, మాటికిన్, ససేమిరా, లోపలికిన్, ఆఁకలి + ఆఁకలి + అనును, వాఁడు, అంచునన్, ఈవు + ఏ, తన, కూడు, ఎడ్డె, గుఱ్ఱంబుల, తేరు, ఎటకున్ + ఓ, కొంపోవున్ + పోరు, ఉబుసు–పోక, వాటిన్ + ఉరక, చబుకు + ఏయకుము + అసివాఱఁగన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** పోరిన్ మొదలు–పెట్టన్ కలవు. కోరి అది ముగింపన్ లేవు. ఇసపాయి–బిరడాన్ తెఱచి రంపెలానిన్ వెలికిన్ విడచి తనున్ మాటికిన్ లోపలికిన్ ససేమిరా పంపన్ లేవు. వాఁడు ఆఁకలి ఆఁకలి అనును. అంచునన్ ఈవు + ఏ తన కూడు. పోరు ఎడ్డె గుఱ్ఱంబుల తేరు. ఎటకున్ + ఓ కొంపోవున్. ఉబుసు–పోక అసివాఱఁగన్ వాటిన్ ఉరక చబుకు + ఏయకుము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పోరిన్ = యుద్ధమును ; ఇసపాయి–బిరడాన్ = సీసా యొక్క మూతను ; రంపెలానిన్ = రాక్షసుని ; వెలికిన్ = బయటికి ; తనున్ = తనను (ఆ రాక్షసుని) ; మాటికిన్ = మాటిమాటికి ; అంచునన్ = చివరిలో (చివరికి) ; ఈవు + ఏ = నీవే ; ఎడ్డె గుఱ్ఱంబుల తేరు = పిచ్చి గుఱ్ఱములను పూన్చిన రథము ; ఎటకున్ + ఓ = ఎక్కడకో ; కొంపోవున్ = తీసుకపోవును ; ఉబుసు–పోక =

కాలక్షేపము కాక ; వాటిన్ = ఆ పిచ్చి గుఱ్ఱముల మీఁద ; ఉరక = ఊరకే ; చబుకు + ఏయకుము = చెర్నాకోల ప్రయోగింపకుము ; అసి వాఱఁగన్ = విహరించుట కొఱకు.

**లోవాటిక (తాత్పర్యము) :** నీవు అనుకొని ఒక యుద్ధమును మొదలుపెట్టఁగలవు. కాని అనుకొన్నప్పుడు దానిని ముగింపలేవు. యుద్ధమన్నది సీసాలో పట్టి బంధించిన రాక్షసుని వంటిది. ఒకసారి దాని మూత తీసి వానిని బయటికి వదిలిన తరువాత మరల మాటిమాటికి వానిని సీసాలోనికి ఎట్టి పరిస్థితులలోను (ససేమిరా) పంపలేవు. వాఁడు బయటికి వచ్చిన క్షణము నుండి, "ఆఁకలి, ఆఁకలి" అని గాండ్రించును. ఎవఱును దొరుకనిచో చివరికి నిన్నే పట్టి మెక్కును. యుద్ధమన్నది పిచ్చి గుఱ్ఱములను పూన్చిన రథము వంటిది. దాని నెక్కితివేని అది నీ మాట వినక నిన్ను ఎక్కడకో తీసుకపోయి పడవేయును. ఏమియు తోపక (ఉబుసుపోక) ఊరకే విహరించెద నని చెప్పి ఆ గుఱ్ఱముల మీఁద అనవసరముగా చెర్నాకోల ప్రయోగించి వాటిని రెచ్చఁగొట్టకుము.

SUMMARY : You may start a war at will, but you cannot stop the same at will. War is like a demon locked up in a bottle. Once you lifted the lid and let him out, you will, by no means, be able to send him again inside whenever you want. He thunders for food from the very moment he emerged out and will have yourself for breakfast in the end, if he finds no one around. War is like a chariot drawn by mad horses after boarding which, it fast carries you to an unknown destination and then throw you off. Just because you have no other pastime to enjoy, do not unnecessarily provoke them with an intention to go for a pleasure trip by whipping them hard.

**వెల్మిరిక ||** మొదలుపెట్టిన ముగితి సేయుము ; కూఱిమించినఁ గలసికట్టుము ;
పట్టుఁబట్టిన సడలింపకుము ; నెరిమ యున్న నంకుఁ దిట్టకుము. 91

**మాటల విడఁదీత (పద విభాగము) :** మొదలు–పెట్టినన్, ముగితి + చేయుము, కూఱిమించినన్ + కలసి–కట్టుము, పట్టున్ + పట్టినన్, సడలింపకుము, నెరిమ + ఉన్నన్, అంకున్ + తిట్టకుము.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మొదలు–పెట్టినన్ = ప్రారంభించినచో ; ముగితి + చేయుము = ముగింపు చేయుము (ముగించుము) ; కూఱిమించినన్ = ప్రేమించినచో ; కలసి–కట్టుము = కలసికట్టుగా ఉండుము ; నెరిమ + ఉన్నన్ = భక్తి ఉన్నచో ; అంకున్ = భగవం–తుని.

**లోవాటిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : Bring the work to a finish once you have started it. Be together if you love (your partner). Do not budge an inch if you are determined. Do not blame God if your devotion is for real.

**గోరంటిక ||** జబ్బువడ్డ వారికే ౨ అన్ని మందులు ; చెనటి-బడుగుల కొఱకె ౨ అన్ని చట్టములు ;
చెడ్డవారి మంచితన మవి వెలార్చున్ ; మంచివారిని మటుకుఁ జెడ్డగఁ జూపున్. 92

**మాటల విడఁదీత (పద విభాగము) :** జబ్బు+ పడ్డ, వారికిన్ + ఏ, అన్ని, మందులున్, చెనటి–బడుగుల, కొఱకున్ + ఏ, అన్ని, చట్టములున్, చెడ్డ–వారి, మంచితనమున్ + అవి, వెలార్చున్, మంచి–వారిని, మటుకున్ + చెడ్డగన్ + చూపున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చెనటి–బదుగుల కొఱకున్ + ఏ = దుష్టుల మఱియు దుర్బలుర కోసమే ; వెలార్చున్ = బయట పెట్టును (expose చేయును).

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** చట్టములు చెడ్డవారిని దండించి మార్చుట గుండా వారిలోని మంచితనమును వెలికి దీయును. కాని అసత్యారోపణముల గుండా మంచివారిని చెడ్డగా చూపును. "అవి వడారము అసత్యారోపణములే" నని తేలిన తరువాత సైతము ఆ మచ్చ మంచివారిని విడువదు కదా!

SUMMARY : All medicines are meant for the sick and all laws, for the depraved and the weak. Laws brimg out the best in the depraved, but show good people in a poor light.

*తలీరిక (అవతారిక) : ఈ క్రింద 4 పద్యముల అల్మోదలో ద్వేషము వలని నష్టములను వర్ణించుచున్నాఁడు.*

**చదును పస్సియ అల్మోద ||** కంటు వెలాటి తనింపఱ మెదలము ; ఒరులు తనకుఁ దెల్లము కానితనము ;
దానన్ దండుగ కారున్ గాసులుఁ , బోతరము వలంతికము ససిమియున్. 93

**మాటల విడఁదీత (పద విభాగము) :** కంటు, వెలాటి, తనింపఱ, మెదలము, ఒరులు, తనకున్ + తెల్లము, కానితనము, దానన్, దండుగ, కారు + ఉన్ + కాసులు + ఉన్ + పోతరము + ఉన్, వలంతికము + ఉన్, ససిమి + ఉన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....దానన్ కారున్ + కాసులున్ + పోతరమున్ వలంతికమున్ ససిమి + ఉన్ దండుగ. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కంటు = ద్వేషము ; వెలాటి = ఖరీదైనది ; తనింపఱ = తృప్తిపఱచుటకు వీలుకాని ; మెదలము = భావము ; ఒరులు = వేఱేవారు ; తెల్లము కానితనము = అర్థము కాకపోవుట ; దానన్ = దాని మూలముగా ; దండుగ = వ్యర్థము ; కారున్ = కాలమును ; కాసులున్ = ధనమును ; పోతరమున్ = బలమును ; వలంతికమున్ = ప్రతిభయు ; ససిమి + ఉన్ = ఆరోగ్యమును.

**లోవాఱిక (తాత్పర్యము) :** ద్వేషమొక మిక్కిలి ఖరీదైన మనోభావము. దానిని తగు విధముగా తృప్తిపఱచుకొనుట అసాధ్యము. అది – తనకు ఇతరులు సరిగా అర్థము కాకపోవుట చేత కలుగునట్టిది. దాని మూలముగా మానవుని సమయము, ధనము, శక్తిసామర్థ్యములు, ఆరోగ్య–మును దురుపయోగమగును.

SUMMARY : Hatred is a costly emotion which is impossible to gratify properly. It is generated on account of one's inability to understand others properly and takes a toll of one's time, resources, strength, talent and health.

**(కొనసాఁగింపు) ||** కడిందివడి నీ గడించిన వహియు, గర్గలము లన్ని కాలి పొకాలున్ ;
ఎన్న డనుకొనని వన్నియు నీచేఁ , జేయించి నినున్ డగరగ మార్చున్. 94

**మాటల విడఁదీత (పద విభాగము) :** కడింది + పడి, నీ, గడించిన, వహి + ఉన్, గర్గలముల్ + అన్ని, కాలి, పొకాలున్, ఎన్నడున్ + అనుకొననివి + అన్ని + ఉన్, నీచేన్ + చేయించి, నినున్, డగరగన్, మార్చున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కడింది + పడి = కష్టపడి ; నీ గడించిన = నీవు సంపాదించిన ; వహి + ఉన్ = కీర్తియు ; గర్గలముల్ + అన్ని = పుణ్యములన్నియు ; కాలి = దగ్ధమై ; పొకాలున్ = నాశనమగును ; దగరగన్ = దెయ్యముగా.

**లోవాటిక (తాత్పర్యము) :** ద్వేషము వలన – అంతకు ముందు నీవు కష్టపడి సంపాదించిన పుణ్యఫలములన్నియు దగ్ధమై నాశనమగును. నీవెన్నడును కలలో కూడ చేయఁ దలపెట్టని పాడుపనులన్నింటిని ద్వేషము నీ చేత నిజముగా చేయించి నిన్ను బ్రతికి ఉన్న దయ్యముగా మార్చివేయును.

SUMMARY : Hate burns down and destroys all the *punyams* you earned earlier the hard way. It turns you into a live ghost by inciting you to do all the wicked things which you never wanted to commit..

**(కొనసాఁగింపు)** ॥ మస్తరివయ్యేదు మనిమంతయు నీ, మార్తుఱ కుట్రల చట్రంబునకున్ ;
వీడి చనును నీ విచ్చుకమున్ నీ, వేఁడుకలున్ హాయి-రహారములున్ ; 95

**మాటల విడఁదీత (పద విభాగము) :** మస్తరివి + అయ్యేదు, మనిమి + అంత + ఉన్, నీ, మార్తుఱ, కుట్రల, చట్రంబునకున్, వీడి, చనును, నీ, విచ్చుకము + ఉన్, నీ, వేఁడుకలు + ఉన్, హాయి–రహారములు + ఉన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మనిమి + అంత + ఉన్ నీ మార్తుఱ కుట్రల చట్రంబునకున్ మస్తరివి + అయ్యేదు. నీ విచ్చుకము + ఉన్ నీ వేఁడుకలు + ఉన్ హాయి–రహారములు + ఉన్ వీడి చనును.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మస్తరివి = బందీవి ; అయ్యేదు = అయ్యేదవు ; మనిమి + అంత + ఉన్ = జీవితమంతయు ; మార్తుఱ = శత్రువుల యొక్క ; కుట్రల చట్రంబునకున్ = దుష్ట వ్యూహముల చుట్టుకట్టునకు ; వీడి చనును = వదలి వెడలును ; విచ్చుకము + ఉన్ = స్వాతంత్ర్యము మఱియు ; వేఁడుకలు + ఉన్ = సంబరములు కూడ ; హాయి–రహారములు + ఉన్ = సుఖసంతోషాలు కూడ.

**లోవాటిక (తాత్పర్యము) :** ద్వేషము వలన – నీ శత్రువులు నీకు వ్యతిరేకముగా పన్నునట్టి కుట్రల చట్రములో నీవు శాశ్వత బందీగా మారెదవు. ఆ గొడవలలో పడి – నీ స్వేచ్ఛను, సంబరములను, సుఖసంతోషములను నీవు కోల్పోయెదవు.

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** <u>కుట్రల చట్రము</u> – నీ శత్రువులు నీకు వ్యతిరేకముగా ఒక కుట్ర పన్నెదరు. నీవు దాని నుండి తప్పు–కొని నీ ఎదురు–కుట్ర నీవు పన్నెదవు. ఆతరువాత అది గ్రహించి వారు మఱియొక కుట్ర పన్నెదరు. ఈ విధముగా చర్యా ప్రతిచర్యల పరం–పరలో నీవు ఖైదీ వలె ఇరుక్కపోయెదవు.

SUMMARY : Hate turns you into a lifetime captive in your enemies' framework of endless conspiracies. In the process, you tend to lose all your freedom, festivity, comfort and happi–ness.

**(కొనసాఁగింపు మఱియు ముగింపు)** ॥ ఇందున నొడ్డారింపకు మెవఱిన్ ; ఎప్పటిదప్పుడు మఱువు చెరిదియున్. 96

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఇందునన్ + ఒడ్డారింపకుము + ఎవఱిన్, ఎప్పటిది + అప్పుడు, మఱువు, చెరిది + ఉన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఇందునన్ ఎవఱిన్ ఒడ్డారింపకుము. ఎప్పటిది + అప్పుడు చెరిది + ఉన్ మఱువు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఇందునన్ = ఈ కారణము చేత ; ఒడ్డారింపకుము = ద్వేషింపకుము ; ఎవఱిన్ = ఎవఱిని గానీ ; మఱువు = మఱువుము (మఱచిపొమ్ము) ; చెరిది + ఉన్ = ప్రతిదానిని.

**లోవాటిక (తాత్పర్యము) :** ఈ పైన పేర్కొన్న కారణములను కనురోకలో ఉంచుకొని – ఎవఱిని గానీ ద్వేషింపవలదు. ఎప్పటి గొడవలు

అప్పుడు వెంటనే మఱచిపొమ్ము.

SUMMARY : For the aforementioned reasons – do not hate anyone. Forget each and every dispute as and when it arose.

**పస్సియ** ॥ వెట్టము లనుకొన వెంగలికము సూ, వేఱెంచికల వెలిబుచ్చు వారిన్ ;
అంతపు మీటగమున నొక్కొక్కడు, వింత మెడిదముల వీన్విందు సేయదే? 97

**మాటల విడఁదీత (పద విభాగము) :** వెట్టములు + అనుకొనన్, వెంగలికము, సూ, వేఱు + ఎంచికలన్, వెలి + పుచ్చు–వారిన్, అంతపుం, మీటగమునన్ + ఒక్క + ఒక్కడున్, వింత, మెడిదములన్, వీన్–విందు + చేయదు + ఏ.

**చఱమొలి (అన్వయ క్రమము) :** వేఱు + ఎంచికలన్ వెలి + పుచ్చు–వారిన్ వెట్టములు + అనుకొనన్ వెంగలికము సూ. అంతపుం మీటగమునన్ + ఒక్క + ఒక్కడున్ వింత మెడిదములన్ వీన్–విందు + చేయదు + ఏ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వెట్టములు = శత్రువులు ; అనుకొనన్ = అనుకొనుట ; వెంగలికము సూ = వెఱ్ఱితనము సుమా ; వేఱు + ఎంచికలన్ = భిన్నాభిప్రాయమును ; వెలి + పుచ్చు–వారిన్ = వ్యక్తము చేయువారిని ; అంతపుం = పియానో యొక్క ; మీటగమునన్ = కీబోర్డునందు ; ఒక్క + ఒక్కడున్ = ఒక్కొక్క మీటయు ; వింత మెడిదములన్ = విచిత్రమైన ధ్వనులతో ; వీన్–విందు = చెవులకు విందు.

**లోవాఱిక (తాత్పర్యము) :** భిన్నాభిప్రాయములను వెలిబుచ్చువారిని శత్రువులనుకొనుట వెఱ్ఱితనము సుమా ! పియానో యొక్క మీటపల్కలో పెక్కు చిత్రధ్వనులు నిక్షిప్తమై ఉండును. కాని వాటిలో దేని మాధుర్యము దానిదే కదా !

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** భిన్నాభిప్రాయములు సైతము వేఱువేఱు మీటలవంటివని భావము. ఒకే ఒక్క మీట గల సాధన–మును పియానో అని ఎవఱును పిలువరు. అట్లే ఒకే ఒక్క అభిప్రాయము వినఁబడు సమాజము కూడ నాగరిక సమాజము కాదు.

SUMMARY : It is foolish to deem those with divergent opinions to be one's enemies. Isn't each of the notes in the keyboard of a piano a feast to the ears with its own distinct melody?

*(Divergent opinions are like different notes in the keyborad. An instrument with a single key cannot be called a piano. In the same way, a society in which only one opinion is heard, cannot be considered a civilized one).*

**గోరంటిక జంట** ॥ పరిమారు రెమ్మేన హరువీటులుండు ; కల వమ్మేననె కడుకంపు లిమటలున్ ;
మో మొకటిఁ గనియే పరి మోజుపడెదరు ; లాఁతి వీటులఁ దలఁచుక మూతి ముడువరు ; 98
పరిపరి ప్రానోజ లొక్కొక పరి యొకటఁ , బాడైనను వంటులన్ జూచుత వాట. 99

**మాటల విడఁదీత (పద విభాగము) :** పరిమారు, రెంచ + మేనన్, హరువు + వీటులు + ఉండున్, కలవు + ఆ + మేనన్ + ఎ, కడు–కంపులు + ఇమటలున్, మోము + ఒకటిన్ + కని + ఏ, పరి, మోజు + పడెదరు, లాఁతి, వీటులన్ + తలఁచుకొని, మూతిన్, ముడువరు, పరిపరి, ప్రానోజల్ + ఒక్క + ఒక, పరి + ఒకటన్ + పాడు + ఐనను, వంటులన్ + చూచుతన్, వాటన్.

**చఱమొలి (అన్వయ క్రమము) :** ....కడు–కంపులు + ఇమటలున్ + ఆ + మేనన్ + ఎ కలవు..... వాటన్ వంటులన్ + చూచుతన్. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పరిమారు = చనిపోవునట్టి ; రెంచ + మేనన్ = మానవ శరీరమునందు ; హరువు + వీటులు = అందమైన భాగములు ; కలవు = ఉన్నవి ; ఆ + మేనన్ + ఎ = ఆ శరీరమునందే ; కడు–కంపులు = మిక్కిలి దుర్గంధమయములైనవి ; ఇమటలున్

= అవయవములు కూడ ; మోము + ఒకటిన్ = ఒక్క ముఖమును ; కని + ఏ = చూచియే ; పరి = జనము ; లాఁతి వీటులన్ = వేఱే భాగములను ; మూతిన్ ముదువరు = నిరసింపరు ; పరిపరి ప్రానోజల్ = వివిధ (భిన్న) సంప్రదాయములు ; ఒక్క + ఒక పరి = ఒక్కొక్క సారి ; ఒకటన్ = ఒకచోట (ఒక విషయములో) ; వంటులన్ = సానుకూలాంశములను ; చూచుతన్ = చూచెదరు గాక ; వాటన్ = వాటియందు.

**లోవాటిక (తాత్పర్యము) :** నశ్వరమైన మానవ శరీరమునందు అందమైన భాగములును ఉన్నవి. అదే శరీరమునందు బహు దుర్గంధ భూయిష్ఠములైన అవయవములు సైతమున్నవి. కాని వాటన్నింటిలోకి ముఖమును మాత్రమే చూచి జనము ఇష్టపడెదరు. అంతే తప్ప ఆ ముఖమును చూచుచున్నప్పుడు మిగితా అవయవములను తలఁచుకొని ఱోతపడరు. అట్లే లోకమునందు ఒక్కొక్క సంప్రదాయము ఒక్కొక్క అంశమునందు చెడిపోయి ఉండును. కాని ఆ ఒక్క అంశమును బట్టియే ఆ మొత్తము సంప్రదాయమును నిరసించుట సరికాదు. తక్కిన సానుకూలాంశములను కూడ లెక్కలోనికి తీసికొనవలెను.

SUMMARY : The human's mortal frame contains smelly parts as well as beautiful parts in it. Of them all, folks behold only the face and like the person, but are not repelled by the thought of the rest of the organs. Similarly, different traditions get perverse in different matters. However it is inappropriate to resent them solely on the basis of those particular matters. May people take into account the remaining positive aspects as well.

**పస్నియ** ॥ ఎత్తులమారు లెఱగంటులు తఱచు ౨ , అకానిదులపై నానిదులె పెచ్చు ;
తాటిమ్రానులు తాఁకు సూటిగ మినుు ; వాటి చుట్టు తీఁగె వంపులు గను. 100

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎత్తులమారుల్ + ఎఱగంటులు, తఱచు, అకానిదులపైన్ + ఆనిదుల్ + ఎ, పెచ్చు, తాటిమ్రానులు, తాఁకున్, సూటిగన్, మినున్, వాటి, చుట్టు, తీఁగె–వంపులు, కను.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎత్తులమారుల్ + ఎఱగంటులు తఱచు అకానిదులపైన్ + ఆనిదుల్ + ఎ పెచ్చు ఎత్తులమారుల్ + ఎఱగంటులు. తాటిమ్రానులు మినున్ సూటిగన్ తాఁకున్. వాటి చుట్టు తీఁగె–వంపులు కను.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎత్తులమారుల్ = కుయుక్తిపరులు ; ఎఱగంటులు = మీఁదుగోలు (మీఁద పడునట్టి, దూఁకుడు) మనుష్యులు ; అకానిదుల పైన్ = స్వతంత్రుల కన్న ; ఆనిదుల్ + ఎ = పరాశ్రయులే ; పెచ్చు = ఎక్కువగా ; తాటిమ్రానులు = తాటి చెట్లు ; మినున్ = ఆకాశమును ; కను = చూడుము.

**లోవాటిక (తాత్పర్యము) :** తఱచుగా స్వతంత్రుల కన్నను వారి మీఁద ఆధారపడి బ్రదుకు పరాధీనులే ఎక్కువ కుతంత్రకారులును, దూఁకుడు మనుష్యులును అయి ఉండెదరు. తాటిచెట్టు సూటిగా నిట్రముగా ఆకాశమునకేసి పెరుగును. కాని దానిని చుట్టుకొన్న తీఁగె మట్టుకు ఎన్ని వంపులు తిరిగియుండునో గమనింపుము.

SUMMARY : The dependent ones are often more scheming and aggressive than the independent ones in whose patronage they live. Look howmany curves the creeper coiling around a palm tree has, while the tree grows straight to the sky.

**చేమంతిక జంట** ॥ చెరుగని హత్తు నొత్తు ౨ పరక కడగం డ్లెడఁదన్ ;
చిన్నారమునఁ గాంచరుల మన్నివిడుపుఁ జదువమియుఁ,
గొనఁటితనముఁ ద్యాలును గొఱలిబ్బియుఁ దలవంపులున్,

బేల్పోకయు నాస్తుల కోల్పోకయు రోసేఁగియున్, 101
ఆలు-బిడ్డలు నేస్తచుట్టాలుఁ దన కెడవౌటయు,
వలసయు హావళి నెఱివాసిఁ దప్పిపోయినదియున్. 102

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెరుగని, హత్తున్ + ఒత్తున్ + పరక, కడగండ్లు + ఎడఁదన్, చిన్నారమునన్ + కాంచరుల, మన్ని-విడుపు + ఉన్ + చదువమి + ఉన్ + కొనఁటితనము + ఉన్ + త్యాలు + ఉను + కొఱ-లిబ్బి + ఉన్ + తల-వంపులు + ఉన్, బేల్పోక + ఉన్ + ఆస్తుల కోల్పోక + ఉన్, రో-సేఁగి + ఉన్, ఆలు-బిడ్డలున్, నేస్త-చుట్టాలున్ + తనకున్ + ఎడవు + ఔట + ఉన్, వలస + ఉన్, హావళి. నెఱి-వాసిన్ + తప్పి-పోయినది + ఉన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చిన్నారమునన్ కాంచరుల మన్ని-విడుపు + ఉన్ చదువమి + ఉన్ కొనఁటితనము+ ఉన్ త్యాలు + ఉను కొఱ-లిబ్బి + ఉన్ తల-వంపులు + ఉన్ బేల్పోక + ఉన్ ఆస్తుల కోల్పోక + ఉన్ రో-సేఁగి + ఉన్ ఆలు-బిడ్డలున్ నేస్త-చుట్టాలున్ తనకున్ ఎడవు ఔట + ఉన్ వలస + ఉన్ హావళి నెఱి-వాసిన్ తప్పి-పోయినది + ఉన్ — (ఈ) పరక కడగండ్లు ఎడఁదన్ చెరుగని హత్తున్ ఒత్తున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** హత్తున్ + ఒత్తున్ = ముద్ర వేయును ; పరక కడగండ్లు = దజను కష్టాలు ; ఎడఁదన్ = గుండె మీఁద ; చిన్నారమునన్ = బాల్యమునందు ; కాంచరుల = తల్లిదండ్రుల ; మన్ని-విడుపున్ = మరణము మఱియు ; చదువమి + ఉన్ = అవిద్య కూడ ; కొనఁటితనమున్ = అంగవైకల్యము కూడ ; త్యాలు + ఉను = జబ్బు కూడ ; కొఱ-లిబ్బి + ఉన్ = పేదఱికము కూడ ; తల-వంపులు + ఉన్ = అవమానములు కూడ ; బేల్పోక + ఉన్ = మోసపోవుట కూడ ; ఆస్తుల కోల్పోక + ఉన్ = ఆస్తులను పోఁగొట్టుకొనుట కూడ ; రో-సేఁగి + ఉన్ = ధన నష్టము కూడ ; ఎడవు + ఔట + ఉన్ = దూరమగుట కూడ ; హావళి = ఆపద ; నెఱి-వాసిన్ = వెంట్రుక వాసిలో.

**లోవాఱిక (తాత్పర్యము) :** 12 కష్టములు మానవుని హృదయముపై చెరుగని ముద్ర వేయును. (అనఁగా వీటి ప్రభావము నుండి బయటఁ బడుట మిక్కిలి కష్టమని భావము). అవి — 1. చిన్నప్పుడే తల్లిదండ్రులు చనిపోవుట 2. చదువు లేకపోవుట 3. అంగవైకల్యము 4. రోగము 5. పేదఱికము 6. అవమానములు 7. మోసపోవుట 8. ఆస్తులను పోఁగొట్టుకొనుట 9. డబ్బును పోఁగొట్టుకొనుట 10. ఏ కారణము చేత నైనను తన ఆలుబిడ్డలలోఁ గానీ బంధుమిత్రులలోఁ గానీ ఒకఱిద్దఱు దూరమగుట 11. ఉన్న ఊరు/ దేశము విడచి వలస-పోవలసి వచ్చుట 12. వడారము వెంట్రుకవాసిలో తప్పిపోయిన ఒక పెనుప్రమాదము.

**పైమాల విడఁబర్రు (విశేష వివరణము) :** (౧) పరక అనఁగా పాతిక (25) లో సగము. అనఁగా 12½. కాని ఈ కాలములో కొందఱు దీనిని 13 గా పూర్ణాంకము చేసియు, 14 గా పెంచియు చెప్పుచున్నారు. ఆ లెక్క మేరకే చిల్లర వ్యాపారములు కూడ చేయుచున్నారు. అది తప్పు.

(౨) ఈ పద్యమునందు చెప్పినవి ప్రధానమైన కష్టములు. వీటిలోని ప్రభేదములు పెక్కులుండును. కాని అవి అన్నియు ప్రధానములయందు అంతర్భవించునవే నని పారఁజూడవలసినది. మచ్చునకు — తిట్లు దెబ్బలు తినుట, వేఱేవారి చేత అపార్థము చేసికొనఁబడుట, జననిందకు గుఱియగుట, పరువు పోవుట మఱియు తనకంటె హీనుల క్రింద పని చేయవలసి వచ్చుట, ఇవి అన్నియు అవమానముల క్రిందికే వచ్చును. వీటిని గ్రహింప వలసినదే తప్ప ప్రత్యేకముగా పేర్కొనఁ బనిలేదు.

(౩) రోసేఁగి = ధన నష్టము. ఇట్లే పరుసేఁగి (పరువునష్టము) మొదలైన ఎసకట్టులను గ్రహించునది.

SUMMARY : 12 hardships leave an indelible and lasting impression on the human mind. 1. Loss of one's parents in one's childhood 2. Lack of education 3. A handicap 4. Disease 5. Penury 6. Humiliations 7. Deception 8. Loss of property 9. Loss of money 10. Getting distanced from one's wife & children and friends & relations 11. Having to emigrate 12. A huge calamity from which one managed to escape by a whisker.

**పొన్నిక॥** ఒండనుక చేయ లాయొండై యొనఁగూడుఁ ; జెండాడెద రంత దాని చెయ్వరిని ౨ పరి ;
అదే వాన సేఁగి దక్కు డొక్కొకటికిని ; అంకుఁ దిట్టరు రెంచలు రెంచనే గాని. 103

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒందు + అనుకొని, చేయన్ + లాయి + ఒందు + ఐ + ఒనఁగూడున్ + చెండాడెదర్ + అంతన్, దాని, చెయ్వరిని, పరి, అదే, వాన, సేఁగి, దక్కు డు + ఒక్క + ఒకటికిని, అంకున్ + తిట్టరు, రెంచలు, రెంచన్ + ఏ, కాని.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒందు అనుకొని చేయన్ లాయి + ఒందు ఐ ఒనఁగూడున్. అంతన్ దాని చెయ్వరిని పరి చెండాడెదర్. అదే వాన ఒక్క + ఒకటికిని సేఁగి దక్కు డు. రెంచలు రెంచన్ + ఏ కాని అంకున్ తిట్టరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒందు + అనుకొని = ఒకటి సంకల్పించి ; చేయన్ = చేయఁగా ; లాయి + ఒందు + ఐ = మరియొకటి అయి ; ఒనఁగూడున్ = సిద్ధించును ; చెండాడెదర్ = దారుణముగా విమర్శించెదరు ; అంతన్ = అప్పుడు ; దాని చెయ్వరిని = ఆ పని చేసిన వానిని ; పరి = జనము ; అదే వాన = ఒక్క వానయే ; సేఁగి = నష్టము ; దక్కు డు = లాభము ; ఒక్క + ఒకటికిని = మనుష్యులకు వేర్వేఱుగా ; అంకున్ = దేవుని ; రెంచలు = మనుష్యులు ; రెంచన్ + ఏ కాని = మనిషినే తప్ప.

**లోవాఱిక (తాత్పర్యము) :** కొన్నిసారులు మనిషి ఒకటి అనుకొని చేసినది దురదృష్ట వశమున మఱియొకటిగా పరిణమించవచ్చును. అంత–టితో జనము వాని మీఁదఁ బడి తోలు తీసెదరు (ఘోరముగా విమర్శించెదరు). దేవుఁడు అందఱి మీఁదను సమానముగా కురిపించిన ఒకే వాన కొందఱికి లాభదాయకమును, మఱికొందఱికి నష్టదాయకమును కావచ్చును. అంతమాత్రము చేత జనము దేవుని నిందింపరు గదా! కాని మనిషిని మటుకు నిందించెదరు.

**వైమాల విడఁబఱ్ఱు (విశేష వివరణము) :** వడారము పనుల సాఫల్య వైఫల్యములను బట్టియే తోడి మనుష్యులను తీర్పరింపరాదని భావము. సాఫల్య వైఫల్యములు దైవాధీనము. కార్యసాధకుల మంచి ఉద్దేశములే ప్రధానము. ఎట్లయితే దేవుని విమర్శింపరో అట్లే మంచి ఉద్దేశములు గల మనుష్యులను సైతము విమర్శింప వలదని సందేశము.

SUMMARY : Sometimes the outcome of a work which man did with a noble intention might unfortunately turn out otherwise. Immediately folks rise to roast him alive for his failure. The same rain showered by God leaves profits to some and losses to some others. But do folks blame God the way they roast the human? No, they always blame the human only.

*(It is only the noble intentions of a man, but not his success or failure, that needs to be taken into account before you judge him. Do not hasten to criticize the human for unforeseen events just like you do not criticize God for natural phenomena).*

**పొన్నిక॥** పసిఁడి విలువ దెలిసిన వాఁడే ౨ అగసాలె ; నేల విలువ దెలిసిన వాఁడే ౨ అరకాను ;
కతన విలువ దెలిసిన వాఁడే లెక్కాను ; రెంచ విలువ దెలిసిన వాఁడే పేరెంచ. 104

**మాటల విడఁదీత (పద విభాగము) :** పసిఁడి–విలువ, తెలిసిన–వాఁడు + ఏ, అగసాలె, నేల–విలువ, తెలిసిన–వాఁడు + ఏ, అరకాను, కతన–విలువ, తెలిసిన–వాఁడు + ఏ, లెక్కాను, రెంచ–విలువ, తెలిసిన–వాఁడు + ఏ, పేరెంచ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అగసాలె = కమసాలె ; అరకాను = రైతు ; కతన–విలువ = తర్కపు విలువ ; లెక్కాను = గణితవేత్త ; రెంచ–విలువ = మనిషి విలువ ; పేరెంచ = మహనీయుఁడు.

**లోవాఱిక (తాత్పర్యము) :** బంగారపు విలువ తెలిసినవాఁడే కమసాలె. నేల విలువ తెలిసినవాఁడే రైతు. తర్కించుట ఎంత ముఖ్యమో తెలిసిన వాఁడే గణితవేత్త. అదే విధముగా, మనుష్యుల విలువ తెలిసినవాఁడే మహామనీషి (మహనీయుఁడు).

SUMMARY : A skillful goldsmith is the one who can evaluate gold correctly. A genuine far– mer is the one who can estimate the worth of soil. An intelligent mathematician is the one who understands well the significance of logical reasoning. Similarly, a great soul is the one who knows the value of humans.

**తామరిక ||** కడఁదేల్ముల నిలుమట్టున ౨ కంటగింపకు మెవఱినిన్ ;
ఒరు-మేల్కోరులులే నీ యోజ నవవాటులున్ సూ !
బైజయు నాకళ-లేమియుఁ బాఱికలఁ జేయనోటయు,
నేతు-హేన్-తామట్టుకము లేయు నా మేల్కోరికన్ ;
నీఱు కడఁదేల్మి చేతల నిక్కమేగలి తక్కుడున్. 105

**మాటల విడఁదీత (పద విభాగము) :** కడఁదేల్ముల, నిలుమట్టునన్ + కంటగింపకుము + ఎవఱినిన్, ఒరు–మేల్కోరువులు + ఏ, నీ + ఓజన్, + అవవాటులు + ఉన్, సూ, బైజ + ఉన్ + ఆకళ–లేమి + ఉన్ + పాఱికలన్ + చేయన్ + ఓట + ఉన్ + ఏతు–హేన్–తామట్టుకముల్ + ఏయున్ + ఆ, మేల్కోరికన్, నీఱు, కడఁదేల్మి, చేతలన్, నిక్క–మేగలి, తక్కుదున్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** కడఁదేల్ముల నిలుమట్టునన్ ఎవఱినిన్ కంటగింపకుము. అవవాటులు + ఉన్ నీ ఓజన్ ఒరు–మేల్కోరువులు + ఏ సూ. బైజ + ఉన్ ఆకళ–లేమి + ఉన్ పాఱికలన్ చేయన్ + ఓట + ఉన్ ఏతు–హేన్–తామట్టుకముల్ ఆ మేల్కోరికన్ ఏయున్. చేతలన్ నిక్క–మేగలి తక్కుదున్ కడఁదేల్మి నీఱు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కడఁదేల్ముల నిలుమట్టునన్ = సిద్ధాంతముల ప్రాతిపదికన ; కంటగింపకుము = ద్వేషింపకుము ; ఒరు–మేల్కోరువులు + ఏ = పరహితైషులే ; నీ + ఓజన్ = నీ వలెనె ; అవవాటులు + ఉన్ = ప్రతివాదులు కూడ ; సూ = సుమా ; బైజ + ఉన్ = అజ్ఞానము మఱియు ; ఆకళ–లేమి + ఉన్ = అవగాహనలోపము కూడ ; పాఱికలన్ = ఆలోచనలను ; చేయన్ + ఓట + ఉన్ = ఆచరింపలేక పోవుట కూడ ; ఏతు–హేన్–తామట్టుకముల్ = గర్వాహంకార స్వార్థములు ; ఏయున్ = దెబ్బగొట్టును ; ఆ మేల్కోరికన్ = ఆ హితాభిలాషను ; నీఱు = బూడిద ; కడఁదేల్మి = సిద్ధాంతము ; చేతలన్ = చర్యలలో ; నిక్క–మేగలి = నిజమైన దీక్ష ; తక్కుదున్ = లోపింపఁగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** సిద్ధాంతముల ప్రాతిపదికన ఎవఱిని గానీ ద్వేషింపవలదు. నీ ప్రతివాదులు కూడ నీ వలె పరహితాభిలాషులే నని మఱువరాదు. (కాని అందుకు వారెంచుకొన్న దారి వేఱు). అజ్ఞానమును, విషయముల పట్ల సమగ్ర అవగాహన లోపించుటయు, తమ ఆలోచనలను తామే ఆచరణలో పెట్టలేక పోవుటయు, గర్వాహంకార స్వార్థములును — ఇవి ఆ పరహితాభిలాషను పోఁగొట్టును. అందు–వలన తాము నమ్మిన సిద్ధాంతము ప్రజలకు అనుకొన్నంత మేలు చేయుటలో అంతిమముగా విఫలమగును. సిద్ధాంతవాదుల చర్యలలో నిజ మైన దీక్ష లోపించిన తరువాత ఇఁక ఆ సిద్ధాంతము కృష్ణార్పణము.

SUMMARY : Do not hate anyone on the basis of an ideology. Make no mistake, your rival argumentators are people's wellwishers too, just like yourself (though they have chosen to tread a different path). Ignorance, lack of a comprehensive understanding of issues, failure to implement positive ideas, pride, ego and selfishness — these traits will untimately kill all the original ideals of doing public good. The ideology is as good as lost for good, once sincerity

went missing in the acts of the ideologues.

**గోరంటిక ॥** ఏమియుఁ దెలియని వాఁడు లేఁ ; డయ్యోజ-
నేమియును జేతఁగాని వాఁడును లేఁడు ;
అవ్వలిఁ దామనుకొన నీ వయ్యెదు వది ;
ఎదిరి ననదగఁ దలవ నీ వయ్యెదు వది. 106

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏమి + ఉన్ + తెలియని–వాఁడు, లేఁడు + ఆ + ఓజన్ + ఏమి + ఉను + చేతన్ + కాని–వాఁడు + ఉను, లేఁడు, అవ్వలిన్ + దామ + అనుకొనన్, నీవు + అయ్యెదువు + అది, ఎదిరిన్ + అనదగన్ + తలవన్, నీవు + అయ్యెదువు + అది.

**చఱమోలి (అన్వయ క్రమము) :** … అది నీవు అయ్యెదువు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఆ + ఓజన్ = ఆ విధముగానే ; అవ్వలిన్ = అవతలివానిని / వారిని ; దామ = అమాయకము ; అనుకొనన్ = అనుకొనఁగా /అనుకొన్నచో ; ఎదిరిన్ = ఎదుటివారిని / ప్రత్యర్థులను / వ్యతిరేకులను ; అనదగన్ = అసమర్థముగా / అసమర్థము అని.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

SUMMARY : There is no one in the world who does not know anything. Similarly, there is no one in the world who cannot do anything. If you think that others are ignorant and naïve, you are going to become just that. In the same way, if you think that others are incapable, you will become just that.

*(Do not ever underestimate others, should you be successful).*

**తమ్మిక ॥** మునువందము లెవటివి వారికిన్ ; ముద్దగు మణియము ప్రెమ్మాటికిన్ ;
పడేలు పేటిమించును బలిమిన్ ; కోవాను పేర్మించు గంగిమిన్ ;
ఎఱుకయే వంచమునున్ గఱపరి ; ఎన్ని కనురోక లుండనీ, కడ-
కందఱు నొక్క కూటమునందే కలసి బ్రదిమానింపక తీఱదు ;
అందఱి నడుమనె కొఱలి తిరియున్ ౨ అన్నిఁటి మాల్కొన్న బోడయున్. 107

**మాటల విడఁదీత (పద విభాగము) :** మునువందముల్ + ఎవటివి, వారికిన్, ముద్దు + అగున్, మణియము, ప్రెమ్మాటికిన్, పడేలు, పేటిమించును, బలిమిన్, కోవాను, పేర్మించున్, గంగిమిన్, ఎఱుక + ఏ, వంచము + అనున్, గఱపరి, ఎన్ని, కను–రోకలు + ఉండనీ, కడకున్ + అందఱున్ + ఒక్క, కూటమునందున్ + ఏ, కలసి, బ్రదిమానింపక, తీఱదు, అందఱి, నడుమన్ + ఎ, కొఱలి, తిరియున్, అన్నిఁటిన్, మాల్కొన్న, బోడ + ఉన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మునువందముల్ + ఎవటివి వారికిన్ ముద్దు + అగున్. మణియము ప్రెమ్మాటికిన్ (ముద్దు + అగున్). పడేలు బలిమిన్ పేటిమించును. కోవాను గంగిమిన్ పేర్మించున్. గఱపరి ఎఱుక + ఏ వంచము + అనున్. ఎన్ని కను–రోకలు + ఉండనీ. కడకున్ + అందఱున్ + ఒక్క కూటమునందున్ + ఏ కలసి బ్రదిమానింపక తీఱదు. అన్నిఁటిన్ మాల్కొన్న బోడ + ఉన్ అందఱి నడుమన్ + ఎ కొఱలి తిరియున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మునువందముల్ = ప్రాథమ్యములు (priorities) ; మణియము = అధికారము ; ప్రెమ్మాటికిన్ = రాజకీయవేత్తకు ; పడేలు = సేనాని ; పేటిమించును = గౌరవించును ; బలిమిన్ = బలమును ; కోవాను = దైవజనుఁడు ; గంగిమిన్ = పవిత్ర

తను ; ఎఱుక + ఏ = జ్ఞానమే ; వంచము = ముఖ్యము ; గఱపరి = అధ్యాపకుఁడు ; కను–రోకలు = దృక్కోణములు ; కడకున్ = చివరికి : కూటమునందున్ + ఏ = సమాజమునందే ; బ్రదిమానింపక తీఱదు = జీవింపక తప్పదు ; అందఱి నడుమన్ + ఎ = అందఱి మధ్యనే ; కొఱలి = నివసించి ; తిరియున్ = భిక్షించును ; మాల్కొన్న = వదులుకొన్న (త్యాగము చేసిన) ; బోడ + ఉన్ = సన్న్యాసి కూడ.

**లోవాఱిక (తాత్పర్యము) :** సమాజములో ఎవఱి ప్రాథమ్యములు వారికి ముద్దు. ఒక రాజకీయవేత్తకు అధికారమే ముద్దు. ఒక సేనానికి బలమే గౌరవనీయమైన విషయము. ఒక దైవజనుని దృష్టిలో పవిత్రతయే మాన్యతమము. ఒక అధ్యాపకుని దృష్టిలో జ్ఞానమే అత్యంత ముఖ్యము. ఈ విధముగా ఎన్ని దృక్కోణములు ఉన్నను, చివరికి అందఱును ఒకే సమాజములో కలసి బ్రదుకక తప్పదు. అన్నిఁటిని త్యాగము చేసిన సన్న్యాసి కూడ జనుల మధ్యనే నివసించుచు భిక్షాటన చేయును కదా.

SUMMARY : To each one in the society, his own prorities feel cute. Political power feels cute to a politician. A general respects strength the most, while a godman does sanctity. A profes- sor accords importance only to knowledge. Like this, let there be any number of viewpoints, folks cannot help coexisting in the same society in the end. Even a monk who renounced everything continues to live among people and beg them for alms, doesn't he?

**దాసానిక జంట ||** ఏడు ప్రాయేళ్ళుఁ దఱిసి యేఁగనేల లాసీమ,
నడిమి తరఁగది బ్రదుకునే నడిపికొను మాటైన?
తలఁగ నక్కఱలేదు తరతరాల తమ సీమ,
వానపాటు వైమాలము కా, ప్రూఁగాణము ల- 108
వ్వారి పంటువలు కా, పారియే లనువీఁడు కా,
నాడు నకలగుండై నెమ్మనమ్ము నెలకొనఁగా. 109

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏడు, ప్రాయేళ్ళన్ + తఱిసి, ఏఁగన్ + ఏల, లా–సీమ, నడిమి–తరఁగది–బ్రదుకున్ + ఏ, నడిపికొను, మాట + ఐనన్, తలఁగన్ + అక్కఱ–లేదు, తరతరాల, తమ, సీమన్, వాన–పాటు, వైమాలము, కాన్, ప్రూఁగాణముల్ + అవ్వారి–పంటువలు, కాన్, పారియేల్ + అనువీఁడు, కాన్, నాడు + ఉన్ + అకలగుండు + ఐ, నెమ్మనమ్ము, నెలకొనఁగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నడిమి–తరఁగది–బ్రదుకున్ + ఏ నడిపికొను మాట + ఐనన్ ఏడు ప్రాయేళ్ళన్ తఱిసి లా–సీమ ఏఁగన్ + ఏల? వాన–పాటు వైమాలము కాన్, ప్రూఁగాణముల్ + అవ్వారి–పంటువలు కాన్, పారియేల్ + అనువీఁడు కాన్, నాడు + ఉన్ + అకలగుండు + ఐ నెమ్మనమ్ము నెలకొనఁగాన్, తరతరాల తమ సీమన్ తలఁగన్ + అక్కఱ–లేదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఏడు ప్రాయేళ్ళన్ = సప్తసముద్రములను కూడ ; తఱిసి = దాఁటి ; ఏఁగన్ + ఏల = పోవుట ఎందుకు ; లా–సీమ = విదేశమునకు ; నడిమి–తరఁగది–బ్రదుకున్ + ఏ = మధ్యతరగతి జీవితమునే ; నడిపికొను మాట + ఐనన్ = కడపు పక్షములో ; తలఁగన్ + అక్కఱ–లేదు = వదలిపో నక్కఱలేదు ; వాన–పాటు = వర్షపాతము ; వైమాలము = విశేషము/ విస్తారము ; కాన్ = కాఁగా ; ప్రూఁగాణముల్ = పంటభూములు (పొలాలు) ; అవ్వారి–పంటువలు = విపరీతముగా ఫలించునట్టివి ; పారియేల్ = భూపతి (రాజు/ ప్రభుత్వము) ; అనువీఁడు = అనుకూలుఁడు ; నాడు + ఉన్ = దేశము కూడ ; అకలగుండు + ఐ = కలగుండు లేనిదై/ క్షోభ రహితమై (సంక్షోభ ములు లేనిదై) ; నెమ్మనమ్ము = శాంతి/ ప్రశాంతి.

**లోవాఱిక (తాత్పర్యము) :** విదేశాలలో సైతము మధ్యతరగతి బ్రదుకునే కడపు పక్షములో అంత శ్రమ దీసికొని సప్తసముద్రాలు దాఁటి పోవుట దేనికి? స్వదేశములో వానలు బాగుగా కురిసి పొలాలు చక్కగా పండుచున్నచో, రాజు (ప్రభుత్వము) ప్రజలకు అనుకూలమైనచో, దేశము ఏ సంక్షోభములును లేక ప్రశాంతముగా ఉన్నచో — తరతరాల జన్మభూమిని వదలిపోనక్కఱలేదు.

SUMMARY : Why take the trouble to cross the seven seas if one were to lead the same middle-class life abroad too? One need not leave one's motherland of generations, if it rains copiously, yields are bountiful, if the king (government) is favourable and the land is peaceful, being free from crises.

**చేమంతిక ॥** తలదాఁచుకొనెడి గూటిఁ దన యాఁకటికైన కూటి,
సాలెపుర్వు వా-జిగుటన్ సమకూర్చికొన్నటులన్,
దన్నేఱిమి గలవారలు తమనుండియె కలమోఁపున్,
సమకూర్చికొందు ; రది సాలని వారు వొకాలెదరు ;
పోఁగొట్టుకొంద్రు ముందటులు ప్రోఁగు సేసినవియున్. 110

**మాటల విడఁదీత (పద విభాగము) :** తల-దాఁచుకొనెడి, గూటిన్ + తన + ఆఁకటికిన్ + ఐన, కూటిన్, సాలె-పుర్వు, వా-జిగుటన్, సమకూర్చికొన్న + అటులన్ + తన్నేఱిమి, కల-వారలు, తమనుండి + ఎ, కలమోఁపున్, సమకూర్చికొందురు + అది + చాలని-వారు + పొకాలెదరు, పోఁగొట్టుకొంద్రు, ముందటులు, ప్రోఁగు + చేసినవి + ఉన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ముందటులు ప్రోఁగు + చేసినవి + ఉన్ పోఁగొట్టుకొంద్రు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వా-జిగుటన్ = నోటి జిగుటితో ; తన్నేఱిమి కల-వారలు = ఆత్మగౌరవము గలవారు ; కలమోఁపున్ = సర్వ స్వమును (సమస్తమును) ; అది + చాలని-వారు = అట్టి ఆత్మగౌరవము తగినంతగా లేనివారు ; పొకాలెదరు = నాశనమయ్యెదరు ; ముందటులు = పూర్వికులు.

**లోవాఱిక (తాత్పర్యము) :** సాలీఁడు తన నోటిలోని జిగుటితోనే గూడల్లుకొని ఆ గూటి గుండానే తిండిని కూడ గడించును. అట్లే ఆత్మగౌర-వము గలవారు కూడ తమ ప్రతిభాపాటవముల గుండానే కావలసిన వాటి నన్నింటిని సమకూర్చుకొందురు. ఆత్మగౌరవము లేనివారు తమ పూర్వీకులు సంపాదించిన ఇచ్చిన వాటిని సైతము పోఁగొట్టుకొని దిక్కులేని వారై నాశనమయ్యెదరు.

SUMMARY : The spider weaves its web with the aid of its own saliva and catches its food trapped in the web. Similarly, the ones with self-respect earn everything out of their own talent and hard work, whereas those without self-respect perish miserably, having lost even the things earned and bequeathed to them by their forefathers.

**రాల్మిక ॥** ఒబ్బిడికము సహమందము ; అలరాట మరపోఁతరము ;
ఆపోవిక అరప్రాహి ; దీమసము పాయిగెల్వము. 111

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒబ్బిడికము, సహము + అందము, అలరాటము + అర-పోఁతరము, ఆపోవిక, అర-ప్రాహి, దీమ సము, పాయి-గెల్వము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒబ్బిడికము = శుభ్రత / పరిశుభ్రత ; సహము = సగము ; అలరాటము = సంతోషము ; అర-పోఁతరము = సగము బలము ; ఆపోవిక = తృప్తి ; అర-ప్రాహి = సగము భాగ్యము ; దీమసము = ఆత్మవిశ్వాసము ; పాయి-గెల్వము = పాక్షికము గా (కొంతవరకు) గెలుపు.

**లోవాతిక (తాత్పర్యము) :** వస్తువుల/ చోటుల/ మనుష్యుల యొక్క అందములో సగము వాటి/ వారి శుభ్రతా-పరిశుభ్రతల వలననే. సంతోషముగా ఉన్నచో సగము బలము వచ్చినట్లే. తృప్తిగా ఉన్నచో సగము సంపద సమకూడినట్లే. ఆత్మవిశ్వాసము ఉన్నచో సగము గెలుపు చేకూడినట్లే.

SUMMARY : Cleanliness accounts for half of the beauty of objects, places and people. Happi–ness gives half of the strength/ fitness. Content is equal to half prosperity. Having confidence is as good as scoring half the victory.

**పస్సియ జంట**॥ పొదుప్రొద్దున గీచిన యీదుగీలు, పోకార్చుఁ బ్రెక్కు మై-నచ్చికములు,
కడువెల్కనయ్యై కలకండ చవిన్ ; కాసంత ప్రొద్దెక్క నది సరవిన్- 112
గల్లగుఁ దెల్లగుఁ బరిదూర్పాదగు ; దరివల్కు లిన్నును జిఱుతంచెను ;
దరికొను నల్క యెగోదరికిఁ బల్క. 113

**మాటల విడఁదీత (పద విభాగము) :** పొద్దు + ప్రొద్దునన్, గీచిన + ఈదు–గీలు, పోకార్చున్ + ప్రెక్కు, మై–నచ్చికములు, కదు–వెల్కన + ఐ, కలకండ–చవిన్, కాసు + అంత, ప్రొద్దు + ఎక్కన్ + అది, సరవిన్ + కల్లు + అగున్ + తెల్ల + అగున్ + పరి–దూర్పాదు + అగున్, దరివల్కుల్ + ఇన్నును + చిఱుత + అంచెను, దరికొనున్ + అల్క + ఎగోదరికిన్ + పల్కన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పొద్దుప్రొద్దునన్ గీచిన ఈదు–గీలు కలకండ–చవిన్ కదు–వెల్కన ఐ ప్రెక్కు మై–నచ్చికములు పోకార్చున్. కాసు అంత ప్రొద్దు ఎక్కన్ అది సరవిన్ కల్లు అగున్. తెల్ల అగున్. పరి–దూర్పాదు అగున్. దరివల్కుల్ చిఱుత అంచెను ఇన్నును. ఎగోదరికిన్ + పల్కన్ అల్క దరికొనున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గీచిన = చెట్టునకు గాటు పెట్టి తీసిన ; ఈదు–గీలు = ఈతచెట్టు రసము ; పోకార్చున్ = పోఁగొట్టును ; ప్రెక్కు = అనేకమైన ; మై–నచ్చికములు = శరీర దోషములను ; కదువెల్కన + ఐ = మిక్కిలి నిర్మలమై ; కలకండ–చవిన్ = పటికబెల్లపు రుచితో ; కాసు + అంత = కొంచెము ; ప్రొద్దు + ఎక్కన్ = వేళ మీఱఁగా ; అది = ఆ రసము ; సరవిన్ = క్రమముగా/ వరుసగా ; కల్లు + అగున్ = మద్యమగును ; తెల్ల + అగున్ = తెలుపులోనికి మారును ; పరిదూర్పాదు + అగున్ = జననిందాస్పదము అగును ; దరి వల్కుల్ = బోధలు ; ఇన్నును = నచ్చును ; చిఱుత + అంచెను = బాల్యావస్థలో ; దరికొనున్ = భగ్గుమనును ; అల్క = కోపము ; ఎగో దరికిన్ = ఎదిగిన వానికి/ ఆమెకు ; పల్కన్ = చెప్పఁగా/ చెప్పినచో/ చెప్పినప్పుడు.

**లోవాతిక (తాత్పర్యము) :** తెల్లవాఱుచుండఁగా చెట్టునకు గాటుపెట్టి తీసిన ఈత–రసము మంచినీటి వలె నిర్మలమై తియతియ్యని పటికబెల్లపు రుచిని కలిగి అనేక శరీర దోషములను పోఁగొట్టు మందువలె పనిచేయును. సూర్యోదయమై కాసంత వేళ దాఁటినచో అదే ఈత–రసము తెల్లబడి చిక్కనై మత్తును గలిగించు మద్యముగా మారి జనుల నిందకు భాజనమగును. అదే విధముగా, ఎవరైనను తమకు బాల్యములో చేసిన బోధలే మనుష్యులకు నచ్చును, హత్తుకపోవును. కాని పెరిగి పెద్దవారైన తరువాత తమకు ఎవరైన ఏమైన చెప్పినచో "నీవు నాకు చెప్పెడివాఁడవా?" అనుచు క్రోధావేశముతో భగ్గుమందురు.

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** (౧) దోషము ఈత–రసములో లేదు. దానిని త్రాఁగిన వేళలో ఉన్నది. అట్లే తప్పు ఉపదేశములో లేదు. దానిని విన్నవారల వయస్సులో ఉన్నది.

(౨) <u>ఎగోదరి</u> = వయోజనుఁడు (adult). <u>ఎగోదరము</u> = వయోజన దశ (adulthood).

SUMMARY : The juice of the wild date tree drawn early in the morning is clear like fresh water, tastes sweet like crystal sugar and cures the body of several anomalies. After some

time passed, the same juice whitens, thickens, turns into an intoxicant and becomes repre-hensible. Similarly, any teaching is liked and treasured only when taught in childhood. Folks are enraged if taught in adulthood.

*(The fault does not lie in the tree juice, but only the time when it is partaken of. Similarly, it lies not with the teaching or the teacher, but only the age at which it is taught).*

**అవిగింగ ||** పసరంబటు నడచుకొనున్ సమయువు మూఁకన్,
లెసపెంపయు నొఁజందియుఁ జదువానైనన్ ;
లగ్గువిన్నరమైన దక్కుడేమి నెలాత,
యెగ్గువిన్నరంబు లేనిటికిన్ లోను గాన్. 114

**మాటల విడఁదీత (పద విభాగము) :** పసరంబు + అటు, నడచుకొనున్, సమయువు, మూఁకన్, లెసపెంప + ఉన్ + ఔజంది + ఉన్ + చదువాన్ + ఐనన్, లగ్గు-విన్నరము + ఐనన్, దక్కుడు + ఏమి, నెలాత + ఎగ్గు-విన్నరంబులు + ఏనిటికిన్, లోను, కాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** సమయువు లెసపెంప + ఉన్ ఔజంది + ఉన్ చదువాన్ ఐనన్ మూఁకన్ పసరంబు + అటు నడచుకొనున్. నెలాత ఎగ్గు-విన్నరంబులు ఏనిటికిన్ లోను కాన్ లగ్గు-విన్నరము ఐనన్ దక్కుడు ఏమి?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పసరంబు + అటు = జంతువు వలె ; నడచుకొనున్ = ప్రవర్తించును ; సమయువు = మానవుఁడు ; మూఁకన్ = సమూహములో (ఉన్నప్పుడు) ; లెసపెంప + ఉన్ = చక్కగా పెంచఁబడినవాఁడును ; ఔజంది + ఉన్ = సత్ సంస్కారియు ; చదువాన్ = విద్యావంతుఁడును ; ఐనన్ = ఐనప్పటికిని ; లగ్గు-విన్నరము = శుభగ్రహము ; దక్కుడు + ఏమి = లాభమేమి ; నెలాత = బుధుఁడు ; ఎగ్గు-విన్నరంబులు = అశుభ గ్రహములు ; ఏనిటికిన్ = ఐదింటికి ; లోను కాన్ = ప్రభావితము కాఁగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనిషి చక్కని పెంపకమును, సంస్కారమును, చదువుసంధ్యలును గలిగియున్నను అల్లరిమూఁకలతో చేరినప్పుడు జంతువు వలె ప్రవర్తించును. జాతకములో నాలుఁగైదు అశుభ గ్రహముల ప్రభావమునకు గుఱియైన బుధగ్రహము స్వతహాగా శుభుఁడును, సౌమ్యుఁడును అయినచో లాభమేమి?

SUMMARY : Man carries himself like an animal while in a mob, though he is a well-bred, cultured and educated one. What is the use if Mercury is a soft and benefic planet by nature, when he is impacted by 5 malefics in a birth-chart?

**గంగేరిక ||** కూర్కునందే యెదుగును గొండిక ; బొంతపుర్వు సీతకోకచిలుక,
అగు రెంచవాన్ పేరెంచవాను ౨ , ఆరయనపుడె తన వాసిఁ దాను. 115

**మాటల విడఁదీత (పద విభాగము) :** కూర్కునందున్ + ఏ + ఎదుగును, కొండిక, బొంతపుర్వు, సీతకోకచిలుక, అగున్, రెంచవాన్, పేరెంచ వాను, ఆరయని + అపుడు + ఎ, తన, వాసిన్ + తాను.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కూర్కునందున్ + ఏ కొండిక ఎదుగును. (కూర్కునందున్ + ఏ) బొంతపుర్వు సీతకోకచిలుక అగున్. తన వాసిన్ తాను ఆరయని అపుడు + ఎ రెంచవాన్ పేరెంచవాను (అగున్).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కూర్కునందున్ + ఏ = నిద్రలోనే ; కొండిక = పసిబిడ్డ ; బొంతపుర్వు = గొంగళిపురుగు ; రెంచవాన్ = మానవుఁడు ; పేరెంచవాను = మహనీయుఁడు ; ఆరయని + అపుడు + ఎ = గమనింపనప్పుడే ; తన వాసిన్ = తన గొప్పతనమును.

**లోవాతిక (తాత్పర్యము) :** పసిబిడ్డ నిద్రలోనే (తనకుఁ దెలియకుండనే) ఎదుగును. వికారమైన గొంగళిపురుగు గూడు గట్టుకొని అందులో నిద్రపోవుచున్న కాలములోనే రంగురంగుల సీతకోకచిలుకగా మారును. అట్లే మానవునికి తన గొప్పతనము తనకు తెలియని దశలోనే ఆతఁడు మహనీయుఁడగును.

SUMMARY: The little kid grows while it is asleep. The ugly caterpillar too becomes a color–ful butterfly while it is asleep. Similarly man becomes a great soul as long as he is not aware of his own greatness.

: సంచమర్తి చెబకము :

**ఇది**

**వాచస్పతి బిరుదుని సంతరిదమైన వల్మిరిగమును నెఱింపటి కావింతయందు**

**రెండవ వీటగు కానస త్రోవలో నైదవ సంచము**

**మొత్తము ముగిసినది.**

**|| మేల్గాతన్ ||**

**మాటల విడఁదీత (పద విభాగము) :** వాచస్పతి–బిరుదుని, సంతరిదము + ఐన, వల్మిరిగము + అను, నెఱింపటి, కావింతయందున్, రెండవ వీటు + అగు, కానస–త్రోవలోన్, ఐదవ, సంచము, మొత్తము, ముగిసినది.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వాచస్పతి–బిరుదుని సంతరిదము + ఐన వల్మిరిగము + అను నెఱింపటి కావింతయందున్ రెండవ వీటు + అగు కానస–త్రోవలోన్ ఐదవ సంచము మొత్తము ముగిసినది.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వాచస్పతి–బిరుదుని = వాచస్పతి అను బిరుదము గల కవి యొక్క ; సంతరిదము + ఐన = ప్రణీతమైన ; నెఱింపటి కావింతయందున్ = చింతనాత్మక కావ్యమునందు ; మూఁడవ వీటు + అగు = మూఁడవ భాగమైన ; కానస–త్రోవలోన్ = లోక మార్గములో ; ఐదవ సంచము = ఐదవ అధ్యాయము ; మేల్గాతన్ (మేల్ + కావుతన్) = శుభమస్తు.

**లోవాతిక (తాత్పర్యము) :** (సుబోధము).

: SUMMARY:

Thus concludes the fifth chapter of the second part named

*Kaanasa Trova* in the work *Valmirigamu* written

By

Vachaspathi.

# వల్మిరిగము

## రెండవ వీటు – కానస త్రోవ

ఆఱవ సంచము

**హంజియము**

**పొన్నిక జంట || తేఁటి యెంగిలియే తేఁట నెఱోల వనరు ;**

**నేల రాలిన రాల్మిక నీ కొల్పుటలరు ;**

**కడనాటి పెరుగోమటి యొడఁబాటు తళిగ ;**

**కతమేమి జాగునకు మమ్ము మన్నింపఁగ?** 1

**పేఱిమి మమ్ము నీ బోరన జేర్చికొనఁగ?**

**ప్రెందాన్ ! ఏమును నీ యామతులమేగా?** 2

**మాటల విడఁదీత (పద విభాగము) :** తేఁటి + ఎంగిలి + ఏ, తేఁట–నెఱోల–వనరు, నేలన్, రాలిన, రాల్మిక, నీ, కొల్పు + అలరు, కడ–నాటి, పెరుగు + ఓమటి + ఒడఁబాటు–తళిగ, కతము + ఏమి, జాగునకున్, మమ్మున్, మన్నింపఁగన్, పేఱిమిన్, మమ్మున్, నీ, బోరనన్ + చేర్చి కొనఁగన్, ప్రెందాన్, ఏము + ఉను, నీ + ఆమతులము + ఏ, కదా.

**చఱమోలి (అన్వయ క్రమము) : :** .... మమ్మున్ మన్నింపఁగన్ జాగునకున్ కతము + ఏమి ....(మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) : :** తేఁటి + ఎంగిలి + ఏ = తేనెటీఁగ యొక్క ఎంగిలియే ; తేఁట = నిర్మలమైన ; నెఱోల–వనరు = అభిషేక ద్రవ్యము ; రాల్మిక = పారిజాతము ; కొల్పు + అలరు = పూజాపుష్పము ; కడనాటి = కడచిపోయిన దినమునకు చెందిన ; పెరుగు + ఓమటి = దధ్యోదనము ; ఒడఁబాటు = సమ్మతమైన ; తళిగ = నైవేద్యము ; కతము = కారణము ; జాగునకున్ = ఆలస్యమునకు ; పేఱిమిన్ = ఆదరముతో ; నీ బోరనన్ = నీ వక్షఃస్థలమున ; ప్రెందాన్ = ఓ పరమాత్మా ; ఏము + ఉను = మేము కూడ ; ఆమతులము = సృష్టియే.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఓ పరమాత్మా ! తేనెటీఁగల ఎంగిలి అయిన తేనె నీకు పరమ పవిత్రమైన అభిషేక ద్రవ్యము కాఁజాలినది. అంద–ఱును త్రొక్కునట్టి నేల మీఁద పడిన పారిజాతములు నీకు పూజాపుష్పములు కాఁగల్గినవి. నిన్నటి పెరుగుతో చేసిన దధ్యోదనమే నీకు మిక్కిలి సమ్మతమైన నైవేద్యమైనది. అటువంటి వస్తువులు నీకు ఆమోదయోగ్యమైనప్పుడు మేమెందుకు కాము? వాటిని నీ దరికి రానిచ్చి మమ్ము మట్టుకు వెలిపెట్టుటకు కారణమేమి? వాటిని వలెనె మమ్ము కూడ నీవెప్పుడు ఆదరముతో హత్తుకొందువు? వాటి వలెనె మేమును నీ సృష్టిలో భాగమే కదా?

SUMMARY : Oh Universal Soul ! The honey which is just a remnant of the nectar tasted by honeybees, is a holy material for your head-bath. The *paarijaatha* flowers fallen on the

ground are thrown on your feet. The curd-rice which is made of yesterday's butter milk is the offering most preferred by you. Having accepted all these defective things, why don't you accept us too? Why delay pardoning our sins? We are a part of your creation too, aren't we?

**తంగేడుక జంట** ॥ ప్రెన్ పల్లెకూటమొలవు ; అయినిల్క లిటఁ గాంచువు ;
వానొడువు లసితెల్పువు, లేసేటిలి ౨ ఔపొందులు ; 3
పరికిఁ జెప్పఁ బరుగేల? పోనిమ్ము తమ త్రోవల. 4

**మాటల విడఁదీత (పద విభాగము) :** ప్రెన్-పల్లెకూటము + ఒలవు, అయినిల్కల్ + ఇటన్ + కాంచువు, వా-నొడువుల్ + అసితెల్పువుల్ + ఎసేటిలి, ఔపొందులు, పరికిన్ + చెప్పన్ + పరుగు + ఏల, పోనిమ్ము, తమ, త్రోవలన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒలవు ప్రెన్-పల్లెకూటము. వా-నొడువుల్ అసితెల్పువుల్. ఇటన్ అయినిల్కల్ కాంచువు. ఔపొందులు ఎసేటిలి. పరికిన్ చెప్పన్ పరుగు ఏల? తమ త్రోవలన్ పోనిమ్ము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ప్రెన్-పల్లెకూటము = పెద్దబడి ; ఒలవు = లోకము ; అయినిల్కల్ = పరిస్థితులు ; ఇటన్ = ఇక్కడ/ ఈ బడిలో ; కాంచువు = గురువు ; వా-నొడువుల్ = నోటి మాటలు ; అసితెల్పువుల్ = అల్ప సమాచారకములు ; ఎసేటిలి = ప్రయోగశాల ; ఔపొందులు = అనుభవములు ; పరికిన్ = జనమునకు ; చెప్పన్ = చెప్పుటకై.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఈ లోకమే ఒక పెద్దబడి. ఇక్కడ నోటి మాటలు (వాటి గుండా బోధించుట) కొంచెమే వెలిబుచ్చఁగల్గును. ఇక్కడ నిజమైన గురువు పరిస్థితులే. అనుభవములే ప్రయోగశాల. అందుచేత "జనమునకు చెప్పి జ్ఞానోదయమును కలిగింపవలె" నన్న తొందఱ ఎందుకు? తమ దారిన తమను పోనిమ్ము. ఆయా పరిస్థితుల మఱియు అనుభవముల గుండా వారంతట వారే తెలిసికొందురు.

SUMMARY : This world is a big school. Here, circumstances are the true teacher, as words are poor communicators. One's own experiences are a laboratory. Therefore, why hasten to enlighten folks by telling them? Leave them alone. They will know everything by their own circumstances and experiences.

**మోదువిక** ॥ ఎం తలఁతి మాటలాడిన నంత పేఱిమి కూటమునన్ ;
ఎంత సైక మారగించిన నంత ససిమియు మేనికిన్ ;
ఎంత దిస్సగ బ్రదికిన నంత హొంత తగ్గ గడింపన్ ;
ఎం తసిపెత్తనించిన నంత మంచి యేలిక జరిమిన్. 5

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎంత + అలఁతి, మాటలు + ఆడినన్ + అంత, పేఱిమి, కూటమునన్, ఎంత, సైకము + ఆరగించినన్, + అంత, ససిమి + ఉన్, మేనికిన్, ఎంత, దిస్సగన్, బ్రదికినన్ + అంత, హొంత, తగ్గన్, గడింపన్, ఎంత + అసి-పెత్తనించినన్ + అంత, మంచి + ఏలిక, జరిమిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కూటమునన్ ఎంత అలఁతి మాటలు ఆడినన్ అంత పేఱిమి. ఎంత సైకము ఆరగించినన్ మేనికిన్ అంత ససిమి ఉన్. ఎంత దిస్సగన్ బ్రదికినన్ గడింపన్ అంత హొంత తగ్గన్. ఎంత అసి-పెత్తనించినన్ జరిమిన్ అంత మంచి ఏలిక.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అలఁతి మాటలు = తక్కువ మాటలు ; పేఱిమి = గౌరవము ; కూటమునన్ = సంఘమునందు ; సైకము = కొంచెము ; ఆరగించినన్ = తిన్నచో ; ససిమి + ఉన్ = ఆరోగ్యము కూడ ; మేనికిన్ = శరీరమునకు ; దిస్సగన్ = నిరాడంబరముగా ; హొంత = శ్రమ ; గడింపన్ = సంపాదించుటకు ; అసి-పెత్తనించినన్ = తక్కువ పెత్తనమును (ఆధిపత్యమును) చూపినచో ; ఏలిక = పరి

పాలకుఁడు/ పరిపాలకురాలు ; జరిమిన్ = చరిత్రలో.

**లోవాఱిక (తాత్పర్యము) :** సంఘమునందు ఎంత తక్కువ మాటలాడినచో అంత గౌరవము. ఎంత తక్కువ తిన్నచో అంత ఆరోగ్యము. ఎంత నిరాడంబరముగా బ్రదికినచో అంతగా సంపాదించు శ్రమ తగ్గును. పరిపాలకుఁడు ఎంత తక్కువ ఆధిపత్యమును నెరపినచో అంత మంచి వాఁడుగా చరిత్రలో నిలచిపోవును.

SUMMARY : The lesser one speaks, the more respect one gains in the society. The lesser one eats, the healthier one gets. The simpler one's lifestyle is, the lesser is the trouble to earn. The lesser a ruler dominates, the more his fame will be in history.

**సంపంగి ॥** ఇప్పటికే వెన్నుద న్నున్న దానికి మంది,
అదనముగా మఱికొంత ౨ అందించెదరు గాని,
మొదలే లేనిదాని నెవఱు వోఁతరించెదరు?
కలిగిన పెండ్లికొడుకునకే కట్నమిచ్చెదరు ;
పేరెంచవానులే ౨ అటు తా రుండనివారు. 6

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఇప్పటికిన్ + ఏ, వెన్నుదన్ను + ఉన్న-దానికిన్, మంది, అదనముగాన్, మఱి-కొంత, అందించెదరు, కాని, మొదలు + ఏ, లేని-దానిన్ + ఎవఱు + పోఁతరించెదరు, కలిగిన, పెండ్లి-కొడుకునకే, కట్నమున్ + ఇచ్చెదరు, పేరెంచవానులు + ఏ, అటు, తారు + ఉండని-వారు.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ....అటు తారు ఉండని-వారు పేరెంచవానులు + ఏ. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వెన్నుదన్ను = ఆధారము/ సమర్థనము ; మంది = జనము ; మొదలు + ఏ = అసలే ; పోఁతరించెదరు = బలోపేతము చేసెదరు ; కలిగిన = సంపద గల ; పేరెంచవానులు + ఏ = మహాత్ములే ; అటు = అట్లు/ ఆ విధముగా ; తారు = తాము.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఇప్పటికే ఎంతయో కొంత ఆధారమును, సమర్థనమును గలదానికి మంది మఱికొంత బలమును చేకూర్చెదరు గాని అసలేమియు లేనిదానిని ఎవఱు బలోపేతము చేసెదరు? ఇప్పటికే ఎంతయో కొంత సంపద గల పెండ్లికొడుకునకు కట్నము రూపము లో ఇంకొంత సంపదను సమకూర్చిపెట్టెదరు తప్ప నిండా చేబోడి అయిన వరునికి పిల్లతోఁ బాటు సంపదను సైతమెవఱు ఇచ్చి బాగుచేసెదరు? అట్లు చేయువారు సామాన్యులు కారు, మహనీయులే సుమీ !

SUMMARY : Folks may render some more help to an already-existent and well-supported entity. Who would dare strengthen something which barely exists? Folks give dowry only to a groom who is already in possession of some wealth of his own. Who will give a penniless one wealth along with the bride? If someone did like that, he is no commoner, but verily a great soul.

**పస్సియ జంట ॥** ఏమి సేయఁజాలు నీకు మన్వహి, నీ మనిమిని బయటఁ బెట్టుట వసిలి?
తిప్పలలో నీ తోయమువారలు, తప్ప నీకుఁ దోడుండ రాదటులు ; 7
ఇద్దఱె తాళికులు నినుఁ గావన్ ౨, ఇద్దరిఁ బ్రెందాన్, ౨ అద్దరి రావాన్. 8

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏమి + చేయన్ + చాలున్ నీకున్, మన్ + వహి, నీ, మనిమిని, బయటన్ + పెట్టుటన్, వసిలి,

తిప్పలలోన్, నీ, తోయము–వారలు, తప్పన్, నీకున్ + తోడు + ఉండరు + ఆదటులు, ఇద్దఱు + ఎ, తాళీకులు, నినున్ + కావన్, ఈ + దరిన్ + ప్రెందాన్, ఆ + దరిన్, రావాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మన్ + వహి నీ మనిమిని బయటన్ పెట్టుటన్ వసిలి నీకున్ ఏమి చేయన్ చాలున్? తిప్పలలోన్ నీ తోయము–వారలు తప్పన్ ఆదటులు నీకున్ తోడు ఉండరు. నినున్ కావన్ ఇద్దఱు + ఎ తాళీకులు. ఈ దరిన్ ప్రెందాన్. ఆ దరిన్ రావాన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మన్ + వహి = సత్కీర్తి ; మనిమిని = జీవితమును ; బయటన్ + పెట్టుటన్ వసిలి = బయట పెట్టుట తప్ప ; తిప్పలలోన్ = కష్టములలో ; నీ తోయము–వారలు తప్పన్ = నీ పరివారములోని వారు తప్ప ; ఆదటులు = అభిమానులు ; తాళీకులు = సమర్థులు ; కావన్ = కాఁపాడుటకు ; ఈ + దరిన్ = ఈ ఒడ్డున (లోపలి ప్రపంచములో) ; ప్రెందాన్ = పరమాత్మ ; ఆ + దరిన్ = ఆ ఒడ్డున (బయటి ప్రపంచములో) ; రావాన్ = రాజపురుషుఁడు.

**లోవాటిక (తాత్పర్యము) :** నీ కీర్తి నీ వ్యక్తిగత జీవితమును బయట వేయుట తప్ప నీకేమి చేయఁగలదు? కష్టములు వచ్చినప్పుడు నీకు తోడుండునది నీ సన్నిహిత పరివారములోని వారే గాని దూరములో ఉన్న అభిమానులు కారు. ఏ కష్టమునుండి అయినను నిన్ను కాఁపాడఁ గలవారు ఇద్దఱే. ఒకఱు – నీ లోపల ఉన్న పరమ పురుషుఁడు (భగవంతుఁడు). రెండవ వారు — బయట ఉన్న రాజపురుషుఁడు (ప్రభు–త్వమునందు పై–పదవిలో ఉన్న మనిషి).

SUMMARY : What can fame do to you, except revealing your personal life? When you face a hardship, it is only the people in your intimate circle, but not the distant fans, who stand by you. For that matter, you have only two to save you from any hardship. One – the Universal Soul (God) inside you. Two – A royal personality outside (a higher–up in the government).

**అవిగింగ ॥** ప్రూ-నీడయు గోడన్ బులికొలఁదై తోఁచెడు,
వెల్గువెలంకి కయ్యది దరివెడలినప్పుడు ;
తా రా-ప్రోదియ యైన తందరుసు కలిదము,
పఱపఁగఁజాలు వెడల్పు మఱియ హత్తరము. 9

**మాటల విడఁదీత (పద విభాగము) :** ప్రూ–నీడ + ఉన్, గోడన్ + పులి–కొలఁది + ఐ, తోఁచెడున్, వెల్గు–వెలంకికిన్ + ఆ + అది, దరి–వెడలిన + అప్పుడు, తాన్, రా–ప్రోదియ + ఐన, తందరుసు, కలిదము, పఱపఁగన్ + చాలున్ + వెడల్పు–మఱియ–హత్తరమున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ప్రూ–నీడ + ఉన్ వెల్గు–వెలంకికిన్ దరి–వెడలిన అప్పుడు ఆ + అది గోడన్ పులి–కొలఁది ఐ తోఁచెడున్. రా–ప్రోదియ ఐన తందరుసు కలిదము తాన్ వెడల్పు–మఱియ–హత్తరమున్ పఱపఁగన్ చాలున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ప్రూ–నీడ + ఉన్ = పురుగు యొక్క నీడ కూడ ; గోడన్ = గోడ మీఁద ; పులి–కొలఁది + ఐ = పులి యొక్క పరిమాణమై ; తోఁచెడున్ = చూపట్టును ; వెల్గు–వెలంకికిన్ = కాంతి ఆకరమునకు ; ఆ + అది = ఆ పురుగు ; దరి–వెడలిన + అప్పుడు = దగ్గరగా వెళ్ళినప్పుడు ; రా–ప్రోదియ = రాజపోషితుఁడు/ పోషితురాలు ; తందరుసు = సామాన్యుఁడు/ సామాన్యురాలు ; కలిదము = కూడ ; పఱపఁగన్ + చాలున్ = ప్రసరింపఁగల్గును ; వెడల్పు–మఱియ–హత్తరమున్ = విస్తారమైన అధికారమును మఱియు ప్రభావ మును.

**లోవాటిక (తాత్పర్యము) :** ఒక చిన్న పురుగు కాంతి–ఆకరము (ఉదా: ఒక దీపము) నకు దగ్గరగా పోయినప్పుడు దాని నీడ అక్కడి గోడపై పులి అంత పరిమాణములో కనిపించును. అట్లే ఒకఁడు పరమ సామాన్యుఁడైనను, ఆతనికి రాజపోషణము (ప్రభుత్వ పోషణము) కలిగిన–చో ఆతఁడు గొప్ప అధికారమును, ప్రభావమును ప్రసరింపఁగల్గును.

SUMMARY : The shadow of a small insect looks as big as that of a tiger on the nearby wall, if it goes near the source of light. Similarly, if one has royal patronage, he can wield exten-sive power and influence over the public, though he was previously just a commoner.

**తామరిక॥** మనోజ గుట్టుల విప్పరాదు మనువాడిన మగువ యొద్దనున్ ;
లెమ్మెలంతల జోలి కూడదు తన్మనుకందటి కడ నైనన్ ;
మొత్తముఁ జెప్పఁజన దెడాటము రో-లెక్కరి బైవాటులకున్ ;
తెఅపగఁ బేఁదలతోఁ గయ్యము వల దెంతటి గుజాఱివైనన్.
తెలిద మెల్ల దరివల్కరాదు బలుకూర్చు నేర్వానునకునున్. 10

**మాటల విడఁదీత (పద విభాగము) :** మనోజ-గుట్టులన్, విప్పన్ రాదు, మనువు + ఆడిన, మగువ ఒద్దన్ + ఉన్, లెంబి + మెలంతల, జోలి, కూడదు, తన్ + మనుకందటి కడన్ + ఐనన్, మొత్తమున్ + చెప్పన్ + చనదు + ఎడాటము, రో-లెక్కరి-బైవాటులకున్, తెఅపగన్ + పేఁదలతోన్ + కయ్యము, వలదు + ఎంతటి, గుజాఱివి + ఐనన్, తెలిదమున్ + ఎల్లన్, దరివల్కన్ రాదు, బలు-కూర్చు, నేర్వానునకున్ + ఉన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** మనువు ఆడిన మగువ ఒద్దన్ + ఉన్ మనోజ-గుట్టులన్ విప్పన్ రాదు. తన్ మనుకందటి కడన్ ఐనన్ లెంబి మెలంతల జోలి కూడదు. రో-లెక్కరి-బైవాటులకున్ మొత్తమున్ ఎడాటము చెప్పన్ చనదు. ఎంతటి గుజాఱివి ఐనన్ పేఁదలతోన్ తెఅపగన్ కయ్యము వలదు. బలు-కూర్చు నేర్వానునకున్ + ఉన్ తెలిదమున్ ఎల్లన్ దరివల్కన్ రాదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మనోజ-గుట్టులన్ = వృత్తిరహస్యములను ; విప్పన్ రాదు = బయట పెట్టరాదు ; మనువు + ఆడిన = పెండ్లాడిన ; మగువ ఒద్దన్ + ఉన్ = స్త్రీ వద్ద కూడ ; లెంబి + మెలంతల = కుటుంబస్త్రీల యొక్క ; జోలి = ప్రసక్తి ; కూడదు = పనికిరాదు ; తన్ + మనుకందటి కడన్ + ఐనన్ = తన ప్రాణస్నేహితుని వద్దనైనను ; చెప్పన్ + చనదు = చెప్పఁదగదు ; ఎడాటము = విషయము ; రో-లెక్కరి-బైవాటులకున్ = ఆదాయ గణకులకు మఱియు న్యాయవాదులకు ; తెఅపగన్ = బహిరంగముగా ; కయ్యము = గొడవ ; గుజాఱివి + ఐనన్ = ధనవంతుఁడవైనను ; తెలిదమున్ + ఎల్లన్ = తెలిసినది మొత్తము ; దరివల్కన్ రాదు = ఉపదేశింపరాదు ; బలు-కూర్చు = మిక్కిలి ఇష్టుఁడైన ; నేర్వానునకున్ + ఉన్ = విద్యార్థికి కూడ.

**లోవాఱిక (తాత్పర్యము) :** కట్టుకొన్న భార్య దగ్గర సైతము నీ వృత్తిరహస్యములను బయట పెట్టరాదు. ప్రాణస్నేహితుని దగ్గర కూడ (ఆతని మఱియు నీ యొక్క) కుటుంబస్త్రీల ప్రస్తావన తెచ్చి మాటలాడరాదు. ఆదాయ గణకుల దగ్గరను, న్యాయవాదుల దగ్గర కూడ నీ యొక్క మొత్తము వ్యవహారమును గూర్చి చెప్పివేయరాదు. నీవెంత కుబేరుఁడవైనను పేఁదలతో బహిరంగముగా గొడవ పడరాదు. ఒకానొక విద్యార్థి నీకెంత ఇష్టుఁడైనను నీకు తెలిసిన విద్య మొత్తము ఆతనికి ఉపదేశింపరాదు.

**పైమాల విడఁబఱు (విశేష వివరణము) :** (౧) అట్లే కుటుంబస్త్రీల వద్ద కూడ తన స్నేహితుల ప్రస్తావన తెచ్చి మాటలాడరాదు.

(౨) <u>పేఁదలతోఁ గయ్యము వలదు :</u> ధనిక-పేఁద తేడాలను తేఁటతెల్లముగా వక్కాణించు పనులను వివేకవంతులు చేయరాదని భావము. అట్లే ధనిక -పేఁదల నడిమి గొడవలలో ధనికులకు ప్రజల నుండి ఎట్టి సమర్థన (public support) గానీ లభింపదని గమనించునది.

SUMMARY : Do not reveal your trade secrets even to your wife. Do not broach up the topic of family-women even in front of you bosom friend. Do not disclose every detail of yours even to your accountant and lawyer. Do not involve in a public row with the poor, no matter how rich you are. Do not impart all of that you knew, to the student, no matter however much you like him.

**దాసానిక** ॥ లో నంద ఱొక్కటియే నెళవులోన వెలుపలన్ ;
మన్నింపకుండుత నందఱ న్నొక్క లాగునన్ ;
ఇంపు సేయుత నెళవరుల కింటివారలకు నీ,
లంప ; నెడాప మన్నింతలఁ గ్రచ్చుకొందురు వా-
రలరింపు వారిఁ ; జేయకు మకపాటి లాతులకు. 11

**మాటల విడఁదీత (పద విభాగము) :** లోన్ + అందఱు + ఒక్కటి + ఏ, నెళవులోనన్, వెలుపలన్, మన్నింపక + ఉండుతన్ + అందఱన్ + ఒక్క, లాగునన్, ఇంపు + చేయుతన్, నెళవరులకున్ + ఇంటి–వారలకున్, నీ, లంపన్ + ఎడాప, మన్నింతలన్, క్రచ్చుకొందురు, వార్ + అలరింపు, వారిన్ + చేయకుము + అకపాటి, లాతులకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నెళవులోనన్ వెలుపలన్ లోన్ అందఱు ఒక్కటి + ఏ. అందఱన్ ఒక్క లాగునన్ మన్నింపక ఉండుతన్. నీ లంపన్ నెళవరులకున్ ఇంటి–వారలకున్ ఇంపు చేయుతన్. వార్ ఎడాప మన్నింతలన్ క్రచ్చుకొందురు. వారిన్ అలరింపు. లాతులకున్ అకపాటి చేయకుము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** లోన్ = లోలోపల (మనస్సులలో) ; నెళవులోనన్ = పరిచయమునందు ; వెలుపలన్ = పరిచయములకు బయట ; మన్నింపక + ఉండుతన్ = చూడకుండ ఉండెదరు గాక ; ఇంపు + చేయుతన్ = సంతోషమును కలిగించెదవు గాక ; నెళవరులకున్ = పరిచయస్థులకు ; ఇంటి–వారలకు = నీ కుటుంబములోని వారికి ' నీ లంపన్ = నీ రాశితో/ సామగ్రితో/ సామానుతో ; ఎడాప = ప్రత్యేకమైన ; మన్నింతలన్ = చూచికోలులను ; క్రచ్చుకొందురు = ఆశించెదరు ; వార్ = ఆ పరిచయస్థులు మఱియు నీ కుటుంబము వారు ; అలరింపు = సంతోషపెట్టుము ; వారిన్ = ఆ పరిచయస్థులను మఱియు నీ కుటుంబమువారిని ; అకపాటి = అన్యాయము ; లాతులకున్ = ఇతరు లకు.

**లోవాఱిక (తాత్పర్యము) :** నీకు పరిచితమైన వలయమునందును దాని బయటను ఉన్న మనుష్యుల తత్త్వములన్నియు లోలోపల ఒక్కటియే. అయినను నీవు అందఱిని ఒకే విధముగా చూచుకొనవలదు. నీ పరిచితులకు మఱియు కుటుంబమువారికి నీ వనరులతో సంతోషమును కలిగించుము. ఎందుకనఁగా వారు తమ స్వంత మనిషిగా నీ నుండి ప్రత్యేకమైన చూచికోలు (treatment) ను ఆశించెదరు. కాని అదే సమయములో బయటివారికి మట్టుకు అన్యాయము చేయవలదు సుమా.

**పైమాల విడఁబఱ్ఱు (విశేష వివరణము) :** <u>మన్నించు</u> = క్షమించు (to pardon), చూచికొను (to care for, to traet).

వీనిలో "చూచికొను" (to care for, to treat) అన్న అర్థములో భావార్థకము (noun) మన్నింత అగును. మన్నింపు అనఁగా క్షమిం–చుట.

SUMMARY : The folks inside and outside of your circuit of acquaintances are all same innately. Yet you should not treat all of them alike. Please your acquaintances and family members specially with your own resources, since they expect special treatment from you as their own man. However, at the same time, make sure that no injustice is done to others.

**అవిగింగ** ॥ అపాసల్పాదు లీవి-నిక్క-మకాఱియలు ;
లాతులకుఁ గుందును సేఁగి గల్గుచోఁ గాదు ;
పంటకమే నేటుకాను మంచిసెబ్రలకు ;
అకార్తి వాన వడువు ౨ అగుఁ దెహతేర పొసవు. 12

**మాటల విడఁదీత (పద విభాగము) :** అపాసల్పాదులు + ఈవి-నిక్కము + అకాజియలు, లాతులకున్ + కుందు + ఉను, సేఁగి, కల్గుచోన్ + కాదు, పంటకము + ఏ, నేటుకాను, మంచి-సెబ్రలకున్, అకార్తి-వాన-వదువు, అగున్ + తెహతేర, పొసవు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఈవి-నిక్కము అకాజియలు అపాసల్పాదులు. లాతులకున్ కుందు + ఉను సేఁగి కల్గుచోన్ కాదు. మంచి-సెబ్రలకున్ పంటకము + ఏ నేటుకాను. తెహతేర పొసవు అకార్తి-వాన-వదువు అగున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అపాసల్పాదులు = నిత్య ఆచరణీయములు ; ఈవి-నిక్కము + అకాజియలు = దానము, సత్యము మఱియు అహింస ; లాతులకున్ = ఇతరులకు ; కుందు + ఉను = బాధయు ; సేఁగి = నష్టమును ; కల్గుచోన్ = కలిగినట్లయినచో ; పంటకము + ఏ = ఫలితమే ; నేటుకాను = నిర్ణాయకము ; మంచి-సెబ్రలకున్ = మంచి-చెడ్డలకు ; అకార్తి-వాన-వదువు = అకాల వర్షపు రీతి ; తెహతేర పొసవు = అసందర్భపు ధర్మము.

**లోవాఱిక (తాత్పర్యము) :** దాన-సత్యాహింసలు ఎల్లప్పుడును ఆచరణీయములే కాని వాటి మూలమున ఇతరులకు బాధయు, నష్టమును కలుగుచున్న పక్షములో అవి ఆచరణీయములు కావు. మంచి-చెడ్డలన్న వాటికి స్వతహాగా అర్థమేమియు లేదు. ఆయా పనుల యొక్క తుది ఫలితమే వాటి మంచిచెడ్డలను నిర్ణయించును. వాన పడుట పంటలకు మంచిదే. కాని అకాల వర్షము నష్టదాయకము కదా ! అటువంటిదే అసందర్భముగా ఆచరించు ధర్మము కూడ.

SUMMARY : The virtues of munificence, truth and non-violence are sure, worth practising at all times, except when they cause loss and misery to others. Things called good and bad have no definition by themselves. They are defined by the ultimate outcome of the deeds done. Rain in general is good for crops. But the same rain during the non-season will prove to be destructive. Same case with the virtues which are practised the wrong way.

**తమ్మిక ||** చెలిమిదనంబు నౌరెంచకమున్ వెలార్చం బనిలేదు మొదలనే ;
పరి యోప దందులకు వేర్మి యౌ పగిది నీ తాన నటుపిమ్మటన్ ;
అప్పస మొక వాల్కమె వీలువడ, దైనిల్క లుండవు నీ కేలన్ ;
చవిఁజూపుము నీ గుంబనన్ రేగుంబనన్ దొట్టతొలుత సుతన్. 13

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెలిమిదనంబు + ఉన్ + ఔరెంచకము + ఉన్, వెలార్చన్ + పని, లేదు, మొదలన్ + ఏ, పరి + ఓపదు + అందులకున్, వేర్మి + ఔ, పగిదిన్, నీ తానన్ + అటు-పిమ్మటన్, అప్పసము + ఒక, వాల్కము + ఎ, వీలు + పడదు + ఐనిల్కలు + ఉండవు, నీ, కేలన్, చవిన్ + చూపుము, నీ, గుంబనన్, రేగుంబనన్ + తొలుత + తొలుత సుతన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** చెలిమిదనంబు + ఉన్ + ఔరెంచకము + ఉన్ మొదలన్ + ఏ వెలార్చన్ + పని లేదు. అటు-పిమ్మటన్ పరి అందులకున్ వేర్మి + ఔ పగిదిన్ నీ తానన్ + ఓపదు. అప్పసము + ఒక వాల్కము + ఎ వీలుపడదు. ఐనిల్కలు నీ కేలన్ ఉండవు. నీ గుంబనన్ రేగుంబనన్ తొలుత + తొలుత సుతన్ చవిన్ + చూపుము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చెలిమిదనంబు + ఉన్ = స్నేహశీలమును మఱియు ; ఔరెంచకము + ఉన్ = సౌజన్యమును కూడ ; వెలార్చన్ + పని లేదు = ప్రదర్శింప నక్కఱలేదు ; మొదలన్ + ఏ = మొదటిలోనే ; పరి = ప్రజ ; ఓపదు = సహింపదు ; అందులకున్ = ఆ స్నేహశీలమునకును, సౌజన్యమునకును ; వేర్మి + ఔ = భిన్నమైన ; పగిదిన్ = విధమును ; నీ తానన్ — నీ దగ్గర ; అటు-పిమ్మటన్ = ఆ తరువాత ; అప్పసము = ఎల్లప్పుడు ; ఒక వాల్కము + ఎ = ఒక వైఖరియే ; వీలుపడదు = సాధ్యము కాదు ; ఐనిల్కలు = పరిస్థితులు ; నీ కేలన్ = నీ చేతిలో ; చవిన్ + చూపుము — రుచి చూపుము ; గుంబనన్ = నీ ఆకార గోపనమును ; రేగుంబనన్ = గాంభీర్యమును ; తొలుత + తొలుత సుతన్ = మొట్టమొదటి నుండియే.

**లోవాఱిక (తాత్పర్యము) :** క్రొత్తవారితో వ్యవహరించునప్పుడు, మొదటిలోనే నీ స్నేహశీలమును, మంచితనమును పూర్తిగా వారికి ప్రదర్శింప నక్కఱలేదు. నీవట్లు చేసినచో – వారు ఆ తరువాత కూడ అన్ని సందర్భములలోను నీ నుండి అట్టి నడవడికనే ఆశించెదరు. అందుకు భిన్న మైన నడతను సహింపలేరు. కాని అన్ని వేళలా ఒకే లాగున ఉండుటకు పరిస్థితులు నీ చేతులలో ఉండవు కదా ! కనుక నీ ఆకార గోపన తత్త్వమును, గాంభీర్యమును ఇతరులకు మొదటి నుండియే అనుభవములోనికి వచ్చునట్లుగా చేయుము.

SUMMARY: While dealing with newcomers, you need not exhibit your amity and kind heart at the very inception. If you did, they keep expecting the same mood from you later on and grow intolerant of any behaviour slightly at variance with their expectation. But circumstances won't be in your hands to keep up the same mood always. Therefore, let the folks be exposed to your reserved and serious moods right from the beginning.

**గోరంటిక ॥** ఆడంగులకు నడుమ ననఁటి విత్తంత, ముదిత-మగల కౌన ముంటెపు గింజంత,
మగవారి లీగున మామిడి టెంకంత, హేను-ఢీ యుంట హెచ్చుఱా నెచ్చెలీ ! 14

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఆడంగులకున్, నడుమన్, అనఁటి, విత్తు + అంత, ముదిత–మగల, కౌనన్, ముంటెపుం గింజ + అంత, మగ–వారి, లీగునన్, మామిడి–టెంక + అంత, హేను–ఢీ, ఉంటన్, హెచ్చుఱా, నెచ్చెలీ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఆడంగులకున్ = ఆడువారికి, ఆడువారికి ; నడుమన్ = మధ్య ; అనఁటి విత్తు + అంత = అరఁటి విత్తన మంత ; ముదిత–మగల కౌనన్ = ఆడువారికి, మగవారికి నడుమ ; ముంటెపుం గింజ + అంత = పనస గింజంత ; మగ–వారి లీగునన్ = మగవారికి, మగవారికి మధ్య ; హేను–ఢీ = అహంకారముల ఘర్షణము ; ఉంటన్ = ఉండుట చేత ; హెచ్చుఱా = జాగ్రత్త ; నెచ్చెలీ = ప్రియ మిత్రమా.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఓ ప్రియ మిత్రమా ! ఆడువారికి, ఆడువారికి మధ్య అహంకార ఘర్షణము అరఁటి గింజంత మాత్రమే ఉండును. ఆడువారికి, మగవారికి మధ్య అది పనసగింజంత ఉండును. మగవారికి, మగవారికి మధ్య అది మామిడి టెంకంత ఉండును. కనుక జాగ్రత్త సుమా !

SUMMARY : The clash of egos between one woman and another would be as little as a banana seed. That between a man and a woman would be the size of a jackfruit seed. That between a man and another man would be as big and as hard as a mango seed. Therefore, beware my friend !

**తెల్మిరిక జంట ॥** ఒరుమేల్కోరువ వైతేని, నొందిలి వల దొరు లెయ్దరని,
మన్దలఁపుల నీ చేఁబల్కు ; నొంటింపు నీది చెప్పుటయె ; 15
వినకున్న వదలివేయుటయె ; కినిసి వారి నేపఁ **బాటియె?** 16

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒరు–మేల్కోరువు + అవు + ఐతి + ఏనిన్ + ఒందిలి, వలదు + ఒరుల్ + ఎయ్దురు + అని, మంచి + తలఁపుల, నీ చేఁబల్కున్, ఒంటింపు, నీది, చెప్పుట + ఎ, వినక + ఉన్నన్, వదలి–వేయుట + ఎ, కినిసి, వారిన్ + ఏపన్ + పాటి + ఎ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒరు–మేల్కోరువవు ఐతేనిన్ మంచి తలఁపుల నీ చేఁబల్కున్ ఒరుల్ ఎయ్దురు అని ఒందిలి వలదు. చెప్పుట + ఎ ఒంటింపు నీది. వినక ఉన్నన్ వదలి–వేయుట + ఎ. కినిసి వారిన్ ఏపన్ పాటి + ఎ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒరు-మేల్కోరువవు + ఐతి + ఏనిన్ = పర హితైషివి ఐనచో ; ఒందిలి = ఖేదము ; ఒరుల్ = ఇతరులు ; ఎయ్దరు = అనుసరింపరు ; మంచి + తలఁపుల = మంచి ఉద్దేశములతో కూడిన ; చేఁబల్కున్ = సలహాను ; ఒంటింపు నీది = నీ కర్త వ్యము ; కినిసి = కోపించి ; ఏపన్ = బాధపెట్టుట ; పాటి + ఎ = న్యాయమా?

**లోవాతిక (తాత్పర్యము) :** నీవు నిక్కముగా ఇతరుల శ్రేయోఽభిలాషివైనచో "నేను మంచి ఉద్దేశములతో వారికిచ్చిన సలహాలను వారు పాటించుట లే"దని బాధపడవలదు. నీ కర్తవ్యము మంచి చెప్పుట వరకే. ఒకవేళ వారు వినకపోయినచో వదలివేయుటయే. అంతే తప్ప వినుటలేదని కోపించి వారిని బాధపెట్టుట కాదు.

SUMMARY : If you are truly a wellwisher of others, do not feel sorry that they do not comply with the well-meaning words of advice that you gave them. Your mandate is only to teach others good things and to leave them alone, in case they did not pay heed. You have no business hurting them, getting angry over their failure to comply.

**అవిగింగ ॥** మంచికి దొరకు టరిది బాసటయు వెన్నుదన్నున్ ;
మతకముగాఁ జెడునకు మటుకన్ని సమకూడు ;
తోఁట నరుకఁ బలువులు తోడువత్తురు గాని,
నాటి ప్రెనుపము సేయ నరుదెంచున దెవఱు? 17

**మాటల విడఁదీత (పద విభాగము) :** మంచికిన్, దొరకుట + అరిది, బాసట + ఉన్, వెన్నుదన్ను + ఉన్, మతకముగాన్ + చెడునకున్ + మటుకున్ + అన్ని, సమకూడున్, తోఁటన్, నరుకన్ + పలువులు, తోడు-వత్తురు, కాని, నాటి, ప్రెనుపము + చేయన్ + అరుదెంచునది + ఎవఱు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మంచికిన్ బాసట + ఉన్ వెన్నుదన్ను + ఉన్ దొరకుట + అరిది. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అరిది = అపరూపము ; బాసట + ఉన్ = సహాయము మఱియు ; వెన్నుదన్ను + ఉన్ = సమర్థనము కూడ ; మతకముగాన్ = మాయగా ; ప్రెనుపము + చేయన్ = దోహదము చ్యుటకై ; అరుదెంచునది + ఎవఱు = వచ్చునది ఎవఱు?

**లోవాతిక (తాత్పర్యము) :** మంచికి సహాయమును, సమర్థనమును దొరకుట అరిది. కాని చిత్రముగా చెడుకు మాత్రము అన్నియు దొరకును. "ఒక తోఁటను నరికివేయుదము" అని ప్రతిపాదించినచో బారాది మంది సిద్ధముగా ప్రోఁగయ్యెదరు. అదే, "ఒక తోఁటను నాటి పెంచు-దము, పదండి" అన్నచో ఎవఱును రారు.

SUMMARY : The good rarely finds help and support, while the evil has everything at hand for the asking. For instance, many readily gather at the call to log a garden, but few turn up when asked to plant one and tend to the same.

**పస్పియ ॥** ముక్కుమోము మెఱుఁగని మూఁకల నడుమ, హెచ్చుఱా రేకపు ముచ్చటలతోన్ ;
మాటలకు మాటలతో మారాడు, నౌఁజంద మరిదీ యానసమునన్. 18

**మాటల విడఁదీత (పద విభాగము) :** ముక్కు-మోము + ఎఱుఁగని, మూఁకల, నడుమన్, హెచ్చుఱా, రేకపుం, ముచ్చటలతోన్, మాటలకున్, మాటలతోన్, మారు + ఆడు, ఔఁజందము + అరిది + ఈ + ఆనసమునన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ముక్కు-మోము ఎఱుఁగని మూఁకల నడుమన్ రేకపుం ముచ్చటలతోన్ హెచ్చుఱా. ఈ ఆనసమునన్ మాట

లకున్ మాటలతోన్ మారు ఆడు ఔఁజందము అరిది.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ముక్కు-మోము + ఎఱుఁగని మూఁకల నడుమన్ = అజ్ఞాత సమూహముల మధ్య ; హెచ్చఱా = జాగ్రత్త ; రేకపుం ముచ్చటలతోన్ = గంభీర అంశములలో ; మారు + ఆడు = సమాధానమును ఇచ్చునట్టి ; ఔఁజందము = సంస్కారము ; అరిది = అపరూపము ; ఈ + ఆనసమునన్ = ఈ లోకమునందు.

**లోవాఱిక (తాత్పర్యము) :** నీవెవఱో వారికిని, వారెవఱో నీకును తెలియని సమూహముల మధ్య గంభీర అంశముల మీఁద చర్చించునప్పుడు జాగ్రత్త సుమా! లోకములో మాటలకు మాటలతో సమాధానము చెప్పునట్టి సంస్కారము అరుదు.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** నీ అభిప్రాయములు నచ్చనివారు నిన్ను వాదమునందు ఓడింపలేక నీ పరువు తీయుటకును, నిన్ను కొట్టించుటకును ప్రయత్నింపవచ్చును. కనుక జాగ్రత్త అని భావము.

SUMMARY : Beware of participating in debates with faceless groups on serious topics. It is rare in the world to find the good culture of answering one's words in words.

*(Be on guard because those who cannot disprove your contentions, may try to defame you or have you physically assaulted).*

**అవిగింగ జంట ॥** నమ్మి యొక కడఁదేల్మి నిమ్ముగాఁ గట్టువడి ౨ ,
అందఱ నన్నిఁటి నందుండియే యారయన్ ౨ ,
ఒలవంతయు మార్తుఱట్టు లగుపింపసాఁగు ;
మస్తరింప మట్టువెట్ట మసలు మెదలములు ; 19
నానాడు హెచ్చు సూ నచ్చనివారి వెరసు ;
కావళముఁ జేయించు కడఁదేల్ము లీఁగుతన్. 20

**మాటల విడఁదీత (పద విభాగము) :** నమ్మి + ఒక, కడఁదేల్మిన్ + ఇమ్ముగాన్ + కట్టు + పడి, అందఱన్ + అన్నిఁటిన్ + అందుండి + ఏ + ఆరయన్, ఒలవు + అంత + ఉన్, మార్తుఱు + అట్టుల్ + అగుపింపన్ + సాఁగున్, మస్తరింపన్, మట్టు + పెట్టన్, మసలున్, మెదల ములు, నాడున్ + నాడున్, హెచ్చున్, సూ, నచ్చని-వారి, వెరసు, కావళమున్ + చేయించు, కడఁదేల్ములు + ఈఁగుతన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మస్తరింపన్ మట్టు పెట్టన్ మెదలములు మసలున్. నచ్చని-వారి వెరసు నాడున్ నాడున్ హెచ్చున్ సూ. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కడఁదేల్మిన్ = సిద్ధాంతమును ; ఇమ్ముగాన్ = బాగుగా ; అందుండి + ఏ = దానిలో నుండియే ; ఆరయన్ = గమనింపఁగా ; ఒలవు + అంత + ఉన్ = లోకమంతయు ; మార్తుఱు + అట్టుల్ = శత్రువుల వలె ; అగుపింపన్ + సాఁగున్ = కనిపిం చుట మొదలగును ; మస్తరింపన్ = బంధించుటకు ; మట్టు + పెట్టన్ = చంపుటకు ; మసలున్ = కదలాడును ; మెదలములు = భావ ములు ; నాడున్ + నాడున్ = దిన-దినమునకు ; హెచ్చున్ = పెరిగిపోవును ; సూ = సుమా ; వెరసు = సంఖ్య ; కావళమున్ = పాప మును ; చేయించు ; ఈఁగుతన్ = త్యజించెదరు గాక.

**లోవాఱిక (తాత్పర్యము) :** నీ వొక సిద్ధాంతమును గట్టిగా నమ్మి దానికే కట్టుబడి లోకములో అన్ని విషయములను, అందఱు మనుష్యులను దాని కోణములో నుండియే చూచుట మొదలుపెట్టితివేని, అవన్నియు విషప్రాయము వలె తోచును. జనమందఱును శత్రువుల వలెనె కని-పించసాఁగెదరు. "వారందఱిని చెఱసాలలో వేయింపవలె" ననియు, "లేదా చంపవలె" ననియు కోరికలు కలుగును. నచ్చనివారి సంఖ్య నానాటికి హెచ్చుచు పోవును. కనుక తమ చేత ఘోర పాపములను చేయించునట్టి తప్పుడు సిద్ధాంతములను జనము త్యజించెదరు గాక !

SUMMARY : If you started strongly believing in an ideology, committed yourself to the same and began to view everything and everyone from its viewpoint, the entire world will look like a pack of enemies. You will feel like jailing or killing all of them. Thus the numbers of your mental enemies will go on shooting up. Therefore, may folks renounce the sort of ideologies which make them commit sins.

**పస్పియ** ॥ కడఁదేల్మొలు కడఁదేల్మొల కొఱకే ; మంది కోస మెంతమట్టును గావు ;
కూఱిమి-పొరసు వాట గుండుసున్న ; వలయున్ మాడ్గాటి మన్య మణియము,
తలఁచుకొన్నటు వాటి జరిపిడింప. 21

**మాటల విడఁదీత (పద విభాగము) :** కడఁదేల్మొలు, కడఁదేల్మొల కొఱకున్ + ఏ, మంది కోసము + ఎంత–మట్టును + కావు, కూఱిమి–పొరసు, వాటన్, గుండు–సున్న, వలయున్, మాడ్గాటి, మన్య–మణియము, తలఁచుకొన్న + అటు, వాటిన్, జరిపిడింపన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....తలఁచుకొన్న + అటు వాటిన్ జరిపిడింపన్ మాడ్గాటి మన్య–మణియము వలయున్. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కడఁదేల్మొలు = సిద్ధాంతములు ; ఎంత–మట్టును = ఎంతమాత్రమును ; కూఱిమి–పొరసు = ప్రేమాంశ వాటన్ = వాటిలో ; వలయున్ = కావలెను ; మాడ్గాటి = పాశవికమైన ; మన్య–మణియము = రాజ్యాధికారము ; తలఁచుకొన్న + అటు = సంకల్పించిన విధముగా ; వాటిన్ = ఆ సిద్ధాంతములను ; జరిపిడింపన్ = అమలు జరుపుటకు.

**లోవాఱిక (తాత్పర్యము) :** సిద్ధాంతములు (భావజాలములు) సిద్ధాంతముల కోసమే, ప్రజల కోసము కాదు. వాటియందు మానవ ప్రేమాంశ హుళక్కి. అందుచేతనే వాటిని అమలులోనికి తేవలె నన్నచో పాశవికమైన నిరంకుశ రాజ్యాధికారము అవసరమగును.

SUMMARY : Doctrines (ideologies) are for the sake of doctrines only, but not for the people. Brutal state power is needed to implement them, as they lack the element of love.

**గంగేరిక జంట** ॥ దిగుళ్ళ నొలయించును బారాది, దిగుమతి సేసికొన్న మెదలాది ;
వెలుఁగొందవలయున్ దెరలిటియై, కొలువలి నుడి బ్రదుకోజ ; తమ కై- 22
నవి యిముడు, సవించు, నొంటఁ బట్టు, దండి హొనెమ్మనమ్ముల దోఁటు. 23

**మాటల విడఁదీత (పద విభాగము) :** దిగుళ్ళన్ + ఒలయించును, బారాది, దిగుమతి + చేసికొన్న, మెదలాది, వెలుఁగు + ఒందన్ వలయున్, తెరలిటి + ఐ, కొలువలి, నుడి, బ్రదుకోజ, తమ. కైన్ + అవి + ఇముడున్ సవించున్ + ఒంటన్ + పట్టున్, దండి, హొ–నెమ్మనమ్ములన్, దోఁటున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** దిగుమతి చేసికొన్న మెదలాది బారాది దిగుళ్ళన్ ఒలయించును. కొలువలి నుడి బ్రదుకోజ తెరలిటి ఐ వెలుఁగు + ఒందన్ వలయున్. తమ కైన్ అవి ఇముడున్. సవించున్. ఒంటన్ పట్టున్. దండి హొ–నెమ్మనమ్ములన్ దోఁటున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** దిగుళ్ళన్ = మనోవ్యథలను ; ఒలయించును = పుట్టించును ; బారాది = అనేకముగా ; మెదలాది = భావ జాలము ; తెరలిటి + ఐ = జాతీయమై/ దేశీయమై ; కొలువలి = మతము ; నుడి = భాష ; బ్రదుకోజ = జీవనశైలి ; తమ కైన్ = తమ చేతి లో ; అవి = తమ భాషా–జీవన శైలులు ; ఇముడున్ = ఒదుగును ; సవించున్ = రుచించును ; ఒంటన్ + పట్టున్ = తమలో భాగము అగును ; దండి = పుష్కలమైన ; హొ–నెమ్మనమ్ములన్ = సుఖ–శాంతులను ; దోఁటున్ = ప్రసాదించును.

**లోవాఱిక (తాత్పర్యము) :** విదేశముల నుండి దిగుమతి చేసికొన్న సిద్ధాంతములును, భావజాలములును స్థానిక ప్రజల జీవితములలో అనేక

మైన బాధలకును, మనోవ్యథలకును కారణములగును. మనుష్యుల యొక్క మతము, భాష, జీవన విధానము మొదలైనవన్నియు జాతీయములై, దేశీయములై ఉండవలెను. అప్పుడవి వారి అవగాహనకు అందుబాటులో ఉండును. రుచించును (నచ్చును/ ఇష్టమగును). అవి తమలో భాగమగును. మఱియు మిక్కిలి సుఖశాంతులను సైతము ప్రసాదించును.

SUMMARY : The religion, language and lifestyle etc should be native, as imported doctrines and ideologies cause mental worries and sufferings to the natives. The native culture (which has organically evolved) would be accessible to the natives' understanding. It feels good besides being digestible. It also affords them immense peace and comfort.

**అవిగింగ ॥** మూటలివ్వ మురిసెద రా ఱెప్పాటునకే ;
చేయ మే లెదురుమేల్సేసి దులిపికొందురు ;
మాటమంతి యుబుసులమారులనె ౨ అప్పసము,
మంది కూర్మించెదరు డెందమార నిక్కము. 24

**మాటల విడఁదీత (పద విభాగము) :** మూటల్ + ఇవ్వన్, మురిసెదర్ + ఆ, ఱెప్పాటునకున్ + ఏ, చేయన్, మేలు + ఎదురు-మేల్ + చేసి, దులిపికొందురు, మాట-మంతి-ఉబుసులమారులన్ + ఎ, అప్పసము, మంది, కూర్మించెదరు, డెందము + ఆరన్, నిక్కము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మూటల్ ఇవ్వన్ ఆ ఱెప్పాటునకున్ + ఏ మురిసెదర్. మేలు చేయన్ ఎదురు-మేల్ చేసి దులిపికొందురు. మాట-మంతి-ఉబుసులమారులన్ + ఎ మంది అప్పసము డెందము ఆరన్ కూర్మించెదరు. నిక్కము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మూటల్ = డబ్బుల మూటలను ; ఇవ్వన్ = ఇచ్చినచో ; మురిసెదర్ = సంతోషించెదరు ; ఆ ఱెప్పాటునకున్ + ఏ = ఆ క్షణము వరకే ; చేయన్ = చేయఁగా ; మేలు = ఉపకారమును ; ఎదురు-మేల్ = ప్రత్యుపకారమును ; మాట-మంతి-ఉబుసుల మారులన్ + ఎ = పిచ్చాపాటీ మాటలాడుచు కబుర్లు చెప్పునట్టి వారినే ; అప్పసము = ఎల్లప్పుడు ; మంది = జనము ; కూర్మించెదరు = ప్రేమించెదరు ; డెందము + ఆరన్ = మనసార ; నిక్కము = ఇది నిజము.

**లోవాఱిక (తాత్పర్యము) :** జనమునకు డబ్బులిచ్చినచో తీసికొని ఆ క్షణమునకు ఆనందించి ఆ తరువాత మఱచిపోయెదరు. ఉపకారము చేసినచో మరల తిరిగి ఉపకారము చేసివేసి, "ఇఁక చెల్లుకు చెల్లు" అందురు. వారు మనసార ప్రేమించునది ఎవఱిని అనఁగా, ప్రతిదినము తమతో కూర్చుండి పిచ్చాపాటి, మాట-మంతి కబుర్లు చెప్పువారినే. ఈ ముక్క వినుటకు విచిత్రముగాను, నమ్మను అశక్యముగాను అని-పించినను ఇదే నిజము.

SUMMARY : If given money, folks take it, feel happy for the moment and then forget about it. If they are done a favour, they will reciprocate it and claim that enough has been done. They heartily love only those who daily give them company by talking all and sundry gossip. At the first glance, it sounds strange and unbelievable, but this is verily the truth.

**తంగేడుక ॥** ద్రిచ్చుయినను గోటలున్, దీరుంటమె పాకాలిన,
మఱుపుట్టువు త్రేసునకు, మన్నికరి పుస్తెకమ్మ. 25

**మాటల విడఁదీత (పద విభాగము) :** ద్రిచ్చు + అయినను + కోటలు + ఉన్ + తీరుంటము + ఎ, పొకాలినన్, మఱుపుట్టువు, త్రేసునకున్, మన్నికరి. పుస్తెకమ్మ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కోటలు + ఉన్ ద్రిచ్చు అయినను తీరుంటము + ఎ పొకాలినన్ మన్నికరి పుస్తెకమ్మ త్రేసునకున్

మఱుపుట్టువు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ద్రిచ్చు + అయినను = అదృశ్యమైనను ; తీరుంటము + ఎ = నాగరికతయే ; పొకాలినన్ = నాశనమైనను ; మఱుపుట్టువు = పునర్జన్మ ; త్రేసునకున్ = జాతికి ; మన్నికరి = నాణ్యమైన ; పుస్తెకమ్మ = పుస్తకము.

**లోవాటిక (తాత్పర్యము) :** మానవులు కట్టుకొన్న కోటలవంటి మహావస్తువులు అదృశ్యమైనను (కూలిపోయినను), మొదలు నాగరికతయే నాశనమైపోయినను, మన్నికైన (కలకారు నిలచిపోఁజాలు నాణ్యము గల) పుస్తకము ఒక్కటి మిగిలినను చాలును. అదియే జాతికి పునర్జన్మ నిచ్చి బ్రదికించును.

SUMMARY : Although forts collapse or a whole civilization declines, a single book of endur-ing quality will be able to give rebirth and a new lease of life to a race.

**అవిగింగ ॥** ఏలిక యెట్టేఁడో యేలుకోటియు నట్లే ;
పై-మణియారి యెట్లో ప్రోటియము నట్లే ;
లెంబెద్ద యెట్టేఁడో లెంబి ౦ అంద అట్లే ;
అయ్యవా రెట్టేఁడో ౦ అతని చట్ట లట్లే. 26

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏలిక + ఎట్టేఁడు + ఓ + ఏలుకోటి + ఉన్ + అట్లు + ఏ, పై-మణియారి + ఎట్లు + ఓ, ప్రోటియము + ఉన్ + అట్లు + ఏ, లెంబి + పెద్ద + ఎట్టేఁడు + ఓ, లెంబి, అందఱు + అట్లు + ఏ, అయ్యవారు + ఎట్టేఁడు + ఓ, అతని, చట్టలు + అట్లు + ఏ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఏలిక = పరిపాలకుఁడు ; ఎట్టేఁడు + ఓ = ఎటువంటి వాఁడో ; ఏలుకోటి + ఉన్ = పరిపాలితులు (పౌరులు) కూడ ; పై-మణియారి = పై అధికారి ; ప్రోటియము + ఉన్ = సిబ్బంది కూడ ; లెంబి + పెద్ద = కుటుంబ పెద్ద ; అయ్యవారు = ఉపాధ్యాయుఁడు ; చట్టలు = శిష్యులు.

**లోవాటిక (తాత్పర్యము) :** పౌరుల స్వభావము పరిపాలకుని తత్త్వమును బట్టియే ఉండును. ఒక కార్యాలయమునందలి సిబ్బంది యొక్క గుణములు వారి పై-అధికారి యొక్క గుణములను బట్టియే ఉండును. కుటుంబపెద్ద ననుసరించియే కుటుంబమువారు ఉండెదరు. ఉపా-ధ్యాయుని బట్టియే విద్యార్థులు ఉండెదరు.

SUMMARY : Citizens' character follows that of the ruler. The nature of the staff at an office closely resembles that of their boss. Family members' behaviour is in keeping with that of the head of the family. Students' attitude takes after that of their teacher.

**గంగేరిక ॥** అకతర్పు తమయంత జరుగునవి, బల్ తీరుంటిద కానసమునన్,
బల్లిదుల చేతాఁకు కల్గకయె, కావాల్.స్కనియో మేదకముననొ. 27

**మాటల విడఁదీత (పద విభాగము) :** అకతర్పు, తమ + అంత, జరుగునవి, బల్, తీరుంటిద-కానసమునన్, బల్లిదుల, చేతాఁకు, కల్గకయె, కావాల్.స్కని + ఓ, మేదకమునన్ + ఒ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** బల్ తీరుంటిద-కానసమునన్ కావాల్.స్కని + ఓ మేదకమునన్ + ఒ బల్లిదుల చేతాఁకు కల్గకయె తమ + అంత జరుగునవి అకతర్పు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అకతర్పు = అరుదు ; తమ + అంత = తమంతట తాముగా ; జరుగునవి = సంభవించునవి ; బల్ = మిక్కిలి ; తీరుంటిద-కానసమునన్ = నాగరికమైన లోకమునందు ; బల్లిదుల = బలవంతుల యొక్క ; చేతాఁకు = చేతి స్పర్శ ; కావాల్ స్కని + ఓ = ఉద్దేశ పూర్వకముగానో ; మేదకమునన్ + ఒ = అమాయకత్వము చేతనో.

**లోవాఱిక (తాత్పర్యము) :** నాగరికత మిక్కిలి వ్యాపించిన ప్రపంచములో — తెలిసియో తెలియకో బలవంతుల చేయి పడకుండ విషయములు తమంతట తాముగా జరిగిపోవుట అరుదు.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** (౧) బల్లిదులు = ధనవంతులు గానీ, అధికారవంతులు గానీ.

(౨) మేదకము = దురుద్దేశము గానీ భావి పరిణామములను గూర్చిన ఊహ గానీ లేని అమాయక మనఃస్థితి (innocuous-ness).

SUMMARY : In a highly civilized world, rare are the events which take place without a deliberate or innocuous involvement of the stronger.

**వెల్మిరిక ॥** కలిగిన చోటఁ గొలువు సేరుము ; లేని చోటున లేమ వెదకుము ;
బల్లిదులతోడి లొల్లి వలవ- దయినవారితో నంకోలున్. 28

**మాటల విడఁదీత (పద విభాగము) :** కలిగిన, చోటన్ + కొలువు, చేరుము, లేని, చోటునన్, లేమన్, వెదకుము, బల్లిదులతోడి, లొల్లి, వలవదు, + అయిన-వారితోన్ + అంకోలు + ఉన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కలిగిన చోటన్ కొలువు చేరుము. లేని చోటునన్ లేమన్ వెదకుము. బల్లిదులతోడి లొల్లి వలవదు. అయిన-వారితోన్ అంకోలు + ఉన్ (వలవదు).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కలిగిన చోటన్ = ధనమున్న చోట ; కొలువు చేరుము = ఉద్యోగములో చేరుము ; లేని చోటునన్ = ధనము లేని ప్రదేశమున ; లేమన్ = స్త్రీని ; బల్లిదులతోడి = బలవంతులతో ; లొల్లి = గొడవ ; వలవదు = వద్దు ; అయిన-వారితోన్ = బంధు మిత్రులతో ; అంకోలు + ఉన్ = వ్యాపారము కూడ (వలవదు = వద్దు).

**లోవాఱిక (తాత్పర్యము) :** ధనమున్న చోట ఉద్యోగములో చేరుము. ధనము లేనిచోట పెండ్లికూఁతునకై వెదకుము. బలవంతులతో గొడవ పడవలదు. నీ వ్యాపారమునకు నీ బంధుమిత్రులను వినియోక్తలుగా చేసికొనవలదు.

SUMMARY : Join the service of those who are fat with money. Search for a bride among the families of humble means. Do not have tiffs with the stronger. Do not make customers of your friends and relatives.

**పస్పియ ॥** ఇలబ్రదిమానము మీఁ దానిదము, వెలిబ్రదిమాన ; మీ రెంటి మీఁద,
నానిదము తరుతేని బ్రదిమానము. 29

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఇల-బ్రదిమానము మీఁదన్ + ఆనిదము, వెలి-బ్రదిమానము + ఈ, రెంటి మీఁదన్ + ఆనిదము, తరుతేని, బ్రదిమానము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఇల-బ్రదిమానము మీఁదన్ = గృహ జీవితము మీఁద ; ఆనిదము = ఆధారితము (ఆధారపడినట్టిది) ; వెలి-బ్రదిమానము బయటి జీవితము ; తరుతేని బ్రదిమానము = ఆధ్యాత్మిక జీవితము. .

**లోవాఱిక (తాత్పర్యము) :** ఇంటిలో కడపు జీవితమును బట్టియే బయట కడపు జీవితము కూడ ఉండును. ఆధ్యాత్మిక జీవితము ఈ రెంటి మీఁదను ఆధారపడి ఉండును. ఈ రెండును సరిగా లేనివానికి సరైన ఆధ్యాత్మిక జీవితము కూడ ఉండదని భావము.

SUMMARY : One's social life depends on one's domestic life. His spiritual life depends on both of these.

**వెల్మిరిక** ॥ దప్పికఁ దీర్పదు వేఁడినీరు, కడుపుమంటను ౨ కారపు కూడు ;
ఎఱియుచుఁ జెప్పున దెక్క దొరుల- కెంత మేల్కోరు వీవైనను. 30

**మాటల విడఁదీత (పద విభాగము) :** దప్పికన్ + తీర్పదు, వేఁడి–నీరు, కడుపు–మంటను, కారపుం + కూడు, ఎఱియుచున్ + చెప్పునది + ఎక్కదు + ఒరులకున్ + ఎంత, మేల్కోరువు + ఈవు + ఐనను.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** వేఁడి–నీరు దప్పికన్ తీర్పదు. కారపుం కూడు కడుపు–మంటను (తీర్పదు). ఈవు ఎంత మేల్కోరువు ఐనను ఎఱియుచున్ చెప్పునది ఒరులకున్ ఎక్కదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** దప్పికన్ = దాహమును ; కడుపు–మంటను ఆఁకటిని ; ఎఱియుచున్ = మండుచు (కోపించుచు) ; ఒరుల కున్ = ఇతరులకు ; మేల్కోరువు = హితైషి ; ఈవు = నీవు.

**లోవాఱిక (తాత్పర్యము) :** వేఁడినీరు త్రాఁగినచో దాహము తీఱదు. విపరీతముగా కారము దట్టించిన తిండి తిన్నచో ఆఁకలి ఉపశమింపదు. అదే విధముగా నీవు ఇతరులకు ఎంత శ్రేయోఽభిలాషివైనను, నీవు కోపముగా అఱచి చేయు ఉపదేశములు వారి తలలకు ఎక్కనే ఎక్కవు.

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** నీవు నిక్కముగా ఇతరులకు శ్రేయోఽభిలాషివని అనిపించుకొనఁదలఁచినచో కోపమును అడంచు–కొని శాంతముగా తగ్గుటెల్గున హితోపదేశము చేయవలసినదని భావము.

SUMMARY : Thirst cannot be quenched with hot water. Hunger cannot be satiated with pungent food. Similarly, the teachings you impart in fury fail to make it to the heads of your listeners, no matter however much a wellwisher you are of them.

**వెల్మిరిక** ॥ ఇనుముప్పుకాన్ ౨ అడిసున్నితము ; అడిమారుక్రాలిక కది కతము ;
కావళింతు రడిసున్నితులే ౨ , అకసున్నితులపైఁ బెచ్చుగాన్. 31

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఇనుముప్పుకాన్, అడిసున్నితము, అడిమారుక్రాలికకున్ + అది, కతము, కావళింతురు + అడిసున్నితులు + ఏ, అకసున్నితులపైన్ + పెచ్చుగాన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** అడిసున్నితము ఇనుముప్పుకాన్. అడిమారుక్రాలికకున్ అది కతము. అడిసున్నితులు + ఏ అకసున్నితుల పైన్ పెచ్చుగాన్ కావళింతురు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఇనుముప్పుకాన్ = ఇంకను ఎక్కువ ముప్పును కలిగించునట్టిది (ప్రమాదకరము) ; అడిసున్నితము = అతి–సున్నిత–తనము ; అడిమారుక్రాలికకున్ = అతి–ప్రతిస్పందనమునకు ; కతము = కారణము ; కావళింతురు = పాపము చేసెదరు ; అడి సున్నితులు + ఏ = అతి సున్నితులే ; అకసున్నితులపైన్ = సున్నితులు కానివారి కన్నను ; పెచ్చుగాన్ = ఎక్కువగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** సున్నిత–తనము లేకపోవుట కన్న దానిని అతిగా కలిగి ఉండుట ఎక్కుదు ప్రమాదకరము. ఎందుకనఁగా — అతి సున్నిత–తనము అతి–ప్రతిస్పందనలకును, అతి–ప్రతిచర్యలకును దారిదీయును. అందువలన అమార్దవుల కన్న అతి–మార్దవులే ఎక్కువ పాపములకు ఒడిగట్టెదరు.

SUMMARY : Hypersensitivity is more dangerous than insensitivity, as it results in over-re-action. Consequently, the hypersentive tend to sin more than the insensitive.

**వాణిద ॥** తారసిల్లిన తోడ్తోడ దాడి సేసి యుసురుఁ దీయుఁ ,
బులియుఁ జిఱుతపులియు వేహి చిలువయున్ లాయేలులన్ ;
పరఁగె నందున వాటికిం బ్రామిఁడి పసరంబుల సడి ;
వేదుటు లెలందార్ వాకుట్టరు లండ్రు రెంచలలోన్. 32

**మాటల విడఁదీత (పద విభాగము) :** తారసిల్లిన, తోడ్తోడన్, దాడి + చేసి, ఉసురున్ + తీయున్ + పులి + ఉన్ + చిఱుత–పులి + ఉన్, వేహి, చిలువ + ఉన్, లా + ఏలులన్, పరఁగెన్ + అందునన్, వాటికిన్ + ప్రామిఁడి, పసరంబుల, సడి, వేదుటుల్ + ఎలందార్, వాకుట్టరుల్ + అండ్రు, రెంచలలోన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తారసిల్లిన తోడ్తోడన్ పులి + ఉన్ చిఱుత–పులి + ఉన్ వేహి చిలువ + ఉన్ దాడి చేసి లా + ఏలులన్ ఉసురున్ తీయున్. అందునన్ వాటికిన్ ప్రామిఁడి పసరంబుల సడి పరఁగెన్. రెంచలలోన్ వేదుటుల్ ఎలందార్ వాకుట్టరుల్ అండ్రు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తారసిల్లిన తోడ్తోడన్ = దారిలో తగిలిన వెనువెంటనే ; ఉసురున్ + తీయున్ = ప్రాణము తీయును ; వేహి = సింహము ; చిలువ + ఉన్ = పాము కూడ ; లా + ఏలులన్ = ఇతర జంతువులను ; పరఁగెన్ = విలసిల్లెను ; అందునన్ = అందుచేత ; ప్రామిఁడి = క్రూరమైన ; పసరంబుల = జంతువులు అను ; సడి = చెడ్డపేరు ; వేదుటుల్ = ఉన్మాదులు ; ఎలందార్ వాకుట్టరుల్ = నిరంకుశ నియంతలు ; అండ్రు = అనెదరు ; రెంచలలోన్ = మానవ సమాజములో.

**లోవాతిక (తాత్పర్యము) :** తమకు దారిలో ఎవఱు/ ఏది తటస్థించినను వెంటనే దాడి చేసి చంపుట పులికిని, చిఱుతపులికిని, సింహమునకును, పామునకును సహజ స్వభావము. అందుచేతనే వాటికి 'క్రూరజంతువులు' అన్న చెడ్డపేరు కలిగెను. ఆ క్రూరజంతువుల స్వభావమే గల మనుష్యులకు మానవ సమాజమునందు "ఉన్మాదులు, నిరంకుశ నియంతలు" అని పేరు.

SUMMARY : It is characteristic of the tiger, the panther, the lion and the snake to attack and kill whoever/ whatever crosses their path. They are notorious as '*wild animals*' for this reason. Persons of the same wild mentality are known in the human society as fanatics, des-pots and dictators.

**పస్పియ మున్నంగి ॥** మాడిపోవుచుఁ దాను మండుటెండ, మ్రానొసఁగు మందికిఁ జల్లని నీడ ;
తరలించి తెరలవానుల నావలి, దరికిఁ దా నీటనె మిగులుఁ గడపలి ; 33
ఝుమ్మని తేంట్లు తేనె నొల్లిన మఱి, కమ్మతావి నీనక మానదు విఱి ;
వాఁడి నాగళ్ళఁ దనవాఁడె తన్నుఁ , జీల్చినను లిబులిచ్చు తల్లిమన్ను ; 34
సిట-సిటమునకుఁ గ్రొవ్వొత్తి కరఁగును, జిటపటలాడక పఱపును వెలుఁగును ;
మంది పేరెంచల వాసిమి వారు, మన్నంత కారుఁ గనుగొనలేరు. 35

**మాటల విడఁదీత (పద విభాగము) :** మాడి–పోవుచున్ + తాను, మండు + ఎండన్, మ్రాన్ + ఒసఁగున్, మందికిన్ + చల్లని, నీడన్, తరలించి, తెరలవానులన్ + ఆవలి, దరికిన్ + తాన్, నీటన్ + ఎ, మిగులున్ + కడపలి, ఝుమ్ + అని, తేంట్లు, తేనెన్, నొల్లినన్, మఱి, కమ్మ–తావిన్ + ఈనక, మానదు, విఱి, వాఁడి, నాగళ్ళన్ + తన–వాఁడు + ఎ, తన్నున్ + చీల్చినను, లిబుల్ + ఇచ్చున్, తల్లి–మన్ను, సిటము–సిటమునకున్ + క్రొవ్వొత్తి, కరఁగును + చిటపటల్ + ఆడక, పఱపును, వెలుఁగును, మంది, పేరెంచల, వాసిమిన్, వారు, మన్న

+ అంత, కారున్ + కనుగొనన్ లేరు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మ్రాన్ మందు + ఎండన్ తాను మాడి-పోవుచున్ మందికిన్ చల్లని నీడన్ ఒసఁగున్. కడపలి తెరలవానులన్ ఆవలి దరికిన్ తరలించి తాన్ నీటన్ + ఎ మిగులున్. ఝుమ్ + అని తేంట్లు తేనెన్ నొల్లినన్ విఱి కమ్మ-తావిన్ మఱి ఈనక మానదు. వాఁడి నాగళ్ళన్ తన-వాఁడు + ఎ తన్నున్ చీల్చినను తల్లి-మన్ను లిబుల్ ఇచ్చున్. సిటము-సిటమునకున్ క్రొవ్వొత్తి కరఁగును. చిటపటల్ + ఆడక వెలుఁగును పఱపును. మంది పేరెంచల వాసిమిన్ వారు మన్న అంత కారున్ కనుగొనన్ లేరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మ్రాన్ = చెట్టు ; ఒసఁగున్ = ప్రసాదించును ; మందికిన్ = జనమునకు ; తరలించి = చేరవేసి ; తెరలవానులన్ = ప్రయాణికులను ; ఆవలి దరికిన్ = అవతలి ఒడ్డునకు ; కడపలి = ఓడ ; తేంట్లు = తేనెటీఁగలు ; నొల్లినన్ = దోచుకొన్నను ; మఱి = ఇంకను ; కమ్మ-తావిన్ = సురభి గంధమును ; ఈనక మానదు = వెదఁజల్లక మానదు ; విఱి = పువ్వు ; తన-వాఁడు + ఎ = తనలో నుండి పుట్టినవాఁడే ; తన్నున్ = తనను ; లిబుల్ + ఇచ్చున్ = సంపదల నిచ్చును ; తల్లి-మన్ను = భూమాత ; సిటము-సిటమునకున్ = క్షణ క్షణమునకు ; పఱపును = ప్రసరించును ; పేరెంచల = మహాత్ముల యొక్క ; వాసిమిన్ = ఘనతను ; మన్న + అంత కారున్ = బ్రదికి ఉన్నంత కాలము.

**లోవాఱిక (తాత్పర్యము) :** చెట్టు స్వయముగా మండుటెండలో మాడిపోవుచు తన్నాశ్రయించిన జనమునకు మాత్రము చల్లని నీడ నిచ్చును. ఓడ ప్రయాణికులను అవతలి ఒడ్డునకు చేర్చి తాను మట్టుకు శాశ్వతముగా నీటిలోనే ఉండిపోవును. తేనెటీఁగెలు తన తీయనైన రసమును పీల్చివేసినను పువ్వు సుగంధమును వెదఁజల్లుట మానదు. తన బిడ్డయే అయిన మానవుఁడు తనను వాఁడి నాగళ్ళతో దున్ని చీల్చివేసినను భూమాత ఆతనికి సంపదలిచ్చుట మానదు. క్రొవ్వొత్తి తాను క్షణ క్షణమునకు కరఁగిపోవుచు నిశ్శబ్దముగా వెలుఁగులను ప్రసరించును. జనము మహాత్ముల గొప్పతనమును వారు బ్రదికి యున్నంత కాలము గుఱుతింపఁజాలరు.

SUMMARY : The tree is scorched in the hot son, but gives shelter to the people. The ship carries the voyagers to the other shore, but herself remains in water forever. The flower is not done casting fragrance around even after it has been robbed of its nectar by bees. Mother Earth does not keep riches from man, though he rends her away with sharp ploughshares being her own child. The candle melts away minute by minute, but silently keeps shedding light all over. Folks cannot recognise the sublimity of great souls as long as they are alive.

**గోరంటిక ॥** ప్రూడింపఁజనదు బోడల బ్రదుకోజన్, మాటల మెసవుల మడుగుల నెందులనున్ ;
ఇలుగాఁపి తొడరవలె నిలుగాఁపమునే ; మనరా దొండొరుల వలె ఱేఁడుపేఁదల్. 36

**మాటల విడఁదీత (పద విభాగము) :** ప్రూడింపన్ + చనదు, బోడల, బ్రదుకు + ఓజన్, మాటలన్, మెసవులన్, మడుగులన్ + ఎందులన్ + ఉన్, ఇలుగాఁపి, తొడరన్ వలెన్ + ఇలుగాఁపమున్ + ఏ, మనన్ రాదు + ఒండొరుల వలెన్, ఱేఁడు + పేఁదల్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (ఇలుగాఁపి) మాటలన్ మెసవులన్ మడుగులన్ ఎందులన్ + ఉన్ బోడల బ్రదుకు + ఓజన్ ప్రూడింపన్ చనదు. ఇలుగాఁపి ఇలుగాఁపమున్ + ఏ తొడరన్ వలెన్. ఱేఁడు + పేఁదల్ ఒండొరుల వలెన్ మనన్ రాదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ప్రూడింపన్ + చనదు = అనుకరింపరాదు ; బోడల బ్రదుకు + ఓజన్ = సన్న్యాసుల జీవన విధానమును ; మాటలన్ = మాటలయందును ; మెసవులన్ = తిండ్లయందును ; మడుగులన్ = బట్టలయందును ; ఎందులన్ + ఉన్ = దేనియందును ; ఇలుగాఁపి = గృహస్థుఁడు ; తొడరన్ వలెన్ = అనుసరింపవలెను ; ఇలుగాఁపమున్ + ఏ = గృహస్థాశ్రమమునే ; మనన్ రాదు = బ్రదుకరాదు ; ఒండొరుల వలెన్ = ఒకటి వలె ఒకఱు ; ఱేఁడు + పేఁదల్ = రాజును, పేఁదయు.

**లోవాఱిక (తాత్పర్యము) :** గృహస్థులు తమ మాటల శైలిలో గానీ, ఆహార విహారములలో గానీ, వస్త్రధారణములో గానీ సన్న్యాసుల జీవన

విధానమును అనుకరింపరాదు. వారు తమకు విహితమైన గృహస్థాశ్రమ ధర్మములను మాత్రమే అనుసరింపవలె. రాజు పేఁద వలెను, పేఁదవాఁడు రాజు వలెను బ్రదుకరాదు కదా !

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** ఆశ్రమ సాంకర్యము ఉభయభ్రష్టతకు దారిదీయును.

SUMMARY : Householders should not imitate the lifestyle of monks in any matter including words, food and dress. They are supposed to discharge the duties of household life only. The king and the pauper should not live like each other.

*(Hybridization of household life and monkhood will lead to downfal here and hereafter too).*

**అవిగింగ ॥** ఒప్పందపుఁ దౌలము లొల్లకు : మవి బెడియున్ ;
ఒప్పునది నిండెయ్దు వలనుపడ దెవఱికిన్ ;
సరిగా దెసదాఁటుల సావరము లనుకొనన్ ;
కలసి మనఁగ నేర్చెడి కట్టకమే తౌలము. 37

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒప్పందపుం + తౌలములు + ఒల్లకుము + అవి, బెడియున్, ఒప్పునది, నిండు + ఎయ్దున్, వలను–పడదు + ఎవఱికిన్, సరి–కాదు + ఎసదాఁటులన్, సావరములు + అనుకొనన్, కలసి, మనఁగన్, నేర్చెడి, కట్టకము + ఏ, తౌలము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒప్పందపుం తౌలములు ఒల్లకుము. అవి బెడియున్. ఒప్పునది నిండు + ఎయ్దున్ ఎవఱికిన్ వలను–పడదు. ఎసదాఁటులన్ సావరములు అనుకొనన్ సరి కాదు. కలసి మనఁగన్ నేర్చెడి కట్టకము + ఏ తౌలము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒప్పందపుం + తౌలములు = ఒప్పందముల మీఁద ఆధారపడి ఏర్పఱచుకొను సంబంధములకు ; ఒల్లకుము = ఒప్పుకొన వలదు ; బెడియున్ = విఫలమగును ; ఒప్పునది = ఒప్పందములో ఒప్పుకొన్న నిబంధనములను ; నిండు + ఎయ్దున్ = పూర్తిగా అనుసరించుట ; వలను–పడదు = సాధ్యము కాదు ; ఎసదాఁటులన్ = అతిక్రమణములను ; సావరములు = అపరాధములు ; అనుకొనన్ = అనుకొనుట ; కలసి మనఁగన్ = కలసి జీవించుటను ; నేర్చెడి = అభ్యసించునట్టి ; కట్టకము + ఏ = శాస్త్రమే ; తౌలము = సంబంధము.

**లోవాఱిక (తాత్పర్యము) :** వ్రాత–ఒప్పందముల మీఁద ఆధారపడి ఏర్పఱచుకొను సంబంధములకు ఎట్టి పరిస్థితులలోను ఒప్పుకొన వలదు. అటువంటి మానవ సంబంధములు తప్పనిసరిగా విఫలమై తీఱును. ఎందుకనఁగా ఖచ్చితముగా ఒప్పందములో ఒప్పుకొన్న నిబంధనముల మేరకే నడచుకొనుట ఎవఱికిని సాధ్యము కాదు. అందుచేత అటువంటి అతిక్రమణములను నేఱముగా భావించుట కూడ సరికాదు. మానవ సంబంధము అనఁగా కలసి బ్రదుకుటను అభ్యసించు కళ మఱియు శాస్త్రము.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** వ్రాత–ఒప్పందములు కృత్రిమములు మఱియు బలవంతములు. అవి అపనమ్మకములకు ప్రతి–బింబములు మఱియు ఆదిలోనే హంసపాదులు. మానవ సంబంధములు పరస్పర ప్రేమతోను నమ్మకముతోను ఏర్పఱచుకొని ఆ విధముగా కొనసాఁగ వలసినవి. అంతే తప్ప. తమ సంబంధీకులను ఒప్పందపు కాగితములను బట్టి తీర్పు తీర్చుట సరి కాదని కవిభావము.

SUMMARY : Never consent to a human relation to be formed on the basis of a written agr–eement. Such relations will compulsorily fail, for it is not possible for anyone to fully comply with the conditions stipulated therein in letter and spirit. Violations do occur, but it is im–proper to term them a crime. A human relation is an art and science of learning to live toge–ther over time.

*(Let the relation take its own time to evolove and form its own operating rules. A relation-ship can only form itself but cannot be created artificially).*

**అవిగింగ ॥** పదరుపాటి ౨ , అర్మిలివాన్ కాంచువులు గాక,
చెటేళ్ళయి కావలుండు కాంచరుల కొదవన్. 38

**మాటల విడఁదీత (పద విభాగము) :** పదరుపాటి, అర్మిలివాన్, కాంచువులు, కాక, చెటేళ్ళ + అయి, కావలి + ఉండు, కాంచరులకున్ + ఒదవన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** అర్మిలివాన్ కాంచువులు కాక చెటేళ్ళ అయి కావలి ఉండు కాంచరులకున్ ఒదవన్ పదరుపాటి.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పదరుపాటి = శాపప్రాయము ; అర్మిలివాన్ = వాత్సల్యము గల ; కాంచువులు కాక = గురువులుగా కాకుండ ; చెటేళ్ళ + అయి = చెఱసాల పాలకులు అయి ; కావలి + ఉండు = కాపలా కాఁచునట్టి ; కాంచరులకున్ = తల్లిదండ్రులకు ; ఒదవన్ = పుట్టుట.

**లోవాటిక (తాత్పర్యము) :** తమ పిల్లలతో వాత్సల్యము గల గురువుల వలె వ్యవహరింపకుండ వారిని ఖైదీల వలె చూచుచు, తాము చెఱసాల పాలకుల వలె క్రూరముగా, నిరంకుశముగా, హింస్రముగా ప్రవర్తించునట్టి తల్లిదండ్రులకు పుట్టుట ఘోర శాపముతో సమానము.

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** (౧) చెటేలు/ చెటేల్ = చెఱసాల అధికారి (jailor).

(౨) అర్మిలి = వాత్సల్యము (పెద్దలకు పిన్నల పట్ల ఉండునది – affection). అర్మిలివాన్ = వాత్సల్యము గల/ వాత్సల్యము గలవాఁడు/ వాత్సల్యము గలామె. దీనిని గతిశీల విశేషణము (dynamic adjective) గాను, విశేష్య నిఘ్నముగా కూడ ఎసవాడవచ్చును.

SUMMARY : It is almost a curse to be born to the sort of parents who treat their children cruelly, despotically and violently, like jailors do convicts, in stead of dealing with their children like affectionate teachers.

**అవిగింగ జంట ॥** పారిపయమున మనుట యించుకయే రెంచాది ;
బ్రదుకు నిక్కముగ బారాది నమ్మకములూఁది ;
ఇందటివి తీసిపోవవు సూ ౨ అందటులకు ;
అదియ తుది తవన రెంచ కెల్ల నమ్మకము వోన్ ; 39
నమ్మకమే తనకపుం దొలి మారుక్రాలిక ;
నమ్మమి పిమ్మటియే ; నమ్మి ప్రూడించియే,
పైద యగు నెగోదరి పలునేర్మల యెఱుకరి ;
నమ్మక మెటు లున్నను దుది పంటకమె వంచ. 40

**మాటల విడఁదీత (పద విభాగము) :** పారి–పయమునన్, మనుట + ఇంచుక + ఏ, రెంచాది, బ్రదుకున్, నిక్కముగన్, బారాది, నమ్మకములు + ఊఁది, ఇందటివి, తీసి–పోవవు, సూ, అందటులకున్, అది + అ, తుది, తవన, రెంచకున్ + ఎల్ల, నమ్మకమున్ + పోన్, నమ్మకము + ఏ, తనకపుం + తొలి, మారుక్రాలిక, నమ్మమి, పిమ్మటి + ఏ, నమ్మి, ప్రూడించి + ఏ, పైద + అగున్ + ఎగోదరి, పలు–నేర్మల + ఎఱుకరి, నమ్మకము + ఎటులు + ఉన్నను + తుది పంటకము + ఎ, వంచ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** రెంచాది పారి–పయమునన్ మనుట ఇంచుక + ఏ. (రెంచాది) నిక్కముగన్ బారాది నమ్మకములు ఊఁది

బ్రదుకున్. ఇందటివి అందటులకున్ తీసి–పోవవు సూ. రెంచకున్ ఎల్ల నమ్మకమున్ పోన్ అది + అ తుది తవన. నమ్మకము + ఏ తనకపుం తొలి మారుక్రాలిక. నమ్మమి పిమ్మటి + ఏ. నమ్మి ప్రూడించి + ఏ పైద ఎగోదరి, పలు–నేర్మల ఎఱుకరి అగున్. నమ్మకము ఎటులు ఉన్నను తుది పంటకము + ఎ వంచ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పారి–పయమునన్ = భూమితలమునందు ; మనుట = జీవించుట ; ఇంచుక + ఏ = కొంచెమే ; రెంచాది = మానవాళి ; నిక్కముగన్ = నిజముగా ; బారాది = అనేకమైన ; నమ్మకములు + ఊది = నమ్మకములను పట్టుకొని ; ఇందటివి = ఇహలోకపు నమ్మకములు ; తీసి–పోవవు = తక్కువ కావు ; సూ = సుమా ; అందటులకున్ = పరలోకపు నమ్మకములకు ; అది + అ = అదే ; తుది తవన = చివరి నిమిషము ; రెంచకున్ = మనిషికి ; ఎల్ల = మొత్తము ; పోన్ = పోఁగా / పోయినప్పుడు ; తనకపుం = సహజమైన ; తొలి మారుక్రాలిక = మొదటి ప్రతిస్పందనము ; నమ్మమి = అవిశ్వాసము / అకనమ్మకము ; పిమ్మటి + ఏ = తరువాతిదే ; ప్రూడించి + ఏ = అనుకరించియే ; పైద = పిల్లవాఁడు ; ఎగోదరి = వయోజనుఁడు ; పలు–నేర్మల = బహువిద్యల ; ఎఱుకరి = జ్ఞాని ; తుది పంటకము + ఎ = అంతిమ ఫలితమే ; వంచ = ముఖ్యము.

**లోవాఱిక (తాత్పర్యము) :** మానవాళి భూతలము మీఁద బ్రదుకుట తక్కువయే. అది ఎక్కువగా పలు నమ్మకముల మీఁదనే ఆనకపడి బ్రదుకుచుండును. పరలోకపు నమ్మకములే నమ్మకములని జనము తలఁచెదరు. కాని ఇహలోకపు నమ్మకములు వాటికన్న ఎంతమాత్రమును తక్కువవి కావు. అన్ని నమ్మకములును పోయిన తరువాత మనిషికి అదే చివరి నిమిషమగును. నమ్మకమే మనిషి యొక్క సహజమైన మొదటి స్పందనము. అకనమ్మకము తరువాత వచ్చునట్టిదే. పెద్దలను గట్టిగా నమ్మి వారిని అనుకరించి నేర్చుట గుండానే ఒక పిల్లవాఁడు బహువిద్యావేత్తయు, వయోజనుఁడు (వయస్సు వచ్చినవాఁడు) ను అగును. నమ్మకములు నిజమా? కాదా? అన్న చర్చకన్న వాటి చివరి ఫలితమే ముఖ్యముగా చూడఁదగినది.

**పైమాల విడబర్పు (విశేష వివరణము) :** <u>ఎగోదరి</u> = ఎదిగిన మనిషి – వయోజనుఁడు (adult).

SUMMARY : Mankind lives more on its various beliefs than on the Earth. Folks think that beliefs exclusively signify religious beliefs. No. Worldly beliefs are no second to the religious ones. The moment man gives up all the beliefs, it will be his last breath. Belief is the first and foremost response of man. Disbelief arises only next. A lad grows to be a versatile scholar only when he believes the elders and learns things accordingly. The final outcome of beliefs matters more than the debate over how far they are true. .

**వాణిద జంట** ‖ చెర్లాటలు చెనుపరముల్ ; చెణుకులు చిన్నబుచ్చులున్ ;
ప్రావణముల్ వారకముల్ ; బాసటల్ చేవలయికల్ ;
మెచ్చులన్ని మెరమెచ్చుల్ ; హోళియుఁ దా తామట్టుకమౌ ;
తెఱపిక సోమరితనమౌ ; త్యాలులు కుంటి సాకులౌ; 41
మిన్నకమున్ రేగుంబనమున్ మెత్త మోహరములౌ;
తడకారు టనుంగులకే తప్పుకోలరి రెంచ యౌ,
నెచ్చెలిమి పొఱపొచ్చెముల పాలై నచ్చక పోవన్. 42

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెర్లాటలు, చెనుపరముల్, చెణుకులు, చిన్నబుచ్చులు + ఉన్, ప్రావణముల్, వారకముల్, బాసటల్, చేవలయికల్, మెచ్చులు + అన్ని, మెరమెచ్చుల్, హోళి + ఉన్, తామట్టుకము + ఔన్, తెఱపిక, సోమరితనము + ఔన్, త్యాలులు, కుంటి,– సాకులు + ఔన్, మిన్నకము + ఉన్, రేగుంబనము + ఉన్, మెత్త, మోహరములు + ఔన్, తడకారు + అనుంగులకున్ + ఏ, తప్పుకోలరి, రెంచ + ఔన్, నెఱ + చెలిమి, పొఱపొచ్చెముల, పాల్ + ఐ, నచ్చక–పోవన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నెఱ చెలిమి పొఅపొచ్చెముల పాల్ ఐ నచ్చక-పోవన్ చెర్లాటలు చెనుపరముల్ (ఔన్). చెఱుకులు చిన్నబుచ్చులు + ఉన్ (ఔన్). ప్రావణముల్ వారకముల్ (ఔన్). బాసటల్ చేవలయికల్ (ఔన్). మెచ్చులు అన్ని మెరమెచ్చుల్ (ఔన్). హాళి + ఉన్ తామట్టుకము ఔన్. తెఅపిక సోమరితనము ఔన్. త్యాలులు కుంటి-సాకులు ఔన్. మిన్నకము + ఉన్ రేగుంబనము + ఉన్ మెత్త మోహరములు ఔన్. రెంచ తడకారు + అనుంగులకున్ + ఏ తప్పుకోలరి ఔన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చెర్లాటలు = సరసములు ; చెనుపరముల్ = బూతులు ; చెఱుకులు = ఛలోక్తులు ; చిన్నబుచ్చులు + ఉన్ = అవమానములు కూడ ; ప్రావణముల్ = బహుమతులు ; వారకముల్ = ఋణములు ; బాసటల్ = సహాయములు ; చేవలయికల్ = చేయక తప్పనివి ; మెచ్చులు + అన్ని = ప్రశంసలన్నియు ; మెరమెచ్చుల్ = ముఖప్రీతి ; హాళి + ఉన్ = ఆసక్తి కూడ ; తామట్టుకము + ఔన్ = స్వార్థపరత అగును ; తెఅపిక = విశ్రాంతి ; త్యాలులు = జబ్బులు ; మిన్నకము + ఉన్ = మౌనము మఱియు ; రేగుంబనము + ఉన్ = గాంభీర్యము కూడ ; మెత్త మోహరములు + ఔన్ = మెత్తని వ్యూహములగును ; తడకారు + అనుంగులకున్ + ఏ = చిరకాల ఆప్తులకే ; తప్పుకోలరి = తప్పుకొని తిరుగువాఁడు ; రెంచ = మనిషి ; నెఱ + చెలిమి = ప్రాణస్నేహము ; పొఅపొచ్చెముల పాల్ + ఐ = అభిప్రాయ భేదముల పాలై ; నచ్చక-పోవన్ = నచ్చకుండ పోవఁగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఇద్దఱి నడిమి ప్రాణస్నేహము అభిప్రాయ భేదములకు బలియై ఒకఱికొకఱు నచ్చకుండ పోయినప్పుడు – ఒకనాటి సరసములు ఇప్పుడు హఠాత్తుగా బూతులై పోవును. ఒకఱి మీఁద ఒకఱు విసరుకొన్న ఛలోక్తులు ఇప్పుడు అవమానము చేయుటతో సమాన మగును. అప్పుడు ఒకఱికొకఱు ప్రేమతో ఇచ్చుకొన్న కానుకలు ఇప్పుడు తిరిగి ఇచ్చివేయవలసిన అరువుసొమ్ములగును. ఆనాడు స్వచ్ఛంద ముగా చేసికొన్న సహాయములు చచ్చినట్లు చేయక తప్పని విధాయకములగును. అలనాడు మనసార చేసిన ప్రశంసలు ఇప్పుడు ముఖప్రీతి అయిపోవును. ఆనాడు చూపిన ఆసక్తి ఇప్పుడు స్వార్థమైపోవును. ఆనాడు తీసికొన్న విశ్రాంతి ఈనాడు సోమరితనమగును. అప్పుడు వచ్చిన జబ్బు ఇప్పుడు కేవలము కుంటిసాకగును. మౌనమును, గాంభీర్యమును మెత్తని పన్నాగములగును. ఇట్లు మనస్సు విఱిగిన తరువాత మనిషి తన చిరకాలపు ఆత్మీయుల నుండియే తప్పుకొని తిరుగుట మొదలుపెట్టును.

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** అవి వాస్తవముగా అట్లు కావు. కాని మారిన పరిస్థితులలో ఆ విధముగా మాటలాడుట మొదలు-పెట్టెదరని భావము.

SUMMARY : When thick friendship between two persons turns sour due to acute differences of opinion – the once-sportive things/ flirtations become a vulgarity now. The jokes cracked then, become pointed humiliations now. The same gifts then presented with love, become re-payable loans now. The voluntary helps rendered then, become obligations now. The compli-ments heartily given then, become flattery now. The interest evinced then, becomes self-in-terest now. The rest taken then, becomes laziness now. The-then sickness becomes a lame excuse now. Silence and thoughtfulness are interpreted as soft scheming. Later man begins to avoid the very people who were once intimate to him.

**వాణిద ॥** ఎవ్వారును గరపేట రేలిక యౌ కాకడారిన్ ;
అవ్వారి విలువ యివ్వరు కాకడారి-యేలికకున్ ;
అందఱకు నన్నియు నొసంగఁ డంకు, డది హేనుకతము ;
ఒక వ్రయయందే రపణిం పొక్కొక్కఱికి వ్రాయిదము. 43

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎవ్వారు + ఉను, గరపేటరు + ఏలిక + ఔ, కాకడారిన్, అవ్వారి, విలువ + ఇవ్వరు, కాకడారి + ఏలికకున్, అందఱకున్ + అన్నియున్ + ఒసంగఁడు + అంకుడు + అది, హేను-కతము, ఒక, వ్రయయందున్ + ఏ, రపణింపు + ఒక్క

+ ఒక్కటికిన్, వ్రాయిదము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఏలిక ఔ కాకదారిన్ ఎవ్వారు +ఉను గరపేటరు. కాకదారి ఏలికకున్ అవ్వారి విలువ ఇవ్వరు. అంకుదు అందఱకున్ అన్నియున్ ఒసంగఁడు. అది హేను–కతము. ఒక వ్రయయందున్ + ఏ రపణింపు ఒక్క + ఒక్కటికిన్ వ్రాయిదము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గరపేటరు = నమ్మరు ; కాకదారిన్ = తత్త్వవేత్తను ; అవ్వారి = అపారమైన ; కాకదారి + ఏలికకున్ = తత్త్వ వేత్త అయిన పరిపాలకునికి ; ఒసంగఁడు = ప్రసాదించఁడు ; అంకుదు = దేవుఁడు ; హేను–కతము = అహంకార హేతువు ; ఒక వ్రయ యందున్ + ఏ = ఒక అంశమునందే ; రపణింపు = రాణింపు ; వ్రాయిదము = వ్రాయఁబడినది.

**లోవాటిక (తాత్పర్యము) :** ఒక తత్త్వవేత్త పరిపాలన బాధ్యతలను గైకొన్నచో జనము ఆతని తత్త్వశాస్త్రమును నమ్మరు. అట్లే ఒక రాజు తాత్త్వి–కుఁడైనచో జనము ఆతనికి విశేషముగా విలువ ఇవ్వరు. అందువలననే **దేవుఁడు అందఱికిని అన్నియు ఇవ్వఁడు**. ఇచ్చినచో అది అహం–కారమును ప్రోదిసేయును. కనుక ప్రతివారికిని ఏదో ఒక అంశమునందే రాణించు యోగము వ్రాయఁబడి ఉన్నది.

SUMMARY : Folks do not believe in the philosophy of a philosopher who assumes charge as a ruler. Similarly, if a ruler becomes a philosopher, folks cease to accord him much respect. That's why God does not grant everyone everything. If granted so, it will nurture ego in man. So, the excellence only in one discipline has been written by Him for each one.

**దాసానిక ॥** వలుసు నీది ౨ ఐపడి వారివారి కొలువడి, నీ
వెలఁదుక పిల్లలనే వెనుక వేసుక రాసాఁగ,
నీ కొడుకులు నీకే యెదురు మాటలాడఁబోఁగ,
నీ చట్టులుఁ గ్రిన్నలు నీకుఁ జేఁబల్కులివ్వఁగ,
నీ వాటులకు మంది మారువల్కుట మానఁగా. 44

**మాటల విడఁదీత (పద విభాగము) :** వలుసు, నీది, ఐపడి, వారి–వారి, కొలువడిన్, నీ, వెలఁదుక, పిల్లలన్ + ఏ, వెనుకన్, వేసికొని, రాన్–సాఁగన్, నీ, కొడుకులు, నీకున్ + ఏ + ఎదురు, మాటలాడన్ + పోఁగన్, నీ, చట్టులున్ + క్రిన్నలున్, నీకున్ + చేఁబల్కులు + ఇవ్వఁగన్, నీ, వాటులకున్, మంది, మారువల్కుటన్, మానఁగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ...వారి–వారి కొలువడిన్ నీది వలుసు ఐపడి. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వలుసు నీది — నీ కర్తవ్యము ; ఐపడి = సమాప్తము ; వారి–వారి కొలువడిన్ = వారి వారి కొలఁతలో/ లెక్క లో ; నీ వెలఁదుక = నీ స్త్రీ/ నీ పెండ్లాము ; వెనుకన్ వేసికొని = సమర్థించి ; రాన్–సాఁగన్ — వచ్చుట మొదలుపెట్టినప్పుడు ; చట్టులున్ = శిష్యులు మఱియు ; క్రిన్నలున్ = చిన్నవారు కూడ ; చేఁబల్కులు = సలహాలు ; వాటులకున్ = వాదనలకు ; మంది = జనము ; మారు వల్కుటన్ = సమాధానమిచ్చుటను.

**లోవాటిక (తాత్పర్యము) :** నీ పెండ్లము నీ పక్షమును గాకుండ నీ పిల్లల పక్షమునే పూనుట మొదలుపెట్టినప్పుడు, నీ కొడుకులు నిన్నెదిరించి మాటలాడినప్పుడు, నీ శిష్యులును, నీ కంటె చిన్నవారును నీకు సలహాలు, సూచనలు ఇచ్చుచున్నప్పుడు — వారి కనురోకలో తమ పట్ల నీ కర్తవ్యములన్నియు పూర్తి అయినట్లుగా తెలిసికొనుము.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** నిక్కముగా పూర్తి కావు. కాని ఇతరులు ఆ విధముగా భావించెదరు. అయినను వారి పట్ల కోపము దెచ్చుకొనక ఓర్పుతో మెలఁగవలె నని భావము.

SUMMARY : Understand that your obligations are over in the eyes of your people – when

your wife starts supporting your children against you, when your sons give you retorts and when your own disciples and juniors give you suggestions and words of advice.

**అవిగింగ జంట** ॥ పలు నలిగమ్ములు మెలయు, నది మన్నయి వెలయు ;
మన్ను కల్లవుఁ, కల్ పంచాణమౌ, మఱి వేల్పౌ ;
రెంచలు నుండరు నీ కాంచినటులె తొలుతన్ ;
మారెద రందఱుఁ గుందరా దందులకు ; 45
అరిది తౌలములయం దపాకట్టుబడికలు ;
అకనిక్కువాటి సూ ౨ అట్టిదానిఁ గ్రచ్చుట ;
మార్పు నివ్వెఱకానైనను దాళవలయున్ ;
మారినందు కలుగక మన్నించి సాఁగుమిఁక. 46

**మాటల విడఁదీత (పద విభాగము) :** పలు–నలిగమ్ములు, మెలయున్ + అది, మన్ను + అయి, వెలయున్, మన్ను, కల్లు + అవున్, కల్, పంచాణము + ఔన్, మఱి, వేల్పు + ఔన్, రెంచలు + ఉన్ + ఉండరు, నీ, కాంచిన + అటుల్ + ఎ, తొలుతన్, మారెదరు + అందఱు + ఉన్ + కుందన్ రాదు + అందులకున్, అరిది, తౌలములయందున్ + అపాకట్టుబడికలు, అకనిక్కువాటి, సూ, అట్టి–దానిన్ + క్రచ్చుట, మార్పు, నివ్వెఱకాన్ + ఐనను + తాళన్ వలయున్, మారిన + అందుకున్ + అలుగక, మన్నించి, సాఁగుము + ఇఁకన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** పలు నలిగమ్ములు మెలయున్. అది మన్ను అయి వెలయున్. మన్ను కల్లు అవున్. కల్ పంచాణము + ఔన్. మఱి వేల్పు + ఔన్. తొలుతన్ నీ కాంచిన అటుల్ + ఎ రెంచలు + ఉన్ ఉండరు. అందఱు + ఉన్ మారెదరు. అందులకున్ కుందన్ రాదు. తౌలములయందున్ అపాకట్టుబడికలు అరిది. అట్టి–దానిన్ క్రచ్చుట అకనిక్కువాటి సూ. మార్పు నివ్వెఱకాన్ ఐనను తాళన్ వలయున్. మారిన అందుకున్ అలుగక మన్నించి ఇఁకన్ సాఁగుము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పలు నలిగమ్ములు = ప్రెక్కు పదార్థములు ; మెలయున్ = మిశ్రమగును ; అది = ఆ మిశ్రము ; వెలయున్ = అవతరించును ; కల్లు = ఱాయి ; అవున్ = అగును ; పంచాణము = శిల్పము ; వేల్పు = దేవుఁడు ; రెంచలు + ఉన్ = మనుష్యులు కూడ ; నీ కాంచిన + అటుల్ + ఎ = నీవు చూచిన విధముగా ; తొలుతన్ = మొదట ; కుందన్ రాదు = బాధపడరాదు ; అరిది = అపరూపము ; తౌలములయందున్ = సంబంధములలో ; అపాకట్టుబడికలు = శాశ్వతమైన నిబద్ధతలు ; అకనిక్కువాటి = అవాస్తవికము ; సూ = సుమా ; అట్టి–దానిన్ = అటువంటి శాశ్వత నిబద్ధతను ; క్రచ్చుట = ఆశించుట ; నివ్వెఱకాన్ = దిగ్భ్రాంతికరము ; తాళన్ వలయున్ = ఓర్చుకొనవలెను.

**లోవాఱిక (తాత్పర్యము) :** అనేక పదార్థములు కలసి మట్టిగా రూపొందును. ఆ మట్టియే మిగుల గట్టిపడి ఱాయి అగును. ఆ ఱాయియే తరువాతి కాలములో శిల్పమగును. ఆ శిల్పమే మరల దేవుఁడగును. అట్లే నీవు చూచిన మనుష్యులు కూడ మొదట ఉన్నట్లే తరువాత కూడ ఉండిపోరు. కాలక్రమమున అందఱును ఎంతో కొంత మారెదరు. ఎవఱును మినహాయింపు కారు. దానికి బాధపడరాదు. మానవ సంబంధములలో శాశ్వతముగా ఒకఱితోడి స్నేహమునకు కట్టుబడి ఉండుట అరుదు. అట్లు కట్టుబడి ఉండవలెనని ఆశించుట అవాస్తవికము. ఇతరులు మన పట్ల మారఁగా చూడవలసి వచ్చుట దిగ్భ్రాంతికరమే. కాదనరాదు. కాని వారట్లు మారినందుకు కోపము పెట్టుకొనక వారి కర్మకు వారిని వదలివేసి నీ దారిన నీవు ముందుకు సాఁగిపొమ్ము.

SUMMARY : Several substances blend together to form soil which in turn, becomes a rock if hardened. The same rock becomes a piece of sculpture if chiselled. The same piece of sculpt–ure becomes God if worshipped. Similarly humans too change more or less in course of time,

but won't remain the same as you had first found them to be. No one is an exception to this rule. Rare are the human relations which remain mutually committed for ever. Such an expectation is unrealistic too. True, it is shocking to watch people change, but you should bear with it and move on you way without harboring any grudge against them.

**అవిగింగ జంట ||** అలఁతి చాదునఁ బొరుగున నవఘళించు తావి,
నలనాటి నెనపులేవో ౨ అలరించుఁ దాఁకి ;
తెరువున ౨ పరికంతయుఁ దెల్కవాపఁగఁజాలు,
వెలగంత యెల్కపీనుఁగు వెదఁజల్లు గౌలు ; 47
మినుకుపాటి వెలుఁగున్న ౨ చాలు, నినుమడించుఁ
గనుకలి నూర్మడిగాఁ గటిక చీఁకటులనున్ ;
కొంచెమైన నికరము మంచిసెడు హత్తరము. 48

**మాటల విడఁదీత (పద విభాగము) :** అలఁతి, చాదునన్ + పొరుగునన్ + అవఘళించు, తావిన్ + అలనాటి, నెనపులు + ఏవి + ఓ, అలరించున్ + తాఁకి, తెరువునన్, పరికిన్ + అంత + ఉన్ + తెల్క + పాపఁగన్ + చాలున్, వెలగ + అంత + ఎల్క-పీనుఁగు, వెదఁజల్లు, గౌలు, మినుకుపాటి, వెలుఁగు + ఉన్నన్, చాలున్ + ఇనుమడించున్ + కనుకలి, నూర్మడిగన్ + కటిక, చీఁకటులన్ + ఉన్, కొంచెము + ఐనన్, నికరము, మంచి-చెడు-హత్తరము.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** అలఁతి చాదునన్ పొరుగునన్ అవఘళించు తావిన్ అలనాటి నెనపులు ఏవి + ఓ తాఁకి అలరించున్. వెలగ అంత ఎల్క-పీనుఁగు వెదఁజల్లు గౌలు తెరువునన్ పరికిన్ అంత + ఉన్ తెల్క పాపఁగన్ చాలున్. కటిక చీఁకటులన్ + ఉన్ మినుకుపాటి వెలుఁగు ఉన్నన్ చాలున్, కనుకలి నూర్మడిగన్ ఇనుమడించున్. మంచి-చెడు-హత్తరము కొంచెము ఐనన్ నికరము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అలఁతి = కొలఁదిపాటి ; చాదునన్ = అగరు (సాంబ్రాణి) తో ; పొరుగునన్ = చుట్టుప్రక్కల ; అవఘళించు = వ్యాపించు ; తావిన్ = సువాసన వలన ; అలనాటి = గతకాలపు ; నెనపులు = జ్ఞాపకములు ; అలరించున్ = సంతోషపెట్టును ; తెరువునన్ = వీథిలో ; పరికిన్ + అంత + ఉన్ = జనమందఱికి ; తెల్క = మతి ; పాపఁగన్ + చాలున్ = పోఁగొట్టఁగల్గును ; వెలగ + అంత = వెలగకాయ అంత 'ఎల్క-పీనుఁగు = చచ్చిన ఎలుక బొంద ; గౌలు = గబ్బు ; మినుకుపాటి= చిన్న కిరణమంత ; కనుకలి = చూడఁగల శక్తి ; ఇనుమడించున్ = పెరిగిపోవును ; నూర్మడిగన్ = వందలాది రెట్లుగా ; కటిక చీఁకటులన్ + ఉన్ = గ్రుడ్డి చీఁకటులలో కూడ ; నికరము = ఖాయము ; మంచి-చెడు-హత్తరము = మంచి-చెడుల ప్రభావము.

**లోవాఱిక (తాత్పర్యము) :** కొలఁదిపాటి సాంబ్రాణి కాలిన వాసన వలన ఏనాటివో తీపిగుర్తులు మేల్కొని మనస్సును తాఁకి ఆనందింపఁజేయును. అట్లే ఒక వీథిలో వెలగకాయంత చిన్న ఎలుక చచ్చి పడినచో దాని బొందకంపు అంతటను వ్యాపించి జనములకు మతి పోఁగొట్టును. కళ్ళు పొడుచుకొన్నను కానరాని కటిక చీఁకటులలో సైతము ఒక చిన్న కిరణమంత వెలుఁగు ఉన్నను, మానవుని కనుచూపు క్షణాల మీఁద అనేక వందల రెట్లు పెరిగిపోవును. కనుక, ఎంత చిన్నగా అయినను, మంచి-చెడుల ప్రభావము పడితీఱును.

**పైమాల విడఁబఱ్పు (విశేష వివరణము) :** కనుకలి = చూడఁగల శక్తి (visual faculty) ; వినుకలి = వినఁగల శక్తి.

SUMMARY : A small amount of burnt incense pleases one's mind by bringing back the sweet memories of an unknown past. The stench of a dead rat engulfs the entire street and drives its residents crazy. Man's visual faculty spikes one hundred-fold even if there is a single faint ray in the midst of pitch darkness. Thus, however minor it may be, the impact of good

and bad is sure to exist.

**గంగేరిక ॥** మంది వినఁ బొగడు మందనములన్ ; వినుచుము చెవిలో వీసరములన్ ;
గొప్పనిపించును గొంతు విప్పుట ; తీయన కాదు దాని తరుకౌట. 49

**మాటల విడఁదీత (పద విభాగము) :** మంది, వినన్ + పొగడు, మందనములన్, వినుచుము, చెవిలోన్, వీసరములన్, గొప్ప + అనిపించును, గొంతున్, విప్పుట, తీయన, కాదు, దాని, తరుకౌట.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మంది వినన్ మందనములన్ పొగడు. వీసరములన్ చెవిలోన్ వినుచుము. గొంతున్ విప్పుట గొప్ప + అనిపించును. దాని తరుకౌట తీయన కాదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మంది వినన్ = జనము వినునట్లుగా ; పొగడు = పొగడుము ; మందనములన్ = సద్గుణములను ; వినుచుము = వినిపించుము (చెప్పుము) ; వీసరములన్ = లోపములను గూర్చి ; తరుకౌట = పర్యవసానము.

**లోవాటిక (తాత్పర్యము) :** ఒకటి సద్గుణములను ఉగ్గడింప వలసినప్పుడు అది పదిమందిలో చేయుట ప్రశస్తము. కాని ఒకటి లోపములను గుఱించి మాటలాడునప్పుడు మాత్రము అట్లు చేయుట పనికిరాదు. అది రహస్యముగా గుసగుసగా చెవిలో చెప్పవలసిన విషయము. ఒకటి లోపములను గూర్చి నలుగుఱిలో ఎలుగెత్తుట మొదటిలో ఏదియో పౌరుష కృత్యము వలెను, వీరోచిత కార్యము వలెను తోచును. కాని ఆ తరువాత దాని పర్యవసానములు తీయగా ఉండవు. "కనుక జాగ్రత్త" అని భావము.

SUMMARY : Praise someone's good qualities in public. However, of bad qualities, just murmur in the ear, if the need be. It feels great in the beginning to be able to raise your voice against someone's bad qualities. But its consequences will not be savoury.

**తామరిక ॥** నడుతులుఁ బొసవులు మేల్బారులుఁ గుఱిదమ్ము లపాసల్పాదుగ ;
కడగండ్ల కారునకుఁ గా వవి, కడగండ్లను మున్నాఁపుటకే ;
విడిగాఁ గలవు బారియంబులు కడగండ్ల కారు కోసరమే ;
నలఁతఁ బడినప్పు డెప్పటి వలె నలిగములన్ నములరాదుగా ! 50

**మాటల విడఁదీత (పద విభాగము) :** నడుతులు + ఉన్ + పొసవులు + ఉన్, మేల్బారులు + ఉన్ + కుఱిదమ్ములు + అపాసల్పాదుగన్, కడగండ్ల, కారునకున్, + కావు + అవి, కడగండ్లను, మున్నాఁపుటకున్ + ఏ, విడిగాన్ + కలవు, బారియంబులు, కడగండ్ల, కారు, కోసరము + ఏ, నలఁతన్ + పడినప్పుడు + ఎప్పటి వలెన్, నలిగములన్, నములన్ రాదు, కదా.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....కడగండ్ల కారు కోసరము + ఏ విడిగాన్ బారియంబులు కలవు.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నడుతులు + ఉన్ = నీతులు మఱియు ; పొసవులు + ఉన్ = ధర్మములు ఇంకను ; మేల్బారులు + ఉన్ = ఆదర్శములు కూడ ; కుఱిదమ్ములు = ఉద్దిష్టములు (ఉద్దేశింపఁబడినవి) ; అపాసల్పాదుగన్ — నిత్య ఆచరణీయములుగా (ఎల్లప్పుడును ఆచరింప వలసినవిగా) ; కడగండ్ల కారునకున్ = ఆపత్కాలముకొఱకు ; కావు + అవి = ఆ ధర్మములు కావు ; కడగండ్లను = ఆపదలను ; మున్నాఁపుటకున్ + ఏ = నివారించుటకే (రాకుండ ముందే ఆఁపుటకు మాత్రమే) ; బారియంబులు = ఆపద్ధర్మములు ; నలఁతన్ + పడినప్పుడు = జబ్బుపడినప్పుడు ; నలిగములన్ = అన్ని పదార్థములను ; నములన్ రాదు కదా = తినరాదు కదా.

**లోవాటిక (తాత్పర్యము) :** నీతులును, ధర్మములును, ఆదర్శములును ఎల్లప్పుడును ఆచరించుటకే ఉద్దేశింపఁబడినవి. అవి అరుదైన ఆపత్కాలములలో ఆచరించుట కోసము కావు, ఆపదలు రాకుండ నివారించుట కోసమే సుమా! ఆపత్కాలముల కోసము వేఱుగా ఆపద్ధర్మములు కలవు. అవి అనునిత్య ఆచరణీయములు కావు. జబ్బుపడిన వాఁడు ఎప్పటి వలెనె అన్ని పదార్థములను యథేచ్ఛగా తినరాదు కదా.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** (౧) ఆరోగ్యముగా ఉన్న వారికి రోగుల పథ్యము పనికిరాదు. అట్లే నిత్య కార్యక్రమములలో ఆపద్ధర్మములను పాటింపరాదని భావము.

(౨) అపా = నిత్య–

సల్పు +పాదు = సల్పాదు = చేయుటకు యోగ్యమైన (సల్పు = చేయు)

SUMMARY : Morals, virtues and ideals are meant for practising on a daily basis but not just in distress. In fact, they are meant for avoiding the possiblity of undergoing distress. There are strictures separately for the times of distress, which are not fit to be followed at normal times. A man who has fallen sick should not eat everything freely like he did earlier.

**సంపంగి** ॥ కూడదు గుంపులఁ బట్టి వేదారుల బులుపన్,
నలుపన్ దీర్పన్ మఱియు నుల్లటమ్మెపుడున్ ;
వేద-వేదారున్ నేటుత వేఱువేఱుగాన్ ;
రాయిడివడి చేయరె యిటు రాఁబడిపన్నులన్? 51

**మాటల విడఁదీత (పద విభాగము) :** కూడదు, గుంపులన్ + పట్టి, వేదారులన్, బులుపన్, నలుపన్ + తీర్పన్, మఱియున్ + ఉల్లటమ్ము + ఎపుడున్, వేదారు–వేదారున్, నేటుతన్, వేఱు–వేఱుగాన్, రాయిడి + పడి, చేయరు + ఎ + ఇటు, రాఁబడి–పన్నులన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** గుంపులన్ పట్టి వేదారులన్ బులుపన్ నలుపన్ తీర్పన్ ఎపుడున్ కూడదు, మఱియున్ ఉల్లటమ్ము. ఎపుడున్ వేదారు–వేదారున్ వేఱు–వేఱుగాన్ నేటుతన్. రాఁబడి–పన్నులన్ ఇటు రాయిడి పడి చేయరు + ఎ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కూడదు = పనికిరాదు ; వేదారులన్ = వ్యక్తులను ; బులుపన్ = సుఖపెట్టుట ; నలుపన్ = ఒత్తుట (పీడించుట) ; తీర్పన్ = తీర్పు తీర్చుట ; మఱియున్ + ఉల్లటమ్ము = ఇంకను ఇందులకు వ్యతిరిక్తము ; వేదారు–వేదారున్ = వ్యక్తి–వ్యక్తిని ; నేటుతన్ = నిర్ణయించెదరు గాక ; రాయిడి + పడి – శ్రమపడి ; చేయరు + ఎ = చేయరా ; ఇటు = ఇట్లు ; రాఁబడి–పన్నులన్ = ఆదాయపు పన్నుల విషయములో.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక వ్యక్తి ఏ గుంపునకు చెందునో ఆ గుంపును బట్టి ఆతనిని సుఖపెట్టుటయో, దుఃఖపెట్టుటయో, తీర్పు తీర్చుటయో ఎన్నటికిని పనికిరాదు. అట్లే ఒక వ్యక్తి ఒక గుంపునకు చెందిన వాఁడన్న కారణము చేత ఆ మొత్తము గుంపును కూడ సుఖపెట్టుట, దుఃఖపెట్టుట, తీర్పు తీర్చుట కూడ పనికిరావు. గుంపులతో నిమిత్తము లేకుండ ఏ మనిషిని ఆ మనిషి యొక్క వ్యక్తిగత మంచి–చెడులను బట్టియే నిర్ణయింపవలె. కోటులాది మంది వద్ద ఆదాయపు పన్ను వసూలు చేయునప్పుడు ఇట్లే వ్యక్తిగతముగా లెక్కలు వేసెదరు కదా! ఆ ఓపికయే ఈ విషయములో కూడ ఎందుకు ఉండఁగూడదు?

SUMMARY : Individuals should not be done a favor, troubled or judged by the groups they belong to and *vice versa.* May they be judged by their individual merits and demerits. Do the authorities not do likewise while computing individual incomes and levying a tax on them?

**మొల్ల జంట** ॥ ఒరుల గుట్టులెఱుఁగ నుంకింపవలదు ; పాఱఁబాటునఁ గనురోకకు వచ్చినను,
మురిసి మూఁకలకు డవిణ గొొట్టవలదు ; పా మ్మవతలి కేమియు జరుగనట్లున్, 52
దెలియనట్లును నీవు సూడనట్లున్ ; అందటిగా నయ్యది కావళకాను ;
ఇందటిగా నన్నునో హావళికాను ; విను నౌరెంచల కది చీదరకాను. 53

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒరుల, గుట్టులు + ఎఱుఁగన్ + ఉంకింపన్ వలదు, పొఱఁబాటునన్ + కను-రోకకున్, వచ్చినను, మురిసి, మూఁకలకున్, దవిణ, కొట్టన్ వలదు, పొమ్ము + అవతలికిన్ + ఏమి + ఉన్, జరుగని + అట్లు + ఉన్ + తెలియని + అట్లు + ఉను, నీవు + సూడని + అట్లు + ఉన్, అందటిగాన్ + ఆ + అది, కావళకాను, ఇందటిగాన్ + అన్నన్ + ఓ, హావళికాను, విను + ఔరెంచ లకున్ + అది, చీదరకాను.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....ఏమి + ఉన్ జరుగని అట్లు + ఉన్ తెలియని అట్లు + ఉను నీవు సూడని అట్లు + ఉన్ అవతలికిన్ పొమ్ము.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఒరుల = ఇతరుల యొక్క ; గుట్టులు = రహస్యములను ; ఎఱుఁగన్ = తెలిసికొనుటకు ; ఉంకింపన్ వలదు = ప్రయత్నింపవలదు ; కను-రోకకున్ = దృష్టికి ; మురిసి = ఆనందించి ; మూఁకలకున్ = గుంపులకు ; దవిణ కొట్టన్ వలదు = దప్పు కొట్టి చెప్పవలదు ; అందటిగాన్ = పారలౌకికముగా (ఆధ్యాత్మికముగా) ; ఆ + అది = అట్లు ఇతరుల రహస్యములను తెలిసికొని పది మందికి చెప్పుట ; కావళకాను = పాపహేతువు ; ఇందటిగాన్ + అన్నన్ + ఓ = ఐహికముగా ఏమో ; హావళికాను = ప్రమాదకరము ; విను = నీవు వాటిని గూర్చి చెప్పుచుండఁగా వినునట్టి ; ఔరెంచలకున్ = సజ్జనులకు ; చీదరకాను = జుగుప్సాకరము.

**లోవాఱిక (తాత్పర్యము) :** వేఱేవారి రహస్యములను తెలిసికొనుటకై ఎన్నడును ప్రయత్నింపవలదు. ఒకవేళ పొఱఁబాటున అట్టివి నీ దృష్టికి వచ్చినను, ఆనందించి పదిమందికి దప్పుకొట్టి చెప్పరాదు. ఏమియు జరుగనట్లు, నీకు తెలియనట్లు, నీవేదియు చూడనట్లు మిన్నకుండి అవ తలికి పొమ్ము. ఇతరుల రహస్యములను శోధించి తెలిసికొనుట ఆధ్యాత్మిక కోణము నుండి మహాపాపము. లౌకిక దృష్టి నుండి బహు ప్రమాదకరము. మంచివారి చెవిన పడినచో వారికది ఱోత పుట్టించును.

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** లౌకిక దృష్టి నుండి బహు ప్రమాదకరము : తమ రహస్యములను తెలిసికొన్నవారిని జనము బ్రదుకనివ్వరు. చంపివేసెదరు. లేదా పరువు దీసెదరు.

SUMMARY : Never try to uncover others' secrets. Even if you chanced upon such things, do not feel excited and tomtom it to the public. Just quietly go your way, as if nothing has happened and as if you know nothing of it, nor saw anything. To find out others' secrets is a great sin from the spiritual standpoint and highly risky from a worldly viewpoint. Such an act is loathed by the noble.

**అవిగింగ ||** సలిగం బొలనెరసులె మేల్బారువాటునకు ;
పరిపరి మేల్బారుల పొంతనమాలికయే,
మననేర్పున ; కొండొరు మయ్యాత లిరువమున్ ;
పచ్చి మననేర్పు వలవవు పిచ్చి మేల్బారు-
లెచ్చగు సూ యూ రెంటి యెలమి-కలయికయే. 54

**మాటల విడఁదీత (పద విభాగము) :** సలిగంబు + ఒల-నెరసులు + ఎ, మేల్బారువాటునకున్, పరిపరి, మేల్బారుల, పొంతనమాలిక + ఏ, మననేర్పునకున్ + ఒండొరు-మయ్యాతలు + ఇరువము+ ఉన్, పచ్చి, మననేర్పు, వలవవు, పిచ్చి మేల్బారులు + ఎచ్చు + అగున్, సూ, ఈ, రెంటి + ఎలమి-కలయిక + ఏ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒల-నెరసులు + ఎ మేల్బారువాటునకున్ సలిగంబు. పరిపరి మేల్బారుల పొంతనమాలిక + ఏ మననేర్పునకున్ (సలిగంబు). ఇరువము+ ఉన్ ఒండొరు-మయ్యాతలు. పచ్చి మననేర్పు పిచ్చి మేల్బారులు వలవవు. ఈ రెంటి ఎలమి-కలయిక + ఏ ఎచ్చు అగున్ సూ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సలిగంబు = హేతువు ; ఒల-నెరసులు + ఎ = లోక దోషములే ; మేల్బారువాటునకున్ = ఆదర్శవాదమునకు ; పరిపరి = వివిధములైన ; మేల్బారుల = ఆదర్శముల ; పొంతనమాలిక + ఏ = పొంతనలేమియే ; మననేర్పునకున్ = లౌక్యమునకు ; ఒండొరు-మయ్యాతలు = ఒకదాని సంతానము ఒకటి ; ఇరువము+ ఉన్ = ఉభయమును (రెండును) ; పచ్చి మననేర్పు = పచ్చి లౌక్యము ; వలవవు = వద్దు ; పిచ్చి మేల్బారులు = పిచ్చి ఆదర్శములు ; ఎచ్చు + అగున్ = గొప్ప అగును ; సూ = సుమా ; ఎలమి-కలయిక + ఏ = సంతోష సంగమమే.

**లోవాఱిక (తాత్పర్యము) :** లోకమునందలి దోషములే ఆదర్శవాదమునకు కారణము. అదే విధముగా, వివిధ ఆదర్శముల నడుమ పొంతన లేకపోవుటయే లౌక్యమునకు మూలము. ఇట్లు ఈ రెండు దృక్పథములును ఒకదాని నుండి మఱొకటి పుట్టినవి. అయినను పచ్చి లౌక్య-మును వలదు. పిచ్చి ఆదర్శవాదము కూడ వలదు. ఈ రెండింటి మేలిమి కలయికయే శ్రేష్ఠము.

SUMMARY : Idealism springs off the shortcomings of the practical world. Similarly worldly wisdom is born of the incompatibility between diverse ideals. Thus, both are derived from each other. Yet, we need neither idealism nor worldly wisdom in their purest forms, but only their judicious admixture.

**దాసానిక ॥** కాల్సేతులు రెండేసి పనిఁ గావించువారికి ;
కదలకట్లె ౨ అంటిపట్టుకొని యుందురు పారికి ;
చెట్టుపల్ రెం డదనము పని సేయించువారికి ;
చెరఁగులు నాల్గు వారి రాఁజీరుచుండును దరికి. 55

**మాటల విడఁదీత (పద విభాగము) :** కాల్ + చేతులు, రెండు + ఏసి, పనిన్ + కావించు-వారికిన్, కదలక + అట్లె, అంటి-పట్టుకొని + ఉందురు, పారికిన్, చెట్టుపల్, రెండు + అదనము, పని + చేయించు-వారికిన్, చెరఁగులు, నాల్గు, వారిన్, రాఁజీరుచున్ + ఉండును, దరికిన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** పనిన్ కావించు-వారికిన్ రెండు + ఏసి కాల్ + చేతులు. పారికిన్ కదలక అట్లె అంటి-పట్టుకొని + ఉందురు. పని చేయించు-వారికిన్ రెండు చెట్టుపల్ అదనము. వారిన్ నాల్గు చెరఁగులు దరికిన్ రాఁజీరుచున్ ఉండును.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** రెండు + ఏసి = తలా రెండు ; పారికిన్ = భూమికి ; చెట్టుపల్ = ఱెక్కలు ; చెరఁగులు = దిక్కులు ; రాఁజీ-రుచున్ ఉండును = ఆహ్వానించుచుండును ; దరికిన్ = దగ్గరికి.

**లోవాఱిక (తాత్పర్యము) :** స్వయముగా పనిచేయు వారి కొక్కొక్కఱికి రెండేసి చేతులును, రెండేసి కాళ్ళను ఉండును. వారు నేలకంటుకొని ఉండెదరు. కాని ఇతరుల చేత పని చేయించు వారికి మాత్రము కాల్సేతులతో పాటు ఎగురుటకు రెండేసి ఱెక్కలు కూడ ఉండును. ప్రపంచ-మునందలి నలుదిక్కులు వారిని రా, రమ్మని పిలుచుచుండును.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** పనిచేయించు వారు అనఁగా స్వంతగా వ్యాపారములను, పరిశ్రమలను నెలకొల్పు వారు.

SUMMARY : Those who work in person have a pair of hands and a pair of legs each. They are stuck in the land where they work. However, those who have others work for them, grow even a pair of wings to fly and receive invites from four corners of the world.

*(Those who have others work for them = Entrepreneurs).*

**దాసానిక ॥** తొండి వెలిబైలు మననే తొడరి యుండు ననఁగా ;

మార్చ్బలింప నది గాదు నున్న వెల్కమాటియము,
కటిక తుటార కార్కంటి మైకానువే గాని ; 56

**మాటల విడఁదీత (పద విభాగము) :** తొండి, వెలిబైలు, మనన్ + ఏ, తొడరి + ఉండున్ + అనఁగాన్, మార్చ్బలింపన్ + అది, కాదు, నున్న, వెల్క, మాటియము, కటిక, తుటార-కార్ + కంటి, మైకానువు + ఏ, కాని.

**చఱమోలి (అన్వయ క్రమము)** వెలిబైలు మనన్ + ఏ తొడరి ఉండున్ అనఁగాన్ తొండి. మార్చ్బలింపన్ అది నున్న వెల్క మాటియము కాదు, కటిక తుటార-కార్ + కంటి మైకానువు + ఏ కాని.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తొండి = మోసము ; వెలిబైలు = బాహ్యావరణము ; తొడరి + ఉండున్ = అనుసరించి ఉండును ; అనఁగాన్ = అనుట ; మార్చ్బలింపన్ = ప్రతిబింబించుటకు ; నున్న = నునుపాటి ; వెల్క = నిర్మలమైన ; మాటియము = అద్దము ; కటిక తుటార- = కఠోర కర్కశమైన ; కార్ + కంటి మైకానువు + ఏ = నల్లని పాషాణ స్వరూపమే.

**లోవాటిక (తాత్పర్యము) :** "నీవు లోకము పట్ల ఎట్లున్నచో లోకము కూడ నీ పట్ల కూడ అట్లే ఉండు" ననియు, "నీవు లోకమును ఏ కండ్ల తో చూచెదవో అది అట్లే కనఁబడు" ననియు వినఁబడుచుండును. కాని అది కనుగప్పిడి. బాహ్యావరణము స్వతఃగా ఎల్లప్పుడు కఠిన కర్కశ పాషాణ స్వరూపమే తప్ప నీ వ్యక్తిత్వమును ప్రతిబింబించుటకు అది చక్కని నున్నని నిర్మలమైన అద్దమేమియు కాదు.

SUMMARY : We often get to hear certain silly statements like "*The world is towards you the same way you are towards it.*" and "*The world appears to you just like you look at it.*" This is nothing but gaslighting. The external sphere is only a stony-hearted and diehard entity but not a smooth and spotless mirror to reflect and reciprocate your own character.

**దాసానిక ||** అక్కైకటి నీ మంచిసెబ్ర జోలి వెలిబైలికి ;
అప్పసమున్ బ్రల్లదమే ౨ ఆలుటిగా నయ్యది ;
నీదియ నీదు మంచి ; వెలిబైలి సాతమేడన్?
కరోలిదేమి, నీ కొంచు నీకుఁ జలువ సేయన్? 57

**మాటల విడఁదీత (పద విభాగము) :** అక్కైకటి, నీ, మంచి-సెబ్రల, జోలి, వెలిబైలికిన్, అప్పసము + ఉన్, ప్రల్లదము + ఏ, ఆలుటిగాన్, ఆ + అది, నీది + అ నీదు మంచి వెలిబైలి సాతము + ఏడన్ కరోలిది + ఏమి, నీ, కొంచు, నీకున్ + చలువ + చేయన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నీ మంచి-సెబ్రల జోలి దానికిన్ అక్కైకటి. ఆ + అది ఆలుటిగాన్ అప్పసము + ఉన్ ప్రల్లదము + ఏ. నీదు మంచి నీది + అ. వెలిబైలి సాతము ఏడన్? నీ కొంచు నీకున్ చలువ చేయన్ కరోలిది ఏమి?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అక్కైకటి = అసందర్భము ; మంచి-సెబ్రల జోలి = మంచి-చెడ్డల ప్రసక్తి ; వెలిబైలికిన్ = బాహ్యావరణమునకు ; అప్పసము + ఉన్ = ఎల్లప్పుడు ; ప్రల్లదము + ఏ = దుర్మార్గమే ; ఆలుటిగాన్ = స్వతహాగా ; ఆ + అది = ఆ బాహ్యావరణము ; నీది + అ = నీదే ; నీదు = నీ యొక్క ; మంచి = మంచితనము ; వెలిబైలి = బాహ్యావరణము యొక్క ; సాతము = పాత్ర ; ఏడన్ = ఎక్కడ ; కరోలిది + ఏమి = వాతావరణానిది ఏమున్నది ; కొంచు = చెమట ; చలువ + చేయన్ = చల్లదనము నివ్వఁగా.

**లోవాటిక (తాత్పర్యము) :** నీవు మంచివాఁడవో చెడ్డవాఁడవో అన్న చర్చ బాహ్యావరణమునకు అసందర్భము. నీవు తనకు పనికి వచ్చెదవా? లేదా? అన్నదే దాని గోల. ఆ రకముగా అది ఎల్లప్పుడు దుష్టమే. నీ మంచితనము నీ స్వంతమే తప్ప అందులో బాహ్యావరణ పాత్ర ఏమియు లేదు. ఎందుకనఁగా నీవు పుట్టుకతో మంచివాఁడవే. నీ చెమటయే నీకు చల్లదనము నిచ్చుచున్నప్పుడు అందులో వాతావరణమును పొగడుటకు ఏమున్నది?

SUMMARY : The external sphere is least bothered about the question of whether you are a good man or a bad man, but it is seriously concerned with the sole question of "*How useful are you to me?*" Thus it has always been a villain. It has no role whatsoever in the formation of your noble character. You are solely behind your good character because you were just that at your birth. What is there to praise the weather when your own sweat cools you?

**పస్సియ** ॥ తెలివిఁ గలిగి మెలఁగినంత కారే, చెలిసుట్టమ్ము లనుంగులు నీ మెయి ;
పచ్చిగొట్టి పాఱెద రవ్వారే, పిచ్చి రెచ్చి నీవు ఠవణిల్లితే. 58

**మాటల విడఁదీత (పద విభాగము) :** తెలివిన్ + కలిగి, మెలఁగిన + అంత, కారే, చెలి + చుట్టమ్ములు + అనుంగులు, నీ మెయిన్. పచ్చి + కొట్టి, పాఱెదర్ + ఆ + వారే, పిచ్చిన్, రెచ్చి, నీవు, ఠవణిల్లితేన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....పిచ్చిన్ రెచ్చి నీవు ఠవణిల్లితేన్ పచ్చి కొట్టి పాఱెదర్ ఆ + వారే. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మెలఁగిన + అంత కారే = వ్యవహరించినంత కాలమే ; చెలి + చుట్టమ్ములు = స్నేహితులును, బంధువులును ; అనుంగులు = ఆప్తులు ; నీ మెయిన్ = నీతో ; పచ్చి + కొట్టి = స్వస్తి చెప్పి ; పాఱెదర్ = పరుగెత్తెదరు ; ఆ + వారే = వారే/ ఆ బంధుమిత్రులే ; పిచ్చిన్ = ఉన్మాదముతో ; రెచ్చి = చెలరేఁగి ; ఠవణిల్లితేన్ = వర్తించినచో/ ప్రవర్తించినచో.

**లోవాఱిక (తాత్పర్యము) :** నీవు తెలివి గలిగి వ్యవహరించుచున్నంత కాలమే నీయందలి నమ్మకముతో నీ బంధుమిత్రులు మఱియు ఇతర ఆప్తులు నీతో ఉండెదరు. అట్లు కాక నీవు పిచ్చిపిచ్చిగా రెచ్చిపోయి ప్రవర్తించుట మొదలుపెట్టితివేని వారందఱు నిన్ను వదిలి పాఱిపోయె-దరు సుమా.

SUMMARY : Your friends, relations and other close ones would be with you as long as you wisely deal with things. However, if you begin to behave recklessly like a crazy man, all of them will bid you farewell and flee.

**గోరంటిక** ॥ కూటంబున నున్నను గూడ దద్దాని, వాటములన్ని యొంటఁ బట్టించుకొనన్ ;
లే దంకిలి నీవు నీవుగా నుండన్ ; ప్రెక్కు పసరములు కొఱలు నొకే కానన్ ;
ఒక్కొక్కటి మను నొక్కొక్క తీరునన్. 59

**మాటల విడఁదీత (పద విభాగము) :** కూటంబునన్ + ఉన్నను + కూడదు + ఆ + దాని, వాటముల్ + అన్ని + ఒంటన్ + పట్టించుకొనన్, లేదు + అంకిలి, నీవు, నీవుగాన్ + ఉండన్, ప్రెక్కు, పసరములు, కొఱలున్ + ఒక + ఏ, కానన్, ఒక్క + ఒక్కటి, మనున్ + ఒక్క + ఒక్క, తీరునన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కూటంబునన్ ఉన్నను ఆ దాని వాటముల్ అన్ని ఒంటన్ పట్టించుకొనన్ కూడదు. నీవు నీవుగాన్ ఉండన్ అంకిలి లేదు. ఒక + ఏ కానన్ ప్రెక్కు పసరములు కొఱలున్. ఒక్కొక్కటి ఒక్కొక్క తీరునన్ మనున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కూటంబునన్ = సంఘమునందు ; ఉన్నను = ఉన్నప్పటికిని ; కూడదు = వలదు ; ఆ + దాని = ఆ సంఘము యొక్క ; వాటముల్ + అన్ని = ధోరణులన్నిఁటిని ; ఒంటన్ + పట్టించుకొనన్ = అలవాటు చేసికొనుట ; లేదు + అంకిలి = అభ్యంతరము లేదు ; ప్రెక్కు పసరములు = అనేక జంతువులు ; కొఱలున్ = నివసించును ; ఒక + ఏ కానన్ = ఒకే అడవిలో ; ఒక్క + ఒక్కటి = ఒక్కొక్క జంతువు ; మనున్ = జీవించును ; ఒక్క + ఒక్క తీరునన్ = ఒక్కొక్క విధముగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** సంఘములో బ్రదుకుచున్నంత మాత్రాన దాని ధోరణులన్నిఁటిని నీవు తు.చ. తప్పకుండ అలవాటు చేసికొన పని

లేదు. సంఘమున కన్న వేఱుగా నీ వ్యక్తిత్వమును నీవు నిలఁబెట్టుకొని నీవు నీవుగా మిగులుటకు అభ్యంతరమేమియు ఉండదు. ఒకే అడవి లో అనేక జంతువులు కాఁపరముండును. కాని ఏ జంతువు ఆ జంతువుగానే ఉండును. అంతే తప్ప పక్షి పురుగైపోదు. పురుగు పులి అయి పోదు.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** మనుష్యులందఱు ఒకే జీవజాతికి చెందినను వారివారి శీల వైవిధ్యము చేత వేర్వేఱు జీవజాతుల వంటివారే నని భావము.

SUMMARY : You need not cultivate all the societal trends just because you happen to live in it. There would be no problem even if you stick to your own individuality and remain your own prestine self. Look, several species inhabit a single forest. Yet, each of them lives in its own way.

**వాణిద** ॥ బైజరి గాఁ డెఱుములుఁ గట్టకములున్ నేర్వని వాఁడు ;
బైజరి సోఁగారుల కాకడన్ బసింపని వాఁడే ;
జరుమానపు టైనిల్కు లాకళింపు గాని వాఁడే ;
చుట్టుపరి లోఁగాకడఁ జదువలేని వాఁడే. 60

**మాటల విడఁదీత (పద విభాగము) :** బైజరి, కాఁడు + ఎఱుములున్ + కట్టకములున్, నేర్వని–వాఁడు, బైజరి, చోన్ + కారుల, కాకడన్ + పసింపని–వాఁడే, జరుమానపు + ఐనిల్కల్ + ఆకళింపు, కాని–వాఁడే, చుట్టుపరి–లోఁగాకడన్ + చదువలేని–వాఁడే.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎఱుములున్ + కట్టకములున్ నేర్వని–వాఁడు బైజరి కాఁడు. చోన్ + కారుల కాకడన్ + పసింపని–వాఁడే బైజరి. జరుమానపు + ఐనిల్కల్ + ఆకళింపు కాని–వాఁడే బైజరి. చుట్టుపరి–లోఁగాకడన్ + చదువలేని–వాఁడే బైజరి.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** బైజరి = అజ్ఞాని ; ఎఱుములున్ = విజ్ఞానములను ; కట్టకములున్ = శాస్త్రములను ; చోన్ + కారుల = దేశ కాలముల యొక్క ; కాకడన్ = తత్త్వమును ; పసింపని–వాఁడే = గ్రహింపనివాఁడే ; జరుమానపు = వర్తమానపు ; ఐనిల్కల్ = పరిస్థితులు ; ఆకళింపు కాని–వాఁడే = అర్థము కానివాఁడే ; చుట్టుపరి = తన చుట్టుత ఉన్నవారి ;–లోఁగాకడన్ = మనస్తత్త్వమును ;

**లోవాఱిక (తాత్పర్యము) :** అజ్ఞాని అనఁగా అర్థము– విజ్ఞానశాస్త్రములు, ధర్మశాస్త్రములు తెలియనివాఁడని కాఁడు. దేశకాలముల స్పృహ లేనివాఁడును, వర్తమాన పరిస్థితులను సరిగా అర్థము చేసికొనలేని వాఁడును, తన తోడి మనుష్యుల మనస్తత్త్వమును చదువలేని వాఁడును – నిజమైన అజ్ఞానులనఁగా వీరే సుమా.

SUMMARY : Ignorance does not mean non-familiarity with scriptures and sciences. Real ignorance means the failure to properly understand one's times and place, the contemporary situation and also the mentality of the folks around.

**దాసానిక** ॥ గడించి మొల్లములన్ గరిసించుతఁ బైలముగన్ ;
వలసినంత మేరకు వెచ్చించుతఁ జిల్లరగన్ ;
మెదడు సించుకొనరాదు మేర మీఱి తలపోసి ;
ఒల్లకు మది నీ కొక యుల్లాప త్యాలు కాన్. 61

**మాటల విడఁదీత (పద విభాగము) :** గడించి, మొల్లములన్, గరిసించుతన్ + పైలముగన్, వలసిన + అంత, మేరకున్, వెచ్చించుతన్ + చిల్లరగన్, మెదడు + చించుకొనన్, రాదు, మేరన్, మీఱి, తలపోసి, ఒల్లకుము + అది, నీకున్ + ఒక + ఉల్లాప, త్యాలు, కాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మొల్లములన్ గడించి పైలముగన్ గరిసించుతన్. వలసిన అంత మేరకున్ చిల్లరగన్ వెచ్చించుతన్ మేరన్ మీఱి తలపోసి మెదడు చించుకొనన్ రాదు. అది నీకున్ ఒక ఉల్లాప త్యాలు కాన్ ఒల్లకుము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** గడించి = ఆర్జించి ; మొల్లములన్ = డబ్బులను ; గరిసించుతన్ = భద్రపఱచెదవు గాక ; పైలముగన్ = క్షేమముగా ; వలసిన + అంత మేరకున్ = అవసరముల ప్రకారము ; వెచ్చించుతన్ = ఖర్చు పెట్టెదవు గాక ; చిల్లరగన్ = చిన్న చిన్న మొత్తములుగా ; మెదడు + చించుకొనన్ రాదు = బుఱ్ఱ పాడు చేసికొనఁగూడదు ; మేరన్ మీఱి = మితిమీఱి ; తలపోసి = ఆలోచించి ; ఒల్లకుము = ఒప్పుకొనవలదు ; అది = ఆ డబ్బు/ ఆ డబ్బు వ్యవహారము ; ఉల్లాప త్యాలు = మానసిక రోగము ; కాన్ = అగుటకు.

**లోవాటిక (తాత్పర్యము) :** డబ్బు సంపాదించుము. క్షేమముగా దాఁచిపెట్టుము. లేదా కొంచెము కొంచెము ఖర్చుపెట్టుము. అంతే తప్ప దానిని గుఱించి మితిమీఱి ఆలోచించి బుఱ్ఱ పాడుచేసికొన వలదు. డబ్బు వ్యవహారములు నీకొక మానసిక వ్యాధి అగుటకు అంగీకరింప వలదు.

SUMMARY : Earn money, store it safe or spend it away in retail, But do not ever lose your peace of mind by constantly thinking about it. Do not allow money matters to become sorts of mental disease for you.

**పస్నియ జంట ॥** మందనములన్ని మాయమైపోవు, మడియువు మాడల రెంచగ మారన్ ;
తన కూఱిమి, తన పేఱిమి, నెరిమయుఁ , దన నగవులుఁ దన యేడ్పులు, వరవలుఁ , 62
దన చెలిమియుఁ దన యెఱుకయు మొత్తము, బవంతమగు ; బ్రదుకె బవంతమగున్ ;
మెలపు తనకుండ దొరులకు నివ్వఁడు ; కడిఁదిపడి యొరులకిడి కడతేఱున్. 63

**మాటల విడఁదీత (పద విభాగము) :** మందనములు + అన్ని, మాయము + ఐ–పోవున్, మడియువు, మాడల, రెంచగన్, మారన్. తన, కూఱిమి, తన, పేఱిమి, నెరిమ + ఉన్ + తన, నగవులు + ఉన్, తన + ఏడ్పులు + ఉన్, వరవలు + ఉన్ + తన, చెలిమి + ఉన్ + తన + ఎఱుక + ఉన్, మొత్తము, బవంతము + అగున్, బ్రదుకు + ఎ, బవంతము + అగున్, మెలపు, తనకున్ + ఉండదు + ఒరులకున్ + ఇవ్వఁడు, కడిఁదిపడి, ఒరులకున్ + ఇడి, కడతేఱున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మడియువు మాడల రెంచగన్ మారన్ మందనములు + అన్ని మాయము + ఐ–పోవున్.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మందనములు + అన్ని = సుగుణములన్నియు ; మడియువు = మర్త్యుఁడు ; మాడల రెంచగన్ = డబ్బు మనిషిగా ; మారన్ = మారినప్పుడు ; కూఱిమి = ప్రేమ ; పేఱిమి = గౌరవము ; నెరిమ + ఉన్ = భక్తి కూడ ; నగవులు + ఉన్ = నవ్వులు కూడ ; వరవలు + ఉన్ = సేవలు కూడ ; చెలిమి + ఉన్ = స్నేహము కూడ ; ఎఱుక + ఉన్ = జ్ఞానము కూడ ; బవంతము = నకిలీ ; మెలపు = సుఖము ; ఒరులకున్ = ఇతరులకు ; కడిఁదిపడి = కష్టపడి ; ఒరులకున్ = ఇతరులకు ; ఇడి = ఇచ్చి ; కడతేఱున్ = గతించును.

**లోవాటిక (తాత్పర్యము) :** మనిషి డబ్బుమనిషిగా మారిన తరువాత తనలోని సుగుణములన్నియు మంత్రము వేసినట్లు మాయమైపోవును. తన ప్రేమ, తాను చూపించు గౌరవము, తన భక్తి, నవ్వులు, ఏడ్పులు, తాను చేయు సేవలు, స్నేహము, జ్ఞానము అన్నియు నటనగా నకిలీగా మారిపోవును. తన బ్రదుకే నకిలీ అయిపోవును, అటువంటివాఁడు తాను సుఖపడఁడు, ఇతరులను సుఖపెట్టఁడు. ఆ విధముగా డబ్బు కోసము కష్టపడి, కష్టపడి చివరికి అదంతయు ఎవఱికో అప్పగించి తాను కన్నుమూయును.

SUMMARY : Once man turns money-minded, all his good qualities will do a vanishing trick as by a magic spell. The love, friendship, respect, devotion and knowledge that he exhibits – will all become a pretense. His smiles, sobs and services will all turn fake. His life itself will

become fake. Thus he strives hard and hard for money and then dies, leaving all that he has earned to someone else.

**అవిగింగ** ॥ "అందఱి కోస మొక్క, ఱొక్కఱి కోస మంద" -
అన్న పన్నము రవణిల్లు సూడులున్ననే ;
లేనప్పుడు మంది సూడ రెవ్వఱి మోమున్ ;
తమలోని వానినె వెలివేసెదరు పెలుచన్,
దమ పెద్దలతో వానికిఁ దగవేర్పడుడున్. 64

**మాటల విడఁదీత (పద విభాగము) :** అందఱి కోసము + ఒక్కఱు + ఒక్కఱి కోసము + అందఱు + అన్న, పన్నము, రవణిల్లున్, సూడులు + ఉన్నన్ + ఏ, లేని + అప్పుడు, మంది + చూడరు + ఎవ్వఱి, మోమున్, తమలోని, వానిన్ + ఎ, వెలి–వేసెదరు, పెలుచన్ + తమ, పెద్దలతోన్, వానికిన్ + తగవు + ఏర్పడుడున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** "అందఱి కోసము ఒక్కఱు, ఒక్కఱి కోసము అందఱు" అన్న పన్నము సూడులు ఉన్నన్ + ఏ రవణిల్లున్. లేని అప్పుడు మంది ఎవ్వఱి మోమున్ చూడరు. తమ పెద్దలతోన్ వానికిన్ తగవు ఏర్పడుడున్ తమలోని వానిన్ + ఎ పెలుచన్ వెలి–వేసె దరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పన్నము = సూక్తి ; రవణిల్లున్ = వర్తించును ; సూడులు = శత్రువులు ; ఉన్నన్ + ఏ = ఉన్నప్పుడే ; మంది = జనము ; పెలుచన్ = క్రూరముగా ; తగవు = గొడవ ; ఏర్పడుడున్ = ఏర్పడఁగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము)

**పైమాల విడఁబఱ్పు (విశేష వివరణము) :** ద్వేషించుటకు ఉమ్మడి శత్రువులు దొరుకనప్పుడు జనము తమలోని వారినే కొందఱిని శత్రువులుగా ఎంచుకొని ద్వేషించుట మొదలుపెట్టెదరని భావము.

SUMMARY : The slogan "*One for all and all for one*" is applicable only when there are common enemies. In their absence, folks don't want to see even the face of someone among themselves. Moreover, they cruelly excommunicate one among themselves if he is in a dispute with their elders/ authorities.

**మోదువిక జంట** ॥ పొంటియమేమి వరకించి పొఱఁబాటు సేసిన బొందిన్,
నెఱమని గుఱుతింప కెల్ల నేఱములకును గాణయాచి?
పరి తచ్చెద రక్కఱ నెద పాడగుటన్ లోఁద్యాలునన్ ;
కూటవిల్వల కనువుగ దీటుకొన తమ బ్రదిమానమున్ ; 65
తీర్పుఁ డక్కఱ లోదార్పుఁ డెదలు కుదుర్పుఁడు త్యాలులన్ ;
గఱప మానుఁడు కొండికలకుం గల్లవిల్వలమరమున్. 66

**మాటల విడఁదీత (పద విభాగము) :** పొంటియము + ఏమి, వరకించి, పొఱఁబాటు + చేసిన, బొందిన్, నెఱము + అని, గుఱుతింపక + ఎల్ల, నేఱములకును + కాణయాచి, పరి, తచ్చెదరు + అక్కఱన్ + ఎద, పాడు + అగుటన్, లోఁద్యాలునన్, కూట–విల్వలకున్ + అనువుగన్, దీటుకొన,న్ తమ, బ్రదిమానమున్, తీర్పుఁడు + అక్కఱల్ + ఓదార్పుఁడు + ఎదలు, కుదుర్పుఁడు, త్యాలులన్, గఱపన్, మానుఁడు, కొండికలకున్ + కల్ల–విల్వల + అమరమున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** "ఎల్ల నేఱములకును కాణయాచి నెఱము" అని గుఱుతింపక పొఱఁబాటు చేసిన బొందిన్ వరకించి పొంటియము ఏమి? అక్కఱన్, ఎద పాడు + అగుటన్, లోఁద్యాలునన్, తమ బ్రదిమానమున్ కూట-విల్వలకున్ అనువుగన్ దీటుకొనన్ పరి తచ్చెదరు. అక్కఱల్ తీర్పుఁడు. ఎదలు ఓదార్పుఁడు. త్యాలులన్ కుదుర్పుఁడు, కొండికలకున్ కల్ల-విల్వల అమరమున్ గఱపన్ మానుఁడు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పొంటియము = ప్రయోజనము ; వరకించి = శిక్షించి ; బొందిన్ = శరీరమును ; నెఱము = మనస్సు ; కాణయాచి = జన్మస్థానము ; పరి = జనము ; తచ్చెదరు = తప్పు చేసెదరు ; అక్కఱన్ = అవసరములో ; ఎద = హృదయము ; పాడు + అగుటన్ = పాడగుట వలనను ; లోఁద్యాలునన్ = మనోరోగము చేతను ; కూట-విల్వలకున్ = సమాజపు విలువలకు ; అనువుగన్ = అనుగుణముగా ; దీటుకొనన్ = దిద్దుకొనుటకు ; బ్రదిమానమున్ = జీవితమును ; త్యాలులన్ = మనోరోగములను ; గఱపన్ మానుఁడు = నేర్పించుట మానండి ; కొండికలకున్ = చిన్న పిల్లలకు ; కల్ల-విల్వల = తప్పుడు విలువల ; అమరమున్ = వ్యవస్థను.

**లోవాఱిక (తాత్పర్యము) :** "అన్ని నేఱములకును అసలైన పుట్టినిల్లు మనస్సే" నని గుర్తింపకుండ పొఱఁబాటు చేసిన శరీరమును అందుకు శిక్షించి ప్రయోజనమేమి? జనము తప్పులు చేయుటకు 4 ప్రోద్బలములు ఉండును. (1) అవసరములు (2) మనస్సు పాడగుట (అందు వలన ఆవేశము/ ఉద్రేకము) (3) మానసిక వ్యాధి (4) సమాజపు విలువలకు అనువుగా తమ జీవితమును తీర్చి దిద్దుకొనవలె నన్న ఆశ-యము. అందుచేత తప్పులు జరుగకుండవలె నన్న – జనముల అవసరములను తీర్పవలె. కలఁత చెందిన మనస్సులను ఓదార్పవలె. మాన సిక వ్యాధులను గుర్తించి నయము చేయవలె. చిన్నప్పటి నుండి పిల్లలకు తప్పుడు సామాజిక విలువలను నేర్పుట మానవలె.

SUMMARY : What use punishing the body for committing a wrong without recognizing the fact that the mind is the cradle of all guilts? In all, 4 factors lie at the root of all crimes. (1) Needs (2) A disturbed mind (and the resultant emotions) (3) A mental disease (4) The ambition to lead one's life in accordance with social values. For a society free of crime, folks' needs must be met. Disturbed minds need to be consoled. Mental diseases need to be treated on time. Elders should stop inculcating flawed social values in kids.

**నల్వతమ్మిక ॥** తమించి తచ్చినన్ దగు వరకమును దప్పక యౌపొందునది వెనువెంట,
నడిగి దొరతనమువారి కేలనోఁ , ఆయిపరి పెద్దల నొడువు మేరకొ,
లెంబిపెద్దలు మీఁదుపేటినదో, కట్టకంబుల గ్రబులు నేటినదో ;
అసరపడు దానికిఁ దెందేమానము ; అందున నిను-బకుర మెలియ వరకము. 67

**మాటల విడఁదీత (పద విభాగము) :** తమించి తచ్చినన్ + తగు వరకమును + తప్పక + ఔపొందునది వెనువెంటన్ + అడిగి దొరతనము-వారి కేలన్ + ఓ ఆయిపరి పెద్దల నొడువు మేరకున్ + ఒ లెంబి-పెద్దలు మీఁదుపేటినది + ఓ కట్టకంబులన్ గ్రబులు నేటినది + ఓ అసరపడు దానికిన్ + తెందేమానము అందునన్ + ఇను-బకురము + ఎలియ వరకము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తమించి తచ్చినన్ వెనువెంటన్ అడిగి దొరతనము-వారి కేలన్ + ఓ ఆయిపరి పెద్దల నొడువు మేరకున్ + ఒ లెంబి-పెద్దలు మీఁదుపేటినది + ఓ కట్టకంబులన్ గ్రబులు నేటినది + ఓ తగు వరకమును తప్పక ఔపొందునది. అసరపడు దానికిన్ తెందేమానము. అందునన్ + ఎలియ వరకము+ ఇను-బకురము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తమించి = కోరి ; తచ్చినన్ = తప్పు చేసినచో ; తగు వరకమును = సముచిత దండనమును ; ఔపొం దునది = అనుభవింప వలసినది ; దొరతనము-వారి = ప్రభుత్వము వారి ; కేలన్ + ఓ = చేతులలోనో ' ఆయిపరి పెద్దల = ఆవాస పెద్దల యొక్క ; నొడువు మేరకున్ + ఒ = మాట ప్రకారమో ; లెంబి-పెద్దలు = కుటుంబ పెద్దలు ; మీఁదుపేటినది + ఓ = విధించినదో ; కట్టకం

బులన్ = శాస్త్రములలో ; గ్రబులు = పండితులు ; నేటినది + ఓ = నిర్ణయించినదో ; అసరపడు దానికిన్ = వాయిదా పడునట్టి శిక్షలకు ; తెందేమానము = చక్రవడ్డీ ; అందునన్ = అందులోను ; ఇను–బకురము = ఇంకను భయంకరము ; ఎలియ వరకము = భవిష్యద్ దండనము.

**లోవాఱిక (తాత్పర్యము) :** అన్నియు తెలిసి కూడ కావలెనని తప్పు చేసినచో – ఆ చేసినది బట్టబయలుగా చెప్పుకొని ఒప్పుకొని – అందుకు ప్రభుత్వమువారి చేతులలో గానీ, ఆవాస పెద్దల మాట మేరకు గానీ, కుటుంబ పెద్దలు చెప్పినట్లు గానీ, లేదా **పూర్వ శాస్త్రములలో పండితులు సెలవిచ్చిన దాని ప్రకారము గానీ** వెంటనే శిక్షను అనుభవింప వలసినది. ఆలస్యము చేయరాదు, వాయిదా పడ్డ శిక్షలకు చక్రవడ్డీ కట్టఁబడి అవి భవిష్యత్తులో పలురెట్టులు భయంకరముగా అనుభవములోనికి వచ్చును సుమా.

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** (౧) ఆవాస పెద్దలు : తాను నివసించుచున్న పల్లెకు పెద్దలైనవారు.

(౨) చివర చెప్పఁబడినదైనను నాల్గవ ఉపాయమే సర్వోత్తమము. మనిషి తన తప్పులను ఒప్పుకొనఁదగ్గ మహానుభావులు ఎక్కడను లేరు. అందఱును రహస్యముగా దోషులే. పైపెచ్చు తప్పును ఒప్పుకొన్న నాటి నుండి దానిని గుర్తుపెట్టుకొని/ గుర్తుకు తెచ్చి దుష్ప్రచారము చేసి రాజకీయములకు దిగువారే ఉన్నారు.

SUMMARY : If a sin has deliberately been committed with the full knowledge of its gravity, better confess the same and obtain suitable punishment for it at the hands of the government, or the community elders, or the family elders or as per the directives given in the scriptures. The procedure should not be delayed, for a punishment postponed is the punishment aggravated by way of compounded interest.

**దాసానిక ॥** మూఁడుపదుల లోపల ముచ్చటపడి కైకొన్న
నేటులు మస్తరించును దనుం దన వారలనుం
ముత్తరముల దనుకనో మఱి ౨ అంతకు నెక్కుడో ;
తత్తరమున దిగకుమి ముత్తల చేఁబల్కు లేక. 68

**మాటల విడఁదీత (పద విభాగము) :** మూఁడు, పదుల లోపలన్, ముచ్చట–పడి, కైకొన్న, నేటులు, మస్తరించును + తనున్ + తన–వారలన్ + ఉన్, మూఁడు + తరముల దనుకన్ + ఓ, మఱి, అంతకున్ + ఎక్కుడు + ఓ, తత్తరమునన్, దిగకుము + ఇ, ముత్తల, చేఁబల్కు, లేక.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మూఁడు పదుల లోపలన్ ముచ్చట–పడి కైకొన్న నేటులు తనున్ + తన–వారలన్ + ఉన్ మూఁడు + తరముల దనుకన్ + ఓ మఱి అంతకున్ + ఎక్కుడు + ఓ మస్తరించును. ముత్తల చేఁబల్కు లేక తత్తరమునన్ దిగకుము + ఇ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కైకొన్న = తీసికొన్న ; నేటులు = నిర్ణయములు ; మస్తరించును = బంధించును ; ఎక్కుడు + ఓ = ఎక్కువయో ; తత్తరమునన్ = తొందఱపాటుతో ; ముత్తల = అనుభవజ్ఞుల యొక్క ; చేఁబల్కు లేక = సలహా లేకుండ.

**లోవాఱిక (తాత్పర్యము) :** ముప్పదేండ్ల ప్రాయము లోపల నీవు ముచ్చటపడి తీసికొన్న ప్రతి నిర్ణయము నిన్ను మఱియు నీవారిని రాఁబోవు మూఁడు తరముల వరకు గానీ లేదా అంతకన్న ఎక్కువ కాలము గానీ పరిస్థితులకు బందీలుగా మార్చును. కనుక అనుభవజ్ఞుల సలహా–సంప్రదింపులు లేకుండ తొందఱపడి దేనియందును చప్పున దిగవలదు.

SUMMARY : Each call taken by you before you turn 30, is going to hold you and your folks captive of the circumstances for the next 3 generations or even more. Therefore, do not proceed on any matter without soliciting the advice of experienced elders.

**పొన్నిక ॥** "నయమగు" నని సస్కాను గొను లెసకాను ;
"మేలగు" నని తనీవికఁ గాఁబల్కరియు ;
"బాగు సేసెద" నని కలమోపుఁ బ్రెమ్మాటియుఁ ,
"దప్పక మనదే గెలువ" మని బైవాటియు ;
క్రచ్చు మీఁదనె నడచు నిచ్చలు నీ యొలవు. 69

**మాటల విడఁదీత (పద విభాగము) :** నయము + అగున్ + అని, సస్కానున్ + కొనున్, లెసకాను + ఉన్, మేలు + అగున్ + అని, తనీవికన్ + కాఁబల్కరి + ఉన్, బాగు + చేసెదన్ + అని, కలమోపున్ + ప్రెమ్మాటి + ఉన్ + తప్పక, మనది + ఏ, గెలువము + అని, బైవాటి + ఉన్, క్రచ్చు మీఁదన్ + ఎ, నడచున్, నిచ్చలున్ + ఈ + ఒలవు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** నయము అగున్ అని లెసకాను + ఉన్ సస్కానున్ కొనున్. కాఁబల్కరి + ఉన్ మేలు అగున్ అని తనీవికన్ (కొనున్). ప్రెమ్మాటి + ఉన్ బాగు చేసెదన్ అని కలమోపున్ (కొనున్). బైవాటి + ఉన్ తప్పక మనది + ఏ గెలువము అని (సస్కానున్ కొనున్). ఈ ఒలవు నిచ్చలున్ క్రచ్చు మీఁదన్ + ఎ నడచున్ +.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సస్కానున్ = రుసుమును ; కొనున్ = తీసికొనును ; లెసకాను + ఉన్ = వైద్యుఁడు కూడ ; తనీవికన్ = దక్షిణను ; కాఁబల్కరి + ఉన్ = జ్యోతిష్కుఁడు కూడ ; కలమోపున్ = సర్వస్వమును ; ప్రెమ్మాటి + ఉన్ = రాజకీయ నేత కూడ ; గెలువము = విజయము ; బైవాటి + ఉన్ = న్యాయవాది కూడ ; క్రచ్చు మీఁదన్ + ఎ = ఆశ మీఁదనే ; నిచ్చలున్ = ఎల్లప్పుడు ; ఒలవు = లోకము.

**లోవాఱిక (తాత్పర్యము) :** "జబ్బు తప్పక కుదురు" నని చెప్పి వైద్యుఁడు వైద్యకట్నము పుచ్చుకొనును. "అంతా మేలే జరుగు" నని చెప్పి జ్యోతిష్కుఁడు దక్షిణ తీసికొనును. "దేశమును బాగుచేసెద" నని చెప్పి రాజకీయ నేత సర్వస్వమును తన గుప్పిటిలోనికి తెచ్చుకొనును. "ఈ వ్యాజ్యములో మనదే గెలుపు" అనుచు న్యాయవాది కూడ రుసుము రాఁబట్టును. ఇట్లు జనుల ఆశ మీఁదనే ఆనకపడి ప్రపంచము నడచు చున్నది.

SUMMARY : The doctor collects his fee, saying "*You will be alright soon*." The astrologer takes remuneration, assuring the client that his stars augur well for him. The politician takes hold of everything, promising to fix all problems in the country. The lawyer exacts his payment, stressing that it is in deed a winning case. Thus the world runs only on hope.

**సంపంగి ॥** పనిలోఁ జేర్చుకొనకుము బ్రదికి చెడ్డవానిన్ ;
పెనిమిటివి కాకుము మూఁడవ మనువుదానికిన్ ;
కొనకు మెవ్వాఱును డబ్బిచ్చి కొనని యాస్తిన్ ;
కైకొనకుము వెల్లంకి గుసారయిన రోతిన్. 70

**మాటల విడఁదీత (పద విభాగము) :** పనిలోన్ + చేర్చుకొనకుము, బ్రదికి, చెడ్డ–వానిన్, పెనిమిటివి, కాకుము, మూఁడవ, మనువు–దానికిన్, కొనకుము + ఏ + వాఱును, డబ్బు + ఇచ్చి, కొనని + ఆస్తిన్, కైకొనకుము, వెల్లంకి, గుసారు + అయిన, రోతిన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** బ్రదికి చెడ్డ–వానిన్ పనిలోన్ చేర్చుకొనకుము. మూఁడవ మనువు–దానికిన్ పెనిమిటివి కాకుము. ఏ + వాఱును డబ్బు ఇచ్చి కొనని ఆస్తిన్ కొనకుము. వెల్లంకి గుసారు అయిన రోతిన్ కైకొనకుము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పెనిమిటివి = భర్తవు ; ఏ + వాఱును = ఎవఱు గానీ ; కైకొనకుము = తీసికొనకుము ; వెల్లంకి = ఆకరము/ మూలము ; గుసారు + అయిన = నిగూఢమైన ; రోతిన్ = ధనమును.

**లోవాటిక (తాత్పర్యము) :** ఒకప్పుడు బాగుగా బ్రదికి చితికిన వానిని పనిలో పెట్టుకొన వలదు. ఇప్పటికే మూఁడుసారులు పెండ్లి చేసికొన్న స్త్రీని నీవు నాలుఁగవ సారి చేసికొన వలదు. ఎవఱును కొనుటకు ఇష్టపడని ఆస్తిని నీవు తెగించి కొనవలదు. ఎక్కడి నుండి వచ్చినదో తెలి–యని డబ్బును తీసికొన వలదు.

SUMMARY : Do not employ in your service the one who had once seen better days but now fell on bad days. Do not marry a woman for the fourth time who already had three marri–ages. Do not buy a property which no one else has so far dared to buy. Do not accept the mo–ney the source of which is suspect.

**పస్సియ ॥** వలయు మేల్బారు లెవఱివి వారికి ; లెప్పంబులు నెవఱివి వారి, కొకే,
మేల్బారు లెప్పముఁ గూడ దందఱ- కుండదుగా యెల్లఱ కొకే యాలు! 71

**మాటల విడఁదీత (పద విభాగము) :** వలయున్, మేల్బారులు + ఎవఱివి, వారికిన్, లెప్పంబులు + ఉన్ + ఎవఱివి, వారికిన్ + ఒక + ఏ, మేల్బారు + ఉన్, లెప్పము + ఉన్ + కూడదు + అందఱకున్ + ఉండదు, కదా + ఎల్లఱకున్ + ఒక + ఏ + ఆలు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** మేల్బారులు ఎవఱివి వారికిన్ వలయున్. లెప్పంబులు ఉన్ + ఎవఱివి వారికిన్ (వలయున్). అందఱకున్ ఒక + ఏ మేల్బారు + ఉన్ లెప్పము + ఉన్ కూడదు. ఎల్లఱకున్ ఒక + ఏ ఆలు ఉండదు కదా.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వలయున్ = ఉండవలెను ; మేల్బారులు = ఆదర్శములు ; లెప్పంబులు + ఉన్ = లక్ష్యములు కూడ ; కూడదు = పనికిరాదు ; ఆలు = భార్య.

**లోవాటిక (తాత్పర్యము) :** ఎవఱి ఆదర్శమును, లక్ష్యమును వారికి విడిగా ఉండవలెను. అందఱును ఒకే ఆదర్శమును, లక్ష్యమును పెట్టు–కొనుట పనికిరాదు. అందఱికిని కలిపి ఒకే భార్య ఉండదు కదా !

SUMMARY : Folks should have a separate ideal and goal each. It is improper for all people to have the same ideals and goals. Do all have the same wife?

**తామరిక ॥** నీ పని ౨ ఐపడి గాక ముందె నిండు పైకముఁ జెల్లింపకుమీ !
చిన్న మొత్తమైనను ౨ ఎంచక చెప్పకుమీ ముందే నెనరుల్. 72

**మాటల విడఁదీత (పద విభాగము) :** నీ, పని, ఐపడి, కాక, ముందు + ఎ, నిండు, పైకమున్ + చెల్లింపకుము + ఈ,. చిన్న, మొత్తము + ఐనను, ఎంచక, చెప్పకుము + ఇ, ముందు + ఏ, నెనరుల్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....చిన్న మొత్తము + ఐనను ఎంచక ముందు + ఏ నెనరుల్ చెప్పకుము + ఇ. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఐపడి = సమాప్తము/ పూర్తి ; నిండు పైకమున్ = పూర్తి మొత్తము డబ్బును ; ఎంచక = లెక్కపెట్టకుండ ; నెనరుల్ = కృతజ్ఞతలు/ ధన్యవాదములు.

**లోవాటిక (తాత్పర్యము) :** నీ పని పూర్తి చేయనివారికి నిండు మొత్తము డబ్బును చెల్లించవలదు. వేఱేవారు నీకు తిరిగి ఇచ్చినది చిన్న మొత్త–మైనను లెక్కపెట్టుకొనకుండ కృతజ్ఞతలు చెప్పవలదు.

SUMMARY : Do not pay full amount to the ones who did not yet complete doing your work. Do not thank others for giving you money before you count it, no matter however small an amount it is.

**పస్పియ జంట** ॥ కొనువందముల తీర్తేను లెఱుఁగుము ; మారాటకానుల లోర్వులు గనుము :
కొనునపుడే యిమ్ముగఁ జూచి కొనుము ; లాతులకుఁ గూడఁ జూపించి కొనుము ; 73
వేసఱక కనుగొనుము వెలలంతటఁ ; అదనపు వెచ్చంబు లడిగి తెలియుము. 74

**మాటల విడఁదీత (పద విభాగము) :** కొను-వందముల, తీర్తేనులు + ఎఱుఁగుము, మారాటకానుల, లోర్వులు, కనుము, కొను + అపుడు + ఏ + ఇమ్ముగన్ + చూచి, కొనుము, లాతులకున్ + కూడన్ + చూపించి, కొనుము, వేసఱక, కనుగొనుము, వెలలు + అంతటన్, అదనపుం, వెచ్చంబులు + అడిగి, తెలియుము.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ....వేసఱక కనుగొనుము వెలలు + అంతటన్.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కొను-వందముల = కొను వస్తువుల యొక్క ; తీర్తేనులు = లక్షణములు ; మారాటకానుల = అమ్మువారి యొక్క ; లోర్వులు = వివరములు ; కనుము = పరిశీలింపుము ; ఇమ్ముగన్ = చక్కగా ; లాతులకున్ = ఇతరులకు ; వేసఱక = విసుగు జెందకుండ ; అంతటన్ = అన్నిచోటుల ; వెచ్చంబులు = ఖర్చులను గుఱించి.

**లోవాఱిక (తాత్పర్యము) :** వస్తువులను కొనుటకు ముందు — ఆ వస్తువుల లక్షణములను గుఱించి క్షుణ్ణముగా తెలిసికొనుము. వాటిని అమ్మువారల వివరములను కనుగొనుము. నీవొక్కఁడవే చూచుట కాదు. తెలిసిన ఇతరులకు సైతము చూపించి వారి అభిప్రాయమును తీసికొనుము. కొనునప్పుడే బాగుగా పరీక్షించి కొనుము. విసుగు జెందక అన్ని చోటులకు పోయి వెలలను గూర్చి కనుగొనుము. కొనుగోలు వెల కాక ఇంకను అదనపు వ్యయములేమైన పడునేమో అడుగుము.

SUMMARY : Before you buy anything, do know all the features of the articles you propose to buy. Inquire of the details of the sellers. Do not be content with seeing the articles yourself, but also know the opinion of others by showing them. Buy only after properly testing the articles. Do not feel sick of visiting other places and comparing prices. Inquire of the additional costs involved apart from the sale price.

**అవిగింగ** ॥ మాడలు వోసి కొన్న వందముల వాడవలె ;
ఇనుసేఁగి వాడకము కన్న వాడమి వలన,
పని సేయకపోవుఁ , బాడగు, విల్వయు డిందున్,
వ్రేఁకన యగుఁ , దెచ్చిపెట్టు వే కైపదముల్. 75

**మాటల విడఁదీత (పద విభాగము) :** మాడలు + పోసి, కొన్న, వందములన్, వాడన్ వలెన్, ఇనుసేఁగి, వాడకము కన్నన్, వాడమి వలనన్, పని + చేయక-పోవున్ + పాడు + అగున్, విల్వ + ఉన్, డిందున్, వ్రేఁకన + అగున్ + తెచ్చి-పెట్టున్, వే, కైపదముల్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** మాడలు పోసి కొన్న వందములన్ వాడన్ వలెన్. వాడకము కన్నన్ వాడమి వలనన్ ఇనుసేఁగి. (వాడమి వలనన్) వందములు పని చేయక-పోవున్. పాడు అగున్. విల్వ + ఉన్ డిందున్. వ్రేఁకన అగున్. వే కైపదముల్ తెచ్చి-పెట్టున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మాడలు + పోసి = డబ్బులు పోసి ; వందములన్ = వస్తువులను ; ఇనుసేఁగి = ఇంకను నష్టము ; వాడమి వలనన్ = వాడకపోవుట చేత ; విల్వ + ఉన్ = విలువ కూడ ; డిందున్ = క్షీణించును ; వ్రేఁకన + అగున్ = బరువగును ; వే కైపదముల్ = వేయి సమస్యలను.

**లోవాఱిక (తాత్పర్యము) :** మిక్కిలి పైకమును వెచ్చించి కొన్న వస్తువులను చక్కగా వాడుకొనవలెను. వాడకుండ ఊరక దాఁచుకొనుట వలన మేలేమియు జరుగదు సరి కదా, ఇంకను నష్టమే వాటిల్లును. వస్తువులను వాడకపోవుట వలన అవి సరిగా పని చేయవు. లేదా పూర్తిగా

పాడగును. వాటికి విలువ తగ్గిపోవును. (అమ్ముదమన్నచో కొనువారు కూడ దొరుకరు). అవి అనవసరమైన మోపు వలె పరిణమించును. పైపెచ్చు అనేక ఇతరేతర సమస్యలకు సైతము దారిదీయును.

SUMMARY : The articles bought at a cost should be used regularly. You will lose more by keeping them under the lock and key than by using them. Through non-use, they cease to work properly or stop functioning altogether. Their value comes down drastically with no one coming forward to buy them in turn. They create several other problems too besides becoming an unwanted burden.

**తామరిక ||** వాడకుండుత సురాళముగా వణికంబగు వందమునైనను ;
వాడుచుండుత సుతారముగా నేర్చి వందముల వాడకమును ;
పెట్టిన రోఁగారుహొంతలున్ వట్టివాఱు నెల్ల నలిగముల్,
చెట్ట జాఱి వందము సెడినన్ ; గిట్టు రెంచయె కొన్ని సారుల్. 76

**మాటల విడఁదీత (పద విభాగము) :** వాడక + ఉండుతన్, సురాళముగాన్, వణికంబు + అగు, వందమున్ + ఐనను, వాడుచున్ + ఉండుతన్, సుతారముగాన్, నేర్చి, వందముల, వాడకమును, పెట్టిన, రో + కారు + హొంతలు + ఉన్, వట్టివాఱున్ + ఎల్ల, నలిగముల్, చెట్ట, జాఱి, వందము + చెడినన్, గిట్టున్, రెంచ + ఎ, కొన్ని, సారుల్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వణికంబు అగు వందమున్ ఐనను సురాళముగాన్ వాడక ఉండుతన్. వందముల వాడకమును నేర్చి సుతారముగాన్ వాడుచున్ ఉండుతన్. చెట్ట జాఱి వందము చెడినన్ పెట్టిన రో + కారు + హొంతలు + ఉన్ ఎల్ల నలిగముల్ వట్టివాఱున్. కొన్ని సారుల్ రెంచ + ఎ గిట్టున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వాడక + ఉండుతన్ = వాడక ఉండెదరు గాక ; సురాళముగాన్ = నిర్లక్ష్యముగా ; వణికంబు + అగు = ఉచితమైన/ ఊరక వెలపెట్టకుండ వచ్చినటువంటి ; వందమున్ + ఐనను = వస్తువును కూడ ; సుతారముగాన్ = సున్నితముగా ; వాడకమును = వాడునట్టి పద్ధతిని ; రో + కారు + హొంతలున్ = ధన, కాల, శ్రమములు ; వట్టివాఱున్ = దండుగ అగును ; ఎల్ల నలిగముల్ = అన్ని పదార్థములు ; చెట్ట జాఱి = చేయి జాఱి ; చెడినన్ = పాడైనచో ; గిట్టున్ = చనిపోవును ; రెంచ + ఎ = మనిషియె.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఊరకే (ఉచితముగా) వచ్చిన వస్తువునైన సరియే, నిర్లక్ష్యముగా వాడరాదు. వస్తువులను ఎట్లు వాడవలెనో ఆ పద్ధతి సరిగా నేర్చుకొని వాటిని సున్నితముగా ఉపయోగించుకొనవలెను. సరిగా వాడకపోవుట వలన అవి చేయి జాఱినచో/ అదుపు తప్పినచో వాటి ఉత్పత్తి మఱియు కొనుగోలు కోసమై వెచ్చించిన ధనము, కాలము, శ్రమ, పదార్థ సంపత్తి అన్నియు దండుగ అగును. కొన్ని సారులు మనిషి ప్రాణము కూడ పోవును సుమా !

SUMMARY: Even an article which came for free should not be used recklessly. People should learn the correct use of different articles and use them accordingly. All the money, time, labour and resources invested in the production and purchase of those articles will go waste if they go out of hand through misuse. Sometimes it may result in the loss of a human life too.

**అవిగింగ జంట ||** ఔరెంచ లాయిమాడ్కి తా రే సీమలోఁ
ద్రేసులోఁ గొల్వలిలోఁ దఱిలోనఁ బుట్టిన ;
ప్లల్లదుల్ ౨ అటులనే యెల్లఱు నాయిమాడ్కి

యే సీమ-డ్రేసు-గొల్వలి-దఱుల వారైన ; 77

మొదవు కసవు మెసవు నెక్కడ నే తఱినైన ;

వేఁగి మనీకుల కౌసు వైకించును వేన. 78

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఔరెంచలు + ఆయిమాడ్కి, తారు + ఏ, సీమలోన్ + డ్రేసులోన్ + కొల్వలిలోఁన్ + తఱిలోనన్ + పుట్టినన్, ప్రల్లదుల్ + అటులన్ + ఏ + ఎల్లఱున్ + ఆయిమాడ్కి + ఏ సీమ + డ్రేసు + కొల్వలి + తఱుల–వారు + ఐనన్, మొదవు, కసవున్, మెసవున్ + ఎక్కడన్ + ఏ, తఱిన్ + ఐనన్, వేఁగి, మనీకుల, కౌసున్, వైకించును, వేనన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** తారు ఏ సీమలోన్ డ్రేసులోన్ కొల్వలిలోఁన్ తఱిలోనన్ పుట్టినన్ ఔరెంచలు ఆయిమాడ్కి. ఏ సీమ + డ్రేసు + కొల్వలి + తఱుల–వారు ఐనన్ ప్రల్లదుల్ ఎల్లఱున్ అటులన్ + ఏ ఆయిమాడ్కి. ఎక్కడన్ + ఏ తఱిన్ ఐనన్ మొదవు కసవు మెసవున్. (ఎక్కడన్ ఏ తఱిన్ ఐనన్) వేఁగి మనీకుల కౌసున్ వేనన్ వైకించును.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఔరెంచలు = సజ్జనులు/ మంచివారు ; ఆయిమాడ్కి = సదృశము/ ఒకే విధము ; తారు = తాము ; సీమలోన్ = దేశములో ; డ్రేసులోన్ = జాతిలో ; కొల్వలిలోఁన్ = మతములో ; తఱిలోనన్ = కాలములో ; పుట్టినన్ = పుట్టినప్పటికిని ; ప్రల్లదుల్ = దుష్టులు కూడ ; అటులన్ + ఏ = అదే విధముగా ; మొదవు = ఆవు ; కసవున్ = గడ్డిని ; మెసవున్ = తినును ; వేఁగి = పులి ; మనీకుల = జీవుల యొక్క ; కౌసున్ = మాంసమును ; వైకించును = కోరును ; వేనన్ = వేఁటాడుటకై.

**లోవాఱిక (తాత్పర్యము) :** మంచివారు ఏ దేశ–కాలములలో, ఏ జాతి–ధర్మములలో పుట్టినను వారందఱు ఒక్కలాగుననే ఉండెదరు. అదే విధముగా దుర్మార్గులు కూడ ఏ దేశ–కాలములలో, ఏ జాతి–ధర్మములలో పుట్టినను ఒక్కలాగుననే ఉండెదరు. ఆవు ఏ సమయమున ఎక్కడ ఉన్నను గడ్డినే తిని బ్రదుకును. అదే విధముగా పులి కూడ ఏ సమయమున ఎక్కడ ఉన్నను జీవులను వేని (వేఁటాడి) వాటి మాంస–మునే తినఁగోరును.

**వైమాల విడఁబఱ్రు (విశేష వివరణము) :** (౧) మంచివారును, చెడ్డవారును అన్ని దేశ–కాలములలోను, జాతి–ధర్మములలోను ఉండెదరు. వారల మంచి–చెడులకు అవి కారణములు కావు.

(౨) సీమ-డ్రేసు-గొల్వలి-దఱుల-వారు : సమాహార ద్వంద్వపూర్వక తద్ధితాంతము.

SUMMARY : Good people are all similar to each other, no matter where, when and in which race or religion they are born. In the same way, bad people are all similar irrespective of their place, times, race and religion. The cow grazes on grass wherever it lives. Similarly, the tiger wants to hunt other beings for their meat wherever it dwells.

**గోరంటిక॥** "అది ఆడఁ జెప్పణి, యిది యీడఁ జెప్పణి, యా వ్రాతరి మేటి, యీ వ్రాతరి యోటి" ౨

అని యిటు దిగకుము వమ్మొఱపాటలకున్ ; నలుసల్పు లెచ్చు నలుబది నోలులపై. 79

**మాటల విడఁదీత (పద విభాగము) :** అది, ఆడన్ + చెప్పణి + ఇది + ఈడన్ + చెప్పణి + ఆ, వ్రాతరి, మేటి + ఈ, వ్రాతరి + ఓటి, అని + ఇటు, దిగకుము, వమ్ము + ఒఱపాటలకున్, నలు–సల్పులు + ఎచ్చు, నలుబది, నోలులపైన్.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ....అని + ఇటు వమ్ము + ఒఱపాటలకున్ దిగకుము. నలుబది నోలులపైన్ నలు–సల్పులు + ఎచ్చు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఆడన్ = అక్కడ ; చెప్పణి = చెప్పఁబడనిది (అనుక్తము) ; ఈడన్ = ఇక్కడ ; వ్రాతరి = రచయిత ; మేటి = శ్రేష్ఠుఁడు ; ఓటి = డొల్ల ; ఇటు = ఈ విధముగా ; వమ్ము + ఒఱపాటలకున్ = వ్యర్థమైన చర్చలకు ; నలు–సల్పులు = నాలుగు ఆచరణ

ములు ; ఎచ్చు = గొప్ప ; నోలులపైన్ = పుస్తకముల కన్నను.

**లోవాఱిక (తాత్పర్యము) :** "ఈ ముఖ్యమైన అంశము ఈ పుస్తకములో చెప్పఁబడలేదు. ఆ పుస్తకములో చెప్పఁబడలేదు. ఆ రచయిత శ్రేష్ఠుఁడు. ఈ రచయిత లోఁతు లేని వట్టి డొల్ల" ఈ విధముగా పుస్తకములను గూర్చి మఱియు రచయితలను గూర్చి దండుగమారి చర్చ–లకు పూనుకొనకుము. నలుబది పుస్తకములను చదువుట కన్న నాలుగు ఆచరణములు గొప్పవి.

SUMMARY : Do not resort to fruitless debates over books and writers, complaining, "*This matter has not been written in this book or that book. That writer is hallowed and this writer is hollow.*" Practising 4 good principles is greater than reading 40 books.

**చదును పస్సియ** ॥ కావింపఁదగదు కలగాపులగం, బొక్కొక వింగడపుఁ బొసవు మఱొకట ;
సరిపోలిక నగు సరిసాటికములు ; సరిసాటికములఁ గలుగదు తొంటిది. 80

**మాటల విడఁదీత (పద విభాగము) :** కావింపన్ + తగదు, కలగాపులగంబు + ఒక్క + ఒక, వింగడపుం + పొసవున్, మఱి + ఒకటన్, సరిపోలికన్ + అగున్, సరిసాటికములు, సరిసాటికములన్ + కలుగదు, తొంటిది.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒక్క + ఒక వింగడపుం పొసవున్ మఱి + ఒకటన్ కలగాపులగంబు కావింపన్ తగదు. సరిపోలికన్ సరిసాటికములు అగున్. సరిసాటికములన్ తొంటిది కలుగదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కావింపన్ + తగదు = చేయఁగూడదు ; కలగాపులగంబు = మిశ్రము ; ఒక్క + ఒక = ప్రతి ఒక్క ; వింగడపుం + పొసవున్ = వర్గము యొక్క ధర్మమును ; మఱి + ఒకటన్ = మఱియొక దానితో ; సరిపోలికన్ = ఖచ్చితముగా పోలి ఉండుట వలన ; అగున్ = కలుగును ; సరిసాటికములు = సమానత్వములు ; సరిసాటికములన్ = సమానత్వముల వలన ; కలుగదు = ఏర్పడదు ; తొంటిది = మొదట చెప్పఁబడినట్టిది (సరిపోలిక).

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రతి ఒక్క వర్గము యొక్క ధర్మమును మఱియొక వర్గపు ధర్మముతో కలగాపులగము చేయరాదు. ఏ వర్గపు సహజ ధర్మము ఆ వర్గానిదే. అది ఇతరులకు వర్తింపదు. లోకములో ఇద్దఱు అచ్చుమచ్చుగా పోలి ఉండుట వలన వారి నడుమ సమానత్వమేర్ప–డును. పోలికలే లేనివారిని సమానులుగా ప్రకటించినంత మాత్రాన వారి మధ్య పోలికలు ఏర్పడవు కదా!

SUMMARY : The obligations of each section of the society should not be jumbled with those of other sections. Each section has its own organic functions which cannot be assigned to others. Absolute equality comes only through absolute identicality. But identicality cannot be formed by making a formal proclamation of equality.

**అవిగింగ** ॥ చెరిదియు మాటలందుఁ జెప్పనోడును రెంచ ;
అయినను గేరు నటు సెప్పఁజాలని మిగితన్,
"గతన లేదు, సొఱిది లేదు, మూదలి లే" దని ;
మెదల మేవికలే నొడువు, లవి యెఱుక కావు. 81

**మాటల విడఁదీత (పద విభాగము) :** చెరిది + ఉన్, మాటలందున్ + చెప్పన్ + ఓడును, రెంచ, అయినను + కేరున్ + అటు + చెప్పన్ + చాలని, మిగితన్ + కతన, లేదు, సొఱిది, లేదు, మూదలి, లేదు + అని, మెదల–మేవికలు + ఏ, నొడువులు + అవి + ఎఱుక, కావు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** రెంచ చెరిది + ఉన్ మాటలందున్ చెప్పన్ ఓడును. అయినను అటు చెప్పన్ చాలని మిగితన్ "కతన లేదు,

సొఱిది లేదు, మూదలి లేదు" అని కేరున్. నొడువులు మెదల-మేవికలు + ఏ. అవి ఎఱుక కావు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** చెరిది + ఉన్ = ప్రతిదానిని ; చెప్పన్ + ఓడును = చెప్పలేకపోవును ; రెంచ = మనిషి ; కేరున్ = ఎగతాళి చేయును ; అటు = అట్లు/ ఆ విధముగా ; చెప్పన్ + చాలని = చెప్పలేని ; మిగితన్ += తక్కినవారిని ; కతన = తర్కము ; సొఱిది = క్రమము ; మూదలి = నిరూపణము/ రుజువు ; మెదల-మేవికలు + ఏ = భావచిత్రాలే ; నొడువులు = వాక్యములు ; ఎఱుక = జ్ఞానము.

**లోవాఱిక (తాత్పర్యము) :** మానవుఁడు తన మనస్సులో ఉన్న ప్రతి ఒక్కటి మాటలలో చెప్పలేఁడు. కాని తన వలెనె చెప్పలేని ఇతరులను మటుకు, "వారు చెప్పుచున్న దానిలో తర్కము లేదు, క్రమము లేదు, రుజువు లేదు" అని దెప్పును. మాటలు అన్ని భావములను యథా-తథముగా వెలిబుచ్చలేవు కదా ! అవి వడారము భావములకు గీచిన సంకేతాత్మక చిత్రములే తప్ప సాక్షాత్తుగా సమాచారము గానీ జ్ఞానము గానీ కావు.

SUMMARY: Man cannot put every feeling of his in words. Yet he assails others, calling their versions illogical, disorderly and unsubstantiated. Words are neither information nor knowl-edge by themselves. Thay cannot render all thoughts and feelings faithfully, being only ver-bal imageries thereof.

**దాసానిక బారు ||** తన్నొరులు మన్నించునటులే ౨ అగుఁ దాను రెంచ ;
తఱ్ఱిగఁ జూచి తగ్గించి తప్పుడనఁ బాటియే ౨ అంచ?
మంచికుక్కకుఁ బిచ్చికుక్క ౨ అని పేరిడి పిచ్చి-
పిచ్చిగ బాద నది నిక్కముగఁ బిచ్చిదే ౨ అగుఁ గాదా? 82

**మాటల విడఁదీత (పద విభాగము) :** తన్నున్ + ఒరులు మన్నించు + అటులు + ఏ అగున్ + తాను రెంచ తఱ్ఱిగన్ + చూచి తగ్గించి తప్పుడు + అనన్ + పాటి + ఏ అంచన్ మంచి-కుక్కకున్ + పిచ్చి-కుక్క అని పేరు + ఇడి పిచ్చి-పిచ్చిగన్ బాదన్ + అది నిక్కముగన్ + పిచ్చిది + ఏ అగున్ + కాదా.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** రెంచ తన్నున్ ఒరులు మన్నించు + అటులు + ఏ తాను అగున్. తఱ్ఱిగన్ చూచి తగ్గించి అంచన్ తప్పుడు అనన్ పాటి + ఏ? మంచి-కుక్కకున్ పిచ్చి-కుక్క అని పేరు ఇడి పిచ్చి-పిచ్చిగన్ బాదన్ అది నిక్కముగన్ పిచ్చిది + ఏ అగున్ కాదా.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తన్నున్ = తనను ; ఒరులు = ఇతరులు ; మన్నించు + అటులు + ఏ = చూచుకొను తీరుగానే ; రెంచ = మనిషి ; తఱ్ఱిగన్ = నీచముగా ; అనన్ = అనుట ; పాటి + ఏ = న్యాయమా ; అంచన్ = చివరిలో/ చివరికి ; పేరు + ఇడి = పేరుపెట్టి ; నిక్కముగన్ = నిజముగా.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఇతరులు తన్ను ఎట్లు చూచెదరో మనిషి చివరికి అట్లే అగును. ఒక మనిషిని హీనముగా చూచి ఆతనిని/ ఆమెను గూర్చి తక్కువగా మాటలాడి అందుకు వారు తిరగఁబడినచో వారిని తప్పుడు మనుషులు అనుట న్యాయమేనా? ఒక మంచికుక్కకు పిచ్చి కుక్క అని పేరుపెట్టి పిచ్చిపిచ్చిగా కొట్టినచో అది నిజముగానే పిచ్చిదైపోవును గదా?

SUMMARY : Man ultimately becomes the way he is treated by others. Is it right to stigma-tize persons if they rebelled after being treated meanly and abused? Would a good dog not go mad after being called a mad dog and beaten black and blue?

**పస్సియ ||** నెమలి మట్టుకే సిందాడఁజాలు ; కుహువ యొక్కఁడే పాడఁగల్గును ;
వడారము వేపియే కావలుండు ; నెఱవాదులనే సంప్రదించుమా,

చెరి కైకట్టున నెప్పనికైనన్. 83

**మాటల విడఁదీత (పద విభాగము) :** నెమలి మట్టుకున్ + ఏ, సిందు + ఆడన్ + చాలున్, కుహువ + ఒక్కఁడు + ఏ, పాడన్ + కల్గును, వడారము, వేఁపి + ఏ, కావలి + ఉండున్, నెఱవాదులన్ + ఏ, సంప్రదించుము + ఆ, చెరి, కైకట్టునన్ + ఏ + పనికిన్ + ఐనన్.

**చఱమొలి (అన్వయ క్రమము) :** ....చెరి కైకట్టునన్ ఏ పనికిన్ ఐనన్ నెఱవాదులన్ + ఏ సంప్రదించుము + ఆ. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** సిందు + ఆడన్ + చాలున్ = నాట్యమాడఁగల్గును ; కుహువ = కోకిల ; ఒక్కఁడు + ఏ = ఒక్కటే ; వడార ము = కేవలము ; వేఁపి + ఏ = కుక్కయే ; కావలి + ఉండున్ = కాఁపలా ఉండును ; నెఱవాదులన్ + ఏ = నిపుణులనే ; చెరి కైకట్టునన్ = ప్రతి సందర్భములోను.

**లోవాఱిక (తాత్పర్యము) :** నెమలి మాత్రమే నృత్యము చేయును. కోకిలయే శ్రావ్యముగా పాడును. కుక్క మాత్రమే కాఁపలా కాయఁగలదు. ఈ విధముగా ఎవఱు చేయవలసిన పని వారు మాత్రమే చేయఁగలరు. కనుక ఏ సందర్భమున ఏ పనికైనను నిపుణులనే సంప్రదించుము. వారు చెప్పినట్లే చేయుము.

SUMMARY : Only the peacock can dance. Only the cuckoo can sing. Only the dog can stand guard. Thus tasks need to be done only by those who can do them. Therefore, consult only experts for any task on any occasion and do as they advise you.

**దాసానిక ॥** తలకెత్తుకొనకు మొరులు తలపెట్టి సగము సేసి,
తలఁగిపోయిన కెలసమున్ ; తలమాసిన పని ౨ అది ;
త్రోసెదరు నీ మీఁదనె తొలిసగపు వీసరములఁ ,
దుదికానువు నీ పేరనె కుదురై వినఁబడుటన్. 84

**మాటల విడఁదీత (పద విభాగము) :** తలకెత్తుకొనకుము + ఒరులు, తలపెట్టి, సగము + చేసి, తలఁగి–పోయిన, కెలసమున్, తల–మాసిన, పని, అది, త్రోసెదరు, నీ మీఁదన్ + ఎ, తొలి,–సగపుం, వీసరములఁన్ + తుది–కానువు, నీ పేరన్ + ఎ, కుదురు + ఐ, వినన్ + పడుటన్.

**చఱమొలి (అన్వయ క్రమము) :** ఒరులు తలపెట్టి సగము + చేసి తలఁగి–పోయిన కెలసమున్ తలకెత్తుకొనకుము. అది తలమాసిన పని. తుది–కానువు నీ పేరన్ + ఎ కుదురు + ఐ వినన్ + పడుటన్ నీ మీఁదన్ + ఎ తొలి–సగపుం వీసరములఁన్ త్రోసెదరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తలపెట్టి = సంకల్పించి ; తలఁగి–పోయిన = విడిచి వెడలిన ; కెలసమున్ = పనిని ; తలమాసిన పని = తెలివితక్కువ పని ; తొలి–సగపుం = పని యొక్క మొదటి అర్ధభాగమునకు చెందిన ; వీసరములఁన్ = లోపములను ; తుది–కానువు = పని యొక్క అంతిమరూపము ; నీ పేరన్ + ఎ = నీ పేరు మీఁదనే ; కుదురు + ఐ = స్థిరముగా ; వినన్ + పడుటన్ = వినఁబడుట వలన.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఇతరులు సంకల్పించి సగము చేసి వదలిపోయిన పనిని నీవు నడుమ వచ్చి తలకెత్తుకొని చేయవలదు. అది వట్టి తెలివితక్కువ పని. ఎందుకనఁగా పని పూర్తి అయిన తరువాత మొత్తము పని నీ పేరు మీఁదనే ప్రసిద్ధమగును గనుక దాని మొదటి సగ–పాలు నందలి లోటుపాటులకు సైతము నిన్నే బాధ్యుఁడుగా చేసెదరు.

**పైమాల విడఁబఱ్రు (విశేష వివరణము) :** ఈ ముక్క ప్రజల పనులకే తప్ప గత ప్రభుత్వములు మొదలుపెట్టి ఆఁపిన పనులకు వర్తింపదు. వాటిని ఎవఱో ఒకఱు అవశ్యము పూర్తిచేసి తీఱవలె.

SUMMARY : Do not take it upon yourself to finish the works planned and executed in half by others. It is an unwise move, for people will hold you responsible even for the mistakes

made in the first half of the works, as the entire project will be known by your name following its completion.

*(The precept only applies to the private works of the people but not to those started by the previous governments).*

**దాసానిక** ॥ తఱియముగా నైన మఱి తడకారుగా నైనను ౧ ,
ఒల్లకు మొరులు నీ కడ నిల్లడముంచఁగోరిన,
యురువులఁ గొనుటకుఁ ద్రోసిపుచ్చ మోమోటపడకు ;
తేడాలు తప్పక వచ్చు నవి తిరిగిచ్చెడి ౧ అజ్జు. 85

**మాటల విడఁదీత (పద విభాగము) :** తఱియముగాన్ + ఐనన్, మఱి, తడ–కారుగాన్ + ఐనను, ఒల్లకుము + ఒరులు, నీ కడన్ + ఇల్లడము + ఉంచన్ + కోరిన + ఉరువులన్ + కొనుటకున్ + త్రోసి–పుచ్చన్, మోమోట–పడకు, తేడాలు, తప్పక, వచ్చున్ + అవి, తిరిగి + ఇచ్చెడి, అజ్జు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఒరులు నీ కడన్ తఱియముగాన్ ఐనన్ మఱి తడ–కారుగాన్ ఐనను ఇల్లడము ఉంచన్ కోరిన ఉరువులన్ కొనుటకున్ ఒల్లకుము. త్రోసి–పుచ్చన్ మోమోట–పడకు. అవి తిరిగి ఇచ్చెడి అజ్జు తేడాలు తప్పక వచ్చున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తఱియముగాన్ + ఐనన్ = తాత్కాలికముగా గానీ ; మఱి = లేనిచో ; తడ–కారుగాన్ + ఐనను = చిర కాలముగా నైనను ; ఒల్లకుము = ఒప్పుకొనకుము ; ఒరులు = ఇతరులు ; ఇల్లడము + ఉంచన్ + కోరిన = దాఁపుడుగా ఉంచుటకై కోరిన ; ఉరువులన్ = వస్తువులను ; కొనుటకున్ = తీసికొనుటకు ; త్రోసి–పుచ్చన్ = తిరస్కరించుటకు ; మోమోట–పడకు = మొహమాటపడ కుము ; అజ్జు = సమయమున.

**లోవాఱిక (తాత్పర్యము) :** కొంఁది కాలము వరకు గానీ, చాల కాలము వరకు గానీ, ఇతరులు నీ దగ్గర తమ వస్తువులను దాఁచుమని చెప్పి ఇవ్వఁబోయినచో ఒప్పుకొనకుము."నేను తీసికొనను. దాఁపను." అని చెప్పుటకు ఎంతమాత్రమును మొహమాటపడవలదు. ఎందుకనఁగా, వాటిని తరువాత తిరిగి ఇచ్చునప్పుడు వాటి లెక్కలలో తప్పకుండ తేడాలు వచ్చును. అప్పుడు మీ యిద్దఱి నడుమ నేస్తము చెడును.

SUMMARY : Do not consent to keep others' articles in your house either temporarily or for a long time. Be candid about your rejection, because differences will sure arise with respect to the value and count of the articles while returning them.

**చేమంతిక జంట** ॥ హెచ్చుఱా నెళవిండులతో ; వా రిచ్చునదేదియుఁ ,
బుచ్చుకొనవలదు ; నీ మెదలముల వెలిబుచ్చవలదు ;
వారికి విడిది నివ్వకు ; వారింటను నీవుండకు ; 86
తమ మోపిక నీవు తలకెత్తుకొనవలదు ; వారల
పల్కు నమ్మవలదు ; వారితోఁ జిక్కవలదు పోరుల ;
నొసఁగకు వారల కప్పులు ; వలపుఁజెయిదములు తప్పులు. 87

**మాటల విడఁదీత (పద విభాగము) :** హెచ్చుఱా, నెళవిండులతోన్, వార్ + ఇచ్చునది + ఏదియున్ + పుచ్చుకొనన్ వలదు, నీ, మెదలములన్, వెలిబుచ్చన్ వలదు, వారికిన్, విడిదిన్ + ఇవ్వకు, వారి + ఇంటను, నీవు + ఉండకు, తమ, మోపికన్ + ఈవు, తలకున్ + ఎత్తుకొనన్ వలదు, వారల, పల్కున్, నమ్మన్ వలదు, వారితోన్ + చిక్కన్ వలదు, పోరులన్ + ఒసఁగకు, వారలకున్ + అప్పులు, వలపు + చెయిద

ములు, తప్పులు.

**చఱమోలి (అన్వయ క్రమము)** : నెళవిండులతోన్ హెచ్చఱా.... వారితోన్ పోరులన్ చిక్కన్ వలదు. వారలకున్ + అప్పులు ఒసఁగకు. (వారితోన్) వలపు + చెయిదములు తప్పులు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** హెచ్చఱా = జాగ్రత్త ; నెళవిండులతోన్ = అపరిచితులతో ; మెదలములన్ = భావములను ; వెలిబుచ్చన్ వలదు – వ్యక్తము చేయవలదు ; విడిదిన్ = బసను/ వసతిని ; మోపికన్ = బాధ్యతను ; ఈవు = నీవు ; ఒసఁగకు = ఇవ్వకుము ; వలపు + చెయిదములు = ప్రేమచేష్టలు.

**లోవాటిక (తాత్పర్యము) :** అపరిచితులతో జాగ్రత్త సుమా ! వారి దగ్గర నుండి ఏమియు తీసికొనకుము. నీ తలఁపులను వారికి వెల్లడి చేయ–కుము. వారికి నీ ఇంటిలో బస ఇవ్వకుము. వారి ఇంటిలో నీవును బస చేయకుము. వారి బాధ్యత నీవు తీసికొనకుము. వారి మాటలు నమ్మకుము. వారితో గొడవ పడకుము. వారికి అప్పులివ్వకుము, వారితో ప్రేమ–శృంగార చేష్టలు చేయకుము.

SUMMARY : Beware of strangers. Do not accept anything from them. Do not reveal your ideas to them. Do not provide lodgings to them in your house. Do not stay at theirs too. Do not take their responsibility. Do not trust them. Do not involve in a scuffle with them. Do not lend money to them. Do not engage with them in love and romance.

**దాసానిక** ॥ తగులవలదు పోయిపోయి మగువల మగవారల,
తగవుల మగువల తగవులఁ గొండికల తగవులన్,
బేదల తగవులఁ బెద్దల తగవుల నెంతనుఁగులైన ;
పెద్దలును ౨ పిల్ల లగుదురు పిల్లల తగవులచేన్. 88

**మాటల విడఁదీత (పద విభాగము) :** తగులన్ వలదు, పోయి, పోయి, మగువల, మగవారల, తగవులన్, మగువల, తగవులన్ + కొండికల, తగవులన్ + పేదల, తగవులన్ + పెద్దల, తగవులన్ + ఎంత + అనుఁగులు + ఐనన్, పెద్దలు + ఉను, పిల్లల్ + అగుదురు, పిల్లల, తగవులచేన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎంత అనుఁగులు ఐనన్ మగువల మగవారల తగవులన్ మగువల తగవులన్ కొండికల తగవులన్ పేదల తగవులన్ పెద్దల తగవులన్ పోయి పోయి తగులన్ వలదు. పిల్లల తగవులచేన్ పెద్దలు + ఉను పిల్లల్ అగుదురు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తగులన్ వలదు = ఇఱికికొనవలదు ; కొండికల = చిన్నపిల్లల యొక్క ; అనుఁగులు + ఐనన్ = ఆప్తులైనను.

**లోవాటిక (తాత్పర్యము) :** నీకు ఎంత ఆప్తులైనను, ఆడు–మగ నడుమ, చిన్నపిల్లల నడుమ, ఆడువారి నడుమ, పేదల నడుమ, ధనికులును అధికారవంతులును అయినవారి నడుమ చెలరేఁగు గొడవలలో తలదూర్చవలదు. చిన్నపిల్లల గొడవలలో తలదూర్చు పెద్దలు తాము కూడ చిన్నపిల్లలయ్యెదరు.

SUMMARY : Do not interfere in the disputes arising between a couple, among children, among women, among the poor and among the rich and powerful, no matter how close they are to you.

**దాసానిక జంట** ॥ తిమ్మఁడు లే కెఱుఁగనగునె తినల్వియుఁ దినర్దియు?
వారువము లేక యావపాఱునే తేరుసేత?

ఎనుము లెద్దులు లేక మునుపటి సాఁగు సాగెనే?
ఊరవేహి లేక తనవారిఁ గాఁచికొన నగునె? 89
పిట్టల అంతులఁ దట్టెన్ దనకున్ సీకారము ;
పిల్లితల్లి జాలి మెసలి బూసమంత పైలము ;
పసరంబుల రేటలపైఁ బైకెదిగెఁ దా రెంచ ;
పాటియె వాటిఁ బూటము ముప్పు ముక్కమని యెంచ. 90

**మాటల విడఁదీత (పద విభాగము) :** తిమ్మఁడు, లేక + ఎఱుఁగన్ + అగును + ఎ, తినల్వి + ఉన్ + తినర్ది + ఉన్, వారువము, లేక + ఆవ పాఱును + ఎ, తేరు–సేత, ఎనుములు + ఎద్దులు, లేక, మునుపటి, సాఁగు, సాగెన్ + ఏ, ఊర–వేహి, లేక, తన–వారిన్ + కాఁచికొనన్ + అగున్ + ఎ, పిట్టల, అంతులన్ + తట్టెన్ + తనకున్, సీకారము, పిల్లి–తల్లి–జాలి, మెసలి, బూసము + అంత, పైలము, పసరంబుల, రేటల పైన్ + పైకిన్ + ఎదిగెన్ + తాన్, రెంచ, పాటి + ఎ, వాటిన్ + పూటము, ముప్పు, ముక్కము + అని + ఎంచన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తిమ్మఁడు లేక తినల్వియు తినర్దియు ఎఱుఁగనగునె? వారువము లేక తేరు–సేత ఆవపాఱునే? ఎనుములు ఎద్దులు లేక మునుపటి సాఁగు సాగెనే? ఊర–వేహి లేక తన–వారిన్ కాఁచికొననగునె? పిట్టల అంతులన్ తనకున్ సీకారము తట్టెన్. పిల్లి–తల్లి–జాలి మెసలి బూసము అంత పైలము. పసరంబుల రేటలపైన్ రెంచ తాన్ పైకిన్ ఎదిగెన్. వాటిన్ పూటము ముప్పు ముక్కము అని ఎంచన్ పాటియే?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తిమ్మఁడు లేక = కోఁతి లేనిచో ; ఎఱుఁగన్ + అగును + ఎ = తెలియవచ్చునా ; తినల్వి + ఉన్ = తినఁ దగినది మఱియు ; తినర్ది + ఉన్ = తినఁగూడనిది కూడ ; వారువము లేక = గుఱ్ఱము లేనిచో ; ఆవపాఱును + ఎ = తోచునా ; తేరు–సేత = రథమును తయారు చేయుట ; ఎనుములు = దున్నపోఁతులు ; మునుపటి సాఁగు = పూర్వకాలపు వ్యవసాయము ; సాగెన్ + ఏ = జరిగెనా ' ఊర–వేహి లేక = గ్రామసింహము (కుక్క) లేనిచో ; కాఁచికొనన్ = కాఁపాడుకొనుట ; అగున్ + ఎ = అగునా (సాధ్యమగునా) ; అంతులన్ = కలధ్వానముల వలన ; తట్టెన్ = స్ఫురించెను ; తనకున్ = (ఇక్కడ) మానవునికి ; సీకారము = సంగీతము ; మెసలి = ప్రసరించి ; బూసము + అంత = ధాన్యమంతయు ; పైలము = క్షేమము ; పసరంబుల = జంతువుల యొక్క ; రేటలపైన్ = భుజముల మీఁద ; రెంచ = మనిషి ; పాటి + ఎ = న్యాయమా ; వాటిన్ = ఆ జంతువులనే ; పూటము = భారము ; ముప్పు = ప్రమాదకరము ; ముక్కము = భంగము ; ఎంచన్ = భావించుట.

**లోవాఱిక (తాత్పర్యము) :** కోఁతులు కొన్ని కాయగూరలను తినుటను, మఱికొన్నిఁటిని తినకుండ వదలివేయుటను చూచి, ఏది తినఁదగినదో, ఏది కాదో మనిషి తెలిసికొనఁగల్గెను. చుట్టుప్రక్కల గుఱ్ఱములు ఉండుట చేతనే ఒక రథమును తయారు చేసి దానికి వాటిని పూన్చవలె నన్న ఆలోచన మనిషికి కలిగెను. దున్నపోఁతులు, ఎద్దులు ఉండుట చేతనే మనిషి వ్యవసాయము చేయఁగల్గెను. కుక్కను పెంచుకొనుట చేతనే ఆతఁడు తనవారిని శత్రువుల, దొంగల మఱియు జంతువుల బారి నుండి కాఁపాడుకొనఁగల్గెను. పక్షుల కలస్వనములను విని వాటి మాదిరిగా సంగీతమును రూపొందించుకొనెను. పిల్లిని పెంచుకొని దాని దయతో ఎలుకల బారి నుండి తన దిగుబడిని (పంటలను) క్షేమ ముగా దాఁచుకొనఁగల్గెను. ఈ విధముగా మనిషి అడుగడుగున జంతువుల భుజముల మీఁదనే ఎక్కి నాగరికతను నిర్మించుకొనెను. ఇప్పు–డదే జంతువులను గూర్చి ఆర్థికముగా బరువనియు, ప్రమాదకరమనియు, తనకు ఏకాగ్రతాభంగమనియు తలఁచుట న్యాయమేనా?

SUMMARY : Man was able to know what to eat and what not to by observing monkeys. He was able to make a chariot just because of the presence of horses around. He could engage in agriculture only with the help of buffaloes and oxen. He succeeded in safeguarding his folks from the menace of thieves and enemies only because he reared the dog. He created music with the inspiration drawn from the sounds of birds. H reared the cat and saved his produce

from the rat menace by her grace. Thus, man stood on the shoulders of animals at every stage and built the civilization. Now is it fair to dub the same animals as a burden, a risk and a disturbance?

**వాణిద** ॥ మనవారైనను లాతులైన మఱి యెవ్వారైనన్,
దీవింపవలయు నిండెదఁ గూర్మి నెనసిన జంటలన్ ;
ఊరకుంద మట్లు మనము గావింపలేని యెడలన్ ;
ఏవారి మనిమి వారిది ; మనకెందుకు వీరి జోలి? 91

**మాటల విడఁదీత (పద విభాగము) :** మన–వార్ + అయినను, లాతులు + ఐనన్, మఱి + ఏ + వార్ + ఐనన్, దీవింపన్ వలయున్, నిండు + ఎదన్ + కూర్మిన్ + ఎనసిన, జంటలన్, ఊరకుందము + అట్లు, మనము, కావింపన్ లేని + ఎడలన్, ఏ–వారి, మనిమి, వారిది, మనకున్ + ఎందుకున్, వీరి, జోలి.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కూర్మిన్ ఎనసిన జంటలన్ మన–వార్ అయినను లాతులు ఐనన్ మఱి ఏ + వార్ ఐనన్ నిండు ఎదన్ దీవింపన్ వలయున్. అట్లు మనము కావింపన్ లేని ఎడలన్ ఊరకుందము. ఏ–వారి మనిమి వారిది. మనకున్ వీరి జోలి ఎందుకున్?

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** లాతులు = ఇతరులు ; నిండు + ఎదన్ = హృదయపూర్వకముగా ; కూర్మిన్ = ప్రేమతో ; ఎనసిన = ఏకమైన ; కావింపన్ లేని + ఎడలన్ = చేయలేనిచో ; ఏ–వారి మనిమి వారిది = ఎవఱి బ్రదుకు వారిది ; వీరి జోలి = ఈ ప్రేమికుల ప్రసక్తి.

**లోవాఱిక (తాత్పర్యము) :** మనవారైనను, బయటివారైనను, ఇంకెవత్తైనను ప్రేమతో ఏకమైన జంటలను హృదయపూర్వకముగా దీవింప–వలెను. అట్లు దీవించుటకు మనస్సు రానిచో నోరు మూసికొని ఊరకుందము. అంతే తప్ప వారిని తిట్టుట, కొట్టుట, చంపుట, వేఱే విధముగా నష్టపఱచుట పనికిరాదు. మిగితావారి విషయములో ఎవఱి జీవితము వారిది. అటువంటప్పుడు ప్రేమికుల జీవితములో మాత్రము మనకు జోక్యమెందుకు?

SUMMARY : The love couples who were joined in a matrimony need to be blessed heartily. Let's keep quiet if we do not feel like blessing them. But we should not scold, beat, kill or damage them. In others' case, to each his own life. Then why should we specially meddle with lovers' lives?

**సంపంగివాలు జంట** ॥ ఈఁద యిది యెవఱు పీల్ప వచ్చెనో మన వరకు?
ఈడ మబ్బు లేడ నీరుఁ ద్రావెనో గుటుకు గుటుకు?
నిలచిన నేల దిగువ నెవఱి మేనులున్నవో?
నీ యెఱుకలన్నియుఁ గడఁగి నీవే కనుగొన్నవో? 92
మారాడక కైకొనుత మంచి యేడ నున్నన్ ;
కొల్వలిద్రేసులు వల్వవు కొఱవా నెడాటములన్. 93

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఈఁద + ఇది + ఎవఱు, పీల్పన్, వచ్చెన్ + ఓ, మన వరకున్, ఈడ–మబ్బులు + ఏడన్, నీరున్ + త్రావెన్ + ఓ, గుటుకు–గుటుకు, నిలచిన, నేల దిగువన్ + ఎవఱి, మేనులు + ఉన్నవి + ఓ, నీ + ఎఱుకలు + అన్ని + ఉన్ + కడఁగి, నీవు + ఏ, కనుగొన్నవి + ఓ, మారు + ఆడక, కైకొనుతన్, మంచి + ఏడన్ + ఉన్నన్, కొల్వలి– త్రేసులు, వల్వవు, కొఱవాన్, ఎడాటములన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఈఁద ఇది ఎవఱు పీల్పన్ మన వరకున్ వచ్చెనో. ఈడ మబ్బులు ఏడన్ నీరున్ గుటుకు–గుటుకు త్రావెనో.

నిలచిన నేల దిగువన్ ఎవఱి మేనులు ఉన్నవో. నీ ఎఱుకలు అన్నియున్ కడఁగి నీవే కనుగొన్నవో. మంచి ఏడన్ ఉన్నన్ మారు ఆడక కైకొనుతన్. కొఱవాన్ ఎడాటములన్ కొల్వలి– త్రేసులు వల్వవు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఈఁద + ఇది = ఈ గాలి ; పీల్పన్ = పోల్వఁగా ; ఈడ–మబ్బులు = ఇక్కడి మేఘాలు ; ఏడన్ = ఎక్కడ ; నేల దిగువన్ = భూమి క్రింద ; మేనులు = శరీరములు ; ఎఱుకలు = జ్ఞానములు ; కడఁగి = ప్రయత్నించి ; మారు + ఆడక = ఎదురు మాటలాడకుండ ; కైకొనుతన్ = స్వీకరించెదవు గాక ; కొల్వలి– త్రేసులు = మతము మఱియు జాతి ; వల్వవు = వద్దు ; కొఱవాన్ = ప్రయోజనకరమైన ; ఎడాటములన్ = విషయములలో.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఇక్కడ మనము పీల్చుచున్న గాలి ఎవఱు (ఏ మతస్థులు, ఏ దేశస్థులు, ఏ జాతీయులు) పీల్చిన పిమ్మట ఇక్కడకు వచ్చినదో కదా ! ఇక్కడ కురియుచున్న మేఘములు ఎక్కడి నీటిని గుటకలు వేసి వచ్చినవో కదా ! ఇక్కడ మనము నిలఁబడ్డ చోట భూమి లో ఎవఱి (ఏ మతస్థుల/ జాతీయుల) శరీరములు పాఁతిపెట్టఁబడి ఉన్నవో కదా ! నీకు తెలిసిన జ్ఞానమంతయు నీవే కనుగొన్నదా? లేక ఇతరులు (ఇతర మతస్థులు మఱియు ఇతర జాతులవారు) కనుగొనఁగా నీవు నేర్చుకొంటివా? అందుచేత నేస్తమా ! ఉపయోగ కరమైన విషయములందు మతము, జాతి మున్నగు ప్రసక్తులను తేవలదు. మంచి ఎక్కడ ఉన్నను, ఎవఱి వద్ద ఉన్నను వారి మతమును, జాతిని చూడకుండ స్వీకరించుము,

SUMMARY : Whose breath could be the air blowing here? Where could these clouds have drunk water to rain the same here? Whose bodies could have been buried under the ground that we stand on now? Is it yourself who discovered all the body of knowledge in your posse–ssion? Or did you learn it after someone discovered it for you? Therefore, my friend ! Do not bring forth the topics of caste and creed in useful matters. Accept good from anywhere with–out caring about the caste and creed of its source.

**అవిగింగ ||** తారివానుల చెంత దరివల్కరుల చెంతఁ ,
బ్రోపోరు చెంత మఱి పాటియోరు చెంతను ౨ ,
ఒప్పందకాను కడ వియ్యపు వారి తోడ,
నడుగకయే మాటలాడరా దదనముగాన్. 94

**మాటల విడఁదీత (పద విభాగము) :** తారివానుల చెంతన్, దరివల్కరుల చెంతన్ + ప్రోపోరు చెంతన్, మఱి, పాటియోరు చెంతను, ఒప్పందకాను కడన్, వియ్యపు–వారి తోడన్ + అడుగక + ఏ, మాటలు + ఆడరాదు + అదనముగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....అడుగక + ఏ అదనముగాన్ మాటలు + ఆడరాదు. (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తారివానుల చెంతన్ = యజమానుల దగ్గర ; దరివల్కరుల చెంతన్ = గురువుల దగ్గర ; ప్రోపోరు చెంతన్ = పోలీసువారి దగ్గర ; మఱి = ఇంకను ; పాటియోరు చెంతను = న్యాయ వ్యవస్థ దగ్గర ; ఒప్పందకాను కడన్ = ఒప్పందమునకు వచ్చువాని దగ్గర ; వియ్యపు–వారి కడన్ = అవతలి పెండ్లివారి దగ్గర.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఇప్పుదున్న/ కాఁబోవు యజమానుల దగ్గర, గురువుల దగ్గర, పోలీసువారి దగ్గర, న్యాయవ్యవస్థ దగ్గర, నీతో ఒప్పందము చేసికొనఁబోవుచున్నవాని దగ్గర మఱియు అవతలి పెండ్లివారి దగ్గర — వారు అడుగకుండనే వివరములను చెప్పుచు అధిక ప్రసంగము చేయరాదు.

SUMMARY : Do not talk overly by divulging the details unasked for, when you are with your present/ prospective paymasters, the police, the judiciary, the agreement party and the

folks on the fiancé's side/ fiancée's side.

**పొన్నిక** || ఔపొందవలసి యుండు నటుపైన మూఁడు,
తరమ్ముల వరకు లెంబిపెద్ద తప్పులకున్ ;
వందలాదేండ్లు తేని పొఱఁబాటులకున్ ;
వేలాది యేండ్లు కోవాను డొగరులకున్. 95

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఔపొందన్ వలసి + ఉండున్ + అటు-పైనన్, మూఁడు ,తరమ్ముల వరకున్, లెంబి-పెద్ద-తప్పులకున్, వందలాది + ఏండ్లు, తేని, పొఱఁబాటులకున్, వేలాది + ఏండ్లు, కోవాను-డొగరులకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** లెంబి-పెద్ద తప్పులకున్ అటు-పైనన్ మూఁడు తరమ్ముల వరకున్ ఔపొందన్ వలసి ఉండున్. తేని పొఱఁబాటులకున్ వందలాది ఏండ్లు (ఔపొందన్ వలసి ఉండున్). కోవాను-డొగరులకున్ వేలాది ఏండ్లు (ఔపొందన్ వలసి ఉండున్).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఔపొందన్ వలసి + ఉండున్ అనుభవింప వలసి ఉండును ; అటు-పైనన్ = ఆ తరువాత ; లెంబి-పెద్ద తప్పులకున్ = కుటుంబ పెద్ద చేసిన తప్పులకు ; తేని పొఱఁబాటులకున్ = పరిపాలకుని పొఱఁబాటులకు ; కోవాను-డొగరులకున్ = మత స్థాపకుల తప్పిదములకు.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక కుటుంబపెద్ద తప్పు చేసినచో దాని ప్రభావము ఆ వంశము మీఁద ఆ తరువాత మూఁడు తరముల వరకు ఉండును. ఒక పరిపాలకుఁడు చేసిన దాని ప్రభావము వందలాది సంవత్సరాల పాటు ఉండును. ఒక మతస్థాపకుఁడు చేసిన దాని ప్రభా-వమును కొలఁది వేల సంవత్సరముల పాటు అనుభవింప వలసి ఉండును.

SUMMARY : Three generations of posterity will be affected for the fault of a family-head. A nation will be affected for a few centuries for the fault of a ruler. All are affected for thou-sands of years for the fault of a religious guru.

**పొన్నిక** || ఆస్తి గారు మదుపు గారు కొడుకుఁగూఁతులు ; విచ్చుతానుకలు వారు వేఱు మనీకులు ;
కాంచరులు పన్నిదు లాలనారులుగా ; కడమాల్ మణియము వారిపైఁ గలుగదుగా. 96

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఆస్తి, కారు, మదుపు, కారు, కొడుకు + కూఁతులు, విచ్చు-తానుకలు, వారు, వేఱు, మనీకులు, కాంచరులు, పన్నిదులు + ఆలనారులుగాన్, కడమాల్, మణియము, వారిపైన్ + కలుగదు, గా.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కొడుకు + కూఁతులు ఆస్తి కారు. మదుపు కారు. వారు విచ్చు-తానుకలు వేఱు మనీకులు. ఆలనారులు గాన్ కాంచరులు పన్నిదులు. వారిపైన్ కడమాల్ మణియము కలుగదు గా.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** విచ్చు-తానుకలు = స్వతంత్ర ఆత్మలు ; వేఱు మనీకులు = వేఱే జీవులు ; కాంచరులు = తల్లిదండ్రులు ; పన్నిదులు = నియమితులు ; ఆలనారులుగాన్ = చూచుకోలరులుగా ; కడమాల్ = అనంతమైన ; మణియము = అధికారము.

**లోవాఱిక (తాత్పర్యము) :** కన్నబిడ్డలు తల్లిదండ్రుల యొక్క ఆస్తులు గానీ మదుపు (పెట్టుబడి) గానీ కారు. వారు తల్లిదండ్రుల కన్న వేఱైన స్వతంత్ర ఆత్మలు. వారు ఎవఱో వేఱే జీవులు. ఇప్పుడు ఈ తల్లిదండ్రుల కడకు వచ్చినారు. వారిని ప్రేమగా చూచుకొనుటకై ఇప్పుడు ఈ తల్లి దండ్రులు భగవంతుని చేత నియమించఁబడినారు. కనుక పిల్లల మీఁద తల్లిదండ్రులకు అనంతమైన అధికారము లేదు. పరిమిత అధికా-రము మాత్రమే కలదు.

**పైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** పిల్లల జీవితములో ప్రతి విషయమునందును తల్లిదండ్రులు కలుగఁజేసికొనుట సరికాదని భావము.

SUMMARY : Children are neither assets not investments of their parents, but only independent souls and that fact makes those beings distinct from their present parents. Their parents have been appointed by God as their caretakers now. So parents have no unlimited powers over their children.

**దాసానిక** ॥ దక్కుడు దక్కు డనుచుఁ బ్రెక్కు లెక్కలేయనేల?
అక్కఱలకు మించి చిక్కిన దంతయు దక్కుడే ;
అక్కఱలకు తగ్గిన దంతయుఁ జెడ్డ సేఁగియే ;
వడారము దాఁచుకొనుటకై దోచుకొనవలవదు ;
నీ దక్కు డొరుల బొక్కుడుగా నెసమారరాదు. 97

**మాటల విడఁదీత (పద విభాగము) :** దక్కుడు, దక్కుడు + అనుచున్ + ప్రెక్కు, లెక్కలు + ఏయన్ + ఏల, అక్కఱలకున్, మించి, చిక్కినది + అంత + ఉన్, దక్కుడు + ఏ, అక్కఱలకున్, తగ్గినది + అంత + ఉన్ + చెడ్డ, సేఁగి + ఏ, వడారము, దాఁచుకొనుటకై, దోచుకొనన్ వల వదు, నీ, దక్కుడు + ఒరుల, బొక్కుడుగాన్ + ఎసమారన్ రాదు.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** దక్కుడు = లాభము ; అక్కఱలకున్ = అవసరములకు ; సేఁగి + ఏ = నష్టమే ; వడారము = కేవలము ; ఒరుల బొక్కుడుగాన్ = ఇతరులను భక్షించుట వలె ; ఎసమారన్ రాదు = పరిణమించఁగూడదు.

**లోవాఱిక (తాత్పర్యము) :** లాభము, లాభము అనుచు రకరకాల లెక్కలు వేసి అయోమయపడుట ఎందుకు? అవసరముల కన్న పెచ్చుగా వచ్చిపడినది అంతయు లాభమే. అవసరముల కన్న తక్కువైనది అంతయు నష్టమే. లాభముల పేరుతో విపరీతముగా దాఁచుకొనుట దోచు కొనుటకు దారితీయును. అట్లు చేయవలదు. నీ లాభార్జనము ఇతరులను మ్రింగివేయుటగా పరిణమించరాదు.

SUMMARY : Why get confused by making various calculations of profit? All that earned in excess of one's needs is verily profit. All that earned below one's needs is verily loss. Hoarding money in excess will lead to exploitation. Your profits should not gobble up others.

**అవిగింగ** ॥ ఒండు-రెండు-మూఁడు పదిగమ్ముల వెనుకకుం,
దలపోయును బడుచువాఁడట్లు నొక్కొక్కడు ;
త్రెవలుం ద్రేసులు నూఱంగుల వెనుకకున్ ;
సీమలుఁ గొల్వళ్లు వేయంగుల వెనుకకున్ ;
కలుగ రెటనుం గటిక జరుమానపు బ్రదివానులు. 98

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒండు–రెండు–మూఁడు, పదిగమ్ముల, వెనుకకున్ + తలపోయును + పడుచువాఁడు + అట్లున్ + ఒక్క + ఒక్కడున్, త్రెవలన్ + త్రేసులున్, నూఱంగుల, వెనుకకున్, సీమలున్, కొల్వళ్లున్, వేయంగుల, వెనుకకున్, కలుగరు + ఎటన్ + ఉన్ + కటిక, జరుమానపుం, బ్రదివానులు.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** ఒక్కొక్కడున్ పడుచువాఁడు + అట్లున్ ఒండు–రెండు–మూఁడు పదిగమ్ముల వెనుకకున్ + తలపోయును. త్రెవలన్ త్రేసులున్ నూఱంగుల వెనుకకున్ (తలపోయును). సీమలున్ కొల్వళ్లున్ వేయంగుల వెనుకకున్ (తలపోయును). కటిక జరుమానపుం బ్రదివానులు ఎటన్ + ఉన్ + కలుగరు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** పదిగమ్ముల వెనుకకున్ = దశాబ్దముల వెనుకకు ; తలపోయును = ఆలోచించును ; ఒక్క + ఒక్కడున్ = ప్రతివాఁడును ; త్రెవలన్ = కులములును ; త్రేసులున్ = జాతులును ; నూఱంగుల వెనుకకున్ = శతాబ్దముల వెనుకకు ; సీమలున్ = దేశములును ; కొల్వళ్లున్ = మతములును ; వేయంగుల వెనుకకున్ – సహస్రాబ్దముల వెనుకకు ; కలుగరు = పుట్టరు/ ఉండరు ; ఎటన్ + ఉన్ = ఎక్కడ నైనను ; కటిక జరుమానపుం బ్రదివానులు = వట్టి వర్తమానములోనే బ్రదికెడి వారు. .

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రతివాఁడును తన యొక్క ప్రస్తుత వయస్సున కంటె పదేండ్లో, ఇరువదేండ్లో, ముప్పదేండ్లో చిన్నవాఁడైనట్లు పడుచుగా ఆలోచించుచుండును. కులములు మఱియు జాతులు వందలాది ఏండ్ల నాటి మనస్తత్త్వముతో ఆలోచించును. మతములు మఱియు దేశములు వేలాది ఏండ్లనాటి వైఖరితో ఉండును. ఈ లోకములో పూర్తిగా వర్తమాన కాలములోనే జీవించువా రెవఱును దొరుకరు.

SUMMARY : Everyone thinks as if he is younger by one or two or three decades than his current age. Castes (tribes) and races think backwards by centuries. Countries and religions think backwards by a few millennia. Thus, you find no one living in the absolute present any where in the world.

**తామరిక॥** కాంచియు గుఱుతెఱుఁగ నోడెదరు కనులారఁ బేరెంచల నెపుడు ;
ఎవఱో తెలుప నెవఱో వ్రాయ నెగఁబడి కొల్తురు బైజటులన్ ;
బ్రదివానుల లోటుపాటులన్ వసిలి పట్టదు వారి వాసిమి ;
ఱాల నెల్లఱు గుఱుతుపట్టెద, రక్కఱ నేర్పు రవాయిలకే. 99

**మాటల విడఁదీత (పద విభాగము) :** కాంచి + ఉన్, గుఱుతు + ఎఱుఁగన్ + ఓడెదరు, కనులారన్ + పేరెంచలన్ + ఎపుడున్, ఎవఱు + ఓ, తెలుపన్ + ఎవఱు + ఓ, వ్రాయన్ + ఎగఁబడి, కొల్తురు, బైజటులన్, బ్రదివానుల, లోటు–పాటులన్, వసిలి, పట్టదు, వారి, వాసిమి, ఱాలన్ + ఎల్లఱున్, గుఱుతు–పట్టెదరు + అక్కఱ, నేర్పు, రవాయిలకే.

**చఱిమోలి (అన్వయ క్రమము) :** కనులారన్ కాంచి + ఉన్ ఎపుడున్ పేరెంచలన్ గుఱుతు ఎఱుఁగన్ ఓడెదరు. ఎవఱు + ఓ తెలుపన్ ఎవఱు + ఓ వ్రాయన్ ఎగఁబడి బైజటులన్ కొల్తురు. బ్రదివానుల లోటు–పాటులన్ వసిలి వారి వాసిమి పట్టదు. ఱాలన్ ఎల్లఱున్ గుఱుతు–పట్టెదరు. రవాయిలకే నేర్పు అక్కఱ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కాంచి + ఉన్ = చూచి కూడ ; గుఱుతు + ఎఱుఁగన్ + ఓడెదరు = తెలిసికొనలేక పోయెదరు ; పేరెంచలన్ = మహనీయులను ; తెలుపన్ = తెలుపఁగా ; వ్రాయన్ = వ్రాయఁగా ; కొల్తురు = ఆరాధిచెదరు ; బైజటులన్ = అజ్ఞాతులను ; బ్రదివానుల = బ్రదికి ఉన్నవారి యొక్క ; లోటు–పాటులన్ వసిలి = లోపములు తప్ప ; వాసిమి = ఘనత ; అక్కఱ = అవసరము ; నేర్పు = నైపుణ్యము ; రవాయిలకే = వజ్రములకే.

**లోవాఱిక (తాత్పర్యము) :** ప్రతి దినము మహనీయులను చూచుచు కూడ వారు మహనీయులన్న సత్యమును జనము తెలిసికొనలేరు. తామెప్పుడును చూడని వారిని గుఱించి ఎవఱో తెలుపఁగా వ్రాయఁగా ఆరాధించుట మొదలుపెట్టెదరు. బ్రదికి ఉన్నవారిలో లోపములే తప్ప వారి గొప్పతనము జనమునకు పట్టదు. ఱాళ్ళను అందఱు గుర్తుపట్టఁగలరు. కాని వజ్రములను గుర్తుపట్టి వెలకట్టుటకే కదా ప్రత్యేక నైపుణ్యము కావలసినది

SUMMARY : Folks cannot identify great souls even after seeing them daily. However they begin to venerate unknown personalities if someone writes or speaks about them. It is only the defects but not the greatness of the living souls that catches their attention. Anyone can identify stones. But special skill is needed to identify and evaluate diamonds.

**అడిగోరంటిక జంట** || అది లాహయే ; వారు వేల్పుజేజులే ; అది కోవా, అందటికి వారు మోజులే ;
అయిన నచ్చుట నీకేమిటి మేల్తనము ౨ , అడుగడుగున జరుగుచున్నప్పుడు బన్నము? 100
ఎవ్వఱు నాలకింపనప్పుడు కొంచెము, ని న్నాకళించుకొనకున్నఁ బరతెంచుము ;
అది బిస్తయె ; వారు డగరేల్రెంచలే ; అది చీపేఱు, మఱువర్ది పాడుకలయే. 101

**మాటల విడఁదీత (పద విభాగము) :** అది, లాహ + ఏ, వారు, వేల్పు–జేజులు + ఏ, అది, కోవాఱు + అందటికిన్, వారు మోజులు + ఏ, అయినన్ + అచ్చటన్, నీకున్ + ఏమిటి, మేల్తనము, అడుగు + అడుగునన్, జరుగుచున్ + ఉన్న + అప్పుడు, బన్నము, ఎవ్వఱున్ + ఆలకింపని + అప్పుడు, కొంచెమున్, నిన్నున్ + ఆకళించుకొనక + ఉన్నన్ + పరతెంచుము, అది, బిస్త + ఎ, వారు, డగర + ఏల్రెంచలు + ఏ, అది, చీపేఱు, మఱువర్ది, పాడు–కల + ఏ.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....అయినన్ అడుగు + అడుగునన్ బన్నము జరుగుచున్ + ఉన్నప్పుడు అచ్చటన్ నీకున్ ఏమిటి మేల్తనము?.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** లాహ + ఏ = స్వర్గమే ; వేల్పు–జేజులు + ఏ = దేవ–దేవతలే ; కోవాఱు = నందన వనము ; మోజులు + ఏ = మోహింపఁదగినవారే ; అయినన్ = కాని ; మేల్తనము = ప్రయోజనము ; బన్నము = అవమానము ; ఆలకింపని + అప్పుడు = శ్రద్ధగా విననప్పుడు ; కొంచెమున్ = కొంచెము కూడ ; ఆకళించుకొనక + ఉన్నన్ = అర్థము చేసికొనకుండ ఉన్నచో ; పరతెంచుము = పాఱి పోవుము ; బిస్త + ఎ = నరకమే ; డగర + ఏల్రెంచలు + ఏ = భూతములు మఱియు రాక్షసులే ; చీపేఱు = వైతరిణీ నది ; మఱువర్ది = మఱువరాని ; పాడు–కల + ఏ = దుఃస్వప్నమే.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఒక చోటు స్వర్గమే కావచ్చును. అక్కడివారు దేవ–దేవతలే కావచ్చును. అది నందన వనమే కావచ్చును. వార–న్నచో అందటికి మోజు, ఆరాధనాభావము ఉండవచ్చును. కాని నీకు మట్టుకు అక్కడ అడుగడుగున అవమానములే ఎదురగుచున్నచో నీకు ఆ ప్రదేశము వలని ప్రయోజనమేమి? అక్కడ నీ మాటలు ఎవఱును వినిపించుకొననప్పుడు, నిన్ను ఎవఱును అర్థము చేసికొననప్పుడు వెంటనే అక్కడి నుండి పాఱిపొమ్ము. అది స్వర్గము కాదు, నరకమే. వారు దేవతలు కారు, భూతములు మఱియు రాక్షసులే. అది నందన వనము కాదు. వైతరిణీ నదియే. అది మోహింపఁదగినది కాదు. ఒక భయంకరమైన పీడకలయే.

SUMMARY : A particular place may be heavenly and its denizens, like gods and goddesses about whom folks go crazy. But what use it is, if you only encounter humiliations at every turn there? Better flee that place if no one there listens to your words, nor undertsands you properly. It is no heaven, but only a veritable hell. They are no gods but only demons. It is no crazy place but only a nightmare.

**అవిగింగ** || తెలిసినను లేకున్న వాడినను లేకున్న,
హుళకి కొఱగాని యిమ టొక్కటియు రెమ్మేనఁ ,
స్రగ్గింపఁగూడ దూరక కూడదు వ్రప్పన్,
సమాబ్రదిమి మల్క తలయెత్తిననె తప్పన్. 102

**మాటల విడఁదీత (పద విభాగము) :** తెలిసినను, లేక + ఉన్నన్, వాడినను, లేక + ఉన్నన్, హుళకి, కొఱ + కాని + ఇమట + ఒక్కటి + ఉన్, రెంచ + మేనన్, స్రగ్గింపన్ + కూడదు + ఊరక, కూడదు, వ్రప్పన్, సమా–బ్రదిమి–మల్క, తల + ఎత్తినన్ + ఎ, తప్పన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తెలిసినను లేక ఉన్నన్ వాడినను లేక ఉన్నన్ కొఱ కాని ఇమట ఒక్కటి + ఉన్ రెంచమేనన్ హుళకి. సమా–బ్రదిమి–మల్క తల ఎత్తినన్ + ఎ తప్పన్ (ఇమట ఒక్కటి + ఉన్) ఊరక స్రగ్గింపన్ కూడదు. వ్రప్పన్ కూడదు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** హుళకి = శూన్యము (లేదు) ; కొఱ + కాని = నిరుపయోగమైన ; ఇమట = అవయవము ; రెంచ + మేనన్ = మానవ శరీరములో ; స్రగ్గింపన్ + కూడదు = తగ్గింపరాదు ; ఊరక = అనవసరముగా ; కూడదు వ్రప్పన్ = ఛేదింపరాదు (నరుక రాదు) ; సమా–బ్రదిమి–మల్క = చావుబ్రదుకుల ప్రశ్న.

**లోవాఱిక (తాత్పర్యము) :** శరీరములో ఏ అవయవము దేనికి ఉపయోగపడునో, ఎట్లు పని చేయునో మనకు సరిగా తెలియక పోవచ్చును. దానిని మనము ఉపయోగించుకొనక పోవచ్చును. అంతమాత్రమున ఆ అవయవము నిరుపయోగమని తలవరాదు. ఆ మనిషికి ఆ అవ–యవము వలన చావు–బ్రదుకుల సమస్య ఏర్పడినప్పుడు తప్ప — తదితర సందర్భములయందు దానిని చిన్నగా కత్తిరించుట గాని, పూర్తిగా నరకుట గానీ చేయరాదు.

SUMMARY : We may not know which organ in the human body is useful in what way and exactly how it functions. But there is not a part in the body which does not have a purpose. So no organ should be taken for the useless. Therefore, no organ should be cut short or amp–utated unless it poses a grave life–and–death question to the human.

**పొన్నిక॥** తూఁగించి కూరలు తూఁకపు ఱా యచటనె,
విడచి యేఁగెదరు మంది విసవిస యింటికి ;
ఊతటి నిల్కయు నట్టిద ; ఆతఁ డందఱ-
కక్కఱ యొక్కసారి, కటుపైనఁ బగతుఁడు. 103

**మాటల విడఁదీత (పద విభాగము) :** తూఁగించి, కూరలు, తూఁకపుం, ఱా + అచటన్ + ఎ, విడచి + ఏఁగెదరు, మంది, విసవిస + ఇంటికిన్, ఊతటి–నిల్క + ఉన్ + అట్టిది + అ, ఆతఁడు + అందఱకున్ + అక్కఱ + ఒక్క–సారికిన్ + అటు–పైనన్ + పగతుఁడు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కూరలు తూఁగించి తూఁకపుం ఱా అచటన్ + ఎ విడచి మంది విసవిస ఇంటికిన్ ఏఁగెదరు. ఊతటి–నిల్క + ఉన్ అట్టిది + అ. ఆతఁడు అందఱకున్ ఒక్క–సారికిన్ అక్కఱ. అటు–పైనన్ పగతుఁడు.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తూఁగించి = తూయించి ; ఏఁగెదరు = పోయెదరు ; మంది = జనము ; విసవిస = కోపించి వేగముగా ; ఊతటి–నిల్క + ఉన్ = తటస్థుని పరిస్థితి కూడ ; అట్టిది + అ = అటువంటిదే ; అక్కఱ = అవసరము ; పగతుఁడు = శత్రువు.

**లోవాఱిక (తాత్పర్యము) :** జనము కూరగాయలను కొనునప్పుడు తూఁకపు ఱాతితో వాటి బరువును తూయించెదరు. ఆ తరువాత "ఆ తూఁకము బహుశ తప్పు కావచ్చుననియు, ఆ తూఁకపు ఱాయి సరైనది కా" దనియు అనుమానముతో కోపము దెచ్చుకొని ఆ ఱాతిని అక్కడనే వదలి కూరలను మాత్రమే తీసికొని ఇంటికి విసురుగా పోయెదరు. వివాదములందు తటస్థుని పరిస్థితి సైతమూ తూఁకపు ఱాతి వంటిదే. జనమునకాతఁడు తప్పనిసరిగా కావలె, కాని ఒక్కసారికే సుమా. రెండవ సారి ఆతని అభిప్రాయమును ఎవఱును అడుగరు. ఎందుకనఁగా ఆ యొక్కసారికే ఆతఁడు వారి దృష్టిలో శత్రువైపోవును.

SUMMARY : Folks at first, get vegetables weighed by measuring stones, but instantly after–wards, doubt their accuracy and angrily go home, carrying the commodity and leaving the stone behind. The situation of a neutral one in a dispute is similar to that of the measuring stone. Just like a measuring stone, he is compulsorily needed by all, but only for once. Folks won't go in for his opinion for a second time, for he would have already become their enemy in the very first instance.

**సంపంగి ॥** కార్తి రా బయటఁబడు కళ్ళముం దెటారుగాఁ .
గాతమ్రాను లేవి గొడ్డుమ్రాను లేవి సరిగ ;
మంది నికమరము నెఱుఁగఁ గందుము నికరముగాఁ ,
దమవైన మాడలను దడిమి తీయవలసినన్. 104

**మాటల విడఁదీత (పద విభాగము) :** కార్తి, రాన్, బయటన్ + పడున్, కళ్ళ ముందు + ఎటారుగాన్ + కాత–మ్రానులు + ఏవి, గొడ్డు–మ్రానులు + ఏవి, సరిగన్, మంది–నికమరమున్ + ఎఱుఁగన్ + కందుము, నికరముగాన్ + తమవి + ఐన, మాడలను + తడిమి, తీయన్ వలసినన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** కార్తి రాన్ కాత–మ్రానులు ఏవి గొడ్డు–మ్రానులు ఏవి సరిగన్ కళ్ళ ముందు ఎటారుగాన్ బయటన్ పడున్. తమవి ఐన మాడలను తడిమి తీయన్ వలసినన్ మంది–నికమరమున్ నికరముగాన్ ఎఱుఁగన్ కందుము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కార్తి = ఋతువు ; రాన్ = రాఁగా (వచ్చినప్పుడు) ; ఎటారుగాన్ = ప్రత్యక్షముగా ; కాత–మ్రానులు = కాయలు కాయు చెట్లు ; గొడ్డు–మ్రానులు = కాయలు కాయని చెట్లు ; సరిగన్ = చక్కగా ; మంది–నికమరమున్ = జనుల నిజాయితీని ; ఎఱుఁగన్ + కందుము = తెలిసికొనఁగలము ; నికరముగాన్ = పూర్తిగా ; మాడలను = డబ్బులను ; తీయన్ వలసినన్ = బయటికి తీసి ఇవ్వవలసి వచ్చినప్పుడు.

**లోవాటిక (తాత్పర్యము) :** ఏది కాయలు కాయు చెట్టో, ఏది కాయని చెట్టో ఋతువు వచ్చినప్పుడే ప్రత్యక్షముగా బయట పడును. అదే విధ–ముగా, తమ జేబులలో నుండి డబ్బులు తీసి ఇవ్వవలసి వచ్చినప్పుడే జనములలో నిజాయితీ, అంకిత భావము మఱియు త్యాగశీలము ఎంతవరకు ఉన్నవో మనము తెలిసికొనఁ గల్గెదము.

SUMMARY : The onset of the season itself lays it bare as to which tree is fruit-bearing and which is not. Similarly, people's sense of sincerity, dedication and sacrifice will be out in the open only when they are asked to contribute money out of their pockets.

**పొన్నిక ॥** ఎద్దియో యొకానొక దిద్దరాని తప్పు, నొనర్చు నెంత హెచ్చరి యగు నోవరియు ;
ఎసమారుఁ దన కదియ ౨ ఉసుఱుగొడ్డముగాఁ , గొండచిలువ మ్రింగిన ముండ్లపంది వలెన్. 105

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎద్ది + ఓ, ఒకానొక, దిద్దన్ రాని, తప్పున్ + ఒనర్చున్ + ఎంత, హెచ్చరి + అగు, నోవరి + ఉన్, ఎసమారున్ + తనకున్ + అది + అ, ఉసుఱు–గొడ్డముగాన్ + కొండచిలువ, మ్రింగిన, ముండ్ల–పంది వలెన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎంత హెచ్చరి అగు నోవరి + ఉన్ ఎద్ది + ఓ ఒకానొక దిద్దన్ రాని తప్పున్ ఒనర్చున్. కొండచిలువ మ్రింగిన ముండ్ల–పంది వలెన్ అది + అ తనకున్ ఉసుఱు–గొడ్డముగాన్ ఎసమారున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎద్ది + ఓ ఒకానొక = ఏదో ఒక ; ఒనర్చున్ = చేయును ; ఎంత హెచ్చరి + అగు = ఎంత జాగ్రత్తపరుఁడైన ; నోవరి + ఉన్ = రోగి కూడ ; ఎసమారున్ = పరిణమించును ; అది + అ = అదియే ; ఉసుఱు–గొడ్డముగాన్ = ప్రాణాంతకముగా.

**లోవాటిక (తాత్పర్యము) :** తన ఆరోగ్యము విషయములో గొప్ప జాగ్రత్తపరుఁడైన రోగి కూడ సరిదిద్దుకొనను వీలుపడని ఏదో ఒక వెఱ్ఱి పొఱఁబాటు చేయును. తాను మ్రింగిన ముండ్లపంది కొండచిలువకు ప్రాణాంతకమైనట్లుగా — ఆ ఒక్క పొఱఁబాటే రోగికి ప్రాణాంతకమగును.

SUMMARY : Even the most health-conscious of patients may make an incorrigible mistake which proves fatal for him like a porcupine swallowed by a python.

**మొల్ల జంట** || అయ్యవారు తోచు నౌటాలరిగా ం ; అమ్మనాయనలు బిగితవానులుగా ;
నేస్తములే ం అపా-తారీనులుగా ; జరుమానము కడమాల్ కలకారుగా ; 106
చూచిన చెరి పిన్నదియు లాహెతగా ం ; కావళములు పిసరంత ముచ్చటగా ం ;
తనకుఁ దానె యెలబ్రోమువానుగా ం ; పరువము పఱపు మతకము లివియ కదా! 107

**మాటల విడఁదీత (పద విభాగము) :** అయ్యవారు, తోచున్, నౌటాలరిగాన్, అమ్మ-నాయనలు, బిగితవానులుగాన్, నేస్తములు + ఏ, అపా-తారీనులుగాన్, జరుమానము, కడమాల్, కలకారుగాన్, చూచిన, చెరి, పిన్నది + ఉన్, లాహెతగాన్, కావళములు, పిసరు + అంత, ముచ్చటగాన్, తనకున్ + తాను + ఎ + ఎలబ్రోమువానుగాన్, పరువము, పఱపు, మతకములు + ఇవి + అ, కదా.

**చఱమోలి (అన్వయ క్రమము) :** అయ్యవారు నౌటాలరిగాన్ తోచున్. అమ్మ-నాయనలు బిగితవానులుగాన్ (తోచున్). నేస్తములు + ఏ అపా-తారీనులుగాన్ (తోచున్). జరుమానము కడమాల్ కలకారుగాన్ (తోచున్). చూచిన చెరి పిన్నది + ఉన్ లాహెతగాన్ (తోచున్). కావళములు పిసరు + అంత ముచ్చటగాన్ (తోచున్). తనకున్ + తాను + ఎ + ఎలబ్రోమువానుగాన్ (తోచున్). పరువము పఱపు మతకములు + ఇవి + అ కదా.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** అయ్యవారు = ఉపాధ్యాయుఁడు ; తోచున్ = కనిపించును ; నౌటాలరిగాన్ = విదూషకుఁడుగా ; బిగిత వానులుగాన్ = ఛాందసులుగా ; నేస్తములు + ఏ = మిత్రులే ; అపా-తారీనులుగాన్ = శశ్వద్ ఆత్మీయులుగా ; జరుమానము = వర్తమానము ; కడమాల్ = అనంతమైన ; కలకారుగాన్ = శాశ్వతత్వముగా ; చెరి పిన్నది + ఉన్ = ప్రతి యువతియు ; లాహెతగాన్ = అప్సరసగా ; కావళములు = పాపములు ; పిసరు + అంత = ఇసుమంత ; ముచ్చటగాన్ = విషయముగా ; ఎలబ్రోమువానుగాన్ = సర్వశక్తిమంతుఁడుగా ; పరువము = యౌవనము ; పఱపు = ప్రసరించు ; మతకములు = మాయలు. ఇవి + అ = ఇవే.

**లోవాతిక (తాత్పర్యము) :** పిల్లలకు యౌవనము పొడసూపఁగా – తమకు చదువు చెప్పు ఉపాధ్యాయుఁడు గందోళిగాని వలె కనిపించును. తల్లిదండ్రులు చాదస్తపు ముదుసళ్ళ వలె కనిపించెదరు. మిత్రులు ఆజీవన ఆత్మీయుల వలె తోచెదరు. జరుగుచున్న కాలమే శాశ్వతమని-పించును. కంటఁబడ్డ ప్రతి పడుచుపిల్ల సాక్షాత్తు దేవకన్య వలె కనిపించును. పాపకార్యములు చిన్న విషయములుగా తోచును. తమకు తాము సర్వశక్తిమంతులుగా అగుపించెదరు. ఆహా ! ఇట్టిది కదా పడుచుదనము పిల్లల మనస్సులపై ప్రసరించు మాయాజాలము !!

**పైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** నిస్సంకోచముగా ముందు-వెనుకలు ఆలోచింపకుండ పాపములు చేయఁగల్గుట యౌవనమునకు గల ప్రధాన లక్షణములలో ఒకటి. ఆ పై-ప్రాయమునకు చేరుకొన్నను, యౌవనము వద్దనే మానసిక ఎదుగుదల ఆఁగిపోయినవారు కూడ అంతే మట్టములో పాపములకు ఒడిగట్టెదరు.

SUMMARY : When children come of age – the teacher looks like a clown. The parents are perceived to be old-fashioned and outdated. Friends appear like life-long companions. Current times feel like eternity. Every young woman that one comes across on the street, looks like a divine damsel. Sins look like minor issues. Their own selves feel like omnipotent. This is the sort of the magic spell cast by youth on young minds.

**చేమంతిక** || ఒకటికై నుడివినవి వే ఱొకటి కదుకరించెదరు ;
ఒకటికై చేసినవి మఱియొక్కఱు వాడుకొందురు ;
ఒకటి వాక్రువ్వ నింకొకటి యాకళించుకొందురు ;
ఒక్కటి సేయఁబోయి లాయొక్కటి గావించెదరు ;
గీలుఁ ద్రావరు ; కండఁ దినరు ; తొక్కదోలు సూచెదరు. 108

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఒకటికై, నుడివినవి, వేఱు + ఒకటికిన్ + అదుకరించెదరు, ఒకటికై, చేసినవి, మఱి + ఒక్కఱు, వాడు కొందురు, ఒకటి, వాక్రువ్వన్ + ఇంకన్ + ఒకటి + ఆకళించుకొందురు, ఒక్కటి + చేయన్ + పోయి, లాయి + ఒక్కటి, కావించెదరు. గీలున్ + త్రావరు, కండన్ + తినరు, తొక్క + తోలు + చూచెదరు.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** నుడివినవి = చెప్పినవి ; అదుకరించెదరు = వర్తింపఁజేసెదరు ; వాక్రువ్వన్ = వచింపఁగా ; ఆకళించు కొందురు = అర్థము చేసికొందురు ; లాయి + ఒక్కటి = వేఱొక్కటి ; కావించెదరు = చేసెదరు ; గీలున్ = రసమును.

**లోవాటిక (తాత్పర్యము) :** (ప్రజల తత్త్వమును గుఱించి విడఁబల్కుచున్నాఁడు) : పెద్దలు ఒకటి కొఱకు చెప్పిన అంశములను ప్రజలు వేఱొకటికి అనువర్తించెదరు. పెద్దలు ఒకటి కోసము కావించిన ఏరుపాటులను వేఱొకఱు వాడుకొందురు. ఒక మాట పల్కినచో వేఱొక అర్థమున బోధపఱచుకొందురు. వారు ఒక పనిని ఒక ఉద్దేశముతో చేసెదరు. కాని అది ఇంకొక విధముగా పరిణమించును. ఒక నేవళ మైన తీయని పండును చేతికిచ్చినచో దాని తొక్క, తోలు పరీక్షించుచుండెదరే తప్ప తీసి లోనున్న కండను తినరు. రసమును త్రాఁగరు.

**వైమాల విడఁబర్పు (విశేష వివరణము) :** గీలుఁ ద్రావరు, కండఁ దినరు, తొక్కదోలు సూచెదరు : పెద్దల యొక్క కులము, జాతి, మతము మొదలైనవే తప్ప వారి మంచిపనులను, మంచిమాటలను సామాన్య జనము గ్రహింపలేరని భావము.

SUMMARY : Folks apply to someone else the things told by the bygone elders for one. The arrangements made by elders for one class will be used by another class. You mean some–thing and they understand it in another sense. They do something on a particular purpose, but it will culmuinate in some other outocme. Give them a fruit and then they will keep star–ing at its peel without bothering to enjoy its flesh and juice.

**గోరంటిక జంట** || హెచ్చు కెలస మది, క్రించు కెలస మిది ౨ అని, నొచ్చుకొనవల దొరుల నొప్పింపవలదు ;
సరిసాటి ౨ అన్ని పనులున్ దినిపి మనుచున్ ; చేయు పని తనయంత నినుఁ బ్రోదించున్ ; 109
నీర్పాయికి నీరే బ్రదిమానము ససిమియు ; తాఁ బంచు నల్లయే గుండెకుఁ బ్రోదియు. 110

**మాటల విడఁదీత (పద విభాగము) :** హెచ్చు, కెలసము + అది, క్రించు, కెలసము + ఇది, అని, నొచ్చుకొనన్ వలదు + ఒరులన్ నొప్పింపన్ వలదు, సరిసాటి, అన్ని, పనులున్ + తినిపి, మనుచున్, చేయు, పని, తన + అంత, నినున్ + ప్రోదించున్, నీర్పాయికిన్, నీరు + ఏ, బ్రదిమానము, ససిమి + ఉన్, తాన్ + పంచు, నల్ల + ఏ, గుండెకున్ + ప్రోది + ఉన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (అదే).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** హెచ్చు కెలసము = అధికమైన పని/ వృత్తి ; క్రించు కెలసము = హీనమైన పని/ వృత్తి ; నొచ్చుకొనన్ వలదు = బాధపడ వలదు ; ఒరులన్ = ఇతరులను ; నొప్పింపన్ వలదు = బాధపెట్టవలదు ; సరిసాటి = సమానముగా ; తినిపి = తిని పించి (తిండి బెట్టి) ; మనుచున్ = బ్రదికించును ; ప్రోదించున్ = పోషించును ; నీర్పాయికిన్ = నేజకమునకు ; బ్రదిమానము = జీవనము ; ససిమి + ఉన్ = ఆరోగ్యము కూడ ; పంచు = పంపిణి చేయు ; నల్ల + ఏ = నెత్తుతే ; ప్రోది + ఉన్ = పుష్టి కూడ.

**లోవాటిక (తాత్పర్యము) :** "అది గొప్ప వృత్తి, ఇది అధమ వృత్తి" అని బాధపడుచు నీవు పనిచేయవలదు. అటువంటి మాటలతో ఆయా పనులు చేయువారిని సైతము నీవు బాధపెట్టవలదు. అన్ని పనులును మనిషికి సమానముగా తిండి పెట్టి జీవితము నిచ్చునట్టివే. నీకొక పని చేయుట బాగుగా వచ్చినచో నీవు నోరు దెఱచి అడుగక పోయినను అది తనంతట తానే నిన్ను పోషించును. (చేయు పనిలోనే తన పోష–ణము కూడ ఇమిడి ఉండును). శరీరములోని నీటిని వడఁగట్టు నేజకము (kidney) ఆ నీటిలోనే కొంత ఆహారముగా తీసికొని బ్రదు–

కును. ఆరోగ్యముగా నుండును. అదే విధముగా నెత్తుటిని శరీరమున కంతటికిని పంపిణి చేయు గుండె ఆ నెత్తుటిలోనే కొంత తన పోషణ మునకై గైకొనును.

SUMMARY : Do not work on the assumptions of something being a great work and another being lowly. And do not hurt others too on these assumptions. All works equally feed the human and give him/ her life. Any work which you are good at, will feed you well before you ask for it. The kidney subsists on the very water that it filters and keeps healthy. Similary, the heart draws its sustenance from the very blood which it pumps to the body.

**పస్పియ** ॥ తనంటీనులనె జంటగా వెదుకc , దొకెలసంబు గా - దాలుమగలకుc
గావలె నాలుడి వే, ఱెద యొండే ; ఈసురుల కెంతయున్ సేcగి ౦ అగున్,
సరియాలుటి జంట మయ్యాతలోన్. 111

**మాటల విడcదీత (పద విభాగము) :** తనంటీనులన్ + ఎ, జంటగాన్, వెదుకన్ + తౌ–కెలసంబు, కాదు + ఆలు–మగలకున్ + కావలెన్ + ఆలుడి, వేఱు + ఎద + ఒండు + ఏ, ఈసురులకున్ + ఎంత + ఉన్, సేcగి, అగున్, సరియాలుటి–జంట–మయ్యాతలోన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తనంటీనులన్ + ఎ జంటగాన్ వెదుకన్ తౌ–కెలసంబు కాదు. ఆలు–మగలకున్ ఆలుడి వేఱు కావలెన్. ఎద ఒండు + ఏ (కావలెన్). సరియాలుటి–జంట–మయ్యాతలోన్ ఈసురులకున్ ఎంత + ఉన్ సేcగి అగున్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** తనంటీనులన్ + ఎ = ఆత్మాదృశులనే/ తనవంటివారినే ; జంటగాన్ = జోడిగా ; వెదుకన్ = వెదకుట ; తౌ–కెలసంబు = సముచిత కార్యము ; ఆలు–మగలకున్ = భార్యాభర్తలకు ; కావలెన్ = అవ వయయును ; ఆలుడి = స్వభావము ; ఎద = హృదయము ; ఒండు + ఏ = ఒక్కటియే ; ఈసురులకున్ = బలహీనులకు ; ఎంత + ఉన్ = ఎంతో ; సేcగి = నష్టము ; అగున్ = జరుగును ; సరియాలుటి = సరిపోలిన స్వభావము గల ; జంట–మయ్యాతలోన్ = జంత యొక్క సంతానములో.

**లోవాఱిక (తాత్పర్యము) :** పెండ్లి చేసికొనునప్పుడు అచ్చము తనవంటి జోడినే వెదకికొనుట సరియైన పని కాదు. భార్యాభర్తల స్వభావములు వేఱువేఱుగా ఉండవలెను. కాని వారిద్దఱి హృదయము మట్టుకు ఒకటియే అయి ఉండవలెను. అట్లు కాక వారిద్దఱును ఒకే స్వభావము గల వారైనచో, వారి సంతానమునందు బలహీనులైన వారికి గొప్ప నష్టము మఱియు బాధ వాటిల్లును.

SUMMARY : It is unwise to opt for an exactly similar life-partner. The characters of the man and wife should differ, but their hearts must be one. If they are contrary to this, the weakest among their children will undergo extreme pain and loss.

**కలిగోటిక** ॥ తమ మేనులె కావు తమయవి ; తమ బిడ్డలు మటు కెప్పగిదిc,
బొట్టలో నున్న బయట నున్నను, బొడముటే తీరైనను ;
తప్పు జరిగిన వరకించుతన్ దమ్మో మఱి లాతులనో ;
ఏ తప్పుc జేయని లోcగందుల యుసురు దీయుటేలనో ?
మేల్తనమొండు నెఱవేర్ప మే ; నది యెగవేయకుండుతన్. 112

**మాటల విడcదీత (పద విభాగము) :** తమ, మేనులు + ఎ, కావు, తమ + అవి, తమ, బిడ్డలు, మటుకున్ + ఏ + పగిదిన్ + పొట్టలోన్ + ఉన్నన్, బయటన్ + ఉన్నను + పొడముట + ఏ, తీరు + ఐనను, తప్పు, జరిగినన్ వరకించుతన్ + తమ్మున్ + ఓ మఱి, లాతులన్ + ఓ, ఏ, తప్పున్ + చేయని, లోcగందుల + ఉసురున్ + తీయుట + ఏలనో, మేల్తనము + ఒండు, నెఱవేర్పన్, మేన్ + అది + ఎగవేయక +

ఉండుతన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** తమ మేనులు + ఎ తమ + అవి కావు. పొట్టలోన్ ఉన్నన్, బయటన్ ఉన్నను, పొడముట ఏ తీరు ఐనను తమ బిడ్డలు మటుకున్ ఏ + పగిదిన్ (తమ + అవి)? తప్పు జరిగినన్ తమ్మో మఱి లాతులనో వరకించుతన్. ఏ తప్పున్ చేయని లోఁగందుల ఉసురున్ తీయుట ఏలనో? మేల్తనము ఒందు నెఱవేర్పన్ మేన్. అది ఎగవేయక ఉండుతన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** మేనులు + ఎ = శరీరములే ; తమ = తమవి ; మటుకున్ = మాత్రము ; ఏ + పగిదిన్ = ఏ విధముగా ; పొడముట = కలుగుట/ ఏర్పడుట ; ఏ తీరు + ఐనను = ఏ విధముగా అయినను ; జరిగినన్ = జరిగినచో ; వరకించుతన్ = శిక్షించెదరు గాక ; లాతులన్ + ఓ = ఇతరులనో ; లోఁగందుల = గర్భస్థ శిశువుల యొక్క ; ఉసురున్ + తీయుట = ప్రాణము తీయుట ; ఏలనో = ఎందుకో ; మేల్తనము = ప్రయోజనము ; ఒందు = ఒకదానిని ; నెఱవేర్పన్ = నెఱవేఱుటకే ; అది = దానిని ; ఎగవేయక + ఉండుతన్ = ఎగఁగొట్టకుండెదరు గాక.

**లోవాఱిక (తాత్పర్యము) :** తమ శరీరములే తమవి కావు. అటువంటప్పుడు తమ బిడ్డల శరీరముల మీఁద మాత్రము తమకేమి హక్కు కలదు, యథేచ్ఛగా వారిని చంపివేయుటకు? ఆ బిడ్డలు పొట్టలో ఉన్నను బయట ఉన్నను, వారి పుట్టుక ఏ విధముగా జరిగినను పెద్దలకా హక్కు ఎక్కడిది? ఏదైన తప్పు జరిగినచో ఆ తప్పు చేసినవారు తమను తాము శిక్షించుకొనవలె. లేదా ఇతరులు వారిని శిక్షింపవలె. అంతే గాని ఏ తప్పును చేయని గర్భస్థ శిశువుల ప్రాణములు తీయుట ఎందుకు? ఈ శరీరము మఱియు దీనిలోని సంతాన వ్యవస్థ ఒక ప్రయోజనమును నెఱవేర్చుట కొఱకై ఇవ్వఁబడినవి. ఆ కర్తవ్యమును ఎగవేయకుండునది.

SUMMARY : People do not own their own bodies. (They are just residents trapped inside the bodies given to them). Then how can they own and kill those of their kids, whether the kids are inside the wombs or outside of them, no matter how they are born? If a wrong has happened, let the wrong-doers punish themselves. Else may others punish them. But why punish the innocent kids in the wombs by murdering them? The body and its reproductive system have been given for a purpose. May folks not evade the obligation.

**అవిగింగ** ॥ ఎవ్వారి తట్టు నిలువకు మింట రవరవలు,
పొడమ నది పెద్దలైనను మఱి పిన్నలైన ;
ఒడంబడుము చెరివారల అలవల్కునకున్ ;
ఓదార్చుము సరిసాటిగఁ జెరియొక్కఱి,
నోలిమి నొరు లెఱుఁగకుండ విడివిడిగాన్. 113

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఏ + వారి, తట్టున్, నిలువకుము + ఇంటన్, రవరవలు + పొడమన్ + అది, పెద్దలు + ఐనను, మఱి, పిన్నలు + ఐనన్, ఒడంబడుము, చెరి-వారల, అలవల్కునకున్, ఓదార్చుము, సరిసాటిగన్ + చెరి + ఒక్కఱిన్ + ఓలిమిన్ + ఒరులు + ఎఱుఁగకుండన్, విడి-విడిగాన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఇంటన్ రవరవలు పొడమన్ ఏ + వారి తట్టున్ నిలువకుము. అది పెద్దలు ఐనను మఱి పిన్నలు ఐనన్. చెరి-వారల అలవల్కునకున్ ఒడంబడుము. ఓలిమిన్ ఒరులు ఎఱుఁగకుండన్ విడి-విడిగాన్ చెరి ఒక్కఱిన్ సరిసాటిగన్ ఓదార్చుము.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఏ + వారి తట్టున్ = ఎవ్వఱి వైపునను ; ఇంటన్ = ఇంటిలో/ కుటుంబములో ; రవరవలు = అభిప్రాయ భేదములు ; పొడమన్ = కలిగినప్పుడు ; ఒడంబడుము = ఒప్పుకొనుము ; చెరి-వారల = ప్రతివారి యొక్క ; అలవల్కునకున్ = వాదమునకు ; సరిసాటిగన్ = సమానముగా ; చెరి + ఒక్కఱిన్ = ప్రతి ఒక్కఱిని ; ఓలిమిన్ = ఏకాంతమునందు ; ఒరులు = వేఱేవారు.

**లోవాఱిక (తాత్పర్యము) :** నీ కుటుంబమువారి నడుమ అభిప్రాయ భేదములు కలిగినప్పుడు నీవు వారిలో ఏ ఒక్కఱి వైపున గానీ నిలఁబడకుండ మెలకువతో నుండుము. పెద్దలను సమర్థించవలదు. పిన్నలను సమర్థించవలదు. వారు నీ అభిప్రాయమును గూర్చి అడిగినచో వారందఱి వాదములకు ఒప్పుకొనుము. ఎవఱి వాదమును ఖండించవలదు. వారిలో ఒక్కొక్కఱిని విడివిడిగా ఏకాంతములో బుజ్జగింపుము.

SUMMARY : If your family members are at loggerheads with one another, be careful enough to not take sides. Support neither the elders nor the young. Do not reject anyone's contention but concede to everyone's point. Assuage each one separately in private unbeknownst to the rest

**దాసానిక ||** ఈవ తలఁచెద, వీవ చెప్పెద, వీవ చేసెదవు ;
ఈవ మల్కలెత్తెదవు, మారులీవ యిచ్చెదవు ;
మిన్నక చూపఱ యైన యోలగులు ననుఁగులేల?
తనతో సయ్యాట తనకేమి, చేహయే గాని? 114

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఈవు + అ, తలఁచెదవు + ఈవు + అ, చెప్పెదవు + ఈవు + అ, చేసెదవు, ఈవు + అ, మల్కలు + ఎత్తెదవు, మారులు + ఈవు + అ + ఇచ్చెదవు, మిన్నక–చూపఱ + ఐన + ఓలగులు + ఉన్ + అనుఁగులు + ఏల, తనతోన్, సయ్యాట, తనకున్ + ఏమి, చేహ + ఏ, కాని.

**చఱమోలి (అన్వయ క్రమము) :** (సుబోధము).

**కుఱు మమ్మాఱిక (లఘుటీక) :** ఈవు + అ = నీవే ; తలఁచెదవు = ఆలోచించెదవు ; మల్కలు = ప్రశ్నలను ; ఎత్తెదవు = ప్రస్తావించెదవు ; మారులు = సమాధానములు ; మిన్నక చూపఱ + ఐన = మౌన ప్రేక్షకులైన ; ఓలగులు + ఉన్ = సభాసదులు మఱియు ; అనుఁగులు = ఆప్తులు ; ఏల = ఎందుకు ; సయ్యాట = సరసము ; చేహ = స్వయంతృప్తి.

**లోవాఱిక (తాత్పర్యము) :** అన్నియు నీవే ఆలోచించి నీవే మాటలాడి నీవే అమలు పఱచుచున్నచో ఇంక నీకు సభాసదులతోను, ఆప్తులతోను పని ఏమి? నీవు ఇతరులతో ఆడునది సరసమగును గానీ, నీవే నీతో అంతయు చేసికొన్నచో అది స్వయంతృప్తి మాత్రమే అగును కదా?

SUMMARY : If you think out everything yourself, speak everything yourself and act it out all by yourself, why do you need courtiers and confidantes? Flirtation becomes foreplay only if you do it with others. But with your own self, it is called self-gratification.

**అవిగింగ జంట ||** ముంటెపుఁ దొనల నోము దళపు ముండ్ల తోలుక ;
చెట్టుఁజేవఁ గాఁచుచుండుఁ దా గట్టి బెరడు ;
కప్పుఁగాఁపును వలయుఁ , బాసే కా దింటికి ;
కాంచరుల కాఁపుదలయే పెంచుఁ బిల్లలన్ ; 115
కాఁపుదల గల కఱద కావించు మేల్తలఁపు ;
ప్రెంపారుఁ కాఁపుదలఁ దీరుంట మంకోలు ;
పదిమంది కాఁపుదలఁ బడసినవె బల్లిదుఁడు ;
కాఁపుదలయే తెల్లము కల్మి బల్మలకున్. 116

**మాటల విడఁదీత (పద విభాగము) :** ముంటెపుం + తొనలన్ + ఓమున్, దళపుం, ముండ్ల, తోలుక, చెట్టు + చేవన్ + కాఁచుచున్ +

ఉండున్ + తాన్, గట్టి, బెరడు, కప్పు + కాఁపు + ఉను, వలయున్ + పాసు + ఏ, కాదు + ఇంటికిన్, కాంచరుల, కాఁపుదల + ఏ, పెంచున్ + పిల్లలన్, కాఁపుదలన్, కల, కఱద, కావించున్, మేల్తలఁపు, ప్రెంపారున్, కాఁపుదలన్ + తీరుంటము + అంకోలు, పది–మంది–కాఁపుదలన్ + పడసినన్ + ఎ, బల్లిదుఁడు, కాఁపుదల + ఏ, తెల్లము, కల్మి–బల్ములకున్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** దళపుం ముండ్ల తోలుక ముంటెపుం తొనలన్ ఓమున్. గట్టి బెరడు తాన్ చెట్టు –చేవన్ కాఁచుచున్ ఉండున్. ఇంటికిన్ పాసు + ఏ కాదు కప్పు–కాఁపు + ఉను వలయున్. కాంచరుల కాఁపుదల + ఏ పిల్లలన్ పెంచున్. కాఁపుదలన్ కల కఱద మేల్తలఁపు కావించున్. కాఁపుదలన్ తీరుంటము అంకోలు ప్రెంపారున్. పది–మంది కాఁపుదలన్ పడసినన్ + ఎ బల్లిదుఁడు . కల్మి–బల్ములకున్ తెల్లము కాఁపుదల + ఏ.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ముంటెపుం + తొనలన్ = పనస తొనలను ; ఓమున్ = కాఁపాడును ; దళపుం = దళసరి ; ముండ్ల తోలుక = ముళ్ళ తొక్క ; చెట్టు + చేవన్ = చెట్టు యొక్క కండను, సారమును ; కప్పు + కాఁపు + ఉను = కప్పు యొక్క రక్షణమును కూడ ; పాసు + ఏ = పునాదియే ; కాంచరుల = తల్లిదండ్రుల యొక్క ; కఱద = మేధ ; కావించున్ = చేయును ; మేల్తలఁపు = మంచి ఆలోచనను ; కాఁపుదలన్ = రక్షణము వలన ; తీరుంటము = నాగరికత ; అంకోలు = వ్యాపారము ; పది–మంది–కాఁపుదలన్ = పదుగుఱ రక్షణ మును ; పడసినన్ + ఎ = పొందినప్పుడే ; బల్లిదుఁడు = బలవంతుఁడు ; తెల్లము = అర్థము ; కల్మి–బల్ములకున్ = సంపదకు మఱియు బలమునకు.

**లోవాఱిక (తాత్పర్యము) :** పనసపండులోని మెత్తని తీయ తొనలను ముండ్లతో కూడిన దళసరి తొక్క కప్పి కాఁపాడుచుండును. చెట్టులోపలి కండను మఱియు సారమును మందపాటి బెరడు కాఁపాడుచుండును. ఇల్లు కూలిపోక ఉండవలె నన్నచో దానికి బలమైన పునాదియే కాదు, పైకప్పు యొక్క రక్షణము కూడ కావలెను. పిల్లల పెరుగుదలకు కారణము వారికి పెద్దలిచ్చు రక్షణమే. భద్రత గల మేధయే మంచి ఆలో–చనలు చేయఁగలదు. భద్రత ఉన్నప్పుడే నాగరికత పెరుగును. వ్యాపారములు కూడ ప్రెంపొందును. పదిమంది యొక్క కాఁపుదల గలవాని నే జనము బలవంతుఁ డందురు. (ఒంటరివాఁడు బలహీనుని క్రిందనే లెక్క). చివరిగా — సంపదకును, బలమునకును నిజమైన అర్థము — రక్షణమును కలిగి ఉండుటయే.

SUMMARY : The sweet carpels inside the jackfruit are covered with a thick and thorny rind. The flesh and pith of the tree are covered with a thick bark. A house needs, not just a strong foundation, but also the protection of a roof. The security given by the parents lies behind the children's growth. Only a secure mind can have excellent ideas. It is security which ensures the growth of the civilization in general and business in particular. Only the one guarded by ten others is considered a strong man. (Loners are deemed to be the weak). Lastly, security itself is the true meaning of wealth and strength.

**నల్వతమ్మిక ||** ఎఱుకరులకుఁ జెందు నెల్లానసము, నెఱుక గల్గు నౌపొందుల వలనన్,
ఔపొందులు నిడుబ్రదిమి వలనన్, నిడుబ్రదిమి సక్కససిమి వలనన్ ;
సస్మివానులదే యెల్లానసము ; సస్మియ నికాప కల్మియు బల్మియున్. 117

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఎఱుకరులకున్ + చెందున్ + ఎల్ల + ఆనసము + ఉన్ + ఎఱుక, కల్గున్ + ఔపొందుల వలనన్, ఔపొందులు, నిడు–బ్రదిమి వలనన్, నిడు–బ్రదిమి, చక్క–ససిమి వలనన్, సస్మివానులది + ఏ + ఎల్ల + ఆనసము + ఉన్, సస్మి + అ, నికాప, కల్మి + ఉన్, బల్మి + ఉన్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ఎల్ల ఆనసము + ఉన్ ఎఱుకరులకున్ చెందున్. ఎఱుక ఔపొందుల వలనన్ కల్గున్. ఔపొందులు నిడు–

బ్రదిమి వలనన్ కల్గున్. నిడు–బ్రదిమి చక్క–ససిమి వలనన్ కల్గున్. సస్మివానులదే ఎల్ల ఆనసము + ఉన్. సస్మి + అ నికాప కల్మి + ఉన్ బల్మి + ఉన్.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఎఱుకరులకున్ = జ్ఞానులకు ; ఎల్ల + ఆనసము + ఉన్ = మొత్తము ప్రపంచము ; ఎఱుక = జ్ఞానము ; ఔపొందుల వలనన్ = అనుభవముల వలన ; నిడు–బ్రదిమి వలనన్ = దీర్ఘాయుష్షు వలన ; చక్క–ససిమి వలనన్ = దిట్టమైన ఆరోగ్యము వలన ; సస్మివానులది + ఏ = ఆరోగ్యవంతులదే ; సస్మి + అ = ఆరోగ్యమే ; నికాప = యథార్థమైన ; కల్మి + ఉన్ = సంపద మఱియు ; బల్మి + ఉన్ = బలము కూడ.

**లోవాఱిక (తాత్పర్యము) :** ఈ ప్రపంచము జ్ఞానులదే. కాని జ్ఞానము అనుభవముల గుండానే కలుగును. విస్తారమైన అనుభవము – మంచి ఆయుర్దాయము ఉన్నప్పుడే సంభము. మంచి ఆయుర్దాయము – మంచి ఆరోగ్యము ఉన్నప్పుడే సాధ్యము. కనుక ఈ ప్రపంచము వాస్తవము గా ఆరోగ్యవంతులకు మాత్రమే చెందినది. ఆరోగ్యమే నిజమైన సంపద మఱియు బలము.

SUMMARY : True, the world belongs to the knowledgeable people. But knowledge is only gained through versatile experience. Such experience only comes about in course of longevity. Longetivity is attainable only by keeping good health. Therefore, the world only belongs to healthy ones. In fact, health is the real wealth and strength.

**దాసానిక ॥** కడఁక నీది నీవు కావింపక కావు పనులు,
వంటులెన్నేని నీకు సై-యొడఁగూడి యున్నను ;
వండి వాఱిచి తళియ వడ్డించి యోమటి నోటి-
వరకుఁ దెచ్చినపుడైన నీ పళ్ళ వాడవేటి?
అకవంచము గెలువము ; కడంకయే కడుహిర్సము. 118

**మాటల విడఁదీత (పద విభాగము) :** కడఁకన్, నీది, నీవు, కావింపక, కావు, పనులు, వంటులు + ఎన్ని + ఏని, నీకున్, సై–ఒడఁగూడి + ఉన్నను, వండి, వాఱిచి, తళియన్, వడ్డించి + ఓమటిన్, నోటి వరకున్ + తెచ్చిన + అపుడు + ఐనన్, నీ, పళ్ళన్, వాడవు + ఏటి, అకవంచము, గెలువము, కడంక + ఏ, కడు–హిర్సము.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వంటులు ఎన్ని ఏని నీకున్ సై–ఒడఁగూడి ఉన్నను నీవు నీది కడఁకన్ కావింపక పనులు కావు.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** కడఁకన్ నీది = నీ ప్రయత్నమును ; కావింపక = చేయకుండ ; వంటులు = అనుకూలతలు ; ఎన్ని + ఏని = ఎన్ని ఐనను ; సై–ఒడఁగూడి + ఉన్నను = సిద్ధముగా సమకూడినను ; తళియన్ = కంచములో ; ఓమటిన్ = అన్నమును ; అకవంచము = అముఖ్యము ; గెలువము = విజయము ; కడంక + ఏ = ప్రయత్నమే ; కడు–హిర్సము = మిక్కిలి ప్రధానము.

**లోవాఱిక (తాత్పర్యము) :** నీ ప్రయత్నము నీవు చేయనప్పుడు – నీకు ఎన్ని అనుకూల పరిస్థితులు ఏర్పడినను, నీకు పనులు నెఱవేరవు. అన్న మును వండి కంచములో వడ్డించి నోటి వరకు తెచ్చినప్పుడు అది తినుటకు కనీసము పళ్ళనైనను లివార్చవలెను కదా? ప్రయత్న-ఫలిత ముగా విజయము సిద్ధించునా? లేదా అన్న మీమాంస అముఖ్యము. ముందు ప్రయత్నము చేయుటయే మిక్కిలి ప్రధానము.

**వైమాల విడఁబర్చు (విశేష వివరణము) :** లివార్చుట = దేనినైన నములునప్పుడు దౌడలను లేదా పండ్లను పైకి, క్రిందికి ఆడించుట.

SUMMARY : If you do not make an effort, your goals cannot be reached, no matter how many favourable conditions have set in. When someone prepared food, served it in a plate

and brought it to your mouth, you should at least use your own teeth to eat it, shouldn't you? The question of *"whether the effort would be fruitful or not"* is beside the point. Making an effort is of utmost importance.

**వెల్మీరిక జంట** ‖ ఆమని నెలకొన్న మఱుసిటము, చీడవట్టిన చెట్టు కలిదము,
మొదల నరకిన మ్రాను మెలిదము, మారాఁకు వేయకునికిఁ గనము ; 119
తలఁగకు తమి బ్రదిమానమునన్, బలు రాయిడు లెన్ని యేర్చినన్,
బ్రదిమి వలిస్క వలెఁ గరఁగినన్ ; తుది చెరిదియు వేఱొండు మొదల్. 120

**మాటల విడఁదీత (పద విభాగము) :** ఆమని, నెలకొన్న, మఱుసిటము, చీడ + పట్టిన, చెట్టు, కలిదము, మొదలన్, నరకిన, మ్రాను, మెలిదము, మారు + ఆఁకు, వేయక + ఉనికిన్ + కనము, తలఁగకు, తమిన్, బ్రదిమానమునన్, బలు–రాయిడుల్ + ఎన్ని + ఏర్చినన్, బ్రదిమి, వలిస్క వలెన్ + కరఁగినన్, తుది, చెరిది + ఉన్, వేఱు + ఒండు, మొదల్.

**చఱమోలి (అన్వయ క్రమము) :** ....బ్రదిమానమునన్ బలు–రాయిడుల్ ఎన్ని ఏర్చినన్ బ్రదిమి వలిస్క వలెన్ కరఁగినన్ తలఁగకు తమిన్.... (మిగితా సుబోధము).

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** ఆమని = వసంత ఋతువు ; నెలకొన్న = ఏర్పడిన ; మఱుసిటము = మఱు క్షణము ; కలిదము = సైతము ; మెలిదము = సైతము ; మారు + ఆఁకు = క్రొత్త చిగుళ్ళు ; వేయక + ఉనికిన్ = వేయకుండ ఉండుటను ; కనము = చూడము ; తలఁగకు = వదలకుము ; తమిన్ = ఆశను ; బ్రదిమానమునన్ = జీవితములో ; బలు–రాయిడుల్ = మిక్కిలి శ్రమలు ; ఏర్చినన్ = బాధపెట్టినను ; బ్రదిమి = ఆయుర్దాయము ; వలిస్క వలెన్ = కర్పూరము వలె ; తుది చెరిది + ఉన్ = ప్రతి అంతము.

**లోవాటిక (తాత్పర్యము) :** వసంత ఋతువు ప్రవేశించుచునే — చీడ పట్టిన చెట్లయినను, మొదలంట నరికివేయఁబడ్డ మ్రానులైనను క్రొత్త చిగుళ్ళు వేయకుండ ఉండుట చూడము. అట్లే నీ జీవితములో నీవు ఎన్ని కష్టములు పడినను, నీ ఆయుర్దాయమే కర్పూరము వలె కరఁగిపోయినను ఆశను వదులుకొన వలదు. ప్రతి అంతము ఒక క్రొత్త ఆరంభము మాత్రమే.

SUMMARY : As soon as spring sets in, even the blighted plants and tree stumps do put forth new leaves. In the same spirit, do not lose hope, but cherish it, no matter however much you suffered, although all your lifespan evaporated like camphor. Every end is just a new beginning.

: సంచమర్తి చెబకము :

**ఇది**

**వాచస్పతి బిరుదుని సంతరిదమైన వల్మీరిగమను నెఱింపటి కావింతయందు**

**రెండవ వీటగు కానన త్రోవలో ఆఱవ సంచము**

**మొత్తము ముగిసినది.**

**‖ మేల్గాతన్ ‖**

**మాటల విడఁదీత (పద విభాగము) :** వాచస్పతి–బిరుదుని, సంతరిదము + ఐన, వల్మీరిగము + అను, నెఱింపటి, కావింతయందున్,

రెండవ వీటు + అగు, కానస-త్రోవలోన్, ఆఱవ, సంచము, మొత్తము, ముగిసినది.

**చఱమోలి (అన్వయ క్రమము) :** వాచస్పతి-బిరుదుని సంతరిదము + ఐన వల్మిరిగము + అను నెఱింపటి కావింతయందున్ రెండవ వీటు + అగు కానస-త్రోవలో ఆఱవ సంచము మొత్తము ముగిసినది.

**కుఱు మమ్మాటిక (లఘుటీక) :** వాచస్పతి-బిరుదుని = వాచస్పతి అను బిరుదము గల కవి యొక్క ; సంతరిదము + ఐన = ప్రణీతమైన ; నెఱింపటి కావింతయందున్ = చింతనాత్మక కావ్యమునందు ; మూఁడవ వీటు + అగు = మూఁడవ భాగమైన ; కానస-త్రోవలో = లోక మార్గములో ; ఆఱవ సంచము = ఆఱవ అధ్యాయము ; మేల్గాతన్ (మేల్ + కావుతన్) = శుభమస్తు.

**లోవాఱిక (తాత్పర్యము) :** (సుబోధము).

: SUMMARY:

Thus concludes the sixth chapter of the second part named

*Kaanasa Trova* in the work *Valmirigamu* written

By

Vachaspathi.

---

**కానస త్రోవ మొత్తము ఐపడి.**



# వల్మిరిగము – ౨. కానస త్రోవ – వ్రాయోలిటి అల్బారుక

## (అకారాది పద్యానుక్రమణిక)





*Image of the rose and leaves by James Loris from Pixabay*

